

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౧ సంచిక ౧

విషయ వివరణము

# శ్రీ రామకృష్ణ ప్రభ

## చందాదారులకు

౧. పత్రిక ప్రతిమాసము 20-వ తేదీన వెలువరింపబడును. ఒక వారము, పదిరోజులు చూచి ప్రతి మీకు అందకపోయినయెడల ఉత్తరము వ్రాయుడు.

౨. సంవత్సర చందా రు. 3 మాత్రమే. జనవరినెల నుండిగాని జూలై నెల నుండిగాని చందాదారులుగా చేరవచ్చును. విడిప్రతి రూ. ౦—౬—౦ లు. హిగిన్ బాతంస్ వారి స్టాలులోగాని, మా పత్రిక ఏజెంటును గాని అడుగుడు.

౩. ఉత్తర ప్రత్యుత్తరములు వీలైనంతవరకు ఇంగ్లీషున వ్రాయుడు. మీ చందాదారు సంఖ్య సూచింపుడు. ఉత్తరములను "మేనేజరు, శ్రీరామకృష్ణప్రభ" అను చిరునామాకు వ్రాయుడు.

౪. చిరునామాయందు ఎట్టిమార్పు కలిగినను 10-వ తారీఖులోపున మఠ కార్యాలయమునకు తెలుపవలయును. లేనిచో, పత్రిక పూర్వపు చిరునామాకే పంపబడును.

## వ్యాసకర్తలకు

౧ కేవలము నైతిక ధార్మిక వైజ్ఞానిక విషయకములైన వ్యాసములేకాక, సాహిత్యమునకును కవిత్వమునకును సంబంధించిన ఏ వ్యాసములైనను పంపవచ్చును. సులభ సుందరమగు గ్రాంథిక భాషలో వ్రాయవలయును.

౨. వ్యాసములు అచ్చులో మూడు పుటలకు మించరాదు. ప్రతినెల ఒకటవ తేదీకి వ్యాసములు మాకు అందవలెను.

౩. వ్యాసములను, విమర్శకై పంపు గ్రంథములను, వినిమయముగా పంపెడి పత్రికలను "సంపాదకుడు, శ్రీ రామకృష్ణ ప్రభ" అను చిరునామాకు వ్రాసి పంపవలెను.

౪. వ్యాసము తిరుగ పంపబడవలయునన్నచో తగు పోస్టేజి చేర్చి పంపవలయును.



# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౮ } ౧౯౭౦ జూలై – వికృతి – అధికాషాఢము { సంచిక ౧

## ప్రార్థన

### భక్తి శతకము

శ్రీరామచంద్రకవిభారతి

శ్లో॥ స్వయంభూతాఖిజ్ఞం భవభయహరం భీతి రహితమ్,
స్ఫురద్భాగ్యః భోగోంజిః మహతవీర్యం మదనజిత్ ।
చతుర్మార్గం శుద్ధప్రకృతి చ తథాకర్తృకమిదమ్
ముదం లోకోత్కృష్టామతను తనుతాం వస్తు జగతామ్॥ 5

ఏది సర్వభూతరహస్యములను తెలిసికొని సంసారభీతిని పోగొట్టి భయమనునది లేక వైభవముతో ప్రకాశించుచుండునో, ఏది కామమును జయించి అప్రతిహత ప్రభావముతో ఐహికసుఖముల పరిత్యజించెనో, ఏది చతుర్విధమార్గములతో శుద్ధ ప్రకృతితో వెలయుచు ఎవరిచేతను సృష్టింపబడకున్నదో, అదే లోకమునకు అఖండ, ఉత్కృష్టముదమునుగల్గించుగాక!

శ్లో. క్వచిన్నీలం పీతం క్వచిదపి చ రక్తం క్వచిదపి,
క్వచిచ్చంద్రచ్ఛాయం క్వచిదపి చ మాంజిష్ఠరుచిరమ్ ।
క్వచిత్ ప్రభా ‿ర్యం యదయతి చ వర్ణవ్యతికరా,
చ్ఛి కాషట్కం తై ప్సైర్వథమపరి తద్ వస్తు శరణమ్॥ 6

ఏది కొన్ని ప్రదేశములందు నీలిరంగుగను, ఇతర ప్రదేశములందు పసుపువర్ణముగను, అన్యప్రదేశములందు ఎఱ్ఱని చాయగను ప్రకాశించునో, ఏది యొకచోట చల్లని చంద్రకాంతితో ప్రకాశించుచు మరియొకచోట మాంజిష్టవర్ణముతో వెలయుచుండునో, ఏది అన్యతర ప్రదేశములందు తేజోవంతముగా షడ్వర్ణముల మిళితమై ఆరు శిఖలతో ప్రజ్వరిల్లుచుండునో అదియే నాకు శరణము.



ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ.

# శ్రీ రామకృష్ణ వచనామృతము—'మ.'

## శ్రీ రామకృష్ణుడు - భక్తులు

[స్థలము . దక్షిణేశ్వర దేవాలయము - మధ్యాహ్నసమయము]

17 జూన్, 1883.

శ్రీరామకృష్ణుడు ఆహారము ముగించి తన గదిలో చిన్నమంచముపై విశ్రమించియుండెను. అధరుడు, 'మ.' వచ్చి శ్రీరామకృష్ణునకు నమస్కరించిరి. ఆ సమయముననే ఒక తాంత్రికభక్తుడుకూడ వచ్చెను. రాఖాలు, హాజ్రా, రామ్‌లాలు మొదలగువారు శ్రీరామకృష్ణుని సన్నిధానమున నుండిరి.

శ్రీరామకృష్ణుడు (భక్తులతో) :—సంసారమున నుండగనే ఈశ్వరదర్శనము ఏల లభింపదు? కాని, అది దుర్లభము. జనకాది మహాపురుషులు సముచితము జ్ఞానము పొందిన పిమ్మటనే సంసారమున నడుగిడిరి. అయినను భయమే. నిష్కామకర్ములుకూడ భయపడవలసినదే. భైరవినిజూచి జనకుడు తల త్రిప్పుకొనెను, స్త్రీదర్శనమువలన సంకోచము చెందెను. అప్పుడు భైరవి, "ఓ జనకా! నీకింకను జ్ఞానము కలుగలేదని తోచుచున్నది. నీయందింకను స్త్రీ పురుష భేదభావమున్నది."

"మసినిండిన గదిలో మెలగుచో ఎంత బుద్ధిమంతునికైనను ఎంత మెలకువగలవాడయినను కొంత మసి శరీరము నంటుకొనును."

ఎందరో సంసారుల జూచియున్నాను. వారు మడిబట్ట కట్టుకొని పూజలో కూర్చొనువరకు మంచి దైవీయభావము కలవారుగా నుందురు. కొంత ఆహారము పుచ్చుకొనువరకుకూడ ఆ భావము వారియందుండును. కాని తరువాత తమ నిజమూర్తి ధరింతురు—రజస్తమములతో నిండియుందురు.

సత్వగుణమువలన భక్తి కలుగును. అయినప్పటికి భక్తిలో సాత్వికభక్తియు, రాజసికభక్తియు, తామసికభక్తియు కలవు. సాత్వికభక్తి అనగా విశుద్ధసత్వము. ఇది ఏర్పడినప్పుడు ఈశ్వరునితప్ప మరి యే విషయముపైనను మనస్సు నిలువదు. దేహము రక్షించుటకొరకు మాత్రము, శరీరముపై మనస్సు నిలుచును.

"పరమహంసలు మూడుగుణములకును అతీతులు. వారిలో ఈ మూడు గుణములు ఉండినప్పటికి, లేనట్లే...సరిగా ఒక బాలకుని స్వభావము వారిలో కనపడును. ఏ గుణమునకును వారు వశ్యులుకారు. కావుననే చిన్నచిన్న పసిబాలురను తమయొద్ద నుంచుకొనెదరు. అందువలన ఆ బాలకస్వభావము నారోపించుకొనెదరు."

"పరమహంస ఏమియు సంచయము చేయజాలడు. కాని సంసారులు తమకుటుంబమునకై సంచయము చేయవలయును."

తాంత్రికభక్తుడు :—పరమహంసకు పాపపుణ్యములకు సంబంధించిన జ్ఞానముండునా?

శ్రీరామకృష్ణుడు:—ఇదియే కేశవసేనుడు కూడ అడిగెను. అప్పుడు నేను 'దీనినిగూర్చి నీకు చెప్పిన నీ సమాజము నిన్ను విడిపోవు' నన అతడు, 'అట్లైన సరే నిలువుడు' అనెను.

"పాపపుణ్యములననేమో నీకు తెలియునా?

పరమహంస కండ్లకు ఈశ్వరుడే కొందరకు సుమతిని కొందరకు దుర్మతిని ఇచ్చుచున్నట్లు కనపడును. కొన్నివృక్షములు మంచిపండ్లను కొన్ని చెడుపండ్లను ఇచ్చుట నీవు చూడలేదా? తీపిమామిడిపండ్ల నిచ్చు మామిడిచెట్ల కల్పించిన ఈశ్వరుడే పులుపుపండ్ల నిచ్చు చెట్లను కూడ సృష్టించియున్నాడు.''

తాంత్రికభక్తుడు:—ఔనండి! ఎత్తైన కొండపైనుండి జూచిన కండ్లకందువరకు గల గులాబీతోటల జూడవచ్చును.

శ్రీరామకృష్ణుడు:—పరమహంస ఇదంతయు మాయయొక్క ఐశ్వర్యముగా చూచును. సత్తు, అసత్తు, పాపము, పుణ్యము, అన్నియు దానిలో చేరినవి దీనిని అంత త్వరగా అంద జాలవు. ఆ సమయమున నీకు ఏ పరివారమును ఉండను.

తాంత్రికభక్తుడు:—కర్మఫలము మాత్ర మున్నదా?

శ్రీరామకృష్ణుడు:—అదికూడ ఉన్నది. సత్కర్మములు చేసిన మంచి ఫలము, దుష్కర్మములకు తదనుయుక్తమగు ఫలము. మిరపకాయ నమలిన కారముండదా? ఇదంతయు ఈశ్వర లీల, వారి క్రీడ.

తాంత్రికభక్తుడు:—అట్లైన మా గతి యేమగును! కర్మఫలములున్నవే.

శ్రీరామకృష్ణుడు:—కర్మఫలములుండిన నేమి? ఈశ్వరభక్తుల మాట వేరు.

(పాట భావము)

“ఓ మనసా కృషికర్మము నీకు తెలియదు. కాళికాదేవి నామముతో కంచెకట్టిన పొలమున నష్టమేమియు నుండదు.

ఆ ముక్తకేశియైన కాళియే గట్టియున్న కంచె యొద్దకు యముడుకూడ రాజాలడు

నీ గురువిచ్చిన బీజారోపము చేసి భక్తి వారిని పారింపుము నీ వొక్కడవే చేయజాల నిచో రామప్రసాదుని వెంటనిడుకొనుము”

(మరియొకపాట భావము)

“యముడువచ్చు మార్గమును చక్కగా మూసివైచితి

ఇక నా మనస్సునందలి సందేహములన్నియు తీరిపోయినవి.

నవద్వారములు గల నా గృహమునకు నలు దిక్కుల శివుడు కావలి కాయుచున్నాడు.

నా గృహమున కొకటే స్తంభము. మూడు త్రాళ్ల వలన కట్టబడియున్నది.

సహస్రదళపద్మమున శ్రీనాథుడు అభయ ప్రదాన మిచ్చుచు విరాజిల్లుచున్నాడు.”

పై రెండు పాటల పాడిన పిదప శ్రీరామకృష్ణుడు ఇట్లు చెప్పకొడగెను.

“కాశీనగరమున వేశ్య మరణించినను శివత్వము పొందును.

ఎవడు భక్తితో నిండి, హరినామము, రామనామము, కాళీనామోచ్చారణము—వీని వలన కంటనీరు చేయునో అప్పుడు సంధ్యావార్చుట మొదలగు కర్మములు ముగియును. అట్టివానిని కర్మఫలములు అంటజాలవు.”

(మరల ఇంకొకపాట భావము)

“ఈశ్వరధ్యానమునుబట్టి భావము కలుగును

భావమెట్టిదో యట్టిదే సిద్ధియు వీటినన్నిటికి మూలము భక్తివిశ్వాసములు.

కాళికాదేవి పాదపద్మ సరోవరమున చిత్తము మునిగియుండిన పూజా, హోమ, యాగ యజ్ఞములన్నియు అనావశ్యకములు.”

ఇంకను కొన్నిపాటల పాడి, తరువాత

శ్రీరామకృష్ణుడు ఇట్లు సెలవిచ్చెను: "ఈశ్వర భక్తిలో నిమగ్నుడైనవానికి అసత్ బుద్ధియైన పాపబుద్ధి యుండదు."

తాంత్రికభక్తుడు — తమరు సెలవిచ్చినట్లు 'విద్యాఽహం' భావము మాత్రము నిలుచును.

శ్రీరామకృష్ణుడు.— అవును. విద్యాహంకారబుద్ధి, లేక నేను భక్తుడను, ఈశ్వరదాసుడను అను మంచి యహంకారబుద్ధియే నిలుచును. దుష్టఅహంకారబుద్ధి వీడిపోవును.

తాంత్రికభక్తుడు — నేడు తమరు ఎన్నియో సందేహముల దూరీకరించితిరి.

శ్రీరామకృష్ణుడు — ఆత్మసాక్షాత్కారము కలిగిన అన్నిసందేహములు వీడిపోవును. భక్తి యొక్క తమోగుణమును పిలువుము. "ఏమి! నేను రామనామజపము చేయుచుండగా, కాళికాదేవీదివ్యనామ ముచ్చరించుచుండగా, నా కెట్లు బంధము ఏర్పడగలదు? ఆహా! నాకు కర్మఫలములు కూడనా?

శ్రీరామకృష్ణుడు మరల పాట నారంభించెను.

(భావము)

నేను దుర్గాదేవి నామోచ్చారణముతో మరణించిన ఓ తల్లీ! నీవెట్లు నా ముక్తికి అడ్డు పెట్టెదవు? శాంకరీ! నే నెట్టి దురాత్ముడనైన నేమి?

బ్రహ్మహత్య చేసినను, భ్రూణహత్య చేసినను, సురాపానము చేసియుండినను, స్త్రీహత్య గోహత్య చేసియున్నను, నాకేమియు భయములేదు.

నీ పవిత్రనామము పాతకముల నశింపజేసి బ్రహ్మపదమునకు తీసికొనిపోవును.

శ్రీరామకృష్ణుడు:— అన్నిటికంటె ముఖ్యమైనది దృఢనమ్మకము. "నా గురువు శ్రీరామచంద్రుడే ఈ సర్వము చెప్పియుండెను. 'ఓహీ రామ్ ఘుట్ ఘుట్ మే లేటా'" అని నమ్మి శిష్యుని రొట్టెముక్కను కుక్క తీసికొనిపోవుచుండగా అతడు, "ఓ రామా! నిలువుము, నిలువుము, రొట్టెలో నెయ్యి లేదు. నెయ్యి పూసి యిచ్చెదనని కేకలు వేయుచు దాని వెంట బడిపోవును. చూచితివా గురువాక్యములం దెంత నమ్మకమో?

పనికిరానివారి కెప్పుడును నమ్మకము కలుగదు, ఎప్పుడుజూచినను సందేహమే. కాని సర్వసంశయములు ఆత్మసాక్షాత్కారము కాకపోయిన నశింపజాలవు."

"పరిశుద్ధభక్తియందు మరి ఎటువంటి ఆశయు ఉండదు. ఆ భక్తివలన శీఘ్రముగా ఈశ్వరుని పొందగలము. అణిమాదిసిద్ధులు అకామ్యవస్తువులు. శ్రీకృష్ణుడు అర్జునునితో "తమ్ముడా! అణిమాదిసిద్ధులలో ఒకటి యుండినను ఈశ్వరదర్శనము కలుగదు. కాని కొంచెము శక్తిమాత్రము హెచ్చుగ వచ్చును" అని చెప్పెను."

తాంత్రికభక్తుడు — అయ్యా! ఈ కాలమున తాంత్రిక క్రియలు ఏల ఫలించవు?

శ్రీరామకృష్ణుడు:— ఈ కాలమున తాంత్రిక క్రియల సర్వాంగములు సరిగా చేయబడవు. సంపూర్ణభక్తియు కలుగదు. అందుచేతనే తాంత్రిక క్రియల ఫలము గోచరించుటలేదు.

కడపట శ్రీరామకృష్ణుడు "భక్తియే సారము. సరియైన భక్తునకు భయమేదియు ఉండదు. తల్లి జగజ్జనని అన్నియు నెరుగును. పిల్లి ఎలుకను ఒకవిధముగా పట్టుకొనినను, తన కూనను మరొకవిధముగా పట్టుకొనును" అని చెప్పి నాటి వాక్యాలాపమును ముగించెను.

శ్రీ శారదేశ్వర్యై నమః

# ధర్మ పరిశీలన

## విశ్వమత సిద్ధికి మార్గము

### శ్రీ వివేకానందస్వామి

(గతసంచిక తరువాయి)

ఇందుకు కారణమేమి? మతధర్మమును గురించిన సత్యమంతయుగల గ్రంథమును భగవంతుడిచ్చియున్నను దానివలన ప్రయోజనమేమియు కలుగదు. ఎందుచేతననగా, దానినెవరును గ్రహించుకొనజాలరు. ఉదాహరణమునకు బైబిలును, క్రైస్తవులలోగల శాఖలవన్నిటిని తీసికొనుడు; వీనిలో ప్రతి శాఖయును మూలగ్రంథమందలి యొకానొక వాక్యమునకు వ్యాఖ్యానముచేసి, మూలగ్రంథము తనకు మాత్రమే అవగాహనయగునుగాన తాను చేసిన వ్యాఖ్యానముమాత్రమే సరియైనదని తదితరవ్యాఖ్యానములన్నియు తప్పులు తడకలని చెప్పుచుండును. ప్రతి మతము విషయమునను ఇట్లే జరుగుచున్నది. మహమ్మదీయులలోను, బౌద్ధులలోను శాఖలెన్నియో గలవు. ఇక హిందువులలోనన్ననో, అవి శతసంఖ్యాకములు. ఆధ్యాత్మిక విషయములలో మానవజాతినంతటిని ఒకేవిధమయిన అభిప్రాయము కలిగియుండునట్లు చేయుటకు జరుగు ప్రయత్నములన్నియు విఫలములయ్యెనని, ఇటు తరువాతగూడ విఫలములగునని యీను కనుబరుచుటకే యీ విషయములను మీగమనిక లోనికి తెచ్చుచున్నాను. నేడుకూడ ఒక నూతన సిద్ధాంతమును బయలుదేరదీయ ప్రతి మనుష్యుడును తన అనుచరులను విడిచి యిరువది మైళ్లు దూరమైనను వెళ్లినయెడల, వారిరువది శాఖలను నిర్మింతురు. సర్వకాలమందిట్లే జరుగుచున్నట్లు మీరు గ్రహింపవచ్చును. అందరు నొకేవిధమయిన యభిప్రాయములను కలిగియుండునట్లు మీరు చేయజాలరు. ఇది వాస్తవ విషయము. ఇందుకు భగవంతునకు నావందనము లర్పింతును. ఏమతశాఖకైనను నేను విరోధినికాను. మతశాఖలుండుట నాకిష్టము. అవి ఇతోధికముగా వృద్ధినొందగోరెదను. ఏల? కారణమును తెలుపుచున్నాను: మీరును, నేనును, మఱి యిక్కడగలవారందరును ఒకే విధముగా ఆలోచింపనారంభించినచో, ఆలోచించుటకు మనకేమియు విషయములేయుండవు. చలనము కలుగవలెననిన, రెండుమూడు శక్తులకు సంఘర్షణ జరుగవలెనని మీరెరుగుదురు. ఆలోచనలసంఘర్షణలవలననే, ఆలోచనల వివిధత్వమువలననే, ఆలోచనకలుగుచున్నది. ఇక మనమందరము నొకేవిధముగ యోచించునెడల, మన మొక చిత్రవస్తు ప్రదర్శనశాలలోని ఐగుప్తీయమూక విగ్రహములవలె నొకరినొకరు తెల్లబోయి చూచికొనుచుందుము:— ఇంతకంటె విశేషఫలితమేమియు కలుగదు. జీవశక్తికలిగి,

వడివడిగ ప్రవహించు సెలయేటి నీటియందు మాత్రమే పలురకముల సుడిగుండము లుత్పన్నమగును. జీవరహితమైన నిలువనీటిలో, సుడిగుండములే యుండవు. మతములు నశించినతరువాత, శాఖలేవియుగాని యుండనే యుండవు. ఆనాడు శ్మశానశాంతి, సామరస్యములు సంపూర్ణముగ ప్రబలగలవు. కాని, మానవజాతి తన బుద్ధిబలము నుపయోగించి, యోచించుచుండు నంతకాలము, మతశాఖలుండును. భిన్నత్వము జీవలక్షణము కనుక, ఉండియే తీరవలయును. మానవులలో తలకొకటి చొప్పున మతశాఖలు పెరిగి, మతధర్మము విషయమున ప్రతివ్యక్తియు తన సొంత పద్ధతిని, ప్రత్యేకయోచనావిధానమును అనుసరించుచుండవలయునని పరమేశ్వరుని ప్రార్థింతును.

ఈస్థితి యిదివరకే యుండియున్నది కూడ. మనలో ప్రతివ్యక్తియు తన స్వీయపద్ధతి ననుసరించియే యోచనచేయుచుండుట నిజము. కాని, ఈ సహజవైఖరి కెల్లప్పుడును, కడకు నేటికిని కూడ అంతరాయము కల్పింపబడుచునే యున్నది. ప్రత్యక్షముగా పశుబల ప్రయోగము సంభవింపకపోయినను, ఇతర సాధనలుపయోగింపబడుచున్నవి. న్యూయార్కు నగరమందలి ఉత్తమ మతబోధకులలో నొకడేమి చెప్పుచున్నాడో వినుడు. ఫిలిప్పైను ద్వీపవాసులకు క్రైస్తవమతబోధ చేయుట కొకేమార్గము కలదట! యుద్ధములో వారిని జయించుటే ఆమార్గమట! ఇదివరకే వారు క్రైస్తవులలోని కాథలిక్ శాఖకు చెందియున్నారు. కాని, ఆమతబోధకుడు వారిని ప్రెస్బిటీరియను శాఖ నవలంబింపజేయ గోరుచున్నాడు, ఇందుకొఱకై, అతడు తనజాతికంతటికిని దారుణ రక్తపాతపాపము నంటకట్టుటకు సంసిద్ధుడైయున్నాడు. ఎంతఘోరకలి! ఇతడు సర్వశాస్త్రపారంగతుడైన పండితుడు, తనదేశమందలి యత్యుత్తమమతబోధకులలో నొకడు. ఇట్టి మనుష్యుడు లవలేశమైనను సిగ్గులేక బహిరంగసభలలోనిలిచి, అర్థశూన్యమగు నిట్టి అవివేక ప్రసంగము చేయగలుగుచున్నాడనిన, శ్రోతల అభినందనములను బడయుచున్నాడనిన, ప్రపంచ మెట్టిస్థితియందున్నదో యోచింపుడు! ఇదియా నాగరకత! ఇది క్రొత్తపేళ్లతో, నూతనపరిస్థితులలో మరల విజృంభించుచున్న వ్యాఘ్రముల, నరభక్షకుల, అనాగరకజాతుల పూర్వకాలమునాటి రక్తపిపాస కాక, వేఱేమి! ప్రస్తుత ప్రపంచస్థితియే యిట్లున్నచో, ప్రతి మతశాఖయు నితర మతశాఖలను తనకు సాధ్యమైన యావదుపాయములను వినియోగించి, చీల్చి చెండాడుటకు ప్రయత్నించుచుండిన పూర్వయుగములలో ప్రపంచమెట్టి భయంకర సంఘటనలకు లోనయ్యెనో యోచింపుడు. ఇది చరిత్రాత్మకమైన విషయము. మన అంతరంగమందున్న పెద్దపులి నిద్రించుచున్నదే కాని, మరణింపలేదు. అవకాశములు కలిగినప్పుడది మీదకురికి, వెనుకటివలెనే వాడియగు తన గోళ్లను, కోరలను ఉపయోగించును. కత్తులకంటెను, తదితరాయుధములకంటెను ఘోరతరములైన ఆయుధములున్నవి. నిరసనభావము, సాంఘికద్వేషము, సాంఘికబహిష్కరణమును, ఈ యాయుధములు. కేవలము మనవలె యోచింపని మనుష్యులపైని ఈ మహాదారుణాయుధములు ప్రయోగింపబడుచున్నవి. మనవలెనే యితరులెందుకు యోచింపవలయును! కారణమేదియు నాకు గోచరించుటలేదు. నేను హేతుబద్ధుడగు మానవు



# శ్రీరామకృష్ణ ప్రభ

## ఆఱవ సంపుటము

౧౯౪౯ జూలై విరోధి - ఆషాఢము మొదలు ౧౯౫౦ జూన్ వికృతి-జ్యేష్ఠము వఱకు


సంపాదకులు :

శ్రీ ఋతజానందస్వామి

శ్రీ వెదురుమూడి వేంకటకృష్ణరావు



శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి

సంవత్సర చందా రూ. ౪] : : [విడి ప్రతి అణాలు

# విషయానుక్రమణిక

డనే యగుచో, ఇతరులు నావలె యోచించు చుండనందుకు సంతోషింతును. నేను శ్మశాన వాటికవంటి దేశములో నివసింపగోరను. మానవప్రపంచములో నేనొక మానవుడనుగ నుండగోరెదను. ఆలోచనాపరులగు మానవులకు భేదాభిప్రాయములుండును. అభిప్రాయభేదమే యోచనకు ప్రధమ లక్షణము. నేనాలోచనాపరుడగు మానవుడనగుచో, భేదాభిప్రాయములుగల ఆలోచనా కుశలురగు మానవులమధ్యనే తప్పక జీవింపగోరుదును.

ఈ సందర్భమున నొక ప్రశ్న బయలుదేరుచున్నది. ఈ భేదాభిప్రాయములన్నియుకూడ యదార్థములేయగునా? ఒక విషయము నిజమయినచో, తద్వ్యతిరేకము అబద్ధమగును. పరస్పర విరుద్ధములయిన యభిప్రాయము లొకే పట్టున యధార్థములెట్లు కాగలవు? ఈప్రశ్నకే నేను సమాధానమీయ దలచుచున్నాను. కాని మున్ముందు మిమ్మొకవిషయ మడిగెదను. ప్రపంచమందలి మతములన్నియు వాస్తవముగా పరస్పరవిరుద్ధములా? మహోన్నతభావములకు తావలములయిన బాహ్యరూపములను గురించి నేను చెప్పుటలేదు. వేర్వేరు మతధర్మములలో వినియోగింపబడు వివిధ భవనములు, భాషలు, కర్మకాండలు, గ్రంధములు మొదలయినవని నా యుద్దేశము కాదు. ప్రతి మతముయొక్క అంతరంగిక జీవకోశము నుద్దేశించి చెప్పుచున్నాను. ప్రతిమతమునకు ఆధారభూతమయిన జీవకోశముకలదు. అది మరియొక మత జీవకోశముకంటె భిన్నముగ నుండవచ్చును. కాని, అవి పరస్పర విరుద్ధములా? మతములు పరస్పరవిరుద్ధములా, పరస్పర పోషకములా?—ఇదియే ప్రశ్న. నా లేబ్రాయమునుండియు, యావజ్జీవితమును నేనీ ప్రశ్ననుగురించి బహుశ్రద్ధగా యోచించుచుంటిని, ఈసందర్భమున నాకడపటి యభిప్రాయము మీకొకింత సాహాయ్యకరముగ నుండవచ్చునను నుద్దేశముతో, దానిని మీకు తెలుపుచున్నాను. మతములు పరస్పర విరుద్ధములుకావని, పరస్పర పోషకములని నా నమ్మకము. ఒకవిధముగ ప్రతి మతమును విశ్వజనీన పరమ సత్యమందొక భాగమును గ్రహించి ఆ భాగస్థూలరూపముగ బరిణమింప నావిష్కరించుటకు తనయావచ్ఛక్తిని వినియోగించును. కాబట్టి, అది ఉన్నదానిని పెంపుచేయునే కాని, త్రోసిరాజని దానిస్థానము నాక్రమింపదు. ఇదియే సారాంశము. మతవిధానము లొకటి వెంబడి మరియొకటి బయలుదేరి, ఒక్కొక మహాభావస్వరూపముగ నొప్పుచుండును. ఇది వరకున్న ఆదర్శములకు నూతనాదర్శములు చేర్పబడవలయును. ఇదియే మానవజాతి పురోగమనము. మానవపురోభివృద్ధి యెల్లప్పుడును సత్యమునుండి సత్యమునకే కాని, స్వల్పతర సత్యమునుండి ఘనతర సత్యమునకే కాని, దోషమునుండి సత్యమునకుమాత్రము కాదు. అభివృద్ధి విషయమున, బిడ్డడు తండ్రిని మించవచ్చును. అంతమాత్రమున, తండ్రినిలేని వారిలో జమవేయతగునా? తండ్రిస్థితికి మఱికొంత యభ్యున్నతికలిసి వచ్చిన పరిణామమే బిడ్డడు. శిశుప్రాయమందుకంటె మీకిప్పుడెక్కువ జ్ఞానమున్నంతమాత్రమున, మీరా దశను లాఘవముగ పాటింతురా? మీపూర్వస్థితిని స్మరించి, దానిని మీరెన్నడైన అవివేకశూన్యావస్థయని చెప్పుదురా? ఇంత యెందుకు? శైశవమున మీకుగల జ్ఞాన మితోధికముగ వృద్ధిహొందిన పరిణామమేకదా మీ ప్రస్తుత స్థితి.

(సశేషము)



# జటాయువు సాయుజ్యము

శ్రీ కేశవతీర్థస్వామి

ఉ॥ అంత జటాయు వా రఘువరాంఘ్రియుగంబున ముక్కువెట్టి, ని
శ్చింతను, రామరామయని చింతనసేయుచు వీడి దేహ, మ
త్యంత మనోజ్ఞ భూషణ మహాద్భుత పీతపటాభిరాముడై
కాంతి జితార్కుడై యెదుట గానగవచ్చె చతుర్భుజుండునై.

మ॥ హరి సారూప్యము బొంది పక్షిపతి, దివ్యానంద బాష్పాంబువుల్
వరదల్ గట్టగ చేయిమోడ్చి, విలసద్భక్తి ప్రపూర్ణాంగుడై,
కరుణావార్ధిని, రామచంద్రుని, జగత్కల్యాణ సంధాయకున్
హరి నీరీతిగ బ్రస్తుతించెను మహోద్యజ్ఞాన వాక్యంబులన్.

మ. కో॥ దేవ! రామ! అనూపరూప! అతీత! నిర్గుణ! సద్గుణా!
రావణాసుర బాహుభంగ శరాసనాంబక! ప్రేరకా!
పావనాంబుద వర్ణ! సుందర పద్మనేత్ర! కృపార్ణవా!
కావవే ధరణీ ప్రదీపక! ఖండితోగ్రభవా! నతుల్.

మ. కో॥ వందనంబిదె అప్రమేయ! శివా! అనాది! అఖండ! గో
వింద! ద్వంద్వవిదూర! జ్ఞాన పవిత్రరూప! ధరాధరా!
వందనంబిదె రామ మంత్రజప స్థిరాఖిల రంజనా!
వందనంబుల కామ వత్సల! భంజితారి మదాసురా!

మ॥ పరమబ్రహ్మవు వాసుదేవుడవు, సర్వంబంచు నిన్వేదముల్
నిరత స్తోత్రముసేయు, నిన్ను గుణ మౌనిస్తోమముల్ భక్తియున్
పరమ జ్ఞాన విరాగ మార్గముల, సంభావింతు భవద్దయా

జ టా యు వు సా యు జ్య ము

శరధీ! విశ్వ సమస్తమోహన మహాసౌందర్య! అస్మద్ధృద్ధాం
బుధోపాసీన మధువ్రతా! బుధహితా! భూమీసుతా సంయుతా!

మ. శా॥ హేయగమ్య! సుగమ్య! నిర్మల! హేసమాసమ! శీతలా!
పాయకన్నిను యోగులింద్రియవర్గమెల్ల నణంచి, ని
ర్మాయులై కని సంతసింతురు రామ! శ్రీరమణీ నివా
సా! యనారత దాసవశ్య! యశః ప్రభంజిత సంసృతీ!
నాయెడంద వసింపవే రఘునాథ! సర్వజగద్ధనా!

ఉ॥ ఆరఘురామ శౌర్య విగతాయువు, భక్తజటాయువిట్లు గం
భీరవచో విలాసమున వేయి విధంబుల సన్నుతించి, దు
ర్వార తపోవిభూతిగల వారు, గమింపగజాలనట్టి సం
సార విదూరమైన హరి సత్పథ మేగె మహాద్భుతంబుగన్.

చ॥ నడుమున గుడ్డకట్టి, రఘునాథుడు భక్తి వినమ్రభావుడై
కొడుకటు బాష్పహార్తికవు గుత్తులురాలగ కన్గొలంకులన్
పుడకలు పేర్చి దానిపయి పూజ్య జటాయువు దేహముంచి, య
గ్గిడి దహనాదులన్ సలిపె, కేవల మాఖగరాజు పక్షియే!

శా॥ ఆహా! ఎంతదయాబ్ధి సూర్యకులుడవ్యాజానురాగుండు, సం
దేహంబించుక లేదు, యోగులు మహాదివ్యర్షులే చేరలే
రాహా! మాంసము మెక్కు నీచఖగమా! ఆవిష్ణు సాయుజ్యమా!
మోహాదుల్ విడి రాఘవేశ్వరుని సన్మోదంబుతో గొల్వుడీ!

మ॥ అయయో ఎంతటి మందభాగ్యులు! హరిన్ అవ్యాజకారుణ్యు, శ్రీ
దయితున్ గొల్వక లోకవాంఛలను పెన్దావాగ్నిలో గ్రుగ్గుచున్
భయదోద్దండ పునః పునర్జననముల్ వ్యాధుల్ జరామృత్యు సం
చయముల్ గల్గు భవాబ్ధి గూలెదరు దుస్స్వాంతుల్ గిరీంద్రాత్మజా!

—

శ్రీ

# రణభేరి

కొరియా దేశము కొండలతో నిండి, రెండు కోట్ల ముప్పదిలక్షల ప్రజలతో నిండిన పెద్ద ద్వీపకల్పము. దీనికి తూర్పున సముద్రమును రుషియాయును, ఉత్తరమున మంచూరియాయును, పడమటను, దక్షిణమునను సముద్రమును గలవు. దక్షిణమున మిక్కిలి చేరువగనే జపాను కలదు. 1895 వ సంవత్సరమందు జరిగిన చీనా – జపాను యుద్ధము తరువాత కొరియా స్వతంత్రదేశమయ్యెను. కాని, 1910 లో దీనిని రుషియా యెక్కడ మ్రింగివేయునో యను భయముతో జపాను తన సామ్రాజ్యమందు గలుపుకొనెను. 2 వ ప్రపంచయుద్ధమందు మిత్రమండలి పక్షమున నుండిన రుషియా, యుద్ధములో జపానునోడించి, కొరియాను పరాధీనతనుండి విడుదల చేసెను. అయినను, దీని పరిపాలన విషయమున రుషియా, అమెరికాలకు భేదాభిప్రాయములు కలిగినందున, దీనిని ఉత్తర కొరియా యని, దక్షిణ కొరియా యని రెండు భాగములుగ విభజించి, ఉత్తరభాగము రుషియా పెత్తనముక్రిందను, దక్షిణభాగము అమెరికా సంయుక్తరాష్ట్రముల పెత్తనముక్రిందను నుండునట్లు తీర్మానించికొని, ఆ యుభయదేశ ప్రభుత్వములవారును రాజీచేసికొనిరి. 38 వ సమరేఖ (పారలెల్ లైను) అని చెప్పబడు కేవల మూహాకల్పితమైన యొక గీత ఉత్తర, దక్షిణ కొరియాలకు మధ్య సరిహద్దు. ఇనుము మొదలగు ఖనిజములు సమృద్ధిగానున్నను, వానిని వినియోగపరచుకొనజాలకపోవుటచే, వరి, బార్లి మున్నగు ఆహారపదార్థములను పండించి, విదేశముల కెగుమతిచేయుచు [illegible] ప్రజలు ముఖ్యముగ వ్యవసాయపరిశ్రమవలననే జీవించుచుండిరి. ఇట్లు శాంతముగ కాలము గడచిపోవుచుండ, కడచిన జూను నెల 25 వ తేదీని ఉత్తర కొరియా దక్షిణ కొరియాపై దాడి వెడలెనను పిడుగువంటి దారుణవార్తను అమెరికా సంయుక్తరాష్ట్ర ప్రభుత్వము ప్రకటించినది.

ఈ వార్తయందలి యాథార్థ్యము సందేహాములకు గురియైనది. 1947 లో అంతర్జాతీయ సమితి కొరియా దేశవ్యవహారములను కనిపెట్టి చూచుచుండుటకు, ఆస్ట్రేలియా, కనడా, చీనా, ఎల్ సాల్వడార్, ఫ్రాన్సు, ఇండియా, సిరియా, యుక్రేన్, ఫిలిప్పైను ప్రతినిధులుగల అంతర్జాతీయ కొరియా కమిషనును ఏర్పాటుచేసెను. ఈ కమిషనువారు కొరియానుండి అంతర్జాతీయ సమితికి పంపిన తంతివార్తనుబట్టి ఉత్తర కొరియాయే యుద్ధమును ప్రారంభించెనని నిర్ణయించుటకు వీలులేకుండెను. ఉత్తర కొరియా ప్రభుత్వము 38 వ సరిహద్దు గీత నానుకొనియున్న తన గ్రామములను దక్షిణ కొరియా ప్రభుత్వము ముట్టడించినదని ప్రకటించినది. ఎట్లయిననేమి, అంతర్జాతీయ కొరియా కమిషను యుద్ధమునుండి విరమింప నిరుకగలవారిని హెచ్చరించినది. ఉత్తర కొరియా యీ హెచ్చరికను మన్నింపనందున, అంతర్జాతీయసమితి యుద్ధవిరామమునకు తగిన చర్యను దీసికొనవలయునని కొరియా కమిషను విన్నవించెను. ఈ విన్నపమును బురస్కరించికొని సమితి సెక్రెటరి-జనరల్ ట్రిగ్వే లై యుద్ధవిరమణ

ఫలితమును జేకూర్చుటకు సమితి సభ్యుల సాయుధ సాహాయ్యమును గోరెను. ఈ కోర్కెను పాటించి అమెరికా సంయుక్తరాష్ట్ర ప్రభుత్వము తన త్రివిధబలములను దక్షిణ కొరియా సాయమునకు బంపుచు, ఉత్తర కొరియాచే యుద్ధమును మాన్పింప రుషియాను వేడుకొనెను. కాని, నిజముగ యుద్ధమును ఉత్తర కొరియా ప్రారంభింపలేదని, అంతర్జాతీయసమితిని అమెరికా సంయుక్తరాష్ట్ర ప్రభుత్వము తన కాణాచిగ నుపయోగించుకొని, ఉత్తర కొరియాపై దాడివెడలుచున్నదని దోషారోపణ జేసెను, ఇంతేకాదు, అమెరికా తనపెత్తనముక్రింద నుండిన దక్షిణ కొరియనులకు పటుతరమైన సైనికశిక్షణ మీయలేదని యాక్షేపించెను, మెకార్థర్ సేనానిని దక్షిణ కొరియా సైన్యాధిపతిగ నియమించుట అక్రమమని, శాసనవిరుద్ధమని ప్రకటించెను; స్వజాతీయైక్యతకొఱకు అమెరికాలోని ఉత్తరపు రాష్ట్రము లెట్లు దక్షిణరాష్ట్రములతో పోరాడెనో, నేడట్లే ఉత్తర కొరియా దక్షిణ కొరియాతో యుద్ధముచేయుచున్నదని సమర్థించెను, చీనాప్రజలలో నిట్టి అంతరంగికయుద్ధము జరుగుచుండినప్పుడు అమెరికా యిట్టి చర్య నేల తీసికొనలేదని ప్రశ్నించెను. ఈ విషయములనన్నిటినిబట్టి, కొరియా ప్రజల జాతీయైక్యతగాని, యోగక్షేమముగాని అమెరికాకు ప్రధానము కాదని, స్వప్రతిష్ఠకొఱకై ప్రపంచాధిపత్యము కొఱకై ఆ ప్రభుత్వము పెనుగులాడుచున్నదని పాఠకులకు విశదము కాగలదు. అందుచేతనే, కొరియాప్రజల యీ అంతఃకలహ మేనిమిషమున మహాభయంకర ప్రపంచయుద్ధముగ బరిణమించునో యని శాంతిప్రియులెల్లరు కలవరపడుచుండుట. మన ఇండియా ప్రధానామాత్యుడు మొన్న మొన్న అమెరికను, సోవియటు, బ్రిటిషు ప్రభుత్వములకు యుద్ధవిరమణమును గోరుచు సందేశమును బంపుట కీ కలవరమే కారణము. సోవియటు ప్రభుత్వనియంత స్టాలిన్ సేనాని, నెహ్రూ చేసిన ప్రతిపాదనలను వెంటనే అంగీకరించినను, అమెరికా సంయుక్తరాష్ట్ర ప్రభుత్వాధ్యక్షుడు ట్రూమను మహాశయుడు, ప్రత్యుత్తర సుముహూర్తమునకింకను మీనమేషములను లెక్కించుచున్నాడు. అంతర్జాతీయసమితి సమావేశమం దీ విషయపునరాలోచనకు మున్ముందు సమితిలోనుండి ప్రాత చీనా ప్రతినిధిని తొలగించి, నేటి చీనా ప్రజాప్రభుత్వమునకు ప్రాతినిధ్యమిచ్చుట బహుముఖ్యమని నెహ్రూ మహాశయుడు తన సందేశమున దెలిపియుండెను. సమితిచర్చలలో రుషియా పాల్గొనవలయుననిన, నింతకంటె గత్యంతర మింకొకటి యేదియును లేదు. కాని, క్రిందపడినను మా మంటియొద్దే, ప్రాత చీనా నేషనలిస్టు ప్రభుత్వమే, గెలిచినదను మూర్ఖధోరణిని ప్రెసిడెంటు ట్రూమనింకను విడిచిపెట్టలేదు. కాబట్టిన కుందేటికి మూడేకాళ్లనుచున్నాడీ ప్రజాస్వామ్యాభిమాని! ప్రపంచశాంతి, మానవజాతి యోగక్షేమములు నిట్టి స్వప్రతిష్ఠారాధకుని చిత్తవిలాసముపై నాధారపడియుండుట ప్రపంచదౌర్భాగ్యము కాక మరేమని చెప్పవలయును? విశ్వప్రజాశాంతి, క్షేమముల రక్షణమే, ఈ ప్రభుత్వము లహరహమనుసరింపదగిన మహోన్నతరాజధర్మమను బుద్ధిని, "లోకద్రోహి నరేంద్రవంశదహను"డగు జగన్నాథుడు సమస్తదేశపరిపాలకులకును త్వరితముగ నొసంగుగావుతమని ప్రార్థించుచున్నాము. పాపము నశించి, ధర్మమే జయమొందునుగాక! ఓం శాంతి, శ్శాంతి, శ్శాంతిః.

# శ్రీ కృష్ణస్తవము

శ్రీ చెరుకుమల్లి వేంకటయ్య చౌదరి

(పోనెలసంచిక తరువాయి)

మ॥ అతిమోదంబున తండ్రి యానతిని ఘో * రారణ్య మధ్యంబులన్
సతితోఁ గూడి చరించి, శిల్పమునకున్ * సాయుజ్యమబ్బించి, దు
ర్మతులం గూల్చి, యశంబుఁ గాంచి, కడిమిన్ * రాణించితే దేవ! యు
న్నతభావా! రఘురామమూర్తివయి, కృ * ష్ణా భక్తసంరక్షణా! ౩౧

మ॥ కలుషోన్మత్తుడునౌ ప్రలంబు నుదసం * గ్రామంబునం ద్రుంచి, నా
గలిచే దంతిపురిన్ బెగల్చితివ, రం * గత్తుంగ కాళింది, శై
వలినీ గర్వమడంచినాడవ కృపా * వారాన్నిధీ! నా మనం
బలరారన్, బలరామనామమున, కృ * ష్ణా! భక్తసంరక్షణా! ౩౨

మ॥ కపట శ్రీఘనరూపివై త్రిదశశ * త్రూదీక్షచే మున్ను, నా
త్రిపుర స్త్రీలకు నాస్తికంబిడి, మహా * రిష్టంబు గల్పించు, ప్రా
ణపదిబృందముగూల్చు, నీ చరిత మెన్న * న్నేరికశక్యంబు, శ్రీ
శ! పరేశా! రిపువంశనాశ! యదుకృ * ష్ణా! భక్తసంరక్షణా! ౩౩

మ॥ ఒగిదుష్టాత్ములు, సాధుజీవనుల, స * ద్యోగేంద్ర సంఘమ్ములన్
బగలున్ రేయి భరింపరాని, విపదాం * భస్నాతులంజేసి, యా
సగుణోద్ధర్మము రూపుమాప, తవరో * షాగ్నింబడం గూల్పవే!
నగధారీ! కలిరూపధారివయి! కృ * ష్ణా! భక్తసంరక్షణా! ౩౪

మ॥ భవదీయామల పాదయుగ్మ జనితాం * భః పాకరాజీవ, సం
భవవీచీ నివహాంబు సోకెడు మహా * ద్భాగ్యంబు చేకూర, మా
నవు లెవ్వం డతిలోకుఁడై వినుతిఁ గాం * చన్ లేడు, జోహారు లీ
యవె గైకోర! సమస్తపాపహర, కృ * ష్ణా! భక్తసంరక్షణా! ౩౫

మ॥ బహుజన్మంబులనుండి దుష్కలుష జం * జాలంబునం బ్రుంగి, యి
క్కుహనావిశ్వమె శాశ్వతంబనుచు, వా * శోభూన నీ దుష్టుడం
చహితాత్ముండవుగాక, నీదుకొసకం * టన్ జూచి బ్రోవంగదే!
యహితల్పా! బహురూపకల్ప! హరి, కృ * ష్ణా! భక్తసంరక్షణా! ౩౬

(సశేషము)



# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీ హరిశరణమ్

ఆల్మోరా,
24-7-'15

ప్రియ... ..

నాకోరికలేవియు సాగనేరవు "దేవ ఇచ్ఛా ప్రవర్తతే." మీరు నన్ను ప్రార్థించినందులకై నే నెంతయో కృతజ్ఞుడను. 'అందులకై నావందనశతములను స్వీకరింప గోరెదను. నీకుగల ఈశ్వరదర్శనేచ్ఛ యెంతయు బాగడదగినది. "ఇహచేదవేదీ దత్తసత్యమస్తి, నచేదిహా వేదీన్మహతీ వినష్టిః"— మానవు డీలోకముననే బ్రహ్మస్వరూపము నందగలడు. అట్లయిన సత్యలాభమును బడయును. ఇది తెలియజాలనిచో మహానర్థము కలుగును." కేనోపనిషత్తు 2-5. ఈ శరీరముతోడనే భగవల్లాభము నందగలిగినచో శుభము. అట్లుకానిచో మహానర్థము కలుగుననుటకు సందేహములేదు. (ఆయనను) కోరువాడే ఆయనను బడయగలడు. భగవంతుడాతని స్వీకరించును. 'యమేవైషవృణుతే తేన లభ్య—ఎవడు భగవంతుని వరించునో యాతడే ఆయనను పొందగలడు!'—కఠోపనిషత్తు 1-2-23. వెదకిచూచినచో సహజముగా ఆయనను కనుగొనగలము. ఆతడు మహాదయాళువు. కాని ఆయనను గోరువారెవరు? ఇదియే ప్రశ్న! ఆతని చిత్తము కలిగినచో స్తంభమందు సయితము మనకు గోచరింపగలుగునట్లు ప్రతిజ్ఞచేసియున్నాడు. కాని వెదకువారెవరు? ఇదియే మహామాయ! పలువిషయములపై మనస్సు ప్రబలియుండుటవలన ఆయనను వెదకుటకు మనకు తీరుబడికలుగదు. శ్రీరామకృష్ణ గురుదేవుడు బియ్యపుకొట్టులోని ఎలుకలను ఏమార్చువిధము నిందుల కుదాహరణముగా జెప్పువారు. ఎదుట బియ్యపుబస్తాలున్నను ఎలుకలు తమ్ము వంచించుటకై వణిజులు ముందట నుంచియున్న చేటలోని పేలాలను తిని పొట్ట నింపుకొనును. కాని బియ్యముజోలికిపోవు. ఇట్లు జీవుడు దారాపుత్రాదులవలని సుఖములందే ప్రమత్తుడై యుండును. భగవంతుడు తనలోనున్నను ఆతని ననుసంధానింపడు. ఇదియే మహామాయ.

(బెంగాలీపాటయొక్క భావము)

[ఇదియే మహామాయావిలాసము. మనలందఱను అది ఏమఱించుచున్నది. బ్రహ్మయు, విష్ణువు సయితము అచేతన జీవభావావస్థయందు భగవంతుని తెలియగలరా?

బెస్తవాడు వలవేయుచు, మీనము లందు ప్రవేశించును రాకపోకలకనువగు మార్గమావలయందున్నను ఆ మత్స్యము తప్పించుకొనజాలదు.

పట్టుపురుగు తాను అల్లిన గూటియందు గూర్చొని వలచుచో బయలువెడలవచ్చును. కాని మహామాయకులోనైన యీపురుగు తాను అల్లిన గూటియందే మరణించును.]

ఇదియే మహామాయావిలాసము. కాని అభయవాణియు నొకవైపున వినవచ్చుచున్నది.

—'మామేవయే ప్రపద్యంతే మాయామేతాం తరంతితే * తమేవశరణంగచ్ఛ సర్వభావేన భారత, తత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్. †

కాని శ్రద్ధ ఆవశ్యకము. భగవత్కృప వలన శ్రద్ధ మనలో నుదయించిన నిక భయము లేదు.

శ్లో॥ శ్రద్ధావాన్ లభతేజ్ఞానం
తత్పరః సంయతేంద్రియః,
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి
మచిరేణాధిగచ్ఛతి. ‡

లోకులేమన్న నీకేమి? భగవద్దర్శనము స్వానుభూతి, మనలో మన మనుభవింపగలము. భగవంతుడు స్వసంవేద్యుడు. కావున పరుల పలుకులవలన నిందెట్టిమార్పును గలుగజాలదు. మనలో మనము పూర్ణానందము ననుభవింప గలము.

'నశోచతి నకాంక్షతి' భగవత్కృపవలనదీనిని మనము బడయగలిగినచో నిం దాశ్చర్యమూవంతయు నుండదు. వేయిసంవత్సరములనుండియు చీకటితోనిండియున్నగదియందు నయితము ఒక నిప్పుపుల్ల నంటించినచో ఆగదియంతయు ప్రకాశముతో నిండును. "నక్కలన్నియు నొకేవిధముగా నఱచును" అని శ్రీరామకృష్ణ గురుదేవుడు వచించెడివారు. అనగా జ్ఞానులందఱును అనుభూతియం దొకేరకము. వారి యుపదేశమునందు భేదముకలుగదు. అందఱును ఆ జగన్మాతృ సంతానములే, వివిధమతములును, వివిధమార్గము లయినను వానియన్నింటికి గమ్య మొక్కటియే.

శ్లో॥ రుచీనాం వైచిత్ర్యా
దృజుకుటిల నానాపథజుషాం,
నృణామేకో గమ్యస్త్వమసి
పయసా మర్ణవయివ.

శివమహిమ్నస్తోత్రము.

వివిధమార్గముల ప్రవహించియు జలము సముద్రమునే చేరునట్లు నరులును వక్రావక్ర గతుల నెట్లు నడిచినను నిన్నేపొందుదురు.

చందమామ అందఱకును మామయే. దీని యందు తప్పేమున్నది? మీరేల చిత్తదౌర్బల్యమును పొందెదరు. దేవీ సంతానము లసమానులు అనంతశక్తి సంపన్నులు. "ఎవనితల్లి బ్రహ్మమయియైయున్నదియో అతనికి భయమేల?" రామప్రసాదిట్లు పాడియున్నాడు.

(పాటభావము)

దేవీసంతానమునకు బలము నందేమి కొదువ? ఆమెకృపవలన వారు అనంతశక్తిని బడసి యుందురు. నిజముగా ఆమెయే తల్లి. ఆమె పాదములే గంగా గయా కాశీ.

---

* ఎవరు ఇతరసాధనలపై నిర్భరపడక నన్నే ఆశ్రయించుచున్నారో వారే దుస్తరమగు ఈమాయ నతిక్రమించుచున్నారు. అనగా సంసారబంధమునుండి ముక్తులగుచున్నారు.

† భారతా! సంసారార్తి నాశనముకొఱకు నీవు సర్వతోభావమున ఈశ్వరునే శరణుజొందుము, ఆయన కృపవలన నీవు పరమశాంతిని మోక్షమును బొందగలవు.

‡ శ్రద్ధాళుడను గురుసేవారతుడును జితేంద్రియుడునగు ముముక్షువు తత్త్వజ్ఞానమును బడయగలడు [జ్ఞానలాభపర్యంతము చిత్తశుద్ధికొఱకు కర్మయోగము అవశ్య మనుష్ఠేయము. జ్ఞానలాభానంతరము మఱి కర్తవ్యము లేదు.] అతడు జ్ఞానమునుబడసి అతి శీఘ్రముగనే పరమశాంతిని (మోక్షమును) బొందును.

శ్లో. త్వంవైష్ణవీ శక్తి, అనంతవీర్యా!
విశ్వస్య బీజం పరమాసిమాయా,
సమ్మోహితం దేవి సమస్తమేత
త్వంవై ప్రసన్నా భువి ముక్తిహేతుః,*
సప్తశతి 11-5

ఈ బ్రహ్మమయియే మనజనని. మనకింక భయమెందులకు? మనము చిత్తదౌర్బల్యము నందుటలేల? మీరు మహాశక్తి సంపన్నులు. దేవ్యనుగ్రహమువలన మీరు సాధింపజాలని కార్యమేమియు నుండబోదు. మీరు 'నేను, నాది' యను భావమెట్లు విడివడునని యడుగుచున్నారు. అది పోవుట కెంతసేపు. తల్లిదయ కలిగిన ముహూర్తమాత్రముననే భగవద్జ్ఞానము సాధింపగలరు. ఇది సత్యము.

ఇట్లు,
శుభాశీర్వచనములతో
శ్రీ తురీయానంద

* నీవే అనంత వీర్యశాలినివి, వైష్ణవీశక్తివి. సంసారమునకు కారణస్వరూపవు. పరమమాయాస్వరూపిణివి. ఓదేవీ నీవు జగత్తంతయు సమ్మోహితముగావించియున్నావు. నీవు ప్రసన్నవైనచో లోకమున ముక్తిలభించును.



వీధినాటకములను జూచితిరికదా! అందు కృష్ణలీలా నాటకమున తాళమృదంగాదులతో పాటకాండ్రు ఎలుగెత్తి, "రావయ్యా, ఓ కృష్ణ! ఇమ్ము దర్శనము!" అని పాడుచుండునంతకాలము కృష్ణవేషధారి వారి ఘోషను కొంచెమైనను ఆలకింపడు. చుట్టకాల్చుకొనుచు తెరచాటున వేషములు వేయుచోట గూర్చుండి దగ్గఱవారితో ప్రగల్భములు కొట్టుచుండును. వారి రొద యణగి నారదమహర్షి, మార్దవము, మనోహరమునగు కంఠస్వరముతో, "శరణం తవచరణం భవహరణం మమ గోవింద!" అని గాన మారంభింపగనే శ్రీకృష్ణు డిక విలంబముచేయక వెంటనే రంగమున ప్రత్యక్షమగును. సాధకుడు, "ప్రభూ! అనుగ్రహింపుము, నాకు దర్శనమిమ్ము" అని యూరక అఱచుచుండునంతవఱకు జగత్ప్రభువు దర్శనమీయడు. భగవంతుడు సాక్షాత్కరించునపుడు భక్తుని హృదయము ప్రేమసాగరమున లీనమై యుండును. అవు డెంతయు ప్రశాంతచిత్తుడై యుండును. మునుపటిగోల అంతయు పూర్తిగా అంతరించును. ప్రేమపూరిత హృదయుడై, మనసార భక్తుడు ప్రార్థించినంతనే భగవాను డిక ప్రత్యక్షమగుటకు ఒకనిముసమైనను జాగుచేయజాలడు.

—శ్రీ రామకృష్ణ పరమహంస



శ్రీ కృష్ణాయనమః

# శ్రీ కృష్ణచైతన్యులు

ధర్మమార్గములందు ప్రసిద్ధిగాంచినది భక్తి మార్గము. ఈభక్తిమార్గము భారతదేశమందంతటను చక్కగా వ్యాపించియున్నది. పూర్ణావతారుడని ప్రసిద్ధిగాంచిన శ్రీకృష్ణపరమాత్ముని భక్తులను లక్షలకొలదిగా ఆసేతుహిమాచలము మనము కనుగొనవచ్చును. ఇట్టి శ్రీకృష్ణ భక్తిని వంగదేశమున చక్కగా వ్యాపింపజేసిన వారు శ్రీకృష్ణచైతన్య మహాశయులు. అంత మాత్రమే కాక పుణ్యక్షేత్రములందు ప్రాధాన్యత వహింపగలిగిన బృందావనము ప్రస్తుత స్థితికి వచ్చుటకు సయితము వారే కారకులు.

ప్రపంచమునందు ధర్మము క్షీణించి అధర్మము హెచ్చు పెరిగి లోకము అల్లకల్లోలము కానున్నసమయమున భగవంతుడు అవతరించి ధర్మసంస్థాపనము కావించి, సాధుసంరక్షణమును దుష్టనిగ్రహమును గావించునని భగవద్గీతయందు వివరింపబడియున్నది కదా! ఈ విషయమును—ఈ పలుకును—తెలియుటకై శ్రీకృష్ణచైతన్యులవారి అవతారకాలమున వంగదేశ మెట్లుండెనని పరిశీలింతము. ఆ కాలమున వంగదేశము మహమ్మదీయపాలనమునకు లోనైయుండెను. సాధారణ ప్రజానీకము ధర్మమార్గమునుండి తమదృష్టిని తొలగించి, అందు నమ్మకమును గోల్పోయి, ఐహికలాభములకును విషయతృష్ణా పూరణమునకును తగు మార్గమును, వృత్తములను అవలంబించుచుండిరి. సద్వంశజాతులై వేదవేదాంగములు జదివి జ్ఞానలాభము నందగలిగిన బ్రాహ్మణులకు సైతము ధర్మము, దేవుడు మున్నగు విషయములయందెట్టియు నమ్మకము లేకయుండెను. ఆ కాలమున ప్రజలయందు శాక్తేయమతమే ప్రబలియుండెను. సాధారణముగా మంగళచండీ (ఐహికసంపదల నొసగగల పౌరాణిక దేవత) గుణగానము గావించి యామె కృపకు పాత్రులు కావుటయే నాటి ప్రజల ధర్మమునందు ముఖ్యాంగముగా భాసిల్లుచుండెడిది. ఇక ఈశ్వర సాక్షాత్కారమే పరమావధిగా తలంచిన సాధువుల జీవితము సయితమెంతయో కష్టమైయుండెనన్నచో నాటి సామాన్య ప్రజాజీవనము ఎట్లుండెడిదో పాఠకులరయుదురుగాక! ఇట్టి సమయమున ప్రపంచమంతటను భక్తితరంగిణి ప్రవహింపజేసిన మహాప్రభువు ఈశ్వరాంశీయులై శ్రీకృష్ణచైతన్యులవారు క్రీ. శ. 1485 వ సంవత్సరమున అవతరించిరి.

నాడు ఫాల్గుణ పూర్ణిమ. మరియు చంద్రగ్రహణము. నవద్వీపములందు కొన్ని సంవత్సరములనుండియు తన సతీమణియగు శచీదేవితో వాసముచేయుచున్న శ్రీ జగన్నాథ మిశ్రుడు విరివిగా దానధర్మములు గావించుచుండెను. ఆ పవిత్రదినముననే శ్రీ శచీదేవి తన ద్వితీయకుమారుని ప్రసవించెను. ఆ శిశువునకు శాస్త్రోక్తముగ విశ్వంభరుడని నామకరణము కావించిరి. కాని ఆ మహాత్ముని

'నిమయి' అనియే సాధారణముగా పిలువబడుచుండెను. ఇంతులకు గల కారణము నిదమిత్థముగా మనము నిరూపింపజాలము కాని, ఆ మహామహుడు నింబవృక్షము నీడను జన్మించుటవలన వారి కిట్టి నామము కలిగెనని కొందఱు విశ్వసింతురు. అంతియేకాక బంగరుమేని ఛాయ కలిగియుండుటవలన గౌరాంగుడనియు నా మహామహుడు ప్రసిద్ధిగాంచియుండెను. నిమాయి మిక్కిలి సుఖపురుషుడు. దేహకాంతికి దగిన లావణ్యము, అంగసౌష్ఠవము కలిగి కన్నవారికి కన్నులపండువుగా నుండెను. బాల్యమున ఆయన కావించిన కొంటెపనులు అనేకములు. ఇరుగుపొరుగుల ఇల్లాండ్రు శచీదేవికి తనపుత్రుని కొంటెపనులను దెలిపి ఆక్షేపించుచుండువారు. ఒక్కొక్కసమయమున మడికట్టుకొని చేసినవంట శుద్ధికాకపూర్వము తనచేతితో దీసికొని భుజించెడివాడు. స్నానము చేసి వచ్చుచున్నవారి కెదురుగా జని పుక్కిటినీరు వారి ముఖమున నుమియుచుండెను. నిద్రించుచున్న చంటిపిల్లలను గిల్లి ఏడ్పించుచుండెను. ఇట్టి పనుల సహింపజాలక దైనందినము ఎందఱో మగువలు శచీదేవికి విన్నవింప నామెయు కొందఱను సామవాక్యములతోడను మఱికొందఱను బ్రతిమాలికొనియు నచ్చజెప్పి వారివారిని తమతమ యిండ్లకు బంపుచుండెడిది. ఒకనాడు శచీదేవి తన చిన్నకుమారుని శాసింపదలంచి చేత బెత్తమునుబట్టి పుత్రుని వెన్నంటెను. స్నానము కావించి మడికట్టుకొన్న తల్లి అశుద్ధపదార్థముల జేరదని యెఱిగిన గౌరాంగుడు ఒక పెంటప్రోగుపై నిలువంబడెను. 'ఇది యేమి? మైలయందు—అశుద్ధమునందు—నిలువబడితివి? రమ్ము! దిగి త్వరగా రమ్ము' అని శచీదేవి పుత్రుని బిలిచెను. ఆ మహామహుడు 'ఇది యేటి అశుద్ధము! ఇంతకంటెను మైల మన శరీరముననే యున్నది' అని బదులు పలికెను.

కాలము గడచిన కొలదియు నిమాయి కొంటెపనులుగూడ హద్దుమీఱినవి. తన తండ్రిని జేరు పండితుల సహాలి మాతడు వివిధములుగ కష్టపెట్ట నారంభించెను. బాలుని సాధువర్తనుని గావించుటకు చదువు చెప్పించుటయే తగిన కార్యమని తలచి ఆతనిని ఒక బడిలో జేర్పించిరి. అపూర్వ మేధాశక్తిని గలిగిన నిమాయి అందఱికంటె త్వరత్వరగా పాఠముల నేర్చుకొనుచుండెను. ఆ కాలమున 'నదీయా' (నవద్వీపమున)యందు షడ్దర్శనములలో నొకటియైన న్యాయశాస్త్రమున కత్యంత ప్రాబల్యముండెను. పండితులెల్లరు నీ శాస్త్రముచే నాకర్షింపబడి దీనినే శ్రద్ధతో పఠించువారు. తార్కికప్రవృత్తిగల నిమాయి అనతికాలమునందే న్యాయశాస్త్రమున విశేషప్రతిభను బడసెను. ఇట్లుండ నిమాయికి పండ్రెండవయేడు ప్రవేశించెను. ఆయన తండ్రియు మరణించెను. తండ్రి మరణమువలన నిమాయిని కష్టపరంపరలు వెన్నంటెను. కాని చదువును విడువక న్యాయశాస్త్రము, వ్యాకరణము—వీనియందు విశేషపాండిత్యము నార్జించెను.

ఇట్లుండ తల్లి యాతని జ్యేష్ఠభ్రాతయగు విశ్వరూపునకు వైవాహికసంబంధమును కుదిర్చెను. కాని ప్రపంచవిషయ విముఖుడగుటవలన ఆతడు గృహమును త్యజించి వెడలెను. చదువుముగిసినంతనే శచీదేవి నిమాయికి లక్ష్మీదేవియను కన్యను వధువుగా గుదిర్చి వివాహము కావించెను. నాటినుండియు తన జీవనమునకై నిమాయి చిన్న సంస్కృతపాఠశాల నొక

దానినిస్థాపించి పిల్లలకుబడిచెప్పుచుండెను. పాండిత్యము అపారమయి ప్రకాశించుటవలన ఆ బడికి విద్యార్థులనేకులు వచ్చుచుండువారు. మహాపండితులని ప్రసిద్ధిగాంచిన వారెవరైనను తర్కమున ఈయనతో వాదమునకు బూనుకొన్నచో అందఱును ఓడిపోయెడివారే. కావున నిమాయికి వంగదేశమంతట పేరుప్రతిష్ఠలు కలిగెను. కొన్నాళ్లకు పిమ్మట వంగదేశమంతట యాత్ర కావింపవలయునని నిమాయి బయలుదేరెను. చేరిన సభలందెల్ల నిమాయి ప్రధాన స్థానము వహించుచు తనతో వాదమునకు బూనిన వారినెల్ల నోడించుచుండెను. ఇట్లు అయిదారు మాసముల కాలము లోకయాత్ర కావించి గృహమును జేరెను, ఈలోపుననే లక్ష్మీదేవి మరణించెను. తల్లి ఈవిషయమును కుమారునకు నివేదించి, పునర్వివాహమునకు తనకుమారుడు సమ్మతించునో లేదోయని యాయన ముఖము నిరీక్షించుచుండెను తల్లిని సంతసింప జేయుటకై నిమాయి పునర్వివాహమునకు సమ్మతించెను. విష్ణుప్రియయను కన్యారత్నమును వివాహమయ్యెను.

ఒకనాడు నిమాయి నదిని దాటుటకై పడవనెక్కెను. ఆపడవయందే మఱియొక పండితుడు నుండెను. వారిరువురును కలిసి సద్విషయాలాపమును గావించుచుండిరి. కొంతసేపటికి నిమాయి చేతియందలి పుస్తకమును జూచి పండితుడు, 'ఇదియేమి?' అని యడిగెను. 'న్యాయశాస్త్రమునకు టీక' యని నిమాయి వచించెను. ఆ పండితు డాపలుకులకు తెల్లబోయి విచారగ్రస్తునివలె కన్పట్టెను. 'నీవిచారమునకు కారణమేమని' నిమాయి ప్రశ్నించెను. 'అయ్యా! నే నిరువది సంవత్సరములు కష్టించి న్యాయశాస్త్రమునకు టీక వ్రాసితిని.. నేడు మీరును టీక వ్రాసితిరి. మీకు గల పలుకుబడియు ప్రసిద్ధియు నా గ్రంథమును మూలబడద్రోయును, కాని మీ గ్రంథమునకువలె నా గ్రంథమునకు ప్రచారము కలుగజాలదుగదా! ఇదియే విచారించుచున్నాను' అని పండితుడు బదులు పలికెను. అంతట నిమాయి అత్యంత త్యాగమూర్తియై తన గ్రంథమును నీటబడనైచెను. నిమాయికి పండితుడనను స్వోత్కర్ష యున్నను మీది యుదాహరణము ఆయనది ఎంతటి దయార్ద్రహృదయమో తెలియజేయుచున్నది.

ఇట్లు కొన్నాళ్లు గడచిన పిదప నిమాయి తండ్రికి శ్రాద్ధము గావించుటకై, గయాక్షేత్రమును జేరి యచ్చట తన పితృదేవతలను శ్రాద్ధముతో తృప్తికొందించెను. భాగవతోత్తముడైన శ్రీ ఈశ్వరపురీవారిని కలిసికొని నిమాయి వారిచే మంత్రదీక్షను బూనెను. దినములకొలదియు క్షేత్రమున బసియున్న విత్తనము వర్షము కురియుగనే యంకురించునట్లు చిన్ననాటినుండియు నిమాయి శరీరమున దాగియున్న భక్తిబీజము ఈ మంత్రోపదేశవర్షముతో నంకురింప నారంభించెను. నిమాయి అంతఃకరణమున శ్రీకృష్ణప్రేమ నిబిడీకృతమై యుండెను. ఎల్లవుడు తర్కాభిలాషియైయుండు నిమాయి నేడు సంపూర్ణ మానవస్వభావుడై వెలుగుచుండెను. ఎల్లప్పుడు ఆనందముతో నుండిన ఆ మహాత్ముడే ఇప్పుడు శ్రీకృష్ణవిరహమును సహింపజాలక అడుగడుగున కన్నీరు నించుచున్నాడు. సాటిలేని పాండిత్యముచే స్వాభిమానియై చరించిన నిమాయి నేడు అతి కోమలహృదయముగల భక్త నిమాయిగా పరిణమించెను, భగవత్ప్రేమతో పరిపూర్ణమైన హృదయము కలవాడై జీవసాదలనెల్ల భగవత్స్వరూపులుగా భావించుచు వారిసేవ

చేయనారంభించెను. ఇట్టి విపరీతవృత్తమును తిరస్కరించి తమ బంధువులు తన్ను ఆ మార్గమునుండి మరల్ప బ్రయత్నింపగా నిమాయి యిట్లు వచించెను: 'ఈశ్వరదృష్టితో మానవసేవ చేయుటయే సర్వశ్రేయస్కరము. మహావృక్షమువలె నుండుము. తనశాఖల ఖండింపనున్న శత్రువునకు సయితము వృక్షములు ఛాయ నొసగును. అవియితరులనుండి దేనికొఱకును ఎదురుచూడవు. తాముఎండిపోవుచున్నను ఇతరులవలన చెంబుడునీళ్లు సయితము అశింపవు. వర్షమో, తుపానో, మండువేసవియో— అన్నింటిని సమానముగా సహించుకొనియుండి మొల్లరకు సుగంధకుసుమములను కమ్మనిఫలములను ఒసగును.' దినములు గడచిన కొలదియు నిమాయి కృష్ణభక్తికి మేరలేక యుండెను; 'నా ప్రియకృష్ణుడేడీ' యన్న నాదముతో వనములందు చరింప (వెదక) నారంభించెను. ఒకనాడు శుక్లాంబరుడను భక్తునియింట హరినామసంకీర్తనమును గావించుచు హఠాత్తుగా ఒక స్తంభమును కౌగలించుకొని మూర్ఛిల్లెను. తరువాత ప్రజ్ఞ కలిగిన వెంటనే 'ఇప్పుడు నాకు గోచరించిన దయాళుప్రియుడు శ్రీహరి యింతలో నెచటికి బోయెను?' అని యడుగుచు మఱల మేను మఱచెను. ఇట్లు రెండుమూడుసార్లు దర్శనము లభించి వారికి సంపూర్ణముగా మహాభావము కలిగెను. దీనితోబాటు వారి జీవితమంతయు కృష్ణప్రేమమయమైపోయెను. ఇట్లు రోజులకొలది ప్రపంచమునంతయు మఱచి మహాభావనిమగ్నులగుచుండిరి. పిదప వారు సంపూర్ణ బాహ్యజ్ఞానమును బడసినను తమ జీవితోద్దేశము శ్రీకృష్ణభక్తిని ప్రచారము కావించుటయే యని తెలిసికొనెను. నాడు నిమాయి ఒక చిన్న సంకీర్తనాబృందమును తయారుచేసి అందందు భజనచేయుచుండిరి. కాలక్రమమున నిమాయి భజనచేయుస్థలముననే పట్టణములోనియు పల్లెలలోనియు ప్రజలు గుమిగూడుచుండిరి. ఈ కాలమున నిమాయి గృహకృత్యముల నావంతయు నిర్వహింపజాలకుండెను. ప్రప్రథమమున నిమాయి శ్రీనివాసునియింట భజనకార్యమును నిర్వహించుచుండెను. ఆ కాలమున నిత్యానంద అవధూతస్వామివారు నిమాయియందు భ్రాతృభావమును గలిగియుండిరి. వీరిరువురును జంటగా హరినామసంకీర్తనమున పాల్గొనుచుండిరి. నిమాయి నిత్యానందుల గని అపరిమితానందము నందెను. మిక్కిలి ఉచ్ఛ్రతరులైన ఈ భక్తాగ్రేసరుల భక్తియే యెంతటి దుష్టులను సైతము పరిపూర్ణముగ పరివర్తనము చేయుచుండెను.

ఆ సమయమున నవద్వీపమున జగన్నాథ మాధవులను దుష్టు లిరువురు గలరు. వారు అమితముగా సురాపానముచేసి యితరులనెల్ల కష్టపెట్టువారు. వీరి బారిబడి తప్పించుకొని బయటబడిన వారు నవద్వీపమున లేరు. హరినామసంకీర్తనమన్నవారికి పరమ ద్వేషము. అట్టివారి నీదుష్టు లమితముగా బాధించెడివారు. కావున నెట్టి భక్తులును ధైర్యముగ వీరియెదుట బడకుండిరి. ఒకనాడు నితాయి (నిత్యానందావధూతస్వాములవారు) హరినామసంకీర్తనము చేయుచుండగా జగన్నాథ మాధవులు సురాపానము గావించి మత్తిల్లి కల్లుకడవ చేతబట్టి ఎదురైరి. వీరిని జూడగనే నితాయి చుట్టునున్నవారు 'మీ రిక సంకీర్తనమును ముగింపుడు. ఆ దుష్టులు మిమ్ము బాధింతురు' అని పలికిరి. కాని ఆ దుష్టుల శీలమును పరివర్తనము చేయదలంచి పరిపూర్ణదయాస్వరూపుడగు నితాయి 'భయపడకుడు', నే నెట్టి సురాపానమున వీరు

మత్తిల్లిరో దానిని మాన్పి వారు హరినామామృతపానమున మత్తులగునట్లు చేయుడు'నని పరివారమునకు చెప్పి హరినామసంకీర్తనమును సాగించెను. జగన్నాథ మాధవులు తగుపరివారముతో వచ్చి నితాయి పరివారమును గొట్టిరి. మాధవుడు నితాయిని కుండపెంకులతో తలపై బాదెను. కాని నితాయి ఆవంతయు చలింపక పరిపూర్ణ దయాస్వరూపుడై తమ్ముడా జగన్నాథా! కొట్టితివి. అందులకేమి? నాకై యొకమాటు శ్రీకృష్ణుని నామము నుచ్చరింపుము అని పలుకుచు బుజ్జగించి, మాధవుని కౌగలింపబోయెను. కాని మత్తిల్లిన మాధవుడు నితాయిని మరల కొట్టుటకై చేయి పైకెత్తెను. ఇంతలో మనస్సు చలించిన జగన్నాథుడు మాధవుని చేయి పట్టుకొనెను. ఈ విషయము తెలిసి నిమాయి అచ్చటికేతెంచెను. నితాయి తలనుండి కారుచున్న రక్తమునుజూచి, నిమాయి, 'యీ దుష్టుల శిక్షింతుమా' యని కవయబోవ అతని బట్టుకొని నితాయి మందహాసముతో 'అన్నా! ఏమిటి? భగవంతుడే సర్వమునకును కర్తయని తెలిసియు కోపమునకు లోబడి నీవు వీరిని శిక్షింపదలంచుట అర్థరహితప్రలాపము' అని పలికెను. ఈ పలుకులతో నిమాయి కోపము నుపసంహరించుకొని జగన్నాథ మాధవుల కౌగిలించుకొనెను. అంతటితో వారి మత్తు వదలెను. ఈ మహాపురుషుల స్పర్శవలన వారి శీలము పరివర్తనమయ్యెను. వారి దుష్టవర్తనము దూరీకృతమయ్యెను. వీరిరువురు ఆ భక్తద్వయము పాదములపై బడి అపరాధ క్షమాపణమును గోరిరి. నాటినుండియు వారిరువురు పరమవైష్ణవులుగా మారిపోయిరి.

ఇట్లు నిమాయి సామాన్య ప్రజానీకమును చేరి హరిభక్తిప్రబోధమును గావించుట పండితులకెల్ల సరిపడకపోయెను. కావున వారు ఆయనను పలుపలువిధముల తిరస్కరింప మొదలుపెట్టిరి. కాని నిమాయి ఏమియు లెక్కింపలేదు, అంతకంటె ఆక్షేపింపనులేదు, శ్రీకృష్ణభక్తి నెల్లరియందును కలిగింపవలయునని కోరుచుండెను. ఈ కార్యమునకు సన్న్యాసాశ్రమమే తగినదనియును అప్పుడే తాను ఎల్లవారితోడను కలసిమెలసి యుండుటకు తగిన సౌకర్యము కలుగుననియును దలంచి సన్న్యాసాశ్రమమును బుచ్చుకొనుటకై నిశ్చయించెను. కాని తల్లిని మెప్పించి గృహత్యాగమును గావింతుగాయన్న సమస్య పైకొనెను. తాను దప్ప సంరక్షకులులేని తల్లి తన సన్న్యాసాశ్రమ స్వీకరణమునకు సమ్మతింపదని గుర్తించెను. కాని ఆమెకు తెలుపకుండ పోయినచో మాతృహత్యాపాతకము తన్నంటునని యెంచి నిమాయి తన కోరికను తల్లికి విన్నవించెను. ఆమెయు నీ తలంపు మానుమని యెన్నియోవిధముల ప్రార్థించెను. కాని నిమాయి సమ్మతింపలేదు. కావున వేరుమార్గములేక శచీదేవి ఆతని ప్రార్థనము నంగీకరించెను.

ఇట్లు తల్లివలన సెలవుపొందిన నిమాయి విష్ణుప్రియను సమ్మతింపజేయవలసియుండెను. అందులకై నిమాయి పడకటింటికిపోయెను. ఆమె రాకకై కాచుకొనియుండెను. మాతాపుత్రుల సంభాషణమును విన్న విష్ణుప్రియకు తెలియని దేమియులేదు. ఆమె ఇంటిపనులన్నియు ముగించుకొని సాయంకాలమున అశ్రుపూరితనేత్రములతో మెల్లగా శయనగృహమునకు వచ్చెను. ఆమె పరితాపకరమయిన స్థితినిజూచి నిమాయి ఆమెను ఎన్నియోవిధముల ఓదార్పబూనెను. ఆయన మధురభాషణమును విని

కొంచెము ధైర్యము దెచ్చుకొని విష్ణుప్రియ యిట్లు పలుక నారంభించెను. 'హా నాథా! నన్ను విడిచి నీవు సన్న్యాసివయ్యెదవా? నిన్ను పతిగాబడసినందులకు నేనెంతయో అదృష్టవంతురాలనైతి ననుకొంటిని. నా మనోరాజ్యము కూలిపోయెను. నాకొఱకు నేనేమియు చింతించుటలేదు. నీవె ట్లాధర్మమును అవలంబింతువా యనియే నేను భయపడుచున్నాను, నీకిప్పటికి ఇరువదినాలుగేండ్లు మాత్రమే నిండినవి. ఇట్టి యౌవనప్రాయమున నెట్లు నీవా కఠినవియమములను సహింతువు? నీవు సన్న్యాసమును స్వీకరించిన, నిరాదరణయై నీ తల్లి నిశ్చయముగా మరణించును. ధర్మసంరక్షణార్థము మాతృహత్య గావింతువా? ఇట్టి కార్యమునకు నిన్ను లోకు లేమందురు? ఇన్నాళ్లు అందఱిచే పొగడ్తలగాంచిన నీవు పరులనిందలకు గుఱియగుట తగునా? అట్లితరులు నిన్ను నిందించుచో నే నెట్లు విని సహింపగలను?' ఈ పలుకులను విని నిమాయి, 'విష్ణుప్రియా! నన్ను నీ పతినిగా భావించితివి. కావుననే నీవిట్లు పలుకుచున్నావు. కాని అందఱకు పతి శ్రీకృష్ణుడొక్కడే. కావున నీ వాతని పతిగా వరింప యోగాభ్యాసము గావింపుము. అట్టి భావము నీకు కలిగినచో ఎన్నటికిని పతివియోగము సంభవింపనేరదు. దానితో పోల్పదగిన ప్రేమయు లేదు' అని పలికెను. కాని విష్ణుప్రియ నిమాయితో ఎన్నో విధములుగ తర్కించెను. ఎంతకును ఫలములేక పోవుటను జూచి మిక్కిలి గంభీరముగా 'ఓ నాథా! ఈశ్వరాదేశము ననుసరింప నీవు పూనుకొంటివి. ఏ వ్రతమును నీ వనుష్ఠింపనెంచితివో దానిని నే నడ్డగించి పాపభాగినియగుటను గోరను. నాకీ సంసారమున నెట్టి అభిలాషయు లేదు. నీ కేది సుఖము నిచ్చునో అదియే నాకును సుఖము నొసగును. నా కష్టముల నీ కెఱిగించి నిన్ను దుఃఖింపజేయ నా కెంతమాత్రము నిష్టము లేదు' అని పలికి మఱి యేమియు పలుకజాలక శోకాతీతయై మూర్ఛిల్లెను.

క్రీ. శ. 1509 ఉత్తరాయణ సంక్రాంతి నాడు ఇల్లువిడిచి నిమాయి సన్న్యాస స్వీకరణార్థము బయలుదేరెను.

(సశేషము)



ఓం శ్రీ కాళహస్తీశ్వరాయనమః

# హితోపదేశము

## శ్రీ నిత్యానందస్వాములవారు

పరిశుద్ధాత్ములైన సోదర సోదరీమణులారా! అనేక ధర్మములను వినుటకంటె విన్న కొంచెమైనను ఆచరించుటకై పూనుకొనుట శ్రేయస్కరము. కాబట్టి ఈ తెలుపబోవు ధర్మములను మీరు మీజీవితకాలమున సదా జ్ఞప్తియందుంచుకొని కార్యరూప మొనర్చుటకై తీవ్రముగ కృషిసల్పినచో అచిరకాలములోనే మీకు దుఃఖరాహిత్యము, శాశ్వతానందపదవి చేకూరగలవు.

బహుజన్మార్జిత సుకృతముచే మనకీ మానవజన్మ లభించినది. భగవత్సాయుజ్యము నొందుటకై ఇతర జన్మలందులేని గొప్ప సదవకాశము ఈ మనుష్యజన్మయందుగలదు. దేవతలుకూడ మోక్షమునొందవలెనన్న మానవులై జన్మించి తుదకు జ్ఞానసంపాదనము గావింపవలసినదే. కాబట్టి ఇట్టి దుర్లభతరమైన ఈ మానవజీవితమును భగవదన్వేషణమునకై, ఆత్మ సాక్షాత్కారమునకై వినియోగించినచో మన కర్తవ్యమును నెరవేర్చినవారమగుదుము. అట్లుగాక, ఇతరములైన ప్రాపంచిక వస్తుజాలముల సంపాదనముననే యావత్కాలముగడపి, భగవచ్చింతన లేశమైన గావింపకున్నచో, ఈ యుత్తమజన్మను వ్యర్థపఱచినవారమై తుదకు దుఃఖములపాలు గావలసివచ్చును.

"నరాణాం క్షీణపాపానాం కృష్ణేభక్తిః ప్రజాయతే" అన్నట్లు జీవునియందున్న సంచిత పాపపంకిలము ఎంతెంత క్షీణించుచుండునో, అంతంత అధికముగ అతనికి భగవంతునియందలి భక్తి వృద్ధినొందుచుండును. కావున బహుజన్మార్జితమగు అట్టిపాపము క్షయించుటకై మనుజుడు మొట్టమొదట పుణ్యకర్మలను విరివిగ నాచరింపవలెను. "జపతో నాస్తిపాతకమ్" అని పెద్దలు చెప్పిరిగావున, జప, ధ్యానాదులుకూడ పాపపరిహారమందు తప్పక తోడ్పడగలవు. ఈరీతిగ, దాన, ధర్మాది సత్కర్మములద్వారా, భగవత్పూజన, నామసంకీర్తన, జప ధ్యానాదులద్వారా ఎవుడు తన సంచిత పాపరాశినంతయు క్రమక్రమముగ నశింపజేసికొనుచురాగా, భక్తి అతనియందు అధికముగ ప్రాదుర్భవించినదై భగవంతుని పొందవలెనను తీవ్ర ఆవేదనజనించును. దానినే ముముక్షుత్వమందురు. అట్టి అతడు తానుచేయు సమస్తకర్మములను భగవదర్పితముగ నేచేయును గాని స్వార్థముకొఱకుగాని, ఫలాపేక్షచేగాని చేయడు. అట్టి ఫలాపేక్షారహితమగు(నిష్కామ) కర్మచే చిత్తము అత్యంతశుద్ధమగును. చిత్తమెపుడుశుద్ధమగునో, అపుడు నిర్మలమగుఅద్దమునందు సూర్యబింబము స్వచ్ఛముగ ప్రకాశించునట్లు ఆత్మజ్ఞానము దేదీప్యమానముగ ప్రకాశింపదొడగును. అపుడు తాను కేవలము సచ్చిదానందస్వరూపమగు పరమాత్మయే యనియు, బంధముగాని, దుఃఖముగాని తనకేకాలమందును లేవనియు, అజ్ఞానవశమున తాను బద్ధుడనని యింతకాలము తలంచుచు దుఃఖముల ననుభవించుచుంటిననియు ఈ జగన్నాటకమంతయు చిత్తముచే కల్పింపబడిన ఒకానొక

మిథ్యాజాలమనియు, విస్పష్టముగ తెలిసి
కొనును. అత్తతి జీవునకు కలుగు ఆనందము
నకు మేరలేదు. ఇక జన్మ సఫలమైనదని తలం
చును. నిరతిశయానందమనుభవించును. అదియే
జీవన్ముక్తస్థితి. అదియే మనయందఱియొక్క
పరమ లక్ష్యము. ఈ జీవితమందే అట్టిమహో
న్నతస్థితిని మనమందరమును సంపాదించుకొన
వలెను. లేకున్న, ఈ సదవకాశములు మరల
దొరకవు. భగవదనుగ్రహమువలన ఆరో
గ్యము, తెలివి, సంపద, సద్గురుబోధ మున్నగు
నవి యన్నియు కలిగియున్న ఈ తరుణమున
మనము మన ఆత్మోన్నతికై యత్నింపనిచో
అటుపిమ్మట అవి మనలను వీడినప్పుడు పశ్చా
త్తాపపడవలసి వచ్చును. దీపమున్నపుడే ఇల్లు
చక్కపెట్టుకొనవలెను. ఆయువు దినదినము
క్షీణించుచున్నది. మృత్యువను పిశాచము
జీవుని కబళించుటకై కాచుకొనియున్నది. కా
బట్టి సంసారసాగరమునుండి దరిజేరుటకై భగ
వంతుడను నావను ఇపుడే వెతకికొనవలెను. ఈ
విషయమును గ్రహింపజాలక అజ్ఞానులు మా
యావశమున భగవంతుని విస్మరించి పార
లౌకిక ధర్మమునుగూర్చి ఒకింతేని యత్నింపక
దేహము శాశ్వతమనియు, ఈ జగత్తు సత్య
మనియు, నమ్మి అనేక వ్యవహారములందు
తగుల్కొని, ప్రాపంచిక విషయభోగలాల
సులై, ఆ క్షణికానందములతోనే సంతృప్తి
పడుచు తుదకు జీవితమును వ్యర్థముగ ధార
వోయుచున్నారు. వాస్తవముగ దృశ్యవిషయ
ములందు ఆనందములేదు. మఱియు వానిని
అనుభవించినకొలది తృష్ణ పెరుగునేగాని తరు
గదు. ఒకవేళ ఏలేశమైన ఆనందము అందు
న్నప్పటికిని అది కొండంతదుఃఖముతో గూడి
యే యుండును. "సౌఖ్యంతు బిందుమాత్రేణ
దుఃఖం పర్వతమేవచ" అన్నట్లు అట్టి దుఃఖ
పూరితములైన యల్పసౌఖ్యములకొఱకు పరు
విడి తుదకు క్లేశమునే తెచ్చుకొనుచు, పరమా
ర్థమును మైమఱచి, ఈయమూల్య జీవితమునం
తయు వ్యర్థముచేయుట పాడియా! ఎందరో
చక్రవర్తులు, రాజులు పూర్వమీదృశ్యవిషయ
ములన్నిటిని అనుభవించి, అనుభవించి, విసికి
వేసారి, తుదకు అందు వాస్తవిక సౌఖ్యము
లేదని తెలిసికొని, అట్టి రాజ్యభోగములన్నిటిని
తృణమువలె బరిత్యజించి, పిమ్మట ఏ అనుభవ
జ్ఞుడగు మహనీయునో యాశ్రయించి, ఆత్మ
జ్ఞానమొంది కడతేరిరి. ఈరీతిగ బాగుగచింతన
జేసి ముముక్షువులైనవారు అసారమైన దృశ్య
విషయములను త్యజించుటయను వైరాగ్య
మునుగూడ బాగుగ నలవఱచుకొనవలెను.
కావుననే వైరాగ్యమను ప్రమిదెయందు, భక్తి
యను తైలముపోసి, జ్ఞానదీపమును వెలిగింప
వలెనని పెద్దలుచెప్పుటకు కారణము. ఈప్రకా
రముగ పైన దెల్పిన నిష్కామకర్మ, భక్తి,
వైరాగ్యము, జ్ఞానము మున్నగువానినన్నిటిని
బాగుగ నభ్యసించుచు, అట్టి అపూర్వ ఆయుధ
ముల సాయముచే అవిద్యయను శత్రువును
పూర్ణముగ నోడింపవలయును. అపుడే ఆత్మ
సామ్రాజ్యాధిపత్యము మనకు లభించి జన్మ
కడతేఱును. ప్రతి జీవునియందును అనేకజన్మల
నుండి బాగుగ ఘనీభవించియున్నట్టి వాసనలు,
సంకల్పములు ఎన్నియోగలవు. మేఘము సూ
ర్యుని కప్పివేయునట్లు ఈ సంకల్పములన్నియు
ఆత్మను మఱుగుపఱచుచున్నవి. కాబట్టి ఆత్మ
నిర్మలముగ ప్రకాశింపవలెనన్న మనస్సునం
దున్నట్టి సంకల్పముల నొక్కొక్కదానిని పార
ద్రోలవలెను. మొదట దుస్సంకల్పము
లను సత్సంకల్పములచే నణగద్రొక్కి అపిదప

కేవలము సంకల్పరహితమగు పదవి (ఆత్మస్థితి) నొందవలెను. అట్లే ఒక్కొక్క ఇంద్రియమునుగూర్చి బాగుగ విచారణచేసి దానిని విషయములపైపునకు పరుగిడనీయక అరికట్టవలెను. ఆత్మ (స్వస్వరూప) చింతనగూడ ప్రక్కప్రక్కన చేయుచురావలెను. అనగా జీవునియొక్క యథార్థస్వరూపమగు పరమాత్మయొక్క లక్షణములను నిరంతరము మననము చేయుచుండవలెను. ఈ ప్రకారము బహు కాలము చేయుచురాగా తుదకు దృశ్యము నుండి మనస్సు మరలి, అంతర్ముఖమై, ప్రత్యగాత్మయందు విలీనమై, జీవబ్రహ్మైక్యము సిద్ధించును. అదియే జీవుని పరమావధి. అదియే మన జీవితలక్ష్యము. కర్మచేగాని, యోగముచేగాని, ధ్యానముచేగాని, భక్తిచేగాని, జ్ఞానముచేగాని, అందొకటిచేగాని, రెంటిచేగాని, లేక అన్నిటిచేగాని, మనుజుడు ఎట్లైనను ఆ పరమ లక్ష్యమును ఈ జన్మయందు పొందియే తీరవలెను. లేనిచో, ఇంకను అనేక జన్మలందు సంసారచక్రమున తగుల్కొని మితిలేని దుఃఖముల ననుభవింపవలసియుండును.

అయితే, గృహస్థాశ్రమముననున్నవారట్టి పరమోన్నతలక్ష్యమును పొందుటకు వీలుండునా యనినచో నిస్సంశయముగ పొందవచ్చును. ఆత్మసాక్షాత్కారము (లేక జీవన్ముక్తి) ఒక ఆశ్రమముపైగాని, ఒకజాతిపైగాని, ఒకమతముపైగాని, ఒకదేశముపైగాని, స్త్రీపురుషభేదముపైగాని, ఆధారపడియుండదు. ఏయాశ్రమమునకు చెందినను, ఏప్రదేశమునసున్నను, చేయవలసిన సాధనను సక్రమముగ చేసినచో, ఎవరైనను భగవత్సాయుజ్యము నొందగలరు.

"నివృత్తరాగస్య గృహం తపోవనమ్" అనునట్లు రాగద్వేషరహితుడగు గృహస్థుని యిల్లు తపోవనమనియే చెప్పబడును. అట్లే రాగద్వేష సహితుడగు తాపసియొక్క ఏకాంతకుటీరము సయితము దారుణప్రపంచరంగమే యగును.

అయితే గృహస్థాశ్రమమున నున్నవారికి కొన్ని బాధ్యతలు అధికముగా నుండుననుట నిక్కము. తక్కిన అన్ని యాశ్రమములవారిని పోషింపవలసినవారు గృహస్థులే గనుక, కొంత వ్యవహారకాండ వారికి మిగిలియే యుండును. అయినప్పటికిని వారు చేయు ఆ వ్యవహార కార్యము ఇతరులకు ఉపకరించునదిగను, ధర్మపూర్వకముగను, భగవదర్పితముగను నున్నచో, అయ్యది వారి చిత్తశుద్ధికి తప్పక అనుకూలించును. ఈ సందర్భమున గృహస్థులు నిర్వహింపవలసిన కొన్ని ధర్మములను సూక్ష్మముగ తెలుపుట మంచిదని తలంచుచున్నాను.

ప్రతిదినము ప్రాతఃకాలము బ్రహ్మముహూర్తమున (4 ఘంటలకు) నిద్రనుండి లేచుటను అభ్యసింపవలెను. లేవగనే పడకపై నుండియే కొంతసేపు భగవంతునిగూర్చి చింతనచేసి (కొన్ని ప్రార్థనాశ్లోకములను భక్తిపూర్వకముగ పఠించి) ఆ నాటి దినమంతయు అనేక కార్యములందు ప్రవేశింపనున్నాననియు, ఆయా కార్యములన్నిటియందును మనస్థైర్యమును, ధర్మబుద్ధిని ప్రసాదింపవలెననియు, సర్వేశ్వరుని వినయపూర్వకముగ ప్రార్థింపవలయును. మఱియు, తాను దినమందు చేయబోవు వ్యవహారములన్నిటిని ఒక్కపర్యాయము జ్ఞాపకమునకు దెచ్చుకొని, బహుజాగరూకతతో, భగవత్స్మృతితో అందు ప్రవేశించుచున్నట్లు భావన చేసికొనవలెను. ఈ రీతిగ కొన్ని పవిత్ర నిశ్చయములను గావించుకొని, పడకపైనుండి లేచి స్నానాది నిత్యకృత్యముల నెరవేర్చుకొని తన

ధ్యానగృహమునందు ప్రవేశింపవలెను. ప్రతి గృహస్థుని యింటియందును ప్రత్యేకముగ ఒక ధ్యాన (కుటీరము) స్థలము లేక గది యుండుట మంచిది. అద్దానియందు ఆతని యిష్టదైవతము యొక్కయు, గురుదేవుని యొక్కయు, ప్రణవముయొక్కయు, మహాత్ములయొక్కయు, భక్తశిఖామణులయొక్కయు పటములుంచి, ధూపదీపాదిసంయుక్తముగను, పరమపవిత్రముగను, శుద్ధముగను దాని నుంచవలెను. ఏలయనిన, పూజాగృహమందు ప్రవేశింపగనే సాధకునకు ఒకవిధమైన దైవిక ఉత్తేజన కలిగి మనస్సు ఊర్ధ్వముఖము కావలెను. పవిత్రాణువులచే నా స్థలమును వ్యాపింపజేసినచో, పవిత్రభావన లచట గలిగియున్నచో, (దుష్టజనులను నాస్తికులను, రానీయక చూచుచో) పరిశుద్ధమగు వాతావరణ అచట తప్పక ఏర్పడగలదు. స్నానానంతరము ఆ ధ్యానగృహమున బ్రవేశించి, పరమభక్తితో గీతాపారాయణము, పూజ, జపము మున్నగునవి యాచరింపవలయును. ఒక జపమాలయు గలిగియుండుట మంచిది. ఆ ధ్యానసమయమున మనస్సును ప్రాపంచికవిషయములవైపునకు పోనీయక భగవంతుని వైపునకే త్రిప్ప యత్నింపవలెను. కనీసము ఒక అరగంటయైనను ఆ పూజామందిరమున గృహస్థుడు ధ్యానాదులందు కాలము గడుపవలెను. అట్లు ప్రార్థనాదులను నెరవేర్చిన పిదపనే ఆహారమును గైకొనునట్టి దృఢనియమమున కాతడు సదా కట్టుబడియుండవలెను. ఏలయనిన, పరమార్థానుభవము మాటలచే వచ్చునదికాదు. నియమ, నిష్ఠలుండవలెను. అట్లు కానిచో మనస్సున కాతడు బానిసయై అది చెప్పినట్లు చేయవలసివచ్చును. ఈ రీతిగ గృహస్థుడు తన ధ్యాన కార్యక్రమమును పూర్తిచేసికొని ఆ పిమ్మట తన అవసర దైనిక వ్యవహార కార్యములందు ప్రవేశించి, ధర్మపూర్వకముగ వానిని నిర్వర్తించుకొని, మరల రాత్రి భోజనాత్పూర్వము ఉదయమువలెనే కొంతసేపు భగవంతుని ధ్యానింపవలెను. పిదప రాత్రి పరుండబోవునపుడు తాను దినమందు చేసిన పొరపాట్లు ఏవైన నుండినచో సవరించుకొని, మరుసటిదినమున అవి చేయకుండు లాగున కృతనిశ్చయుడు కావలెను.

గృహస్థుడగువాడు తన శక్తికొలది అతిథి అభ్యాగతులను ఆదరించుచు, దీననారాయణులకు (దరిద్రులకు, దీనులకు) సహాయము చేయుచు, ఉత్తములగు బ్రహ్మనిష్ఠులను పరిపోషించుచునుండవలెను. దానములలోను ప్రప్రథమమున బ్రహ్మవిద్యాపోషణకొఱకు, అనగా ఉత్తమబ్రహ్మనిష్ఠులగు సాధువులకొఱకు, పరమార్థవిషయములకొఱకు ఒనర్చునది సర్వశ్రేష్ఠము. దాని ఫలితము చెప్పతరముకాదు. ఆపిదప లౌకిక విద్యాపోషణకై యొనర్చు దానము ఉత్తమము. అటుపిదప అన్నదానము. ఆతరువాత చెరువులు. బావులు, సత్రములు మున్నగునవి నిర్మించుట. ఏదానమైనను పాత్రత నెఱిగియే అనగా దానమును గ్రహించు వాని యోగ్యతను గమనించియే చేయవలెను. ఈ విషయమును గ్రహింపనందుచేతనే నేటి కాలమున ఎందరో ధనికులు తమ్ము చేరునట్టి స్తుతిపరులవాక్యములనువిని, ఎంతయో ధనమును అనవసరకార్యములకు వెచ్చించి తుదకు అల్పఫలితమునే పొందుచున్నారు. కాబట్టి అనుభవములేని ప్రాపంచికజనుల వాక్యములను విని మోసపోకుడు! ఇట్లు పైన దెల్పిన రీతి దినమందు తాను ముఖ్యముగ నాచరింపవలసిన వ్యవహారకార్యములను పూర్తిచేసికొని తక్కిన

సమయమునుగూడ వ్యర్థముగ బోనీయక ఏదైన సద్గ్రంథములను బఠించుచుండవలెను. లేదా అనుభవజ్ఞులగు మహాత్ములయొద్ద సద్బోధ వినుచుండవలెను. సాధ్యమైనంతవఱకు ఎల్ల కాలములందును మనస్సు భగవదున్ముఖముగనే యుండునట్లు చూడవలెను. అపుడే పూర్ణపవిత్రత ఏర్పడగలదు. పుణ్యకార్యములచే, మఱియు నిష్కామకర్మచే చిత్తమును శుద్ధమొనర్చుకొని, దుస్సంకల్పములను బారద్రోలి, ఇంద్రియనిగ్రహముగావించుకొని, భక్తి, జ్ఞాన, వైరాగ్యాదులద్వారా స్వస్వరూపము (ఆత్మ) నెఱుఁగుటయే మోక్షమునకు దారి. అది తప్ప మోక్షమునకు వేఱొకదారి యెద్దియును లేదు. ఎవరు ఎన్ని బోధలు చెప్పినను తుదకు పర్యవసానమిదియే. కాబట్టి ఈ పరమ లక్ష్యమునే చిత్తమందుంచుకొని, దానికి సాధనభూతముగ పైన వచించిన పూజా, జప, ధ్యానాదులను మీరు ప్రతిదినము నియమముతప్పక ఆచరించుచుండినచో శీఘ్రకాలములోనే మీకు భగవంతునియొక్కయు సద్గురునియొక్కయు అనుగ్రహముకలిగి, మనశ్శాంతి ఏర్పడి, ఈజన్మయందే దుఃఖరహితులై, పరమానంద మనుభవింపగలరు.

సోదర సోదరీమణులారా! ఒక్క వాక్యము మఱువకుడు! మీరు వాస్తవముగ జీవులు కాదు. పరమాత్మస్వరూపులే! అనాది అజ్ఞానముచే అసత్యమును మైమఱచుటచే ఇట్టి జీవస్థితి సంభవించినది. సద్గురుబోధచే, ఎప్పుడట్టి సత్యమును మరల నెఱుఁగుదురో అప్పుడిక బంధమే లేదు. నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త స్వరూపులే మీరు! ఈ సత్యమునే వేదాంత డిండిమము ముక్తకంఠముతో చాటుచున్నది, దానిని వినినమా ముక్తులమే! వినకుందుమా బద్ధులమే!

"క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప" అను శ్రీకృష్ణవచనప్రకారము మనయందు బహుకాలమునుండి జీర్ణించియున్నట్టి దుర్బలత్వమును బారద్రోలి మన జన్మహక్కగు ఆత్మసామ్రాజ్యమును తిరిగి పొంది నిర్భయులమై మెలగెదముగాక!

"స్వల్పమప్యస్యధర్మస్య త్రాయతే మహతో భయాత్" అను భగవదాదేశ ప్రకారము ఈ ద్వితీయమార్గమును ఏకొంచెము ఆచరించినను, అది మహత్తర ఫలితమును చేకూర్చునుగావున, ఇక నిందు భయపడవలసినదేమియును లేదు. పైగా—

"నమేభక్తః ప్రణశ్యతి" "నహికల్యాణకృత్కశ్చిద్దుర్గతింతాత గచ్ఛతి" అనగా నా భక్తుడు ఎన్నటికిని చెడడు! దైవకార్యముల నాచరించువాని కెన్నడును దుర్గతి కలుగదు అను నీరీతిగ ఎలుగెత్తి చాటిన శ్రీకృష్ణభగవానుని వచనములను స్మృతిపథమున నుంచుకొని, స్థైర్య, ఔదార్య, గాంభీర్యములు మనలను ముందునకు బురికొల్ప స్వాతంత్ర్యపథమున (ఆత్మస్వాతంత్ర్యమార్గమున) నిర్భయచేతస్కులమై జనెదముగాక! మనలో! నిద్రాణమై యున్నట్టి ఆత్మ సింహమును మేలుకొలిపి "పంజరా - దివ కేసరి" యన్నట్లు మాయాజాలమును విచ్ఛిన్నమొనర్చి బంధరహితులమై నిత్యనిరతిశయమగు ఆత్మస్వాతంత్ర్యానంద మనుభవింతుము గాక! అందులకై సర్వేశ్వరుడు మనకందరకును తగిన శక్తి సామర్థ్యములను ఆయురారోగ్యములను, ఆత్మవిశ్వాసమును ప్రసాదించు గాక!

ఓం తత్సత్! ఓం తత్సత్!! ఓం తత్సత్!!!

# సు భా షి త ము లు

మూలము

శ్రీ వివేకానందస్వామి

అనువాదము :

శ్రీ దే వేం. రా. భాస్కరశాస్త్రి

తే. గీ. ఆత్మనిగ్రహము కలిగి | హాయినున్న
శక్తిమంతుని నెవ్వరు | జరుపలేరు!
ప్రతిఘటించుట ముఖ్యమ్ము | పాపములను
ఎట్టివైనను వానిని | మట్టిచేసి
పిదప పొందుము, మిత్రమా! | హృదయ శాంతి!
శాంతమతితో స్వధర్మంబు | జరుపువాని,
వింత మానిసి విధముగా | విధిని చేయు
వాని, "ఇదినాది కాదని" | పలుకువాని
జన్మ యొక్కటే ధన్య మీ | జన్మలందు!
'అతని' గురియించి పరోక్ష | మందు నింద
చేయగారాదు—పాపవు | చెయ్దియగుట;
ఓర్మి దాలిచి తప్పుల | దలపకుండ
పాపకర్మల క్షమియింప | వలెను సుమ్మి!!
చిలిపి కజ్జాలు చేయంగ | తలచి యొకడు
నిన్ను డాసిన ప్రక్కకు | నీవు తిరిగి
విముఖుడవయి మర్యాదగా | విడువు మతని!
నీచకార్యాలు చేయగా | నీ తనువును
వ్యర్థపరచిన మానిసి | యముని జేరు.
దూషణంబులు వినుటయు | దోషమగును—
కాన తచ్ఛిద్రగ్రహణంబు | మాను మీవు!
సౌఖ్యభానుడు దుఃఖంపు | ఛాయ లేక
ఎన్నడైనను భాసింప | నీవు కంటె?
ఎట్టి క్రియలైన తలపక | హృదయమందు
కడిది పూనిక వహియించు | కర్త—యితడు
నిజముగా బుద్ధిశాలి య | ని జనులంద్రు.
పూర్వకాలాన నాస్తిక | పురుషుడన్న—
దైవమనునది లేదని | తలచువాడు;
నేటి కాలాన నాస్తిక | మేటి యితడు—
ఆత్మవిశ్వాస రహితుండు | నాస్తికుండు!

# సంఘవార్తలు

## శ్రీ రుద్రానందస్వామివారు

భారతదేశమునకు పదివేలమైళ్ల దూరమున నున్న ఫిజి (Fiji) ద్వీపములలో పండ్రెండు సంవత్సరములు శ్రీరామకృష్ణసేవాసంఘము తరపున ఆధ్యాత్మికసేవను గావించిన శ్రీ రుద్రానందస్వాములవారు ఇటీవల మాతృదేశమునకువచ్చిరి. ఫిజిద్వీపమునందలి భారతీయుల స్థితి అత్యంతశోచనీయమైయుండెడిది. ఇరువది సంవత్సరములకుపూర్వము అచ్చటగల చెఱకు తోటలయందు కృషిచేయుటకై భారతదేశము నుండి తీసికొనిపోబడినవారును వారి సంతతి వారే అచ్చటనున్న భారతీయులు. అచ్చటి రాజ్యాంగమువారు వీరిని సదా బానిసలుగనే యుంపదలచి వీరికి విద్యాభివృద్ధికరములగు మార్గములజూపి తోడుపడుటగాని రాజకీయములందు అరితేరగల అభ్యుదయమునకు పునాదులగు రాజకీయపదవుల నొసగుటకాని కావింపరైరి. ఈ బానిసల యిక్కట్లకు మేరలేదు. తమఅధోగతిని గుర్తించి తత్పరిహారణార్థము, ఆత్మపునరుద్ధరణార్థము, వారు శ్రీరామకృష్ణ సేవాసంఘమువారి సాయము నర్థించిరి. వెంటనే శ్రీ రామకృష్ణసేవాసంఘమునుండి శ్రీ అవినాశానందస్వాములవా రా ద్వీపములకు బంపబడిరి. ఒక సంవత్సరముపాటు శ్రీ స్వామివారచ్చటనుండి భారతీయుల పునరుద్ధరణ మార్గముల నన్వేషించిరి. పిదప శ్రీ రుద్రానందస్వాములవా రచటికిబంపబడిరి. అచ్చటి భారతీయుల స్థితిని బాగుపఱచుటకు విద్యాభ్యాసమే మూలాధారమని గుర్తించిన శ్రీస్వామివారు అచ్చట పది-పండ్రెండు పాఠశాలలు స్థాపన జేసి వారి ధార్మికజీవన ప్రబోధముకొఱకు కొన్ని దేవాలయముల సముచితము ప్రతిష్ఠింప జేసిరి. భిన్నప్రదేశములనుండి ఫిజీద్వీపముల జేరిన ఈ భారతీయులను ఒకటిగాజేర్చి శ్రీ స్వామివారు ఐకమత్యము సంఘీభావమును వారియందు పురికొల్పిరి. అచ్చటి బ్రిటిష్ ప్రభుత్వమువారికి జెప్పి వారి ఆర్థికపరిస్థితిని ఉన్నతికి దెచ్చిరి. తమజీవనమునందు, హృదయపూర్వకముగా కృషిగావించుచున్న శ్రీస్వామివారిని వారు లండనులో జరిగిన చక్కెర కాన్ఫరెన్సుకు (Sugar Conference) కు తమ ప్రతినిధిగా నెన్నుకొని పంపిరి. తమ కర్తవ్యమును నిర్వహించి శ్రీవారు ఐరోపా అమెరికాలయందు పర్యటించి భారతదేశమును జేరిరి. వీరికి చెన్నపట్టణమున నెన్నియో స్వాగతోత్సవములు గావింపబడెను. భారతదేశమున రెండుమూడు మాసములు పర్యటించి శ్రీవారు మఱల ఫిజీ ద్వీపములకేగగలరు.



# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

## శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము)

540 పుటలు సర్వాంగ సుందరమగు చతుర్థ ముద్రణము వెల రూ. 3-4-0

## శ్రీ మద్భగవద్గీత

480 పుటలు శ్రీధరీయ టీకాసార ప్రతిపద టీకా తాత్పర్య విశేషార్థ సహితము రూ. 3-0-0

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

850 పుటలు (మద్రాసు ఆంధ్ర విశ్వవిద్యాలయములందు పాఠ్యగ్రంథము) రూ. 2-8-0

## శ్రీ శారదాదేవి చరిత్ర

256 పుటలు (ఆంధ్ర విశ్వవిద్యాలయమున పాఠ్యగ్రంథము) వెల రూ. 1-12-0

## శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

186 పుటలు (ఆదర్శప్రాయుడగు గృహస్థుని జీవితము) వెల రూ. 1-4-0

| | | | |
|---|---|---|---|
| శారదా ప్రసంగములు | ... | 2 | 8 | 0 |
| ప్రబోధరత్నాకరము | ... | 2 | 4 | 0 |
| రాజయోగము | ... | 2 | 4 | 0 |
| కర్మయోగము | .. | 1 | 8 | 0 |
| భక్తియోగము | ... | 1 | 4 | 0 |
| వివేకానందలేఖావళి (మొదటి భాగము) | | 1 | 8 | 0 |
| వివేకానందలేఖావళి (రెండవ భాగము) | | 1 | 8 | 0 |
| అనుష్ఠాన వేదాంతము | ... | 1 | 4 | 0 |
| వివేక సూర్యోదయము | .. | 1 | 0 | 0 |
| శ్రీ పరమహంస నీతికథా రత్నములు | | 0 | 12 | 0 |
| భక్తిమార్గము | ... | 0 | 8 | 0 |
| చికాగో నగరోపన్యాసములు | ... | 0 | 8 | 0 |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| గురూపదేశములు | | | ... | 0 | 8 | 0 |
| నా సంస్కరణ యుద్ధవిధానము | | | ... | 0 | 6 | 0 |
| నా గురుదేవుడు | | | ... | 0 | 6 | [illegible] |
| నవీన భారతదేశము | | | .. | 0 | 4 | [illegible] |
| శ్రీ పరమహంస జీవిత సంగ్రహము | | | | 0 | 4 | [illegible] |
| ముక్తిమార్గము | | | ... | 0 | 8 | [illegible] |
| సర్వం విష్ణుమయం జగత్ (తెలుగు) | | | | 0 | 8 | [illegible] |
| శ్రీ రామనామ సంకీర్తనము | | | ... | 0 | 1 | [illegible] |
| యతిగీతము (సన్న్యాసిగానము) | | | ... | 0 | 1 | [illegible] |
| సింహగర్జన | 0 | 0 | 6 డజను | 0 | 5 | [illegible] |
| నా మతము | 0 | 0 | 6 డజను | 0 | 5 | [illegible] |

ఇవియేకాక

సంస్కృత, ఆంగ్ల, ద్రావిడ, కన్నడ గ్రంథములును

వేదాంతకేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణప్రభ (ఆంధ్రము) శ్రీరామకృష్ణ విజయము (తమిళము)

అను మాస పత్రికలును మాయొద్ద దొరకును.

**శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి**

మున్నగువారి ఛాయాచిత్రములును మాయొద్ద దొరకును

ఇట్లు వ్రాయుడు:

మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు

# శ్రీ రామకృష్ణ ప్రభ

## చందాదారులకు

౧. పత్రిక ప్రతిమాసము 20-వ తేదీన వెలువరింపబడును. ఒక వారము, పది రోజులలోపల ప్రతి మీకు అందకపోయినయెడల ఉత్తరము వ్రాయవలెను.

౨. సంవత్సర చందా రు. 3 లు మాత్రమే. జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని చందాదారులుగా చేరవచ్చును. విడిప్రతి రూ. ౦—౬—౦ లు. హిగిన్ బాథంస్ వారి స్టాళ్లలో గాని, మా పత్రిక ఏజెంటుల వద్ద గాని అడుగుడు.

3. ఉత్తర ప్రత్యుత్తరములు వీలైనంతవరకు ఇంగ్లీషున వ్రాయుడు. మీ చందాదారు సంఖ్యను మరువకుడు. ఉత్తరములను "మేనేజరు, శ్రీరామకృష్ణప్రభ" అను చిరునామాకు వ్రాయవలెను.

౪. చిరునామాయందు ఎట్టిమార్పు కలిగినను 10-వ తారీఖునకు ముందుగా మాకు తెలియవలయును. లేనిచో, పత్రిక పూర్వపు చిరునామాకే పంపబడును.

## వ్యాసకర్తలకు

౧. కేవలము నైతిక ధార్మిక వైజ్ఞానిక విషయములైన వ్యాసములేకాక, వాని వ్యక్తులను గూర్చిన విషయము సంబంధించిన ఏ వ్యాసమునైనను పంపవచ్చును. సులభ సుందరమగు గ్రాంథిక భాషలో వ్రాయవలెను.

౨. వ్యాసములు అచ్చులో మూడు పుటలకు మించరాదు. ప్రతినెల 20 వ తేదీలోగా వ్యాసములు మాకు అందవలెను.

3. వ్యాసములను, విమర్శకు పంపు గ్రంథములను, వినిమయముగ పంపెడి పత్రికలను "సంపాదకుడు, శ్రీ రామకృష్ణ ప్రభ" అను చిరునామాకు వ్రాసి పంపవలెను.

౪. వ్యాసము తిరుగ పంపబడవలయునని కోరినచో పోస్టేజి చేర్చి పంపవలెను.

---



# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౮ } ౧౯౫౦ ఆగస్టు - వికృతి - శ్రావణము { సంచిక ౨

## ప్రార్థన

## భక్తి శతకము

శ్రీరామచంద్రకవిభారతి

శ్లో. పరాభేద్యం జాంబూనదరుచిరవర్ణం త్రిశరణమ్
త్రియానం త్రిప్రజ్ఞం త్రిభువనశరణమ్ త్రివచనమ్।
కృపాపాత్రం మన్దస్మితమరుణ సచ్చీవరధరమ్
కృతధ్యానం సిద్ధాసనఘటితపాద్ వస్తుశరణమ్॥ 7

ఏది త్రిభువనములకు శరణ్యమై, త్రివచనములతో కూడియుండి కృపాపాత్రమై, అధరోష్ఠముపై చిరునవ్వు నొలుకుచు ధ్యాననిష్ఠలో సిద్ధాసనమున నుండి శత్రువులచే జయింపబడక స్వచ్ఛమైన బంగారువర్ణముతో ప్రకాశించుచు, త్రిశరణములతో కూడికొనియున్నదో, మూడు యానములతో కూడికొనియున్నదో, మూడు ప్రజ్ఞలు కలిగియున్నదో అదియే నాకు శరణము.

శ్లో. ప్రసన్నం ఫుల్లేన్దీవరనయనయుగ్మం త్రిపిటకమ్,
ముహుర్వ్యాకుర్వాణం సురనరగణేభ్యః కరుణయా।
పరం శాన్తం స్వర్ణోపలరజతలోష్టేష్వపి చ సమమ్,
దృశాం నవ్యాతిథ్యం భవతు మమ తద్వస్తు శరణమ్॥ 8

ఏది ప్రసన్నమై వికసించిన పద్మముల బోలుకన్నులుగల్గి దేవతలకు మానవులకు త్రిపిటకముల చెప్పుచు కరుణామయమై ఉత్కృష్టమై శాంతియుతమై వెండి బంగారములయందు గాళ్లయందు మట్టియందు ఒకేభావముతో ఎల్లప్పుడు కండ్లకు నవ్యాతిథ్యమును కలుగజేయునో అదియే నాకు శరణము,

ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ

# శ్రీ రామకృష్ణ వచనామృతము — 'మ.'

## పానీహాటీ మహోత్సవమున శ్రీరామకృష్ణుడు

18 జూన్, 1883.

నాడు సోమవారము జ్యేష్ఠ శుద్ధ త్రయోదశి. మధ్యాహ్నము ఒంటిగంట యయినది. శ్రీకృష్ణచైతన్యుల భక్తులెందరో పానీహాటిలో గొప్పయుత్సవము చేయుచుండిరి. దీనికి అటుకుల పండుగ యనిపేరు. శ్రీకృష్ణచైతన్యుల శిష్యుడగు రఘునాథదాసీయుత్సవమును ప్రారంభించెను. పూర్వము శ్రీకృష్ణచైతన్యులీ పుణ్యక్షేత్రమున కేతెంచినపుడెల్ల శ్రీ రఘునాథదాసునింటినుండి ఈ భజనబృందమును గలిసి మహాభావనిమగ్నులై యుత్సవమున బాల్గొనువారట. దీనిని కనిపట్టిన నిత్యానందు లోకనాథుని బట్టికొని, 'ఓరీ! దొంగా! ఎవరికిని దెలియనిరీతి నీవిచటికేతెంచి యీయానందమున పాలుపంచుకొనిపోవుచుంటివా! మమ్ము నయిలతము నేమరించుచున్నావు. నీకిదియే శిక్ష. నీవిచటికేతెంచు భక్తులెల్లరకు అటుకుల పంచిపెట్టవలయు'నని వేళాకోళము చేసెను. నాటి నుండియు నీయటుకులపండుగ యచట ప్రారంభింపబడియెను. ప్రతిసంవత్సరమును వైష్ణవులెల్లరు నీయుత్సవమును జయప్రదముగ కొనసాగించువారు. ఇచటికి వచ్చిన భక్తులెల్లరు శ్రీకృష్ణనామసంకీర్తనము గావించుటయు, స్తుతించుటయు, శ్రీ రాధాకృష్ణ పూజనము కావించుటయు నాచరించువారు. ఈ పానీహాటి గంగాతీరమున గలదు. అందు శ్రీ రాధాకృష్ణమందిర మొండు గలదు. అచటనే ఈ భక్తులందఱును కలసికొనువారు. శ్రీరామకృష్ణగురుదేవుడుగూడ సాధారణముగా ప్రతి సంవత్సరము నీయుత్సవమునకు వచ్చుచుండువారు. నేడీ యుత్సవము నేర్పఱిచిన మణిసేన్ శ్రీరామకృష్ణుల నాహ్వానించియుండెను. కావున శ్రీ గురుదేవుడు రాముడు, రాఖాలు, భావనాథుడు, 'మ.' మొదలగువారితో బయలుదేరెను. మార్గమునందు శ్రీ గురుదేవుడు తమ యనుచరులతో హాస్యరసపూరితములగు పలుకుల బలుకుచు కబురులు చెప్పుచు వచ్చుచుండెను. కాని పానీహాటీ చేరుటయు బండిదిగి వేగముగా సరాసరి గుంపులోనికి వెళ్లిపోయెను. అచ్చట మణిసేన్ గురువు, నవద్వీప గోస్వామి సంకీర్తనము చేయుచుండెను. వారితో గలసి నృత్యముచేయుచు గురుదేవుడుచూచుచుండగనే సమాధిమగ్నుడయ్యెను. ఈ స్థితియందు గురుదేవుడు పడిపోవునేమో యని నవద్వీపగోస్వామి ఆయనను బట్టుకొనెను. లక్షలకొలది భక్తులచటి కేతెంచియుండిరి. వారెల్లరును భగవన్నామస్మరణ చేయుచుండిరి. రోదసీకుహరమెల్ల భగవన్నామముతో నిండియుండెను.

భక్తులెల్లరు నామసంకీర్తనము గావించుచు శ్రీ గురుదేవునిపై పుష్పవర్షము గురియించిరి. అద్భుతావహమగు శ్రీవారి సమాధిస్థితిని జూచుటకై ఒండొరుల నారసికొని ముందున కేతెంచుచుండిరి. శ్రీరామకృష్ణ గురుదేవుడు బాహ్యజ్ఞానము నందినపుడెల్ల పాటల పాడుచుండెను.

పాట భావము:

హరినామోచ్చారణము గావింప నెవరికి కనులవెంట బాష్పములు గురియునో * ఎవరు స్వయముగా విలపించి జగత్తునెల్ల విలపింప జేయుదురో వారిరువురు నేతెంచిరి. తాము నృత్యము గావించి ఇతరులచే నృత్యము చేయింతురో వారిని గనుగొనుడు అహా! దెబ్బలు తినియు ఎవరు పాపులకు హరినామము నొసగుదురో వారిరువురు వరుగో! హరిప్రేమతో మత్తిల్లి ప్రపంచమంతయు మత్తిల్లజేయుచున్నారు. వీరేకదా! యొకానొకప్పుడు వ్రజాంగనల వెన్నలను దొంగిలించువారు. జాతిభేదముల పాటింపక యెల్లరను ఆదరించి మించిన సోదరు లిరువురు నేతెంచిరి. అంచలను అలింగనముచేసికొను మహాత్ము లిరువురు నేతెంచిరి జగన్నాథ మాధవుల నుద్ధరించిన సోదరు లిరువురు జనుదెంచిరి. శత్రు మిత్ర భేదరహితమయి ప్రపంచరక్షణార్థ మవతరించిరి

శ్రీరామకృష్ణ గురుదేవుడు అర్ధబాహ్యదశ యందు నృత్యము మాత్రము చేయుచుండెను. భావము సంపూర్ణముకాగా సమాధిస్థితి నందుచుండెను. అపుడు ఆయన యుజ్జ్వలముఖ మెంతో చక్కగా నుండెడిది. సంకీర్తనము కావించుచున్నవారెల్ల శ్రీ రాధాకృష్ణ మందిరాభిముఖులైరి. మందిర మెంతయు చిన్నది కావున కొందఱు మాత్రమే లోనికి పోగలిగిరి. తక్కినవారెల్లరు శ్రీరామకృష్ణ గురుదేవునితో మందిర ప్రాంగణమునందు నృత్యము కావింప జొచ్చిరి. ఈ హరినామసంకీర్తన ధ్వని రోదసీ కుహరమెల్ల వ్యాపించి, గంగానదిలో పయనించుచున్న పడవవారినిగూడ నాకర్షించెను. వారుగూడ సంకీర్తనముచేయ నారంభించిరి.

సంకీర్తనము ముగియగా శ్రీరామకృష్ణుని, నవద్వీపగోస్వామిని మణిసేన్ తనయింటికి దీసికొనివచ్చి ఆహారము పెట్టించెను. తదుపరి రామ్, రాఖాల్ మున్నగువారి కెల్లరకును ప్రసాదము నొసగబడెను. భక్తవత్సలుడైన శ్రీరామకృష్ణుడు నృత్యముచేయుచు వారందఱకు ప్రసాదము పంచిపెట్టెను.

మధ్యాహ్నమయినది. రామ్, రాఖాల్ మున్నగు భక్తులతో శ్రీరామకృష్ణ గురుదేవుడు ముచ్చటించుచుండెను. అపుడు మణిసేన్ తన భోజనము ముగించి యచ్చటికి వచ్చి కూర్చొనెను.

శ్రీరామకృష్ణుడు:— (నవద్వీప గోస్వామితో) భక్తి పక్వమయినపుడు భావము కలుగును. దానితరువాత మహాభావము. అటు తరువాత ప్రేమ. తుదకు వస్తులాభము అనగా భగవత్సాక్షాత్కారము. శ్రీ గౌరాంగుడు మహాభావము, ప్రేమ—యీ రెండింటిని అనుభవించుచుండువాడు. ప్రేమ కలిగినవాడు తప్పక ఈ జగత్తునెల్ల మఱచిపోవును. మనుజులకు ప్రియమయినది శరీరముకదా! దానిని సయితము అతడు విస్మరించును. గౌరాంగున కిట్టి ప్రేమ కలిగెడిది. సముద్రమును జూచి

* శ్రీకృష్ణచైతన్యులు, నిత్యానందులను సూచించుచున్నది.

యమున యను భావమున అతడు దానిలోని కరిగెను. సాధారణ జీవులకు మహాభావముకాని ప్రేమకాని పొడమనేరదు. భావము మాత్రమే వారికి కలుగును. గౌరాంగునకు ఈ మూడవస్థలును కలిగెడివి. నా మాట సరియేనా?

గోస్వామి —చిత్తము. అంతర్దశ, అర్ధబాహ్యదశ, బాహ్యదశ.

శ్రీరామ·— అంతర్దశయందుండునపుడు (గౌరాంగుడు) సమాధిస్థితి నందువాడు. అర్ధబాహ్యదశయందు నృత్యము మాత్రమే చేయువాడు.

ఇట్టి సమయమున నవద్వీప గోస్వామి గురుదేవునితో పరిచయము కలిగించుటకై తన కుమారుని దీసికొనివచ్చెను. అతడు యువకుడు. శాస్త్రాధ్యయనము చేయుచుండెను. అతడు ముందునకువచ్చి శ్రీరామకృష్ణ గురుదేవునకు నమస్కరించెను.

గోస్వామి·—ఇంటనే యుండి శాస్త్రముల జదువుచున్నాడు. ఈ దేశమున వైదికగ్రంథములంతగా దొరకునవి కావు. మాక్స్‌ముల్లర్ అచ్చువేయించిన పిదప కొలది ప్రజలైన వానిని జదువుచున్నారు.

శ్రీరామ:—ఎక్కువ శాస్త్రముల జదువ నవసరములేదు. శాస్త్రమునందలి సారాంశము గ్రహించిన జాలును. శాస్త్రసారము గ్రహించి యందుకొఱకే యావజ్జీవము పాటుపడవలయును. భగవల్లాభమే కదా శాస్త్రోద్దేశము. 'బ్రహ్మసత్యం జగన్మిథ్యా' యని దేవి నాకు వేదాంతసారమును జూపియున్నది. గీతను పదిసార్లు వల్లించిన నేది యగునో యదియే అనగా 'త్యాగీ' యనునదియే గీతాసారము.

గోస్వామి:— త్యాగీ కాదు, తాగీయగును. అందలి దానికి నదియే అర్థమగును. తగ్‌ధాతు నజ్ = తాగ్ + ఉజ్ త్యాగి.

శ్రీరామ·—గీతాసారము అర్థము—'హే జీవ! అన్నిటినీ త్యజించి భగవంతునికొఱకు సాధనల చేయుము.

గోస్వామి·—త్యాగ మెవరికి కావలయును?

శ్రీరామ·—మీరందఱు గోస్వాములు. భగవంతుని పూజించువారు. (వైష్ణవార్చకులు) మీరెల్ల సంసారమును త్యజింప వలనుపడదు. మీరట్లు త్యజించిన భగవదారాధన కావించువారెవరు? మీరు మనస్సున మాత్రము త్యాగముచేయవలయును. భగవానుడే లోకశిక్షణార్థము మిమ్ము సంసారమున నుంచియున్నాడు. ఎంతగా ప్రయత్నించినను నీవు త్యాగము చేయజాలవు. నీవెంత ప్రయత్నించినను నీ స్వభావము నిన్ను సాంసారిక కృత్యములకే పురికొల్పును.

శ్రీకృష్ణు డర్జునునితో ఏమి పలుకుచున్నాడు? 'నీవు యుద్ధమొనర్పవా? నీవు తలచినంతమాత్రమున యుద్ధమునుండి నీవు నివృత్తుడవు కాజాలవు.' ఇట్లు పలుకుచు శ్రీ గురుదేవుడు సమాధిమగ్నుడయ్యెను. నవద్వీప గోస్వామియు, ఆయన కుమారుడును భక్తులును ఆశ్చర్యముతో శ్రీవారిని చూచుచుండిరి. కొంతసేపటికి శ్రీ గురుదేవుడు సహజస్థితికి దిగి ఇట్లు పలికెను: 'యోగము, భోగము'—మీరు గోస్వాములు కనుక రెండును మీకు గలవు. ఇక మీరు ఆంతరంగికముగ భగవానుని యెదుట ప్రార్థింపదగినది యొక్కటియే—'హే ఈశ్వరా! నీ భువనమోహన మైన యైశ్వర్యమును నేను వాంఛింపలేదు. వలయునది నీవే.' భగవంతు డంతటియందు వెలసియున్నాడు. ఐనను ఎవరి

మనః ప్రాణములు భగవానునియందు లయమైయున్నవో వారే భక్తులు.

శ్రీరామకృష్ణ గురుదేవుడు సంపూర్ణ సహజస్థితిని బొందియుండెను. (నవద్వీప గోస్వామితో) :—నా యీ సమాధ్యవస్థను కొందఱు రోగమని వచియింతురు. 'ఎవని శక్తి వలన జగత్తునకెల్ల చైతన్యము కలుగునో అట్టి పరాత్పరుని చింతనమువలన అచైతన్యము కలుగగలదా' యని నేను తలంచుచున్నాను.

మణిసేనుడు అభ్యాగతులకెల్ల దక్షిణ తాంబూలాదు లొసంగెను. శ్రీరామకృష్ణునకు ఐదు రూపాయ లీయబోయెను.

శ్రీరామ — నేను ధనమును గ్రహింపను.

ఐనను మణిసేనుడు బలవంతముగ దక్షిణ నొసగజూచెను. అంత,

శ్రీరామ:—మీ గురువుమీద ఒట్టు. నేను గ్రహింపజాలను.

పిదప మణిసేనుడు పట్టుపట్టగా శ్రీ గురుదేవుడు 'మ.' ను జూచి, 'ఎట్లు ఈ సంఘటనను దప్పించుకొనుట' యని పలికెను. వెంటనే 'మ.' అడ్డువచ్చి, 'ఎట్టి పరిస్థితియందయినను శ్రీ గురుదేవుడు ధనమును చేపట్టరు' అని మణిసేనునకు నచ్చజెప్పెను. శ్రీరామకృష్ణ గురుదేవుడు భక్తులతోగూడి బండినెక్కి దక్షిణేశ్వరమునకు బయలుదేరెను. మార్గమధ్యమున 'మోతీసీల్' కట్టించిన దేవాలయము గలదు. ఆ దేవాలయమునకు 'మ.' తో గూడి వెళ్లవలయునని శ్రీ గురుదేవుడు ఎన్నాళ్లనుండియో తలంచుచుండెను. ఈ దేవాలయము నొద్ద గల సరోవర ప్రాంతమున కూర్చొని 'నిరాకారధ్యానము'ను కావించు విధమును 'మ.' కు నేర్పదలంచియుండెను. ఈ సమయమున శ్రీరామకృష్ణ గురుదేవుడు తనకు పడిసెము పట్టియుండినను ఆ బండిని దిగి 'మ.' తో దేవాలయమున ప్రవేశించెను. అందు శ్రీ శ్రీ గౌరాంగుని విగ్రహము గలదు. ఆ మూర్తిని దర్శించి సరోవరమునొద్ద కేగి కొంతసేపు నిలుచుకొనియుండిరి. జలములలోనున్న మత్స్యముల నెవరును హింసింపరు కావున ఆ నీట నేదేని ఆహారము వైచినచో నా మత్స్యములన్నియు చెలరేగి జలోపరిభాగమున విహరించుచుండెడివి. 'ఆ మత్స్యములను జూడుము. నిరాకారబ్రహ్మమును ధ్యానించుట యనగా, ఈ మత్స్యములవలె చిదానందసాగరమున ఆనందముతో నీదులాడుటయే' అని 'మ.' తో గురుదేవుడు వచించెను.



శ్రీ శారదేశ్వర్యై నమః

# ధర్మ పరిశీలన

## విశ్వమతసిద్ధికి మార్గము

### శ్రీ వివేకానందస్వామి

(గతసంచిక తరువాయి)

ఇంకొకవిషయము. ప్రాయికముగ పరస్పర విరుద్ధములగు దృక్పథములనుండి ఒకే వస్తువును మనము చూడవచ్చును. కాని, ఆ వేర్వేరు దృక్పథములనుండి మనము చూచునదిమాత్రము ఒకేవస్తువు. ఒకడు సూర్యుని కడకు పయనించుచు, దారిలో ఒక్కొక స్థలముననిలిచి సూర్యుని ఛాయాచిత్రమునుదీసినాడనుకొందము. అతడు తిరిగివచ్చి, తానుతీసిన ఛాయాచిత్రముల నన్నిటిని మనకు గనుబరచినప్పుడు, వానిలో నేరెండుగాని ఒకేతీరున లేవని మనకు విశదముకాగలదు. కాని, ఇవి అన్నియు భిన్నదృక్పథములనుండి తీసిన ఒకే సూర్యుని ఛాయాచిత్రములనువిషయము నెవరు కాదనగలరు? వేర్వేరు మూలలనుండి ఈ దేవాలయమునకు మనము నాలుగు ఛాయాచిత్రములను దీసి చూచినచో, అవి యెంత భిన్నముగ గన్పడును! కాని ఈ దేవాలయముమాత్రమే అవియన్నియు గనుబరచును. ఇదేవిధముగ మన మనేక దృక్పథములనుండి సత్యమును దర్శించుచున్నాము. మనజననము, విద్య, పరిసరములు మొదలగు విషయములను బట్టి ఆదృక్పథములు వేర్వేరుగ నున్నవి. ఈ సంబర్భములనుబట్టి మనము గ్రహింపగలుగునంత సత్యమునుమాత్రమే స్వమనోబలిమిచే స్వబుద్ధి విశేషముచే గ్రహించి, స్వహృదయ భావానుగుణమగు రూపవిలాసముతో వెలువరించుచున్నాము. మన స్థితిగతులకును, శక్తికిని తగినంత సత్యమునుమాత్రమే మనము తెలిసికొనగలము. ఒక మనుష్యునకును వేరొక మనుష్యునకును తారతమ్యమును, ఒక్కొకప్పుడు పరస్పర విరుద్ధభావములుకూడ నుండుటకిదే కారణము. అయినను, మనమందరమొకే విశ్వజనీన పరమ సత్యమునకు చెందిన వారము.

కనుక, మానవజాతియొక్క మేలుకోరిన భగవంతుని కార్యనిర్వాహకములగు ఈ మతము లన్నియు భిన్నశక్తులనియు, వానిలో నేయొకటిగాని నాశనము కావింపబడజాలదనియు, నశింపదనియు నాయభిప్రాయము. ప్రకృతిలోని యే శక్తినిగాని మీరెట్లు నాశనముచేయజాలరో అట్లే యీ యాధ్యాత్మికశక్తులలో దేనినిగాని మీరు నాశనముచేయజాలరు. ప్రతి మతధర్మమును సజీవముగనున్నదని మీరు గ్రహించియున్నారు. కాలము పోను పోను అది క్షీణించిన క్షీణింపవచ్చును, వృద్ధినొందిన వృద్ధినొందవచ్చును. ఒక్కొకప్పుడది తన అలంకారము

లలో నెన్నింటినో కోల్పోయియుండవచ్చును; కొండొకతరి, బహువిధ భూషాశోభితమై ప్రకాశింపవచ్చును. కాని, దాని జీవము మాత్ర మెల్లప్పుడును ఉండియేయున్నది, అది యెన్నటికిని పోవునదికాదు. ప్రతి మతధర్మమునకును విశిష్టమైన ఆదర్శమున కెన్నటికిని నాశనము లేదు.

ప్రతి దేశమందలి తత్వశాస్త్రవేత్తలును, తదితరులు నింతవరకు దేనిని కలలోని కల్మినివలె అపేక్షించుచున్నారో ఆ విశ్వమత మిదివరకున్న దేకాని క్రొత్తదికాదు. అది వాస్తవముగ ఈలోకముననున్నది. విశ్వసాభ్రాత్రత మనకిదివరకే యెట్లున్నదో, అట్లే విశ్వమతము కూడ నిదివరకేయున్నది. మీలో ఖండాంతరములకుబోయి దూరదేశములను జూచినవారికి, ప్రతిజాతిలోను సోదర సోదరీమణులు కనుపడ లేదా? ప్రపంచమంతట వారు నాకగుపడిరి. సౌభ్రాత్రత ఇదివరకే యున్నది. కాని, కొందరు మాత్రము క్రొత్తక్రొత్త సోదరబృందములకై దేవురించుచు, దీనిని కనుగొనజాలక చెడగొట్టుచున్నారు. విశ్వమతముకూడ ఇదివరకే యున్నది. వేర్వేరు మతములను బోధించు పనిని తమతలలపై నిడుకొనిన ఆచార్యులును నితరులును కొలది క్షణములవరకు తమ మత ప్రచార మాపివేసిన చాలును; విశ్వమత మిదివరకే యెట్లున్నదో మనకు వెంటనే విశదము కాగలదు. ఎప్పటి కప్పుడు దానిని వారే భగ్నముచేయుచున్నారు. తమలాభముకొఱకే వారిట్లు చేయుచున్నారు. ప్రతి దేశమందును ఆచార్యవృత్తి నవలంబించువారు బహు సంకుచితహృదయు లనువిషయము మీకెల్లరకును తెలిసినదే. ఎందుచేత? జనులను నడిపించు ఆచార్యులు చాల కొలదిగ మాత్రమే కలరు, వారిలో చాలమంది జనులచే నడిపింపబడుచు, జనులకు దాసానుదాసులై, బానిసలై యున్నారు. పుష్కలముగ నీటితోనిండిన చెరువునుజూపి, 'ఎండిపోయినదే!' అని మీరు పల్కినచో 'ఔ నౌను. ఎండిపోయినది' అని వారుకూడ పల్కుదురు. చంద్రుడు నల్లగ నుండునని మీరు పల్కినచో, 'ఔనౌను. చంద్రుడు నల్లగనే యుండును' అని వారు కూడ చిలుకలవలె పలుకుచుందురు. జను లభివృద్ధినొందిన వారు కూడ నభివృద్ధినొందుదురు; అంతేకాని వెనుకబడియుండజాలరు. ఆచార్యులను నిందించుట నేడు పరిపాటియైనను, ముందుగ మిమ్ము మీరే నిందించుకొనవలసియున్నారు. ఎంత యోగ్యతమీకుగలదో, అంతమాత్రమే మీఫలసిద్ధికూడ. ఏ ఆచార్యుడైన నవనవోన్నతభావ సంపదను మీకు చేకూర్చి, మిమ్ము ముందునకు నడిపింపగోరుచో ఆయనగతి యేమగును? బహుశః ఆయనబిడ్డలు తిండికిలేక మలమలమాడుదురు. దారిద్ర్యదేవత ఆయనయింట తాండవమాడుచుండునని వేరుగ చెప్పనక్కరలేదు. మీరనుసరించు లౌకికధర్మములనే ఆయనయు ననుసరించును. "మీరు ముందునకు నడచినచో, మేమును ముందునకు సాగెద' మని యాయన చెప్పును. అయితే, జనాభిప్రాయమునకు వెఱువని మహనీయులు కూడ నరుదుగ గలరు. వారు సత్యమును గ్రహించి, దానినిమాత్రమే లెక్కసేయుదురు. సత్యము వారి నావహించి, తనకై వసముగావించికొనియుండుటచే, వారెల్లప్పుడును ముందునకే పోవుచుందురు కాని, వెనుదిరిగి చూడజాలరు, జనులపై నాధారపడరు. భగవంతుడే వారికి చేదోడుగా నుండును. ఆ జ్ఞానతేజ

మును వారు సందర్శించి, అనుసరించుచుందురు.

ఈ దేశమున, నేనొక మొర్మను వాస్తవ్యుని గలసికొంటిని! అతడు నన్ను తన మతమునకు ద్రిప్పుకొనుటకు ప్రయత్నించెను. అందుపైన నాయనతో నిట్లంటిని "అయ్యా! మీ అభిప్రాయములపట్ల నాకు చాల గౌరవమున్నది. కాని, కొన్నివిషయములలో నేను మీతో నేకీభవింపను. సన్న్యాసాశ్రమపరంపరకు చెందినవాడను నేను, బహుపత్నిత్వమందు నమ్మకము గలవారు మీరు. కాని, మతబోధచేయుటకు మీ రిండియాదేశమునకేల రారు?" అంతట, ఆశ్చర్యవశుడై యాయన "ఇదియేమి? ఏవిధమైన వివాహమందుగాని, మీకీసుమంతయు నమ్మకములేదు. మేమన్ననో, బహుపత్నిత్వమందు విశ్వాసముకలవారము. అయినను, నన్ను మీ దేశమునకు రమ్మనుచున్నారే." అని నుడివెను. ఇందులకు, "ఔను: నా దేశప్రజలు పరమతభావము తెచ్చుటనుండి వెలువడినను, వానిని వినుదురు. ఇండియాదేశమునకు మిమ్మాహ్వానించుటకు నాకు రెండు కారణములున్నవి. ఇందు మొదటిది. మతశాఖలయందు నాకు ప్రబలమైన విశ్వాసముకలదు. రెండవది: ఇండియాలో ప్రస్తుతముగల శాఖలతో తృప్తిపడనివారనేకులు గలరు. ఈ అసంతృప్తిచే, వారికి మతములో పనియే లేదు. ఇట్టివారిలో నుండి, కొందరనుచరులు మీకు లభింపవచ్చును." అని బదులు చెప్పితిని. మతశాఖ లెంత యెక్కువగనున్న, మతలబ్ధికి జనులకంత అవకాశముండును. పలురకముల ఆహారపదార్థములుగల భోజనవిక్రయశాలలలో తమ ఆకలిని దీర్చుకొనుటకెల్లరకును అవకాశముండును. కనుక, ప్రతిదేశమందును శాఖలు పెరుగవలయునని నేను కోరుచున్నాను. ఇందువలన పారమార్థిక జీవితమును గడపుటకు జనుల కిప్పటికంటె నెక్కువగ అవకాశముగలుగును. మతమునందు జనులకిష్టములేదని తలంపగడు. ఇది యథార్థమని నేను నమ్మను. మీ వాంఛితమును మతబోధకులు తీర్పజాలరు. నాస్తికుడుగనో, భోగలాలసుడుగనో, నుకిరియేయితర హేయజీవిగనో ప్రజలచే దూషింపబడు వ్యక్తియే, తాను వాంఛించు సత్యమును ప్రసాదింపగల మనుష్యుని సందర్శించు అవకాశమును బడసి, తన కులమునకెల్ల నత్యంతాధ్యాత్మిక సంపన్నుడుగ బరిణమింపవచ్చును. మన కలవాటైన విధముననే ఆహారమును మనము భుజింపగలము. హిందువులమగు మేము చేతితో ఆహారమును దీసికొని భుజింతుము. మా వ్రేళ్లు మీ వ్రేళ్లకంటె నెక్కువ చురుకుగ, నిపుణముగ బనిచేయును. మావలె మీరు మీ వ్రేళ్లను వాడజాలరు. ఆహారము దానికి నంతమాత్రమున లాభములేదు, మీ విశిష్ట విధమున దానిని మీరు భుజింపవలయును. ఆధ్యాత్మికభావములు మీకు కలుగవలయునను మాట నిజమే. కాని, అవి మీ సొంతమైన పద్ధతికి అనుగుణముగ లభింపవలయును, అవి మీ మనోభావముల రూపముతో నొప్పుచున్ననే తప్ప, మీకు తృప్తికలుగదు. నాభావముల కనుగుణమైన రూపమున సత్యమును ప్రసాదింపగల మహనీయుడు తటస్థించినప్పుడు, నేను దానిని గ్రహించి, స్థిరస్థాయిగ పోషించుకొన గలుగుదును. ఇది యొక గొప్ప వాస్తవిక విషయము.

(సశేషము)

శ్రీ కృష్ణాయనమః

# ప్రపంచమనుసరింపదగినది బౌద్ధమత మొక్కటియేనా?

[కొన్నాళ్ళ క్రితము డాక్టరు B R అంబేద్కర్‌గారు మహాబోధిపత్రిక వైశాఖ సంచికయందు 'బుద్ధుడు—భవిష్యత్తున అతని ధర్మము' అను వ్యాసమును రచించి యుండిరి అందుగల ప్రశ్నలు కొన్నింటికి శ్రీ కృష్ణదాసు బుద్ధప్రేమికులు ఒసగిన ప్రత్యుత్తరము లివ్వుట ప్రచురింప బడుచున్నవి. సంపాదకులు.]

ప్రశ్న శ్రీకృష్ణుడు, ఏసుక్రీస్తు, మహమ్మదు—వీరందఱికంటె బుద్ధుడు మిక్కిలిగా అహంభావరాహిత్యమును గనుబఱచెను. ఏసు తన్ను దేవుని పుత్రునిగా జెప్పుకొనెను. మహమ్మదు తన్ను దేవదూతగా వివరించుకొనెను. శ్రీకృష్ణుడు తానే పరమేశ్వరుడనని ప్రకటించుకొనెను.

ఉత్తరము ఈ పల్కులనుబట్టియా యెవరెంతవరకు స్వాభిమానరహితులైనారను విషయమును నిర్ణయించుట? ఇతివృత్తకమను గ్రంధమునందలి వాక్యములను గొన్నిటి నిచట నుదాహరింతును. అవన్నియు బుద్ధుని స్వవచనములుగా భావింతురు. శ్రీకృష్ణుడును, ఏసుక్రీస్తును వచించిన తెఱంగుననే బుద్ధుడును స్వోత్కర్షను స్వీయ దివ్యమహిమను ఉద్ఘాటించి యుండుట నిందు గానవచ్చెడు.

ఇతివృత్తమునందలి వచనముల కాంధ్రీకరణము:—

"సోదరులారా! యుగముల క్రితము నేనొకప్పుడు స్వర్గమున మహావైభవోపేత దేవతగా జన్మించితిని. అచట నేనే బ్రహ్మమను! అన్నింటిని జయించు అజేయుడును, సర్వజ్ఞుడును, సర్వేశ్వరుడు నగు పరబ్రహ్మను......... సోదరులారా! ముప్పదియాఱు పర్యాయములు నేను దేవరాజయిన శక్ర (శక్రుడ) నై జన్మించితిని. అసంఖ్యాకములగు పర్యాయములు నేను రాజుగను, జగత్ప్రభువుగను జన్మించితిని."

పై నుదాహరింపబడిన పలుకులు గమనించినచో బుద్ధుడు సయితము స్వోత్కర్షను స్వీయ దివ్యసంపదను వచించియున్నాడని తెలియుచున్నది గదా! మీ యభిప్రాయప్రకారము బుద్ధుని అహంభావశూన్యతను ఋజువుచేయు మాటలివి! ఈ మహాపురుషులు స్వాభిమానపరులని సూచించునట్లు పలుకుటకూడ మహాపాపము! ఏసుక్రీస్తు నిమ్నాతినిమ్నులను నిజస్నేహితుల

వలె ప్రేమించి, తన అసువులను తీసిన క్రూరులను క్షమింప దైవమును ప్రార్థించి, సర్వమానవోద్ధరణకై తన శరీర రక్తమును ధారవోసిన ఆదర్శ విరాగి, సాటిలేని మహానుభావుడు. శ్రీకృష్ణుని జీవితమంతయు స్వార్థత్యాగము, నమ్రత యను సుగుణముల కాదర్శప్రాయము. ఆ మహామహుడు దురాత్ముడగు కాళీయుడు మున్నగు దుష్టుల ననేకుల మదమణచుటయే కాక, లోకద్రోహులగు నరపాలురను తెగటార్చి విదురుని ఆతిథ్యమునకు సమ్మతించెను, బీదసుధామునకు బంధువాయెను, అర్జునునకు సారథి యయ్యెను. అందఱను రాజులుగ నొనర్చినను తానుమాత్రము రాజ్య మాశింపలేదు. ఎన్నియో గాథలచే నాతని జీవితము దురూహ్యముగా నాచ్ఛాదింపబడియున్నను ఆ మహాత్ముని జీవితమున స్వార్థత్యాగము, దీనవాత్సల్యము, ధర్మానురక్తి—అందందు గోచరింపకపోవు.

ప్రశ్న. ఏమయిన నగుగాక! తాను భగవంతుడనని శ్రీకృష్ణుడు వచించుట మిక్కిలి దుస్సాహసము.

ఉత్తరము: ధర్మగ్రంథములను సాధారణముగా మనము ఏ భావముతో పరికింతుమో అదియే అందు మనకు గోచరించుచుండును. యుగయుగములనుండియు లక్షలకొలది ప్రజలు దైవముగా భావించి మిక్కిలి భక్తితో గౌరవించు దివ్యపురుషుని మోసగాడని వచించుట ఆయనయందు విశ్వాసముగల జనులకెల్ల తప్పక కోపకారణము కాగలదు. మనము మిక్కిలి ఓరిమితో నిందలి సత్యాసత్యములను అరయవలయును. కృత్రిమమైన అనుకరణమును విడనాడి, యథార్థవస్తువును గ్రహింపవలయును. హిందూమత ప్రమాణ గ్రంథములన్నిటినిబట్టి భగవదైక్యమే మన గమ్యమని విశదము కాగలదు. తమ 'అహము'ను భగవంతునిలో లీనము చేయువారే తమ్ము పరమేశ్వరునిగ భావించికొని యిట్లు పలుకగలరు. ఎందఱో మహానుభావు లిట్టి జ్ఞానార్జనము గావించి యిట్లు వచించియున్నారు. అట్టివారియందు క్షుద్రాతిక్షుద్రమగు 'నేను' అను అహము నిలిచియుండజాలదు. వారి జ్ఞానోత్తేజము డాంబికము గాదని వారి పారమార్థిక జీవనవిధానమే తెలియజేయుచుండును. భగవద్గీతయందు శ్రీకృష్ణుడు తన్ను అర్జునుని చెలికానిగను, మార్గదర్శిగను, వృష్ణికులతిలకునిగను, భగవద్భక్తునిగను, పరమేశ్వరునిగను జెప్పుకొనియున్నాడు. (శ్లో॥ తమేవ చాద్యం పురుషం ప్రపద్యే యితః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ॥ 15-4.—ఎవనినుండి అనాదియగు ఈ సంసార ప్రవాహము నిర్గతమైనదో, నేను, ఆ యాదిపురుషుని శరణుజొచ్చుచున్నాను.) దీనినిబట్టిచూడ శ్రీకృష్ణభగవానుడు తాను అర్జునునకు గురువుగా నున్నను భగవంతుని శరణుజొచ్చుచున్నాడు గదా! ఇది యెల్లరును భగవల్లాభముకొఱకు అనుసరింపదగినదియే.

హిందూధర్మానుసారముగ ఎవరు సంపూర్ణత్వము పొంది తమ ఆత్మను భగవదనుసంధానము గావింతురో అట్టి మహామహులే అవతారపురుషులుగా నెన్నబడుచున్నారు. వారు చరాచరము లన్నిటియందును తమ యాత్మనే పరికింతురు. ముందుగ నేపాక్షిక బుద్ధికి లోనుగాకుండ శాస్త్రముల దిలకించినచో అందు విరుద్ధములుగా గోచరించుచున్న విషయముల విమర్శించి సద్విషయములను—సదర్థములను దెలిసికొన నెంతయు నవకాశము గలదు. సర్వభూతములయందును తన ఆత్మనే పరికింపగల మహా

త్మునియం దెట్టి దుష్ప్రవర్తనమును గోచరింపదు. ఆతడెప్పుడును ఆత్మశ్లాఘనము జేసికొనడు.

ప్రశ్న : ఈ మతప్రవక్తలు తమకు గలవని చెప్పికొను మహిమలు, నమానుషశక్తులు, భగవత్ శాసనాధికారము మున్నగువాని మాట యేమి?

ఉత్తరము : ధర్మగ్రంథములన్నియు వందల కొలది వత్సరములకు పూర్వము రచింపబడినవి. నేడు మనకున్న ఐతిహాసిక సత్యదృష్టియు, వైజ్ఞానిక పద్ధతియు ఆనాటి ప్రజలకు లేవు. మనుష్యుని మనోభావములను దీర్చి దిద్దుటయందే వారి బుద్ధి కేంద్రీకరింపబడియుండెను. కాని వారు విమర్శక దృష్టిని ప్రబలము కావింప ప్రయత్నించినవారు కారు. ఎల్లధర్మములయందలి దర్శనాంశములు విమర్శకదృష్టి గలవారి కెల్లరకు నచ్చును. ఒక ధర్మ దర్శనాంశముతో ఇతర ధర్మ పౌరాణికాంశమునుగాని—కర్మకాండ విషయమునుగాని సరిపోల్చి చూచుట న్యాయము కాదు. బౌద్ధమతమునందుగూడ ఎన్నియో పౌరాణికగాధలు—దేవతలు మానవ కార్యములందు చేయిచేసికొనుట మున్నగునవి—అమానుషకృత్యములు, స్వర్గములు, నరకములు ఇవన్నియు వివరింపబడియున్నవి. బ్రహ్మసహంపతియొక్క కోరిక ననుసరించియే బుద్ధుడు భూలోకమునుజూచి క్రిందికి దిగి వచ్చెను. వివిధరూపములను దాల్పగల శక్తి తనకు గలదనియు, తాను గోడలను చొచ్చుకొని పోగలననియు, నీటిమీద నడువగలననియు, సూర్యచంద్రాదులను తాకగలననియు బుద్ధుడు కశ్యపునితో వచించియున్నాడు. కంటకమను గుఱ్ఱము నగరమునుండి బుద్ధుని బయటకు గొని పోవునపుడు దాని పాదములు మోపినచోటులం దెల్ల కమలములు వికసించెడివట. ఇట్టి వనేకములు గలవు. శ్రీకృష్ణుడును, ఏసును తమ మాటలు భగవద్వాక్యములే యని చెప్పుకొనినచో అందుల కా పలుకులే ప్రమాణములు. అట్టి శ్రేష్ఠవాక్కులు భగవదర్పితము గావించిన మనస్సుగలవారే చెప్పగలరు గాని ఇతరులు వచియింపజాలరు. వారి ప్రసంగములలో అందందు గోచరించుచున్న నీరసవాక్కులన్నియు వారిపేరిట నెవరో ప్రక్షిప్తములు గావించినవి గాని నిజముగా వారివి కావు. ఇట్టి పలుకులవలన వారి ఘనత కెట్టి లోటును గలుగజాలదు. బుద్ధుడు హేతుబద్ధమగు మతధర్మమును ప్రచారముచేసెనన్నమాట సత్యమే. కాని, అతడు తా ననుసరించిన మార్గము అపూర్వముకాదని వివరించిన యీ క్రింది ప్రమాణవాక్కులను మనము మఱువరాదు.

“సోదరులారా! నేను అనుసరించిన మార్గము పూర్వ మెందరో మహాత్ములచే ననుసరింపబడినదని నేను కనుగొంటిని.”

సత్యము కాలమువలె అనాది యనియు అది తమ కల్పనాశక్తి ఫలితమని యెవరును వాదింపజాలరనియు బుద్ధభగవానుడు గుర్తించియుండెను. భూతకాలమునుండి వర్తమానకాలిక విషయములును, వర్తమానమునుండి భవిష్యత్తును బయలుదేరును. వేదకాలపు మహర్షులు మొదలు శ్రీ గాంధీమహాత్మునివఱకును నడచిన భారతదేశీయ విజ్ఞానచరిత్రను చక్కగా పరిశీలించిన విద్వాంసులకు హిందూమతధర్మము పుచ్చిపోయిన కఱ్ఱముక్కవంటి పనికిమాలిన వస్తువు కాదను విషయము స్పష్టముగా గోచరించును. తాత్త్విక దృఢవిశ్వాసము విషయమున, బుద్ధునకు శ్రీ శంకర, రామానుజ, మధ్వాచార్యు లీషణ్మాత్రమును దీసిపోవువారు కారు.

ప్రశ్న ఎట్లైనను, హైందవధర్మము నీతిపై నాధారపడియుండలేదు. కనీసము నైతికజీవనము దాని అంశమాత్రముకూడ గాదు. ఇక బౌద్ధ ధర్మమన్ననో, అది నైతికజీవనముపైననే ఆధార పడియున్నది. బౌద్ధధర్మము నైతికజీవనమే కాని మరేదియు కాదు.

ఉత్తరము ఇది ఎంతమాత్రము సరికాదు. బుద్ధభగవానుడు తన ధర్మముయొక్క పరమా వధి నిర్వాణమని స్పష్టముగా వచించి యున్నాడు. నైతికజీవనము దానికి తోడ్పడు నది మాత్రమే. ఒకప్పు డాయన ఉన్నాభుడను బ్రాహ్మణునితో సంభాషించుచు ఈ క్రింది విధముగా చెప్పియున్నాడు :

"ఓ బ్రాహ్మణుడా! పవిత్రజీవనము దాని పరమావధియగు నిర్వాణలక్ష్యములో లీనమై నప్పుడే సుసాధ్యమగును. నిర్వాణమే దాని అత్యంత ఫలసిద్ధి."

ఉపనిషత్తులను రచించిన ఋషులకువలె బుద్ధునకుకూడ నైతికజీవనము ఒక సాధనము మాత్రమే. "మజ్ఝిమనికాయము" నందలి I—184 వ శ్లోకమున నీ మహామహుని పలుకు లిట్లున్నవి :

"నే నింతకుముందు పలికినట్లు నావ సాయ మున మన మొక తీరమును విడిచి మరియొక తీరమును చేరినపుడు నావను మనతో దీసికొని పోము, దాని నచ్చట విడిచివెళ్లుదము. సోదరు లారా! ఆ విధముగనే మన మనుసరించిన ధర్మమార్గములనుకూడ విడచిపోవలెననిన ఇక అధర్మమార్గములనుగూర్చి పలుకవలయునా!"

కావున నైతికజీవనము బౌద్ధధర్మముయొక్క ఆదియు, అంతమునుకాదు. పై నుదాహరింప బడిన పలుకులే యింతకు ప్రమాణములు. అం దుచేత ఇతర మతములలో ఏది భగవంతుడుగా చెప్పబడినదో అది బౌద్ధధర్మమునందలి నిర్వా ణమే కాని, నైతికజీవనము మాత్రము కాదు. హిందూధర్మమున నైతికజీవనము నొక్కి వక్కాణింపబడలేదనుట సదా వినవచ్చుచున్న విషయమే. పాశ్చాత్యదేశములనుండి వచ్చిన క్రైస్తవమతప్రచారకులు హిందువులను తమ మతమున గలుపుకొను తలంపుతో తమకు వీలైనప్పుడెల్ల హిందూధర్మమును దూషించు చుండువారు. కాని, ఇతర ధర్మము లెంతవరకు నీతిమార్గమును బోధించినవో అంతవరకు హిందూధర్మముకూడ దానికి ప్రాముఖ్యత నిచ్చియే యున్నది. ఇంతేకాదు, హిందూమత మందలి పరమతసహనమను మహోన్నత ధర్మ మును ఇతర మతములు హిందూమతమునుండి నేర్చుకొనవలసియున్నవి. ప్రొఫెసర్ పాల్ డైసెనుగా రిట్లు చెప్పుచున్నారు

"నిన్ను నీ వెట్లు ప్రేమింతువో అట్లే నీ యిరుగుపొరుగువారిని ప్రేమింపుమని "బైబిల్" లో చెప్పబడినది. కాని నేను అన్యుల నేల ప్రేమింపవలెనో కారణము విశదీకరింపబడలేదు. ఇందులకు వేదములందే తగినయుక్తి గోచరించు చున్నది.—నీ యిరుగుపొరుగున నున్న వ్యక్తి గూడ నిజముగా నీ యాత్మయే. మీ రిరువు రును వేరనుకొనుట కేవలము భ్రమ."

నీతి అన్నిమతములందును నున్నప్పటికిని, వేదాంతమునందే అది చక్కగా విశదీకరింప బడినది. వేదాంత సిద్ధాంతమే హిందూధర్మ శరీరమునందలి ఉత్తమాంగము. ఏలననగా, అద్వైత వేదాంతమునుబట్టి జగత్తు ఒక్కటే. ఇంద్రియముల ద్వారమున జూచునప్పుడు అది జడముగను, బుద్ధిచే జూచునపుడు జీవులుగను, ఆత్మదృష్టితో జూచునపు డీశ్వరుడుగను గన బడును. ఇదియే సర్వనీతిశాస్త్ర పరమార్థ

బోధనము. బౌద్ధధర్మము ప్రకారము నీతి పరిపాలనకు ఇంద్రియగ్రాహ్యమైన మార్పు బొందుచుండు ప్రపంచమే జాలును, దైవికాధారము అన్యమేదియు ననావశ్యకము. ఎల్లప్పుడు మార్పునొందు దానిని తెలిసికొనుటకు నిర్వికారమగు వస్తువుపై దృష్టి నుంచుట ఎంతటి యవసరమో విమర్శకుల కందరికిని తెలిసిన విషయమే.

పరివర్తనముచెందు విషయమును తెలియుటకు, పరివర్తనరహితమగునది అత్యవసరము గనుక ఇందు సముద్రము, దాని అలలను మన ముదాహరణముగ దీసికొనవచ్చును. మార్పు కలదియు, లేనిదియుగా నుండు నొక సద్వస్తువు గలదని మనము గ్రహింపవలెను. అదియే పరివర్తనకు లోనైన ప్రకృతిగనో నిర్వికారమగు పరబ్రహ్మముగనో మన ఆధ్యాత్మికోన్నతి కనుగుణమగునటుల మనకు గోచరించును. స్వార్థపరత్వము నశించి దాని స్థానమున నైతికధర్మమగు సత్యము లేక నిర్వాణము లేక పరబ్రహ్మము మానవునియందు ప్రకాశించునపుడు అతడు ప్రపంచమునకు నాయకుడగును. అట్టి స్థితి కతడు వచ్చినపుడే, మానవజాతిని పీడించి అధోగతిపాలుచేయుచున్న ఈర్ష్య, దౌర్జన్యము, అహంకారము, కలహములు నశించును. నిగ్రహమే సంఘమును రక్షించును. ఇంద్రియభోగాపేక్షకై, వ్యక్తిగతాధికారమునకై -ప్రాకులాట నశించిననేగాని ఆ నిగ్రహబుద్ధి లభింపదు. ఇంద్రియగ్రాహ్యమగు నీ ప్రపంచమున సద్వస్తువు నొక నిమిషమైనను దర్శించినచో ఆ పరమసత్యము మాత్రమే, పరుల కష్టముపైన, దుఃఖముపైన ఆధారపడియుండు ఇంద్రియసుఖమునకు మానవుని విముఖునిగ చేయును. అంతియేకాని, కాఫీ పుస్తకములందలి నీతు లిట్టి యుత్తమ సుగుణరత్నము నెన్నటికిని సాధింపజాలవు.

(సశేషము)



కారుణ్య మహత్త్వమునుగూర్చి హిందూమతమంతటి మహత్తరముగా బోధించు మతము లోకమున వేఱులేదు, పేదల—దీనుల—కుత్తుకలపై పరమనీచముగా హిందూమతమువలె కాలిడి త్రొక్కు మతమును లోకమున వేఱులేదు. సనాతనధర్మమున కీ దోషము నంటగట్టుట తగదని—పారమార్థికములనియు వ్యావహారికములనియు సర్వవిధ క్రూరసిద్ధాంతముల గల్పించు పండితంమన్యుల, వంచకుల, దోషమిది యని—పరమేశ్వరుడు నాకు దెలిపియున్నాడు.

—శ్రీ వివేకానందస్వామి



చైతన్యులు, 'మీరు మహాపండితులు. మీరే వ్యాఖ్యానము గావించి యందలి యర్థ మెరిగించి నన్ను కృతార్థుని గావింపుడు' అని పలికెను. పాండిత్యమున నభిమానము కలిగియుండిన సార్వభౌముడు ఆ శ్లోకమునకు పదునాడు విధముల అర్థముచేసి చూపెను. వీనినన్నింటిని విడిచిపుచ్చి శ్రీ చైతన్యులు స్వయముగా పదునెనిమిది విధముల వ్యాఖ్యానించి సార్వభౌముని భ్రమింపజేసెను. అంత సార్వభౌముడు శ్రీకృష్ణచైతన్యుల యెదుట స్వీయపాండిత్య మెట్టి లాఘవమునకు గురియయ్యెనో గ్రహించెను.

మఱియొకనాడు సార్వభౌముడు శిష్యులకు 'బ్రహ్మసూత్రములను' బోధించుచుండెను. అచటనున్న శ్రీకృష్ణచైతన్యుల కా వ్యాఖ్య యెంతమాత్రము నచ్చదయ్యె. ముఖలక్షణములవలన శ్రీకృష్ణచైతన్యుల భావమును గ్రహించిన సార్వభౌముడు 'నా వ్యాఖ్యానమునందు గల లోపమెద్ది?' యని ఆ మహాత్ముని ప్రశ్నించెను. శ్రీకృష్ణచైతన్యులు 'మీరు గావించినది ఆ సూత్రములకు ఏమాత్రము వ్యాఖ్య కాదు. అని దానిని పూర్వపక్షము గావించి బ్రహ్మసూత్రములకు భక్తియే ప్రధానముగా స్వీయవ్యాఖ్యను వివరించెను. ఎల్లరును దిగ్భ్రమచెందిరి. ఇట్టి ప్రసంగములవలన శ్రీ చైతన్యుల పాండిత్యమును గ్రహించిన సార్వభౌముడు ఆ భక్తాగ్రేసరునితో భగవద్విషయములగూర్చి నానాడు ప్రసంగించుచుండెను. ఇట్లుండ 'భక్తియందు తన కభిరుచి యెట్లు జనింపగల'దని శ్రీ చైతన్యులను ప్రశ్నించెను. 'కలియుగమునందు నామసంకీర్తనమే శ్రేష్ఠమైన సాధనము'. శ్లో. తృణాదపి సునీచేన తరోరపి సహిష్ణునా, అమానినామానవేన కీర్తనీయః సదా హరిః—ఎవరు తృణముకంటెను నమ్రత కలవారో, వృక్షములకంటె సహనము కలవారో, ఎల్లరకు సన్మానము గావించి స్వీయమానమును కోరనివారో, వారెల్లరు హరినామసంకీర్తనము చేయదగినవారు. ఈ ధర్మమార్గమున అట్టి భక్తుడు. 'ధనమునో, స్వజనమునో, సుందరీనివహమునో, కవిత్వమునో కాంక్షింపక 'జన్మజన్మములందును నీయెడ అహైతుకభక్తి కల్గునవు'మని భగవంతుని ప్రార్థింపవలయును' అని బోధించెను. ఈ ఉపదేశములన్నియు విని సార్వభౌముడు శ్రీ చైతన్యుల ప్రభావానుభూతి అయిన భక్తిమార్గము నవలంబించెను. ఆయన మనోపరివర్తనమే అచ్చటి పండితులకెల్ల శ్రీకృష్ణచైతన్యులయెడ గురుభావమును గల్గించి వారందఱను శ్రీ చైతన్య శిష్యవర్గమున జేర్చెను.

ఇట్టి శిష్యగణము భక్తగణము సేవింప శ్రీ చైతన్యులు నాలుగైదు మాసము లందు వసించి పిదప దక్షిణదేశమునకు బయనమయ్యెను. మార్గమున బ్రహ్మగిరి, కూర్మాచలము, సింహాచలము మున్నగు క్షేత్రముల దర్శించి చివరకు గోదావరీతీరమును జేరిరి. అచట రామానందరాయ్ అను నతడు రాజమహేంద్రవరమును శాలించుచుండెను. ఒకనాడు శ్రీ చైతన్యులు గోదావరియందు స్నానము గావించి నామజపము గావించుచుండిరి. ఈ విషయమును విని అచటికి రామానందులు మేళతాళములతో వచ్చి వారికి సాష్టాంగ నమస్కారము గావించెను. రామానందునియెడ సద్భక్తలక్షణములను గనుగొన్న శ్రీ చైతన్యులు ఆతని లేవదీసి కౌగలించుకొని తమప్రక్కన కూర్చొనబెట్టుకొనెను. ఇరువురును ఎంతయో ఆనందించిరి. నాయట్టి

సామాన్యభక్తుని మీయట్టి మహాత్ములు ఆదరించుట మహాభాగ్యము. మీరు మా పట్టణమున కొన్నాళ్లుండవలయునని ప్రార్థించెను. కొంతకాలము ముచ్చటించిన పిదప రామానందులను రాత్రి తమయొద్దకు ఏకాంతముగ రమ్మని శ్రీ చైతన్యులు పంపివైచిరి. సాయంత్రమునందే తమ పనులను పూర్తిగావించుకొని రాత్రి యయిన వెంటనే రామానందరాయలు శ్రీ చైతన్యులకు జేరెను. ఆ మహనీయు లిరువురు నేకాంతప్రదేశమును జేరి ఆధ్యాత్మిక విషయములను ముచ్చటింప బ్రారంభించిరి. రామానందుడు మహాపండితుడు. భక్తిబోధక గ్రంథములు—శ్రీమద్భగవద్గీత, పురాణములు, ఉపనిషత్తులు—చక్కగా జదివినవాడు. కావున ఆయన భక్తియు జ్ఞానము పరిశీలింపదలంచి శ్రీ చైతన్యులు అతనిని బహువిధముల బ్రశ్నించిరి. అందొకటి:-

శ్రీకృష్ణచైతన్యులు —సాధ్యసాధనల గూర్చి శాస్త్రము లేమనుచున్నవి?

రామానందుడు —విష్ణుపురాణమున నిట్లు వచింపబడియున్నది—నీ వర్ణాశ్రమోచిత ధర్మము ననుసరించి పరమాత్ముడగు విష్ణువు నారాధింపుము. ఆ జగన్నాథుని సంతుష్టిచేయునది అంతకంటె వేఱొండు లేదు.

శ్రీకృష్ణచైతన్యులు —ఇది బహిరంగసాధన. ఇంతకంటె శ్రేష్ఠమైనదానిని వచింపుము.

రామా :— సకలకర్మఫలములను శ్రీకృష్ణున కర్పించుటవలన మనము 'పరాభక్తిని' బడయగలమని శ్రీమద్భగవద్గీత యెలుగెత్తి చాటుచున్నది.

శ్రీకృష్ణచైతన్యులు — ఇదియును బహిరంగ సాధనయే. దీనికంటె నుత్తమమైన దానిని దెలుపుము.

రామా — 'పరాభక్తి'ని బడయుటకు 'సర్వధర్మముల బరిత్యజించి నన్నే యాశ్రయింపుము. నేను నిన్ను రక్షింతును' అని శ్రీకృష్ణభగవానుడు వచించియున్నాడు.

శ్రీకృష్ణచైతన్యులు — ఇంతకన్నను శ్లాఘ్యతరమైన దేదియైనను గలదా?

రామా.—జ్ఞానమువలన లభించు నమ్మకమే ఉచ్చతరమైన భక్తి.

అందులకు శ్రీకృష్ణచైతన్యులు సమ్మతింపరైరి. కావున రామానందరాయలు మఱల ఇట్లు పలుకదొడంగిరి జ్ఞానముపై నాధారపడక భగవంతునియందు సహజముగా ఉత్పన్నమగు భక్తియే 'పరాభక్తి'. భాగవతమున బ్రహ్మ ఇట్లు ప్రవచించియున్నాడు: ప్రభూ! ఈ విశ్వమున నిన్ను గనుగొనుట మిక్కిలి కష్టసాధ్యము. అయినను శాస్త్రజాలమున నడుగిడక గృహమునందే యుండి నీపురాణములవినుచు నిన్ను సంపూర్ణముగా మనఃప్రాణములతో స్వీకరించువారివలననే నీవు గ్రహింపబడుదువు. వారికే నీ పవిత్రదర్శనము నొసంగుదువు. *

శ్రీకృష్ణచైతన్యులు —నిజమే. ఇదియును

---

* క. విజ్ఞానవిధము లెఱుఁగక, తజ్ఞులు నీవార్తఁ జెప్పఁదను వాఙ్మనముల్
యజ్ఞేశ నీకు నిచ్చిన, యజ్ఞులు నిను బట్టి గెలుతు రజితుఁడవైనన్.

క. నిజముగ నిన్నెఱుఁగఁగ్రమమున; నిజవాంఛలు నిన్నుఁజేర్చి నీకథ వినుచున్
నిజకర్మలబ్ధభక్తిన్, సుజనులు నీ మొదలిటెంకిఁ జొచ్చిరధీశా

ఆంధ్రభాగవతము, దశమ, పూర్వభాగము 550-52.

అంతగా గొప్పదికాదు. దీనిని మించినది వేఱే దైనను గలదా?

రామా — 'ప్రేమభక్తి'యే మిక్కిలి శ్రేష్ఠమయినది. ఆకలిదప్పు లున్నంతవఱకే మనము ఆహారమునకై ప్రాకులాడుచుందుము. అవి తీరినంతట మనమనస్సు ఆహారమువైపు నకు జనదు. భక్తుడు బహిరంగసాధనల నెంతో కాలము ఆశింపడు. అతడు ఆశించునది 'భగవత్ప్రేమయే.'

కృష్ణప్రేమతో హృదయమును పరిపూర్ణము గావింపవలయును.

భగవన్నామస్మరణవలన సామాన్యులెల్లరు పావనులగుదురు, అట్టియెడ భగవద్భక్తులకు దుర్లభమయినదేది?..... '

ఇట్లు పలికి రామానందుడు శాంత, సఖ్య, దాస్య, వాత్సల్యాది భావములనెల్ల వర్ణించి తుదకు 'మధురభావమే అన్నిటికంటెను మహత్తరమయినది. రాసక్రీడయందు భక్తులకు భగవానుడొసగిన ఆనందము లక్ష్మీదేవికి సయితము అలభ్యము' అని వచించెను.

శ్రీకృష్ణచైతన్యులు.—ఇదియెంతయు సమ్మతింపదగినది. దీనిని పరిపూర్ణముగా విన కుతూహలపడుచున్నాడ. కాన దీనినే విపులముగా విశదీకరింపుము.

తదనంతరము 'శ్రీరాధాకృష్ణప్రేమ'ను గూర్చి వివరించుచు శ్రీరామానందుడు ఆదివ్యప్రేమ కామముకంటెఉచ్చతరమయినదనిసహేతుకముగా నిరూపించెను. ఇట్లు భక్తినిగూర్చి ప్రసంగించుచుండ రాత్రి కడచెను. తెల్లవారుటయు రామానందుడు శ్రీచైతన్యులకు నమస్కరించి తన వీట పదిరోజులుండవలసినదిగా ప్రార్థించి, తన నివాసమునకేగెను. ఈ పది దినములును వీరిరువురు భాగవతప్రసంగములు గావించుచు ఆనందముగ ప్రొద్దుపుచ్చుచుండిరి. ఒకనాడిట్లు భగవద్విషయమునుగూర్చి మాట్లాడుచుండ, శ్రీకృష్ణచైతన్యుల స్థానమున (శ్రీచైతన్యులకుమారుగా) మురళీధరుడైన శ్రీకృష్ణభగవానుడే శ్రీరామానందులకు గోచరించెను. అందులకు బ్రహ్మానందమునంది రామానందుడు 'మహాత్మా! నీవే నాయెడ కీరూపమునవచ్చి నేటికి దర్శనమొసగితివా?' యని పలికి పరిపరి విధముల భగవానునకు నమస్కరించెను. శ్రీకృష్ణచైతన్యులు ఆతనిని లేవదీసి కూర్చుండబెట్టి 'నీవు పలుకుచున్న పలుకులేవి?' అని యడిగి 'శ్రీకృష్ణసందర్శనోత్సవము'ను ఆతనినోరార పలికించి విని యిట్లు పలుకనారంభించిరి

'నీభక్తి పరిపక్వము చెందినది. అట్టిస్థితి యందు భక్తుడెల్లెడల తనయిష్టదైవమునే కనుగొనును. ఈ లౌకికప్రభుత్వము నీకేల? దీనిని వదలి పూరీక్షేత్రమునకు బొమ్ము, నేనుగూడ కొంతకాలమున కచటికే తెంతును,' అని పలికి ఆలింగనము కావించుకొని వీడ్కొలిపెను.

ఇట్లు రామానందుల ననుగ్రహించి శ్రీకృష్ణచైతన్యులు దక్షిణదేశమునందలి వివిధ పుణ్యక్షేత్రముల దర్శింప బయలుదేరిరి. మంగళగిరి, అహోబిలము, తిరుపతి, కాంచీపురము, శ్రీరంగము, మధుర, షియాళి, కుంభకోణము, తంజావూరు మున్నగు క్షేత్రముల దర్శించి పశ్చిమతీరమునగల అనంతపద్మనాభక్షేత్రమున తిరువట్టూరు జనార్దనస్వామి క్షేత్రము, బొంబాయిరాష్ట్రమునగల పండరీపురము, నాసిక, దునుష్తీర్థము మున్నగువానిని దర్శించి మఱల పూరీక్షేత్రమును జేరిరి. అచ్చట కొన్నిమాసములు గడిపిరి. పిదప మఱల వంగదేశమునకు బయలుదేరి 'పానీహాటీ', 'రామ్‌కేళీ' మున్నగు

క్షేత్రములజూచిరి. పోయిన చోట్ల నెల్ల వీరి కృష్ణ భక్తి ప్రేక్షకుల నెల్ల ముగ్ధులగావించెను. ఎందఱో భక్తులు వైష్ణవమతమును స్వీకరించి హరి నామసంకీర్తనమునందు ఆ మహాభక్తునితో పాల్గొనుచుండిరి.

శ్రీకృష్ణచైతన్యులు వంగదేశమును జేరిన విషయమును విని శచీదేవి ఆభక్తాగ్రగణ్యుని గలిసికొని బ్రహ్మానందమునందెను. శ్రీకృష్ణ చైతన్యులు రామకేళీయందుండగా ఒకనాడు ప్రభుత్వోద్యోగులగు రూపసనాతను లిరువురును వీరి శిష్యత్వమును స్వీకరించిరి. అందుండి మఱల శ్రీచైతన్యులు పూరీక్షేత్రమున కేగి నాలుగుమాసములుండి పిదప నుత్తర దేశాభిముఖులై ప్రయాణముసాగించిరి. వారు కాశీయందుండగా నొక సన్న్యాసిని కలిసి కొనిరి. ఆ సన్న్యాసి శ్రీచైతన్యులనుజూచి 'నీవు సన్న్యాసధర్మమునువదలి, ఉన్మత్తునివలె ప్రలాపించుచున్నావేల' యని ప్రశ్నించెను. అందులకు శ్రీచైతన్యు లిట్లు ప్రత్యుత్తర మొసగిరట ''నేను మూర్ఖుడనని తెలిసియే నా గురువులు 'నీకు వేదాంతమునందధికార మావంతయు లేదు. కలియుగమున నామజపముననే సారముగలదు. నీవు శ్రీకృష్ణనామ జపము గావింపుము' అని నన్నాజ్ఞాపించిరి. అందువలన నాగుర్వాజ్ఞనే యనుష్ఠించుచున్నాడను.'' ఇట్లు పలికి శ్రీకృష్ణభక్తినిగూర్చి విపులముగా వివరించి చెప్పగా యతీశ్వరుడు ముగ్ధుడై శ్రీకృష్ణ నామ సంకీర్తనమున బాల్గొనెను.

అచ్చటనుండి శ్రీచైతన్యులు మధురాపురమునుజేరిరి. ఆ కాలమున మధురయు బృందావనమును నామమాత్రావశిష్టములై శ్రీకృష్ణ లీలాప్రదేశములు మృగ్యములై యుండెను. శ్రీకృష్ణలీలయే రూపొందిన శ్రీకృష్ణచైతన్యులకు భగవానుడు లీలామానుషుండై క్రీడించిన స్థలములెల్ల స్పష్టముగ గోచరించెను. కావున శ్రీచైతన్యు లాయాస్థలములను భక్తులకు జూపిరి. శ్రీకృష్ణపరమాత్ముడు క్రీడించిన స్థలమగుటవలన బృందావనమును జేరుటయు వీరి భక్తి ఉచ్చస్థితినందెను. వీరి ప్రభావమునువిని చుట్టుపట్ల గ్రామవాసులెల్లరు గుంపులుగుంపులుగా వారిని జేరుచుండిరి. నానాటకి వారిని జేరుచున్న ప్రజాసమూహము హెచ్చగుచుండెను. ఇక నచ్చటనివసింపవలనుపడదని తలచి శ్రీచైతన్యులు మగలప్రయాగకాశీలనుదర్శించి పూరీక్షేత్రమును చేరిరి. ఈపరి వారి కృష్ణవిరహము ఉచ్చస్థితినందెను. ఇట్టి ఉచ్చావస్థయందు వారికేమాత్రము శరీరస్పృహ యుండెడిదికాదు. ఒకానొక పూర్ణిమనాడు సముద్రమునుజూచి 'ఆహా! ఇదిగో యమునానది' యని పలుకుచు నందు దుమికివైచిరి. కాని వారొక వలలో బడుటవలన జాలరు లాయనను బయటికి దీసిరి.

ఇట్లు నిరంతరము శ్రీకృష్ణ విరహమున నున్మత్తులైయుండు శ్రీకృష్ణచైతన్యులు క్రీ.శ. 1455 సంవత్సరము ఆషాఢమాసమున ఒకనాటి రాత్రి యెచటికో వెడలిపోయిరి. వారి శిష్యులు ఎంతగా వెదకినను కనుపింపరైరి.

వీరి అర్ధాంగలక్ష్మి విష్ణుప్రియ తనజీవిత పర్యంతము శ్రీచైతన్యుల పాదుకలను బూజించుచు తన జీవితమును సార్థకము కావించెను. వంగదేశమున శ్రీకృష్ణభక్తికి ప్రాణము గల్పించి ప్రచారముగావించిన శ్రీకృష్ణచైతన్యుల సంక్షేప జీవితచరిత్రము పాఠకలోకమునకు భక్తిభిక్ష నిడుగాక!

శ్రీకృష్ణచైతన్యులు ఉపన్యాసములమూలమునగాక శ్రీకృష్ణలీలా సంకీర్తనముద్వారా

ప్రజలలో భక్తిభావము సముద్భవిల్లునట్లు గావించి తమమతమును వ్యాపింపజేసిరి. వారి ప్రచారము జయప్రదమగుటకు వారి ప్రేమయే ముఖ్యకారణము సాధారణముగా మనుజులెల్లరు సౌందర్యము, మాధుర్యము, ప్రేమ, ఆనందము—వీనిని అభిలషింతురుగదా! శ్రీకృష్ణచైతన్యులో భగవానునియందలి యీ యంశములను మాత్రము ఎక్కువగా విశదీకరించుచు భగవత్సాక్షాత్కారమువలన వీనినన్నిటిని మనము పొందగలమని బోధించెడివారు. శ్రీచైతన్యమతము ననుసరించి బ్రహ్మయు, శ్రీకృష్ణుడు— నొక్కటియే వాసుదేవుడు, శివుడు, విష్ణువు—వీరందరును శ్రీకృష్ణుని రూపములే. శ్రీకృష్ణుడే పరబ్రహ్మము. తన్నుతాను మఱచి తనయిష్టదైవమునకు సంపూర్ణాత్మార్పణము గావించుకొనుటయే భక్తిలక్షణము. అదియే భక్తుల హృదయమును కరగింపగలదు. మనస్సునందలి మాలిన్యమునంతయు దొలగించును. ఇట్టి 'పరాభక్తి'కి బృందావనమునందలి 'గోపికాభక్తి'యే ఆదర్శము. అందు కామభావ మిసుమంతయు నుండదు. ఇందు మహాభావము అత్యంతోన్నతము. ఇది శ్రీరాధయందు సంపూర్ణముగా గోచరించుచుండెడిది. ఈ భావమున రాధ శ్రీకృష్ణసందర్శనమాత్రముననే ఐక్యతానందమును బడసెడిది. కావున శ్రీకృష్ణమాధుర్యమును రాధ సదా యనుభవించుచుండెడిది. ఇట్టి యానందము శ్రీకృష్ణునకుసయితము కలిగెడిదికాదు. శ్రీరాధాకృష్ణసమ్మేళనమే శ్రీకృష్ణచైతన్యుల భావము.

ఇంద్రియములన్నియు బహిర్ముఖములై విషయసుఖములయెడకు వారల నీడ్చుకొనిపోవుచున్నవి మనము వీనినన్నిటిని బంధించి, భగవదున్ముఖములుగావించి భగవత్సాక్షాత్కారానందమును బడయగోరవలయును. ఇది యెన్నియోసాధనలవలనగాని గలుగదు. అందు ముఖ్యమైనది నామజపము. సతతము భగవన్నామజపము చేయుటవలన మానవుడు తన మనస్సును భగవదున్ముఖము గావింపగలడు. అంతియకాక భక్తులతోకూడి మనుట, శ్రీకృష్ణలీలను గూర్చి ఆలోచించుచుండుట,—ఇవి మనస్సును పరిశుభ్రపఱచును. శ్రీకృష్ణలీలలను ప్రసంగించుట, వినుట, శ్రీకృష్ణలీలాక్షేత్రమయిన బృందావనమున నివసించుట, శ్రీకృష్ణవిగ్రహమును ఆతనిగనే భావించి పూజాధ్యాన జపాదులు గావించుట—ఇవన్నియు అనుసరింపదగినవి. తాను గావించుచున్న కార్యములన్నియు శ్రీకృష్ణుని యెట్టయెదుట చేయుచున్నట్లు భావింపవలయును. ఇంతియకాక, వైష్ణవుడు తన జీవితాంతము పరదూషణము, లోభము, అభిమానము—వీనిని వదలి సంయముడై నిరాడంబర జీవనమును గడుపవలయును.



# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిశ్శరణమ్

శ్రీమాన్ శ . . . .

నీయుత్తరముజూచి యెంతయో సంతసించితిని. నీకు గలిగిన భగవద్వ్యాకులము, సాధక జీవనోత్సాహము నశింపకుండుగాక! ఔన్నత్యమున కన్నుంచి, భగవల్లాభమువలన జీవితమును సార్థకము గావించుకొనుటయే మానవులకెల్ల రకు నత్యంతావశ్యకమగు కర్తవ్యము. సాధక జీవితమునందు నీకు గలిగిన తీవ్రాభిలాషను ముముక్షుత్వమును జూచి నేనెంతయో సంతసించుచున్నాను. భగవానుడు నీకు మనోబలము నొసగుగాక! ఇందులకై నేను ఆ పరమాత్మ నత్యంత వినయ వినమితుడనై ప్రార్థించుచున్నాడను. జితేంద్రియత్వ మత్యంత కష్టతరము. కాని తదన్యమార్గ మెయ్యదియును లేదు. 'ఏ యింద్రియమును ప్రప్రథమమున వశపఱచుకొనవలయు'నని ప్రశ్నించితివి. శ్రీకృష్ణభగవానుడు సకలేంద్రియములను వశపఱచుకొనవలయుననియే వచించియున్నాడు.

శ్లో॥ తాని సర్వాణి సంయమ్య
యుక్త ఆసీత మత్పరః
వశే హి యస్యేంద్రియాణి
తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.* గీత 2-61

కాలని మంటికడవలోని నీరు మన యెఱుక లేకయే కారిపోవు చందమున మనకు లభించిన జ్ఞానమెల్ల ఆ యింద్రియముద్వారా హరింపబడునని మనువు వచించియున్నాడు.

శ్లో॥ ఇంద్రియాణాంతు సర్వేషాం
యద్యేకం క్షరతీంద్రియం
తేనాస్య క్షరతి ప్రజ్ఞా
దృతేః పాత్రాదివోదకం.

మనుస్మృతి-2-99.

కావున సకలేంద్రియములను జయింపవలయును. కాని యింద్రియములన్నియు సమాన బలీయములే యయినను జిహ్వోపస్థలే యెల్లరును ప్రధానముగా గణింపదగినవి. శ్రీమద్భాగవతమునందుగూడ సర్వేంద్రియజేతయయ్యు రసనేంద్రియమునకు వశుడయ్యేనేని వాడు జితేంద్రియుడు కాజాలకపోవుటను, శ్లో. తావజ్జితేంద్రియో నస్యాత్ విజితాన్యేంద్రియః పుమాన్, నజయేత్ రసనం యావత్ జితం సర్వం జితే రసే ..మున్నగువానివలన దెలుపబడియున్నది. కావున రసనేంద్రియమును జయించుటయే ప్రధానకర్తవ్యము. ఐనను ఈ విషయమును శ్రీకృష్ణభగవానుడు వేఱువిధముగా అనుగ్రహించియున్నాడు.

శ్లో॥ విషయా వినివర్తంతే
నిరాహారస్య దేహినః,
రసవర్జం రసోఽప్యస్య
పరందృష్ట్వా నివర్తతే గీత-2-59

కఠిన నియమముల ననుసరించి ఆహారాదుల త్యజించి ఉపాసనాదికము గావించినచో విషయములు మనల వీడిపోవచ్చును. కాని విష

---

* యోగి ఇంద్రియముల నన్నిటిని నియమించి, సమాహితుడై, ఆత్మస్థుడై ఉండవలెను. ఏమన ఎవని ఇంద్రియములు వశీభూతములైనవో ఆతని ప్రజ్ఞయే ప్రతిష్ఠితము; అతడే స్థితప్రజ్ఞుడు.

యాసక్తి మాత్రము మనలను పూర్తిగా విడువజాలదు. భగవద్దర్శనలాభమువలన మాత్రమే యీ విషయతృష్ణ నశింపగలదు. శ్రీరామకృష్ణు డిట్లు వచించువాడు 'పటికబెల్లపు పానకము పుచ్చుకొన్నవానికి బెల్లపు పానకము రుచింపదు.' అనగా భగవత్ప్రేమ కలిగిన పిదప విషయసుఖములు తుచ్ఛములై కనుపించును. తూర్పునకు వెడలిన కొలదియు పడమటి దిక్కు నీకు దూరస్థమగుచుండును. అట్లే నీవు భగవత్సాన్నిధ్యమున కేగుకొలదియు విషయములు అంతంతకు వెనుకబడుచుండును. అందులకై నీవావంతయు ప్రయత్నింప నవసరము లేదు. ఇదియే అభివృద్ధిసూచకము. భగవద్భజనయందు నీవు పాల్గొనవలయును. ఇంద్రియజయమునుగూర్చి నీవేమియు ప్రయత్నింప నవసరములేదు. అవి తమంతట తామే నీకు లోనగును.†

భగవద్భజన యనగా మఱి యేమియో కాదు. తనుమన ప్రాణములన్నియు సంపూర్ణముగా భగవదర్పణము గావించుటయే. అన్నిటికంటెను వరణీయుడు భగవంతు డొకడే. ఆయన సన్నిధికే సంపూర్ణ మనస్సు ఆకర్షింపబడవలయును. ఆయనయెడ నాకు పరిపూర్ణ ప్రేమ జనింపదయ్యెగా యని వ్యాకులత నందినచో ఆయనయే మనకు భక్తిభిక్ష పెట్టును. ఆయన కృపయే అత్యంతావశ్యకము. ఆయన కృప లేనిచో నేదియును జరుగనేరదు. 'తనకొఱకై మనమొక యడుగిడిన మనయెడకు శతపథముల నిడు దయాళువు భగవాను'డని శ్రీరామకృష్ణ గురుదేవుడు వచించుచుండును. ఇదియే మనకు పట్టుగొమ్మ. త్రికరణశుద్ధిగా ఆయనను ప్రేమింప బ్రయత్నింపుము. అప్పుడే భగవంతు డెట్టి కరుణామయుడో నీవు తెలియగలవు. అన్నవస్త్రములవంటి స్వల్పవిషయములయందలి ఆసక్తివలన నెట్టి ఘోరదోషము కలుగజాలదు. పథభ్రష్టత కలుగబోదు. కాని ఎల్లప్పుడు విచారబుద్ధి ఆవశ్యకము. భగవదన్యవిషయములం దభిరుచి కలుగనియట్లు జాగ్రత్తపడవలయును. సత్సంగము, సత్పఠనము, (భగవద్విషయములుగల గ్రంథపఠనము) దుస్సంగమునకు దూరుడగుట—ఇవన్నియు భక్తిని గల్గించుటయందు ముఖ్యములయినవి. ఇట్లు భగవత్పథమున పురోగమించుకొలది నీకెట్టి భయమును కలుగజాలదు. ఆయన శరణుజొచ్చిన ఎల్లశోకములు, కష్టములు, దుశ్చింతనలు పటాపంచలు కాగలవు. మనము వానినుండి ముక్తులము కాగలము.

'తత్ప్రసాదాత్ పరాం శాంతిం
స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్.' ‡

ఇక నే చెప్పవలయునది యేది కలదు. భగవచ్ఛరణాశ్రయము లభించెనేని పరమానందమును నందగలవు. నా ప్రేమపూర్వకాశీర్వాదములను గ్రహింపుము.

ఇట్లు,
నీ శ్రేయోభిలాషి,
శ్రీ తురీయానంద

---

† ఇంద్రియముల ద్వారమున విషయముల గ్రహింపని కఠోరతపస్వినుండి విషయములు నివృత్తములగును కాని అతని విషయతృష్ణ ఉపశమింపదు; మఱి ఆత్మసాక్షాత్కారమైనచో విషయతృష్ణగూడ విలీనమైపోవును.

‡ ఆయన కృపవలన నీవు శాశ్వతమయిన, పరమశాంతిస్థానమును బడయగలవు.

# గ్రంథ సమీక్ష

## ఛాయ

సంపాదకులు డాక్టర్ డి. సూర్యభగవానులు. డబుల్ క్రౌను 1/16 సైజు 20 పుటలు. వెల 0-1-0. ప్రాప్తిస్థానము 'ఛాయ' కార్యాలయము, 131, తిరువత్తియూరు హైరోడ్డు, చాకలపేట, మదరాసు.

ఇది సచిత్ర మాసపత్రిక. తొలిసంచిక ఈ ఆగష్టు 15 న సనాతన వైజ్ఞానికసూత్రమున అధునాతన జీవనరహస్యరత్నములఁగూర్చి స్వాతంత్ర్యప్రియుల కర్పింపబడినది. ఇందు 'మహత్తర శక్తిగల పత్రిక నిష్కళంక నిర్మల పథాలలో - ప్రజావృద్ధినే దృష్టిలో ఉంచుకొని నడవడం.. అవసరం. ఇది నూసంకల్పం.'—అని పరిచయవాక్యమున సంపాదకులు దెలిపియున్నారు. ఈ దృఢసంకల్పానుగుణముగా పత్రిక దినదినాభివృద్ధినంది లోకక్షేమమునకై పాటుపడుగావుతమని తలంచుచున్నాము.

## మానవుడు దానవుడా ?

రచయిత. శ్రీ నోముల అప్పారావు. డబుల్ క్రౌ 1/16 సైజు (160 + 8) పుటలు. వెల రూ. 0-10-0. వలయువారు నోముల అప్పారావు, కాకినాడ, తూర్పు గోదావరిజిల్లా యని వ్రాయవలయును.

ఇది సరసమయిన వచనగ్రంథము. ఇందు గ్రంథకర్త భూతహింసాత్మకమగు కర్మము సర్వము మానవుని దానవుని జేయుచున్నదని వివరించుచున్నారు. మానవుడు వివిధమార్గముల నాచరించు భూతహింస చక్కగా వివరింపబడి తన్నివారణమే శ్రేయోదాయకమని బోధింపబడినది. ఆచారము, వ్యవహారము విజ్ఞానసముపార్జనము మున్నగు విషయముల యందలి హింస కన్నులగట్టినట్లు వివరింపబడినది, నాస్తిక్యము ఖండింపబడి ఆస్తిక్యము ప్రబోధింపబడినది. ఈ గ్రంథపఠనమున పారకులు వివిధవిషయముల దెలియగలరు.

## కర్మయోగశాస్త్ర సంగ్రహము

రచయిత : కీ. శే. శ్రీ తెలికెపల్లి సుబ్బరామయ్య. డబుల్ క్రౌ 1/16 సైజు (48 + 8) పుటలు. వలయువారు టి.యస్.వాస్, ఆధ్యక్షంవారివీధి, నెల్లూరు అని వ్రాయవలయును.

ఇది కర్మయోగమును సంగ్రహముగ వివరించుచున్న చిన్న వచనగ్రంథము. శైలి తేట తెల్లమై ఆబాలగోపాలము చదువననువైనదియైయున్నది. కీ. శే. శ్రీ బాలగంగాధరతిలక్ గారి గీతారహస్యమును సంపూర్ణముగా చదువ నవకాశము అనేకులకు లభ్యముకాదని యందలి ముఖ్యాంశముల సారాంశమును మాత్రము గ్రంథకర్త ఈరూపమున వెలువరిచెను. ఇది యెల్లరును పఠించి యనుష్ఠింపదగిన దివ్య గ్రంథము.

## కుందమాల

### (తృతీయ ముద్రణము)

రచయిత శ్రీ బులుసు వేంకటేశ్వరులు, బి.ఏ. డబుల్ క్రౌన్ 1/16 సైజు (16 + 104 + 14) పుటలు. వెల రూ. 2-8-0. వలయు వారు, బులుసు వేంకటేశ్వరులు, బి ఏ, రావూరావుపేట, కాకినాడ అని వ్రాయవలయును.

ఇది దిఙ్నాగుని సంస్కృతకృతి కాంధ్రీకరణము. సలక్షణము సరసపదపూరితమునగు నాటకరాజము. ఇందాఱంకములుగలవు శైలి నాతికఠినము. విద్యార్థుల యుపయోగార్థమిందు లఘుటీకయు జేర్పబడియున్నది.

మచ్చునకు ·

చ పదసమవస్థితిం గనినఁ
ప్రస్ఫుటమౌ రచనంబుఁ గన్గొనన్
విదితము లయ్యె నే మటి య
వే కమలాంచిత పాదరేఖ ల
య్యదె తిలకంబు చారువు న
నంత విచార విశీర్ణమైన నా
యెద హరియించెఁ జూడఁగనె
యియ్యది దేవి పదాళియే యగున్
తృతీయాంకము ౧౧.

## వేదాంతమునకు సూటి బాట

అనువాదకర్త శ్రీరామకృష్ణయ్య. డబుల్ క్రౌన్ 1/16 సైజు (4 + 64) పుటలు. వెల రూ. 0-12-0 ప్రాప్తిస్థానము భూమానందాశ్రమము, గండిక్షేత్రము, వేంపల్లె పోస్టు, కడప జిల్లా.

ఇది వివిధాధ్యాత్మిక గ్రంథముల సారము. ఏతత్ గ్రంథపఠనమున పాఠకలోకము వేదాంతమన నెట్టిదో కొంతకు కొంతయైన గుర్తెఱుంగకపోదు. భగవల్లాభమునకువలయు మార్గము లెల్ల సూక్ష్మముగ నిందు వివరింపబడియున్నవి. 'సర్వంఖల్విదం బ్రహ్మ' 'తత్త్వమసి' త్యాది వాక్యములు విపులముగ నిందు వివరింపబడియున్నవి.



# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౭ | సంచిక ౩

విషయ వివరణము

# శ్రీ రామకృష్ణ ప్రభ

## చందాదారులకు

౧. పత్రిక ప్రతిమాసము 20-వ తేదీన వెలువరింపఁబడును. ఒక వారము, పదిరోజులు గడచి ప్రతి మీకు అందకపోయినయెడల ఉత్తరము వ్రాయుఁడు.

౨. సంవత్సర చందా రు. 3 లు మాత్రమే. జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని చందాదారులుగఁ జేరవచ్చును. విడిప్రతి రూ. ౦—౬—౦ లు. హిగిన్‌బాథంస్ వారి స్టాలులలోఁగాని, మీ పత్రిక ఏజెంటును గాని అడుగుఁడు.

౩. ఉత్తర ప్రత్యుత్తరములు వీలైనంతవఱకు ఇంగ్లీషున వ్రాయుచు మీ చందాదారు సంఖ్య నుదాహరింపుఁడు. ఉత్తరములను “మేనేజరు, శ్రీరామకృష్ణప్రభ” అను చిరునామాకు వ్రాయుఁడు.

౪. చిరునామాయందు ఏట్టిమార్పు గలిగినను 10-వ తారీఖునకు ముందుగా మా కార్యాలయమునకుఁ దెలుపవలయును. లేనిచో, పత్రిక పూర్వపు చిరునామాకే పంపఁబడును.

## వ్యాసకర్తలకు

౧. కేవలము నైతిక ధార్మిక వైజ్ఞానిక విషయకములైన వ్యాసములేకాక, సాహిత్యమునకును కవిత్వమునకును సంబంధించిన ఏ వ్యాసములైనను బంపవచ్చును. సులభ సుందరమగు గ్రాంథిక భాషలో వ్రాయవలయును.

౨. వ్యాసములు అచ్చులో మూఁడు పుటలకు మించరాదు. ప్రతినెల ఒకటవ తేదీకి వ్యాసములు మాకు అందవలెను.

౩. వ్యాసములను, విమర్శకుఁ బంపు గ్రంథములను, వినిమయముగఁ బంపెడి పత్రికలను “సంపాదకుఁడు, శ్రీ రామకృష్ణ ప్రభ” అను చిరునామాకు వ్రాసి పంపవలెను.

౪. వ్యాసము తిరుగఁ బంపఁబడవలయునచోఁ దగు పోస్టేజి చేర్చి పంపవలయును.

---



# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౭ } ౧౯౫౦ సెప్టెంబరు - వికృతి - భాద్రపదము { సంచిక ౩

## ప్రార్థన

### భక్తి శతకము

శ్రీరామచంద్రకవిభారతి

శ్లో. త్రిభువన మసకృన్నిరుప్య యుష్మత్
పద సరోరుహ రేణు మాశ్రితోహమ్।
శరణమయమయం చ దైవతమ్మే
గతిరపరా మమ నాస్తి నాస్తి నాస్తి॥ 9

త్రిభువనములను తలచి తలచి పరిశీలించి నీ పాదపద్మధూళిని ఆశ్రయించితిని, అదే నాకు శరణము, అదే నాకు దైవతము, వేరుగతి లేదు, ముమ్మాటికిని లేదు.

శ్లో. భో వీతరాగ భగవన్ తవ పాదమేవ
వన్దే మునీంద్ర ముహురేవమిమం ప్రపన్దే
భూయః పునః పునరిమం పురతః పరస్తాత్
పార్శ్వద్వయోరుపరి దిక్షు విదిక్షు వన్దే॥ 10

ఓ ప్రభూ! రాగాదిద్వేషములను జయించినవాడా! ఓ దేవా నీ పాదములకే నమస్కరించుచున్నాను. ఓ మునీంద్ర! తిరిగి తిరిగి అనేకపర్యాయములు నీ పాదములకే నమస్కారములు. నీముందు, వెనుక, అన్ని ప్రక్కల శిరస్సుమీద నలుదిక్కుల అన్నిమూలల నమస్కారముచేయుచున్నాను.



ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ

# శ్రీ రామకృష్ణ వచనామృతము — 'మ.'

సోమవారము, 25 జూన్, 1883.

శ్రీరామకృష్ణ గురుదేవుడు నేడు కలకత్తా లోని బలరామ్‌బోస్ గృహమున కేతెంచెను. అచట 'మ.' యు రాఖాలును వచ్చియుండిరి. సుమారు పదిగంటలకాలమయినది. శ్రీరామ కృష్ణ గురుదేవునకు భావావేశము కలిగెను.

(ఆ భావావేశముతో)

శ్రీరామకృష్ణుడు —అంతరంగిక భావముతో భగవానుని తలంచిన ఆయన సంపూర్ణ దర్శనమును (స్వస్వరూపదర్శనమును) బడయ వచ్చును. కాని విషయవాసన లెంతమాత్రము గలిగిన నా దర్శనమును అంతమాత్రము తగ్గుచుండును.

'మ.' :—చిత్తము. తమరు సెలవిచ్చినట్లు భగవానునియం దమూంతముగా నిమగ్నుడు కావలయును.

శ్రీరామ —(ఆనందమున) ఆ! అందఱకును ఒకవేళ గాకపోయిన నెప్పుడో యటిమొక సమయమున నయినను నాత్మసాక్షాత్కారము కలుగవచ్చును.

'మ.' —చిత్తము. కాని భగవానుడే కర్త. ఆయన మనలను తన సంకల్పానుసారమే నిలుపగలడు. కొందఱకు చైతన్యము కలిగించును. కొందఱ నజ్ఞానముననే నిల్పును.

శ్రీరామ —అట్లుకాదు. అత్యంత వ్యాకుల భావముతో భగవానుని ఆమంత్రింపవలయును. ఆంతరికముగ మన మాయనను దలచిన ఆయన తప్పక మన ప్రార్థనల నాలించును.

ఒకభక్తుడు —చిత్తము. నేను అనెడి జ్ఞానమున్నంతవఱకును ప్రార్థన చేయవలయును.

శ్రీరామ —('మ.' తో) భగవల్లీల నను సరించియే మెల్లమెల్లగా పరబ్రహ్మమును సమీపింపగలము. అది సౌధసోపానారోహణమును బోలినది. ఆ నిత్యవస్తుసాక్షాత్కారానంతరము భక్తులు మఱల భగవల్లీలలకు దిగిరావలయును. భక్తుడు భక్తియందే తనమనస్సును లీనము గావించును. ఇదియే నా చివరి సిద్ధాంతము.

భగవంతునకు బహురూపములు గలవు. ఆయన లీలలు నట్టివే—భగవల్లీల, దేవలీల, నరలీల, జగల్లీల మున్నగునవి. భగవానుడు యుగయుగములందు మనుష్యరూపమున నవతరించును. మనుజులకు ప్రేమభక్తి నేర్పుటయే ఈ అవతారోద్దేశము. శ్రీకృష్ణచైతన్యుల గంటివా! అది యొకానొక నిదర్శనము. అవతారముల మూలమున భగవంతుని ప్రేమ భక్తిని మన మాస్వాదింపగలము. ఈ లీల కంతమనునది లేదు. మనకు వలయునది ప్రేమయు, భక్తియు మాత్రమే. వలయునది క్షీరము మాత్రమే. కాని పాలు గోస్తనముల నుండియే వచ్చును. అవతారపురుషులు గోస్తనముల వంటివారు.

---

జూన్ మాసమున నొకానొక దినమున శ్రీరామకృష్ణ గురుదేవుడు దక్షిణేశ్వరాలయము మెట్లపై గూర్చొనియుండెను. నాడు ఎండ అపరిమితముగా నుండెను. కాన 'మ.' మంచుగడ్డ మున్నగువానిని దీసికొని గురుదేవుని సమీపించి వారి పాదముల చెంత గూర్చొనిరి. సంధ్యాకాలము దాపరించినది.

శ్రీరామ — "మణిమల్లికుని మరుమరాలి భర్త యిచటికే తెంచియుండెను. అతడొక పుస్తకమును * జదివెనట. దానినిబట్టి చూడగా భగవంతుడు సర్వజ్ఞుడు, జ్ఞాని యని గోచరింపదు. అయినచో ప్రపంచమున నింతటి దుఃఖమేల కలుగవలయును? జీవులకు మరణము నిశ్చయమయినయెడల వారిని పలువిధముల కష్టపెట్టి చంపుటలేల? అదియునుగాక ఏతద్గ్రంథకర్త "నేనే సృష్టికర్తనయినచో నింతకంటె ఉత్కృష్టమయిన ప్రపంచమును సృష్టించియుందును" అని వ్రాసియున్నాడు."

'మ.' ఏమియు ప్రత్యుత్తరమొసగక గురుదేవుని పలుకు లాలించుచుండెను.

శ్రీరామ — భగవంతుని దెలిసికొనగలమా! నేనుగూడ అపుడపుడు భగవంతుని మంచివానిగను, ఒక్కొక్కప్పుడు దుష్టునిగను దలంతును. ఆయన మనలను తన మహామాయయందు మగ్నులజేసియున్నాడు. కొన్నివేళల మనకు మెలకువ గలిగించును. మఱికొన్నివేళల నజ్ఞానమున ముంచును. ఒక్కొక్కప్పుడు అజ్ఞానము సంపూర్ణముగా మాయమగును కాని మరల అది మనల నావేశించును. నాచుతో నిండిన చెఱువున చిన్న యిటుకఱాయి వైచినంతనే నాచు విడిపోయి శుద్ధమయిన జలము కనుపించును. దేహబుద్ధి యున్నంతకాలము సుఖదుఃఖములు, జన్మమృత్యువులు, రోగశోకములు తప్పవు. ఇవన్నియు దేహసంబంధములే కాని ఆత్మసంబంధములుగావు. దేహము నశించిన పిదప భగవానుడు మనలను ఉచ్చస్థితికి దీసికొనిపోవచ్చును. ఇది గర్భవేదనానంతర సంతానలాభమువంటిది. ఆత్మజ్ఞాన లాభానంతరము సుఖదుఃఖములు మున్నగు ద్వంద్వములన్నియు స్వప్నములవలె గోచరించును.

"మనకేమి తెలియును? ఒకసేరు పాత్రమున పదిసేర్ల పాలిముడునా? ఉప్పుబొమ్మ సముద్రము లోతును గొలువబోయినచో మఱలి రాగలదా?"

సంధ్యయయినది. దేవాలయములందు దీపారాధన జరుగుచుండెను. శ్రీరామకృష్ణుడు తన గదిలోనికి దిరిగివచ్చి మంచమున గూర్చొని దేవీనామోచ్చారణము గావించుచుండెను. అపుడచట నెందఱో భక్తులు గుమిగూడియుండిరి. 'మ.' నాటిరాత్రి యచటనే విశ్రమింప దలచెను. కొంతసేపటికి ఒకభక్తునితో ప్రసంగించుటకై శ్రీరామకృష్ణ గురుదేవుడు గది నుండి బయటికివచ్చెను.

శ్రీరామ — "ఉషఃకాలమున మేల్కొని భగవద్ధ్యానము గావించుట చాల మంచిది. అట్లే సాయంకాలమునగూడ ధ్యానించుట శ్రేయస్కరము."

పిదప శ్రీ గురుదేవుడు సాకార నిరాకార ధ్యానముల నెట్లు గావింపవలయునో యన్న విషయమునుగూడ ఆ భక్తునకు వినుపించుచుండెను.

అనంతరము కొంతసేపటికి శ్రీ గురుదేవుడు పడమటిభాగమునందు గల గుండ్రనివసారాయందు గూర్చొనియుండెను. అపుడు సుమారు

* John Stuart Mill's Autobiography.

రాత్రి తొమ్మిదిఘంటలయినది. 'మ.' గురుదేవుని చెంత గూర్చొనియుండెను.

శ్రీరామ —('మ.' తో) ఇచటికి వచ్చువారి సందేహము లెల్ల తీరును. ఏమనియెదవు?

'మ.' —చిత్తమండి.

ఆ సమయమున ఒకానొక పడవ గంగలో పోవుచుండెను. పడవను నడుపువారు పాడుచు బోవుచుండిరి. ఆ పాటలను విని శ్రీ గురుదేవుడు భావావిష్టుడయ్యెను. శరీరమంతయు గగుర్పొడిచెను.

శ్రీరామ —('మ.' తో) నా శరీరము నంటిచూడుము. పులకరించుచున్నది.

బ్రహ్మము ఒక ప్రోతభావముగ విశ్వమంతయు వ్యాపించియున్నట్లు ఉపనిషత్తులయందు వివరింపబడియున్నది. అదియే యిపుడు శ్రీరామకృష్ణుని స్పర్శించుచున్నదా యని 'మ.' తలంచెను. కొంతసేపటికి శ్రీరామకృష్ణుడు మఱల మాట్లాడ బ్రారంభించెను.

శ్రీరామ —ఇచటికే తెంచువారెల్లరు కొంత సత్సంస్కారము గలవారై యుండవలయును గదా!

'మ.' —నిజమేనండి.

శ్రీరామ —అధరునకు సత్సంస్కారములు గలవు.

'మ.' —అందులకు సందేహమా!

శ్రీరామ —సరళస్వభావుడయినచో భగవానుని శీఘ్రము బడయనగును. రెండు మార్గములు గలవు, సత్ —అసత్తు. సన్మార్గము ననుసరించియే మనము చరింపవలయును.

'మ.' :—చిత్తము. దారమున నొకప్రోగు విడిపోయినను సూదినుండి దానిని దీసికొనజాలము.

శ్రీరామ —ఆహారమున నాలుక కొంకవెంట్రుక తగిలిన నోటిలోని ముద్దనంతయు గ్రక్కి వేయుదుము.

'మ.' —కాని భగవత్సాక్షాత్కారము నందినవారిని అసత్తేమియు జేయజాలదని మీరు ప్రవచించియున్నారు. జ్వలించుచున్న అగ్ని పచ్చి అరటిచెట్టును సయితము కాల్చునట్టిది ఆతని జ్ఞానము.

---

14 జూలై, 1883.

మఱియొకనాడు శ్రీరామకృష్ణ గురుదేవుడు కలకత్తాయందలి అధరసేనుని గృహమునకు వచ్చియుండెను. ఆ యింట రాజనారాయణు డను గాయకుడు శ్రీ చండీదేవి గానమును ఆలాపించుచుండెను.

భావము

నేను నా మనస్సంతయు అభయప్రదములగు శ్రీ దేవీచరణములం దుంచితిని. నేనిక యముని కేల భయపడుదును కాళీనామ మను మహా మంత్రము నా ఆత్మ శిఖయందు బంధింపబడి యున్నది. నా శరీరము ప్రపంచమునకు విక్రయించి దేవీనామమును విలచి తెచ్చితిని కాళీ నామ కల్పతరువును హృదయమున ఆరోపించితిని ఇక యముడు వచ్చిన నా హృదయమును చెఱచి యది యెట్లు వృద్ధియగుచున్నదో చూపుదును దేహమునందలి షడ్రిపులను గొట్టి పాఱద్రోలితిని. జయ దుర్గా యని కేకలు వేయుచు సంసారసాగరము దాటుటకు సిద్ధపడితిని

శ్రీరామకృష్ణుడు పాటను వినుచు భావావిష్టుడై లేచి నిలువంబడెను, ఒక్కొక్కప్పు

డా గాయకునితో గలసి రెండుమూడు ముక్కలు పాడుచుండెను. హఠాత్తుగా సమాధిస్థుడై బాహ్యజ్ఞానమును గోల్పోయి ప్రతిమవలె నిలిచియుండెను. గాయకుడు మఱియొకపాట నారంభించెను.

దాని భావము

యుద్ధమునకు పూనుకొని వచ్చుచున్న ఈమె యెవరు? నీటితో నిండిన కారుమేఘమువలె నామె శరీరము ప్రకాశించుచున్నది. దంతము లన్నియు మిరుమిట్లుగొలుపుచున్నవి. పరువు లెత్తుచో వీడిన కచబంధమునందలి వెండ్రుకలన్నియు నలువైపుల ప్రసరించుచున్నవి. భయ మావంతయు లేక సురాసురుల యుద్ధమునందు దానవుల తన అట్టహాసముతో నట్టే నశింపజేయుచు నీ యుద్ధరంగమున ప్రవేశించుచున్న యీమె యెవరు? అందందు (మధ్యే మధ్యే) ప్రకాశించుచున్న తన శరీరకాంతివలన రణరంగమును ప్రస్ఫుటము గావించుచున్నది. ఆమె నొసటి చెమటబిందువు లెంతటి యందమును గూర్చుచున్నవి! ఆమె కచబంధముపై భ్రమరములు మూగాడుచున్నవి. చంద్రుడు సయితము ఆమె కాంతితో తులతూగజాలక ముఖమును ముడుగు పఱచుకొనియున్నాడు. ఈ మహామాయ యెవరో తెలిపెదవా! ఏమి ఐశ్వర్యము! శివుడు గూడ శవరూపమున నామె పాదతలమున బడియున్నాడు. కమలాకాంతుడుమాత్ర మామంచి గామినిని గుర్తింపగలుగుచున్నాడు. అది మఱి యెవరును గాదు. జగజ్జననియగు శ్రీ కాళికాదేవియే

పాట ముగిసినది. శ్రీరామకృష్ణ గురుదేవుడు సంపూర్ణముగా సమాధిస్థితుడయ్యెను.



శ్రీ శారదేశ్వరీయై నమః

# ధర్మ పరిశీలన

## విశ్వమత సిద్ధికి మార్గము

### శ్రీ వివేకానందస్వామి

(గతసంచిక తరువాయి)

మానవమానసములు వేర్వేరు తరగతులకుజెంది, వివిధరూపములు కలవియగుటచే, వాని విషయమున మతము లెంతటి ఘనకార్యమునకు బూనుకొనియున్నవో యిందువలన మనకు విశదమగుచున్నది. ఒకడేవో రెండు, మూడు సిద్ధాంతములను దీసికొనివచ్చి, తన మతము మానవజాతినెల్ల తృప్తిపఱుపజాలినదై యుండవలయుననుచున్నాడు. అతడొక చిన్న బోనును జేతబట్టుకొని, భగవంతుని జంతుప్రదర్శనశాల యనదగిన ప్రపంచమున బ్రవేశించి, "భగవంతుడును, ఏనుగయును, చివరకందరునుగూడ దీనిలోనికి బోవలయును. దీనిలోనికి బోవుటకు మన మేనుగును ముక్కలుక్రింద కోయవలసియున్నను, అది దీనిలోనికే పోవలసియున్న"దని యుద్ఘాటించును. ఇక నేవో కొలది సద్భావములుగల కులమునకు జెందిన జనులు బయలుదేరి, "మనుష్యులందరును మా కులములోనికి రావలసినవారే!" యని హెచ్చరింతురు. కాని, యంతమంది యుండుట కిది చాలదే!" యని మనమనవచ్చును. ఇందుకు, 'మీరిట్లనుకొనకుడు! ఎట్లైనను, తుదకు ముక్కలుక్రింద కోసిదైననను, వారిని దీనిలో బ్రవేశపెట్టుదు. వారిందులో జేరనిచో, వారికిక గత్యంతరమేలేదు సుడీ!" యని వారిసమాధానము. "మన మాటలు జనులు వినుటలేదే కారణమేమి?" యని శాంతముగ నాలోచించి, ప్రశ్నించుకొను మతబోధకుల నే నింతవరకెన్నడును జూచియుండలేదు. దీనికి మారుగ "ఈ జనులు దుర్మార్గు" లని వారు ప్రజలను దూషించి, శపించుచున్నారు. అంతేకాని, "జనులేల మనమాటలు వినుటలేదు? నేను వారిని సత్యమును గ్రహించునట్లేల చేయలేకున్నాను? వారి భాషలోనే నేనేలమాటాడజాలకున్నాను? వారికి నేను జ్ఞానోదయము కలిగింపలేక పోవుటకు కారణమేమి?" అని వారు తమంత తాము వితర్కించుకొని ఆత్మపరిశోధనజేసికొనరు. నిజముగా, వారికి తెలివితేట లింతవరకేయున్నవి. తమయుపన్యాసములను జనులు వినుటలేదని వారికి తోచినచో, అందుకు వారు తమ్ముతామే తిట్టుకొనవలయును. కాని, దోష మెల్లప్పుడును జనులదే! తమమతమును వారెన్నడును బహుజనావలంబమునకు వలయునంత సువిశాలమైనదిగ చేయుటకు బ్రయత్నింపరు.

ఈ విధముగ స్వల్పసంఖ్యాకులుగల ఒక మతశాఖ తానే సంపూర్ణవిశ్వమతవృక్షమునని చెప్పుకొనుటకు, ఒకానొక చిన్న పరిమితమైన మానవసమూహ మనంతత్వము తనహక్కుగ చెప్పుకొనుటకు, లోకములో నింత ప్రబల కార్పణ్యముండుట కేమికారణమో మనకిప్పుడతి సులభముగ బోధపడుచున్నది. దోష భూయిష్ఠమైన మానవమేధస్సునందుండి కడచిన కొలది శతాబ్దములలో పుట్టి, అనంతభగవత్సత్యము తమకు తెలిసినటుల గర్వోద్రేకముతో జెప్పుకొను చిన్న చిన్న మతశాఖలను గూర్చి యోచింపుము! అవి యెంత దురహంకారపూరితములో ఆలోచింపుడు! ఇందువలన మనుష్యులెంత గర్వాంధులో తేటతెల్లమగుచున్నది. ఇట్టి ప్రగల్భములింతవర కెల్లప్పుడు నిష్ప్రయోజనములై అంతరించుటలో, పరమేశ్వరుని కృపవలన నిటుతరువాతకూడ వాని కదేగతి యెల్లప్పుడును కలుగనుండుటలో ఆశ్చర్యమేమియును లేదు. ఈ విషయములో మహమ్మదీయులదే పైచేయి, వారొక అడుగుముందుకు వేసిరనిన, అదియెల్ల ఖడ్గమాహాత్మ్యమే– అనగా ఒకచేతితో ఖురానును, రెండవచేతితో ఖడ్గమును బట్టుకొని, "ఖురానును స్వీకరింపుము, లేనిచో నీకు చావు తప్పదు. ఇంతకంటె నీకు గత్యంతరమేదియు లేదుసుమా"యను పిడివాద తత్త్వ మాహాత్మ్యమే. ఈ మార్గమున వీరికెట్టి విశేష విజయము చేకూరెనో చరిత్రవలన మీకు తెలిసియేయున్నది. ఆరువందలయేండ్ల వరకు వారు నిరాఘాటముగా విజృంభించిరి. అప్పటికి వారాగవలసివచ్చెను. ఇటువంటి పద్ధతులవలంబించుచో, ఇతరమతములకుగూడ నిదే గతికలుగును. మన మింత శిశుప్రాయులము కదా! మన మెల్లపుడును మానవస్వభావమును మఱచిపోవుదుము. మనము జీవయాత్ర నారంభించునపుడు, మనకేదో మహాద్భుతదశపట్టునని యూహింతుము ఎవరేమి చెప్పినను మనకా నమ్మకము మాత్రము పోదు. కాని, వృద్ధులమైనప్పుడు మనము వేఱె విధమునతలంతుము. ఇది మతములవిషయమునగూడ నిజము. వానికి ప్రారంభదశలలో కొంచెము వ్యాప్తికలిగినప్పుడు, కొలదియేండ్లలో యావన్మానవజాతి మనోవైఖరిని తాము మార్చివేయగలమని భ్రమపడి దౌర్జన్యమున నితరులను తమమతములో కలుపుకొనుటకు జనులను తండోపతండములుగ హింసించి, చంపివేయుచుందురు. ఆప్రయత్నము విఫలమై, వారికి జ్ఞానోదయమగును ప్రారంభమందు వారు సాధింపదలచిన కార్యములయందు వారికి జయముకలుగలేదని మనము గ్రహించుచున్నాము. ఇది యెంతో శుభావహము. ఉన్మాదాభిమాన గ్రస్తములైన యీమతశాఖలలో నే యొకదానికిగాని విశ్వవిజయము లభించియుండినచో, నేటి మానవజాతిగతి యేమైయుండెడిదో యించుక ఆలోచింపుడు. వానికి జయము లభింపనందుకు, భగవంతునకు శతసహస్రకృతజ్ఞతాపూర్వక వందనములు! అయినను ప్రతిమతమొక మహాసత్యమునకు, ఒక విశేషప్రాశస్త్యమునకు ప్రత్యక్షస్వరూపము ఇది దానిప్రాణమని చెప్పవచ్చును. ఈ సందర్భమున నాకొక పూర్వ గాథ జ్ఞప్తికివచ్చుచున్నది పూర్వము కొందరు రాక్షసులు, జనులను చంపుచు, పలువిధములైన యుపద్రవము లొనర్చుచుండెడివారు. వారిప్రాణ మేపక్షులలోనో యుండెడిది. ఆ పక్షులు బ్రతికియుండునంతవరకు, వారి నెవరును చంపజాలరు. ఈ రహస్యమెవడైన గని పెట్టువరకును, వారికేమియు భయములేదు.

ఇట్లే, మనలో నొక్కొక్కరి ప్రాణ మేపక్షి లోనో యున్నది. అనగా, జీవితములో మన కొక ఆదర్శము, సాధింపవలసిన ఘనకార్యమున్నది. ప్రతి మానవజీవియు నిట్టి ఆదర్శమునకు, ఘనకార్యమునకు ప్రత్యక్షస్వరూపము. మీ కేమినష్టము వాటిల్లినను, ఆయాదర్శమును మీరు కోల్పోవనంతకాలము, మీ నిర్ణీత ఘనకార్యమునకు హానికలుగనంతవరకు, మిమ్మేదియు నాశనముచేయజాలదు. సిరివచ్చిన వచ్చుగాక, పోయిన పోవుగాక, ఆపదలు మువ్వెత్తున మిమ్ము ముంచివేయుగాక, ఆయాదర్శమునుమాత్రము బరిపూర్ణముగ మీ రనుసరించి, వర్తించుచో, మిమ్మేమియు నాశనము చేయజాలదు. మీరు ముదుసలులైనను, నూరేండ్ల ముదుసలులైనను, మీజీవిత ఘనకార్య నిర్వహణవిషయమున మీరు నవయౌవన హృదయులై యుండుచో, మిమ్ము నాశనము చేయగలదేమున్నది? కాని, ఆ యాదర్శము పోయినప్పుడు. ఆఘనకార్యమునకు భంగము వాటిల్లినప్పుడు మిమ్మేదియును, తుదకీ ప్రపంచమునగల ఐశ్వర్యమంతయు గాని అధికారమంతయుగాని మిమ్ము రక్షింపజాలదు. జాతులనిన, వ్యక్తులసమూహము లేకావా? కనుక, ఈ జాతులసామరస్యసిద్ధికై, ప్రతిజాతికిని తాను సాధింపవలసిన ఘనకార్యమున్నది. ఆ జాతి ఆయాదర్శానుగుణముగ ప్రవర్తించుచుండు నంతకాలము, దానినేమియు నాశనము చేయజాలదు. కాని, ఏది తన నిర్ణీత జీవిత ఘనకార్యమును విడనాడి, మరిదేనికైన ప్రాకులాడుచో, దానియాయువు క్షీణించి, నశించును. ఈ విషయము మతములకుగూడ వర్తించును. ఈ ప్రాచీనమతములన్నియును నేటికిని సజీవములై యున్నవను సంశయము, లేమి, తమ నిర్ణీతజీవితఘనకార్యసిద్ధికి అనుగుణముగ వర్తించుచున్నవని ఋజువుచేయుచున్నది.

---

సత్త్వగుణాధిక్యముగల వ్యక్తినుండి కర్మములు తమంతతామే తొలగిపోవును. ఆతడు ప్రయత్నించియు కర్మములను చేయజాలడు. భగవంతుడు వానిని కర్మములను జేయనీయడు. ఇందుల కొక యుదాహరణము. గర్భవతియగు కోడలికి క్రమముగా గృహకృత్యభారము తొలగింపబడును. ఇక బిడ్డ పుట్టినంతనే బిడ్డను సంరక్షించుకొనుట తప్ప ఆమెకు మరేపనియు నుండదు, ఉండనీయరు. సత్త్వగుణపూర్ణులు కానివారు సాంసారికకృత్యముల నన్నిటిని నిర్వర్తింపవలయును. భగవంతునికి పూర్తిగా ఆత్మార్పణ మొనర్చుకొని వారు భాగ్యవంతుని యింటిలోని దాసివలె వర్తింపవలయును. ఇదియే కర్మయోగము. భగవన్నామమును స్మరించుచు, శక్తి కొలదియు భగవంతుని ధ్యానించుచు, తోడ్తోడనే పైని చెప్పినరీతిని స్వధర్మమును నిర్వర్తించుకొనుటయే కర్మయోగతత్త్వము.

—శ్రీ రామకృష్ణ పరమహంస

---

# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిః శరణమ్

ఖనఖలు,

1-11-'13.

శ్రీమాన్...

కొంతకాలమునుండి నీవు పలుమారు నా స్ఫురణకు దోచుచుంటివి. నేడు నీకు త్తరము వ్రాయ నిశ్చయించితిని. నీవు క్షేమముగా నున్నట్లు విని సంతసించుచున్నాను. నా లేఖల వలన నీవు లాభమును బొందుచున్నట్లు తెలిసి యానందించుచున్నాను. ఇందువలన నా పరి శ్రమ వృధాకాలేదని తెలియుచున్నది. ధర్మ రాజ్యమున శ్రద్ధ యొక్కటియే శ్రేయోదాయ కము. 'శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్' అని భగవ ద్గీతయందు శ్రీకృష్ణభగవానుడే వచించి యున్నాడు. శ్రద్ధమూలముననే నచికేతుడు సత్యలాభమును బడసెనని కఠోపనిషత్తు వివ రించుచున్నది. యోగశాస్త్రములందు శ్రద్ధ మిక్కిలిగా కొనియాడబడియున్నది. 'యాదృశీ భావనాయత్ర సిద్ధి ర్భవతి తాదృశీ' అను నిర్వ చన మెన్నియో గ్రంథములందు గనంబడు చున్నది. కాన నీశ్రద్ధయే నీశ్రేయస్సునకు మూలకారణమని గ్రహింపుము. నిరంతరము స్మరణమననము గావింప బ్రయత్నించు చుండుము. అనంతరము భగవచ్చరణముల హృద్పద్మాంతరాళమున నిలుప గొలుప నా సర్వేశ్వరుని బ్రార్థింపుము. అట్లు ప్రార్థించి నచో ఆయన కారుణ్య కటాక్షముల నీపై ప్రసరింపజూచును. మానవజీవితమున కష్టసుఖ ములు సర్వదా పొడచూపుచుండును. భగవం తునియందు శ్రద్ధాభక్తులు కుదిరిన ఈ జన్మము సాఫల్యము నందగలదు. అట్లు కానిచో కర్మ ఫలానుభవం బనుల్లంఘనీయము.

ఇట్లు,

నా శుభాశీర్వచనములు,

శ్రీ తురీయానంద

---

శ్రీహరిశరణమ్

ఆల్మోరా,

3-6-'15.

ప్రియ...

మీరు నన్ను రెండు పంక్తులలో మీ యుత్త రమునకు ప్రత్యుత్తరము నొసగుడని వ్రాసి యుంటిరి. ఒకప్పుడు శ్రీపాద రూపగోస్వామి వారు, య—రీ ర—లా ఇ—రం న—య అని కొన్ని అక్షరములు వ్రాసి యా యుత్తరము తన భ్రాత సనాతనునియెడ కొక బ్రాహ్మణునిద్వారా పంపిరట. దానిని జదివి సనాతనుడు తన సోద రుడు రూపుని భావమును గ్రహించెనట. కాని నాకట్టి శక్తి యేది? 'య—రీ ర—లా ఇ— రం న—య—దీని యర్థ మిట్లున్నది' —

య—రీ=యదుపతేః క్వ గతా మథురాపురీ

ర—లా=రఘుపతేః క్వ గతోత్తర కోసలాగి

ఇ—రం= కృతి విచింత్య కుటిల స్వసునగి స్థిరం
న—యం=న సదిదం జగ దిత్యవధారయ *

ఈ కొన్ని పంక్తులే హూపుదు తన సోదరుదు సనాతనునకు దెలుపదలచిన భావములతో నిండి యుండెను. ఏలనన అతడు విషయసురాపాన మత్తుడై జ్ఞానహీనుడయ్యెను. కాని మీ విషయము వేఱు. సంసారమంతయు నాటకరంగ మని మీరే చెప్పియుంటిరి. ఇందు సార మావంతయు లేదు. కేవలము భగవానుడే యిందులకు కారణభూతుడు. కావున తద్భజనమే జన్మమున కర్తవ్యము. ఇందులకు తత్కృప అత్యంతావశ్యకమనియు దెలిపియున్నాడు కావున 'న సదిదం జగదిత్యవధారయ'. ఇక మీకు జెప్పవలయునదేదిగలదు? 'అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వమాం'. †

శ్రీకృష్ణభగవానుని యీ వాక్కులనుగూడ మీరు చక్కగా నెఱిగియే యున్నారు.

శ్లో. అస్వత్థమేనం సువిరూఢమూల
మసంగశస్త్రేణ దృఢేన ఛిత్వా
తతః పదం తత్పరిమార్గితవ్యం. ‡
—గీత-15-3-4

పూర్వము దేవీభక్తులెల్లరు నెట్లు సంసార వృక్షమును ఛేదింపగలిగిరో—ఆ యీ విషయము గీతాపఠనమువలన జక్కగా దెలియ నగుచున్నది. దేవి మనల నిల్పు స్థితియే మంచి దని పలుమారు భగవానుడు వాకొనియున్నాడు. ఎల్లప్పుడును వారు దేవిని మనస్సున నిలుపుటకే ప్రయత్నించువారు. ఆమె వారి నెట్లుంచినను సరియే. శ్రీరామకృష్ణులవారు సగుత మిట్టి భావముగల పాటను పాడుచుండువారు.

పాట భావము

'కాళీమాత నన్నెట్టి స్థితియందుంచినను నదియే నాకు మేలని నేను మఱువకయుండిన జాలు. భస్మీభూషితుడనై తరుచరవాసినై యున్న నేమి—మణికాంచనాలంకృతుడనై రాజసింహాసనస్థితుడనై యున్న నేమి?'

పిల్లికూనను తనతల్లి ఒకప్పుడు బూడిద గొంపియందుంచును. మఱియొకతఱి పఱుపు మీద నుంచును. కాని పిల్లిపిల్ల మ్యావు మ్యావు అనియే అఱచుచుండును. మఱియు నెచ్చటనుంచిన బిడ్డకు శ్రేయోదాయకమో తల్లికే తెలియునని శ్రీరామకృష్ణులవారు వచించువారు. మంగళకరుడగు భగవానుడొనర్చునది సర్వమును మనకు మేలే. భక్తుడీశ్వరునేమియు గోరడు, భగవానుడే మెచ్చి సాలోక్య సామీప్యాదుల నొసంగినను గైకొ

* శ్రీ కృష్ణుని మథురాపురి యిపు డెందు చేరినది ?
శ్రీరామచంద్రుని అయోధ్య (కోసల) యిపు డేమయినది,
వీనిని గమనించి నీ మనస్సున సుస్థిరము గావింపుము.
ఈ జగము నిత్యము కాదనుటను నిశ్చయము గావించుకొనుము.

† అనిత్యమును అసౌఖ్యదాయకము నయిన ఈ ప్రపంచమును ప్రాపించి నీవు నన్ను భజింపుము.
—గీత-9-33.

‡ బద్ధమూలమగు ఈ సంసార అశ్వత్థమును తీవ్రవైరాగ్యమను దృఢశస్త్రములతో ఛేదించి పిదప ఆ బ్రహ్మపదమును అన్వేషింపవలయును.

నడు, § భగవత్సేవనమే నిరంతరము వాంఛించును.

కపిలరూపధారియయిన శ్రీ భగవానుడు తన మాతయగు దేవమాత కిట్లు వచించియుండెను. (నిజమైన భక్తులకు నేను సాలోక్యము, నాతో సమానమగు నైశ్వర్యము, సామీప్యము, సారూప్యము, మదైక్యము—వీని నన్నింటిని నీదలంచినను వారు నా సేవనమును దప్ప నితరమేదియు గోరరు.)

ఇది మీరు చక్కగా గ్రహించిన విషయమే. శ్రీరామకృష్ణ గురుదేవులు పాపమను పలుకునే సహింపజాలకుండువారు. ఇతరుల నెవరినిగాని పాపులని తలంచుటగూడ నిషేధించువారు. అందులకు మారుగా 'నే నీశ్వర నామజపము గావించుచున్నాను. నాకు భయమేల' అని పలుకువారు. తలచినంతమాత్రమున సర్వమును భగవానుడు ధ్వంసము గావించి నూతనసృష్టి చేయగలడని పలికితిరి. అది నిజమే. దీనిని మీరు చక్కగా ననుభూతమొనర్చుకొనియె పలికియున్నారు. భగవానుడు కరుణాసింధువు. భక్తవాంఛాకల్పతరువు. సృష్టిస్థితిలయములు, భూత భవిష్యద్వర్తమానములు అన్నింటికి ఆయనయే మూలపురుషుడు. 'శ్లో. అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః, అహమాదిశ్చ మధ్యం చ భూతానామంతయేవచ'. ¶ ఈ భగవద్వాక్యమే మనకు ప్రమాణము. అవలంబనీయము. కాన "నీవు మంగళమయుడవని నే నెఱుగుదును. ప్రతి నిమేషమును నీ పరిచయమును బొందుచున్నాను. సుఖము గల్గించినను దుఃఖము గల్గించినను నొక్కటియే. నిన్ను నేను విడువను. హే ప్రభూ! నీవు నా హృదయాంబుజమున విలసిల్లుము" అని నేనేల పలుకరాదు. ఆయన యెట్లు చేసినను మంచిదియే. అందులకై దుఃఖప నవసరములేదు. కాని 'నీ పాదపద్మములందే మా మనస్సు లయింపజేయగల శక్తిసామర్థ్యము లొసగుమనియే' ఆయనను మనము ప్రార్థింపవలయును. మనము మఱచినను ఆయన మనల మఱువకుండుగాక! ఆయన మనకు పూర్ణవివేకమును వైరాగ్యమును ప్రసాదించుగాత. ఏలయన "ఏకం వివేకం ప్రౌఢం ఆదాయ సంకటేషు న ముహ్యతి"—వివేకము దృఢచిత్తతతో నవలంబించి నానారిక సంకటములయందు ముగ్ధులము కాక యుండగలము.

ఇట్లు,
శుభాశీర్వచనములతో,
శ్రీ తురీయానంద

---

§ శ్లో. సాలోక్య సార్ష్టి సామీప్య సారూప్యైకత్వముచ్యతే
దీయమానం న గృహ్ణంతి వినా మత్సేవనం జనాః. — భాగవతము-3-29-3.

¶ గుడాకేశా! నేను ప్రాణులందఱి హృదయమున వెలయు ప్రత్యగాత్మను; ఉత్పత్తి, స్థితి, ప్రళయ కారణమను.

# శ్రీ కృష్ణస్తవము

శ్రీ చెరుకుమల్లి వేంకటయ్య చౌదరి

(గతసంచిక తరువాయి)

మ॥ మును కంసాది నిశాచరుల్ సమద క్రోధోద్రిక్తులై మాని, స
జ్జన బృందంబులఁ గుందఁజేయ నపు డక్షయ్యకృపాదృష్టిచే
హననంబుం బొనరించితే విమతులన్ శ్రితార్తావనా! మాధవా!
జననంబొంది యశోదగర్భమునఁ గృష్ణా! భక్తసంరక్షణా! ౮౨

మ॥ వృకముల్ ఛాగము నేకరూపమున, నేరవీక్షించు నీరంబటుల్
అకలంకంబగు నీ సుధాఖ్యల, ననర్ఘ్యాలోచనా మగ్నుఁడై
ప్రకటింపందలపోయు నెవ్వఁడతనిన్ రక్షింప నెల్లప్పుడున్
సకలైశ్వర్యసుఖంబు లిత్తువఁట కృష్ణా! భక్త సంరక్షణా! ౮౩

మ॥ వగపున్ లేమిడిచేఁ గృశాంగుఁడగు నాపన్నుండు, నీ మిత్రుఁడై
న, కుచేలుం డరుదెంచి యొక్క కొణిదెం డటుకుల్ నమో! దేవ! యం
చొగి, యుష్మత్కరయుగ్మమందునను ప్రసన్నుఁ బొంగి, భక్షించి, ప
న్నగశాయీ! యిడితోయి భాగ్యములఁ గృష్ణా! భక్తసంరక్షణా! ౮౪

శా॥ ఏరీ? నీకుసమాను లిమ్మహిని, వాణీనాథుఁడుం గాఁడు, స
చ్చారిత్రుండు పినాకపాణియన, నీరసాయమ్ములర్థించె, జే
జే తేఁడెల్లపుడీ కృపారసము నాశించుం గుణాబ్ధీ! నమ
స్కారంబుల్ సరినీకు నీవె, హరి! కృష్ణా! భక్తసంరక్షణా! ౮౫

మ॥ భవదీయంబగు నామమాధురిని సొంపారంగఁ దాఁగ్రోలి, భూ
ధవులన్ భక్తుల నిచ్చలుం దనుపు హృద్యంబైన పద్యాబ్జముల్
గవితాధాటి నొనర్చి, కూర్చి, హృదయాహ్లాదంబునం దేలు, ప్ర
స్తవనీయుండుఁ గదా! కవీశుఁ డిల కృష్ణా! భక్తసంరక్షణా! ౮౬

మ॥ రుధిర ప్రావృత మాంసఖండముల నాలోచింపకే మన్మథా
స్యదవాగ్నిం బడి, కామినీ స్తనయుగం బంభోధరంబంచుఁ దా
ముద మొప్పారఁగఁ దాపురించు మరణంబుం గూడ లెక్కింపఁడో
సదయాత్మా! విరసాత్మికుం డిలను, కృష్ణా! భక్తసంరక్షణా! ౪౭

మ॥ సమరక్ష్మాతల చండభాస్కరుఁడు, భాస్వద్ధీరుఁ డప్పార్థుఁ డా
లముసేయం గురుసేనఁ గాంచి వెనుకాడంజూచు నప్పట్టునన్
సమరోత్సాహముఁ బొంగ నీవు రథివై సవ్యంబుగా నాటితే!
యమరారాతి విఘాతి! గీతకృతిఁ గృష్ణా! భక్తసంరక్షణా! ౪౮

మ॥ చరితార్థం బని విజ్ఞులెల్ల మహిషచ్ఛాగాది జీవంబులం
గరుణాలేశము విస్మరించి క్రతువుల్ గల్పించి క్రూరాసిచేఁ
బరిమార్పన్ సమకట్టి రట్టియెడఁ బాపచ్ఛేదనం బౌనె? యా
చరితార్థత్వముఁ గూడెనే? మురళి కృష్ణా! భక్తసంరక్షణా! ౪౯

శా॥ ఏజన్మంబున నీకు నెట్టి విరులన్ నే కాన్కలర్పించి నిన్
బూజింపం దొరకొంటినో యిపుడు నీపూజారినై పుట్టితిన్
నాజన్మాంతము నిన్నుఁ గొల్చునటు లాజ్ఞాపింపుమా వీని, న
వ్యాజాంచత్కరుణాకటాక్షములఁ గృష్ణా! భక్తసంరక్షణా! ౫౦

మ॥ అజరం బమృతమైన సుస్థిరపు కాయం బిత్తు పీవంచు, నిన్
భజియింపన్ మనసొగ్గె, మాదృశుల తాపంబింత చల్లార్చెదో
రుజతోడన్ జరతోడఁ గ్రుంగునటు లార్తున్ జేతువో స్వామి! దా
సజనాధీశ! యెఱుంగనాకగునె కృష్ణా! భక్తసంరక్షణా! ౫౧

మ॥ అసలీ సృష్టికి మూలమీవనుచు నావంతేని యోజింపకే
యసువుల్ బాప విషంబుతోఁ బనుప నీర్ష్యస్వాంతుఁడై పూత ర
క్కసినిం దుగ్ధములీయఁ గంసుఁ డపు డక్కాసాక్షి పంచాసువుల్
ససిగా జుట్టినవాఁడ జోతలివె! కృష్ణా! భక్తసంరక్షణా! ౫౨

(సశేషము)

శ్రీ కృష్ణాయనమః

# ప్రపంచమనుసరింపదగినది బౌద్ధమత మొక్కటియేనా?

కృష్ణదాస్ బుద్ధప్రియులు

[కొన్నాళ్ల క్రితము డాక్టరు B R అంభేద్కర్‌గారు మహాబోధిపత్రిక వైశాఖ సంచికయందు 'బుద్ధుడు—భవిష్యత్తున ఆతని ధర్మము' అను వ్యాసమును రచియించి యుండిరి అందుగల ప్రశ్నలు కొన్నింటికి శ్రీ కృష్ణదాసు బుద్ధప్రియులు ఒసగిన ప్రత్యుత్తరము లిప్పుడు ప్రచురింప బడుచున్నవి. సంపాదకులు.]

(గతసంచిక తరువాయి)

మానవులకుండవలసిన నైతిక సంబంధములను లౌకిక ప్రయోజన ప్రమాణములు విశదీకరించి, పోషింపజాలవు. నీతి ఒకవిధమైన సాంఘికపు కట్టుబాటుగనుండుచో, పోలీసువారి కాపుదలయే దానిని నిలువబెట్టవలసియుండును. ఒక ఆదర్శముపైన, అతీంద్రియ దృష్టిపైన, మానవుని ఆంతరంగిక దివ్యత్వముపైన, విశ్వాత్మీయతపైన నాధారపడియుండునప్పుడు మాత్రమే, నీతి స్వయంపోషక పటిష్ఠమైయుండగలదు. 'ఏదేశ మేయుగమునగాని యుత్పన్నము గావించి యుండగల రమ్యాతిరమ్యతాత్త్విక, ధార్మికకుసుమ మగు' ఉపనిషన్మతము తక్క వేరేదియు నీతి కంతటికి నిట్టి సుస్థిరాధారముగ నుండజాలదు. ఒక నీతిస్మృతిని క్రోడీకరింప బ్రయత్నించువారికిగూడ హిందువుల సుప్రసిద్ధమత గ్రంథములలో బ్రతిపుటయందును నైతికాదేశములును, విధులును సమృద్ధిగ దొరకగలవు. యజుర్వేదమందలి ఈశావాస్యోపనిషత్తులోని మొట్టమొదటి శ్లోకమే మానవజాతి యింతవరకు యుగయుగముల నుండి గ్రహించిన మహోన్నతనైతిక సూత్రమును జాటుచున్నది. మతాసక్తుడగు హైందవు డావశ్యకముగ నీతిబద్ధుడైయుండి తీరును. ఇక అవినీతిపరుడగు హైందవు డెన్నటికిని మతాసక్తుడు కాజాలడు. కఠోపనిషత్తు, II-24 చూడుడు. కన్నులుండియు (యథార్థమును) చూడనివానివంటి గ్రుడ్డివాడు వేరొకడుండడు.

అం. కర్మానుష్ఠానమే వేదమతసారము. వేదధర్మ మదియేకాని, నీతిమాత్రముకాదు.

బు. కర్మిష్ఠుల వ్యాఖ్యకు అనుగుణముగ నుండు వేదమతములోని విశేషభాగము కర్మకాండకు సంబంధించియుండుటనిజమే. హిందూ

మతమునకు ప్రాణాధారమైన తాత్త్విక, నైతిక సూత్రసముదాయమేనో యొక రూపమున బహు ప్రాచీనగ్రంథములందుండి గ్రహింపబడినట్లు కనుగొనవచ్చును. పాక్షికదృష్టియనునది పిడివాదమనునది హిందూమతములో లేదు, దానిలో మనుష్యుల పలురకముల మానసిక వికాసమునకు తగినట్లు మతధర్మ భావములు విరివిగాను, స్వేచ్ఛగాను పెరిగినవి.

''ఎవరినీ హింసింపకుము. ఎవరిస్థానమును గాని నిరాకరింపకుము. ఒక మనుష్యుని ప్రస్తుత స్థితిని గమనించి, వీలైనయెడల వానికి చేయూతనిచ్చి అంతకంటె నున్నతతరస్థితికి వానిని లేవనెత్తుము. అంతేకాని, హింసకును, నాశనమునకును బూనుకొనకుము. చిట్టచివర కందరకును సత్యమే ప్రాప్తిస్థానము.''

ఇదియే హిందూమత సిద్ధాంతము. దార్జన్యమువలననో, దేవతారాధనవలననో మానవులలో నధిక సంఖ్యాకు లీ ప్రపంచభోగ్యవస్తువులను సాధింప నెల్లప్పుడును వాంఛించుచున్నారు. యజ్ఞాది కర్మానుష్ఠానము మూలమున వీనిప్రాప్తికి వేదమతము జనులకు నచ్చునట్లు వాగ్దానముచేయుటలో నాశ్చర్యము లేదు. అయినను, వేదము కేవల ప్రార్థనా సముచ్చయమే కాదు. ఇండియా దేశములో కొంతవరకు వేదకర్మకాండకు బదులు పరతత్త్వబోధారూపకమగు హిందూమతము ప్రబలుచుండిన సమయములో, ఇంద్రజాలమునకును, విగ్రహములకును బాహ్యాడంబరయుక్తములగు కర్మలకును ప్రవేశమిచ్చినది బౌద్ధమతమే. ధర్మ శబ్దమునకు భిన్నార్థములు కలవు. దానిని బౌద్ధమతము చాల చక్కగా బెంపొందించిన మాట నిజమే. బౌద్ధమతమునకు పూర్వమీ శబ్దము వాడుకలో నుండెనను నొకే యంశము, నవీన స్థితిగతులలో ఆ మాటకు చేకూరిన విశేషార్థము కొలుదొత్తగల అపరిష్కృత, సత్త్వార్థముయొక్క వికాసముమాత్రమేయని స్పష్టపరచుచున్నది. వేదయుగారంభమందు ఋషి, సత్యశబ్దములను ప్రాతిపదికలుగ గ్రహించి ప్రకృతి క్రమమునకు బ్రతిగ, నైతిక నియమ, క్రమభావము నిదివరకే వృద్ధిచేసిరి. బౌద్ధధర్మ మీ భావప్రవర్ధమాన స్వరూపము తప్ప వేరేమియుకాదు. వేదములలో ధర్మ, యజ్ఞ శబ్దములు చాలవరకు సమానార్థములుగ ప్రయోగింపబడినవి యజ్ఞ శబ్దమునకు కేవల మపరిణతమైన యింద్రజాలమని అర్థము కాదు. యజుర్వేదోక్తములగు పంచమహాయజ్ఞములు పిత, ప్రపితామహాది పూర్వపురుషాంతరములపట్లను, అదృశ్యశక్తులపట్లను, సామాన్యజీవితమున సహవాసులగువారిపట్లను, తదితరజీవులపట్లను మానవుడు నిర్వహింపవలసిన విధ్యుక్తధర్మమును నొక్కి వక్కాణించుచు, ఆతని నైతికబాధ్యతను గుర్తించుచున్నవి. నీతిసార మాత్మనిగ్రహమేకాని, త్యాగశీలమేకాని, భోగలాలసత యెన్నటికిని గాదు. తపో, దాన, వ్రతాది సాధనలచే మానవు లార్జింపవలసిన దిదేయని హిందూమత ముద్ఘోషించుచున్నది. ప్రాచీనయుగములందు మహాత్ములు మున్నగు పూర్ణజ్ఞానులు త్రొక్కిన త్రోవనే తాను కనుగొంటినని బుద్ధుడే ప్రకటించియుండ, నీతిని మతసారముగజేసిన ప్రథమ జగద్గురువు బుద్ధుడని వాదించుట నిరర్థకమైన పని.

అం.—హిందువుల 'నిష్కామకర్మ' యను మాటకు, ప్రతిఫల మాశింపకుండ సత్కర్మ చేయుట యని అర్థముకాదు, బ్రాహ్మణుల విధ్యుక్తధర్మ, కర్మాచరణమే యని దాని

అర్థము. కనుక, కృష్ణునకైనను మతము నీతియై యుండలేదు.

బ.—మతగ్రంథముల సమన్వయము సర్వకాలములందును, వ్యాఖ్యాతల వాద ప్రతివాదములకు గురియైయున్నది. తమ, తమ యభిప్రాయముల కనుగుణముగ, మతగ్రంథములకు అర్థము చెప్పుటకు వారికందరకును స్వాతంత్ర్యముకలదు. ఏకీభావము సులభసాధ్యము కానప్పుడు, వివాదబద్ధములగు గ్రంథముల పఠనము విషయమున పండితోత్తములనతగినవారందరు నేకగ్రీవముగ సమ్మతించి చేసిన పరిశోధన ఫలిత మెల్లరకును శిరసావహనీయము. ప్రతి మతగ్రంథమును, తుదకు కాలప్రవాహఘాటికిగూడ తాళి, మనకు నేడుపయోగపడుచున్న గ్రంథములనైన, నిరసించి, తుత్తునియలుగ ఖండించుట సులభమే. కాని, సత్యాన్వేషణపరులు నమ్రభావులై మతగ్రంథములను, వాని రచయితల దృక్పథమున కనుగుణముగ పఠింపవలయును గీతాప్రతిపాదకమైన కర్మయనగా బ్రాహ్మణు లాచరింపవలసిన నిత్య, నైమిత్తికాది కర్మాచరణమని అర్థము చెప్పుట హాస్యాస్పదము. 'కర్మ' నాచరింపుమని, యుద్ధముచేయుమని కృష్ణుడర్జునుని హెచ్చరించెను, ఇది పురోహిత బ్రాహ్మణు లాచరింపవలసిన కర్మకాదే. కర్మయనుమాటకుగల సామాన్యార్థమును మన మంగీకరింపనిచో, ఈ క్రింది సందర్భములందు, దానికంటె భిన్నమైన అర్థమేది వర్తింపగలదు? ప్రకృతి వేదోక్తనిత్య, నైమిత్తికకర్మల నాచరింప నెల్లరిని ప్రేరేపించుచున్నదనియా గీ. అ III. శ్లో. 5 చెప్పుచున్నది? నిత్యకర్మాచరణ లేనిచో, జీవితమే యసంభవమను అసంగతవాదమును, గీ. అ III. శ్లో. 8 సమర్థించుచున్నదా? విశ్వసృష్టి, స్థితి నిర్వహణదక్షుడగు కృష్ణుడు వేదోక్త కర్మలనే ఆచరించుచున్నాడనియు, నాతడు బ్రాహ్మణుల విధ్యుక్తకర్మల నాచరింపకున్నచో లోకమే నశించియుండుననియు గీ. అ III. శ్లో 22–24 వ్యక్తీకరించుచున్నవా? కర్మ, అకర్మ, వికర్మయనునవి నిత్యకర్మ కలాపములోనివియా? అ. 12. 6 లో చెప్పబడిన "సమస్త కర్మము"లను మాటకు వేదోక్తకర్మములు మాత్రమేయని యెన్నటికిని అర్థము కాదు. కర్మయను పదమునకు సామాన్యార్థమేదియులేనిచో, గీ. అ. 18 లో చెప్పబడిన సహజకర్మకును, స్వభావ – నియత – కర్మకును వేదోక్తకర్మలే యని అర్థమగును. ఇది కేవల మసంబద్ధ ప్రలాపము. అ. 18, 9 మొదలగు శ్లోకములు, సంతోషకరమైనను కాకున్నను కర్మవిధాయక కార్యమువలె ఆసక్తిలేకుండ ఆచరింపబడవలయునని చెప్పుచున్నవి. అ. 18, శ్లో. 15 మనో, వాక్ శరీరములతో చేయబడు నే పనినైనను కర్మ క్రిందకు దెచ్చుచున్నది. అహంకారమును, భవిష్యత్తున ప్రతిఫలమున కాత్రతతో నెదురుచూచు స్వభావమును నిర్మూలించి, కర్మఫలసక్తతను పోగొట్టుటయే కర్మయోగ ప్రధాన లక్ష్యము. నిష్పాక్షికబుద్ధితోను, సద్గురు సాహాయ్యముతోను గీతాపఠనముచేయువారి కిదియంతయు తేటతెల్లమగు విషయము. వేదోక్తకర్మ కాండకు కృష్ణుడు దాసుడు కాడను నంశముకూడ గీతలో, దానిని బుద్ధిపూర్వకముగ గమనింపకుండుటకు దీక్షపట్టినవారికి తప్ప నితరులకెల్ల సుస్పష్టమగుచున్నది. (అ II, శ్లో. 42–45 లు.) నీతియే తన మహోపదేశసారము కానిచో, శ్రీ కృష్ణుడు, శ్రమపడి దైవీయసంపత్తిని విపులముగ వివరించి, తన మానవశీల దర్శనమున

కెల్ల సాత్త్విక జీవితపద్ధతియే హృదయమని భావించి ఉద్ఘాటించి యుండడు.

అం.—ఆవిషయమంతయు నెట్లున్నను, సత్య దూరమును, హానికరమునగు చాతుర్వర్ణ్య సిద్ధాంతద్వారమున సాంఘికముగ మానవుల మధ్య అసమానత్వమునకు వేదవాక్య ప్రామాణ్యమునిచ్చుటచే హిందూమతము దోషభూయిష్ఠమగుచున్నది దానిలో శూద్రుడుకాని, స్త్రీకాని మతగురువై, సన్న్యాసాశ్రమమును స్వీకరించి, భగవత్సాక్షాత్కారము బడయుటకు వీలులేదు. ఈ అసమానత్వబోధను బుద్ధుడు సమూలముగ పెల్లగించి, నాశన మొనర్చెను.

బు.—ఇండియాదేశ ప్రజల సాంఘిక పరిణతియందు వర్ణవ్యవస్థ యాదృచ్ఛికముగ సంభవించినది నేటి మోటారుబండియు, పరిశ్రమలయు వ్యామోహమున దగుల్కొనక జనసమూహము లీదేశమున రాజకీయ జ్ఞానహీనులై నగరముల కెగబ్రాకని పూర్వకాలమున దాని క్లేశములవలన, పాశములవలన నెవరు కాని, యెన్నడును బాధపడి యుండలేదు. స్వల్ప జనసంఖ్యగల దేశములో, సమర్థులవలన బలహీనులంతరింపకుండ, పోటీని తొలగించి, యెల్లరికి నేదోవృత్తిని కల్పించి, సాంఘికసవరణను గావించుటకు వర్ణవ్యవస్థయే యేకైకోపాయముగ నాదుపకరించెను. ఈవ్యవస్థ యేదో యొక రూపమున సర్వదేశములందుండెను, నేటికి నున్నది కాని, నేడు దానిని పూర్వకాలపు సంస్థలలోనే చేర్చవలయును. దానిని మన మింకను నొక సజీవాంశముగ తర్కించుచో, పూర్వకాలముపట్ల మనకుగల అనావశ్యకాభిమానమే అందుకు కారణము వర్ణవ్యవస్థయే హిందూమతమునకు మూలాధారమని వాదించు పూర్వాచారపరాయణులగు హైందవులును, వారి హ్రస్వదృష్టిని, మొండిపట్టుదలను జూచి హిందూమత నాశనమునకు బూనుకొన్న నిర్మూలన కార్యనిపుణులగు సంస్కర్తలునుగూడ దురభిమానావేశగ్రస్తులే. ఈ యుభయపక్షములవారు జాతీయాభివృద్ధి కిసుమంతయును తోడ్పడరు ఆదర్శప్రాయముగ యోచించుచో, ఈ చాతుర్వర్ణ్యవ్యవస్థ మానవుల స్వభావమును బట్టి, దృక్పథమునుబట్టి చేయబడిన సాంఘికవిభజన ఈ అభిప్రాయమును మహాభారతమును, శుక్రనీతియును సమర్థించుచున్నవి. హిందూమతమున సాధుపుంగవు లన్నివర్ణములలోనుండియు నుద్భవించిరి. దక్షిణదేశమున బ్రాహ్మణేతరులగు ఆళ్వారులకును, ఈ దేశమందన్యస్థలములం దితరులకును, దేవతాసముచితములైన గౌరవములు చూపబడినవి.

(సశేషము.)



# మీ రా బా యి

శ్రీ కె - అన్నమరాజశర్మ

తే. గీ. పరవశోత్కర్ష భవదీయ బాష్పపూజ, ముగిసెనో, లేదో, వలిమంచు ప్రొద్దులందు
హృదయ నీరాజనమున వెలిగించినట్టి, కప్పురపుఁదావు లాఱలే దిప్పటికిని! 1

తే. గీ. ఆత్మ సర్వస్వమును హృదయాధినాథుఁ డైన యదుమౌళికర్పించి అక్కటకట!
కుంభభోజుని క్రోధాగ్ని గూలినావు, బ్రతుకు దెరువెల్ల ముందుగ రాలిపడఁగ 2

తే. గీ. విరహ విహ్వలయై రాధ సెదకి, వెదకి, విసివి కోపాన కృష్ణు శపించెఁ గాని,
మీర! నీవెంత సుమ సుకుమార మతివొ, బాష్ప ధారాభిషిక్త గోపాలుఁజేయుఁగు!

తే. గీ. మర్మ కవితాసుధాస్రవ మ్మంజులాతి, మంజులంబైన నీగాన మంజిమార్ద్ర
నీఁదుచున్నార మెచటికో యెఱుఁగరాదు, దారిఁ జూపింపు మావలి తటమునుండి. 4

తే. గీ. మృదుల రాగాశ్రయమ్మైన హృదయవీణ, నన్ని తంత్రుల భక్తినే యన్వయించి
పాడి, చదలేటి తటములఁ బాడుచున్న, మీర! నీప్రేమ దాత్మ్యమ్ము మీరఁగలమె? 5

తే. గీ. నీయశోగాన కథన ప్రకటనోత్క మతిని, పాడుచుండె నారావళీపర్వతాల
వీదరీ ఝరీకటాక్షమ్ము వితతి ముక్త, కంఠమున భక్తి పులకిత గాత్రమగుచు! 6

—"మాలతీమాల"



# వీర గిరీశచంద్ర

శ్రీ దువ్వూరి రామకృష్ణారావు, బి. ఏ.

పందొమ్మిదవ శతాబ్దియందు భారతీయులు తమ ధర్మములనుమరచి, పాశ్చాత్య నాగరికతకులోనై, తమ యౌన్నత్యమును గోల్పోయి, సాంకర్యమునకు బాల్పడి, ఐహిక సౌఖ్యములే శాశ్వతములనకొని ప్రమత్తులైయుండిరి. ఇట్టితరి, లోకసంగ్రహణార్థమై, శ్రీరామకృష్ణదేవులు అవతరించుటయు, వారి దివ్యలీలలు ప్రకటితములగుటయు, పతితులు కొందరుద్ధరింపబడుటయు, గాలపరిణామమున నద్దాని, నిదమిత్థమని జగత్తు గ్రహించుటయు జగద్విదితమే. శ్రీవారి శిష్యకోటిలో నొకరుగనుండి రామకృష్ణుల, ప్రబోధమును ప్రపంచమునకు జాటిన మూర్తులలో గిరీశచంద్రుని ప్రస్తావనమియ్యది. కాళికాదేవాలయమునం దొకనాడు రామకృష్ణులు ధ్యానముసేయుచుండిరి. అంత నొక దిగంబరియైన బాలస్వరూపము ముచ్చిలిగుంట జటలతో, నెడమచంకను సారాబుడ్డితోను, గుడిచంక నమృతభాండముతోను, తప్పటడుగుల జిందులద్రొక్కుచు, వచ్చుట గోచరమాయెను. అంత, 'నీవెవ్వడవు? ఎందులకువచ్చితి' వని, శ్రీరామకృష్ణులడుగ దాను భైరవుడనియు, స్వామికార్యము నెరవేర్చుటకై వచ్చితిననియు, బదులుచెప్పెను. గిరీశచంద్రుడు రామకృష్ణుల దరిజేరినప్పు డాతని దన ధ్యానమునగనిన భైరవునిగా గుర్తించెను.

గిరీశుడు శ్రీగురుదేవులకు సునిశ్చలభక్తితో దన సర్వస్వమును, దన్ను నర్పణముజేసికొని గృహస్థాశ్రమముననుండియు, మార్జాల కిశోర న్యాయమున దరించిన మానసిక సన్యాస యోగసిద్ధుడు. ఈతడు తొలుదొల్త మన యెరుకనెట్టి దుర్మార్గముగ నడచిన, నెట్టి భోగ లాలసుడైనను, శ్రీరామకృష్ణుల శరణు జొచ్చి, వారి యపార కృపచే దన్నుదాను తెలిసికొనగల్గి, తన పేరును సార్థకముజేసికొన్న ప్రత్యక్షోష్ణుడు.

దేశకాలములకు జిక్కి దుస్సాంగత్యము వలన దాజేయని పాడుపనులెవ్వియుచులేవని, గిరీశుడే యొప్పుకొనెను. బాహ్యప్రపంచమతనినెట్లు గుర్తించినను నాతని నవనీత సమ సరళహృదయము విశ్వాసము, దీనమానవ సేవాపరత, స్వార్థరాహిత్యము, ఋజువర్తనము మొదలగు దివ్యగుణములే శ్రీరామకృష్ణుల నాకర్షించి అతనిని వారి యపార దయామృతవృష్టికి బాత్రుని జేసినవి.

గిరీశుడు 1844-వ సంవత్సరమున, కలకత్తా నగరమున నొక యాధ్యాత్మిక నిష్ఠగల యోగ్యమైన కాయస్థకుటుంబమునందుద్భవించెను. వీరి యిలవేల్పు శ్రీధరస్వామి. ఆ పుణ్యదంపతుల కీత డష్టమగర్భము. జ్యేష్ఠపుత్రుని వియోగక్లేశమున దల్లి గిరీశుని కడు గారాబముగ బెంచెడిది. సత్కుల ప్రసూనుడైనను, సరియగు అదుపాజ్ఞలులేమి చిన్ననాటనుండియు నీతడు చాల పెంకి, యాతతాయి. ఈతడెట్టి దుండగీడైనను, వారికుటుంబమునగల యొకము త్తవ్వ

నిత్యమును స్త్రీగణములకు జెప్పుచుండు పురాణకాలక్షేపములను బహుశ్రద్ధాభక్తులతో వినుచుండెడివాడు. ఆ వినునప్పుడు గిరీశుడు తన్మయుడై యశ్రులు రాల్చుచుండెను. జాతర సమయములందు అర్ధఆకారి, పాంచాలి, కవి, కధాకలి మున్నగు ప్రదర్శనములను జూచుచు వానియందనురక్తితో రసాస్వాదన జేసెడివాడు. ఈ చిన్ననాటి కౌతూహలము క్రమశః పెంపొందుచుండుట, మన నూతన నాటికలందు, గీతములందు గాంతుము. ఈ యనురక్తితో, నాతడు కావ్యపఠనములయందత్యుత్సాహము గల్గి పాండిత్య ప్రకర్షను గాంచెను. బీదలన్న, అనాధలన్న రోగపీడితులన్న, నీ విశాల హృదయుని మనస్సు నీరై పోయెడిది. అందువలననే తాను నాట్యమందిరమునందు దొలుదొల్తగ ననాధ బాలికలకు ప్రవేశమునిచ్చి, వారికి సాయపడి, వారి యభ్యుదయమునకు తోడ్పడుచు, వారిని రామకృష్ణ సమాజములందనురక్తులుగ జేయుచుండెను.

గిరీశునితల్లి యాతని బదునొకండవ సంవత్సరమున స్వర్గస్థురాలాయెను. తండ్రియు గిరీశుని సంగతిని తెలిసినవాడై, చేయగలిగిన దేమియును లేక యాతని గడు విచ్చలవిడిగ వదలివైచెను. ఇంతలో తండ్రియు వయసు మీరి కాలధర్మము నొందెను. తండ్రి చనిపోయిన సంవత్సరమునకు, గిరీశుడు వివాహమాడెను. "వివాహో విద్యనాశాయ" యన్నట్లుగ, నీతడు వెంటనే "ఎంట్రన్సు' పరీక్షలో తప్పి విద్యాభ్యాసమునకు స్వస్తివాచకము జెప్పి దుర్వ్యసనములకు లోనై పదునాల్గు వర్షములు గడపెను. తనలో నిబిడీకృతమైన పశుత్వము (అతి మద్యపానము, అతి శృంగారము, అతి దౌర్జన్యము) బాహిరమై, యిరుగుపొరుగులకతని యునికి అతి భయోత్పాతముగనుండెడిది. మామగారీతని దుష్ప్రవర్తన సరికట్టుటకు, ఒక పుస్తకశాలలో నియోగించెను (1866). విద్వత్సంపన్నుడగు మేనమామ కొంత గిరీశుని సహజపరిణామమునకు తోడ్పడుటచే, గిరీశుడును ఆతని కష్టబాటుల కొకింత లోబడి, కొంత దుండగీడుతనము గలదో, యంతకుమించిన పట్టుదలతో స్వయంకృషి జేసి, విద్వాంసపన్నుడై, శాస్త్ర, వేదాంత, చారిత్రక, కావ్యాది ఉద్గ్రంథములను రచించి డాక్టర్. మహేంద్రలాల్ సర్కార్ ఎం. డి. వంటి వారికే స్థానముగల, శాస్త్రపరిశోధక మండలియందు సభ్యత్వమును గూడ గాంచెను.

సామాన్యులవలెనే గిరీశుడును కాలచక్రములో తగుల్కొనియె. కష్టము లొకటి వెంబడి నొకటి వెన్నంటినవి. ఆతని సోదరీమణులిర్వురు దివంగతులైరి. సోదరు లిద్దరును చనిపోయిరి. 1874 లో కళత్రవియోగము సంభవించుటయు, నుద్యోగము పోవుటయు గూడ తటస్థించెను. అంత గిరీశుడు విచారములోబడియె. ఆ మానసిక వేదన, కలత, విచారము మొదలగు నాతనియందలి భావములు [illegible], [illegible], అతిత్ అను నాతని రచనలుగా పరిణమించినవి.

1875 లో తిరిగి వివాహముచేసికొని, ఉద్యోగములో జేరెను. ఇది జరిగిన యారు మాసములకతడు తీవ్రమైన విషూచి బాధకు లోనై ప్రాణములు కడంటి, స్మారకము తప్పెను. అట్టితరి, నొక పెద్ద దివ్యతేజస్సు తనకు తోడసూపుచు, దగ్గరకు రానురా నాతని యెదుట, నొక ఎఱ్ఱనియంచు చీరను కట్టుకొని దయాళువుగ, శాంతస్వరూపమున నొక దివ్యరూపిణిగ దర్శనమిచ్చి, "నాబిడ్డా! నివు దుర్భర

మగు బాధ పడుచున్నావు. పూరీ జగన్నాథుని మహాప్రసాదమును నీ ఆరోగ్యమునకై తెచ్చితి''నని చెప్పి యాతనికిచ్చి తానంతర్ధానమాయెను. అది పుచ్చుకొని, స్మారకము వచ్చి, క్రమశః ఆరోగ్యమునుగాంచెను. కాని కష్టములు వెంటాడుచునే యుండెను. ఉద్యోగము పోవుటయు, నింతలో ద్రవ్యనష్టమును గూడ సంభవించెను. అంత నొక ధర్మసంకట మేర్పడి నాస్తికుడాయెను.

''దేవుడన నున్నాడా? ఉన్నచో నాకు సాక్షాత్కార మగునా? ఎటుజూచినను భౌతిక దేహమునకు గావలసిన యైహిక సౌఖ్యము లుండగా, తెలియమితోగూడిన యస్తి, నాస్తిగనుండు కష్టతమమగు నాముష్మికమున కేల శ్రమ చేయవలెను. దేవుడున్నాడనుట పిరికితనము, చేతకానితనము, నవివేక''మను కొనుచు, నాస్తికుల జాడలను మెచ్చుకొనుచు, ప్రాపంచిక గౌరవమునకై, గొప్పకై అతడు దేవుడు లేడని సభాముఖమున బల్లను గట్టిగ గ్రుద్దుచుండెను. దేవుడున్నాడను వారలను హేళన చేయుచుండెను, దేవుడున్నాడనుట యూహాగానమని, దుర్మార్గముగ సంచరింప కుండుటకై భయ పెట్టుట కేర్పడిన కుతంత్రమని వాదించుచుండెను. కాన, ''ఏనకేన'' ఉపాయమున, తన స్వలాభముల నీడేర్చుకొను చుండవలెననుకొనుచు, నొక ప్రక్క విపరీతమగు నత్యాచారములు, రెండవప్రక్క విపరీతములైన యాతిబాధలు, ద్రవ్యనష్టములును దాపురింప నీకడగండ్ల చీదరనుండి మైమరచుటకై యతి మద్యపానావస్థకు లొల్పడియును, కష్టనివారణకై గిరీశుడు కలకత్తా దరినున్న తారకేశ్వరాలయమునుజొచ్చి, యాతారకేశ్వరుని శరణుజొచ్చెను. తాత్కాలికముగ వెంటనే యాశ్వరకృపవలన గష్టములు గట్టెక్కెను. దీనివలన భగవంతుడున్నాడనుకొనుట వరకు స్ఫురణకల్గినను, అది స్థిరస్థాయిగ నిలబడదుగదా!

తనకుమించిన పరశక్తి యాతని కెప్పటి కప్పుడు స్ఫురించుచునే యుండెను. దేవుడున్నాడని నమ్మియు, శంకితమనస్కుడై, మిత్రుల సలహాను వేడుచుండెను. గురుకటాక్షము లేనిదే పూర్తిగ సందేహానివృత్తి కానేరదనుకొనెను ''గురువుండవలెను గురువే దేవుడు. అట్టివారి నేరినిగాంతును, నావంటి మానవుని దేవునిగా నేనెట్లు తలంతును. నేను మానవరూపమునను్న గురువునకు లొంగి, వంగి సలాములుజేయను. ఇదియు బంధమే! గాన తారకేశ్వరునే ప్రాతఃసంధ్యల స్మరింతును. ఆతడే యగత్యమైన, నాకు గురువుగ బనిచేయును. చూచెద నిదియెట్లు జరుగునో!'' యని తనలోతాను వితర్కించుకొనుచు డోలాయమాన మనస్కుడై కాలముగడుపుచుండెను.

ఇట్టితరి 'మిర్రర్' అను నొకదినపత్రికయందు బ్రహ్మసమాజమువారు, అందును ముఖ్యముగా కేశవచంద్రసేను లంతటివారు, హరిగానముజేయుట, శ్రీమాత యారాధనయు మొదలిడి, రామకృష్ణుల ననుసరించుచున్నారనియు, వారు ప్రక్కయింటికి వచ్చుచున్నారనియు గిరీశుడు చదివి, సర్కసునందలి యొక చిత్రమును జూచుటకు వెళ్లునట్లుగా తమాషాగా శ్రీవారిని సందర్శించుట కాయింటికి వెళ్లెను. అది సంధ్యారాగసమయము. పరమహంసలవారు యోగసమాధిలోనుండిరి. వెలుగుచున్న దీపములను జూచుచున్నను, శ్రీరామకృష్ణులు మైమరచి వేళను గుర్తింపక, సాయం

సంధ్య యైనదాయని ప్రశ్నించిరి. ఇదివిని, గిరీశుడు చీదరగ, 'నింతకన్న నవ్యక్తత యేమి గలు?' దనుచు, త్రాగియుండి గురుదేవులను దూషించుచు లేచి వెళ్లిపోవుచుండెను. దీనిని గ్రహించినవారై, శ్రీరామకృష్ణు లతి శాంతముగ, బరిహాసధ్వనితో, "ఎంత లేకపోయినను దేవునిపేరు చెప్పుకొని త్రాగవచ్చునులే. బహుశః దేవుడును త్రాగుబోతే కాబోలును" అనిరి. అంత, మనత్రాగుబోతు నోరావలించుకొని, నిశ్చేష్టుడై, "నీకది యెటుల దెలియు?" నని గురుదేవులను బ్రశ్నించెను. దేవుడే త్రాగు డెఱుగనివాడైనచో, నతిరయుక్తమువికటము, తలక్రిందులునగు నీ ప్రపంచ మెటుల సృష్టించినాడని తీవ్రదృష్టితో బదులుచెప్పెను. అంత గిరీశుడు గురుదేవుల దెబ్బకు మాట తిరుగక, తెల్లబోయి, వెట్టిమొగము నైచికొని వెడలిపోయెను.

చైతన్యలీలలుప్రదర్శింపబడుచుండెను. ఈప్రదర్శనమును జూచుటకు రామకృష్ణులు, కొందరు శిష్యులతోకూడ వచ్చిరి. గిరీశుడు నాటకశాల దొడ్డిలో బచారు జేయుచుండెను. గిరీశునికడకొక శిష్యుడువచ్చి రామకృష్ణులు వచ్చియున్నారు, వారికి కొంత తావును గల్గింపగలరా?" యని యడుగ, గిరీశుడు "రామకృష్ణులు టిక్కట్టును తీసికొననక్కరలేదు, తక్కినవారు టిక్కట్టును కొనవలె"ననుచు, రెండడుగులు వేయు సరికి, రామకృష్ణులు బండిదిగి గిరీశునివద్ద కేతెంచి, గిరీశునకు నమస్కరించెను. తిరిగి గిరీశుడు నమస్కరించెను. రామకృష్ణులు మరల నమస్కరించిరి. ఇట్లు వారు, వీరును ఒకరినొకరు నమస్కరించుకొనుచుండుట సరిగాదని, గిరీశు డూరకొని, రామకృష్ణుల సముచితాసీనులజేసి, అస్వస్థతగ నుండుటచే తానింటికి వెడలిపోయెను. ఈసందర్భమును గిరీశునకు బోధపడదు గదా!

ఇంతలో గిరీశునితో నొక వైష్ణవచిత్రకారుడు తన యిష్టదైవము తానర్పించు నైవేద్యమును, ప్రతినిత్యము స్వయముగ నరగించుననియు, యిట్టి విషయము లనుభవించుటకు గురుకటాక్షముండవలెననియు చెప్పెను. ఈ విషయము గిరీశుని మనస్సునకు బాగుగ హత్తుకొని, తానింటికివచ్చి గదిలో కప్పుకొని పడుండి, విలపింపనారంభించెను. ఇది జరిగిన మూడునాళ్లకు, గిరీశునింటి ప్రక్కగ గురుదేవులు వెళ్లుచు అతనికి నమస్కరించి వెడలిపోవుచుండిరి. గిరీశుడు వారిని బిలువ సంకల్పించెను. అంత గురుదేవులే గిరీశునకు కబురుపంపి, అందరుకలసి, బలరామమందిరము జేరిరి. అచ్చట గురుదేవులను గిరీశుడు, 'గురువన నేమి?' యని ప్రశ్నించెను. గురువు 'దేవునకు, భక్తునకు సఖ్యముజేయు సామర్థ్యస్థు'డని గురుదేవులు చెప్పిరి. గిరీశుడు తిరిగి 'మంత్రమన నేమి?' యని ప్రశ్నించెను. 'మంత్రమన శక్తియుతమగు హరినామ సంకీర్తనమే' యని శ్రీవారు సమాధానమిచ్చిరి.

ఒకనాడు రామకృష్ణులు ప్రహ్లాదనాటకమును జూచుటకు వెళ్లిరి. ఆయన యనుచరులు గిరీశునితో రామకృష్ణులేతెంచిరని చెప్ప, గిరీశుడు గురుదేవులను లోనికి తీసికొనివెళ్లడనెను, 'తమరు దయచేయరా?' యన, 'నేను లేనిదే రామకృష్ణులు బండిదిగరా?' యని గిరీశుడు ప్రశ్నించెను. ఇంతలో గురుదేవులు బండిదిగి, గిరీశునొద్దకు అతి శాంతభావముతో నేతెంచిరి. అప్రయత్నముగ గిరీశుడు గురుదేవుల పాదముల వ్రాలి, వారికొక గులాబీపుష్పమునుగూడ చేతి కందిచ్చెను. వెంటనే, రామ

కృష్ణులా పుష్పమును దిరిగి గిరీశున కిచ్చి వేయుచు, ''పుష్పములు దేవునకును, రసికులకును మాత్రమే సమర్పణీయములు, నేను రెండునుగా''ననిరి. అంత గిరీసుడు వారినందరి నొకగదిలోనికి గొంపోయి యాసీనులజేసి ప్రదర్శనానంతరము అహంభావముతో తననాట్య దర్పమును గూర్చి) రామకృష్ణుల స్తోత్రము కొఱకెదురుచూచుచుండ, రామకృష్ణులు గిరీశునితో, నీమనస్సు నిష్కళంకముగాక, కుటిల' మనిరి. తప్పత్రాగియుండిన గిరీశుడు వెంటనే రౌద్రముతో గురుదేవులను దూషించెను. శ్రీరామకృష్ణులు ప్రతిమాషణకు గడంగక గిరీశు నాశీర్వదించి వెడలిపోయిరి. పిమ్మట గిరీశుడు తానుపాపిననియు, తనకు త్రికరణశుద్ధి లేదనియు, తాను కూర్చొనియుండు చోటు సయితము అపవిత్రమగుననియు గురుదేవులతో బల్క, ''దౌర్భాగ్యుడై, పాపమునే యనుక్షణము స్మరించువాడు పాపియేయగును. ఒక గది ఎన్ని వేలయేండ్లుగ చీకటిగనుండినను, దివ్వెను వెలిగించగనే క్రమశః చీకటిపోయి, ప్రకాశమానముకాదా? ఒక సారిగ, చీకటి పోవుటయు, ఆక్షణమే ప్రకాశమానమగుటయు జరుగును గదా!'' యని గురుదేవులు సమాధానమిడిరి. ''అట్లయినచో నాకంతయుమీరే! నన్నాశీర్వదింపు''డన ''ఆహా! నీకు నిజముగా నమ్మికగల్గినచో,'' నని గురుదేవులుశలవిచ్చిరి. ''నేను అహంకార మమకారరహితమగు శుద్ధ భక్తిని భగవంతునిపై కలిగియుండుటకై మాత్రమే వాంఛించుచున్నాను. నాకు వేరేమియు కోర్కెలు లే''వని గిరీశుడు బల్కెను.

''ఐహికములకై లౌకిక మానవుడెట్లు ప్రాకులాడుచుండునో, పతివ్రతయగు భార్యభర్తనెట్లు మోహించునో, తల్లి తన బిడ్డయందెట్టి వాత్సల్యభావమును గలిగియుండునో, అట్టి మధుర భావము దైవముపట్ల వహించిన నీకీశ్వరసాక్షాత్కారము కాక తప్పదు. ప్రపంచమునగల దివ్యక్షేత్రములకుబోవుచు, భగవన్నామ సంకీర్తన చేయుచు, ఎల్లప్పుడు వారిని ధ్యానించుచుండుము. ఆచరణయు, అనుభూతియులేని వేదాదివిద్యలవలన ఆత్మప్రకాశము గలుగనేర''దని శ్రీరామకృష్ణులు నుడివిరి. ఈ ప్రసంగసమయమున గిరీశుడు తాను సత్వర యోగసిద్ధికై తాంత్రిక సాధన మొదలిడి, ''శాంభవీ'' యోగమార్గమున దాను పురుషుడుగను, స్త్రీని ప్రకృతిగను భావించి, తరియింపనెంచితినన, గురుదేవు లీ యోగమార్గము చేటును, ముప్పును దెచ్చునని హెచ్చరించి, దేవు నారాధించుటకు స్నేహ, దాస్య, వాత్సల్యమునున్న గుప్రేమభావములు సుగమములని, నిష్ఠచే, భావము, భావమువలన మహాభావము, అందుండి ప్రేమభావము గలుగునని వక్కాణించిరి.

మరికొంతకాలమునకు గురుదేవులు రామచంద్రదత్తుని యింటికి వచ్చిరని విని, గిరీశుడచ్చటికేతెంచి శ్రీవారి పాదధూళినిగ్రహించి ''తన వంకరగుణము తిన్నబడునా'' యని గురుదేవుల నడిగెను. ''తప్పక తిన్నబడు'' నని గురుదేవులు హామీనిచ్చిరి. తిరిగి తిరిగి ప్రశ్నించెను. అట్లేవారు హామీ నిచ్చుటయు జరుగుచుండెను. ఇంతలో ప్రక్కనున్న మిత్రుడు, పదేపదే గిరీశుడు గురుదేవుల నడుగుటను జూచి, ''గురుదేవుల నట్లేల వేధించెదవయ్యా'' యనిరి. గిరీశుడు ఖిన్నుడై తనలో ''ఔను! ఒక్కసారి చెప్పిన నమ్మకములేనిచో వంద సార్లు చెప్పినను నమ్మకము కలుగదుగదా'' యనుకొనెను. సత్యమును గ్రహించుచుండు

టయు, నహంకారమునకు దెబ్బతగులుచుండు టయు ప్రారంభమైనది. గురుదేవుల కంతట నమస్కరించి, గిరీశుడు తన నాటకశాలకేగెను.

రామకృష్ణులయెడ సునిశ్చల భక్తియేర్పడి, గిరీశుడు గురువే దైవమని తలపనారంభించెను. గురుదేవులకు గిరీశున కెన్ని దుర్గుణములున్న, నవి, యన్నియు, భక్తిపారవశ్యముచే సుగుణ పుంజములుగా మారగలవని తెలియును.

ఈతని దుర్లక్షణములలో ముఖ్యమైనది త్రాగుడు. ఒకనాడు నాటకశాలయందు త్రాగి యుండి, గురుదేవులను శిష్యగణమును జిన్న బుచ్చుకొనునట్లుగ దూషించెను. దీనికి గారణము గిరీశుడు గురుదేవునితో దగ్గరసంబంధము నేర్పర్చుకొనుటకై తనను తండ్రిగ భావింప గురుదేవుని గోరెను. ఇందుకు గురుదేవులు, "నేను నీకేలకుమారుడనుగావలయును? నాతండ్రి పవిత్రమగు ఆధ్యాత్మిక నిష్ఠగలవాడ"ని బదులుచెప్పిరి. ఇదియే సురాపాన ప్రమత్తుడై యుండిన గిరీశునకు కోపకారణ మయ్యెను.

గిరీశుడు త్రాగుడు మానలేడయ్యె. రామకృష్ణులతనిని మానుమని యెన్నడును జెప్పడయ్యె. గాఢవ్యసనములు మాటలకు లొంగవని గురుదేవులకు దెలియును. ఈ విషయములు తెలియక, గిరీశుని త్రాగుడు మాన్పింపుమని యొక శిష్యుడు గురుదేవుని బ్రార్థించెను. గురుదేవులు వెంటనే, "గిరీశుడు వీరజాతికి జేరిన భక్తుడు. ఆతనిని త్రాగుబోతుతనమనెడి దోషమంటదు." అని యాశిష్యుని తీక్ష్ణముగ మందలించిరి. గిరీశునకు దెలియకుండగనే, గురుదేవు నవ్యక్తప్రేమ, భ్రమరకీటకన్యాయమున, గిరీశునియం దత్యద్భుత పరిణామమును కలుగజేసినది.

ఒకనాడొక నటికి సుస్తీగానున్నదనివిని గిరీశుడామెను జూచుటకు వెళ్లెను. తప్పత్రాగి దానియింటనే గడిపి తెలివివచ్చుసరికి జరిగిన విషయమును దెలిసికొని చేసినపాపమున కతి ఖేదమందుచు, దక్షిణేశ్వరమునకు సారాయమును చేతబట్టుకొని వెళ్లి, బుడ్డిని, జోళ్లు, నంగవస్త్రమును బండిలోనేమరచి, గురుదేవుల సన్నిధికి వెళ్లగనే, వారిరెండు పాదములను పట్టుకొని వెక్కి వెక్కి యేడ్వసాగెను. గురుదేవులంతలో గిరీశుడు మరచిన వస్తువుల, నొక శిష్యునిచే భద్రపరిపించెను. కొంచెము శాంతిని జెందుసరికి, గిరీశునకు నోరెండుకొని పోయెను. అప్పుడు తానువచ్చిన బండి వెళ్లిపోవుటయు, సారాబుడ్డిని జారవిడిచితిననియు, తెలిసికొనెను. గురుదేవులీ విషయమును గ్రహించి వెంటనే శిష్యునిచే గిరీశునకా సారాయ నందజేయ, వారందరియెదుట గిరీశుడు దానిని బుచ్చుకొనెను. చేసినపని స్ఫురణకురాగనే, గిరీశుడు విపరీతమగు సిగ్గుపడెను.

గురుదేవులు వెంటనే "దీనికేమియు ఆక్షేపణ లేదు. మంచిది, నీమనఃపూర్వకముగ, నీ వనుభవింపుము కాని, యిది కడసారి భోగమని మాత్రము గ్రహింపు" మనిరి. గిరీశుడు పరిశుద్ధుడు కాగలడని గురుదేవులకు దెలియును. గురుదేవులిచ్చిన, ధీమా, గిరీశునకు బాగుగా మనస్సునకు బట్టి, యిది జరిగినప్పటినుండియు, సారాయ మతడు ముట్టకుండెను. చిరకాలము నుండియున్న త్రాగుడెట్లు మానగల్గితిరని గిరీశుని గొందరు ప్రశ్నించిరి. అంత గిరీశుడు, "నేను త్రాగుడును వదలిపెట్టలేదు. నేనిప్పుడు, మరియొకరకపు సారా త్రాగుచున్నాను. వెనుకటి సారాకన్న భగవన్నామసుధారసము నాకు బూర్తిగ మత్తుగల్గించి, యీశరీరము, నీ ప్రపం

చమును మఱపించుచున్న''దని ప్రత్యుత్తర మిచ్చెను.

మరియొకనాడు ప్రసంగించుచు గురుదేవులు–గిరీశునితో నీ కార్యకలాపములతో బాటు, ఉదయాస్తమయముల గొంత భగవంతుని స్మరణయు జేయుమనిరి. గిరీశుడు ''నిత్యక్రమ మసహ్యము. ప్రార్థన, ధ్యానము నేను జేయ జాలను. దైవప్రార్థన చేయుటకన్న నాత్మ హత్య గావించుకొందు''ననెను.

శ్రీ రామకృష్ణులున్నతస్థితి నున్నవారై యాగిరీశుని చీకాకు గ్రహించి, ''దేనికిని నీ వొప్పుకొనుటలేదు, మంచిది, నీకు భగవత్ సాక్షాత్కారము కావలసియు, నీ వతనివైపు నకు మరలలేనిచో, నీ వేమియును జేయ నక్కరలేదు. నీకై నేను జపతపములు చేసె దను. ఇప్పటినుండియు, నీవు కేవలము భగవ దధీనవృత్తిని మెలగుచుండునని, నాకు వాగ్దా నము మాత్రమియ్యవలెను'' అని, అనగ ఆలోచనతక్కువై, విషయమును పూర్తిగ గ్రహింపజాలక, గిరీశుడు,''బ్రతికితినిరా''యని యొక నిట్టూర్పువిడచుచు, గురుదేవుల యౌ దార్యము, బూర్ణప్రేమవలన తానంతవరకు చేసిన పాపము లెల్ల నశించి ముక్తి నొందితి నని యానందాబ్ధిని నోలలాడుచు, ''సరే,'' యని ఒప్పుకొనెను. గిరీశుడు, ''గురుదేవులు నను రక్షించిరి. నాధారము వారిది. నేను గాలివలె విడివడితిని. గురుదేవుల యనంత శక్తిచే నా తెప్ప చల్లగ నొడ్డెక్కిన''దని తలం చెను. కాని, తనకు స్వేచ్ఛపోయి రామకృష్ణు లకు దాను బందీయయ్యెనని అతడు గ్రహింప లేదు.

శ్రీరామకృష్ణుల యపారమగు ప్రేమను గూర్చి గిరీశుడిట్లు చెప్పియుండెను ''ఒకనాడు గురుదేవులు భుజించుతరి, నేను దక్షిణేశ్వరము నకు వెళ్లితిని. అపుడు, వారు సేవించుచున్న గంజిని గొంచెము నన్నుగూడ ద్రాగుమనిరి. నేనును, వారి ప్రక్కన కూర్చొనగనే, గిన్నె లోచుక్కయు లేకుండ నూడ్చి, తల్లి బిడ్డకు దినిపించినట్లుగ, దానినాచే దినిపించిరి. నేను పెద్ద వాడనను జ్ఞానమైనను లేదయ్యె! అపవిత్రము లగు నాయధరముల కాహారము నందిచ్చిన గురుదేవుల పవిత్ర దివ్యహస్త స్పర్శను తలచి నప్పుడెల్ల నాకు వెఱ్ఱెత్తినట్లుండి, యిదికలయా వాస్తవమాయని విస్మయభరితుడనైతిని. శ్రీ వారి యపారమగు ప్రేమయే నా మనశ్శాంతి కాధారము.''

''అనృతమాడవలదని మీ యాన. కాని లెక్కలేనన్ని యసత్యములను మీతోనే యా డితిని. నే నెట్లు సత్యవ్రతుడ గాగల''నని గురు దేవులను బ్రశ్నించితిని. గురుదేవులు వెంటనే, ''గిరీష్ బాబూ! నీవు సత్యాసత్యాతీతుడ'' వనిరి. ''నేనసత్యమాడదలచినపుడెల్ల శ్రీవారి దివ్యమూర్తి నామనసునకువచ్చి, యాయనృత వాక్యము బయటకు రానీయదుగదా! ఇంతేగాక, శ్రీవారు నాకొరకై చేసిన జపఫలితముగ, నా నాలుక యణచివేయబడుచున్నట్లుండి, మాటరా దయ్యెను. శ్రీరామకృష్ణుల సర్వోత్కృష్ట మగు మహాప్రేమచే నాయందలి కామ, క్రోధ, దురహంకారాదులన్నియుఁ బటాపంచలైనవి. ఇంతకన్న నేనేమని చెప్పగలను!''

(సశేషము)

# నవరత్న చిత్తప్రబోధములు

## శ్రీమజ్జీ రామమూర్తి

ఉ॥ కంటికి గానవచ్చినది । కల్లసుమీ యిలుగాకయున్న నే
వెంటనుగన్న నిత్యపద । విన్ విలసిల్లున దొండుగల్గెనే
గంటకు నొక్కరీతిగ వి । కారముగొందు జగంబువీడి నీ
వొంటరివై సునిశ్చలత । నొంది పరేశు భజింపు చిత్తమా. 1

ఉ॥ చిత్తజుడెన్న దుర్జయుడు । చిందరవందర జేసి ధైర్యము
వ్వొత్తుగబట్టి వాని దగు । వేడిమి కోరువలేక శంకరుం
డత్తరి విష్ణుమాయబడి । యంత పరాభవమందె గాన నీ
విత్తరి మెత్తవోక యెటు । లేని పరేశు భజింపు చిత్తమా. 2

ఉ॥ మారుని త్రోవబోక కొర । మాలిన కోర్కెకు తావులీక సం
సారపు రొంపిలోబడక । సంఘములన్ని పరిత్యజించి పా
కారినుతప్రభావు నవి । కారు నుదారు నతీతు భక్త మం
దారుని కోరువాని కను । దారి పరేశు భజింపు చిత్తమా. 3

ఉ॥ భూజల వహ్ని వాయు దివి । భూతమయంబగు దేహమస్థిరం
బీజను లీ సతీమణులు । నీ సుతు లీ పశు లీ ధనంబు లీ
రాజితకీర్తి సంపదలు । రావుగదే నిను గూడి యెవ్వి నీ
తో జనుదెంచు కర్మవెను । దోయ పరేశు భజింపు చిత్తమా. 4

ఉ॥ నీట జనించు బుద్బుదము । నీ తను వాప్తులు పుత్ర మిత్రలం
పాటముజూడగా నధిక । భారము సార విహీన మీగృహం
పాటును గోటమీటిన యు । పాయము కాయముతోడ నుంటచే
మాటికి మాటికిన్ నిగమ । మాన్యు పరేశు భజింపు చిత్తమా. 5

ఉ॥ ఏటికి మాయలోఁబడి యఽహీనము శాశ్వతమైన సౌఖ్యమున్
ఏటను బుచ్చజూతు వతి ఽ వేల సుఖాబ్ధిని జేర్చునాదము
న్నాటికి భక్తియే సుమి యఽమాయకమై తగుభక్తి నూని నీ
నోటినివిచ్చి యొక్కపరి ఽ నోలి పరేశు భజింపు చిత్తమా. 6

ఉ॥ కర్మముచేత నీ విలను ఽ గాంచితి జన్మము పుత్రమిత్రులున్
కర్మమె భార్యకర్మమటు ఽ కర్మనిబద్ధుడవై జగంబునన్
ధర్మపు మార్గమున్ విడిచి ఽ దర్పములాడగ నేల వేగ ని
ష్కర్ముడవైన మేలికను ఽ చాలు పరేశు భజింపు చిత్తమా. 7

ఉ॥ నిన్నెద నమ్మియుంటి నికఽనిన్ విడువన్ నినువేడుకొంచు నీ
సన్నిధి నిల్వఁగోరి మనఽసారగ నిన్నుభజింపుచుంటి నా
పన్నుడ నన్నువీడతగ ఽ వా యనివేడి సుఖంబుజెంద నీ
చిన్నతనంపు భావములు ఽ చెండి పరేశు భజింపు చిత్తమా. 8

ఉ॥ శాశ్వతమట్టె సంపదలు ఽ సాగరవీచులు కన్న నెక్కుడా
విశ్వమునన్ జరామరణ ఽ వేదనలేని వాఁగో శరీరముల్ !
ప్రశ్వములైన కామ్యముల ఽ పాలయి చిక్కిన లెస్స యట్టె జీ
వేశ్వర భావమందుటకు ఽ వేగ పరేశు భజింపు చిత్తమా. 9



# గ్రంథ సమీక్ష

## రజతోత్సవ సంచిక

ప్రకాశకులు శ్రీమళయాళస్వాములవారు, శ్రీవ్యాసాశ్రమము. డబుల్ క్రౌన్ 1/8 సైజు 239 పుటలు. వలయువారు శ్రీవ్యాసాశ్రమము, ఏర్పేడు పోష్టు, చిత్తూరుజిల్లాయని వ్రాయవలయును.

ఇది శ్రీవ్యాసాశ్రమ రజతోత్సవ సూచకముగా ప్రచురింపబడిన సంచిక. ఇందు ఆశ్రమమునకు సంబంధించిన వివిధ ఛాయాచిత్రములు ప్రకటింపబడియున్నవి. ఆశ్రమవాసులగు శ్రీ మళయాళస్వామివారి ఛాయా చిత్రములు వివిధసమయములలో దీయబడినవియు పెక్కులు గలవు. ఈ చిత్రముల విషయములు దెలుపగల వ్యాఖ్యలుగూడ నందందు బొందుపఱుపబడి యున్నవి. ఇంతియకాక ఆశ్రమమునకు వివిధములుగ సేవచేయుచున్న మహనీయుల చిత్రపటములును ఇందు గలవు. మఱియు ధర్మోప న్యాసము, మానవజీవితము, బ్రహ్మచర్యము, ఆత్మవిద్య, "భుక్తి-ముక్తి"-ఇట్టి ఆధ్యాత్మిక వ్యాసరాజము లనేకములు గలవు. దీనిని జదివిన ముముక్షువులు ఎంతయేనియు శ్రేయము నందగలరు. ఆంధ్రదేశమునకు అపార సేవ గావించుచున్న శ్రీస్వాములవారి యనుగ్రహమునకు ఆంధ్రలోకము పాత్రమగుగాక.

## శ్రీ రామతీర్థస్వామి జీవితము

రచయిత శ్రీబులుసు వేంకటేశ్వరులు ఎం.ఏ. ఆంధ్రోపన్యాసకులు, పి.ఆర్. కాలేజి. కాకినాడ, డబుల్ క్రౌన్ 1/16 సైజు (186 + 8) పుటలు. మూల్యము రూ. 2-0-0. వలయువారు శ్రీబులుసు వేంకటేశ్వరులు, రామారావుపేట, కాకినాడ అని వ్రాయ వలయును.

శ్రీరామతీర్థస్వామివారి జీవితరహస్యముల ని గ్రంథము విపులముగ దెలుపుచున్నది. గ్రంథకర్త వచియించినట్లు—'నాస్తిక దుష్ప్రభావముల ప్రజాహృదయముల నుద్ఘాతిలూగించు నేటికాలమున ముఖ్యముగా నిట్టి మహనీయుల సందేశములు దేశమునకు విద్యార్థిలోకమునకును ఆదర స్తుతిపాత్రము లనుటలో సందేహములేదు.' ఈ గ్రంథము సులభశైలియందు చక్కని గ్రాంథికభాషయందు విరచింపబడి పాఠకలోకమునకు ఉత్సాహము కల్పించుచున్నది.

మచ్చునకు

"స్వామి వివేకానందు నైశ్వర్య ప్రేరితవక్తృత్వము, ఆతని జాజ్వల్యమాన సర్వసంగత్యాగము, ఆతని యప్రతిహతవీరవ్యక్తిత్వము, ఆతని యనన్యసామాన్యమోహనవిగ్రహము, ఆతని యమోఘ ధీప్రతిభావిలాసము, నివి యన్నియు లాహోరున నున్న యాతని యునికిచే పంజాబు ప్రజాలోకమునను, మహారాష్ట్రదేశావేశములను గలిగించినవి. లాహోరులో నాతడు "వేదాంతము"నుగూర్చి యిచ్చిన యుపన్యాస మాతని మహోపన్యాసములలో చింతామణి."

# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

## శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము)

540 పుటలు సర్వాంగ సుందరమగు చతుర్థ ముద్రణము వెల రూ. 3-4-0

## శ్రీ మద్భగవద్గీత

480 పుటలు శ్రీధరీయ టీకాసారప్రతిపద టీకాతాత్పర్య విశేషార్థ సహితము రూ. 3-0-0

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

350 పుటలు (మద్రాసు ఆంధ్ర విశ్వవిద్యాలయములందు పాఠ్యగ్రంథము) రూ. 2-8-0

## శ్రీ శారదాదేవి చరిత్ర

256 పుటలు (ఆంధ్ర విశ్వవిద్యాలయమున పాఠ్యగ్రంథము) వెల రూ. 1-12-0

## శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

136 పుటలు (ఆదర్శప్రాయుడగు గృహస్థుని జీవితము) వెల రూ. 1-4-0

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| శారదా ప్రసంగములు .. | 2 | 8 | 0 | గురూపదేశములు .. | 0 | 8 | 0 |
| ప్రబోధరత్నాకరము ... | 2 | 4 | 0 | నా సంస్కారణ యుద్ధవిధానము ... | 0 | 6 | 0 |
| రాజయోగము .. | 2 | 4 | 0 | నా గురుదేవుడు .. | 0 | 6 | 0 |
| కర్మయోగము .. | 1 | 8 | 0 | నవీన భారతదేశము . | 0 | 4 | 0 |
| భక్తియోగము . | 1 | 4 | 0 | శ్రీ పరమహంస జీవిత సంగ్రహము | 0 | 4 | 0 |
| వివేకానందలేఖావళి (మొదటి భాగము) | 1 | 8 | 0 | ముక్తిమార్గము .. | 0 | 3 | 0 |
| వివేకానందలేఖావళి (రెండవ భాగము) | 1 | 8 | 0 | సర్వం విష్ణుమయం జగత్ (తెలుగు) | 0 | 8 | 0 |
| అనుష్ఠాన వేదాంతము ... | 1 | 4 | 0 | శ్రీ రామనామ సంకీర్తనము ... | 0 | 1 | 0 |
| వివేక సూర్యోదయము . | 1 | 0 | 0 | యతిగీతము (పద్యకావ్యము) | 0 | 1 | 0 |
| శ్రీ పరమహంస నీతికథా రత్నములు | 0 | 12 | 0 | సింహగర్జన 0 0 6 డజను | 0 | 5 | 0 |
| భక్తిమార్గము .. | 0 | 8 | 0 | నా మతము 0 0 6 డజను | 0 | 5 | 0 |
| చికాగో నగరోపన్యాసములు .. | 0 | 8 | 0 | | | | |

ఇవియేకాక

సంస్కృత, ఆంగ్ల, ద్రావిడ, కన్నడ గ్రంథములును

వేదాంతకేసరి (ఆంగ్లము) శ్రీరామకృష్ణ విజయము (తమిళము)

అను మాస పత్రికలును మాయొద్ద దొరకును

శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి

మున్నగువారి ఛాయాచిత్రములును మాయొద్ద దొరకును

ఇట్లు వ్రాయుడు:

మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి

సంపాదకులు : శ్రీ ఋతజానందస్వామి; శ్రీ వేగురుమూడి వేంకటకృష్ణరావు
శ్రీ కె. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటరు ప్రెస్సు లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి,
శ్రీ అవినాశానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 20-9-50.





# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౭ సంచిక ౪

విషయ వివరణము

# శ్రీ రామకృష్ణ ప్రభ

## చందాదారులకు

౧. పత్రిక ప్రతిమాసము 20-వ తేదీన వెలువరింపఁబడును. ఒక వారము, పదిరోజులు చూచి ప్రతి మీకు అందకపోయినయెడల ఉత్తరము వ్రాయుఁడు.

౨. సంవత్సర చందా రు. 3 లు మాత్రమే. జనవరినెల నుండిగాని జూలైనెల నుండిగాని చందాదారులుగఁ జేరవచ్చును. విడిప్రతి రూ. ౦—౬—౦ లు. హిగిన్‌బాథంస్‌వారి స్టాలులోఁగాని, మీ పత్రికా ఏజెంటును గాని అడుగుఁడు

3. ఉత్తర ప్రత్యుత్తరములు వీలైనంతవఱకు ఇంగ్లీషున వ్రాయుచు మీ చందాదారు సంఖ్య నుదాహరింపుఁడు. ఉత్తరములను "మేనేజరు, శ్రీరామకృష్ణప్రభ" అను చిరునామాకు వ్రాయుఁడు.

౪. చిరునామాయందు ఎట్టిమార్పు కలిగినను 10-వ తారీఖునకు ముందుగా మా కార్యాలయమునకుఁ దెలుపవలయును. లేనిచో, పత్రిక పూర్వపు చిరునామాకే పంపఁబడును.

## వ్యాసకర్తలకు

౧. కేవలము నైతిక ధార్మిక వైజ్ఞానిక విషయకములైన వ్యాసములేకాక, సాహిత్యమునకును కవిత్వమునకును సంబంధించిన ఏ వ్యాసములైనను బంపవచ్చును. సులభ సుందరమగు గ్రాంథిక భాషలో వ్రాయవలయును.

౨. వ్యాసములు అచ్చులో మూఁడు పుటలకు మించరాదు. ప్రతినెల ఒకటవ తేదీకి వ్యాసములు మాకు అందవలెను.

3. వ్యాసములను, విమర్శకుఁ బంపు గ్రంథములను, వినిమయముగఁ బంపెడి పత్రికలను "సంపాదకుఁడు, శ్రీ రామకృష్ణ ప్రభ" అను చిరునామాకు వ్రాసి పంపవలెను.

౪. వ్యాసము తిరుగఁ బంపఁబడవలయుననుచోఁ దగు పోస్టేజి చేర్చి పంపవలయును.

---




# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౭ } ౧౯౭౦ అక్టోబరు – వికృతి – ఆశ్వయుజము { సంచిక ౪


శ్రీ శారదేశ్వరీదేవ్యైనమః

## దేవీ స్తోత్రము

శ్లో॥ త్వయైవధార్యతే సర్వం త్వయై తత్ సృజ్యతే జగత్
త్వయై తత్ పాల్యతే దేవి త్వమత్స్యన్తే చ సర్వదా॥

గీ. సర్వమునకు మూలాధార ఽ శక్తివౌచు, భువనకోటి సృజింతువు ఽ పొలుపుమీర
పాలనంబు గావింతువు ఽ ప్రళయమందు; లీనమొనరింతు ఽ విదినీకు లీల! దేవి!!! 1

* * * *

శ్లో. త్వం శ్రీ త్వమీశ్వరీ హ్రీస్త్వం బుద్ధిర్బోధలక్షణా
లజ్జా పుష్టి స్తథా తుష్టి స్త్వం శాంతిః క్షాంతిరేవచ॥

గీ. నీవ శ్రీ, యీశ్వరియు హ్రీయు ఽ నీవ, బుద్ధి, లజ్జయును, బుష్టి, తుష్టియు ఽ లలితశాంతి,
దేవతాసముచితగుణ ఽ దీప్తి, క్షాంతి, నీవ, సర్వజగజ్జన ఽ నీ! ప్రణతులు! 2

* * * *

శ్లో. యయా త్వయా జగత్స్రష్టా జగత్పాతాత్తియోజగత్
సోపి నిద్రా వశం నీతః కస్త్వాం స్తోతుమిహేశ్వరః॥

గీ. విశ్వసృష్టి, స్థితి, లయముల్ ఽ విబుధవరులు; మెచ్చు రీతిని సల్పెడు ఽ మేటి విభుని
విష్ణునే నిద్రకవలీల ఽ వివశుజేతు; వీవు! నిను నుతింపగలవా ఽ రెవరు? తల్లి! 3

* * * *

[బ్రహ్మదేవుని చండీస్తవము]



ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ

# శ్రీ రామకృష్ణ వచనామృతము — 'మ.'

శనివారము,
21, జూలై 1883.

మధ్యాహ్నము నాలుగు ఘంటలయినది. శ్రీరామకృష్ణుడు కొందఱు భక్తులతో అధర సేనుడు, యదుమల్లికు మొదలగువారిని వీక్షింప బయనమాయెను. శ్రీవారితో బాటు రామలాల్, 'మ.' మఱియొక భక్తుడు నుండిరి.

'మ.' ఆంగ్లవిద్యాభ్యాసానుసరణమువలన జన్మాంతర సిద్ధాంతము నంగీకరించువాడుకాడు. కాని శ్రీరామకృష్ణుని జేరిన పిదప కొన్నాళ్లకు జన్మాంతర సంస్కార సిద్ధాంతమునం దాతనికి నమ్మకము కుదిరెను. అధరసేనుడు శ్రీరామకృష్ణునియెడ నసాధారణ భక్తిప్రపత్తుల గనుబఱచుట కాతని పూర్వజన్మసంస్కారములే కారణమని 'మ.' కు స్ఫురించెను. కాని యీ విషయమున 'మ.' కు సంపూర్ణ విశ్వాస ముదయింపకపోవుటవలననే తన సందియమును దీర్చుకొనుటకు దక్షిణేశ్వరమున కాతడేతెంచెను. శ్రీరామకృష్ణునితో సంభాషింప గడంగెను.

శ్రీరామకృష్ణుడు — అధరసేనుని జూడగా నీకేమి తోచుచున్నది?

'మ.':— ఆతనికీశ్వరానురాగము మెండుగా నున్నది.

శ్రీరామ — అధరసేనుడు నిన్నెంతయో పొగడుచు మాట్లాడుచుండును.

ఇందులకు 'మ.' ఏమియు ప్రత్యుత్తర మీయక కొద్దికాల మూరకుండెను. కొంత సేపటికి,

'మ.' — నాకు పూర్వజన్మము, సంస్కారములు — వీనిపై నంతగా నమ్మకము కలుగక యున్నది. ఇందువలన నా భక్తికేమయినను హాని కలుగునా?

శ్రీరామ:— భగవత్సృష్టియందు అన్ని విషయములు జరుగగలవని నమ్మిన నంతయే చాలును. నేను తలచినదియే సత్యము. అన్యమంతయు దోషభూయిష్టము అని తలంపవలదు. పిదప ఆయనయే నీకు సర్వము తెలుపగలడు. భగవల్లీల గ్రహింపగలవారెవరు? సృష్టివైచిత్ర్యమే మనము చక్కగా నరయజాలము. నేనెప్పుడును భగవల్లీలల గ్రహింప బ్రయత్నింపను. భగవంతుడు సర్వము గావింపగలడని తెలిసికొని యాయన ధ్యాననిమగ్నుడనై కాలము గడుపుచుందును. 'నేడు తిథినక్షత్రము లేవి' యని యెవరో శ్రీ హనుమంతు నడుగగా ఆయన 'నేను తిథినక్షత్రముల నెఱుగను. కేవలము రామనామజపమొనరించుచుందు'నని వచించెను. ఆయన అసాధారణశక్తి నెవ రెఱుంగగలరు? బలరాముడుగూడ శ్రీకృష్ణుని భగవంతునిగా నరయజాలక యుండెను.

'మ.':— భీష్మునిగూర్చియు నిట్లే మీరు వచించియుంటిరి.

శ్రీరామ:—ఏమి చెప్పియుంటెని?

'మ'—భీష్మదేవుడు శరతల్పగతుడై యేడ్చుచుండెను. పాండవులు శ్రీకృష్ణనితో నిట్లు పలికిరి. 'బావా! ఇది యేటి యాశ్చర్యము! భీష్మదేవు డింతటి మహాజ్ఞాని. అయినను తనకు మరణము సంభవించుచున్నదని యేడ్చుచున్నాడుగదా!'. 'మీరు వెళ్లి ఆయన నడుగుడు' అని శ్రీకృష్ణభగవానుడు వచించెను. పాండవు లట్లడిగిన వెంటనే భీష్ముడు, 'ఈశ్వరలీలల నేనొకింతయినను గ్రహింపజాలకున్నాను. ఓ కృష్ణా! నీవు పాండవులతో దిరుగుచున్నావు. అడుగడుగునకు వారిని కాపాడుచున్నావు. అట్లయినను వారికష్టముల కంతము గోచరించుటలేదే యని చింతించుచున్నాడను' అని పలికెను.

శ్రీరామ:—తన మాయచే భగవంతుడు సర్వమును గప్పివైచినాడు. ఏమియు బయలు వెట్టుటలేదు. కామినీకాంచనములే మాయ. ఈ మాయను ద్రోసివేయకలిగినవాడే భగవల్లాభము నందగలడు. నేనొకప్పు డొకని కీశ్వరదర్శనమునుగూర్చి ప్రవచించుచుండగా నాకు భగవాను డిట్లు కనుబఱచెను. నాయెదుట ఈ దేశమునందలి చెఱువున నాచును దొలగించి యొకడు నీరుద్రావుచుండెను. అప్పుడు నీరు స్ఫటికమువలె స్వచ్ఛముగా నుండెను. ఇందువలన నాకు సచ్చిదానందబ్రహ్మము మాయ యను నాచున గప్పబడినట్లు జూపించెను. ఆ నాచును ద్రోసివేయకలిగినచో మంచి నీరు త్రాగగలము. భగవంతుని చైతన్యము వలననే యావత్ప్రపంచము చైతన్యమయమై యున్నది. నీటియందలి చిన్నిచిన్ని చేపలన్నియు గూడ నప్పుడప్పుడు చైతన్యము కలిగి ప్రవర్తించుట నాకు గోచరించుచున్నది. ఎండిన భూమిపై వర్షము వర్షించి భూమియంతయు దడిసి యెల్లచోట్ల నీరు ఎట్లు వ్యాపించియుండునో యట్లే భగవంతుని చైతన్యము ప్రపంచమంతటను వ్యాపించియున్నది. ఎన్నియో దర్శనములను గంటిని. కాని వానివలన నా కావంతయు గర్వము కలుగలేదు.

'మ.'—మీకు గర్వమెట్లు కలుగగలదు?

ఒకప్పుడు సాక్రటీసను జ్ఞాని గ్రీసు దేశమున నుండెడివాడు. ఒకనా డాకాశవాణి యాతని బిలిచి 'నీయట్టి జ్ఞాని ప్రపంచమున లే'డని వచించెను. అది విని సాక్రటీసు ఆశ్చర్యమున మునిగిపోయెను. పిదప నత డేకాంతప్రదేశమున కేగి ధ్యానముచేయగ ఈ వచనమునకు సరియైన యర్థమును గ్రహింపగలిగెను. అనంతర మాతడు తన స్నేహితుల బిలిచి యిట్లు పలికెను "ఈనాడు నేనొక విషయము గ్రహించితిని. 'నాకేమియు తెలియదనునదియే' యా విషయము." అందఱును తామే జ్ఞానులమని తలంచెదరు. కాని వాస్తవముగా నందఱును అజ్ఞానులే.

శ్రీరామ—ఒక్కొక్కప్పుడు నే నిట్లు తలంచువాడను 'నాకేమి తెలియునని యీ గొప్పగొప్పవారెల్ల రిచటికి వచ్చుచున్నారు?' వైష్ణవచరణుడు గొప్ప పండితుడు. అత డిట్లు పలికెడివాడు. 'నీవు వచించు విషయములన్నియు శాస్త్రములందున్నవి. కాని నీనోటినుండి వినవలయుననియే నీ దగ్గఱకు వచ్చుచున్నాను.'

'మ.'—తమ పలుకులన్నియు శాస్త్రసిద్ధములే. ఈ విషయమే ఆనాడు నవద్వీపగోస్వామి కూడ పలికెను.

శ్రీరామ:—నాయట్టి పండితునైనను సాధువునైనను నీ వెచటనైనను జూచితివా?

'మ.' —భగవంతుడు మిమ్ము తన చేతులార సృష్టించెను. మిగిలినవారిని యంత్రము వలన సృజించెను.

శ్రీరామ—(నవ్వుచు) ఇది యేమి యిట్లు పలుకుచున్నావు!

ఇట్లు కొంతకాలము నవ్వుచు పిదప శ్రీ గురుదేవుడు ఇట్లు పలికెను 'ఒట్టు పెట్టుకొని చెప్పుచున్నాను. నాకు గర్వము లవలేశమైయినను కలుగలేదు.'

'మ.' —విద్యాభ్యాసమువలని లాభము నాకేమియు తెలియదను విషయమును గ్రహించుటయే.

శ్రీరామ—అదియే సరి. నే నెద్దియును గాను. సరే! నీకు ఆంగ్ల జ్యోతిషమున నమ్మకము గలదా!

'మ.' —వారి నియమానుసరిణి క్రొత్త క్రొత్త గ్రహములును నేర్పడవచ్చును. యురానెస్ గ్రహముయొక్క వంకర టింకర చలనమునుబట్టి దూరదృష్టి యంత్రమువలన నూతన గ్రహము నెప్ట్యూనును జూచిరి, గ్రహణమునుగూడ వారు లెక్కించి చెప్పగలరు.

శ్రీరామ—కావచ్చును.

ఇంతలో బండి అధరసేనుని గృహమును జేరెను.

శ్రీరామ—('మ.' తో) సత్యముపై నాధారపడియుండుము. అట్లయినచో తప్పక భగవద్దర్శనము కలుగును.

'మ.'—మీరు నవద్వీపగోస్వామికి జెప్పిన మఱియొకమాట జ్ఞాపకమునకు వచ్చుచున్నది 'ఓ భగవానుడా! నేను నిన్నే కోరుచున్నాను. నీ భువనమోహిని మాయవలన నన్ను ముగ్ధునిగావింపకుము. నాకు వలయునది నీవే.'

శ్రీరామ—ఔను. దీనిని ఆంతరికముగా పలుకుము.

శ్రీరామకృష్ణ గురుదేవు డధరసేనుని యిల్లు సేరెను అందలి ముంగలి గదియందు అధరసేనుడు, 'మ.', రాములాల్ మొదలగు భక్తులు కొందఱును శ్రీవారి చుట్టును గూర్చొనియుండిరి. ఇరుగుపొరుగులవారుగూడ కొందఱు శ్రీరామకృష్ణ గురుదేవుని దర్శింపవచ్చిరి.

శ్రీరామ—(అధరసేనునితో) ఏదీ! రాఖాలునితో నీవు జెప్పితివి కాదా?

అధరుడు —చిత్తము, ఆతనికి చెప్పియుంటిని.

రాఖాలు కొఱకు శ్రీరామకృష్ణులవారు మిక్కిలిగా తొందరపడుట జూచి, అధరసేను డందున్నవారిలో నొకని రాఖాలు పిలుచుటకై బంపెను.

అధరుడు శ్రీరామకృష్ణులవారితో గూర్చొని యిట్లు పలుక నారంభించెను "మీ రెన్నాళ్ల నుండియో మా యింటికి రాకుంటిరి. మీ రీరోజు మా యిల్లు చేరుదురుగాక యని భగవంతుని ప్రార్థించితిని. ఆ సమయమున నా కన్నీటిబిందువులు ప్రవహింప నారంభించెను.

శ్రీరామ—(నవ్వుచు) ఏమిటీ! ఏమనుచుంటివి?

సంధ్య యయినది. దివ్వియలు వెలిగింపబడెను. అందున్న జగన్నాథపటమును జూచి శ్రీరామకృష్ణ గురుదేవుడు చేతులు జోడించి నమస్కరించెను, పిమ్మట నెమ్మదిగా ఆంతరంగికముగ మూలమంత్రము జపించుచున్నట్లు గోచరించెను. తదుపరి 'గోవింద గోవింద సచ్చిదానంద హరి హరి' యనుచు భగవన్నామ సంకీర్తనము చేయ మొదలిడిరి. సంకీర్తనము మధువర్షమువలె నత్యంత మనోహరముగా నుండెను. భక్తు లనంతముగా దానిని విని

యానందించిరి. ఆ సమయమున రామలాలా లొక కీర్తన బాడ దొడగెను. (పాట భావము)

తల్లీ! హరమోహినీ! భువనమంతయు తన్నుతా మంచునట్లు గావించితివి మూలాధార మహాపోత్పలమునందలి వీణావాద్యవినోదినీ! శరీరమను యంత్రమున సుషుమ్నాది తంత్రిత్రయమునందును గుణమయ మహామంత్రమునందును నీవే భాసిల్లుచుందువు నీవే గుణత్రయ విభాగినివి నీవు ఆధారమున భైరవీరాగ రూపిణివి, స్వాధిష్ఠానమున శ్రీరాగస్వరూపిణివి, మణిపురమున మల్లారిరాగమవు, అనాహతమున వసంతరాగమవు, విశుద్ధమున హిల్లోలరాగమవు, ఆజ్ఞాపూరమునందు కర్ణాటకరాగమవు—ఇట్టి స్వరూపమున రాగతాళములతో ముక్కాలమును సంచరించుదానవు ఓ మహామాయా! మమ్ములను మోహపాశమున అత్యంత సులభముగా బంధింపగలవు ఓ సౌదామినీ! తత్త్వము నీయొద్ద మాత్రమే యున్నది దానిని నీవు ఆచ్ఛాదించివైచితివి

తరువాత మఱియొక పాట నారంభించెను. (దాని భావము)

భవదారాభయహర! నీ నామము నేను వినియుంటిని. నా భారము నీకే వదలితిని, రక్షింపుము. రక్షింపుము. బ్రహ్మాండధారీ! నీవే తల్లివి. విశ్వవ్యాపినివి. నీవు కాళివో రాధవో గుర్తింపగలవారెవరు? జీవు లందరియందు వసించు తల్లివగు నీవు మూలాధారకమలమున కులకుండలినీ స్వరూపిణివై విరాజిల్లుచున్నావు.

దానిపై నున్నది స్వాధిష్ఠానము. అచ్చట చతుర్దళపద్మముననే నీ యధిష్ఠానము. అనంతరము వజ్రాసనమగు షడ్దళపద్మము సయితము నీ యధిష్ఠానమే. అంతకు పైనున్నది నాభిస్థానము. అదియే మణిపురమనబడును. అందు నీలవర్ణమయమైన దశదళపద్మము గలదు. ఓ జననీ! సుషుమ్నామార్గమున బయలుదేరి యీ కమలములలో నొక్కొక్కదానిద్వారా పైకి రమ్ము. ఇంకను పైనున్నది సుధాసరోవరము. అందు మనోహరమయిన రక్తవర్ణ ద్వాదశదళపద్మము కలదు. అందు నీ పాదపద్మములు మోపిన నది వికసించును. ఆ హృదయమునందలి గాఢాంధకారము పటాపంచలగును. దానిపై నున్నదియే కంఠస్థలము. అచ్చట ధూమ్రవర్ణముగల షోడశదళపద్మము గలదు. ఆ పద్మమున సూక్ష్మాకాశము గలదు. ఈ సూక్ష్మాకాశమును జేరినవారు ప్రపంచమంతయు మహాకాశమున విలీనమగుటను గాంతురు. దానిపై లలాటస్థానమున ద్విదళపద్మము గలదు. దాని రక్తవర్ణము నాకు నేత్రోత్సవము గొలుపును. మనస్సు అందు బంధింపబడి జగన్నాటకమును జూచుచుండును. అన్నింటికిని పైన శిరమున నత్యంతమనోహరమగు సహస్రదళపద్మము గలదు. అందు వసించువాడే పరమశివుడు. ఆయన సన్నిధి నున్న తల్లివి నీవు. తల్లీ! నీవు ఆద్యశక్తివి. జితేంద్రియ నారీమణివి. యోగీంద్రులు మునీంద్రులు నగేంద్రకుమారినిగా నిన్ను గొలుతురు. నీవు శివునిశక్తివి. ఈ భవసాగరమున నడుగుపెట్టనియట్లు నీవు నన్ను రక్షింపవలయును. నీవు ఆద్యశక్తివి. తల్లీ! పంచతత్త్వములును నీవే. కావున తత్త్వాతీతవయిన నిన్నెవరెఱుంగగలరు? భక్తుల కొఱకే గదా నీ వీ చరాచరరూపముల దాల్చితివి! వారి పంచేంద్రియములును పంచభూతములందు లయమునందినపుడు వారు నీ నిరాకారరూపమునే కాక మఱి దేనిని జూతురు!

రామలాలు 'దానిపైనున్నదియే కంఠస్థలము. అచ్చట ధూమ్రవర్ణముగల షోడశదళ పద్మము గలదు. ఆపద్మమున సూక్ష్మకిరణముగలదు .. ' ఈ భాగమును బాడుచుండ, శ్రీరామకృష్ణగురుదేవుడు 'మ.' ను బిలిచి 'ఇదంతయు వినుము. ఇదియే సచ్చిదానంద నిరాకారదర్శనము. కుండలినీ శక్తి విశుద్ధచక్రమును జేరినపుడు సర్వమును నాకాశమయముగా గనుంగొనును' అనెను.

'మ' —చిత్తము.

శ్రీరామ· — ఈ మాయాబద్ధుడయిన జీవుడు జగత్తును దాటినయెడల ఆ నిత్యవస్తువును జేరగలడు. నాదము నతిక్రమించినచో వారికి సమాధికలుగును. ఓంకారసాధన జేయ నాదభేదము కలిగి సమాధి ప్రాప్తించును.

శ్రీధరుడు శ్రీరామకృష్ణునకు ఇష్ట మృష్టాన్నములొసగి సపర్యలు గావించెను. పిదప శ్రీరామకృష్ణ గురుదేవుడు యదుమల్లికుని గృహమునకు బయలుదేరెను. ఆతనియింట సింహవాహినిమూర్తికి పూజ జరుగుచుండెడిది. శ్రీరామకృష్ణు డాపూజాగృహమును జేరెను. చందనపుష్పాదులతోడను హారాదికములతోడను దేవీ విగ్రహము మనోహరముగా నలంకరింపబడియుండెను. అర్చకుడు ఎదుట కూర్చొనియుండెను. శ్రీరామకృష్ణగురుదేవుడు తన యనుచరులలో నొకని బిలిచి 'దేవికి కానుకగా ఒకరూపాయనిచ్చి నమస్కరింపు'మనెను. ఏలనన దేవాలయమునకు బోయినవారెల్లరు కానుకలిచ్చుట యాచారముగదా! శ్రీరామకృష్ణ గురుదేవుడు సింహవాహిని యెదుట చేతులుజోడించి నిలుచుకొనియుండెను. ఎంతో కాలమయ్యెను, ఆ విగ్రహమును జూచుచున్న గురుదేవుడు చూచుచు చూచుచునే సమాధిస్థితుడయ్యెను. అట్లు కొంతకాలమగున పిదప సమాధి భేదిల్లెను. గురుదేవు డింకను సంపూర్ణబాహ్యస్థితి నందకున్నను 'అమ్మా! నేను పోయివత్తు' నని పలికెను కాని ఆయన నడువగలస్థితియందు లేడు, ఆయన ఎంతో కాలము నిలుచుకొనియే యుండెను. ఆ సమయమున గురుదేవుడు రామలాలును 'నీవు మొదట బాడినపాటను బాడు'మని పలికెను. రామలాలు పాడెను. పాటముగియుటయు శ్రీ గురుదేవుడు (అందఱుగూర్చున్న) గదికివచ్చెను. కాని అప్పుడప్పుడు 'అమ్మా! నాహృదయమున నీవు నివసింపుము' అని పలుకుచుండెను. పిదప 'తల్లీ! ఆనందమయీ! నన్ను నిరానందునిజేయకుము' అను పాటను బాడెను. పాట ముగిసినపిదపగూడ ఆయన తన సహజస్థితి నందలేదు. యదుమల్లికునిజూచి, ''ఏమండీ, బాబూ! ఏమి పాడమందురు? 'నే నెలతక్కువ బిడ్డనా?' యను పాటపాడమందురా? యని పలుకుచు పాడనారంభించెను. (పాటభావము).

నే నేమి నెలతక్కువబిడ్డనా? నీవు కండ్లెఱ్ఱజేసిన నేను భయపడువాడనుగాను శివుడు హృదయమున ధరించిన నీ పాదయుగళి నే నా యైశ్వర్యము. కాని నా సంపద నే నడుగునపు డెల్ల నెన్నియో ఆటంకములు గలుగుచున్నవి. దానపత్రము నా హృదయమున నుంచితి. అందులకు సాక్షి సంతకము పరమశివుడే లిఖించెను ఇక నేను శివునియెడ వ్యాజ్యము పెట్టి నా సంపదను గైకొందును. నా వ్యాజ్యమునందు నేను ఎట్టి కుమారుడనో చూపెదను. గురుదత్తమయిన దస్తావేజు కట్టలు న్యాయస్థానమున బయలువెట్టిన తల్లికొడుకుల వ్యాజ్యమెట్టిదో యెల్లరును తెలిసికొందురని రామప్రసాదు పలుకుచున్నాడు నీవు నన్నాదరించి

ఒడిలోనికి దీసికొని బుజ్జగించువఱకు నే నీ వ్యాప్తిమును పీడను

అప్పటికి శ్రీగురుదేవుడు సహజస్థితినిబడసి 'తల్లి ప్రసాదమును కొంచెము కై కొందు'నని పలికెను. సింహవాహిని ప్రసాదము కొంచెము పంచి పెట్టబడెను. యదుమల్లికుడు కొందఱు (స్తోత్రపాఠకులతో)—గూర్చొని యుండెను. వారినిజూచి శ్రీగురుదేవుడు 'ఈ విదూషకుల నేల వెంటనుంచుకొంటివి' యని యడిగెను.

యదుమల్లిక:—(నవ్వుచు) విదూషకులైన నేమి? మీరు వారి నుద్ధరింపరాదా?

శ్రీరామ—(నవ్వుచు) పవిత్రమగుచున గంగయు సారాయికుండను పవిత్రము గావింప జాలదు.

యదుమల్లికుడు తనయింట చండీగాన మేర్ప అచునట్లు పలికియుండెను. కాని అట్టిదేమియు చేయలేదు.

శ్రీరామ— యేమోయ్! చండీగాన మేది?

యదు—నా కెన్నియో పనులున్నందుననే నేర్పఱుపలేదు.

శ్రీరామ:— ఇదియేమి! మనుష్యునకు ఒక టేమాట. మనుష్యుని మాటలు ఏనుగు దంతములు బయలువడిన మఱల తిరుగవు. నిజమేనా?

యదు:—నిజమే.

శ్రీరామ:—నీవుచాల గట్టివాడవు. ఎంతయో లెక్కచూచియే పనిచేయుదువు. తక్కువ తృణము మేసి యెక్కువ పాలును ఎక్కువ పేడను నొసగు పశువును వెదకినాడట బ్రాహ్మణుడొకడు. నీవును అట్టివాడవే. (అందఱును నవ్వుదురు.)

శ్రీరామ:— (కొంతసేపయినపిదప) నీ గుణము నేను కనిపెట్టితిని. సగము ఉష్ణము సగము శీతలము. భగవంతుడు కావలయును, సంసారమును గావలయును.

పిదప యదుమల్లికుడు అందఱకు ప్రసాదమును పంచిపెట్టెను. ప్రసాదమును స్వీకరించి శ్రీగురుదేవుడు కలాల్ ఘోష్ ఇంటికి బయనమాయెను.

సుమారు రాత్రి పదిగంటలకాలమునకు శ్రీగురుదేవుడు కలాల్ ఘోష్ గృహముచేరెను. ఆతని యిల్లు మిపుల పెద్దది. శ్రీరామకృష్ణగురుదేవు డాయిల్లు ప్రవేశింపగనే సమాధిస్థితు డయ్యెను. ఇంతటి గొప్పభవనమున జనసమ్మర్ద మధికముగా గానరాదయ్యె. శ్రీగురుదేవుడు, రామలాల్, 'మ.' మఱి యిరువురు భక్తులును ఆ భవనమునందలి యొకానొక గదియందు విశ్రమించిరి. కలాల్ ఘోష్ బంధువొకడు గురుదేవునకు స్వాగతమొసగెను. ఆతడు వైష్ణవుడు కావున నూర్ధ్వపుండ్రాదిక వైష్ణవ చిహ్నములు మెండుగా దాల్చియుండెను, చేతియందు తులసిమాల నొక సంచియం దిమిడ్చికొని జపము చేయుచుండెను. మున్ను రెండుమార్లు శ్రీగురుదేవుని దర్శింప దక్షిణేశ్వరమునకాతడు వెళ్లియుండెను. వైష్ణవులు కొందఱు శైవులను వేదాంతులను వారి యాచార వ్యవహారములను పలువిధముల నిందించుచుందురు. కొంచెముగా సహజస్థితికి దిగి శ్రీరామకృష్ణ గురుదేవు డిట్లు పలుకనారంభించెను.

శ్రీరామ·—నాధర్మమే యనుసరణీయము, అన్యులెల్లరు కుమార్గగాములని వచించుట మంచిదికాదు. భగవాను డొకడేకాని రెండుగాడు. ఆయననే వివిధ నామములతో ప్రజలు విను

తించుచుండురు. కొందఱు గాడ్ (God) అందురు, కొందఱు అల్లాయందురు, కొందఱు విష్ణువందురు, కొందఱు శివుడందురు, కొందఱు బ్రహ్మమందురు. ఒకే చెఱువునందలి జలమును ఒకరేవునందలివారు వాటర్ (Water) అనియు, మఱియొకచోట పానీ యనియు, కొందఱు జల మనియు పలికెనను ఆచెఱువునందలి వస్తు వొక్కటియేకదా! వివిధమతములు వివిధమార్గములు. అన్నియు భగవంతునే ప్రాపించును. నదులన్నియు సముద్రమునే జేరుచున్నవిగదా!

వేదము, పురాణము, తంత్రము,—ఇవన్నియును సచ్చిదానందమునే ప్రతిపాదించుచున్నవి. వేదోక్త సచ్చిదానందము బ్రహ్మము. పురాణోక్త సచ్చిదానందము రామకృష్ణాదులు. తంత్రోక్తము శివుడు.

భక్తులందఱు మిన్నక వినుచుండిరి.

వైష్ణవభక్తుడు—అయ్యా! భగవంతునేల స్మరింపవలయును?

శ్రీరామ—ఇట్టి జ్ఞాన మెవనికేని కలిగి యున్నచో నాతడు జీవన్ముక్తుడు. (ఏలయన ఆ భగవంతుడు సర్వవ్యాపియన్న దృఢచిత్తత యాతనికిగలదు.) కాని యిట్టినమ్మకమేది? అందఱకును గలుగుటలేదు గదా! అన్నియు మాటలతోడనే తుదముట్టును. విషయసుఖము నర్థించువారెల్లరును 'భగవంతుడున్నాడు, ఆయన సంకల్పమువలననే సర్వము జరుగుచున్న' దని వినియున్నారు. కాని ఆయనను వారు నమ్మరు. వారిదేవుడెట్టివాడో యెఱుగుదువా? గృహమునందలి పెద్దతల్లి అత్త మొదలగువారు పోరుపెట్టుకొని భగవంతుడున్నాడులే యని పలుకు వచనము లాలించి యనుకరించు పిల్లలవంటివాడు. అందఱును ఆయనను గ్రహింపగలరా! ఆయన శిష్టులను దుష్టులను, భక్తులను, అభక్తులను, ఆస్తికులను, నాస్తికులను సృష్టించెను. ఆయన లీలయందు వివిధ విచిత్రములు గలవు. ఒకచో నాయనశక్తి యెక్కువగా ప్రకాశించును. ఒకచోట తక్కువగా గన్పించుచుండును. సూర్యకిరణములను మృత్తికకంటె జల మెక్కుడుగా ప్రతిబింబింపజేయును. నీటికంటె నద్దము అత్యంతముగా ప్రతిబింబింపజేయును. భక్తులయందు తారతమ్యము గలదు. అవి ఉత్తమమధ్యమాధమ భేదములు. ఇదంతయు భగవద్గీతయందు వివరింపబడియున్నది.

వైష్ణవభక్తుడు—చిత్తము.

శ్రీరామ—అధమభక్తుడు, భగవంతు డాకసమునం దెందోగలడని వచించును. భగవంతుడు సకలప్రాణులయందు చైతన్యస్వరూపుడై యున్నాడని మధ్యమభక్తుడు పలుకును. 'భగవంతుడే సర్వమునై యున్నాడు. కనుము చూచునదెల్ల ఆయన రూపాంతరములే ఆయనయే మాయ, జీవము, జగత్తునై యున్నాడు. తదన్యమేదియు లేదు.' అని ఉత్తమభక్తుడు పలుకును.

వైష్ణవభక్తుడు—ఇట్టి యవస్థ యెవరికేని ప్రాప్తించునా?

శ్రీరామ—ఆయన దర్శనము చేయని వారి కిట్టిస్థితి కలుగజాలదు. ఏవ్యక్తికి భగవద్దర్శనము కలిగినదోయని గుర్తింప కొన్నిలక్షణములు గలవు. అతడొక్కొక్కప్పుడు నవ్వును, ఏడ్చును, పాడును, గంతులువేయును. మఱియొకప్పుడు బాలునివలె సరళస్వభావుడు నుదారచిత్తుడునై యహంకార విరహితుడై యుండును. కొన్నిసమయములం దేవిషయములందును అతని కాసక్తికలుగదు. ఏ గుణమున

కును లోనుగాడు. ఎల్లప్పుడు ఆనందమయుడై యుండును. మఱికొన్ని వేళలయందు, పిశాచము వలె శుచి యశుచి యను భేదబుద్ధి రహితుడై ప్రవర్తించుచుండును. ఆచారానాచారము లాతనియెడ నేకీభవించును. ఒకానొకప్పుడు జడమువలె నేగోయొక వస్తువును జూచుచు చూచుచు నట్లే తన చూపును నిలిపియుంచును, అప్పు డేపనియు జేయజాలడు, దేనికొఱకును ప్రయత్నింపడు.

శ్రీరామ — (వైష్ణవభక్తునిజూచి) 'నీవు, నీది' యనుటయే జ్ఞానము. 'నాది, నేను' అనుటయే యజ్ఞానము. ఓ పరమేశ్వరా! నీవే కర్తవు. నే నకర్తను. ఇదియే జ్ఞానము. 'దేవా! అంతయు నీవే, దేహము, మనము, గృహము, పరివారము, జీవము, జగత్తు ఇవన్నియునీవే. నాదేదియుగాదు.' ఇదియేజ్ఞానము. భగవంతుడు దూరస్థుడనిపలుకువా డజ్ఞాని. జ్ఞానికి భగవంతు డత్యంత సన్నిహితుడు. హృదంతరాళమున నంతర్యామిగ భాసిల్లుచున్నాడనియు, తానే యొక్కొక్కరూపమును దాల్చి విరాజిల్లుచున్నాడు అనియు జ్ఞాని భావించుచుండును.



వర్ణవ్యవస్థ నిలువనిండు, నిలువకపోనిండు, శాఖాసంప్రదాయములు ఉండనిండు, ఊడనిండు, వ్యక్తిగతమైన యిచ్ఛాస్వాతంత్ర్యమును క్రియాస్వాతంత్ర్యమును నరికట్టు నే మానవుడైనను, కులమైనను, జాతియైనను, సంఘమైనను, మఱియే సంస్థయైనను గానిండు,—పరులను అది బాధింపకున్ననుగూడ—పరమదుష్టము, అది నశించితీరవలయును.

ప్రతివ్యక్తికిని ఉన్నతాశయములను దెలిపి, స్త్రీ పురుషులను దమ కర్తవ్యమును దాము నిర్ణయించుకొను నవకాశమొసఁగు నొక వ్యవస్థను నిర్మించుటయే నా జీవితాశాపరమావధి. జీవితమున నతిముఖ్యమైన సమస్యలనుగూర్చి మన పూర్వులును నితర జాతులును నేమని తలంచిరో వారిని దెలిసికొననిండు. ముఖ్యముగా నితరు లిపుడేమి చేయుచున్నారో చూచి తమ కర్తవ్యమును వారిని నిర్ణయించుకొననిండు. రసాయనములను ఒండొంటితోఁ జేర్చునంతవఱకే మనపని, తన నియమములనను ననుసరించి ప్రకృతియే స్ఫటికీకరణకృత్యమును నెఱవేర్చును. తీవ్రముగాఁ బని చేయుఁడు. ధైర్యస్థైర్యములను విడువకుఁడు, భగవానుని నమ్ముఁడు. కార్యరంగమున దిగుఁడు, ''మతమునకు—ధర్మమునకు—హానికలుగని రీతిని జనసామాన్యమును ఉద్ధరింపవలయును'' అను మూలమంత్రమును విస్మరింపకుఁడు.

—శ్రీ వివేకానందస్వామి

శ్రీ శారదేశ్వర్యై నమః

# ధర్మ పరిశీలన

## విశ్వమతసిద్ధికి మార్గము

### శ్రీ వివేకానందస్వామి

(గతసంచిక తరువాయి)

ఈ ప్రాచీనమతములలో దోషములెన్నియున్నను, కష్టములెన్నియున్నను, పోరాటములెన్నియున్నను, ముఖ్యముకాని బాహ్యారూపములు, చిత్తరువులెన్ని గడ్డకట్టుకొనియున్నను, వానిలో ప్రతి మత హృదయమును సజీవమై, సౌష్ఠవమై ఉత్తేజకర భావస్ఫూర్తితో స్పందించుచున్నది. వానితో నేదియును, తానే ఘనకార్య నిర్వహణార్థమై ఆవిష్కరించినదో, ఆ ఘనకార్యమును విడనాడలేదు. పవిత్రమైన ఆ మహాధర్మకార్య పరిశీలన బహుముదావహమైనది. ఉదాహరణమునకు, మహమ్మదీయ మతమును దీసికొనుడు. ఆమతమును ద్వేషించినట్లు క్రైస్తవులే యితరమతమునుగాని ద్వేషింపరు. దానియంత అత్యధమమత మింకొకటి యేదియులేదని వారి యభిప్రాయము. ఏమనుష్యుడైనను మహమ్మదీయుడైనవెంటనే, ఇస్లాముమత మేవిధమైన వివక్షతనుగాని వాని పట్ల గనుబఱుపక, సోదరునివలె వాని నాదరించును. ఇట్లు ఏ యితరమతముగాని వ్యవహరింపదు. మీ అమెరికా ఆదిమజాతియగు ఇండియనులలో నెవడైనను మహమ్మదీయమతమవలంబించుచో, వాని సహపంక్తిని గూర్చుండి భోజనముచేయుటకు తుర్కీదేశ ప్రభువు, సుల్తానున కెట్టి యాక్షేపణయు నుండదు. వానికి బుద్ధి బలమున్నచో, ఆరాజ్యమందు వాడాక్రమింపలేని పదవియే యుండదు. ఈ దేశములో శ్వేతముఖులును, నీగ్రోలును గలసి యొకరప్రక్క నొకరు మోకాళ్లపై మోకరించి ప్రార్థనచేసికొనుటకు స్వేచ్ఛనిచ్చు దేవాలయమును నేనింతవర కెచ్చటను జూడలేదు. ఆ విషయమొకింత యోచింపుడు. ఇస్లాముమతము తన యనుచరుల నందరిని సరిసమానులుగ జేయును. కనుక, మహమ్మదీయమత విశేషాధిక్యత ఇదియేయని మీకు విశదమగును. ఖురానులో జీవితమును గురించి పలుతావులందు గాఢ విషయేంద్రియ భావములు మీకు గనుపడును. వానిని లెక్కచేయకుడు. తన మతమునకు జెందిన మానవ్మానవులకుగల యాక్రియారూపమైన సౌభ్రాత్రతను లోకమునకు బోధించుటకే మహమ్మదీయమత ముద్భవించినది. అదియే మహమ్మదీయ మతసారము. ఇక, లౌకికజీవితము, స్వర్గము మున్నగువిషయములను గురిం

-చిన యితరభావములు దానిలో ముఖ్యమైనవి కావు. అవి కాలక్రమమున వ్యక్తులు ప్రవేశ పెట్టిన పెరుగుదలలు.

హిందువుల జాతీయభావము పారమార్థికత యని మీరు గనుగొనగలరు. ఏ యితర మత ములోగాని, ప్రపంచమందలి యే యితర పవిత్ర గ్రంథములలోగాని భగవద్విషయిక భావము నెవరును అంత శ్రమపడి నిర్వచించి యుండలేదని మీకు విశదమగును. జీవాత్మ భావమునుగూడ, నేవిధమైన యైహికకళంక మంటకుండునట్లు నిర్వచించుటకు వారు ప్రయ త్నించిరి. చిత్ పదార్థము మానవుడు కాకూ డదు. ఈ జీవాత్మ, పరమాత్మైక్యతాభావ మునే, భగవత్సాక్షాత్కారభావమునే హిందు వులు తమమతగ్రంథములందంతట బోధించి యున్నారు. భగవంతుడొక్కడే స్వర్గములో నున్నాడని చెప్పుట కేవల మసంగతమని వారి యభిప్రాయము. ఇది పూర్తిగా అనాగరకమానుష భావము. ఎన్నడైన వాస్తవముగ నుండిన స్వర్గమంతయును, ఇప్పుడీ భూలోకముననే యున్నది. అనంతకాలవాహినిలో నేక్షణమై నను ప్రశస్తమైనదే. ఒక దేవునియందు విశ్వాస మున్నచో వాని నిచ్చటనే నీవు చూడగలవు. నీ కేదోయొక అనుభూతి కలిగినప్పుడే మత ధర్మము ప్రారంభమగునని మేము తలంతుము. మతధర్మమనగా సిద్ధాంతములను నమ్ముట కాదు, మానసికాంగీకారమిచ్చుటకాదు. భగ వంతుడున్నచో, "నీవు వానిని జూచితివా?" "చూడలే"దని చెప్పుచో, వానిని విశ్వసించు టకు నీకేమి అధికారమున్నది? ఈ యేకైక లక్ష్యమునకై, నీవేల ప్రపంచమును బరిత్య జించి, నీ యావజ్జీవితమును దానిని సాధించు టకు వినియోగింపవు? త్యాగము, పారమార్థి కత, ఈ రెండే యిండియాదేశపు మహోదార భావములు. ఈ భావములను బహుశ్రద్ధతో ననుసరించుచున్నది కనుకనే, ఆ దేశమునకు దోషము లెన్నియున్నను వానిని లోకము పాటింపకున్నది.

(సశేషము)



అమృతకుండమున ఏవిధముగా పడినను మనుష్యుడు అమరత్వము పొందును (అనగా మరణము లేనివాడగును). ఎన్నియో సాధనలను చేసి అందు పడినను అమరు డగును. అటులే అందు తోయబడిన వాడును అమృతత్వమును పొందును. తెలిసియైనను, తెలియకయైనను, ప్రమాదమున నైనను, ఏవిధముననైనను భగవన్నామమును ఉచ్చరించి తిరా, దానికి తగినపుణ్యఫలము పొందుదురు.

—శ్రీ రామకృష్ణ పరమహంస

శ్రీ కృష్ణాయనమః

# ప్రపంచమనుసరింపదగినది బౌద్ధమత మొక్కటియేనా?

శ్రీ కృష్ణదాసు బుద్ధప్రియులు

[కొన్నాళ్ల క్రితము డాక్టరు B R అంబేద్కర్‌గారు మహాబోధిపత్రిక వైశాఖ సంచికయందు 'బుద్ధుడు—భవిష్యత్తున అతని ధర్మము' అను వ్యాసమును రచియించి యుండిరి. అందుగల ప్రశ్నలు కొన్నింటికి శ్రీ కృష్ణదాసు బుద్ధప్రియులు ఒసగిన ప్రత్యుత్తరము లిప్పుడు ప్రచురింప బడుచున్నవి.

సంపాదకులు ]

(గతసంచిక తరువాయి)

మలబారుదేశ వాస్తవ్యుడగు శ్రీనారాయణగురుడు సుప్రసిద్ధ సంస్కృతపండితుడు, కవి, తత్త్వవేత్త సంఘసంస్కర్త. హీనకుల సంజాతుడని కర్కశపూర్వాచార పరాయణు లగు ఉన్నతజాతి హైందవు లితనిని నిరసనజేసినను, అంతర్ముఖుడైన యీ మహానుభావుడు రాజకీయాధికార ద్వారమునగాక, హైందవ మతధర్మ శిరోమకుటమనందగిన అద్వైత వేదాంతమందలి సమదర్శన, జీవైక్యతాది మహాభావ సంజీవ జ్యోతిర్మహిమచే, అసంఖ్యాకులగు నిమ్నజాతులవారి నందరిని భాగ్యము, ధీ నైపుణ్యము, విద్యాధిక్యత, నీతి మున్నగు విషయములలో ఉన్నతజాతులతో సరిసమాను లుగజేసి, నవీనకాలమున పేరెన్నికగన్న హిందూమత బోధకులలో నగ్రస్థానము వహించినాడు. హిందూమతములో అవివేకు లప్పుడప్పుడు తెచ్చిపెట్టిన వికారములను తొలగించిన యెడల, ఆమత మసమత్వభావ బోధకముగాక, సమదర్శన, సర్వభూతాత్మ, విశ్వాత్మత భావ బోధకమై యొప్పును. నీరసులును, స్వార్థపరులునగు వ్యక్తులుగాని, జాతులుగాని, (ఇట్టి స్వార్థపరులగు జాతులును, ఘటములును లేని దేశముగాని, కాలముగాని, కలదా?) వర్ణవ్యవస్థను దుర్వినియోగము జేసియుండినచో, ఆకారణమునుబట్టి హిందూమత ప్రాణకేంద్రమగు పారమార్థికతత్త్వమును నిందించి, నాశనముచేయుట సమంజసము కాదు. నేటి ప్రపంచ దుర్గతికి పారమార్థికతత్త్వమే దివ్యౌషధమగుటచే, దాని యావశ్యకతను గురించి వేఱుగ జెప్ప బనిలేదు. అధికారముల నిర్మాణమునకును, నిర్మూలనమునకును తోడ్పడు శక్తు లన్నికాలములందును, అన్నిజాతులయం

దును బనిచేయుచునే యున్నవి. ప్రాచీనకాలములందుగూడ సడలించుటకు వీలులేని జన్మను బట్టికాక, యెక్కువగ నాయా మనస్తత్వాభీష్టములనుబట్టి దేశ, కాలానుగుణముగ మార్చుటకు వీలగునట్లు నిర్మింపబడిన చతుర్విధభాగయుత సంస్థ, వర్ణవ్యవస్థ. వైజవనుడను శూద్రుడు సోమయాగముచేసినట్లు మహాభారతములోను, దేవపి, విశ్వామిత్రాది క్షత్రియులు పురోహితులుగ వ్యవహరించినట్లు ఋగ్వేదములోను కానవగును. ఐతరేయుడను శూద్రుడును, కవషుడను వైశ్యుడును సర్వజనపూజార్హులైన ఋషిశ్రేష్ఠులైరి. శూద్రుడగు విదురుడు సన్యాసి. ఆతని విషయమున దహనసంస్కార మధిక్షేపింపబడియుండుటను బట్టి ఇది నిజమేయని ఋజువగుచున్నది. వేదకాలము నాటి బ్రహ్మవాదినులేకాక, పురాణములలో సులభయు, మఱికొందరు స్త్రీలును సన్యాసినులుగ పేర్కొనబడిరి. బ్రాహ్మణజాతి సర్వకాలములకును మంచిదని, స్వాభావికమైనదని వాదించుటకు నేనీయంశములను తెలుపలేదు. వర్ణవ్యవస్థ రాను రాను క్షీణించి, ప్రజలకందరకును అభివృద్ధికి సమానావకాశములు కలుగకుండచేసి, తన్మూలమున సాంఘికైకమత్యమును భగ్నపఱచినను, దానిని తొలుదొల్త తలపెట్టిన మహనీయులగు కొందరు ప్రాచీనుల యుద్దేశ్యము నేడు సాధారణముగ సంఘసంస్కర్తలనుకొనునంత చెడ్డదికాదని మాత్రమే నేను చెప్పుచున్నాను. ఇక చీనా, టిబెట్, బర్మా, సియామ్, సింహళదేశములలో ప్రబలియున్న రేట బౌద్ధమత స్థితిని బరిశీలింతము. బౌద్ధమతావలంబులమని చెప్పుకొనునట్టి యీ జాతు లితరజాతులకంటె నీతియందును, సమత్వమందును ఉన్నతతర స్థితియందున్నవా ? అసమత్వమునకు తావలమైన యీ దేశముతోను, హిందూమతముతోను బోల్చిచూచిన యెడల ఆదేశములలో జరుగు హత్య, చౌర్యాది దోషముల సంఖ్య ఉపేక్షింపతగినంత చాల తక్కువయాయను విషయమును దోషశాస్త్రవేత్తలు నిర్ణయించి మనకు తెలుపవలసియున్నారు. ఇంతేకాక, చాతుర్వర్ణసంస్థతను బుద్ధుడు సమూలముగ పెళ్లగించి, నాశనము చేసెనని చెప్పుటకూడ యుక్తముకాదు. అట్టిదేమియు జరుగలేదు. మతధర్మ సంఘములో వర్ణమునకు తావులేదనిమాత్రమే బుద్ధుడు చెప్పినాడు

''సోదరులారా! మహానదులన్నియును సముద్రములో గలిసినతరువాత తమతమ ప్రత్యేక నామధేయములను, వంశచరిత్రలను గోల్పోయి, ఎట్లు మహాసముద్రముగ పరిగణింపబడుచున్నవో, అట్లే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను చాతుర్వర్ణములవారును తమ, తమ గృహములను విడనాడి, తథాగతుని ధార్మికశిక్షణమునొంది, గార్హస్థ్యాతీత జీవితారూఢులై, వారి పూర్వ నామధేయములను, వంశచరిత్రలను, త్యజించి సన్యాసులుగ పరిగణింపబడుచున్నారు ..'' (బుద్ధునిబోధలు, పుట 250-1).

(సశేషము)

# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిశరణమ్

ఆల్మోరా,
12–9–'15.

ప్రియ

ఈసారి మీరు అనర్ఘళ గంగాప్రవాహము ననుకరింపగల గొప్ప యుత్తరమును వ్రాసితిరి. ఇట్లు వ్రాయుట లేల? 'పంచాంగమునంతయు మూలముట్టుగ కట్టజేసి పిండినను ఒక చినుకైనను పడదని' పలుకు శ్రీ గురుదేవుని వాక్యముల ననుకరించుచున్నది నా స్థితి. శాస్త్రము లందు జీవన్ముక్త లక్షణము పరమహంస లక్షణము మున్నగు విషయము లెన్నో వివరింపబడియున్నవి. కాని మనమా లక్షణముల నన్నిటిని మన జీవితమున ననుభూతికి గొనితేజాలమేని యవియన్నియు నిరర్థకములే యగును. శ్లో॥ పుస్తకస్తాచయా విద్యా పరహస్త గతం ధనం, కార్యకాలే సముత్పన్నే నసా విద్యా న తద్ధనమ్. * నా యొద్ద నిధియే యున్నచో నా కిట్టి దశ యేల ప్రాప్తించును.

కాని నా కేమియు ప్రాప్తింపలేదే యని ఘదేపదే గోలపెట్టినను ప్రయోజనము లేదని తెలిసికొనుచున్నాను. భగవంతున కనుగ్రహము లేనిచో ఆయనను ప్రాపించుట యసంభవము. ఇదియే నిజమయిన విషయముగా గోచరించుచున్నది. పరమహంసావస్థమాత్రమే యన నేల? మఱి యేదైన భగవచ్ఛరణాశ్రయమువలన మాత్రమేగాక యితరమార్గము వలనకలుగగలదని యెవరును వచియింపజాలరు. శ్లో. రామం చింతయ చిత్తబర్బరచిరం చింతాః సత్తైః కిం ఫలం? । కించిత్వ్యావహ జల్పనేన సతతం రేవక్త్ర రామం వదా,। కర్ణత్వం శృణు రామచంద్ర చరితం కింగీత వాద్యాదిభిః చక్షుః రామమయం నిరీక్ష సకలం రానాత్పరం త్యాజ్యతాం। † ఇదియే యథార్థ వాక్కు. దీనిని మనమున ధారణము గావింపగలిగినచో మనము మనలను సంరక్షించుకొనగలము. అట్లు కానిచో అనవరతము జనన మరణ దుఃఖభోగము లనివార్యములు. నందమామ అందఱిమామ. వెదకి వెదకి పట్టుకొనువారికే ఆయన అనుభవింపదగినవాడు. భగవాను డెల్లరకు దల్లివంటివాడు. ఎవరును అనాథులుగారు. మీరు మిమ్ము గొఱ్ఱెలతోడను మేకలతోడను పోల్చుకొనుచున్నారేల? మీరందఱును సాక్షాద్భగవానుని సంతానములోని వారు. నిజముగా దేవసంతానమున కెట్టి భయమును లేదు. కావున మీరు నేను సయితమెట్టి కారణమువలననైనను భయపడ నవసరములేదు. ఆయన మనల నుంచిన స్థితియందే

---

* పుస్తకమునందు మాత్రమే యిమిడియున్న విద్యయు, పరుల హస్తగతంబయిన ధనమును సమయమాసన్నమయినపుడు నిరర్థకములగును. (చాణక్య శ్లోకము)

† ఓ బర్బరచిత్తమా! నీవు సదా రామచింతనము గావింపుము; అన్యచింతలవలన ఫలమేమి? ఓ ముఖమా! సర్వదా రామనామమును జపింపుము. అనర్థదాయకములగు పలుకులవలన ప్రయోజనమేమి? ఓ కర్ణమా! శ్రీరామచంద్ర చరితమును వినుము. గీతవాద్యాదుల శ్రవణమువలన ఫలితమేమికలదు? అక్షియుగ్మమా! నీవు సకలవిషయములను శ్రీరామమయముగా గనుగొనుము. తదన్యమునెల్ల త్యజింపుము.

యుందము. మంచి చెడ్డ లేవియు నెఱుంగను, తెలిసికొను శక్తియు లేదు. నా బుద్ధికి గోచరింపదు. "సదసత్తులకు నీ వతీతుడవు. నన్నా స్థితికి దీసికొనిపొమ్ము." ఇదియే నా యేకాంత ప్రార్థన. ఏ మార్గమున ఆయన దీసికొని పోవునో నే నెఱుంగను. కాని ఆయన నన్ను గైకొనునను విషయమున మాత్రము దృఢ విశ్వాసము కలదు. ప్రభు (శ్రీ గురుదేవుడు) విట్లు సెలవిచ్చియున్నారు. "భుజింపని వా రెవరును నుండరు. కాని కొందఱు మధ్యాహ్నము, కొందఱు సాయంత్రము, కొందఱు రాత్రులందు భుజింతురు." నీ యిచ్ఛయే నెఱవేరుగాక. బ్రహ్మవిత్తును గూర్చిన పలుకు అత్యంత నిగూఢమైనది. ఆ విషయమున నేను మిక్కిలిగా జెప్పజాలను మున్ను వచించినట్లు "శ్లో. తేషామహం స ముద్ధర్తా ముక్తి సంసార సాగరః" * ఇదియే నా యవలంబనము. అవ్యక్తాహి గతిర్దుఃఖ దేహవద్భిరవాప్యతే † నేను మూఢుడను. దేహాభిమానమును విడువజాలను. కావున నాకు అక్షయ అవ్యక్త బ్రహ్మ జ్ఞానము మిక్కిలి దుర్లభమైనది. కాని బ్రహ్మ జ్ఞానము కలుగకపోయినను గత్యంతర రహితుడ గాను. శ్రీ గురుదేవుని వాక్యములవలన ఈ నమ్మకముమాత్రము నాకు చక్కగా గుదిరినదని గ్రహించితిని. ఒకనాటి యనుభూతిని వివరించుచున్నాడను. దక్షిణేశ్వరమున శ్రీరామకృష్ణుని జూడబోయితిని. అనేకులు వచ్చియుండిరి. వారి యందొక వేదాంత పండితుడుండెను. శ్రీరామకృష్ణుడా పండితుని వేదాంతమునుగూర్చి వివరింపుమనెను. అతడును మిక్కిలి శ్రద్ధాభక్తులతో ఒక గంటకాలము ఉన్నత వేదాంత విషయ వ్యాఖ్యానము గావించెను. శ్రీరామకృష్ణ గురుదేవుడా పలుకులవిని మిక్కిలి యానందించెను. ఇది మా కాశ్చర్యమును గొలిపెను. కాని పిదప ఆ పండితుని బొగడుచు నిట్లు పలికిరి. "నాయనా యివి నాకేమియు నచ్చవు. నాతల్లి యున్నది, నే నున్నాడను. అంతే నాకు గావలసినది. మీ యీ జ్ఞానము—జ్ఞేయము—జ్ఞాత, ధ్యానము — ధ్యేయము — ధ్యాత —ఇట్టి త్రిపుటీకరణములు మంచివే కాని నా భావమిది, 'నా తల్లియు నేను' అన్య మేదియు లేదు." ఈ కొన్ని పలుకులే యచ్చటి ప్రేక్షకుల మనములందెల్ల దృఢముగా పాదుకొని పోయెను. వేదాంత సిద్ధాంతములన్నియు నెందో యేగినవి. వేదాంతమునందలి యీ త్రిపుటి కన్నను శ్రీరామకృష్ణుల 'తల్లియు—నేను' అనునదియే సులభముగను ఇష్టదాయకముగను గోచరించుచున్నది. నాటినుండియు 'తల్లి — నేను' యను విషయమే నాకు తగిన మార్గమని గ్రహించితిని.

ఉపాసన జపము తపము— ఇవన్నియు మానసిక క్రియ లనునది వాస్తవమే. కాని అనుభవముగూడ మానసికమే. అన్యమేదియు కాదు. అయినను విషయవాసనా పరిపూర్ణిత మగు మనస్సు గాదు ఆ మనస్సు. ఈ యుపాసన జపము తపము వీనివలన పరిశుద్ధము గావింపబడినదియే ఆ మనస్సు. ఉపాసనాదులు మనస్సును పవిత్రము గావించుటకే గ్రహణీయములు. వానివలననే వస్తులాభము నందగలము. వస్తు వెల్లపుడు నుండునదియే. కాని దాని

* నేను వారిని మిక్కిలి పరిపూర్ణమయిన సంసారసముద్రమునుండి యుద్ధరించుచుందును. —గీత-12-7.

† దేహాభిమానగ్రస్తులకు నిర్గుణబ్రహ్మలాభ మత్యంత కష్టతరము. —గీత-12-5

యీయావరణమును దొలగించుటయే కర్తవ్యము. ఆవరణము సయితము పెద్దదియో కాదు. మనస్సులోనిదే. ఆ వస్తువున కెవరును ఆవరణము గల్పింపజాలరు. అది స్వయంప్రకాశమయినది, నిత్యసిద్ధము. కావుననే మెడలో దూలమున్నను మఱపున వెదకుటతో దీనిని పోల్తురు. పిదప నేదేనొక యుపాయము మూలమున దానిని బడయగలిగిన నదియే వస్తులాభము.

మన కా జ్ఞానము కలుగక పూర్వముగూడ వస్తు వుండియేయున్నది. ఆ జ్ఞానమే లోపించియుండెను. జ్ఞానము స్ఫురించినపుడు వస్తులాభమని వచింతుము. కాని అది నిత్య ప్రాప్తమయినదియే. శుద్ధ మనస్సు కలిగినపుడు ఇవన్నియు చక్కగా గోచరింపగలవు. శుద్ధ మనస్సనగా మఱి యేమియోగాదు. "శ్లో. విషయే ష్వ్యాతిసంగారో మానసో మల ఉచ్యతే, తేష్వే వహివిరాగోఽస్య నైర్మల్యసముదాహృతం."* సాధారణమగు నిట్టి మనస్సు విషయముల వీడి భగవానునిపై ననురాగము బూనినచో శుద్ధమనస్సగును. ఇంటిపిల్లియే కాటికిపోయిన నడవిపిల్లియగును. ఈ కల్పనాశక్తి పక్వత నందినచో భగవత్సాక్షాత్కారము కలుగగలదు. నేడు కల్పనగా నున్నదియే రేపు సాక్షాత్కారముగా పరిణమించును. కల్పన లేనిచో సాక్షాత్కారమెట్లు కలుగగలదు? ఆత్మవిషయమే ప్రప్రథమమున శ్రోతవ్యము. తరువాత మంతవ్యము, పిదప నిధిధ్యాసితవ్యము, తుదిని సాక్షాత్కారము. అవల నేమికావలయును!

ఇట్లు,
శుభాశీర్వచనములతో
శ్రీ తురీయానంద

———

శ్రీహరిశరణమ్

అల్మోరా
29–9–15.

శ్రీమాన్!

నీ వెచ్చట నున్నను హృదయపూర్వకముగా భగవంతుని భజింపుము. అప్పుడాయన వలన నీ మనస్సు స్థైర్యము నందును. అట్లుగానిచో నీ వెచ్చట కేగినసరిగనే సర్వస్థలములును నొకేరీతిని కనుపించును. భగవద్భజన వినా యెచ్చటను శాంతి లభింపదన్న నిర్వచనము సత్యము.

మానవు డేమి చేయగలడు? భగవదిచ్ఛయందే తన యిష్టము నర్పణము గావించి భగవచ్ఛరణాగతుడై యుండగలిగినచో నెట్టి భయమును కలుగ నేరదు. ఎల్లకార్యములు శుభాంతములే యగును. ఇందు సందియమావంతయు వలదు.

ఇట్లు,
శుభాశీర్వచనములతో
శ్రీ తురీయానంద



* విషయములం దత్యంతాసక్తి కలిగినచో మానసము మలినత నందును. మఱి ఆ విషయములనుండియే విముఖత గాంచిన నదియే నిర్మలమగు మనస్సని వచింపబడును.

# కిసగౌతమి

## శ్రీ. కె. అన్నమరాజశర్మ

తే. గీ. ఈరహోర్త భిక్షార్థినిఁ యెవ్వరీమె!, పెదవి తడియాఱ, లేగానుఁ గదలి యాడ,
ఇంటి కింటికి నేగి,—యర్థించుచుండె, "చేరెడావాలు" నాపల్కెఁ జెవుల బడెడు.

తే. గీ. చాన మృతపుత్రు నొకని బుఁజానబూని, కడపగట్టిన యిల్లెల్లఁ గలయదిరిగి,
ద్వారములనుండి పౌరవలుఁదారమతిని, "రమ్ము, కిసగౌతమీ! యిఁకరమ్మురమ్ము.

తే. గీ. తుందుభమ్ములకా యింతఁ దొట్రుపాటు!", అనగ నాతుర చిత్తయైఁ యడుగు నిట్లు—,
"పుట్టు చావులు మీయింటఁ బొరయవేని, ప్రభునియాజ్ఞానుసారంబుఁబడయు దాన."

తే. గీ. విస్మయప్రద వాక్కులఁ విన్నజనత, "పిచ్చిదాన! పో—పో"మ్మనిఁ వెడలనడచి
వాకిళుల మూయ, నారేయిఁ నేకతముగ, కాలువలదాటి, యడవులఁగడచి, కడచి.

తే. గీ. విసివి వేసారి మృతసుతుఁ వేగ గొనుచు, బుద్ధు పాదాబ్జములమ్రోలఁ మోకరిల్లి,
"జననమృత్యు విహీన సంఁసరణమొందు, కానసైతిని ప్రభుమౌళి?—కానసైతి",

తే. గీ. అనగ, గౌతము డాదరాఁయత్తతననె, "బహుళశోకార్తి సంసృతిఁ వనమునుండి
అమృతఫలముల కేలీలఁ నాసగొనెదు? కష్టసుఖములు లోకానఁ కవలు సుమ్ము."



# జీవస్వాతంత్ర్యము

## (ద్వైతసిద్ధాంతము)

శ్రీ టి. యల్. నరసింహారావు, బి. ఎస్‌సి.

శ్లో॥ "శ్రీమన్మధ్వమతే హరిః
పరతరః సత్యం జగత్తత్త్వతో
భేదో జీవగణా హరే
రనుచరా నీచోచ్చభావంగతాః।
ముక్తిర్నైజ సుఖానుభూతి
రమలా భక్తిశ్చ తత్సాధనం
హ్యక్షాదిత్రితయం ప్రమాణ
మఖిలామ్నాయైకవేద్యో హరిః॥"

శ్రీవాదిరాజస్వామి రచించినదని చెప్పబడు ఈ శ్లోకమున సుప్రసిద్ధ నవరత్నము * లనియెడి తొమ్మిది మధ్వసిద్ధాంతములు పొందుపరచబడి యున్నవి. పై శ్లోకమందలి రెండవ చరణమును పరిశీలించిన జీవుడు – బ్రహ్మ ఒకటి కాదనియు— ఇట్లు జీవాత్మ పరమాత్మలు భిన్నములైయుండుటయేగాక జీవాత్మ సతతము పరమాత్మ ననుసరించుచున్నదనియు స్పష్టమగుచున్నది.

ప్రతి జీవాత్మ స్వకర్మసంపాతమున వివిధావస్థలను పొందుచుండును. పరమాత్మ అచలమై అవస్థాభేదములేక ప్రత్యేకస్థానమున విరాజిల్లుచుండును. పరమాత్మకు స్వేచ్ఛ, స్వాతంత్ర్యము కలదు. జీవాత్మకు అట్టి స్వాతంత్ర్యము లేక పరమాత్మాధీనమై పరమాత్మ దాసత్వమున నుండును. ఇట్లైనచో జీవాత్మకు దాస్యవిమోచనము లేదా? మానసిక స్వాతంత్ర్య ముండదా? ఎల్లప్పుడు పరమాత్మ చెప్పుచేతలలో నుండవలసినదేనా? అను సందేహము లుద్భవింపక మానవు. "జీవాత్మకు స్వాతంత్ర్యము లేదు" అని నిర్ణయించుకొని మన సందేహముల నివ

---

* (1) శ్రీహరిసర్వోత్తమ.
(2) ప్రపంచము యథార్థము.
(3) జీవాత్మ పరమాత్మ భేదము కలదు.
(4) జీవులందరు పరమాత్మని సేవకులు.
(5) జీవులకు నీచోచ్చభావములు తారతమ్యములు గలవు.
(6) స్వాభావిక స్వరూపమైన సుఖానుభవమే ముక్తి.
(7) నిర్మలభక్తియే ముక్తికి సాధనము.
(8) ప్రత్యక్షము మొదలైనవి మూడే ప్రమాణములు.
(9) వేదోపనిషత్తుల మూలమునసే శ్రీహరి వేద్యుడు.

ర్తించుకొనినచో జీవాత్మ పరమాత్మవలన పొందు ప్రతిఫలము, బహుమానము, శిక్ష మొదలగునవి కలుగక మానవు. అప్పుడు జీవులు తాము అనుభవించు ఈ శిక్షలు, బహుమానములు, పాక్షికములగు పరమాత్మ గుణములని చెప్పుకొందురు.

ఇక జీవాత్మ స్వచ్ఛందతతో తన కార్యకలాపములనునిర్వర్తించుకొనినచో పరమాత్మని సర్వశక్తిసంపన్నతకు భంగము కలుగిక మానదు.

"నిరీహాణాం ఈశస్య తృణ
మివ తిరస్కార విషయః"

జీవాత్మ స్వాతంత్ర్యముతో స్వచ్ఛందతతో పరమాత్మ ప్రమేయములేక యుండును. ప్రథమమున జీవాత్మయొక్క దాస్యతనుగాని, పరమాత్మయొక్క స్వేచ్ఛతనుగాని, జీవబ్రహ్మల భేదాభేదములగాని సాధించుటకు ప్రత్యక్ష, అనుమాన, ఆగమ ప్రమాణములే మూలములు.

అనుదినము ఆనుభవికముగా మనము గ్రహించుచున్నదే పరిశీలింపుడు. మానవులు తాము చేయదలచుకొన్న కార్యములు సాఫల్యముగ కొనసాగింపజాలకుండుట—తాము చెప్ప దలచుకొన్న విషయములు ఆమూలాగ్రముగ చెప్పజాలకుండుట మొదలగునవి.

మధ్వాచార్యులు జీవాత్మనుగూర్చి
"కురుభుంక్ష్వ చ కర్మనిజం నియతం
హరిపాద వినమ్రధియా సతతమ్" అని
చెప్పుచు వెంటనే
"సోऽనుత్పత్తిలయః కర్తాజీవ స్తద్వశగః సదా।
సర్వావస్థా ప్రేరకశ్చ ... స ఏకపరమేశ్వరః॥"
అని జీవాత్మ అస్వాతంత్ర్యతను స్థాపించుచున్నారు.

జీవాత్మ మోక్షమందినప్పటికిని స్వేచ్ఛా విరహితమే, పరమాత్మ దాస్యశృంఖలబద్ధమే.

"జగత్సృష్ట్యాది విషయం
మహాసామర్థ్య మప్యతే।
యథేష్ట శక్తిమంతశ్చ
వినాస్యా భానితో త్తమాన్॥"

ముక్తాత్మ జగత్సృష్టికి వలయుశక్తి లేనిదై స్వాభావికోచ్ఛతకు మాత్రము ఆటంకము లేనిదై యుండును.

నిద్రావస్థలో మన కర్మలు మన స్వాధీనములో నుండక బాహ్యాకర్తృత్వముల స్వాధీనమై యుండుటయు మనకు గోచరించుచున్నది.

జగన్నాథ దాసరు

"కిరణ కర్మప మాడిఎలెనె
స్మరణకాలది మాతుగళగు।
తెరవకొడదలి సుమ్మనిప్పరు జాగరావస్థె।
కరుణిసలు వ్యాపారమాడువె
బరలు నాలుగవస్థె గళవరి
హరిసి కొళ్లి నేతికె స్వతంత్రను
తానెనెంబవను॥"

మన శరీరమందలి ప్రతి అవయవము స్వతః సిద్ధముగా తమతమ కార్యముల నిర్వహించినచో ఎందువలన మన మప్పుడప్పుడు విస్మరణ, ఏమరుపాటు, ముభావము మొదలగు మనోభావములు కల్గియుందుము? తిరిగి మనస్సు యథాస్థితిని పొందినప్పుడు మనోభావములు మారుట. ఇట్టి మనకు స్వాతంత్ర్య మెక్కడిది? అని పై కీర్తనకు అర్థము.

ఈ సమస్యకు కొందరు ద్వైతసిద్ధాంతులు "దాసస్వాతంత్ర్య"మని సమాధానపరచెదరు. ఉదాహరణకు కొంతపొడవు త్రాటితో ఒక రాటకు గట్టిన గోవు స్వేచ్ఛతను పరిశీలింపుడు:

దానికి స్వాతంత్ర్యమున్నదా? లేదా? దీనికి సమాధానము ఉన్నదనియు లేదనియుకూడ చెప్పకొనవచ్చును. ఆ గోవుకు రాటకు మధ్య త్రాటి అర్థవ్యాసముతో నేర్పడు వృత్తక్షేత్ర ఫలమున మాత్రము ఆ గోవు స్వేచ్ఛగా తిరుగు చుండును. అంతవరకు మాత్రమే దానికి స్వేచ్ఛ గలదు. ఆ నిర్ణీతక్షేత్రఫలములో తన ఇచ్ఛ వచ్చినట్లు తిరుగుచు మేతమేయవచ్చును. కాని ఆ వృత్తపరిధిని దాటుటకు దానికి స్వేచ్ఛ లేదు. ఈ విధముగ ఆ గోవుకు నియమిత స్వాతంత్ర్యము మాత్రమే కలదు. జీవాత్మ స్వాతంత్ర్యముకూడ ఇట్టిదే. గతజన్మమందలి స్వకర్మ ప్రకృతినిబట్టి ఈ జన్మమున జీవునకు పరిసరాద వాతావరణములు పరమాత్మునిచే నియమింప బడుచున్నవి. ఇట్లు పరమాత్మ జీవాత్మను ముక్కుత్రాట నీడ్చుచు పరిసరముల నేర్పర చుట పరమాత్మ ప్రకృతి ధర్మము.

"యదహంకార మాశ్రిత్య
న యోత్స్య ఇతి మన్యసే
మిథ్యైష వ్యవసాయ స్తే
ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి." అ_18_59
"స్వభావజేన కౌంతేయ
నిబద్ధః స్వేనకర్మణా
కర్తుం నేచ్ఛసి యన్మోహా
త్కరిష్యస్యవశోఽపితత్" అ_18_60.
"అహంకార విమూఢాత్మా
కర్తాహమితి మన్యతే" అ_3_27

"అహంకారమును ఆశ్రయించి యుద్ధమొనర్పను" అని తలచుచున్నావు. ఇది మిథ్య, వట్టి భ్రమ సుమా! నీ క్షత్రియ స్వభావమే నిన్ను నియోగింపగలదు. మోహముచే అవివేకముచే దేనిని చేయ నిచ్చగింపవో నీ స్వభావజాతమగు కర్మవలన బద్ధుడవై నీ ఇష్టమునకు వ్యతిరేకముగనే చేయుదువు. అహంకారమున బుద్ధిచెడిన వాడు "నేను కర్తను" అని తలచును.

ఈ గీతాశ్లోకముల ప్రకారము జీవాత్మకు కొద్దిపాటి స్వేచ్ఛమాత్రమే కలదని తెలియు చున్నది. ఇట్టి స్వాతంత్ర్యము ప్రకృతిసిద్ధము కాదు, ప్రవృద్ధి పరిణామముకొరకై పరమాత్ముడు జీవాత్మకు ప్రసాదించిన నియమిత "దత్తస్వాతంత్ర్యము".

కొందరు ద్వైతసిద్ధాంతులు స్వాతంత్ర్యమే అవసరములేదని వక్కాణింతురు. పరమాత్మే మన విధినిర్ణేత. ఆతడే ప్రేరకుడు, కారకుడు కూడ. జీవాత్మ ఆద్యవస్థలో గుణయుతమై యుండును ప్రతి జీవాత్మ తన ప్రత్యేక పరమావధిని పాటుబడి పొందుటకు తగిన శక్తిని కలిగి యుండును.

ఒక బాలుడు బాల్యమందే చూచిన వస్తువులను చిత్రించి, తన భావి చిత్రకళాకౌశలమును వ్యక్తీకరించినప్పుడు ఆ బాలుని తండ్రి అది గ్రహించి ఆ బాలునకు తగిన సందర్భ సదుపాయములు కల్గించి సమీచీన చిత్రకళాప్రవీణునిగా చేయును. అదేవిధముగ పరమాత్ముడు జీవాత్మకు నవ్యపరిసరానుభవములను కల్గించి ఆత్మానుభూతిని బడయుటకు అవకాశములు కల్పించుచుండును. జీవునకు ప్రథమజన్మపరిస్థితులు ప్రకృత్యాద్యనాదకర్మలచే ఏర్పడు చుండును. తరువాత ప్రతి ఒక్క జన్మలో తత్పూర్వపుజన్మ కర్మలవలన సంపాదించుకొన్న ఫలమును సుఖమునో దుఃఖమునో అనుభవించు చుండును. ఈ సిద్ధాంతవాదుల ప్రకారము మానవమాత్రులకు సన్మార్గములజూపు విధ్యుక్త ధర్మములు చెప్పు వేదాదులు ప్రతి జీవికి ఆ జీవి విధిప్రకారమున కనుగుణముగా అన్వయించు చుండును. జీవాత్మకు ఇందున స్వాతంత్ర్య

ముండకపోవచ్చు కాని అట్టి ఉన్నాయములు పరమాత్మ నిర్బంధముచే జీవాత్మకు కల్గినవే. పరమాత్ముడే ప్రతి విషయమునకు దివ్యప్రేరణ శక్తి యైనచో మనలో కార్యోత్సాహము మృగ్యమగును. గురుభావమును వహించి ఇతరులకు విధినిషేధముల చెప్పుటకు ప్రసక్తి యెక్కడిది. ఒకడు తన భావిజన్మమును దిద్ది తీర్చుకోలేనిచో శాస్త్రముల ప్రమేయమేమి? కాబట్టి మంచిచెడ్డలను తెలిసికొనుటకు జీవాత్మకు కల్గిన నియమిత స్వాతంత్ర్యము—"దత్తస్వాతంత్ర్య" విధానము తృప్తికరముగా కన్పించుచున్నది. ఇట్టి "దత్తస్వాతంత్ర్యవిధానము" దైనికజీవితములో చూచుచునే యున్నాము. ఒకగృహమండలి గృహస్థు అధీనములోనున్న కుటుంబమునకు గల స్వాతంత్ర్యము, ఒక ప్రభుత్వాధికారి క్రింది ఉద్యోగుల స్వాతంత్ర్యము, ఇట్టివే. మన దిగ్విజయములలో నూటికి ఎన్నిపాళ్లు మనశక్తిని వినియోగించితిమి, ఎన్నిపాళ్లు దివ్యశక్తివలన సఫలములైనవికూడ తెలిసికొనవచ్చును. జగన్నాథ దాసరు అను మధ్వభక్తుడు విష్ణురహస్యమను ద్వైత తత్త్వగ్రంథము నాధారముగా రచించిన హరికథామృతసారమున దివ్యశక్తికిని మానవశక్తికిని గల నిష్పత్తి సంబంధమును నిరూపించినాడు.

ఏది ఎట్లున్నను, జీవాత్మకు నియమిత స్వాతంత్ర్యము కలదనియు, అట్టిస్వాతంత్ర్యము జీవుడు స్వప్రకృతి ననుసరించి శ్రీహరిదాసుడై పరిణామమును చెందుటకు పరమాత్ముడు జీవునకిచ్చిన మహాప్రసాదమని చెప్పుకొనవచ్చును.



సత్యమును ప్రేమను ధర్మదీక్షను నడ్డగజాలిన దేదియులేదు. మీరు నిష్కపటులేనా? ప్రాణత్యాగమునకైనను సిద్ధపడు స్వార్థరహితులేనా? ప్రేమమయులేనా? అగుచో మీకు భయములేదు. మృత్యువువలననైనను భయములేదు. వత్సలారా! ముందంజవేయుడు! లోకమున కంతకును వికాసము అత్యావశ్యకమైయున్నది. దానికై లోకము వేచియున్నది! భారతదేశముననే యీ వికాసము—జ్ఞానతేజము—కలదు, ఇంద్రజాలముననా, కాదు, మంత్రతంత్రములందా, కాదు, పరమార్థ వైభవ బోధనమున—మహోన్నతాధ్యాత్మిక తత్త్వబోధనమున—నయ్యది వెల్గొందుచున్నది. ఇందువలననే సమస్త విఘాతములనుండియు భారతజాతిని విధాత కాపాడి, నేటివఱకును నిలిపియున్నాడు. ఇపుడు సమయము వచ్చినది. వత్సలారా! ధీరులారా! మీ రందఱును ఘనకార్యముల నొనర్చుటకు జన్మించితిమని నమ్ముడు! శ్వానగర్జనములకు—మూర్ఖ ప్రతిఘటనములకు—జడియకుడు, వజ్రాయుధఘాతమునకైనను వెఱవకుడు. సుస్థిరులై, కృషి సాగింపుడు!

—శ్రీ వివేకానందస్వామి

# వీర గిరీశచంద్ర

శ్రీ దువ్వూరి రామకృష్ణారావు, బి. ఏ.

(గతసంచిక తరువాయి)

ఒకప్పుడు కాశీపురోద్యానమున నొక చెట్టు క్రింద గూర్చొని గిరీశుడు సోదరశిష్యగణముతో తమలో తాము ప్రసంగించుకొనుచుండిరి. అచటికి రామకృష్ణులు విహారమునకై వచ్చిరి. గురుదేవులను జూడగనే, వారి కందఱును ప్రమొక్కిరి. అంతట రామకృష్ణులు, "గిరీష్! నాయందేమిచూచి, నీవందరకు నన్నవతారమూర్తియని కొనియాడుచుంటి" వనిరి. ఈ ప్రశ్నకు దొట్రుబాటు చెందక, గిరీశుడు బద్ధాంజలుడై, గురుపాదములకు ప్రమొక్కి యుద్రిక్త, గద్గదస్వరముతో "వ్యాస, వాల్మీకాది మహర్షులే భగవంతుని దెలిసికొనలేక పోయిరిగదా! అట్టిచో నావంటి యల్పుడు వానినిగూర్చి యేమి జెప్పగలడు!"ని విన్నవించెను. ఈ వాక్యమునందలి యుద్రేకమునుగని, గురుదేవుల మనస్సు కరగి, ప్రసన్నులై భావసమాధియందుండి, "ఇంక నేనేమందును? మీకు జ్ఞానోదయమగుగావుత" మని వారినందఱి నాశీర్వదించిరి.

గురుదేవులు మంచముపైనుండి లేవలేని స్థితియందొకనాడు గిరీశుని యారోగ్యమును గూర్చి ప్రస్తావించి, లాటును గిరీశునకు బొగాకు, వక్క, ఫలాహారములు దెచ్చియిమ్మనికోరెను. ఇంతలో భక్తుడొకడు గురుదేవులకు బుష్పమాల లందియ్య తానలంకృతుడై, ఆపుష్పమాలలలో, రెండింటిని దీసి గురుదేవులు గిరీశునలంకరించి ప్రసాదమును తినిపించి అంత లేవలేని స్థితియందును, గిరీశునిచేతులు కదిలించి, చెవిలో నేదియో రహస్యముగ జెప్పి, యారోదిన ముపవసింపుమని యాజ్ఞచేసిరి. దీని నతిశ్రద్ధాభక్తులతో గిరీశుడు గ్రహించెను. గురుదేవుల సర్వోత్కృష్టమగు ప్రేమయే ఆ పాపి నాస్తికు నింతటి యాస్తికుజేసెను.

ఎంతటి ఆస్తికుడైనను కర్మ నతిక్రమింపనేరితరము? గిరీశుని కష్టములు నానిని నెంటాడుచునే యున్నవి. రెండవభార్యకు గలిగిన యిద్దఱు కుమార్తెలు మృతులైరి. ఆతల్లియు నొక కుమారుని (వరప్రసాదుని) గని చనిపోయినది. ఈ కారణములవలన, వృద్ధాప్యమున, గిరీశుని మనస్సు చాల క్రుంగిపోయెను. అతని యుల్లాసము, జవసత్వములు సన్నగిలెను. నీశ్వరునిపై భారమువైచి పూర్ణత్యాగముతో నుండుటయే, యీకష్టపరంపరలకు, సుఖదుఃఖములకు ఆతని నిలువబెట్టు నూతయు శాంతిదాయకము నయ్యెను.

గిరీశు డిష్టనిష్ఠకై, గురుదేవులను దనకు బుత్రునిగా నవతరింపుమని వగిబడిగియుండెను గదా! గురుదేవులు గోరిన వరమిచ్చెడివారు గాన, నట్లే గిరీశునకు బుత్రోత్సవము జరిగినది. ఈ వరప్రసాదకుడు శైశవాయమునసే భగవన్నామస్మరణయం దనురక్తియు, గురుదేవుల స్మరణ మాతృదేవి వాక్కులు వినగనే

యూరండిల్లుచుండుటయు జూడ గిరీశున కభీష్ట సిద్ధి యయ్యెననెడి మహానందము కలిగెను.

ఒకనాడు మాతృదేవిని జూచుట కాబాలు డెంతయో తహతహలాడెను. మాతాజీ పట ము మిద్దెపైనుండెను. ఇంటివారందఱును మిద్దె పైకి దీసికొనివెళ్ల నా బిడ్డడు కెవ్వనేడ్చి, వారి కాపటమును జూపించెను. మొదట నిది యేమియో వారు గ్రహింపజాలకపోయినను, తుదకాబాలుని వెంటబెట్టుకొని గిరీశుడుతప్ప మిగిలినవారెల్ల రాయింటిమేడయూదుండిన అమ్మ గారి సన్నిధికేగిరి. అప్పటికి నాలుగేండ్లవా డైనను, వరప్రసాదుడు మాతృదేవిని జూచి దర్శనముకాగనే, యామెకు సాష్టాంగదండప్ర ణామమిడెను. ఇంతటితో నూరకొనకుండ ఆ బాలుడు మేడక్రిందనే కూర్చుండియుండిన తం డ్రిని జేరి, యాతని పంచెను పట్టుకొని మాతృ దేవి దర్శనార్థమై, పైకిలాగుకొని వెళ్లుచుం డెను. గిరీశుడు వెక్కివెక్కి యేడ్చుచు, "నా చిట్టీ! నేను మహాపాపిని! శ్రీమాతృదేవిని జూడజాల!" నని విలపించెను. కాని బాలుడు పెంకిపట్టు వదలడాయెను. చేయునది తోచక ఆ బిడ్డనెత్తుకొని, తన శరీరమంతయు కంపించు చుండ గిరీశుడు మాతృదేవిదగ్గరకుపోయి నేలపై మోకరిల్లి "అమ్మా! యీబిడ్డ, నన్ను నీ దివ్యచరణ దర్శనము చేయించె"ననియె.

నాల్గవ సంవత్సరముననే వరప్రసాదుడు చని పోయెను. గిరీశున కీ పుత్రవియోగము దుర్భర మయ్యెను. "నా కా కుమారుని బ్రసాదించిన వారే తిరిగి వానిని గ్రహించిరి, ఆయానందము నకుగాని యీ దుఃఖమునకుగాని నేను కర్తను గాను. సర్వ మీశ్వరేచ్ఛ"యని మనస్సునకు సమాధానము చెప్పికొని అతడూరడిల్లుచుండెడి వాడు. ఈ దుఃస్థితి జూచి, నిరంజనానందస్వా ములవారు గిరీశుని ప్రోద్బలముజేసి, సన్యాసు లతో జయరామ్‌బాటికి తోడ్కొని వెళ్లిరి. ఇదియే శ్రీమాతృదేవి యవ్యాజ దివ్యప్రేమను పూర్ణముగ గ్రహించుట కతనికి లభించిన ప్రథ మావకాశము. అచ్చట మాతాజీకి, బ్రణ మిల్లి, శారదాదేవి ముఖమును జూచినవెంటనే, గిరీశుడు బయటగదిలోనికి బోయి, యేదియో తీవ్రమైన యాలోచనలోబడియె. ఈ మార్పు చూపరులకందరకు నాశ్చర్యముగ నుండెను. అంత, నిరంజనానందస్వామి, యీ పరిణామ మునకు గారణమేమియని యడుగ, గిరీశుడు తనకు లోగడకలిగిన జబ్బును, తానాస్థితిలో కలయందు జూచినసతి పనుపున గ్రహించిన జగన్నాథ ప్రసాదగాథను చెప్పుచు, నిప్పుడా దివ్యస్వరూపిణిని శారదామాతగా గుర్తించితి నని నుడివెను. అప్పటినుండి, నిరంజనుని దయ వలన దాను, జననిని దెలిసికొన గల్గితినని యానందించుచుండెడివాడు. ఇట్లు గిరీశుడు శ్రీ శారదా రామకృష్ణులను, పార్వతీపరమేశ్వరు లుగను, తలిదండ్రులుగను గ్రహించినవాడై వారియందు పరిపూర్ణ శరణాగతిని బొందెను.

గిరీశు డనుభవింపవలసిన కర్మఫలమంతయు ననుభవించుటయినది. ప్రాపంచిక బంధములు పూర్తిగ దెగిపోయెను. ఉద్యోగమును బోయి నది. ఇప్పటి కాతనియందుగల వక్రత నశిం చినది. నియమబద్ధుడయ్యెను. అతని దృష్టి, అతని ప్రకృతి, సరియగు స్థితిని బడినవి. స్వయం కృత కర్మానుసారముగ వాటిల్లిన దురవస్థలకు లొంగి, క్రుంగి, కృశించి, క్లైబ్యముతోనుండక, గిరీశుడు త్యాగముతోగూడిన భక్తుడయ్యెను. ఇందువలననే వివేకానందులు గిరీశుని, "బీ(వీ)ర గిరీష్" అని కొనియాడిరి. "శరణాగతి యనెడిది

గిరీశునుండియే గ్రహింపగల్గితి’ ననుచు, గిరీశుని భక్తిని స్వాములవారు కొనియాడిరి.

మరియొక సమయమున సృష్టినిగూర్చి గొప్ప చర్చ జరుగుచుండెను. అంత స్వామీజి గిరీశుని నీవేమి చెప్పెదవనిరి. గిరీశుడు, “నేనేమి తెలిసికొందును. నాకట్టి విషయములను తెలిసికొనుటకును, వ్యవధిలేదు. తెలిసికొనగల వివేకమునులేదు. సంసారమును త్యజించినంత మాత్రమున లాభమేమి? గృహస్థాశ్రమ మొకకోటవంటిది. మూఢులు బద్ధులమనుకొనుచు, నిజముగా బద్ధులై యుందురు. ఈ నీ బంధమునకును, నీ ముక్తికిని, నీ మనస్సే కారణము. ఒకచేతితో స్వార్థరహితమగు కర్మ నాచరించుచు, రెండవహస్తముతో భగవంతుని పాదములను నీహృదయకమలములపై నుంచుకొనుము. పనిలేని సమయముల, నీ రెండుచేతులను భగవత్పాదములను నీ హృదయమున నుంచుకొనుము. ఇది శ్రీరామకృష్ణులు నాకనుగ్రహించిన యుపదేశము. శ్రీ గురుదేవుల కృపవలన వేదములను, వేదాంతము నధిగమించి. తరియింపగలనను విశ్వాసము నాకు పూర్ణముగ గలదు. నాకు వేనితోను ప్రసక్తి యేమియును లే”దని ఋగ్వేద గ్రంథమును తన శిరమున పెట్టుకొని మ్రొక్కి— వేదస్వరూపులగు రామకృష్ణావతారమునకు జై, జై యనుచు గిరీశుడు నినాదములు చేసెను.

ఈ మాటలను స్వామీజీ విని దీర్ఘాలోచనలో బడియుండ, గిరీశుడు, “స్వామీజీ! తాము వేదములను, వేదాంతములను బరనము జేసియున్నారు, పండితోత్తములు. తాము పఠించిన వేదములలో వేదాంతములో నెచ్చటనైన నీదేశమునందలి ప్రజల క్లిష్టావస్థలకు, వ్యభిచారదోషములకు, మహాపాపములకు తగు పరిహారము సూచింపగలరా?” యని ప్రశ్నించెను. స్వామీజీ నోటమాటరాక, హృదయమున నావేదన యేర్పడి, “విజ్ఞానము, భక్తి, ప్రేమ మూడును గడ కొక్కటియే. సుష్క వేదాంతము సున్న, సున్న సు”మ్మనుచు, తోటివారికై దుఃఖించిరి.

గిరీశునకు దుర్గాపూజయందు బహుప్రీతి. 1907 లో దుర్గాపూజకు శ్రీమాతృదేవి నాహ్వానించెను. ఆమె చలిజ్వరముచే బాధపడుచుండుటచే, గిరీశు డామెను తనగృహమునుపావనము జేయుటకై పల్లకి పంపెను. కాని, ఆమె రాలేనిస్థితియందుండుటచే వట్టి పల్లకిగా తిరిగి వచ్చెను. అంత, ఆశాభంగముచే, గిరీశుడు ఖిన్నుడై పూజాగృహమునుగూడ త్రొక్కడాయె. ఈ గిరీశుని మనోబాధను గ్రహించెనాయన్నట్లు, పూజాసమయమునకు మాతృదేవి కాలినడకనే గిరీశునింటికి వచ్చెను. గిరీశుడు మహానందభరితుడై యథావిధిని దుర్గ నారాధించెను.

చెట్టునకు తెలియకుండగనె పండు పక్వమై రాలిపోవునట్లు, గిరీశుని వాంఛలన్నియును నశించుటయు, నతడు స్వార్థమనునది యింత మాత్రమును లేక, శరీరమున్నంతదనుక, సనాథరక్షణకు, దరిద్రనారాయణసేవకు, ఫలాపేక్షారహితముగ పనిచేయ దొడగెను. వృద్ధాప్యమున హోమోపతి వైద్యము నభ్యసించి, హరిజనవాడల సేవజేయనారంభించెను. గిరీశు డను క్షణము దాను గురుదేవుల కుపకరణముననియెంచుకొనుచు, దానట్టి యుపకరణముగ వినియోగపడితినను విశ్వాసముతో, ఆనందముతో, రోగికి మందిచ్చుటకు ముందు, మందును తన హస్తకమలములయందుంచుకొని, యతి వినయముగ భగవద్ధ్యానమునుజేసి, శుభమగు

గాకయని, దేవుని వేడుకొనుచు జేతులెత్తి భగవత్ప్రార్థన సల్పెడివాడు.

గిరీశుడు, దనరచనలవలన, నాటకప్రదర్శనములవలన, శ్రీరామకృష్ణబోధామృతమునుశీఘ్రప్రచారము గావించి, స్వామికార్యమును నెరవేర్చి, శాశ్వతత్వమును గాంచిన ధన్యజీవి. గిరీశుడు 76 నాటకములను, 3 నవలలను, 18 చిన్నకథలను, 2 గీతికలను రచించెను. వీనిలో బెక్కు రచనలు జగత్ప్రఖ్యాతిని గాంచినవి. స్వామిభక్తిపరతనే యిందు గాంతుము.

గిరీశుడు 1906 నుండి యుబ్బసముతో బాధపడుచు, ఆరోగ్యమునకై 1909-1910 లో కాశీనగరమందు నివసించెను. కొంచెము సుఖము చేకూరగనే, తిరిగి యెప్పటియట్లు ప్రజాసేవ చేయవలయునను సుద్దేశోత్సాహములతో కలకత్తానగరమును చేరెను. కాని, శక్తిహీనుడగుటచే, రోగ మాతని ద్రొక్కివైచెను. ఇట్లు చరమావస్థయందుండియు, శివరాత్రినాడు నాల్గుజాములత్యంత శ్రద్ధాభక్తులతో శివునారాధించెను. ఇదిచూచిన యొక భక్తాగ్రేసరుడు గిరీశుని దానుంతగ నిట్టిస్థితియందేల శ్రమపడెదరని యడుగ, దమకు శివదర్శన మగునని గిరీశుడు బదులు జెప్పెను. అంత, శివదర్శనమా, గురుదేవులదర్శనమా యని యడుగ, గురుదేవుల దర్శనమేయని చెప్పెను. దర్శనమాత్రమున సరియా, గురుదేవులు సజీవముగ మాట్లాడుభాగ్య మబ్బెనాయని యడుగ, గిరీశుడు గురుదేవులతో సజీవముగ మాట్లాడు నట్టి సాయుజ్యానుభవమే తనకడపటి కోర్కెయనియె!

ఇట్లు రామకృష్ణస్మరణను జేయుచు, తన తోటివారితో "నాకు వేరేమియు కోరకలు లేవు. గురుదేవు నపార ప్రేమసాగరునిగ, అనంత కరుణాసాంద్రునిగ సర్వదా స్మరణజేసి కొనుచుండునట్లు మాత్రమేనన్నాశీర్వదించుడు. ప్రపంచము నాకెంతమాత్రము భయానహము కాదు. గురుదేవుని కటాక్షమున (యమునిని) మృత్యుభయము దాటితి"నని గిరీశుడు తన యనన్యగురుభక్తిని, ఆత్మవిశ్వాసమును వెల్లడించుచుండువాడు. అవసానకాలమున శ్రీరామకృష్ణులను ముమ్మారు స్మరించి, 'దేవా! నాకు శాంతినిమ్ము. నీలో నన్నైక్యము జేసికొను' మని ప్రార్థనచేయుచు, వీరగిరీశుడు క్రీ. శ. 1912 లో మహాసమాధి నందెను.

గృహస్థులకు, అందు ముఖ్యముగా వ్యభిచారులకు, త్రాగుబోతులకు, నటకులకు, వైద్యులకు అనేకములగు లోపములుండునుగాన వారి కుత్తరగతులు లేవని లోకప్రతీతి. కాని, తప్పక యెట్టివారికైన నిశ్చల వీరభక్తిచే నుత్తమగతులు సుసాధ్యములు కాగలవను విషయమున గిరీశుని జీవితము లోకమున నాచంద్రార్కముగ అప్రతిహత నిదర్శనమై వెలయగలదు. లేమినే ప్రేమించుచు, మృత్యురూపమునే యాలింగనముజేసికొనుచు, శివతాండవమున దాండవించుచు, శ్రీమాతనే బహిరంతర్ముఖముల నారాధించిన జీవన్ముక్తుడు గిరీశచంద్రుడు!



# శ్రీ కృష్ణ స్తవము

శ్రీ చెరుకుమల్లి వేంకటయ్యా చౌదరి

(గతసంచిక తరువాయి)

మ. మతిజూడన్నతి చంచలంబు, యశమా మట్టంబు, యిల్లాలిపై
నతికోపంబు, కళేబరేంద్రియధన వ్యర్థంబు, కేళీ, విలా
స తరంగమ్ముల వేళ జాణపయి నిస్సందేహ మోహంబు, శ్రీ
సతివంద్యా! వ్యభిచారలోలురకు కృష్ణా! భక్త సంరక్షణా! ౨౩

మ. ఫణికిం గోరలసందునన్ విషము విస్ఫారంబుగా వృశ్చికం
బునకుం దోకతుది న్నమర్చఁబడె, దుష్కర్మోహాంధుఁడౌ, కల్మషా
త్మునిఁజూడన్ విషముండదే నిలువునం భూరిప్రపూరంబుగా
ననిశంబున్ వనజాధిపా! మురళి కృష్ణా! భక్తసంరక్షణా! ౨౪

మ. పుడమిం గొందరు మాయలొడ్డి విమలాకృత్తున్ సజ్జనుంగూడి, నిన్
విడనాడన్ మనసొప్పదంచు హితమున్ జేతుర్గదా! మీదటన్
వడిగా వానినిఁగార్యరంగమునకున్ బ్రాకించి, మాయావులై
నడియేటన్ మరిపుట్టి ముంచెదరు, కృష్ణా! భక్తసంరక్షణా! ౨౫

మ. పులికోరల్ బెరుకంగవచ్చు, నిసుమంతంబున్ దైలముం దీయఁగా
నల, యత్నించినఁ దీయవచ్చుఁగద, మంటల్ మండి దీపించు, ని
ర్మల లోహంబును మ్రింగవచ్చు, ధనముం భావింపఁగాఁ దీయునే?
నళినాక్షా! యజుఁడైన లోభికడ, కృష్ణా! భక్తసంరక్షణా! ౨౬

మ. జలదంబుల్ మెరుపుల్ మహోద్ధృతములై చయ్యంచు ఘోషించు, వా
నలు సున్నాను శరత్తునందు, మొగులుల్ రావంబు లన్నల్పకే,
భళి! వర్షించును ఖించి వానతరి, దేవా! దుర్జనుండట్లు, సొం
పలరన్ గూయును, చేయు సజ్జనుఁడు కృష్ణా! భక్తసంరక్షణా! ౨౭

మ. జలదంబుల్ నభమందుఁ బ్రాకి పెనువర్షంబుల్ బ్రతిం గోరకే
ఫల పుష్పాన్వితఛాయలీవె విటప వ్రాజంబు, స్వచ్ఛంద ని
ర్మల పానీయమొసంగవే నదులు, మర్త్యానీక సంపూజ్యులో
జలశాయీ! పరసౌఖ్య కాములిలఁ గృష్ణా! భక్తసంరక్షణా! ౨౮

మ. నవమాధుర్య విహీనపుంగవిత, సంకేతానంబులే నింట్లు, భూ
ధవరాహిత్య ధరాతలంబు, కడు పెద్దల్ లేని గ్రామాదులున్
ధవునిన్ మాలిన కామినీ సొగసు, విద్యాశూన్యమౌ గవి, కే
శవ! విశ్వంబున రాణకెక్కవయ కృష్ణా! భక్తసంరక్షణా! ౫౯

మ. కవికిన్ శిల్పికి భేదమేది? కవియా కాంతార మధ్యంబులం
బవనుండేగని పర్వతాళి గుహలన్ వర్ణించుఁ, దాఁగాంచిన
ట్లు, విచిత్రంబుగ శిల్పిదిద్దు నులిచే లోకాభిరామంబుగా
నవసౌందర్యము చిందురూపములఁ గృష్ణా! భక్తసంరక్షణా! ౬౦

మ. ధనమున్ విద్యయు, సత్కులంబు, నివియుం దాల్మి న్నిగర్వంబు స
జ్జనలోకానికిఁ దెచ్చు, దుర్జనులకుం దానావలేపంబులన్
ననిశంబుం బొనఁగూర్చు, నిక్కముగ, నిర్వ్యాపారముంగూరు, భా
షణముల్ దొర్లు వివేకశూన్యముగ కృష్ణా! భక్తసంరక్షణా! ౬౧

మ. ఎపుడున్ పాలసుచెంత సజ్జనుఁడు కన్పింపంగ, నా సజ్జనున్
విపు లౌన్నత్య ప్రభావుఁ డీతఁడని తావీక్షింపకన్నుండి, దూ
రపు కొండల్ నునుపన్నరీతిగను, దూరంబుండు వేరొక్కనిం
జపియించుం గడు గొప్పవాడనుచు, కృష్ణా! భక్త సంరక్షణా! ౬౨

మ. దినముల్ బాగుగనున్న యాతరిని, యాదిత్యచ్ఛవింగాంచుఁ, దా
వనిలోఁగూడి చరించినన్ ఫలము సంప్రాప్తించు, వేయేల, నా
దినముల్ స్రుక్కుచునుండు నత్తరిని సద్దేవాద్రిపై నెక్కినన్
ధనముంగాంచడు మానవుండు, యదు కృష్ణా! భక్తసంరక్షణా! ౬౩

మ. తనకీర్తి ద్యుతిచంద్రికల్ పుడమి మోదం బొప్పఁగాఁ బ్రాకె నం
చును మర్త్యుండతి సంతసిల్లనగునే? చూడం గురంగంబు, నీ
డను వీక్షించి, స్వరూపమెంచి, కడగంట్లం బాలుగాదే! నురాం
గన హృద్యాంతర సీమలందనుపు కృష్ణా! భక్తసంరక్షణా! ౬౪

మ. జయ రామామణి హృత్సరోవర నివాసా! వాసవాదిస్తుతా!
జయ వారాశి గభీర! వారిజదళాక్షా! పక్షిరాడ్వాహనా!
జయ భోగీంద్రశయాన! సత్కవి సుధీ సంవేద్య! విశ్వాధిపా!
జయ దామోదర! శంఖచక్రధర! కృష్ణా? భక్తసంరక్షణా! ౬౫

సంపూర్ణము శ్రీకృష్ణార్పణమస్తు.

# గ్రంథసమీక్ష

## భక్తి తత్త్వము

గ్రంథకర్త: శ్రీ నిర్వికల్పానందస్వామి. డబుల్ క్రౌన్ 1/16 సైజు (52 + 12) పుటలు. వెల: రూ. 0-12-0. వలయువారు సాధన గ్రంథమండలి. తెనాలి అని వ్రాయవలయును.

ఇది భక్తి తత్త్వమును మూలముట్టుగ దెలుపగల గ్రంథము. భక్తియందలి అవాంతర భేదము లీ గ్రంథమున విపులముగ వివరింప బడియున్నవి. శాస్త్రీయములగు ననేక శ్లోకములు దెలిపి వివరింపబడియున్నవి. ద్వితీయ దళమున గల భక్తి భావరసవిచారము మిక్కిలి హృదయ రంజకమై ముముక్షువుల నెల్లర నాకర్షించు చున్నది. శ్రీ చైతన్య ప్రభు సంస్మరణముతో గ్రంథము ముగింపబడియున్నది.

## అభిరామ సంకీర్తనములు

రచయిత్రి: శ్రీమతి యస్. నీలాంబ, డబుల్ క్రౌన్ 1/16 సైజు 72 పుటలు. వలయు వారు, శ్రీ సబ్బిసీసు వేంకటపతిగారు, ఛత్రపురము, గంజాంజిల్లా అని వ్రాయవలయును.

కవయిత్రి శ్రీ నీలాంబగారు శ్రీ వేంకటపతిగారి ధర్మపత్ని. గ్రహబాధ నివారణము కావించిన తమ గురువు శ్రీ పరమహంస అభిరాములవారి యాజ్ఞ మేరకు ఈ సంకీర్తనముల విరచించినది. ఈ గేయములు స్త్రీ పురుష భేదములేక యెల్లరను సర్వసమానముగా పాడుకొనదగియున్నవి. భక్తి బోధకములును చిత్త విస్ఫురణ కరణములును నగు నీ గేయములు పాడి పాఠకలోకము తరించుగాక!

## భక్త జీవనము

కర్త: పుతుంబాక శ్రీ కృష్ణయ్య. డిమై 1/12 సైజు 92 పుటలు. వెల: రూ. 0-12-0 ప్రకాశకులు, శ్రీ సీతారామ నామసంకీర్తన సంఘము, గుంటూరు.

నామసంకీర్తన ప్రచురణ కుసుమములలో వికసించిన 12 వ పుష్పమీ భక్త జీవనము. సహజ భక్తిపరులు శ్రీ కృష్ణయ్యగారు ఆధ్యాత్మికోన్మాదమున అప్పుడప్పుడు తమకు తోచిన తత్త్వవిషయములు పరమేశ్వర స్తుతిపరములు గావించి 108 వచనములను భావములు సూటిగా భక్తుల మనముల నాటునట్లు రచించినారు. భగవద్భక్తు లవశ్య మాఘ్రాణింపవలసిన పుష్పరాజము.

# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

## శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము)

540 పుటలు సర్వాంగ సుందరమగు చతుర్థ ముద్రణము వెల రూ. 3-4-0

## శ్రీ మద్భగవద్గీత

480 పుటలు శ్రీధరీయ టీకాసార ప్రతిపద టీకాతాత్పర్య విశేషార్థ సహితము రూ. 3-0-0

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

350 పుటలు (మద్రాసు ఆంధ్ర విశ్వవిద్యాలయములందు పాఠ్యగ్రంథము) రూ. 2-8-0

## శ్రీ శారదాదేవి చరిత్ర

256 పుటలు (ఆంధ్ర విశ్వవిద్యాలయమున పాఠ్యగ్రంథము) వెల రూ. 1-12-0

## శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

186 పుటలు (ఆదర్శప్రాయుడగు గృహస్థుని జీవితము) వెల రూ. 1-4-0

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| శారదా ప్రసంగములు .. | 2 | 8 | 0 | గురూపదేశములు . | | | 0 | 8 | 0 |
| ప్రబోధరత్నాకరము .. | 2 | 4 | 0 | [illegible] | | | 0 | 6 | 0 |
| రాజయోగము . | 2 | 4 | 0 | నా గురుదేవుడు . | | | 0 | 6 | 0 |
| కర్మయోగము . | 1 | 8 | 0 | నవీన భారతదేశము . | | | 0 | 4 | 0 |
| భక్తియోగము .. | 1 | 4 | 0 | శ్రీ పరమహంస జీవిత సంగ్రహము | | | 0 | 4 | 0 |
| వివేకానంద లేఖావళి (మొదటి భాగము) | 1 | 8 | 0 | ముక్తిమార్గము .. | | | 0 | 3 | 0 |
| వివేకానంద లేఖావళి (రెండవ భాగము) | 1 | 8 | 0 | సర్వం విష్ణుమయం జగత్ (తెలుగు) | | | 0 | 3 | 0 |
| అనుష్ఠాన వేదాంతము .. | 1 | 4 | 0 | శ్రీ రామనామ సంకీర్తనము . | | | 0 | 1 | 0 |
| వివేక సూర్యోదయము . | 1 | 0 | 0 | యతిగీతము (పద్యకావ్యము) | | | 0 | 1 | 0 |
| శ్రీ పరమహంస నీతికథా రత్నములు | 0 | 12 | 0 | సింహగర్జన 0 0 6 | డజను | | 0 | 5 | 0 |
| భక్తిమార్గము .. | 0 | 8 | 0 | నా మతము 0 0 6 | డజను | | 0 | 5 | 0 |
| చికాగో నగరోపన్యాసములు .. | 0 | 8 | 0 | | | | | | |

ఇవిగాక

సంస్కృత, ఆంగ్ల, ద్రావిడ, కన్నడ గ్రంథములును

వేదాంతకేసరి (ఆంగ్లము) శ్రీరామకృష్ణ విజయము (తమిళము)

అను మాస పత్రికలును మాయొద్ద దొరకును

శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి

మున్నగువారి ఛాయాచిత్రములును మాయొద్ద దొరకును

ఇట్లు వ్రాయుడు

మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి

సంపాదకులు శ్రీ ఋతజానందస్వామి; శ్రీ [illegible] వేంకటకృష్ణరావు
శ్రీ కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటరు ప్రెస్సు లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి,
శ్రీ [illegible]స్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 20-10-50.






# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౭ సంచిక ౫

విషయ వివరణము

# శ్రీ రామకృష్ణ ప్రభ

## చందాదారులకు

౧. పత్రిక ప్రతిమాసము 20-వ తేదీన వెలువరింపఁబడును. ఒక వారము, పదిరోజులు చూచి ప్రతి మీకు అందకపోయినయెడల ఉత్తరము వ్రాయుఁడు.

౨. సంవత్సర చందా రు. ౩ లు మాత్రమే. జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని చందాదారులుగాఁ జేరవచ్చును. ఇతర మాసములలోఁ జేరదలచు వారికి జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని సంచికలు చేర్చిపంపఁబడును. విడిప్రతి రూ. ౦—౬—౦ లు. హిగిన్‌బాదంస్ వారి స్టాలులలోఁగాని, మీ పత్రిక ఏజెంటును గాని అడుగుఁడు

౩. ఉత్తర ప్రత్యుత్తరములు వీలైనంతవఱకు ఇంగ్లీషున వ్రాయుచు మీ చందాదారు సంఖ్య నుదాహరింపుఁడు. ఉత్తరములను “మేనేజరు, శ్రీరామకృష్ణప్రభ” అను చిరునామాకు వ్రాయుఁడు.

౪ చిరునామాయందు ఎట్టిమార్పుకలిగినను 10-వ తారీఖునకు ముందుగా మా కార్యాలయమునకుఁ దెలుపవలయును. లేనిచో, పత్రిక పూర్వపు చిరునామాకే పంపఁబడును.

## వ్యాసకర్తలకు

౧ కేవలము నైతిక ధార్మిక వైజ్ఞానిక విషయకములైన వ్యాసములే కాక, సాహిత్యమునకును కవిత్వమునకును సంబంధించిన ఏ వ్యాసములైనను బంపవచ్చును. సులభ సుందరమగు గ్రాంథిక భాషలో వ్రాయవలయును.

౨. వ్యాసములు అచ్చులో మూఁడు పుటలకు మించరాదు. ప్రతినెల ఒకటవ తేదీకి వ్యాసములు మాకు అందవలెను.

౩ వ్యాసములను, విమర్శకుఁ బంపు గ్రంథములను, వినిమయముగఁ బంపెడి పత్రికలను “సంపాదకుఁడు, శ్రీ రామకృష్ణ ప్రభ” అను చిరునామాకు వ్రాసి పంపవలెను.

౪. వ్యాసము తిరుగఁ బంపఁబడవలయుననుచోఁ దగు పోస్టేజి చేర్చి పంపవలయును.

---



# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౭ } ౧౯౭౦ నవంబరు – వికృతి – కార్తీకము { సంచిక ౫

## ప్రార్థన

### భక్తిశతకము

శ్లో॥ గతమిహ భవతా పథాచయేన
స్థితమపి యత్ర చ యత్ర వా నిషణ్ణమ్।
శయితమపి మునీంద్ర యత్రయోగాత్
తదపి శతమ్ ప్రణమామి పుణ్యతీర్థమ్॥ 28

ఓ మునీంద్ర! నీవు త్రొక్కిన బాటే, నీవు నిలిచిన చోటే, నీవు శయనించిన స్థలమే, యోగావస్థలో నీవున్న ప్రదేశమే, మహాపుణ్యతీర్థములు. వాటికి నా వందనశతములు.

శ్లో॥ సమజని భగవాన్ స్వయమ్ స్మ యస్మిం
సకలమబోధి చ యత్ర ధర్మచక్రమ్।
విశదతరమదీపియత్ర యస్మిన్
నమృతమపూరి తదప్యహం నమామి॥ 27

ఎచట బుద్ధభగవానుడు స్వయముగా జన్మించి సకలమును తెలిసికొనెనో, స్వచ్ఛమైన కిరణములతో ధర్మచక్రము ఎచ్చట ప్రకాశించుచున్నదో, ఎక్కడ బుద్ధుడు అమరత్వము నందెనో—ఆ ప్రదేశమునకు వందనము చేయుచున్నాను.



# జన్మసాఫల్యము

రాగము - ఆనందభైరవి　　　　　　　　　　　　　　　　　　　　　తాళము - ఆది.

పల్లవి

ఎన్నేళ్లుధరనరులున్నా - ఏమి ఫలమురా?
ఇహపర సంపత్కరా! - ఇందిరామనోహరా!

అనుపల్లవి

సన్నుతజీవితార్థము - సాత్వికశీలురై
సద్గురుపదసేవచే - సాధింపజాలక॥　　　　　　　　　　　　　　　ఎన్నేళ్లు॥

చరణములు

1. ఉన్నత జన్మమెత్తి - కన్నులపండువుగా
మున్ను వాతాత్మజువలె - సన్నిధినే యుండి
నిన్ను సదా చూచుచు - నిత్యము సేవింపక
దున్నలపగిది రొంపిలో - దొరలుచు, రామా॥　　　　　　　　　　ఎన్నేళ్లు॥

2. పరధనకాంతాహరులై - నరపాలురద్రుంచి
నిరతము నీమానల - వర వీరార్జునుభంగి
చరియింపక తామస - జంతువులగతిని
ధరకెంతో భారమౌచు - మురారి! కృష్ణా!॥　　　　　　　　　　ఎన్నేళ్లు॥

3. ప్రవిమల భక్తులకు - పరమపదమిచ్చే,
బాలకృష్ణనుత! స్వామి - వివేకానందురీతి
భువనమంతట నిల్పి - ముదమూర నినుగొల్వక,
అవని విషవిషయ - వశులై, రామకృష్ణా!　　　　　　　　　　ఎన్నేళ్లు॥



ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ

# శ్రీ రామకృష్ణ వచనామృతము—'మ.'

## దక్షిణేశ్వరమున భక్తులతో శ్రీరామకృష్ణుడు

ఆదివారము,

22, జూలై 1883.

నేడు సెలవుదినము కావున నెందఱో గృహస్థ భక్తులు శ్రీరామకృష్ణుని జూడవచ్చిరి. యువకులు, అందు ముఖ్యముగా, విద్యార్థులితర దినములందు ఎక్కువగా వచ్చుచుండువారు. మంత్రోపదేశార్థమై విశేషముగా శని మంగళ వారములందు శ్రీ గురుదేవులు రమ్మని చెప్పెడివారు. నేడు రాఖాలు, అధరుడు, 'మ.'— వీరు మువ్వురును కలకత్తానుండి వచ్చియుండిరి.

శ్రీరామకృష్ణ గురుదేవులు మాధ్యాహ్నిక భోజనమును గైకొని విశ్రమింపనుండిరి. క్రింది గదియందు మణిమల్లికుడు తదితర భక్తులు కొందఱు కూర్చొనియుండిరి. ఆ గదియందలి గోడలు ఎందఱో దేవీ దేవరల చిత్రపటము లంటింపబడి యెంతయో ఆకర్షణీయముగా నుండెను. వానితోబాటు సముద్రమగ్నము కానున్న పేటరును ఏసుక్రీస్తు రక్షించు దృశ్యముగల చిత్రముగూడ నుండెను. ఇట్టి గురుదేవుల గది చుట్టుపట్ల సుగంధ పరిమళము వెదజల్లు పుష్పములతో నెన్నియో పూలమొక్కలు విరాజిల్లుచుండెను. శ్రీ గురుదేవులు తమ చిన్నిమంచముపై నుత్తరాభిముఖులై కూర్చొనియుండిరి. భక్తులెల్లరు నేలమీదను చాపల మీదను కంబళ్లపైనను గూర్చొని శ్రీవారి ముఖమున జూడ్కులు నిల్పి శ్రీవారినే గమనించుచుండిరి. మణిమల్లికుడు వయోవృద్ధుడగు బ్రాహ్మభక్తుడు, శ్రీ గురుదేవుల దర్శనార్థమై వచ్చియుండెను. కొలదినాళ్ల క్రితమే తాను కాశికి బోయివచ్చిన విషయములన్నియు ఆతడు శ్రీ గురుదేవులతో నివేదించుచుండెను.

మణిమల్లికు—కాశీయందు నే నొక సాధువును దర్శించితిని. వారు ఇంద్రియ సంయమము లేనిదే ఏదియు జరుగజాలదని వచించిరి. కేవలము భగవద్ధ్యానము (నామజపము) చేసినచో ప్రయోజనము లేదట.

శ్రీరామకృష్ణులు—వారి యభిప్రాయ మేమియో తెలియునా? మొదట సాధన చేయవలయును. శమ దమ తితీక్షలు ఆవశ్యకములు. వారందఱుగూడ నిర్వాణముకొఱకే ప్రయత్నించువారు. వారి వేదాంతమతమది. 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా' యను కఠినవాక్య విచారముచేయువారు వారు. అది అత్యంత కఠిన మార్గము. జగమే మిథ్యయైనప్పుడు నీవును మిథ్యయే; నీకుపదేశము చేయుచున్నవారును మిథ్యయే. నీ యుపదేశ గ్రహణముకూడ స్వాప్నికమే. ఇవన్నియు చాల ఉన్నతములగు వాక్కులు. కర్పూరమును రగుల్కొల్పిన అంతయు పూర్ణముగా మండిపోవును గాని యేమియు మిగులదు. ఇంధనదాహమున బూడిదయైనను మిగులును గాని యిం దదియును

మివులదు. చిట్టచివరి విచారానంతరము సమాధి కలుగును. ఆ సమయమున నేను నీవు జగత్తు— వీని ఉనికియే దురవగాహమగును.

పద్మలోచనుడు మహాజ్ఞాని. అయినను నేను దేవిని ప్రార్థించుచున్నను నన్ను మిక్కిలి శ్రద్ధాభక్తులతో జూచుచుండువాడు. ఆతడు వర్ధమాన మహారాజాస్థానపండితుడై యుండెను. కలకత్తా కాతడేతెంచినపుడు కమార్‌హాటీయందలి యొకానొక తోటయందు బసచేయువాడు. ఆ పండితుని జూడవలయునని నాకు తలంపు కలిగెను. కావున ఆతనికి అభిమానము కలదో లేదో యని గ్రహించుటకై హృదయునిబంపితిని. ఆతనికి స్వాభిమాన మీవంతయు లేదని విని యాతని గలిసికొంటిని. ఏమి ఆశ్చర్యము! ఆతడు అంతటి జ్ఞాని, పండితుడు. అయినను నేను రామప్రసాద కీర్తనలను పాడగనే కన్నీరు గ్రుమ్మరించెను. ఆతనితోడి సల్లాపమునందువలె నిక నెవరితోడి సల్లాపము నందును నేను అంతటి ఆనందము ననుభవింపలేదు. 'భక్తుల సహవాసలాభమునందలి అభిలాషను విడిచిపెట్టుడు. లేనిచో నిందువలన పలురకములగు జనులవలన మీకు పతనము కలుగవచ్చు'నని ఆతడు నాకు దెలిపెను. వైష్ణవచరణుని గురువు ఉత్సవానందునితో నీతడు లేఖనపూర్వకముగా తర్కము గావించెను. నన్నుగూడ వినగోరెను. ఒక పెద్ద సభలో శివుడు గొప్పవాడా బ్రహ్మము గొప్పదా యన్న తర్కము ప్రారంభమాయెను. తుదకు బ్రాహ్మపండితుడు పద్మలోచనుని వైపు జూచెను. పద్మలోచనుడు అత్యంత సరళస్వభావముతో నిట్లు బదులు చెప్పెను. 'నా పూర్వ పురుషులు పదునాల్గు తరములవారును శివునీ జూడలేదు బ్రహ్మమును జూడలేదు.' కామినీ కాంచనత్యాగోపదేశమును విని 'వీనినన్నిటి నేల త్యజించమనెదరు. ఇది సొమ్ము, ఇది మన్ను అను భేదబుద్ధి అజ్ఞానమువలననే కలుగుచున్నది' అని యాతడు నాతో బలికెను. అందులకు 'నాయనా! నేనేమి చేయుదును. డబ్బు గిబ్బు నాకు నచ్చదు' అని పలికితిని.

ఒకానొకప్పుడొక పండితుడు మిక్కుటమగు గర్వము గలిగియుండెను. భగవద్రూపమునందు నమ్మిక యాతని కావంతయు లేకయుండెను. ఇట్లుండ నొకనాడాతని కాదివ్యశక్తి దర్శనమొసగెను. దానిని గని యతడు మైమఱచి క్రిందబడిపోయెను. ఇట్లెంతోకాల ముండి స్మృతికలిగినపుడు కాళీ యని పలుకుటకు మాఱు 'కా, కా,' యని వచించుచుండెను.

భక్తుడు — అయ్యా! విద్యాసాగరుని జూచితిరిగదా! వారినిగూర్చి మీ యభిప్రాయమేమి?

శ్రీరామ.—విద్యాసాగరునకు పాండిత్యమున్నది కాని అంతరదృష్టి నహి. ఆతని లోపల బంగారము గలదు. దాని జాడ కొంతే కనుగొనగలిగినచో బాహ్యకార్యకలాపమునంతయు నాతడు వదలివైచును. తనయందు భగవంతుడు గలడని గ్రహింపగలిగినచో నిక ధ్యానచింతానిమగ్నుడగును. నిష్కామకర్మము చేయగా చేయగా కొన్నాళ్లకు వారికి వైరాగ్యము కలుగును. మనస్సు భగవదభిముఖమై ఆయనయందే లిప్తమగును.

విద్యాసాగరుడు గావించుచున్న పని మంచిదే. దయకలిగియుండుట మిక్కిలి మంచిది. దయకును మాయకును ప్రభేద మెంతయో కలదు. దయ మిక్కిలి మంచిది. మాయ చెడ్డది. మాయ యనునది తల్లిదండ్రులపై, ఆలుబిడ్డలపై, సోదరీ సోదరులపై—తక్కుంగల బంధువులపై మాత్రమే కల ప్రేమ. దయ

యనునది సర్వభూతములందును సమానముగ ప్రకాశింపగల పెద్దార్యము.

'మ.' — దయకూడ నొక బంధనమా ?

శ్రీరామ — దయ సత్త్వగుణమువలన కలుగును. సత్త్వమువలన పాలనము, రజోగుణమువలన సృష్టి, తమోగుణమువలన సంహారము జరుగుచుండును. కాని బ్రహ్మము త్రిగుణాతీతము. ప్రకృతిని మించియున్నది. ఈ గుణత్రయము సహితము సత్యమును సమీపింపజాలదు. ఇవన్నియు చోరులవలె నెల్లచోట్లకు బోజాలవు. ఈ కథ వినుము —

ఒకానొక బాటసారి యొక యడవిని బోవుచుండెను. వానికి మువ్వురు చోరులు అడ్డుపడిరి. వారాతని సర్వస్వము నపహరించిరి. కాని వారిలో నొకడు 'వీనిని మాత్రము వదలుట లేల ?' యని యాతని నఱకుటకై కత్తిని దూసెను. అపుడు మఱియొకడు 'వీనిని నఱికి యేమి ప్రయోజనము? వలదు లే. ఈతని కాలు సేతులు కట్టివైచిపోవుదము', అనెను. అందులకు సమ్మతించి వారట్లే వాని కాలుసేతులు బంధించి వదలిపెట్టిపోయిరి. కొంతసేపటికి వారిలో మఱియొకడు తిరిగివచ్చి 'అయ్యో! నీకేమైనను దెబ్బ తగిలినదా! నీ బంధనముల విడిపించెద' నని పల్కి యాకట్లువిప్పి, 'నాతో రమ్ము! నిన్ను బాటలో వదలిపెట్టెద' నని యట్లే వానిని వెంటదీసికొనిపోయి దారిబట్టి 'అదిగో! నీ యిల్లు, పొమ్మ'ని పలికెను. అంతట బాటసారి దొంగను జూచి 'అయ్యా! మీరు చాల గొప్పవారు! నాకెంతయో యుపకారము చేసితిరి, నాతోడ మా యింటికి రం' డని యాహ్వానించెను. అందులకు దొంగ, 'కాదు! నేనచటికి రావలను పడదు. 'పోలీసువారు' నన్ను కనుగొందురు' అని పలికి తనదారిని బోయెను.

సంసారమే మహారణ్యము. ఈ యరణ్యమున సత్త్వ రజ స్తమము లను మూడు గుణములు జీవుని తత్త్వజ్ఞానము నపహరించుచు, తమోగుణము జీవుని నాశనముచేయ బ్రయత్నించును. రజోగుణము సంసారమున బంధించును. కాని సత్త్వగుణము రజస్తమములనుండి కాపాడును. సత్త్వగుణము నాశ్రయింపగలిగినచో కామక్రోధాదులనుండి రక్షింపబడగలము. సత్త్వగుణము సంసారబంధమునుండి జీవునకు ముక్తిని కలిగించును. కాని యీ సత్త్వగుణముగూడ దొంగయే. తత్వజ్ఞానము నొసగజాలదు. అయినను ఉన్నతమార్గమును జూపును. చూపుట మాత్రమే గాక 'ఇదిగో ఆ కనబడునదే నీ యిల్లు' అని హెచ్చరించును. అయినను బ్రహ్మజ్ఞానమునకును సత్త్వగుణమునకును అవాంతరము అత్యంతము. బ్రహ్మ మెట్టిదో యెవరును జెప్పజాలరు. ఎవనికి జ్ఞానము లభించునో ఆతడుగూడ నెవరికిని వివరింపజాలడు. సముద్రమును జేరిన పడవ తిరిగి రాదని లోకోక్తి యున్నదిగదా!

నలువురు స్నేహితులు విహరించుచు నొక ప్రహరీచే ఆవరింపబడిన యొకానొక స్థలమును జేరిరి. ప్రహరి మిక్కిలి యెత్తైయుండుటవలన లోపల నేమికలదో చూడ వలనుపడలేదు. ఎట్లో ఒకవిధముగా నొకడు పైకెక్కెను. ఎక్కి తొంగిచూడగనే ఆశ్చర్యపడుచు 'ఆహాహా!' అనుచు లోనికి దుమికెను. కాని ఏ కబురును తెలుపలేదు. అట్లే పైకెక్కిన వారందఱును ఆశ్చర్యచకితులై లోనికి ప్రవేశించిరి. అయిన బయటివారికి లోపలి విషయమును దెలుపువారెవరు ?

జడభరతుడు, దత్తాత్రేయుడు—మున్నగు వారెల్లరు బ్రహ్మసాక్షాత్కారము నందినప్పు

టికిని ఆ బ్రహ్మమునుగూర్చి యితరులకు చెప్ప గైరి. బ్రహ్మజ్ఞానము కలిగి సమాధ్యవస్థ ప్రాప్తించినచో 'నేను' అను జ్ఞానము నశించి పోవును. కావున రామప్రసాదు 'నీవలన కానిచో ఓ మనసా! రామప్రసాదును నీకు తోడుగా గైకొను' మని పలికెను. మనస్సు జ్ఞానమున లయింపవలయును. అంతిమాత్రమే కాదు. రామప్రసాదనుట 'నేను' అను అహంభావము. అదియునుగూడ నశింపవలయును. అప్పుడే తత్త్వ జ్ఞానోపలబ్ధి.

ఒకభక్తుడు —అయ్యా! అట్లయినచో శుక దేవునకు జ్ఞానము కలుగలేదా?

శ్రీరామ:—కొందఱు కొందఱు, శుకదేవుడు బ్రహ్మసముద్రమును దర్శనస్పర్శనముల మాత్రమే చేసెనుగాని అందు దిగి నిమగ్నుడు కాలేదని వచింతురు. అందువలననే తిరిగివచ్చి యిన్ని యుపదేశము లొసగగలిగెను. 'ఆతడు బ్రహ్మజ్ఞానము నందినపిదప లోకకల్యాణార్థము మఱలివచ్చె' నని మఱికొందరు వచింతురు. ఆయన పరీక్షిత్తునకు భాగవతము వినిపింపవలసి యుండెను. ఇతరులకుగూడ నెన్నియో సదుప దేశము లొసగవలసి యుండెను. కావుననే భగవాను డాతని యహంభావమును సంపూర్ణ ముగా గైకొనలేదు. జ్ఞానపూర్వకమయిన అహంభావమును మాత్రమే భగవాను డాయన యందు నిల్పియుండెను.

ఒకభక్తుడు:—బ్రహ్మజ్ఞానము కలిగిన వర్గము (parties) లేవియు నుండవా?

శ్రీరామ:—కేశవసేనుతో నొకనాడు బ్రహ్మజ్ఞానమును గూర్చి వాదోపవాదములు జరుగుచుండెను. కేశవసేనుడు నుఱియును విశ రింపుడు అని పలుకుచుండెను. కొంతసేపటికి నేను ఇంక చెప్పినచో నీ వర్గము (parties) లేవియు నిలువజాలవు అని పలికితిని. అంతట కేశవుడు సరే! అట్లయినచో ఇంతటితో నిలుపుడని పలికెను. (అందఱును నవ్విరి.) అయినను 'నేను, నాది'—ఇవియన్నియు యజ్ఞానమునకు సంబంధించినవి. నేను కర్తను. స్త్రీ పుత్ర విషయ సమూహములన్నియు నాకు సంబంధించినవి యను భావము అజ్ఞానములేనిదే కలుగజాలదు అని పలికితిని. అంతట కేశవుడు అయ్యా! 'నేను' అను భావమునే వదలిపెట్టిన ఇకనేమియు నుండదుగదా! అని పలికెను. అపుడు నేను 'కేశవ! నేను అను భావమును బొత్తిగా వదలిపెట్టుమని చెప్పుటలేదు. కాని నీ యపక్వాహంకారమునే వదలిపెట్ట నియోగించుచున్నాను. 'నేను కర్తను, నా స్త్రీ, నా పుత్రుడు, నేను గురువను—ఇవన్నియుగూడ అపక్వాహంకారములు. వీనిని త్యజించి నేను భగవానుని దాసుడను. ఆయన భక్తుడను. నే నకర్తను. ఆయనయే కర్త యను పక్వాహం కారముతో నుండవలయునని పలికితిని.

(సశేషము)



శ్రీ శారదేశ్వరీయై నమః

# ధర్మ పరిశీలన

## విశ్వమతసిద్ధికి మార్గము

శ్రీ వివేకానందస్వామి

(గతసంచిక తరువాయి)

క్రైస్తవుల విషయములో, వారు బోధించునది ఒకే ప్రధానభావము ''జాగరూకులై చూచుచు, ప్రార్థించుచుండుడు, ఏలననగా, స్వర్గరాజ్యము (మీకు) చాల చేరువుననే యున్నది.''—మానవులారా! మీ చిత్తములను పవిత్రమొనర్చుకొని, సిద్ధముగ నుండుడు! ఇదియే ఆ భావమున కర్థము. ఆ చిత్తవృత్తి నాశనమనునది యెన్నటికిని లేదు. తమ నిరాశాంధకార బంధురదినములలో, చివరకతి ఛాందస క్రైస్తవ దేశములలోకూడ క్రైస్తవులు వైద్యశాలలు మున్నగు ధర్మసంస్థలను నిర్మించి, పరులకు సేవచేయుటకు ప్రయత్నించుటమూలమున భగవదాగమనమున కెట్లు సంసిద్ధులగుచున్నారో జ్ఞప్తికి దెచ్చుకొనుడు. క్రైస్తవులా యాదర్శమున కనుగుణముగ వ్యవహరించుచుండునంతకాలము, వారి మతము జీవించును.

ఇప్పుడు, నా మనస్సున కొక యాదర్శము స్ఫురించుచున్నది. అది యొక స్వప్నమే కావచ్చును. అది యీ లోకములో నెన్నటికైన సిద్ధించునో సిద్ధింపదో నాకు తెలియదు. కాని, ఒక్కొకప్పుడు పాషాణకర్కశములైన వాస్తవ విషయములలో దగుల్కొని చచ్చుటకంటె కలలు గనుట ప్రశస్తతరము. కనుక, మన మొక కలగందము —

అందరి మనస్సు లొకేరీతి నుండవు. ఈ విషయము మీకు తెలిసినదే. మీరు యధార్థవాదులైన, కేవల లౌకికులు కావచ్చును. రూపములును, కర్మలును మీ కక్కరలేకపోవచ్చును, బుద్ధిగోచరములగు స్థూల, వాస్తవ విషయములు మీకు కావలయును. అవియే మీకు నచ్చును. ఇక పవిత్రవర్తన ప్రధానులగు (ప్యూరిటను) క్రైస్తవులును, మహమ్మదీయులు నున్నారు. తమ దైవారాధన స్థలములలో, వారొక చిత్తరువునుగాని, విగ్రహమునుగాని ఉండనీయరు. బాగు, బాగు! మఱియొకరు కళాసౌందర్యదృష్టిని కలిగియుందురు. వీరికి రమణీయ కళావైభవము అనగా వివిధ వర్ణములతో కూడిన చిత్రలేఖనము, పువ్వులు,

దీపములు మున్నగు కర్మకలాపము కావలయును. వీని సాయముతో భగవంతుని జూడవచ్చునని వీరి యాశయము. బుద్ధిద్వారమున భగవంతు నెట్లు మీ మనస్సు చూఱగొనునో, అట్లే ఆ రూపముల ద్వారమున వారి మనస్సు భగవానుని చూఱగొనును. వీరి తరువాత భక్తులున్నారు. భక్తుని హృదయ మెల్లప్పుడును భగవంతునికొఱకే పరితపించుచుండును. ఆతనికి భగవదారాధనతప్ప వేఱు భావమేదియు నుండదు భగవంతుని స్తోత్రములయందే యాతని మనస్సు లీనమై యుండును. వీరుకాక, తత్త్వవేత్తలు కూడ కలరు. వీరికివేవియు నక్కఱలేదు. వీరు వీనినన్నిటినిజూచి, ''వీరెంత అవివేకులు! భగవంతునిగురించి వీరి కెట్టి భావములున్నవి!'' అని వీరిని హేళనచేయుదురు.

ఈ తెగలలో నొక తెగవారు వేఱొక తెగవారిని జూచి పరిహాసము చేయవచ్చును. కాని, ఈ ప్రపంచములో వీరందరకును స్థానము కలదు. ఈ వివిధ మనస్తత్త్వములును, వేర్వేరు రకముల ఆస్తికులునుగూడ నుండవలసిన ఆవశ్యకత కలదు. ఎప్పటికైన నొక యాదర్శనీయ మతమే యుండునెడల, అది యీ వివిధమనోకోశములను భాగ్యవంతములుగ జేయజాలినదై యుండవలయును. దానిలో, తత్త్వశాస్త్రజ్ఞునకు తత్వసంపత్తి చేకూరవలయును, భగవదారాధకునకు భక్తుని హృదయము లభింపవలయును, కర్మిష్ఠికి మహాద్భుత సాంకేతిక విధానమండీయగల సామగ్రియంతయు దొరకవలయును. కవికి వలయునంత హృదయ సౌందర్య పుష్టి కలుగవలయును. ఇవియేకాక, యింక నెన్నెన్నో అది సమకూర్పజాలినదై యుండవలయును. అట్టి సువిశాలమత మేర్పఱచుటకై, మనము మతములు పుట్టిన పూర్వకాలమునకు బోయి, వానినన్నిటిని గ్రహింపవలయును.

కనుక, మన ధర్మసూత్రము స్వీకరణమై యుండవలెనే కాని, నిరాకరణమై యుండరాదు. సహనము మాత్రమే చాలదు. సహనమని మనము వ్యవహరించునది తెఱచుగ దైవదూషణయే కాని వేరేదియు కాదు. దానిలో నాకు నమ్మకములేదు. స్వీకరణమందే నాకు నమ్మకము. నేనేల సహింపవలయును? మిమ్ము దోషులుగ నెంచినను, నేను మిమ్ము బ్రతుకనిచ్చుచున్నాను. ఇదియే సహనమను మాటకు అర్థము. ఇతరులను నేనును, మీరును బ్రతుకనిచ్చుచున్నారమని తలంచుట దైవదూషణ కాదా? పూర్వముండిన మతములన్నిటిని స్వీకరించి, అవియన్నియు భగవంతు నేరూపమున నారాధించునో ఆ రూపమున నేనుకూడ ఆయా మతములన్నిటితో బాటు పరమాత్మ నారాధింతును, మహమ్మదీయునితో మసీదుకు వెళ్లెదను, క్రైస్తవుల గుడిలోనికి బోయి సిలువ యెదుట మోకరింతును, బౌద్ధదేవాలయములోనికేగి, బుద్ధునకును, ఆయన ధర్మమునకును శరణాగతుడనయ్యెదను. అరణ్యవాసినై, సర్వమానవ హృదయాంతర్గత పరంజ్యోతిస్సాక్షాత్కారమునకై ధ్యాననిమగ్నుడగు హైందవ సాధుపుంగవుని సన్నిధిని గూర్చుండి ధ్యానారూఢుడనయ్యెదను.

ఈ ధర్మాచరణలతోనే తృప్తిపడక, ఇక ముందు లభింపగల ఆధ్యాత్మిక సంపదకు నా హృదయకోశమును సంసిద్ధపఱచియుంచెదను. భగవద్గ్రంథము సమాప్తమయ్యెనా? కానిచో, అది నిరంతరము నేటికిని జరుగుచున్న భగవన్మహిమావిష్కరణమా? అది ప్రపంచమందలి

సర్వమత సత్యావిష్కరణాల సంపుటమగు మహోన్నత గ్రంథము. బైబిలును, వేదములును, ఖురానును, తదితర పవిత్ర మతగ్రంథములన్నియును ఆ గ్రంథములోని పుటలని చెప్పనగును. ఇవియేకాక, యింకను బహిర్గతము కావలయు పుటలనంతముగ దానిలో గలవు. వానియన్నిటికొఱకు నే నా యమూల్య గ్రంథమును తెరచియే యుంచెదను. వర్తమాన యుగమందున్నను, మన మనంత భవిష్యత్కాలమునకు సంసిద్ధులమై యుందుము. పూర్వకాల వైభవమును పూర్తిగ గ్రహించి, వర్తమానయుగ వికాస మనుభవించుచు, భావికాల జ్ఞాన తేజలబ్ధికి మన హృదయద్వారముల నెల్ల తెరచియుంచెదము. ప్రాచీన ప్రవక్తలకును, అర్వాచీన ప్రవక్తలకును, ఇకముందు రాబోవు మహానుభావులందరికిని నమోవాకములు!

(సశేషము)

---

# "శ్రీమన్నారాయణాష్టకమ్"

శ్రీ జిడ్డు కనకయ్య

శ్లో. అచ్యుతం కేశవం ఆదినారాయణం। కృష్ణదామోదరం గోపికావల్లభం।
శ్రీధరం మాధవం శంఖ చక్రాయుధం। రుక్మిణీనాయకం వాసుదేవం భజే॥ 1

శ్లో. అచ్యుతం కేశవం ఆదినారాయణం। పూతనా కేశినీ కంస సంహారకం।
ద్వారకానాయకం ద్రౌపదీరక్షకం। ధర్మసంస్థాపకం దేవదేవం భజే॥ 2

శ్లో. అచ్యుతం కేశవం ఆదినారాయణం। పుండరీకాననం పండరీనాయకం।
చంద్రభాగానదీతీరసంవాసినం। రుక్మిణీవల్లభం పాండురంగం భజే॥ 3

శ్లో. అచ్యుతం కేశవం ఆదినారాయణం। వేదచోరాంతకం వేదసంరక్షకం।
దేవసంరక్షకం దైత్యసమ్మోహనం। మోహినీరూపిణం మత్స్యకూర్మం భజే॥ 4

శ్లో. అచ్యుతం కేశవం ఆదినారాయణం। హేమనేత్రాంతకం క్రోడసద్రూపకం।
హేమనేత్రాగ్రజ ప్రాణసంహారకం। భక్తసంరక్షకం నారసింహం భజే॥ 5

శ్లో. అచ్యుతం కేశవం ఆదినారాయణం। దైత్యవైరోచనధ్వంసినం వామనం।
పాదపద్మావృతః పద్మజాండాదికం। స్వర్గరాజానుజం పద్మనాభం భజే। 6

శ్లో. అచ్యుతం కేశవం ఆదినారాయణం। ఖండితానేకపృథ్వీపతీన్ దుర్గుణాన్।
కార్తవీర్యార్జున ప్రాణసంహారకం। రేణుకానందనం జామదగ్న్యం భజే॥ 7

శ్లో. అచ్యుతం కేశవం ఆదినారాయణం। దండకావాసినం దైత్యవిధ్వంసినం।
వానరైస్సేవితం రావణ ధ్వంసినం। మౌని సంపూజితం రామచంద్రం భజే॥ 8

---

# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీ హరిశరణమ్

ఆల్మోరా,
25-11-'16.

ప్రియ......

18 వ తారీఖునాటి యుత్తరమును జూచి చాల సంతసించితిని. సెలవుదినములయందు కాశీవాసము సాధుసంగమము చేయుచు—మఱియు దానితోఁబాటు మీ కార్యకలాపములనుగూడ నిర్వర్తించుకొనుచున్నారని తెలిసికొని మహానందమున దేలుచున్నాడను. మీ రిచటికి వచ్చియుండినచో చాల బాగుండెడిది. కాని సర్వమును భగవదిచ్ఛయే. అయినను కాశీయందు శ్రీ లాటు మహారాజు, శ్రీ శివానందస్వామివారు—వీరిరువురి సాన్నిధ్యలాభమును బడసియుండుటనుగూడ విని యానందించుచున్నాడను. మీరు తెలిపిన 'మన్న' బ్రహ్మచారి ఇప్పుడు బ్రహ్మచారిగాడు. ఆయన విద్వత్సన్న్యాసము గైకొనియున్నాడు. ఆయనగారినిగూర్చి నే నెంతయో వినియున్నాడను. కాశీయందు ఆయన యెన్నియో సంవత్సరముల కాలము నివసించియుండిరి. ఆయన అస్వస్థులై యుండగా వారిని చూచుటకై 'డాక్టరు' తో కలిసి రెండు మూడు సార్లు వెళ్లియుంటిని. ఆయన సాధుసత్తముఁడే యని నాకు గోచరించెను. ఆయన కాయస్థవంశజుడని తక్కువ చూపు చూడరాదు. బ్రాహ్మణకులసంజాతులైనను బ్రహ్మనిష్ఠకలిగినవారికే పేరు, ప్రతిష్ఠయును. కానిచో 'ద్విజోఽపి శ్వపచాధమః' (విష్ణుభక్తివిహీనుడైనచో బ్రాహ్మణుడైనను చండాలునికన్నను అధముడే.) భగవానునియందు భక్తి కలిగినచో "స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాంగతిమ్." * ఈ పలుకు శాస్త్రసమ్మతమైనది, శ్రీరామకృష్ణులవారి జీవితమునందుగూడ ప్రస్ఫురించినది. బ్రాహ్మణకులసంభవము కలుగనివానికి బ్రహ్మ అనధిగమమని నేను తలంపను. బ్రాహ్మణేతరులకు భగవత్సాక్షాత్కారము కలుగజాలదని వచించువారు శాస్త్రముల చక్కగా నరసినవారు కారని నేను నొక్కి వక్కాణింతును. సాధుసంగమమే తప్ప మఱేదియు మిమ్మాకర్షింపజాలదయ్యెనని తెలిసి చాల సంతసించితిని. ఇది అహంకారపూర్వకమైనను శ్రేయోదాయకమే. ఏలయన, 'భవార్ణవతరణనౌక' యని దీనినే శ్రీ శంకరాచార్యులవారు ఉల్లేఖించియున్నారు. † త్రాసునందు ఒకవైపున సర్వతపోఫలములను మఱియొకవైపున క్షణముపాటి సాధుసంగమ ఫలమును నుంచి తూచినచో

---

* నికృష్టజన్ములగు అంత్యజులును కృష్యాదినిరతులగు వైశ్యులును అధ్యయనరహితులగు స్త్రీ శూద్రులును గూడ నన్ను సేవించి మోక్షమును తప్పక పొందుచున్నారు. —గీత-9-32.

† శ్లో. క్షణమిహ సజ్జనసంగతిరేకా
భవతి భవార్ణవతరణే నౌకా. —మోహముద్గరము.

సాధుసంగము ఫలమే గరీయమై యొప్పునని శాస్త్రములు వెల్లడించుచున్నవి. విషయ గ్రహణశక్తి మేదస్సున నేల తగ్గిపోగలదని మీరు ప్రశ్నించుచున్నారు. అది యెన్నటికిని తగ్గదు. కాని అట్లు తగ్గుటకు మారుగా విచార బుద్ధి ప్రబలమగుచుండును. అసత్తును గ్రహించుటకు ప్రవృత్తి కలుగదు. మీ వినయ మత్యంతము పొగడదగినది. అయినను ఇరువదియేండ్లకు మునుపున్నట్లే యిప్పుడును మీరున్నారు. ఆత్మసంబంధముగా ప్రశ్నించియుండినచో అది సరియే. ఏలయన ఆత్మ యొక విధమయినది. సాధువునకు లౌకికము, ఐశ్వరీకము—రెండును వ్యవహార యోగ్యములయినను, వానికి లౌకికము శుభము నీయదు. సాత్త్వికభావమే సాధువునందు పొందిక కలిగియుండును. మీకీ అసహన మెన్నడు నుండదు. అంతర్ముఖ దృష్టి కొద్దిగా హెచ్చినతోడనే అది తనంత తానే మిమ్ము వీడిపోవును. దీనిని మెల్ల మెల్లగా నభ్యసించుటయే ఆవశ్యకము. 'సంసారమున నుండి భగవద్ధ్యానము గావించుట కోటలో నుండి యుద్ధము చేయుటయే' యని శ్రీరామకృష్ణులవారు వచించియున్నారు. ఇందువలన నెన్నియో సౌకర్యములున్నవి. అన్యుల ప్రయాసములు—ప్రయత్నములు—బయలున నిలుచుకొని యుద్ధముచేయుటవంటివి. ఇట్టి పోరాట మందఱును చేయజాలరు. భగవంతునియందు మనసు నిల్పుటయే చిట్టచివరి సిద్ధాంతము. అందుల కెట్టి యుపాయము నవలంబించినను సరియే. అట్లు చేయగలిగినచో మన జీవితము సార్థకము. వృధాకాదు. వస్త్రాహారము లుండనే యున్నవి. అవి ఆశరీరధారణావధులు. ‡ కాని రామప్రసాదు 'ఆహారసేవనమును దేవికి ఆహుతిగా తలంపు' మని వచించియున్నాడు. ఆయన యుక్తి బాగుగనే యున్నది. మన మిట్లు కావించినచో మనకు త్వరలో భగవచ్చరణములందు భక్తి యుత్పన్నమగును. రామప్రసాదు ఈ విషయమును నొకానొక పాటయందు తెలిపియున్నాడు. దాని భావమిది :

ఓ మనస్సా! నీ కిష్టమున్నచో రేయింబవళ్లు గురుదత్త మహామంత్రమగు కాళీనామమును జపింపుము శయనమునందు ప్రణయజ్ఞానము, నిద్రయందు మాతృజ్ఞానమును, ఆహారమునందాహుతిజ్ఞానమును కల్పించుకొనుము నీవు వినుచున్న సర్వవాక్కులును దేవీమంత్రముగా దలంచుకొనుము కాళీమాత పంచాశతవర్ణమయియై ప్రతి వర్ణమునందును విరాజిల్లుచున్నది తల్లి సర్వఘటములందును విరాజిల్లుచున్నదని రామప్రసాదు ఆనందముతో ప్రకటించుచున్నాడు నీవు నగరమున దిరుగుచుండగా తల్లిని ప్రదక్షిణము చేయుచున్నావని తలంపుము

ఇంతకు మించిన బ్రహ్మజ్ఞాన మేమి కలదు? సర్వత్ర—సర్వకార్యములందును సర్వజీవములందును సర్వభావములందును బ్రహ్మదర్శనము! కేవలము యాజ్ఞవల్క్య స్మృతి మాత్రమే కాక అనేక ధర్మశాస్త్రములందును యోగశాస్త్రములందును, పురాణములందును తంత్రశాస్త్రములందును ఈ విషయమును దెలియనగును. మహానిర్వాణతంత్రము గృహస్థులకు

‡ శ్లో. లోకోఽపి తావదేవకిన్తు భోజనాది వ్యాపారస్త్వా శరీరధారణావధి.—(నారదభక్తిసూత్రము, 1-14). భక్తి సిద్ధి పొందకయున్నంతకాలము పురుషుడు శాస్త్రీయ శాసనముల నవలంబింపవలయును. కాని భోజనాది లౌకికవ్యాపారముల శరీరమున్నంతకాలము అవలంబింపవలయును.

బ్రహ్మజ్ఞానమునందు ప్రామాణిక గ్రంథము. దీని ననుసరించియే రామమోహనరాయ్ ఆది బ్రహ్మసమాజమును కల్పించెను. భగవానుడే గురువు. ఆయన దేనిని ఆవశ్యకమని తలంచునో దానికి అనుగుణమగు నుపాయము నాయన కల్పించును. నీ సందేహములను ఆయన కెఱిగించినచో అందులకు దగిన యేర్పాటు లాయన కలుగజేయును.

కృపావిహీనమైన సాధనలు ఫలరహితములని వచించిన మీ వాక్కు యథార్థము. కాని ఆంతరికముగా సాధనలు గావించినచో తప్పక భగవత్కృప కలుగగలదు. భగవంతుడే గురువు. ఆయన అంతర్యామి. నిష్కపటభావముతో ప్రార్థన చేసినచో యథాసమయమున సమస్త మనోరథములును ఆయన సంపూర్ణములు గావించును. ఎంతగా వ్యాకులము హెచ్చునో ఆయన కృపయు నంతగా మనల సమీపించును. మీకు వ్యాకులము మిక్కుటముగా కలుగవలయుననియే నా ప్రార్థన. నా శరీర పరిస్థితి యొకవిధముగా నున్నది. అప్పుడప్పుడు కొద్దిగా కష్టపడుచున్నాను. అంతయు భగవదిచ్ఛానుసారము జరుగుగాక! మీ యుత్తరము చూచి నేనేల చింతింతును. ఆనందమే కలిగినది. ఇటులే యుత్తరములు వ్రాయుచు నా కప్పుడప్పు డానందమును గల్గింతురుగాక!

ఇట్లు,

శుభాశీర్వచనములతో

శ్రీ తురీయానంద

---

ప్రతిజాతియందును ప్రత్యేకలక్షణములు గోచరించుచుండును. పారమార్థిక దృష్టి, లేదా, అంతరవలోకనపరత్వము భారతీయులందును, వైజ్ఞానిక దృష్టి, లేదా, బాహ్యావలోకనపరత్వము పాశ్చాత్యులందును విలక్షణమై కాన్పించును. పరమార్థమునంతయుఁ బాశ్చాత్యులు సాంఘికవికాస మూలమునఁ బడయఁగోరుదురు; ప్రాచ్యులో, సమస్త సాంఘికశక్తులను బరమార్థమూలమునఁ జేపట్టఁదలఁతురు. హిందూసంఘమును సంస్కరింపవలయునన్నచో, సనాతన ధర్మమును నిర్మూలించుటకంటె మఱియొకమార్గములేదని నవీనసంస్కర్తలకుఁ దోఁచుట కిదియే హేతువు. వారు ప్రయత్నించి విఫలులైనారు. ఎందువలన? వారిలో నెవ్వరును స్వీయమతధర్మములెట్టివో పరిశీలింపకుండుటవలన—సమస్తమతధర్మములకును దల్లియనఁదగు సనాతనధర్మతత్త్వమును గ్రహించుటకు వలయు శిక్షణమును బొందిన వ్యక్తి వీరిలో నొక్కఁడును లేకుండుటవలన. హిందూ సంఘమును బాగుపఱచుట కెట్టి ధర్మవినాశనమును జేయనక్కఱ లేదనియు, నేఁటి సాంఘికదుఃస్థితికి మూలము మతధర్మము లెంతమాత్రము గావనియు వానిని సంఘమున కనువర్తింపఁజేయకుండుటయే హేతువనియు నేను నొక్కి వక్కాణింతును. ఇందలి ప్రత్యుత్తరమును మన, వేదశాస్త్రములనుండి నిరూపింప సంసిద్ధుఁడనై యున్నాను. ఇదియే నా హితోపదేశము. దీనిని నిర్వహించుటకు యావజ్జీవము, యావచ్ఛక్తి తోడను బ్రయత్నింపవలసియున్నది. —శ్రీ వివేకానందస్వామి

శ్రీ కృష్ణాయనమః

# ప్రపంచమనుసరింపదగినది బౌద్ధమత మొక్కటియేనా?

## శ్రీ కృష్ణదాసు బుద్ధప్రియులు

[కొన్నాళ్ల క్రితము డాక్టరు B R అంబేద్కర్‌గారు మహాబోధిపత్రిక వైశాఖ సంచికయందు 'బుద్ధుడు—భవిష్యత్తున ఆతని ధర్మము' అను వ్యాసమును రచించి యుండిరి. అందుగల ప్రశ్నలు కొన్నింటికి శ్రీ కృష్ణదాసు బుద్ధప్రియులు ఒసగిన ప్రత్యుత్తరము లిచ్చుట ప్రచురింప బడుచున్నవి. సంపాదకులు.]

(గతసంచిక తరువాయి)

"తానే మతసహనభావముతో పుట్టి, పెరిగెనో ఆ హిందూమత సహనభావమున కనుగుణముగ, అతడు (బుద్ధుడు) పూర్వాచార పరాయణులపై తిట్లు దుమ్మెత్తిపోయలేదు, వారుకూడ నాతని నిందించి, నిలువబెట్టి దోష విచారణ జరిపించి, హింసల పాల్పడచేయ లేదు" అని బుద్ధుని గురించి వ్రాయుచు సర్ ఫ్రాన్సిస్ యంగ్ హస్బెండు మహాశయుడు, "బుద్ధుడు పేరెన్నికగన్న హిందూమత సంస్కర్తలలో నొకడు మాత్రమై యుండి, తన హితోపదేశమును బహు సామరస్య భావముతో అందిచ్చెనే కాని, తనతో నేకీభవింపని వారి నొకవంక కసిదీర దూషించుచు వెలువరింపలేదు" అని తన అభిప్రాయమును దెలిపినాడు.

"బుద్ధుని సుప్రసిద్ధ శిష్యకోటిలో చేరిన మహాకశ్యపుడు, శారిపుత్రుడు, మౌద్గలాయనుడు, కాత్యాయనుడు మున్నగువారు కొందరు విద్వద్వరేణ్యులైన బ్రాహ్మణులు. ఆయన యేకైకలక్ష్యము ధర్మశీలురను, వివేకశీలురు నగు యువకులకు అత్యుత్తమ సాధుజీవితమును ఈ జన్మలోనే తుదకొక నెలవరకైనను దెలిసికొని, అనుభవైకవేద్యము గావించుకొనగల్గు నట్లు బోధించుటే కాని, నిగ్రోధనునకు తాను తెలిపిన విధమున శిష్యులను సేకరించు వాంఛగాని, ఇతరులను వారి వారి ధర్మవ్రతములనుండి పతితులజేయు వాంఛగాని, వారి వారి జీవిత పద్ధతులను విడనాడ బ్రేరేపించు వాంఛగాని, సన్మార్గములనుండి తప్పించి మిమ్ముల నక్రమ మార్గములందు నెలకొల్పవలయునను వాంఛ గాని కాదు."

ఆయన యేకైకలక్ష్యము దౌష్ట్యము నణచి, సౌశీల్యము వర్థిలునట్లు చేయుట. మనము నేడర్థముచేసికొనునట్లు, బుద్ధుడు స్త్రీ,

పురుషుల సమానత్వమును బోధింపలేదు. తన ధార్మికసంఘములో స్త్రీలకు ప్రవేశమిచ్చుటకు ఆయన బహువిముఖుడై యుండెడివాడు. తన మేనత్త మహాప్రజాపతియును, తన ప్రియశిష్యు డానందుడును చాలసార్లు ప్రతిమాలిన మీదటనే, ఖచ్చితమైన నియమములతో మాత్రమే స్త్రీలకుగూడ దీక్షనిచ్చుటకు ఆయన ఆనందున కనుజ్ఞ నిచ్చెను. స్త్రీల కాయన ప్రత్యేకముగ విధించిన యెనిమిది నియమములలో నొకటి యీ సమానత్వ సిద్ధాంతమును ఛేదించునదై యున్నది. ఈ విషయమున బుద్ధు డిట్లు చెప్పెను

''నూరేండ్లు గతానుభిక్షుణియై కాషాయ వస్త్రములను ధరించుచుండిన సోదరియైనను, క్షణము క్రితము మాత్రమే భిక్షుకుడైన పురుషుని జూచినతోడనే నిలువబడి, ఆతనికి నమస్కరించి పాదాక్రాంతయై, భిక్షుకునకు జేయవలసియుండు గౌరవధర్మములనెల్ల సలుపవలయును.'' (వినయ 2-10)

కడసారిగా ఆయన ఆనందునితో నిట్లు బాహాటముగ చెప్పెను ''గతాగతప్రోక్తమైన ప్రామాణిక శిక్షణ స్మృతి ననుసరించి స్త్రీలు గృహస్థాశ్రమమును త్యజించి, సన్న్యాసినీ జీవిత మవలంబించుటకు అనుమతి పొందుటకు వీలు లేకుండినచో, ధార్మికజీవితము చిరస్థాయిగ కొనసాగును. ప్రామాణిక సద్వర్తన, మానందా!, వేయేండ్ల దనుక నిలువగలదు. కాని, యిప్పుడు స్త్రీలకీ యనుమతి యీయబడినందున. . . ప్రామాణిక సద్వర్తన మైదువందలయేండ్ల వరకుమాత్రమే చెక్కుచెదరకుండ నిలుచును.''

బుద్ధుని నిర్వాణానంతరమున ఆనందుడు స్త్రీలకు సన్న్యాసమిచ్చినందున, భిక్షుకసంఘసంస్థ క్షీణించెనను నేర మా సంస్థ యతనిపై మోపెను. నిజమైన పారమార్థికశీలములేని యొకతరగతి జనులు కేవలము తమ జన్మను బట్టి తా మితరులకంటె ఆధ్యాత్మికముగ శ్రేష్ఠులమని చెప్పుకొనుటలో గల అసంగతమును బుద్ధుడు లోకమునకు సువ్యక్తము చేసెనే కాని, సాంప్రదాయానుగుణ్యములైన సాంఘిక భేదములను నిర్మూలింపలేదు.

అం.—బౌద్ధమత ప్రఘాతములచే నేలమట్టముగ కూలిపోవుటకు సిద్ధముగ నుండిన హానికరమును, సత్యేతరము నగు చాతుర్వర్ణ్య సిద్ధాంతమునకు శాశ్వతజీవితమును ప్రసాదించుటకే ముఖ్యముగా భగవద్గీత వ్రాయబడెనా?

బు.—గీతయందలి యేడువందల శ్లోకములలో రమారమి పండ్రెండు మాత్రమే చాతుర్వర్ణ్యమునకు సంబంధించియున్నవి. అందలి అధ్యాయాంత గద్యలన్నిటిలో ఆ గ్రంథ విషయము బ్రహ్మవిద్యయని, యోగశాస్త్రమని తెలుపబడియున్నది. అనగా, భగవద్గీత పరమ సత్యస్వరూపుడగు భగవంతుని నిరూపించి, ఆ పరమాత్మతో జీవాత్మ యైక్యతను సాధించు మార్గమును బోధించు శాస్త్రము. గీతలో గనుపడు చాతుర్వర్ణ్య సంస్థ కేవల సాంఘిక వర్గీకరణము. అంతేకాని, జన్మనుబట్టి సంక్రమించిన ప్రత్యేకాధికారముల ఆధారముపై నిర్మింపబడిన విభజనసంస్థ కాదు. ఇట్టి ప్రతిపాదన భగవద్గీత బోధించు తాత్త్విక పరమావధియగు సమదర్శనమునకు విరుద్ధము.

(సశేషము)



# శ్రీ వాసుదేవ మననము

శ్రీ మాచిరాజు శ్రీరామకృష్ణ

మ. "తత భోగాను విహార చిత్తులకు బొం
డందూరమై భక్త సం
యుత యోగీంద్రులకెల్ల దానగుచు వే
ద్యుండై, చిదానందుడై,
క్షితిపుత్రాహృదయ ప్రమోదకరుడై
చెల్వొందు శ్రీరామునిన్
సతతంబున్ శరణంబు వేడెదను మో
క్ష శ్రీ సమాకాంక్షినై.

మోక్షమనగా — "పరం సద్బ్రహ్మైవా సదిద మఖిలం జీవనిలయం। జగత్స్వీయాఽవిద్యావిలసిత మిదంచానుభవతి। వినష్టాయాం యస్యాం స్వపర విషయాఽద్వైత కలయా। స్వకీయా మాప్నోతి ప్రకృతి మితిచాద్వైత పదవీ॥ శాంకరః టీక—బ్రహ్మైవ=నిర్గుణ పరబ్రహ్మమే, పరంసత్ = త్రికాలాబాధితమైన సర్వోత్కృష్ట సద్వస్తువు. జీవనిలయం=ప్రాణులకు నివాసస్థానమైన ఇదం అఖిలం = ఆ పరిదృశ్యమాన ప్రపంచక మంతయు, అసత్ = నశించునట్టి అసత్ పదార్థము. (పరబ్రహ్మము) స్వీయా=తన కధీనమైన, అవిద్యా=మాయ యొక్క, విలసితం=క్రియా విశేషమైన ఆవరణ విక్షేపశక్తుల మూలముగా కల్పింపబడిన, ఇదం-జగత్ చ-అనుభవతి = ఈ సకల జగత్తును జీవరూపమున అహంమమే త్యభిమానముతో ననుభవించుచుండును. స్వపర విషయాఽద్వైత కలయా=తానును పరబ్రహ్మమును అభిన్నమే యని దృఢనిశ్చయాద్వైత, జ్ఞానముచేతను, యస్యాం వినష్టాయాం=ఆ యవిద్య నశించుట మూలముగ, తాను, స్వకీయాం ప్రకృతిం=తన యథార్థ స్వరూపమైన సచ్చిదానంద స్వరూపమును, ఆప్నోతి=పొందును. ఇతి-చ=ఇదియే, అద్వైత పదవీ=అద్వైత సిద్ధాంతమైన మోక్ష స్వరూపము.

తాత్పర్యము — పరబ్రహ్మము సత్యమైన పరతత్వమేకాని తన్నాశ్రయించిన అవిద్యా ప్రభావము చేత గల్పితమై జీవనిలయమైన అసత్యమగు నీ జగత్తునంతను 'అహం-మమ' యను నభిమానముతో జీవుడను సంజ్ఞతో ననుభవించుచుండును.

తాను తన నిజస్వరూపమైన శుద్ధచైతన్యమును, తాను పొందిన జీవరూపమును, వాస్తవముగ నొకే యఖండైకరస శుద్ధచైతన్యమని యనుభవరూపమున దెలిసి చూచుటవలన నా యవిద్య నశింపగా, తాను తన యథార్థ రూపమైన అద్వితీయాఖండైకరస శుద్ధచైతన్య రూపమునే పొందును. ఇదియే అద్వైత సమ్మతమైన మోక్ష రూప స్వారాజ్యము.

'స్వారాజ్య' మనగా 'స్వే నైవ రాజత యితి స్వారాట్' = స్వయంప్రకాశమానమగుటంజేసి పరబ్రహ్మము 'స్వరాట్' అనబడును. 'స్వరాజో భావః స్వారాజ్యం' = స్వరాట్

యొక్క భావము స్వారాజ్యము. అనగా స్వయంప్రకాశమానైక పరమాత్మ స్వరూప మున బొందియుండుట రూపమైన మోక్షము స్వారాజ్యము.

ఇటువంటి స్వారాజ్యమును బొందుటకు వేదమునందు రెండు మార్గములు చెప్పబడినవి. "ద్వా విమావథపన్థానౌ యత్ర వేదాః ప్రతిష్ఠితాః। ప్రవృత్తి లక్షణో ధర్మో నివృత్తిశ్చ భావితః॥" జనన మరణములనుండి విడువబడుటకు రెండే మార్గములు చెప్పబడియున్నవి. ఈ మార్గములు వేదప్రోక్తములు. మొదటిదగు ముఖ్యసాధనము నివృత్తిమార్గమగు జ్ఞాననిష్ఠ. రెండవది ప్రవృత్తిమార్గమగు నిష్కామ కర్మానుష్ఠానము. ఈ రెండిటిని వినా వేరే మార్గము లేనేలేదని శ్రీ వేదవ్యాస వచనము. (భారతం. శాం. 240-6) ఇందు మొదటిదగు 'జ్ఞాననిష్ఠ' యనగా—"అభినివేశ పూర్వక ప్రత్యగాత్మ విషయక ప్రత్యయ సంతతి కరణ మేవ జ్ఞాన నిష్ఠా। సైవ నిర్గుణోపాసనా॥" పట్టుదలతో ఆత్మజ్ఞానావృత్తిని జేయుట జ్ఞాననిష్ఠ. ఇదియే నిర్గుణోపాసన. అని శాంకరగీతా భాష్యము.

రెండవది సహాయ సాధనమైన ప్రవృత్తి మార్గమగు నిష్కామకర్మానుష్ఠానము. ఈ ద్వివిధ మార్గములు వినా మోక్షప్రాప్తికి మార్గాంతరము లేనేలేదని శ్రీ వేదవ్యాస వచనము.

అట్లయిన "అదృశ్యే భావనా నాస్తి దృశ్యమే తద్వినశ్యతి। అవర్ణ మస్వరం బ్రహ్మ కథం ధ్యాయంతి యోగినః॥" (ఉత్తర. గీత. 1-37) ఇంద్రియగోచరముగాని వస్తువునందు ధ్యానంబు కలుగదు. సకలదృశ్యప్రపంచకము నశ్వరమే కదా? జ్ఞానైకగమ్యమైన సచ్చిదానంద పరబ్రహ్మంబు నామరూపరహితమగుటం జేసి ధ్యానగమ్యంబు గాదుగదా! ఇంద్రియాగోచరమగునట్టి పరబ్రహ్మంబును యోగులు (జ్ఞానులు) ఎవ్విధంబున ధ్యానించుచున్నారు?

(సశేషము)



మన పేదహిందువులే పాశ్చాత్య దేశీయులందఱికంటెను గోటిరెట్లు విశేష పారమార్థికశీలురు. మతధర్మములపట్ల వారు (పాశ్చాత్యులు) మోసమును లేదా, మూర్ఖాభిమానము నవలంబింతురు. సమాలోచనపరులు మూఢ విశ్వాసయుతములగు తమ మతములనిన విసువుచెంది నూతనవిశ్వాసార్థము భారతదేశముదెసఁ జూచుచున్నారు. నవీనభౌతికశాస్త్రములదాడి నెదిర్చి నిలువఁగలిగిన మన పవిత్రవేదములందలి ప్రతిదివ్యాశయము నెంతటి తమకముతో— మక్కువతోఁ—, పాశ్చాత్యులు స్వీకరించుచున్నారో వచ్చి చూచినచో, మీకుఁ దెలియఁగలదు.

—శ్రీ వివేకానందస్వామి

# భిక్షాం దేహి

శ్రీ కె. అన్నమరాజశర్మ

తే. గీ. గగన మగలించు తపనుఁ డ నమ్మరీఁడు, సార్థకాఖ్యతఁ జెలఁగ మధ్యాహ్నవేళ,
భిక్షుకుం డొక్కఁ డాఁకటఁ బెండువారి, "దేహి" యని వాడ వాడలఁ దిరుగుచుండె.

ఉ. బారులు దీరినట్టి యొక బ్రాహ్మణవీథిని జేరి, విశ్రుత
ద్వారముచెంత భిక్షుకుఁడు భైక్షుకపాత్రను జాపినంత, కో
పారుణితాక్షుఁడై యొక ధరామరసూనుఁడు యాచకా! భుజా
సారముగల్గి, యింద్రియపు సౌష్ఠవముండియు ముష్టియెత్తెదే?

చ. బలమును యౌవనమ్ము నినుఁ బంచికొనెన్ సమభావమూని, యె
ద్దులఁ గొని, మేడినూని, మడి దున్నుచు ఘర్మకణమ్ములూడ్చి, మైఁ
జెలువము స్వేచ్ఛయుం దొణఁక జీవముఁ దాల్చుట లగ్గు, కుంటి గ్రు
డ్డుల పగిదిం జరింపఁగఁ గడుంగడు హేయము సిగ్గుచేటుగన్.

చ. అని పరుషోక్తులం బలుక, నార్ద్రమనస్కుఁడు భిక్షుకుండు లో
చనముల బ్రేమవీచికలు జాల్గొనగేస్తు! బికారిజీవనం
బనయము దూష్యమేయగు, యధార్థము నే నొక హాలికుండనే!
మనుజ హృదంతరాళముల మానక సేద్యము చేయుచుండుదున్.

తే. గీ. జనన మరణాది వికృత సంసార జగతి, కర్మబీజమ్ములను నాటు కర్షకుండ,
అవ్యయానందముం బ్రజ కందఁజేయ, ఏకలక్ష్యపు వ్యవసాయమే నొనర్తు.

తే. గీ. పాపతృణ సంకులంబయి పాడువడిన, చిత్తకేదారముల జ్ఞాన సీరమూని
పెల్లగించుట జీవన వృత్తి నాకు, హాలికుఁడనో - బికారినో, యరయు మింక.

తే. గీ. ఈ యనాసక్తి హృద్ వ్యవసాయమందు, శమదమాదులె నూమకసాధనములు,
అస్ఖలితపూతవిశ్వాస మవధిగాఁగ, ఇంద్రియపు టెడ్ల నదలింతు నేకధాటి!

తే. గీ. అని వచించిన సన్యాసి నార్ద్రదృష్టి, బ్రాహ్మణుఁడు చూచి భక్తి ప్రపత్తి బలికె—
"భిక్షుకా! విశ్వవిస్తృత ప్రేమభరిత, గౌతమాకృతిగాఁగ సాక్షాత్కరించె!"



# వినయపత్రిక

మూలం :
శ్రీ తులసీదాస గోస్వామి

అనువాదం :
క్రాంతికర్

(౧౯౮౯ సెప్టెంబరు సంచిక తరువాయి)

## ౧౧౧

ఓ శ్రీరామచంద్రా!

నీవు ప్రేమ పద్ధతిని చక్కగ నెఱుగుదువు. నీవు గొప్పవారి గొప్పతనమును, దీనుల దీనత్వమును గూడ హరింతువు—వేదము లిట్లే నిన్ను గొనియాడుచున్నవి. నీవు జటాయువునకు శ్రాద్ధ మొనరించితివి. శబరి యెంగిలిజేసిన పండ్ల నారగించితివి—ఈ విషయములను భక్తులు దమసమాజమున మాటిమాటికిని జెప్పుకొనుచున్నారు. నీ వెవని నాదరింతువో యాతనిని లోకము, వేదములుగూడ నాదరించుచున్నవి. అతడు యోగులకంటె, జ్ఞానులకంటె నధికుడుగ నెన్నబడుచున్నాడు.

ఓ ప్రభూ! ఓదయామయా!

నీదయవలన నీ భయంకరమగు కలికాలమందును నీ మహిమను గుర్తెఱిగి నాహృదయమున దానిని ధరించియున్నాను. ఇపుడు నేనితరులకడకేగిన లోకము నిన్నే పరిహసించును.

ఓ దీన బంధూ!

నేను నీ గుమ్మమువిడిచి యెక్కడకు నేగగోరను.

## ౧౧౨

రామనామమును జపించుటవలన నే మానసికమగు దుఃఖము తొలగును. కలికాలమున మిగిలిన యుపాయములన్నియు, చిత్రరచితమగు సూర్యబింబము జీకటుల బారద్రోలజాలనటుల వ్యర్థములు. కర్మకాండ యనంతముగ విస్తరించి యున్నది, కాని పాపముచే, దుఃఖముచే నావరింపబడియున్నది. అది పూవు లెక్కువగ బూచియు నెందుకు కొఱగాని కాయలనుగాయు వృక్షమువలె వ్యర్థము. కపటము, లోభము, పేరాస భక్తిని నాశన మొనర్చినవి. మోక్ష సాధన యుదరపూర్తికి సాధనమయినది. యోగము, సమాధి విఘ్నబాధితములు. వైరాగ్యజ్ఞానములు వాక్చాతురీ మాత్రములు, కృత్రిమములునైనవి. ఆచరణ యెచటను గానరాదు. కపటముతో నిండిన కోట్లకొలది మార్గము లేర్పడినవి, చెప్పుట, ఆచరించుట పొందికలేనివైనవి. ప్రతివారు దమ యాచరణనే గొనియాడుకొందురు. గంగాతీరమున, పుణ్యభూమియగు కాశిలో శివుడు చనిపోవుచున్న జీవునకేమి యుపదేశించునో యెఱుగుదువా? ఆయన రామనామ మహిమను వర్ణించును. స్వయముగ రామనామమును జపించును. ప్రపంచ

మీా విషయము నెఱుగును. వేదము లిందుకు సాక్షులు. రామనామమందే బుద్ధిని లగ్నమొనర్చుట, రామనామమునే ప్రేమించుట, రామనామమునే శరణు జొచ్చుట—ఇవియే యాపదలను దూర మొనర్చును. తులసీ దాసు చెప్పున దేమన—రామనామమునందు మాత్రమే విశ్వాసముగలిగి యుండవలెను. అప్పుడే శ్రీరామచంద్రు డెప్పుడో యొకప్పు డనుగ్రహించును.

## ౧౦౩

శ్రీహరీ!

ఎట్టి యాచరణ నీకామోదకరమో దానిని నేను నిశ్శంకముగ విడచివైచితిని. అయినను నీదాసుడనని చెప్పుకొనుట కావంతయు సిగ్గిలుటలేదు. మునులు అన్నివిధములైన సాంసారిక విషయములందును నాసక్తిని విడిచి యెవనిని భజింతురో, ఎవనిని బొందగోరి జపము-తపము-యోగసాధనల నాచరింతురో వానిని నావంటి మూర్ఖుడు, దుష్టుడు, నీచుడు ఏ యత్నముచే బొందగలడు? భగవంతుడు విమలుడు. కాని నాహృదయము పాపభరితము. కాకులు, గ్రద్దలు, కొంగలు, పందులు విహరించు చెఱువున హంస యెట్లు ప్రవేశించునని నేను సంశయించుచున్నాను. ఏ పరమాత్ముని శరణు జొచ్చి జ్ఞానులు కష్టప్రదములగు త్రివిధ తాపములను విడనాడుదురో వాని దరిజేరినను—స్వర్గమునకేగినను సవతిపోరు తప్పనటుల—అహంకారము, మోహము, లోభము నన్ను విడచుటలేదు. సంసారసముద్రము నుత్తరింప భక్తులు నావవంటివారని యితరులకు బోధించియు నేను మాత్రము వారినే విరోధించుచున్నాను. నీవు నాకు మేలుసేయవలెనని కోరుచున్నాను. భక్తజన విరోధినయ్యు హఠపూర్వకముగ నీతోడి సంబంధమును కలిగియుండుట వేరెచటను నాకు స్థానములేకుండుట వల్లనే. కనుక నో యుదారులలో శ్రేష్ఠుడా! నన్ను - తులసీదాసును - నీ యాశ్రయమున నుంచుకొనుము. ఇతడు నీ గుణముల పాడుచున్నాడు.

## ౧౦౪

ఓ హరీ!

నే నెట్లు నిన్ను ప్రార్థింతును? నా యాచరణను దలచి, తెలిసికొని హతాశుడనై భయమందుచున్నాను. ఏ సాధనము నవలంబించుట వలన నీవు భక్తునిగా దలచి యభయమొసంగుదువో దానిని నే విడనాడితిని. ఏమార్గము ననుసరించుటచే ఆనాటికానాడు విపజ్జాలమున దగుల్కొనవలసి యుండునో దాని ననుసరించుచున్నాను. మనోవాక్కర్మలచే పరుల కుపకారము జేయు నరుడు సంసారసాగరమును దరించునని యెఱింగియుండియు నేను దానికి విరుద్ధముగ నడచుచున్నాను. ఇతరులు సుఖించుట జూచి కారణములేకయే ఈర్ష్యాగ్నిచే దహించుకొని పోవుచున్నాను. దృఢతరమగు సజ్జన సాంగత్యము కర్తవ్యమని వేదములు, పురాణములు ఘోషించుచున్నను అభిమానము, అజ్ఞానము, ఈర్ష్యలకు వశుడనై నేను సజ్జనులను నిరాదరించుచున్నాను. సంసారసాగరమున నీదులాడుచు, జననమరణ చక్రమున దగుల్కొని యుండుటకు హేతువులనదగు కార్యములే నా కభిమానపాత్రములై యున్నవి.

స్వామీ!

నేనిక నీ సాంసారిక దుఃఖములనుండి విముక్తుడనగుట యెట్లో నీవే తెల్పుము. కరుణా

స్వభావముచే నీవు నాపై ననుగ్రహించినపుడె నేనుద్ధరింప బడుదును.

తులసీదాసు చెప్పునదేమన—వేరు ఆధారమేదియు గానరానపుడు నేనేల హైరాన పడవలయును? ఏనాటికైనను నీవే నాపై కరుణించెదవు.

## ౧౦౮

నాధా!

వేరు ఉపాయమును గానక నేను త్వరలోనే నీదరి జేరితిని. జ్ఞానము - భక్తి - వైరాగ్యము—వీనిని నే నెరుగను. లోభ, మోహ, అహంకార, కామ, క్రోధ, మదము లనెడు అరిషట్కము రాత్రింబవళ్లు నన్ను వెంటాడు చున్నవి. వాని సాంగత్య ప్రభావముచే నా మనస్సు చెడుమార్గమున నడచుచున్నది. నీవు మరల్చినచో మరలను. ఇంద్రియసుఖములు శోకకారణములని వేదములు, భక్తులు మరిమరి హెచ్చరించుచున్నారు. దీని నెఱిగియుండియు నేను వానియందే యాసక్తుడనై యున్నాను.

శ్రీహరీ! ఇది కేవలము నీ ప్రేరణయే. నీవు విషము నమృతముగ జేయగలవు. నిప్పును మంచువలె చల్లనిదానినిగా జేయగలవు. నావలేకుండగనే సంసారసాగరమును దరింపజేయగలవు. నీవంటి దయగల హితుడగు ప్రభువు నాకెచటను లభింపడు.

శ్రీరామచంద్రా! హృదయమున నీ విషయమెఱిగియుండియే యన్నిటిని వీడి నిన్నే నమ్ముకొని యున్నాను. నా యీ విపజ్జాలము నీవు త్రెంచిననే త్రెగును

(సశేషము)



ఉత్కృష్టవైదికభావముల నేదియో యొకరూపమున వారందఱును త్వరితగతి నవలంబించుచున్నారు. అర్ధశతాబ్దములోపుననే ప్రపంచమునందలి విద్యాధికులు మన పావనవేదములలోఁ దెలుపఁబడినరీతిని సృష్టియు నాత్మయు శాశ్వతములనియు మహోత్తమము, పరిపూర్ణమునగు మన తత్త్వమే భగవంతుఁడనియు నమ్మితీరెదరు. వారి మతాచార్యులలోఁ బ్రాజ్ఞులగువారిపుడే బైబిలు నీవిధముగా వ్యాఖ్యానించుచున్నారు. వేయేల, పాశ్చాత్యులకు విశేషముగాఁ బారమార్థికనాగరికతయు మనకు విశేషముగా నైహికనాగరికతయు నావశ్యకమై యున్నవని నా యభిప్రాయము.

—శ్రీ వివేకానందస్వామి

# తత్త్వశాస్త్రము

## (అద్వైతము)

శ్రీ ఇచ్ఛాపురపు వైద్యనాధం, బి. ఏ.

సకల ప్రాణులును సర్వకాలములందును వాంఛించునది సుఖము. అట్టి సుఖమును సంపాదించుటకొఱకై యితరప్రాణులవలె మానవుఁడును విశేషప్రయత్నముల నొనర్చుచున్నాఁడు. జాగ్రదవస్థలో సుఖసాధనములగు ధనాదులను సంపాదించుచు, సుఖము ననుభవించుటకై యత్నించుచు దుఃఖమునే యనుభవించుచున్నాఁడు. ఒకవేళ తాత్కాలిక సుఖము లనుభవించి యానందించినను అట్టి సుఖములు క్షణికములగుచున్నవి. ఇట్లు ప్రాపంచిక సుఖములు (విషయసుఖములు) కష్టముచే సంపాదింపఁబడుచు స్వల్పకాలము మాత్రమేయుండి పరిణామదశలో విరసములై దుఃఖకారణములగుచున్నవి. మానవుఁ డీ విషయము నెఱింగియు నజ్ఞానావస్థలో నుండుటవలన మరల మరల నట్టి సుఖమునే విశేషకష్టముల కోర్చియైనను సంపాదింపఁదలఁచును గాని యట్టి విషయసుఖములయందు విరక్తినొందఁడు. సాధారణముగా మానవుఁడిట్లు తన యమూల్యజీవితమును తాత్కాలిక తుచ్ఛసుఖములకై యుపయోగించుచు నిత్యమగు సుఖమెట్లు కలుగునో విచారణచేయుటకైనను అసమర్థుఁడై యున్నాఁడు.

కొందఱు విషయసుఖము లనిత్యములని పండితులవలన తెలిసికొనినను ఈ ప్రపంచమునందలి సుఖములకంటె స్వర్గాద్యుత్తమలోకములయందలి సుఖములు శాశ్వతములు (వినాశములేనివి) అని కాని చిరకాలముండునవియని కానితలంచి యిట్టిసుఖములను సంపాదించు వాంఛతో ఈలోకమునం దుత్తమకర్మలను దేవతోపాసనములను ఆచరించుచుందురు. అట్టి కర్మోపాసనలవలనఁగలుగు సుకృతాతిశయమున నట్టివా రుత్తమలోకములను బొంది సుఖింతురు. కాని యట్టి పుణ్యలోకములుకూడ ననిత్యములే. మనకు ప్రత్యక్షములుకాని పుణ్యలోకములనుగూర్చి ఏ వేదములు సవిస్తరముగ వర్ణించినవో ఆవేదములే అట్టి పుణ్యలోకములు కూడ అనిత్యములేయనియు, కావున నిత్యసుఖమును (మోక్షమును) పొందుటకే ప్రయత్నింపవలెననియు నుపదేశించుచున్నవి. ''తద్యథేహ కర్మ చితోలోకః క్షీయతే ఏవమేవా ముత్ర పుణ్యచితోలోకః.'' అను నిట్టి శ్రుతివాక్యములును ''క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి'' అను నిట్టి స్మృతి వాక్యములును నీ విషయమున ప్రమాణములై యున్నవి.

కావునఁ గొందఱు జ్ఞాను లిహాపరసుఖము

లను రెండిటినిగూడ విడిచి జన్మజరామరణాది దోషరహితమగు మోక్షము నొందుటకు యత్నించి కృతకృత్యులగుచున్నారు. కాని యట్టివారు సంఖ్యలో మిక్కిలి తక్కువగా నుందురు. కారణమేమనఁగా నట్టి నిరుపమాన సుఖము సంపాదించుట దుస్సాధ్యమగుటయే.

అట్టి మోక్షమును సంపాదించుటకు వైరాగ్యము, నిత్యానిత్యవస్తువివేకము, శమాది సుగుణములు, మోక్షేచ్ఛ మున్నగు ననేక సాధనములు కావలయును. అట్టి సాధనములను సంపాదించుటయే మిక్కిలి కష్టసాధ్యమై యున్నది. కావున సాధారణముగా మానవుఁడు మోక్షార్జనమునకై యత్నింపఁడు. యత్నించు వారిలో నొకానొకఁడుమాత్రమే కృతకృత్యుఁ డగును. ఈ విషయము భగవద్గీతలో నిట్లు చెప్పఁబడినది. "మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః." ఓ యర్జునా! వేల కొలఁది మనుష్యులలో కొందఱుమాత్రమే సిద్ధి (మోక్షము) కొఱకు యత్నింతురు. యత్నించెడి వారిలో స్వల్పసంఖ్యాకులుమాత్రమే నన్ను (పరమాత్మను) యథార్థముగఁ దెలిసి కొందురు.

దానినిబట్టి మోక్షసంపాదన మెంత కష్టసాధ్యమైనదో మనకుఁ దెలియుచున్నది. ఈ లోకములో నెంతటి దుష్కరకార్యముల నైనను జేయవచ్చును గాని జీవబ్రహ్మైక్య రూపమగు మోక్షమును సంపాదించుట మిక్కిలి కష్టమని వసిష్ఠాదిఋషులును శంకరాచార్యాద్యద్వైతమతప్రకాశకులును ప్రకటించియే యున్నారు.

అయినను నిది కష్టసాధ్యమైనదని విడువఁ దగినదికాదు. మిక్కిలి కష్టమైనను మహత్తర లాభ మిందుండుటచేతను, మానవుఁడే కాని తక్కిన జీవకోటి దీనిని సాధించుట కసమర్థమగుటచేతను మానవుఁడే దీనిని సాధింపవలసి యున్నది. మానవుఁడే దీనిని సాధింపఁగలఁడు. ఇంత కష్టసాధ్యమగు కార్యము మనకేల యని యూరకున్నచో ఈ శరీరమును విడిచిన తరువాత తన కర్మల ననుసరించి మరల దేవ మనుష్య పశు పక్షి క్రిమికీటకాది జన్మముల నొందుచు, తాత్కాలిక సుఖమును శాశ్వత దుఃఖమును ననుభవించుచు నుండవలసి వచ్చును. కావున జనన మరణ రూపమును దుఃఖభూయిష్ఠమును అగు ఈ సంసారమును౦డి తప్పించుకొని శాశ్వతసుఖమును బడయుటకై మానవశరీరమున్నప్పుడే ఎవ్వఁడు ప్రయత్నింప వలసియున్నది.

అట్లు జనన మరణములను నశింపఁజేసి శాశ్వతసుఖము నొసంగు మోక్షమును సముపార్జించుటకు జీవబ్రహ్మైక్యబోధకమగు జ్ఞానము మాత్రమే సాధనమై యున్నది. ఇందులకు "జ్ఞానాదేవతు కైవల్యమ్" "దేవం మత్వా హర్షశోకౌ జహాతి" "నాన్యః పంథా అయనాయ విద్యతే" అను నిట్టి శ్రుతులు ప్రమాణములై యున్నవి. కావున జీవబ్రహ్మైక్యరూపమగు మోక్షమును సంపాదింపఁ దలంచుట మానవుల కవశ్య కర్తవ్యమై యున్నది.

అట్టి మోక్షేచ్ఛ కలవారికి అద్వైతవేదాంతము అజ్ఞానమును పోఁగొట్టి ఆత్మను గూర్చిన యథార్థజ్ఞానమును గలుగఁజేయును. కావున ఈ వేదాంతశాస్త్రము తత్త్వశాస్త్రమని చెప్పఁ

బడును. మనుష్యున కనాదికాలమునుండియు సహజముగనున్న అజ్ఞానమును తొలఁగించి తత్త్వజ్ఞానము నొసంగుటకు వేదాంతశాస్త్రము ప్రవర్తించుచున్నది.

వేదాంతమనఁగా నుపనిషత్తులని యర్థము. వేదములకు చివర నుండుటచే వీనికీ పేరు వచ్చెను. ఈ యుపనిషత్తులు జీవబ్రహ్మ రహస్యములను, సృష్టిరహస్యములను, జనన మరణ రహస్యములను వివరించి మానవుడు ముక్తి నొందుటకు సంపూర్ణసహాయమును జేయుచున్నవి. అట్టి యుపనిషత్తులు గూఢార్థమును గల్గియుండుటచే సామాన్య మానవులకు దుర్బోధములుగా నున్నవి. అయినను వాని యర్థమును వ్యాస శంకర విద్యారణ్యాది లోకోత్తరప్రభావ సంపన్నులు సాధ్యమైనంత సులభముగా లోకమునకు విశదీకరించిరి.

(సశేషము)



ఓమ్

శ్రీ జ్ఞానప్రసూనాంబా సమేత శ్రీ కాళహస్తీశ్వరప్రసాదోఽస్తు

# ఆత్మస్వరూపానుభవము

శ్రీ నిత్యానందస్వాములవారు; శ్రీకాళహస్తి.

అధ్యాత్మ విద్యారసికులగు

పాఠక మహాశయులారా!

వైదికధర్మమును ఉద్ధరించు నిమిత్తము శ్రీ పరమేశ్వరుడే స్వయముగ శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యరూపమున అవతరించి, ఉపనిషత్సూత్ర గీతాభాష్యాద్యనేక గ్రంథ రత్నములచేత ఆత్మతత్త్వమును భారతదేశమునందంతయు వ్యాపింపజేసెను. ఆత్మస్వరూపానుభవమును సామాన్యజనులు సైతము క్రోలి భవసాగరమును తరింతురుగాక యని తలంచి శ్రీవారి శిష్యులగు శ్రీ హస్తామలకాచార్యులు 12 శ్లోకములలో సమస్తోపనిషత్సారమును ప్రబోధించిరి. హస్తామలకాచార్యుని ఆత్మస్వరూపానుభవము అద్వైతసిద్ధాంత పీఠికయందు చింతామణి తుల్యమని చెప్పవచ్చును. మరియు సకలాద్వైత గ్రంథసారమగు నమృతబిందు విందున్నవి. ఆత్మవిద్యారసికులకీ యుత్తమ స్తోత్రము దొరికిన జాలు. సంసారాంధకారము నవలీల నుత్తరించి పరమపురుషార్థమగు మోక్షమును నొందవచ్చును.

## నివేదన

దక్షిణదేశమున 'శ్రీబలి' యను నొక గ్రామము గలదు. అందు "ప్రభాకరు" డను నొక శాస్త్రజ్ఞుడైన బ్రాహ్మణు డుండెను. అతని కొక పుత్రు డుండెను. అతడు పుట్టినది మొదలు జడునివలె నుండెను. ఒకానొకప్పుడు శ్రీ ఆదిశంకరాచార్యస్వాములవారు తమ శిష్య మండలితోగూడ దేశభ్రమణ మొనర్చుచు ఆ గ్రామము జేరెను. అపుడు ప్రభాకరుడు జడుడగు తనపుత్రుని గైకొని జగద్గురువులవారి సన్నిధిజేరి, అతనిని శ్రీవారి చరణములపై బడవైచెను. ఆ బాలకు డటులే చరణముల యందు బడియుండెను. కాని లేవకపోయెను. అంతట శ్రీ శంకరాచార్యులవారు బాలకుని చేతులబట్టి లేవనెత్తెను. అపుడు ప్రభాకరు డిటుల జెప్పదొడగెను. "ఓ జగద్గురూ! ఈ నా పుత్రునికి జడత్వ మెందులకు గలిగెను? ఇతడుజన్మించి పదుమూడుసంవత్సరములాయెను. కాని వీడింతవఱకు నేదియు తెలియజాల కున్నాడు. ఇతడు వేదముల జదువలేదు. అంతే గాదు, ఒక యక్షరమునుగూడ వ్రాయజాలడు. అయినను నే నితని కుపనయనసంస్కార మొన ర్చితిని. తోడిబాలురు ఆటలాడుటకు బిలిచినను బోడు. విశేషించి బాలురితని జడత్వమును వీక్షించి యితనిని గొట్టుచుందురు. అయినను నితనికి క్రోధము గలుగదు. నిరంతరము ప్రస న్నుడై యుండును. ఒకపుడు భుజించును. భుజింపకను నుండును. నామాట వినడు. స్వేచ్ఛాచారియై ప్రమత్తుడై తిరుగుచుండును. ప్రారబ్దవశమున నీ జడత్వము దినదిన మభివృద్ధి నొందుచున్నది." శ్రీశంకరాచార్యులు బాల కుని మౌనమును, ప్రసన్నమై యోగముద్రను వహించుచున్న ముఖము జూచి వివిధములుగ బ్రశ్నించెను.

శ్రీ శంకరాచార్యులవా రడిగిన ప్రశ్నల కా బాలకుడిచ్చిన సమాధానమే "ఆత్మస్వరూ పానుభవము" "హస్తామలకస్తోత్రము" బ్రహ్మ జ్ఞానమంతియు అరచేతియందలి అమలకము (ఉసిరికకాయ) వలె ఆ బాలకునికి సుగమముగ నుండెను. బాలకునియొక్క యీ యద్భుతమగు వాక్చమత్కారమును వీక్షించి తండ్రియగు ప్రభాకరు డా బాలకుని శ్రీ ఆచార్యులవారి చరణములయందు సమర్పించెను. శ్రీ శంకరా చార్యులవారును, నీబాలకుని పూర్ణసిద్ధి నొందిన యోగిగ నెంచి సన్న్యాసదీక్ష నొసగి, "ఆత్మ స్వరూపానుభవము" హస్తామలకమువలె ప్రత్యక్షమగుటజేసి "హస్తామలకుడు" అని అన్వర్థనామమిడెను. ఇతనే తరువాత శారదా పీఠముయొక్క ప్రధానస్థానము నధిష్ఠించి "హస్తామలకాచార్యు" లని ప్రసిద్ధి బడసెను.

### ఆత్మస్వరూపానుభవ ప్రారంభము

శ్లో॥ కస్త్వం శిశో! కస్యకుతోఽసిగన్తా
కిం నామ తే త్వం కుత ఆగతోఽసి।
ఏతన్మయోక్తం వద చార్భక! త్వం
మత్ప్రీతయే ప్రీతి వివర్ధనోఽసి॥

తా॥ ఓ బాలకా! నీ వెవడవు! ఎవనికి సంబం ధించినవాడవు? ఎచటికి వెళ్లెదవు? నీపేరేమి? ఎచటినుండి వచ్చితివి? నన్ను సంతోష పెట్టుటకై యీ నా ప్రశ్నలకు జవాబిమ్ము. నీవు నా కెక్కువ సంతోషము గలుగజేయు వాడవు.

అంతట నా బాలకుడు మౌనముద్రను

వీడి మృదుమధురవచనములతో నిటుల సమాధాన మొసగెను

శ్లో॥ నాహం మనుష్యో నచదేవ యక్షౌ
న బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాః।
న బ్రహ్మచారీ న గృహీ వనస్థో
భిక్షు ర్నచాహం నిజబోధరూపః॥ 1

తా॥ నేను మనుష్యుడగాను. దేవతనుగాని యక్షుడనుగాని గాను. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులలో నెవనినీ గాను. బ్రహ్మచారినిగాని గృహస్థుడను గాని వానప్రస్థుడనుగాని సన్యాసినిగాని గాను మఱేమన! కేవలాఖండజ్ఞానస్వరూపుడనే నేను. [కాన నాకంటె వ్యతిరిక్తమగు పదార్థ మెద్దియులేదు. వ్యాపకస్వరూపుడ నగు నాకు గమనాగమనము లెక్కడివి? మఱియు నామరహితుడనగు నాకు బే రెక్కడిదని భావము.]

శ్లో॥ నిమిత్తం మనశ్చక్షురాది ప్రవృత్తౌ
నిరస్తాఖిలోపాధి రాకాశకల్పః।
రవిర్లోకచేష్టా నిమిత్తం యథాయః
సనిత్యోపలబ్ధిస్వరూపోఽహమాత్మా॥ 2

తా॥ సూర్యు డెటుల సకల లౌకికకార్యప్రవృత్తికి కారణుడైనను, లౌకికధర్మములచే లిప్తుడుగాక నిర్లిప్తుడై యున్నాడో, అటులే యే యాత్మ మనస్సు, చక్షుస్సు మొదలగు సమస్తేంద్రియ ప్రవృత్తికి కారణమై, సకలోపాధి సంసర్గ రహితమై యున్నదో, మఱియు, ఆకాశమువలె నిర్వికారమై, నిర్మలమై యున్నదో, యట్టి నిత్యజ్ఞానస్వరూపమగు ఆత్మయే నేను.

శ్లో॥ యమగ్న్యుష్ణవన్నిత్యబోధస్వరూపం
మనశ్చక్షురాదీన్యబోధాత్మకాని।
ప్రవర్తన్త ఆశ్రిత్య నిష్కమ్పమేకం
సనిత్యోపలబ్ధిస్వరూపోఽహమాత్మా॥ 3

తా॥ అగ్నికి ఉష్ణత్వము (వేడిమి) స్వభావమై నటుల, ఆత్మకును చైతన్యత స్వభావ సిద్ధము. అచలము, అద్వితీయము నగు ఏ యాత్మ నాశ్రయించి జడస్వరూపములగు మనోనేత్రాదీంద్రియములు తమ తమ కార్యములయందు ప్రవర్తించుచున్నవో, అట్టి నిత్యజ్ఞానస్వరూపమగు ఆత్మయే నేను.

శ్లో॥ ముఖాభాసకో దర్పణే దృశ్యమానో
ముఖత్వాత్పృథక్త్వేన నైవాస్తి వస్తు।
చిదాభాసకో ధీషు జీవోఽపి తద్వత్
సనిత్యోపలబ్ధిస్వరూపోఽహమాత్మా॥ 4

తా॥ దర్పణము (అద్దము) నందు ప్రతిఫలించిన ముఖ ప్రతిబింబము, బింబరూపమగు ముఖమునకంటె వేఱుగాక ముఖరూపమేయగు నటుల, ఏ చైతన్యాత్మ, బుద్ధిరూపదర్పణమునందు జీవరూపముగ ప్రతిఫలించినను, ఆ జీవాత్మ, బింబరూప చైతన్యముకంటె వేఱుగాక నిత్యానంద స్వరూపమేయగుచున్నదో, అట్టి నిత్యజ్ఞాన స్వరూపమగు ఆత్మయే నేను.

శ్లో॥ యథా దర్పణాభావ ఆభాస హానౌ
ముఖం విద్యతే కల్పనా హీనమేకమ్।
తథా ధీ వియోగే నిరాభాసకో యః
సనిత్యోపలబ్ధిస్వరూపోఽహమాత్మా॥ 5

తా॥ ఎటుల దర్పణరూప ఉపాధిలేనిచో, అందు ప్రతిఫలించిన ముఖ ప్రతిబింబము నుండదో, మఱియు, బింబ ప్రతిబింబకల్పనారహితమై యేకమగు బింబరూప ముఖము మాత్రమే మిగిలియుండునో, అట్లే బుద్ధిరూప రూపమగు యుపాధిలేనిచో, ఏ యాత్మయొక్క ప్రతిబింబమును లేదో, అట్టి నిత్య జ్ఞాన స్వరూపమగు ఆత్మయే నేను.

శ్లో॥ మనశ్చక్షురాదే ర్వియుక్తః స్వయం యో
మనశ్చక్షురాదే ర్మనశ్చక్షురాదిః।
మనశ్చక్షురాదే రగమ్యస్వరూపః
సనిత్యోపలబ్ధిస్వరూపోఽహమాత్మా॥ 6

తా॥ ఏయాత్మ మనోనేత్రాదీంద్రియముల కంటె భిన్నమై కేవల సాక్షిమాత్రముగ నున్నదో, మఱియు మనస్సునకు మనస్సై, నేత్రమునకు నేత్రమై, శ్రోత్రమునకు శ్రోత్రమై, వాక్కునకు వాక్కై యున్నదో అనగా మనోనేత్రాదీంద్రియములకు స్వాయముగ దివ్యశక్తిని నొసగి వానిని తమ తమ కార్యములయందు ప్రవర్తింపజేయుచున్నదో, మఱియు కూటస్థ స్వరూపమగు నేయాత్మ మనోనేత్రాదీంద్రియములకు గోచరముకాదో, అట్టి నిత్యజ్ఞాన స్వరూపమగు ఆత్మయే నేను.

శ్లో॥ య ఏకో విభాతి స్వతశ్శుద్ధచేతాః
ప్రకాశస్వరూపోఽపి నానేవ ధీషు।
శరావోదకస్థో యథా భానురేకః
సనిత్యోపలబ్ధిస్వరూపోఽహమాత్మా॥ 7

తా॥ ఒకే సూర్యుడు జలపూర్ణములగు శరావము (మూకుడు) లందు అనేకవిధములుగా ప్రకాశించునటుల, ఏయద్వితీయ విశుద్ధ స్వప్రకాశ చైతన్యరూపమైన యాత్మ స్వయంప్రకాశరూపమైనను, ఉపాధి భేదముచే ననేక బుద్ధులయందు నానాప్రకారములుగ భాసించుచున్నదో, అట్టి నిత్యజ్ఞాన స్వరూపమగు ఆత్మయే నేను.

శ్లో॥ యథాఽనేక చక్షుఃప్రకాశో రవిర్న
క్రమేణ ప్రకాశీకరోతి ప్రకాశ్యం।
అనేకాధియో యస్తథైకః ప్రబోధః
సనిత్యోపలబ్ధిస్వరూపోఽహమాత్మా॥ 8

తా॥ అనేక చక్షుః ప్రకాశముగల సూర్యుడు ప్రకాశింపజేయదగిన నేత్రాది బాహ్య వస్తుజాతమునెల్ల క్రమముగగాక నొకేసారి ప్రకాశింపజేయునటుల, అద్వితీయాఖండ జ్ఞాన స్వరూపమగు నేయాత్మ స్వీయమగు సత్తాస్ఫూర్తిచే నానావిధములగు బుద్ధుల నొకేసారి ప్రకాశింపజేయునో, అట్టి నిత్య జ్ఞానస్వరూపమగు ఆత్మయే నేను.

శ్లో॥ వివస్వత్ప్రభాతం యథారూపమక్షం
ప్రగృహ్ణాతి నాభాతమేవం వివస్వాన్।
యదాభాత ఆభాసయత్యక్షమేకః
సనిత్యోపలబ్ధిస్వరూపోఽహమాత్మా॥ 9

తా॥ నేత్రము ఎటుల సూర్యునిచే ప్రకాశింపజేయబడిన రూపమును గ్రహించునేగాని, సూర్యునిచే ప్రకాశింపబడని రూపమును గ్రహింపజాలదో, చూడజాలదో, అటులే సూర్యుడును ఏచైతన్యస్వరూపమగు ఆత్మచే ప్రకాశింపబడియే, రూపనేత్రాదుల ప్రకాశింపజేయుచున్నాడో, అనగా ఆత్మచే ప్రకాశితుడుగాక రూపనేత్రాదుల

ప్రకాశింప జేయజాలడో, అట్టి అద్వితీయ నిత్య జ్ఞానస్వరూపమగు ఆత్మయే నేను.

శ్లో. యథాసూర్య ఏకోఽప్యనేకశ్చలా సు
స్థిరాస్వ ప్యనన్య ద్విభావ్య స్వరూపః।
చలాసు ప్రభిన్నః సుధీష్వేక ఏవ
సనిత్యోపలబ్ధిస్వరూపోఽహమాత్మా॥ 10

తా॥ చంచలమును, లేక స్థిరమునునైన జలములయందు ఒకే సూర్యుడు భిన్నభిన్న రూపములు గలవాడుగ గనుపించుచున్నాడు. కాని వస్తుతః విచారించిన సూర్యుడొకడే గాని, ఆతనికి నానా రూపములులేవు. అట్లే ఆత్మయు చంచలములు, లేక స్థిరములు నగు నానావిధ బుద్ధ్యుపాధులందు అనేక రూపములతో భిన్నభిన్నముగ గానుపించు చున్నది. కాని పర్యాలోచించిన ఆత్మ ఏకమే గాని దానికి భిన్నభిన్న రూపములు లేవు. అట్టి అద్వితీయ భేదరహిత నిత్యజ్ఞాన స్వరూపమగు ఆత్మయే నేను.

శ్లో ఘనచ్ఛన్న దృష్టిర్ఘనచ్ఛన్నమర్కం
యథానిష్ప్రభం మన్యతే చాతి మూఢః।
తథాబద్ధవద్భాతియో మూఢదృష్టేః
సనిత్యోపలబ్ధిస్వరూపోఽహమాత్మా॥ 11

తా॥ మేఘాచ్ఛాదితమగు దృష్టిప్రసారము గల మూఢుడగు మనుజుడు మేఘావృతుడగు సూర్యుని కాంతివిహీనునిగా దలచునటుల ఏ నిత్యముక్త స్వరూపమగు ఆత్మ అవిద్యాబద్ధము గాకున్నను, నద్దానిని వివేకరహితుడగు అజ్ఞాని భ్రాన్తిచే బద్ధముగనే దలంచు చున్నాడో, అట్టి విశుద్ధాఖండజ్ఞాన స్వరూపమగు ఆత్మయే నేను.

శ్లో. సమస్తేషు వస్తుష్వనుస్యూతమేకం
సమస్తాని వస్తూనియం నస్పృశంతి।
వియద్వత్సదాశుద్ధ మచ్ఛస్వరూపః
సనిత్యోపలబ్ధిస్వరూపోఽహమాత్మా॥ 12

తా॥ ఏ యద్వితీయమగు ఆత్మ ఆకాశాది సమస్త పదార్థములయందును అనుస్యూతముగ (ఓతప్రోతముగ) అనగా, పడుగు-పేకగనున్నను, ఆ పదార్థములను లేశమాత్రమేని అంటకున్నదో, మఱియు నే యాత్మ ఆకాశమువలె విశుద్ధమైయున్నదో, అట్టి నిత్యవిశుద్ధ జ్ఞానస్వరూపమగు ఆత్మయే నేను.

శ్లో ఉపాధౌ యథా భేదతా సన్మణీనాం
తథా భేదతా బుద్ధి భేదేషు తేఽపి।
యథా చంద్రికాణాం జలే చంచలత్వం
తథా చంచలత్వం తథాపీహ విష్ణో॥ 13

తా॥ నీల, పీత, రక్తాది వర్ణవిశిష్టములగు ఉపాధులయొక్క భేదముచే శుద్ధములగు స్ఫటికమణులకు భిన్నభిన్న వర్ణత్వమెటుల ప్రతీతమగుచున్నదో, అట్లే శుద్ధాశుద్ధ బుద్ధిరూపమగు ఉపాధిభేదముచే విశుద్ధమగు అద్వితీయాత్మ నానా రూపములచే విచిత్రముగ దోచుచున్నది. మఱియు ఓ సర్వవ్యాపివగు భగవంతుడా! చంచలమగు జలమునందు, స్థిరమగు చంద్రకాంతికిని చంచలత్వమెటుల గాన్పించుచున్నదో, అట్లే నీయొక్క అచల విశుద్ధ స్వరూపమునందును బుద్ధ్యాద్యుపాధి భేదముచేతనే చంచలత్వము ప్రతీత మగు చున్నది. కాని నీవో, అచలుడవు, నిత్య విశుద్ధాఖండజ్ఞాన స్వరూపుడవు.



# సాక్షాత్కార లక్షణము

శ్రీ తాతా వేంకటేశ్వరరావు

యోగమార్గముచేత నిరుద్ధమయినట్టి చిత్తము ఎచ్చట విశ్రాంతమగుచున్నదో, జ్ఞానానందరూపుడైన యాత్మను జూచి ఎచ్చట సాధకుడు [ఇపుడే జీవన్ముక్తి పొందినవాడు విద్వాంసుడు] హర్ష నిర్భరుడగుచున్నాడో, అచ్చట సుఖము అత్యంతముగనున్నది. ఆ సుఖము ఎట్లున్నది అనగా అది ఇంద్రియములకు గోచరము కాతగినది కాదు, అది సామాన్యబుద్ధికి గోచరము కాతగినదికాదు, అది శ్రవణాది సాధనములచే పరిశుద్ధమై విక్షేపరహితమైన విశేషబుద్ధికే గోచరము కాతగినదిగానున్నది. ఎప్పుడు ఆ సుఖమును ఎఱుగుచున్నాడో, అపుడు వాడు ఆ సుఖమునుండి చలనము పొందడు. ఆ యాత్మసుఖము ప్రాప్తమైన వెనుక ఆ యాత్మ సుఖము కన్న అధికమని ఫ లా భ ము ను త లం ప డు, ఆ యాత్మ సుఖమునందుండగ ఎంత పెద్ద దుఃఖము ప్రాప్తమైనను ఆ సుఖస్థానమునుండి చలనము పొందడు. [వృశ్చికదంశముగాని అగ్నిస్పర్శము గాని శస్త్రాఘాతముగాని లేక వీనికన్న పెద్ద దుఃఖముగాని లేక ప్రపంచమునందు ఎన్నిదుఃఖములున్నవో, ఆయన్ని దుఃఖముల సమష్టిరూపమైనట్టి ఒక మహాదుఃఖముగాని ప్రాప్తమయినను ధీరుడైన సాక్షాత్కారవంతుడు ఒకసారి ప్రాప్తమైన ఆ యాత్మానంద స్థానమును విడడు.] మఱియు ఎవరుసమిష్టి సూక్ష్మలింగ శరీరాభిమానియు సూత్రాత్మయు అగు హిరణ్యగర్భబ్రహ్మానుసంధానము చేయుదురో వారికి హిరణ్యగర్భబ్రహ్మసాక్షాత్కారమును సమస్తలోకములయందు స్వేచ్ఛా సంచార రూపమగు స్వాతంత్ర్యమును కలుగును.

[శ్రీ జ్ఞానేశ్వరుడను మహానుభావుడు మహారాష్ట్రభాషయందు సాక్షాత్కారవంతుని లక్షణము నిట్లు చెప్పుచున్నాడు]

"జైసేం రోడకేంఢోర పావేసుఖాడీ కభిఢార ॥
మగటాకి లేంచి శరీర ఉరోంనేది ॥"

భావార్థము—రోగాదులచే అత్యంతదుర్బలమైన ఆవు ఆయాసముగా తిరుగుచు తిరుగుచు విశ్రాంతి స్థానమును జూచి ఆ స్థానమునందు ఒకసారి పడుచున్నది. తరువాత ఆ యావును కావలసినంత తిట్టుము కొట్టుము; ఆ స్థానమునుంచి లేచుచున్నదా ఏమి? లేవదు. అట్లు త్రివిధతాపములచే తప్తుడైన జిజ్ఞాసువు జన్మమరణ రూపభవారణ్యమునందు తిరుగుచు తిరుగుచు ఆత్మరూప సుఖస్థానమునందు ఒకసారి పడినపుడు ఎంత దుఃఖము ప్రాప్తమైనను ఆ స్థానము వీడడు:

శ్రీ గురుదేవ్ రామకృష్ణ పరమహంస సాక్షాత్కార లక్షణమునుగూర్చి యొకప్పుడిట్లు పల్కెను.

"నీటముంచిన కడవకు లోపలను వెలుపలను గూడ జలము ఉండును. అట్లే పరమాత్మయందు లయ మొందిన జీవునకు బాహ్యాభ్యంతరములందు అఖండాత్మయే గోచరించును. అట్లు గోచరించిననాడు తనకుగలిగించిన అనేకజన్మములందలి విపరీతజ్ఞానమనెడి నీటియందలి మాలిన్యమును జీవుడు తుడిచివేసికొనును; అందుచే నీ స్థితికి చేరగనే అతని సమస్తవికట ప్రసంగములు ఆ నీటియందే మునిగిపోవును. అనగా ఆ సాక్షాత్కారమందే లీనమగును."



# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు



సంపాదకులు: శ్రీ ఋతజానందస్వామి; శ్రీ వేగురుమూడి వేంకటకృష్ణరావు

శ్రీ కే. ఎస్. ఎన్. రాజన్ గారిచే ది జ్యూపిటరు ప్రెస్స్ లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి, శ్రీ ఆదిదేవానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 20-11-50.

# శ్రీ రామకృష్ణ ప్రభ

## చందాదారులకు

౧. పత్రిక ప్రతిమాసము 20-వ తేదీన వెలువరింపఁబడును. ఒక వారము, పదిరోజులు గాంచి ప్రతి మీకు అందకపోయినయెడల ఉత్తరము వ్రాయుఁడు.

౨. సంవత్సర చందా రు. 3 లు మాత్రమే జనవరినెల నుండిగాని జూలై నెల నుండిగాని చందాదారులుగఁ జేరవచ్చును. ఇతర మాసములలోఁ జేరదలచు వారికి జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని సంచికలు చేర్చిపంపఁబడును. విడిప్రతి రూ. ౦—౬—౦ లు. హిగిన్‌బాథంస్ వారి స్టాలులోఁగాని, మా పత్రిక ఏజెంటును గాని అడుగుఁడు

౩. ఉత్తర ప్రత్యుత్తరములు వీలైనంతవఱకు ఇంగ్లీషున వ్రాయుచు మీ చందాదారు సంఖ్య నుదాహరింపుఁడు. ఉత్తరములను "మేనేజరు, శ్రీరామకృష్ణప్రభ" అను చిరునామాకు వ్రాయుఁడు.

౪. చిరునామాయందు ఎట్టిమార్పు గలిగినను 10-వ తారీఖునకు ముందుగా మా కార్యాలయమునకుఁ దెలుపవలయును. లేనిచో, పత్రిక పూర్వపు చిరునామాకే పంపఁబడును.

## వ్యాసకర్తలకు

౧ కేవలము నైతిక ధార్మిక వైజ్ఞానిక విషయకములైన వ్యాసములేకాక, సాహిత్యమునకును కవిత్వమునకును సంబంధించిన ఏ వ్యాసములైనను బంపవచ్చును. సులభ సుందరమగు గ్రాంథిక భాషలో వ్రాయవలయును.

౨. వ్యాసములు అచ్చులో మూఁడు పుటలకు మించరాదు. ప్రతి నెల ఒకటవ తేదీకి వ్యాసములు మాకు అందవలెను.

౩. వ్యాసములను, విమర్శకుఁ బంపు గ్రంథములను, వినిమయముగఁ బంపెడి పత్రికలను "సంపాదకుఁడు, శ్రీ రామకృష్ణ ప్రభ" అను చిరునామాకు వ్రాసి పంపవలెను.

౪. వ్యాసము తిరుగఁ బంపఁబడవలయునచో దగు పోస్టేజి చేర్చి పంపవలయును.



# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౭ } ౧౯౫౦ డిశంబరు – వికృతి – మార్గశిరము { సంచిక ౯

శ్రీ శారదేశ్వరీయైనమః

## శ్రీ మాతృదేవి

రాగము - నాట. తాళము - ఝంప.

పల్లవి

అకారణకరుణామృతరూపిణీ! - సమస్తలోకజననీ!
సకుంకుమాంచితముఖసరోజినీ - నమోస్తుతే శ్రీ శారదామణీ!

అనుపల్లవి

అకామగురుపదభక్తి – సతంబు నా మది నెలకొన నీ
వికార రహితజ్ఞాన – ప్రకాశ మనుగ్రహింపుమీ॥ ॥అకారణ॥

చరణములు

పతితవనితను మును – బహుపరుషోక్తులాడి
పతి అవమానింపగ – భరింపలేక రయమున
"సుతయౌ నా కది" యని – సువిశ్వమాతృవత్స
లత మీర దరిజేర్చి - అభయమిచ్చిన దయరానీ॥ ॥అకారణ॥



ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ

# శ్రీ రామకృష్ణ వచనామృతము—'మ.'

సుమారు మూడుగంటలయినది. శ్రీరామకృష్ణులవారు తన చిన్నమంచముపై గూర్చొని ఆవంతయు శరీరస్పృహలేని భావావేశనిమగ్నులై యుండిరి. కొంతసేపటికి దేవితో నిట్లు సంభాషింప నారంభించిరి 'అమ్మా! ఆతనికి ఒక కళమాత్ర మొసగితివేల? ఓ! నాకు స్ఫురించినది! ఆ యొక్క కళవలననే యెంతటి పనినైనను కొనసాగగలడు. అందువలననే నీవు తలపెట్టిన కార్యమును చేయించుకొనగలవు. ఆతడు ప్రపంచమున కెంతయో ప్రబోధము గావింపగలడు.'

శ్రీరామకృష్ణు డీ విధముగా తన ఆంతరంగిక శిష్యులయందు శక్తి సంచాలనము గావించి వారివలన లోకకల్యాణము గావింపదలచెనా? గదియందు 'మ.' రాఖాలును గూర్చొని యుండిరి. శ్రీరామకృష్ణు లింకను ఆ భావావేశమునందే యున్నారు. అయినను రాఖాలును జూచి 'నీకు కోపము కలిగినదా? సరియగు నౌషధము నొసగవలయునన్న భావముతోడనే నీకు ప్రకోపము కలిగించితిని. కురుపు లేచినచో వైద్యుడు దానికి మొనదేల్చి, పిదప దానిపై నేదో పసరాకు కట్టుట గలదు గదా!'

కొంతకాల మూరకుండి, 'నాకు జూడ హాజ్రా శుష్కకాష్ఠమువలె కనిపించును. ఆతడిచట నుండుటకుగూడ కారణము గలదు. భగవల్లీలకు పుష్టిగలిగింప జటిలుడును కుటిలుడును అవసరమయినటులే ఇచటను హృదయుడు నవసరమయ్యెను.' 'మ.' తో 'భగవద్రూపమును నమ్మవలయును. జగద్ధాత్రి రూపము నర్థము దెలియునా? జగత్తును ధరించియున్నదియే జగద్ధాత్రి. ఆమె ధరింపనిచో జగత్తు పతనమై నశించును. మనోగజమును నిగ్రహింపగలవాని హృదయమునందే జగద్ధాత్రి యుదయించును.'

రాఖాల్:—మనస్సు మత్తగజము.

శ్రీరామ:—కావుననే సింహవాహిని సింహ మాగజమును లోగొనుచున్నది.

సంధ్యాకాలమయినది. దేవాలయమున దీపారాధన ప్రారంభమాయెను. సంధ్యాకాలము ప్రారంభింపగనే శ్రీరామకృష్ణ గురుదేవుడు తన గదియందు భగవన్నామోచ్చారణమును గావించుచుండెను. గదియందు సాంబ్రాణిధూపము వ్యాపింపజొచ్చెను. శ్రీరామకృష్ణులు బద్ధాంజలులై తమ చిన్నమంచముపై గూర్చొని దేవిధ్యానము గావించుచుండిరి. బేల్ఘర్ నుండి గోవిందముఖర్జీ, వారి స్నేహితులు వచ్చి నమస్కరించి క్రింద కూర్చొనిరి. 'మ.' రాఖాలు గూడ నందే యుండిరి. ఆరుబయట చంద్రోదయము కాగా శీతల కిరణములు ప్రసరించుచుండెను. జగత్తంతయు నిశ్శబ్దముగా నుండెను. గదియందలివారు సైతము శాంతముగా భావావిష్టులయిన శ్రీరామకృష్ణులవారి దివ్యముఖ

మును జూచుచు కూర్చొనియుండిరి. కొంత కాలమునకు భావావస్థయందే యిట్లు పలుక నారంభించిరి 'మీ సందేహములన్నియు దెలుపుడు. నే నంతయు దీర్చెదను.' గోవిందుడు ఆతని స్నేహితులు యోచింప దొడగిరి.

గోవిందు.—చిత్తము. దేవికి శ్యామవర్ణము (నల్లరంగు) ఎట్లు కలిగెను?

శ్రీరామ —ఆమె చాలదూరమున నున్నది కనుక దగ్గరకు బోయినచో ఏ రంగును నుండదు. చెఱువునందలి నీరు దూరమునుండి చూచినచో నల్లగా గాన్పించును. దగ్గరకు బోయి దోయిట బట్టినచో ఏ రంగును కనుపింపదు. ఆకసము దూరమున నుండుటచే నీల వర్ణము గలదిగా దోచుచున్నది. దగ్గర కేగిన నే రంగును కనుపింపదు. భగవంతుని సమీపించిన కొలదియు ఆయనకు నామరూపములు లేవని నీవు తెలిసికొనగలవు. మఱల వెనకడుగు పెట్టినచో మా దేవి! శ్యామవర్ణముగలది యని తోచును. శ్యామ! పురుషుడా? ప్రకృతియా? ఒకభక్తుడు దేవీపూజ చేసెను. ఆ పూజను దర్శింపవచ్చిన మఱియొకడు దేవీ కంఠమున యజ్ఞోపవీతమును జూచి యాశ్చర్యమంది, 'ఇదేమి! తల్లి మెడలో జందెము వైచితివే' యని యడిగెను. అప్పుడా భక్తుడు 'తమ్ముడా! నీవు తల్లిని బాగుగా గుర్తించినట్లు కనిపించుచున్నది కాని నాకింకను ఆమె పురుషుడా ప్రకృతియా యని గుర్తింప వలనుపడ లేదు. అందువలననే నేను యజ్ఞోపవీతము నామెకు వైచితి' నని పలికెను.

శ్యామాదేవియే బ్రహ్మము. ఎవరికి రూపమున్నదని తలంతుమో వారికే రూపము లేదు. సగుణస్వరూపము గలవారికే నిర్గుణస్వరూపము కూడ గలదు. బ్రహ్మయే శక్తి, శక్తియే బ్రహ్మ. వీరిరువురును అభేద సచ్చిదానందమయులు.

గోవిందు —యోగమాయ యని యేల పలుకుదురు? దీని యర్థమేమి?

శ్రీరామ.—యోగమాయ యన ప్రకృతీ పురుషుల యోగము. అనగా నైక్యము. మన కంటికి గోచరించు సమస్తమును ప్రకృతీ పురుషుల సమ్మేళనమే. శివకాళీమూర్తిని జూడుము. శివునిపై కాళీమూర్తి నిలువంబడియున్నది. శివుడు శవమై పడియున్నాడు. శివుని కాళి చూచుచున్నది. ఈ సమస్తమును ప్రకృతీ పురుష సంయోగమే. పురుషుడు నిష్క్రియుడు. అందువలననే శివుడు శవమువలె పడియున్నాడు. పురుషుని సంయోగమువలననే ప్రకృతి సమస్త కార్యములను నిర్వర్తించుచున్నది. సృష్టి స్థితి ప్రళయములను గావించుచున్నది. రాధాకృష్ణుల ద్వంద్వమూర్తికిగూడ నిదియే యర్థము. ఈసంయోగము కొఱకే ఆ యిరువురు నొకరివైపున కొకరు పూని నిలిచి యుండుట. సంయోగము దెలుపుట కొఱకే శ్రీకృష్ణుని ముక్కున ముత్యమును, శ్రీమతి రాధ నాసికయందు నీలమణియు గనుపించుచున్నవి. శ్రీమతి రాధ మేనిరంగు ముత్యములవలె నుజ్జ్వలమయినది. శ్రీకృష్ణుడు శ్యామవర్ణుడు. అందులకే శ్రీమతి నీలమణిని ధరించియుండుట. మఱియు శ్రీకృష్ణుడు పీతాంబరమును రాధ నీలాంబరమును ధరించి యున్నారు.

ఉత్తమభక్తు లెవరు? బ్రహ్మజ్ఞానము కలిగి, జీవము, జగత్తు, చతుర్వింశతి తత్త్వములు—ఇవన్నియు ఆ బ్రహ్మమే యని తెలిసికొనగలుగువారు. మొట్టమొదట 'నేతి, నేతి'

విచారము గావించి మేడ నెక్కవలయును. అచ్చటికి చేరిన పిదప, ఏ సున్నము ఇటుకలతో మెట్లు కట్టబడినవో ఆ సున్నము ఇటుకలతోనే మేడయు కట్టబడినదని మనము తెలిసికొనగలము, ఆ బ్రహ్మమే జీవము జగత్తు సకలము నయినదని తెలిసికొనగలము.

కేవల విచారమా! ఛీ, ఛీ. దానితో నాకేమియు పనిలేదు అనుచు ఉమ్మివైచిరి. విచారము గావించి యేల శుష్కుడనై యుండవలయును? 'నీవు – నేను' అను భేదబుద్ధి యున్నంతకాలము భగవత్పాదారవిందముల యందు భక్తిగలిగియుండును.

(గోవిందునితో) ఒక్కొక్కప్పుడు 'నీవే నేను, నేనే నీవు' అని వచింతును. మఱియొకప్పుడాపలుకు 'నీవే, నీవు' గా మాఱిపోవును. అపుడు నేను అనునది కనుపింపనే కనుపింపదు. శక్తికే అవతారములు గలవు. దీని ననుసరించి రాముడు శ్రీకృష్ణుడుగూడ ఆ సచ్చిదానంద సాగరమున రెండు అలలై యున్నారు. అద్వైత జ్ఞానానంతరము చైతన్యము లభించును. సర్వ భూతములందును చైతన్యస్వరూపమున ఆ పరబ్రహ్మమే వికాసించునట్లు మన మపుడు తెలిసికొనగలము. అట్టి యీ చైతన్య లాభానంతరము ఆనందము ననుభవింతుము. ప్రప్రథమమున అద్వైతజ్ఞానము, పిదప చైతన్యలాభము, చివర నిత్యానందము.

('మ.' ను జూచి) నీకే చెప్పుచున్నాను. భగవద్రూపములయందు సందేహము వలదు. భగవంతునకు రూపము కలదను పలుకును విశ్వసింపుము, పిదప నీ మనస్సునకు నచ్చిన రూపమును ధ్యానింపుము. (గోవిందుని జూచి) పురుషునకు భోగాసక్తి యున్నంతకాలము భగవంతుని దెలిసికొనుటకో లేక దర్శించుటకో మిక్కిలి యుద్రేకము కలుగదు. పసిబిడ్డలు ఆటలవలన సకలమును మఱచియుందురు. తినుటకేమయిన నిచ్చి యీ యాటల మఱపింప బ్రయత్నించిన నపుడును కొద్దిగా నా పదార్థముల పుచ్చుకొని మఱల ఆ యాటలకే పోవుదురు. కొంతసేపటికి ఆటలు, ఫలాహారములపై ననిష్టము కలిగినపుడు నేను తల్లిదగ్గఱకేగెదనని వచించును. అపుడు ఫలాహారముల వైపు మనస్సు మఱలదు. ఆ సమయమున నపరిచితుడైనను వచ్చి 'రా! నిన్ను నీ తల్లిదగ్గరకు దీసికొనిపోవుదు' నని పలికినచో వానితో బోవును. ఎవరైనను సరే తల్లిదగ్గరకు దీసికొనిపోయెదమన్నచో వారితోగూడి పోవుటకు వారు సిద్ధపడుదురు.

సాంసారిక సుఖానుభవానంతరము భగవంతునికొఱకు మనస్సు తొట్రువడును. ఆ సమయమున భగవంతు నెట్లు ప్రాపింపగలనా యనియే మనస్సున దోచుచుండును. అప్పుడెవరేమి చెప్పినను సరే వారు వారి పలుకుల విందురు.

'మ.' (తనలో) ఆహా! భోగవాంఛలు తీరినపిదపనేనా భగవంతునికొఱకు తొట్రువడుట.

---

18 ఆగస్టు, 1883,
శనివారము.

బలరామ్‌బోసు నింటియందు శ్రీరామకృష్ణులవారు భక్తులకు భగవదవతారముల గూర్చి బోధించుచుండిరి. లోకశిక్షణార్థము అవతారపురుషులు భక్తులతోడను, భక్తితోడను కాలము గడుపుచుందురు. ఇది మేడమీద నున్నవారు వలయునపుడెల్ల ఆరోహణా

వరోహణముల గావించుటవంటిది. మేడనెక్క వలయునన్న జనులందఱును భక్తిమార్గ మను సరింపవలయును. విషయవాసనలు తగ్గనంత వఱకు జ్ఞానలాభము కలుగదు విషయానురక్తి వీడిన పిదపనే మేడనెక్కగలము. తన లెక్క లన్నియు సరిచూచుకొనంతవఱకు అంగడివాడు శయనింపడు. లెక్కలన్నియు చక్కగా వ్రాసి కొన్న పిదపనే యాతడు నిదురింప నేగును

'మ.' ను జూచి, ఒక్కొక్కరు హారాత్తుగాగూడ దానిపై నుఱికిపడిగూడ చేర వచ్చును.

సరే! కేశవసేనుడు, శివనాధుడు—వీరి యుపాసనగూర్చి నీకేమి తోచుచున్నది?

'మ.' చిత్తము. మీరు చెప్పినట్లు, వారు తోటను వర్ణించుచున్నారే కాని ఆ తోట యజమానుని జూచు మాట అరుదుగా పలుకుచుందురు. వారు సాధారణముగా ఉద్యానవన వర్ణనముతో ప్రారంభించి యా వర్ణనముతోనే ముగింతురు.

శ్రీరామ—ఔను. తోట యజమానిని వెదకి ఆయనతోడి పరిచయము కలిగించుకొనుటయే మన కర్తవ్యము. ఈశ్వరదర్శనమే జీవితోద్దేశము.

బలరాముని యింటినుండి శ్రీరామకృష్ణ గురుదేవుడు అధరునియిల్లు చేరెను. సంధ్యా కాలానంతరము అధరునియింటి లోగిట వైష్ణవ చరణుడు భక్తిమయమయిన కీర్తనలు పాడు చుండెను. శ్రీ గురుదేవుడు భగవన్నామ సంకీర్తనము గావించెను. అధరుడు, 'మ.' రాఖాలు అందఱు నచటనే యుండిరి. శ్రీరామ కృష్ణుడు సంకీర్తనానంతరము భావావిష్టు డయ్యెను. పిదప రాఖాలునితో 'ఇక్కడి (తన్ను జూపుచు) వర్షము శ్రావణమాసపు వర్షమువంటిదికాదు. శ్రావణమాసమున వర్షము అంతలో గురిసి అంతలో వీడును. ఇక్కడి శివుడు పరులచే ప్రతిష్ఠాపనము చేయబడినవాడు కాడు. తనంతట తానే పుట్టి పైకి వచ్చినవాడు. నీ వానాడు దక్షిణేశ్వరమునుండి కోపించి తిరిగిపోయితివి. అపుడు తల్లీ! ఈతని యపరాధమును క్షమింపుము అని దేవిని వేడుకొంటిని. ఆ భావావస్థయందే శ్రీరామకృష్ణుడు అధరునిజూచి, 'బాబూ నీ వే నామమును ధ్యానింపదలంతువో ఆయననే ధ్యానింపుము' అని పలికి అధరుని నాలుకపై నేదియో వ్రాసెను.

ఇదియే శాబోలు అధరునకు దీక్ష.

# ధర్మ పరిశీలన

## జీవాత్మ - భగవంతుడు - మతధర్మము

### శ్రీ వివేకానందస్వామి

(గతసంచిక తరువాయి)

పురాతన యుగవాణి నేడు మనకు వినవచ్చుచున్నది. హిమాలయ గుహలందును, నైమిశాది మహారణ్యములందును వసించిన మహర్షుల వాణియే యిది. ఈవాణియే షెమి వంశీయులగు హిబ్రూ, అరబ్ మొదలగు జాతులకును వినవచ్చినది. బుద్ధాది మహానుభావుల ముఖమున వెల్వడినది యీ వాణియే. భూతల సృష్ట్యాదినుండి మానవ హృదయాంతర్గతమైన శాశ్వత దివ్య తేజమందు వసించు మహాత్ముల వాణి ఈనాడుకూడ మనకు వినవచ్చుచున్నది. ఇది పర్వతశిఖరములనుండి ప్రవహించు చిన్న, చిన్న సెలయేళ్లవంటిది. ఈ సెలయేళ్లు మొదట మనకు దృగ్గోచరములై, నాలుగడుగులు ముందుకు బోవ నదృశ్యములై, మఱికొంత దూరమరిగినపిమ్మట జలజల ప్రవహించుచు, కట్టకడకన్నియు నేకమై గంభీరమగు మహానదీ ప్రవాహ రూపమును ధరించుచుండును. ఇట్లే యావత్కులములకును, జాతులకును జెందిన ప్రవక్తలయ్యు పావన స్త్రీ పురుషులయు ముఖమున మనకు నేడు పారంపర్యముగా వచ్చుచున్న సందేశములు తమతమ శక్తులనెల్ల మేళవించి, పూర్వకాల భేరీనినాదాడంబరమునకు సమమైన యుచ్చైస్స్వరముతో మనలను హెచ్చరించుచున్నవి. ఈ వాణి మనకందచేయు ప్రథమ సందేశమేమన మీకును, మతధర్మములన్నిటికిని శాంతి చేకూరునుగాక! ఈ సందేశము పరస్పర వైషమ్యమునుగాక సమరస భావమున నేకీకృతమైన మతధర్మమును బోధించుచున్నది. మున్ముందు మనమీ సందేశమును పరిశీలింతము ఈశతాబ్దారంభమున మతధర్మమే ప్రాయికముగా అంతరించునను భయము పొడమినది. శాస్త్రపరిశోధనల ప్రబల ప్రఘాతములకు తాళజాలక పూర్వకాల ఛాందసములు పింగాణీ సరుకుల వలె తుత్తునియలగుచుండెను. మతమనగా నేవేవో మూఢ విశ్వాసములయు, అర్థములేని కర్మలయు సముదాయముగ పరిగణించినవారు నిరాశావశులై యేమియు బాల్పోక తికమక పడుచుండిరి. సర్వమును వారి చేతులలోనుండి జారిపోవుచుండెను. ఆ సమయమున మున్వెత్తున నుప్పెనవలె పొంగి వచ్చుచుండిన నిరీశ్వరవాదమును, చార్వాకమతమును సర్వమును తుడిచివేయక తప్పదని తోచెను. తమ అభిప్రాయములను వెలిబుచ్చ సాహసింపని వా రెందరో యుండిరి. చాలమంది నిరాశావశులై, మతధర్మమునకు శాశ్వత నాశనము వాటిల్లనుండె నని

తలంచిరి. కాని, ఆ యుప్పెన అలజడి సమసిపోయినది. ఈ సన్నివేశమున కుపకరించిన దేది? సర్వమత పరిశీలన. వివిధమతములను బరిశీలించితిమేని, వస్తుతః అవియన్నియు నొకటే యని మనకు కనుపడును. బాల్యావస్థలో, నన్నీనాస్తికత ఆవహించినది అప్పుడు మతధర్మమందుగల ఆశనెల్ల నేను తప్పక వదులుకొనవలసినట్లు తోచెను. కాని, అదృష్టవశమున నేను క్రైస్తవ, మహమ్మదీయ, బౌద్ధాది మతములను జదివితిని. తత్ఫలితముగ గలిగిన నాయాశ్చర్యమేమని చెప్పుదును! నామతము బోధించిన ప్రాతిపదిక సూత్రములనే సర్వమతములును బోధించినట్లు కనుగొంటిని. ఈ విధముగ నాకు హెచ్చరిక కల్గెను. "సత్యమేమి?" యని ప్రశ్నించుకొంటిని. ఈ ప్రపంచము నిజమా? ఔను. ఎందుచేత? నేను దానిని జూచుచున్నాను కనుక. మనమిప్పుడు వినిన గాత్ర, జంత్రగానము నిజమా? ఔను, మనమా గానమును వింటిమి కనుక అది నిజమే. కనులు, చెవులు గల శరీరము మానవునకు గలదని మనకు తెలియును. మనకగోచరమైన పారమార్థిక స్వభావ మతనికిగలదు. తన యాధ్యాత్మిక శక్తుల సాయముతో, అతడీ వివిధ మతములను జదివి, మతధర్మ ప్రబోధము భారతీయవనములలో గావింపబడినను, నేదేని క్రైస్తవదేశమున జరిగినను, ప్రధానాంశములలో సర్వమతము లొకటేయని గ్రహింపగలడు. ఇందువలన, మతము మానవమానసమునకు వ్యవస్థానుగుణమైన అవసరమని విశదమగును. ఒక మతముయొక్క ఋజువు తక్కినయన్నిమతముల ఋజువుపైన నాధారపడియుండును. ఉదాహరణమునకు, నాకు మాత్రమారువ్రేళ్లుండి, మరియెవరికిగాని లేనిచో, అది యసాధారణమని మీరు న్యాయముగ జెప్పవచ్చును. ఒక మతముమాత్రమే సత్యమైనదనియు, తక్కినవెల్ల అసత్యములనియు నెవరైన జేసెడువాదమున కీ హేతుపద్ధతిని వర్తింపచేయవచ్చును. ఈ ఆరువ్రేళ్ల చేయివలె ఒక మతముమాత్రమే యీ లోకములో నిజమగుట అస్వాభావికము. కనుక, ఒక మతము సత్యమగునెడల, తక్కినవన్నియు సత్యమైనవికాక తప్పదని మనకు విశదము కాగలదు. అప్రధానాంశములలో వానికి పరస్పర భేదములున్నవే కాని, ప్రధానాంశములలో అవియన్నియు నొకటే. నా వ్రేళ్లు యథార్థమయినచో, మీ అయిదువ్రేళ్లుకూడ యథార్థమైనవని అవి ఋజువుచేయును.

(సశేషము)



# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిశరణమ్

ఆల్మోరా,
25-10-'15.

శ్రీమాన్‌ ... ..

బంకూరాజిల్లాలో క్షామవర్ణనమును జదివి నేను మిక్కిలి చింతించితిని. ఆతడు తన యుత్తరమునందు ఈ క్షామము ఘోరదశను విపులముగ వివరించి వ్రాసియున్నాడు. ఇట్టి సమయమున క్షామపీడితులకు మీవలననైనంతవఱకు సహాయము గావించి నీ జీవితమును కృతార్థము గావించుకొనక నీ విట్లు విరమింపజూచుటయే నీ బుద్ధివైపరీత్యము నాకు స్ఫురింపజేయుచున్నది. ఆ విషయమును నేను జదివి ఆశ్చర్యపడి యెంతయో దుఃఖించితిని. ఈ కార్యము నుండి నిన్ను వదలించి యాశీర్వదింప వ్రాసియున్నావు. కాని ఈ పనినుండి నిన్ను వదలించిన నిక నేపని చేయుదువు? ఈశ్వర సేవయా? 'జీవుని ప్రేమింపగలవాడే భగవత్సేవ కావింపగల'డని శ్రీ వివేకానందస్వాములవారు పలికిన పలుకులు మఱచితివా? శ్రీ వివేకానంద స్వాములవారు నీకు ముక్తిమార్గము నింతటి సుకరము గావించియుండియు దానినంతయు నింతలో మఱచితివే! 'విభిన్నరూపములతో భగవానుడు నీ సమక్షమున నుండ నాతని నెందు వెదకెదవు?' 'నకర్మణా మనారంభా నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే. గీత-3-4. పురుషుడు కర్మముల నాచరింపకుండ నైష్కర్మ్యమును బడయజాలడు.' ఈ పలుకులను తలపునకు దెచ్చుకొనుము. కర్మము చేయకయే యందుండి యెట్లు విముక్తి బడయగలవు? ఇట్టి విపరీతబుద్ధికి లోనై సోమరితనము నాశ్రయించి తమోగుణమునకు వశవర్తివిగా బ్రయత్నింపవలదు. దీనికిమీఱు నీ వోపినంతవఱకు పనిచేసి—యనవేల?—పూజచేసి—ఏలయన భగవత్సేవ పనికాదు, అది యథార్థమగుపూజ—ఇట్టి నిజమైన భగవదారాధన గావించి నిన్ను కృతార్థునిగా జేసికొనుము. ఇట్టి అవకాశ మెన్నడును లభింపదను పలుకు తథ్యము. విశేషము లేవియు లేవు.

ఇట్లు,
శ్రీ తురీయానంద

---

శ్రీహరిశరణమ్

ఆల్మోరా,
3-11-15.

శ్రీమాన్‌ ......

అచ్చట భోజనమునకు చాల ఇబ్బందిగా నుండెనని విని చాల చింతించితిని. భగవత్సంకల్ప మాయనకే యెఱుక. అయినను మీరు మీకు వీలగునంతవఱకు లోటులేకుండ సహజస్వభావము కలిగి కార్యము నిర్వర్తింపుడు. మీ యుక్తియు తర్కమును నా కంతగా నచ్చినవికావు. ప్రతి కార్యమునకును ఆ యుక్తి

సరిపడియుండవలయును. 'Cut the coat according to the cloth—బట్టకు తగినట్లు చొక్కాను (కత్తిరించి) తయారుచేయుము.' అను పలుకు వినియుంటివి కావా? నీయొద్ద నున్న ధనము ననుసరించి దానమొనర్పవల యును. ఇవి అన్యథా జరుగనేరవు. కాని ఆ దానము శ్రద్ధతో—సుహృద్భావముతో—గూడినదా కాదా యను విషయము దాన కాలముననే గోచరింపగలదు. ఉద్యోగశాలల యందు జీవనార్థము పాటుపడువారివలె మీ రెవరికినీ నౌకరులు గారు. మీరు ధర్మార్థము ధర్మము నొనర్చుచున్నారన్న విషయమును మఱువకుడు. మీ పెద్దలుగూడ ఆదాయము ననుసరించి వ్యయ మొనర్పవలసినవారే. వలయు నంత ధనము వారియెడ లేనిచో నేమిచేయుట? కావున మీరును మీకు లభించిన ధనము నను సరించి వ్యయము చేయుడు. అం దావంతయు దోషములేదు. మనోభావమునందే తప్పు. ఉన్న దంతయు అన్నపూర్ణ భాండాగారమే యని తెలిసికొనగలుగుటయే చరితార్థత. లేనిదానిని (శూన్యమును) గూర్చి విచారించుట నిష్ఫ లము.

ఒకానొకప్పు డొకానొక సేనాని కుమారుడు తండ్రిని సమీపించి, 'నాయనా! నీవిచ్చిన ఖడ్గము పొట్టిది. కావుననే శత్రువధ కావింప జాలకపోయితిని' అని పలికెను. అందులకు తండ్రి, 'Add a step to it—దానితోబాటు ఒక అడుగు జేర్పుము' అని పలికెనట. ఇదియే సరియైన యుపదేశము. ప్రపంచమున పుత్రు లడిగినవాని నెల్ల తండ్రు లొసగగలరా? కళా కౌశలముగల దిట్టి పాచికలు వక్రములయినను తనయెత్తు ఫలింపజేసికొని, గెలుపొందగలడు. భగవానుని సంకల్పమును, హృదయమును దెలియగలవాడెనడు విదురుడొసగిన నూకలగం జిని సేవించియాతని భార్య హస్తములనున్న అరటిపండ్ల తొక్కలుగూడ శ్రీకృష్ణు డార గించెనని పెద్దలు వచింతురు. ఈ ప్రసిద్ధవిషయ మెల్లరు నెఱుగుదురు. ఎల్లరును తమలో తాము చెప్పికొనుచుందురు. ఎట్లయినను సద్భా వముతో భగవద్విషయమున సంపూర్ణముగా విలీనుడై తన కర్తవ్యమును నెఱవేర్చుచుండ వలయును. అప్పుడే ఫలసిద్ధి. కాని యితరుల కార్యకలాపమును లక్షింప నవసరములేదు. నీ కార్యమును నీవే పరిశీలించుకొనవలయును. నీవు మంచివాడవయినచో ప్రపంచమంతయు మంచిదే యగుననుమాట సత్యము.

ఇట్లు,
శుభాశీర్వచనములతో,
శ్రీ తురీయానంద



శ్రీ కృష్ణాయనమః

# ప్రపంచమనుసరింపదగినది బౌద్ధమత మొక్కటియేనా?

### శ్రీ కృష్ణదాసు బుద్ధప్రియులు

[కొన్నాళ్ల క్రితము డాక్టరు B. R అంభేద్కర్‌గారు మహాబోధిపత్రిక వైశాఖ సంచికయందు 'బుద్ధుడు—భవిష్యత్తున ఆతని ధర్మము' అను వ్యాసమును రచించి యుండిరి అందుగల ప్రశ్నలు కొన్నింటికి శ్రీ కృష్ణదాసు బుద్ధప్రియులు ఒసగిన ప్రత్యుత్తరము లిచ్చుట ప్రచురింప బడుచున్నవి. సంపాదకులు ]

(గతసంచిక తరువాయి)

బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులను సాంఘిక చాతుర్వర్ణ్యవిభజన గీతలో కేవల నూతనకల్పితమైన భావముకాదు. మహాభారత మందలి యితరభాగములలోకూడ, దీని ప్రస్తావన మనకు గనుపడును. అందొకచోట, పంచమ వర్ణము నిష్కర్షగా నిరాకరింపబడియున్నది. గీతకు పూర్వము విరచితములైన గ్రంథములలోగూడ, ఈ భావమే కొంతవరకు అంగీకరింపబడినట్లు మనకు విశదమగును. ఇందుల కుదాహరణముగ, అధర్వవేదము 5-17-9 లోను, ఐతరేయబ్రాహ్మణము 2-19 లోను అంతర్వర్ణ వివాహములను గురించి ప్రస్తావింపబడినది. అతిప్రాచీనకాలములలో, బ్రహ్మ, క్షత్రియ, వైశ్యజాతులందు సహపంక్తిభోజనము విరివిగా ప్రబలియుండెను సూత్రయుగములో, శూద్రులు వండిన ఆహారమును భుజించుటకు, తక్కిన త్రివర్ణములవారి కెట్టి యాక్షేపణయు లేకుండెను. బ్రాహ్మణ శిష్యులకు క్షత్రియులు మహోన్నత మతమును బోధించినట్లు ఉపనిషత్తులు చెప్పుచున్నవి. కవషుడను శూద్రుని, విశ్వామిత్రుడు, గ్రిత్సమదుడు మున్నగు మునీంద్రులు లోక ఋషిగ "నమస్తే అస్తు త్వం వైనః శ్రేష్ఠోసి (నీకు నమస్కారము, మాకు నీవు శ్రేష్ఠుడవు") అను ఆమోద వాక్యములతో అంగీకరించినట్లు, ఐతరేయ, కౌషితకి బ్రాహ్మణములలో దెలుపబడినది. భలందనుడను వైశ్యుని కుమారుడు వత్సప్రి, బ్రాహ్మణుడును, మంత్రకృతుడు నైనట్లు మత్స్యపురాణము చెప్పుచున్నది. ఒకేకుటుంబములో వివిధవృత్తులుగలవారు జన్మించినట్లు ఋగ్వేదశ్లోకమొకటి తెలుపుచున్నది. యజ్ఞదీక్ష బ్రాహ్మణత్వ మొసంగెనని, శతపథ, ఐతరేయ బ్రాహ్మణములలో గలదు.

ఋగ్వేదములో, "బ్రాహ్మణ" శబ్దము 8 సార్లు మాత్రమే కనుపడుచుండ, ఋషియను నర్థములో, గురువను నర్థములో "బ్రహ్మన్" శబ్దము 46 సార్లు వచ్చును. ఋగ్వేదము 10-62-10 లో ఆర్యులైన యదు కులులును, తుర్వసులును దాసులుగ భావింపబడిరి. ఋగ్వేదము 1-101-5, 1-175-3,

3-34-9 లనుబట్టి యే వ్రతమునులేని జనులు మాత్రమే దశ్యులని మన మూహింపవచ్చును. వర్ణ, వ్రత, వర్ణిన్ శబ్దములొకే మూలపదము నుండి ఉత్పత్తియైనవి. ఈ విషయమునుబట్టి, ఒకానొక నిర్దిష్ట జీవితధర్మ మవలంబించుచు వివాహ, ఉపనయన, యజ్ఞముల మూలమున మహోన్నత వైజ్ఞానిక ప్రమాణానుగుణముగ ప్రవర్తించుచుండిన భగవదారాధకుల కులము మాత్రమే ఆర్యవర్ణమై యుండినట్లు మన మూహించుటలో తప్పులేదు. ఐతరేయ బ్రాహ్మణము 7-32 ను, శతపథబ్రాహ్మణము 13-4-1-2 ను బట్టి, యజ్ఞములో బాల్గొనవలయుననిన, క్షత్రియుడు తాత్కాలికముగ బ్రాహ్మణుడై యుండవలసివచ్చెడిది. విశ్వపరిణతికి కారణ భూతమైన యజ్ఞ ధర్మ ప్రచారమునకై, కర్మ విభాగాధారముపైని చాతుర్వర్ణ్యసంస్థ యేర్ప డినట్లు విష్ణుపురాణము 1-6 తెలుపుచున్నది. పారమార్థికాతిశయమువలననే యెవడైనను బ్రాహ్మణుడగుచున్నాడని, లౌకికవృత్తులను బట్టి జాతులేర్పడుచున్నవని వచించు 18-42 వంటి గీతాశ్లోకములను బోలిన ఘట్టము లనేకము విష్ణుపురాణములో గలవు. ఉన్నతతర మైన పారమార్థిక విజ్ఞానమువలననే, యెవడైనను ఋషి కాగలుగుచున్నాడను ప్రాచీన భావమున కిది సహజపరిణామరూపము. బృహదారణ్యకోపనిషత్తును, మహాభారతమునుబట్టి ప్రారంభమందొక బ్రాహ్మణవర్ణము మాత్ర ముండెను. ఈ విషయములన్నిటివలనను, కొంత మంది ఆర్యనాయకుల యభిప్రాయానుగుణ ముగ, గుణ, శీలములనుబట్టి వివిధవర్ణము లేర్పడినవను గట్టినమ్మకము బహుప్రాచీన యుగములనుండి జనబాహుళ్యములో ప్రబలి యుండినట్లు సుస్పష్టమగుచున్నది

సాంఖ్యదర్శన గుణసిద్ధాంతము నూతగా గొని చాతుర్వర్ణ్య సంస్థను సమర్థించుటలోనే, శ్రీకృష్ణుని అపూర్వ కల్పనాశక్తి వ్యక్తమగు చున్నదని వాదించుట సమంజసముకాదు. తన యుపదేశానుసారముగ అదివరకే జనామోదము మును బడసిన వర్ణభావమును బలపరచుటలో కాక, తనకాలమందు ప్రబలియుండిన సాంఖ్య, యోగ, వేదాంత, ధర్మభావములకు సామరస్య మేర్పరచుటలోనే శ్రీకృష్ణుని యపూర్వ సామర్థ్యము గోచరించుచున్నది.

బౌద్ధమతము వర్ణవ్యవస్థను నాశనముచేయ లేకపోయెను, నాశనము చేసియే యుండినచో, ఇన్ని శతాబ్దము లది నిలిచియుండెడిదికాదు. చాతుర్వర్ణ విధాన మూలకందమును నిర్మూలించుటకుగాని, నిజానుచరుల నీతిప్రమాణమును క్రైస్తవ, హిందూ, మహమ్మదీయ మతావలంబుల నీతికంటె నిసుమంతయు శ్రేష్ఠతరముగ జేయుటకుగాని బౌద్ధమతమునకు శక్తి లేకపోయెను.

అహింసా సిద్ధాంతము, బౌద్ధమతము క్రొత్తగా కనిపెట్టినదికాదు. బహుప్రాచీనములైన ఉపనిషత్తులయందుకూడ ఏదో యొక రూపమున ఈ సిద్ధాంతము మనకు కానవచ్చుచున్నది. ఏ చారిత్రకయుగమునందును, హిందువులు బౌద్ధమతప్రాబల్యమునకు లోనై హింసను విడనాడలేదు. బుద్ధునకుపూర్వమున గూడ, కొంతమంది హిందువులు మాంసాహారమును మానివైచిరి. అహింసా సిద్ధాంత ప్రచారమెంత జరిగినను, బుద్ధుని తరువాత బౌద్ధమత మవలంబించిన యావజ్జాతులవారును నేటికి కూడ మాంసాహారులే. చీనా, జపాను, బర్మా, సింహళదేశములందలి బౌద్ధులు చాలమంది బౌద్ధమతము తమకు ప్రయోజనకారి కాలేక పోయెనని గ్రహించి ఇస్లాము, క్రైస్తవమతములను స్వీకరించిరి. (సశేషము)

# పూ ర్ణ మా న వు డు

శ్రీ పిన్నింటి సుబ్బారావు

## మానవు డనగా నెవరు ?

ప్రపంచమునందలి మేధావులందరును, మానవుడు చనిపోయిన పిమ్మట ఆత డెచ్చటికి బోవును అని తర్కించిరి. హిందూ వేదాంత శాస్త్రప్రకారము ఈ ప్రపంచమందలి సమష్టి తత్వ మేది యని విచారించి ఎట్లు ఒక మట్టి ముద్దను పరిశీలించిన, ప్రపంచమునందలి సమస్త మృత్పదార్థముయొక్క తత్వము తెలియబడునో, యా రీతిగా, దేని తత్వమును దెలిసిన సమస్తమును దెలియబడునో, యా సమష్టి తత్వమును పరిశీలించుచు ఈ ప్రపంచమునందలి సమస్త పదార్థములు, ఘన, ద్రవ, వాయు, నామ, రూప, సూర్య, చంద్రాది సమస్త స్వరూపములును, ఆకాశమను తత్వముయొక్క వివిధ పరిణామములని నిర్ధారణ చేసిరి.

ఈ ఆకాశముతో బాటు, ఆకర్షణ, భావము అను వేరువేరు నామములతో బరగుచున్న, సర్వశక్తిస్వరూపము మిళితమై, సృష్ట్యారంభమున, ఈ విశ్వశక్తి ఆకాశమునందు నిద్రించి, అనంతరము, ఈ శక్తిచే, యాకాశమునందు చైతన్యము గలిగి, ఈ ద్వివిధ తత్వ సమ్మేళనముచే ఈ సమస్తమును ఉద్భవించి, ప్రళయ కాలమునందు ఈ సమస్త పదార్థములు, ఘన పదార్థములు ద్రవపదార్థములుగను, ద్రవములు వాయుపదార్థములుగను, వాయుపదార్థములు ఉష్ణప్రవాహములుగను, అవి మఱల ఆకాశ తత్వమునందును, ఆకర్షణ, విద్వేషణ, చైతన్య శక్తులన్నియును, ప్రాణమునందును లయము గాంచుచు, ఈ రీతిగా, సమస్త చైతన్యములు శక్తియొక్కయు, సమస్త ఆకారములు ఆకాశముయొక్కయు, వివిధరూపములనియు నిర్ధారణచేసిరి.

ఇట్లు సృష్టి యావత్తును, ఆకాశము, శక్తి యను రెండు పదార్థములచే గావింపబడుచున్నది. కాని ఏ యొక్క పదార్థమును దెలిసిన ఈ సమస్తమును దెలియబడునో, యా ఏకతత్వ నిర్ణయ మింతతో పరిష్కారము గానేరదు. ఈ ఆకాశ శక్తితత్వములను, వాని మూలపదార్థమున కన్వేషించి, మహత్తు లేక మనస్సు అను నొక ప్రధానకారణమును కనుగొనిరి. ఇట్లు మనస్సు లేక విశ్వభావనాశక్తియే ఈ ఆకాశ శక్తిస్వరూపములుగా మారి ఈ సమస్తమును గలిగించుచున్నవని తేల్చి ఈ సమస్తమునకు విశ్వమనస్సే విశ్వభావనాశక్తియే మూలకారణమని నిర్ణయించిరి.

మన మొక వస్తువును గాంచునపుడు, బహిర్చక్షువు, అంతర్చక్షువునకును, అది మనస్సునకును, మనస్సు బుద్ధికిని ఆ స్పర్శజ్ఞానమును అందచేయగా, బుద్ధీంద్రియము దానిని నిర్ధారణచేయును. ఛాయాగ్రహణ యంత్రమును పరిశీలించగా, వివిధ కాంతికిరణములను, ఫోటో యంత్రము సమ్మేళనముగావించి, యా ఛాయను

నిలుకడగానున్న యద్దముపై చిత్రింపచేయు చున్నది. ఈ యద్దము నిలుకడగా లేనిచో, ఛాయాగ్రహణము సంభవింపనేరదు. ఆ రీతి గనే బుద్ధిభావమును నిశ్చయించునపుడు, దాని వెనుక నిలుకడగానున్న మఱియొక తత్వముండి తీరవలయును. ఈ తత్వమునే మానవుని ఆత్మ యని వేదాంతులు సిద్ధాంతపరచిరి.

మానవుని మనస్సున కతీతమై ఎట్లు ఆత్మ గలదో, యదేరీతిగా, ఆకాశ, శక్తి తత్వముల రూపముగా ఉన్న విశ్వమనోశక్తి కతీతముగా మానవుని యాత్మవలె విశ్వాత్మ గలదు. దానినే భగవంతుడని పిల్చుచున్నారు. విశ్వాత్మ లేక భగవంతుడే, ఆకాశ, శక్తి, ప్రపంచరూపముగా పరిణమించినట్లు, మానవుని దేహమునకు మనస్సును, మనస్సునకు ఆత్మయు పరంపర కారణ భూతములగుచున్నవి. బాహ్యశరీరమునకావల సూక్ష్మశరీరమును, దాని కతీతముగా ఆత్మయు గలవనియు, ఈ ఆత్మ స్థూల, సూక్ష్మశరీరముల కతీతమనియు గ్రహించవలయును. ఈ ఆత్మ తత్వమునుగూర్చి భిన్నాభిప్రాయములు గలవు.

ఈ ఆత్మ శరీరమునకును, మనస్సునకును అతీతమగుటచే, మరణానంతరము, శరీరము నశించినను,ఆత్మనశింపనేరదని ద్వైతులు వచింతురు ఏలయన, మరణమన, వివిధపదార్థములచే నేర్పడిన, యీనామ, రూపములు, మూల పదార్థములయందు గలియుట. ఆకాశము, ప్రాణశక్తుల కతీతమైయున్న యీయాత్మ, మూలపదార్థములచే నిర్మింపబడలేదు గాన మరణసమయమున దీనికి నాశనములేదు. మరణానంతరము, శరీరమందలి వివిధశక్తులు మనస్సునందును, మనస్సు ప్రాణమునందును, ప్రాణము, ఆత్మయందును లయించి, యీఆత్మ తన సంస్కారములతో, సూక్ష్మదేహమును దాల్చి బహిర్గతమగును. సముద్రమునందలి తరంగములవలె, మానససముద్రమునందు, మన భావములయొక్కయు, చేష్టలయొక్కయు, బీజములు నిల్చియుండును. ఈ బీజములనే సంస్కారములని యందుము. మరణానంతరము, ఆత్మ సూక్ష్మదేహధారియై యీవివిధ సంస్కారముల సమిష్టితత్వము ననుసరించి, భవిష్య జ్జీవితమును దాల్చుచుండును.

మరణానంతరము ఈ ఆత్మకు మూడు స్థితులుగలవు ఆధ్యాత్మికజ్ఞాన సంపన్నుడు, మరణానంతరము సూర్యకిరణములద్వారా సూర్యలోకమును, పిమ్మట చంద్రలోకమును, పిమ్మట విద్యుల్లోకమును చేరును. అచ్చటికి ఒక సిద్ధపురుషుడు వచ్చి, యీ ఆత్మను బ్రహ్మ లోకమునకు దీసికొనిపోవును. అచ్చట ఈ ఆత్మ సర్వశక్తిత్వ సర్వజ్ఞాన లాభములను పొంది, ప్రళయకాలమునందు విశ్వరూపమును దాల్చును. కొందరు స్వార్థపరులు, పుణ్యకర్మలను ఆచరించి, సమస్త స్వర్గములకు నిలయమగు చంద్రమండలమును జొచ్చి, దివ్యదేహములనుదాల్చి, పుణ్యకర్మల ఫలితముల ననుసరించి స్వర్గసుఖముల ననుభవించి, యది క్షీణించినవెంటనే పూర్వకర్మానుసారముగ, వాయువుద్వారా మేఘములయందును, పిమ్మట వర్షబిందువులద్వారా, భూమియందలి యాహారపదార్థములయందునుబడి, వానిని మానవులు భుజించుటచే, మఱల జన్మించుచున్నారు. భూలోకములో పాపపు కర్మ నెక్కుడుగా చేయువారు, భూతములు, దయ్యములరూపమును దాల్చి, యందు కొందరు, మానవుల కుపకారమును, మఱికొందఱి అపకారమును గావించుచు ఆపాపకర్మ తీరినతోడనే, భూలోకములో పశుజన్మలను దాల్చి, పిమ్మట, బాగు

పడుదమను ఉద్దేశముతో, మఱల మానవ జన్మమును ధరించుచుందురు. ఈ రీతిగా, ఈ భూలోకము కర్మభూమి యనబంగుచున్నది. స్వర్గలోకమునకును పాపలోకమునకును బోయిన వారు మఱల వారి జన్మరాహిత్యమునకై యీ లోకమున జన్మింపవలసి యుందురు ఎక్కువ పాపమునుగాని, ఎక్కువ పుణ్యమునుగాని చేసినవారు వారిఫలితమును వెంటనే యనుభవించుచుందురు. ఈ మార్గములకే దేవయానము పితృయానము అని పేర్లుగలవు.

వేదాంతశాస్త్రము, మానవజన్మ సమస్త జన్మలయందును, గొప్ప జన్మయనియు, ఈ భూలోకము, సమస్తలోకములకంటెను గొప్ప లోకమనియు చెప్పుచున్నది. మిగిలిన లోకములందువా! కర్మలఫలితమును అనుభవించుటయే కాని, తరించుమార్గ మాలోకములయందు లేదు. పరిపూర్ణత్వమును కాంచుటకు భూలోకవాసమే పునాది.

బౌద్ధులు ఆత్మ యను వేఱుపదార్థము లేదనియు, సృష్టి యనునది గుణముల సముదాయమువలననే జరుగుచున్నదనియు చెప్పుచున్నారు. మార్పును గ్రహించుటకు, మార్పులేని వస్తువొకటి యున్ననాడుగాని వలనుపడదు. సుఖమును మొదట గ్రహించినగాని దుఃఖముయొక్క బరువు తెలియబడనేరదు. ఆ రీతిగనే ఈ మార్పులేని వస్తువు ఉన్నగాని ఈ నామరూపాత్మకమగు జగత్తుయొక్క వివిధమార్పులు గోచరింపనేరవు. ఈ ప్రపంచమునందు మార్పును గలదు, మార్పులేని స్థితియు గలదు. శరీరము, మనస్సు, ఆత్మ ఈ మూడును వేరువేరు రూపములుగావు. శరీరమును గాంచువారలకు ఆత్మ, మనస్సు గానబడవు. ఆత్మను గాంచువారలకు మిగిలిన రెండును గానబడవు. త్రాడును గాంచునపుడు పాము గానబడదు. పామును గాంచునపుడు త్రాడు గానబడదు, ఉన్నదంతయు ఒక్కటే. సముద్రమునకును తరంగమునకును వ్యత్యాసము నామరూపములే సూర్యుడు వివిధ జలబిందువులయందు వేరువేరుగా గానబడుచున్నను, ఆ భాస్కరు డొక్కడే. ఆ రీతిగనే వివిధ ఉపాధులయందొక్క ఆత్మయే గానబడుచున్నాడనియు, నీవు, నేను అని వేరుగా లేవనియు, ఏదో ఒక్కటే గలదనియు, అజ్ఞానముచే వేరువేరుగా అంతయును గానబడుచున్నదనియు, జ్ఞానము గలిగిన పిదప, నేనే ఈ వివిధ నామ, రూపములుగా పరిణమించుచున్నదనియు గ్రహించగలడు. అందుచే ఆత్మ ఒక్కడే యనియు, ఆతడు పవిత్రుడు, పరిపూర్ణుడు, రూపరహితుడనియు, ఈ నామరూపములు అసత్యములనియు గ్రహింపవలయును.

(సశేషము)

# విరామము

శ్రీ సోమరాజుపల్లి చెంచయ్య

నేటి మానవసమాజమునందు పెక్కుమంది తమతమ దైనందిన వ్యాపారముల మూలమున భగవన్నామస్మరణ జేయుటకు సైతము విరామము లేదనుచుందురు. ఏదేని కొంచెము విరామమున్నను వారివారి దైనిక వ్యాపారాది విషయములనుగూర్చి సంభాషించుకొనుటతో శేషించిన కాలము సైతము సరిపోవుచుండును. ఉదరపోషణార్థమైన యెట్టి సమస్యలుగాని లేని విద్యార్థులు సైతము తమతమ పాఠ్యగ్రంథములను చదువుటకే, తగిన విరామము లేదనుచుందురు. కాని యీ ప్రపంచమునందలి వివిధ జీవరాసులయొక్క జీవయాత్ర వాయుపీడనాయుతమైన వర్షపుదినము నాటి ప్రయాణమువలె ప్రయాసకరమైనది. ఇట్టి కష్టభూయిష్టమైన జీవయాత్రజేయు మానవులు బురదనేలను జను పాంథుడు మాటిమాటికి కాలుజారి క్రిందబడుచు లేచుచు బోవుచందమున వివిధ కష్టములను అనుభవించుచు, అట్టి తరినొక్కొక్కసమయమునందు తమయొక్క జీవితమును సైతము రోయుచు, మరల అంధపరంపరాన్యాయమున కష్టభూయిష్టమైన సంసారజీవితమును వాంఛింతురేగాని భగవదారాధకులు గాజాలకున్నారు. ఇట్టి కష్టభూయిష్టమైన గృహస్థ జీవనులకు కేవలము రెండు నిముసములు భగవదారాధన జేయుటకే వలనుపడకున్నది. హితకాము లెవరైన జీవిత సాఫల్యమునకై భగవదారాధన జేయుడని ప్రేరేచిన మాకిపుడు దీరిక లేదనియు, వార్థక్యమున నిర్వ్యాపారులమై యుందుముగాన నపుడు యథేచ్ఛముగా జీవితసార్థక్యమునకై భగవన్నామస్మరణ జేయుదుమందురేకాని మానవజీవితము చిత్తజల్లులవోలె క్షణికమైనదని గుర్తింపనేరరు. మానవజీవితమును గూర్చి భర్తృహరి మహాశయుడు ఇట్లు చెప్పియున్నాడు

శ్లో. ఆదిత్యస్య గతాగతైరహరహ
స్సంక్షీయతే జీవితం
వ్యాపారైర్బహుకార్యభారగురుభిః
కాలో న విజ్ఞాయతే
దృష్ట్వా జన్మ జరావిపత్తి మరణం
త్రాసశ్చ నోత్పద్యతే
పీత్వా మోహమయీం ప్రమాదమదిరా
మున్మత్తభూతం జగత్.

శ్లో. రాత్రిస్సైవ పునస్స ఏవ దివసో
మత్వా ముధా జంతవో
ధావంత్యుద్యమినస్తథైవ నిభృత
ప్రారబ్ధతత్తత్క్రియాః
వ్యాపారైః పునరుక్తభుక్తవిషయై
రేవంవిధే నాముసా
సంసారేణ కదర్థితా వయమహో
మోహాన్న లజ్జామహే.

శ్లో॥ ఆయుర్వర్ష శతం నృణాం పరిమితం
రాత్రౌ తదర్థం గతం
తస్యార్థస్య పరస్య చార్థ మపరం
బాలత్వ వృద్ధత్వయోః
శేషం వ్యాధి వియోగదుఃఖ సహితం
సేవాది భిర్నీయతే
జీవేవారి తరంగ చంచలతరే
సౌఖ్యం కుతః ప్రాణినామ్

—భర్తృహరి.

ఇట్టి అస్థిరమైన జీవితమునం దెప్పుడో తనకు తీరిక లభించుననుకొనుట వెఱ్ఱితనముగదా! అట్టి స్వల్పవిరామము కొందరికి లభించినను గత జీవితానుభవములనుగూర్చి తలపోయుట తోడను, జరాభారమువలన గలిగెడి దుర్గంతాదుల ననుభవించుటతోడను జీవయాత్ర సమాప్తి యగునేగాని విరామమనునది ఇనుమంతయైన నుండజాలదు. మానవుడు భావికాలమునందు తనకు విరామములభించుననుకొనుట—పరీక్షా నిర్ణీతకాల మింకను చాల గలదని పాఠ్యగ్రంథములను జదువ నుపేక్షించెడి విద్యార్థివలె విఫలుడగునేగాని సఫలుడు గాజాలడు. అందుచేతనే పరమ భాగవతోత్తముడైన ప్రహ్లాదుడు "చేతులారంగ శివుని బూజింపడేని, నోరు నొవ్వంగ హరికీర్తి నుడువడేని, దయయు సత్యంబు లోనుగా దలపడేని కలుగ నేటికి తల్లులకడుపుచేటు" అని చెప్పియున్నాడు. మఱియు భావికాలమున తనకు విరామము లభించునని తలచు మానవుడు మృగతృష్ణయందలి జలమునుగాంచి పానీయ జలమును పారబోసికొను పాంథునివలె జీవితాంతమునందు విచారింపవలసియుండును. అన్నిటికిని ఈ మానవజన్మము కడసారి జన్మమని తెలిసియుండియు తరణోపాయమునకై వెదకుకొనకుండుట అవివేకము గదా!

మఱియు

శ్లో॥ "యావత్స్వస్థమిదం శరీర మరుజం
యావజ్జరా దూరతో
యావచ్చేంద్రియ శక్తి రప్రతిహతా
యావత్క్షయో నాయుషః
ఆత్మశ్రేయసి తావదేవ విదుషా
కార్యః ప్రయత్నో మహాన్
సందీప్తే భవనే తు కూపఖననం
ప్రత్యుద్యమః కీదృశః"

అని భర్తృహరి యోగిపుంగవుడు చెప్పినట్లు ఆయురారోగ్యములు పుష్కలముగా నున్నప్పుడే, జరాభారాదుల బాధ లేని యావ్వన జీవితమునందే జీవితసార్థక్యమునకై ప్రయత్నించెదరుగాక! మానవునకు సృష్టియందు ఏర్పరుపబడియుండెడి బాల్యాది దశలవలె విరామమనునది యొకటి భావి జీవితమునందు ప్రత్యేకముగా నుండనేరదని గుర్తించెదరుగాక! దీపముండగనే యింటిని జక్కబరచుకొనుట బుద్ధిమంతుల లక్షణము.

# వి న య ప త్రి క

మూలం:
శ్రీ తులసీదాస గోస్వామి

అనువాదం:
క్రాంతికర్

(గతసంచిక తరువాయి)

## ౧౦౬

ఓ ప్రపంచమా!

ఇపుడు నేను నిన్ను గుర్తించితిని. నీవు సాక్షాత్తు కపటమునకు పుట్టినిల్లవు. కాని నీవు నన్ను మోసగింపజాలవు. నాకు భగవానుని యండ గలదు. నీవు పైకి జూచుటకు ఎంతో మనోహరముగ నుందువు. కాకున్న సరిగ నాలోచించిన నీలో నున్న దేమియు లేదు. అరటి బోదెలో నెంత వెదకినను సారపదార్థము గన్పించదు గదా! నీకొఱకై నేనెన్నో జన్మము లెత్తితిని. అయినను నీయంతు కనుగొనలేక పోతిని. నీవు నన్ను మహామోహమనెడు నెండ మావిలో నెన్నోమారులు తానమాడించితివి. కాని ఓ ప్రపంచమా! వినుము. నీవు కోటి మాయలు పన్నినను భగవంతుని భక్తుడు నీకు వశుడగువాడు గాడు. ఇక నీవు సపరివారముగ నెచట శ్రీకృష్ణుని యునికి గనరాదో యట్టి హృదయమున నివసింపుము. నీ రహస్యము నెఱుగనివారియెదుట నభినయింపుము. అట్టి వారే రజ్జువునెడ సర్పభ్రాంతిగలిగి భయపడి చత్తురు.

ఓ దుష్టప్రపంచమా! నీ మేలునకై చెప్పుచున్నాను. సపరివారముగ మేలొందదలతువేని నా యుపదేశ మాలింపుము. మొండిపట్టు వీడుము. తులసీదాసు చెప్పునదేమన—ప్రభు భక్తులను విడచి, యహంకార కామముల కాశ్రయులైనవారి నాశ్రయింపుము.

## ౧౦౭

ఓ మనసా!

సమయము చేజారినవెనుక పశ్చాత్తాప పడెదవు. దుర్లభమగు మనుష్యశరీరమును బొంది, మనోవాక్కర్మల శ్రీరామచంద్రుని చరణముల భజింపుము. వేయిచేతులు గల కార్తవీర్యుడు, పది తలలుగల రావణుడుగూడ బలవంతమగు మృత్యువును దప్పించుకొనజాలక పోయిరి. 'మేము మేము' అనెడు భావమున ధన ధామముల గూడబెట్టినవారెందఱో అంతిమకాలమున రిక్తహస్తములతోనే ప్రపంచమును విడచిపోయిరి. దారాపుత్రులు స్వార్థ ప్రేరకులని యెఱిగి వారిని ప్రేమించుట మానుము. ఓ నీచుడా! వీరెటులను చనిపోయిన వెనుక నిన్ను విడచువారే! నీవే యిప్పటి నుండియు వారి నేల విడువవు? ఓ మూర్ఖుడా! ఇపుడు అజ్ఞానమను నిద్రనుండి మేల్కొనుము. నీ ప్రభువగు శ్రీరామచంద్రుని ప్రేమింపుము. హృదయమున దురాశను త్యజింపుము. తులసీదాసు చెప్పునదేమన—కామాగ్ని విషయ

భోగములనెడు ఘృతముతో నెప్పుడును ఉపశమింపదు.

## ౧౦౮

ఓ మూర్ఖ మనసా!

నీ విటునటు ఏల దిరిగెదవు? శ్రీరామచరణకమలామృతరసమును వీడి ఎండమావులకై యేల యత్నులు జూచెదవు? పశువులు, పక్షులు, దేవతలు, మనుష్యులు—ఇంకను నెన్నియో యోనులందు జన్మించితివి. ఎందఱో భార్యలను, పుత్రులను, సోదరులను, గృహములను, జన్మకారకులగు తల్లిదండ్రులను బొందితివి. కాని వీరెల్లరు ఎల్లపుడు నరకసమూహమున దిరుగాడు విద్యలనే నీ కుపదేశించిరి. కల్యాణకారియు, జననమరణరహితము నగు మార్గము నెవరును జూపలేదు. నీ వెన్నోవిధముల మోసగింపబడియుండినను ఇంకను విషయోపభోగముల ప్రాప్తికై యత్నించుచున్నావు. కాని ఓ దుష్టుడా! కామాగ్ని విషయోపభోగమనెడు ఘృతముచే నారదని యెఱుగవా? ఇంతియేగాక కోరిన సుఖములు ప్రాప్తింపమి దుఃఖమనుభవింపవలసివచ్చెను. ఎంతయో ఆపద సహింపవలసివచ్చెను. సుఖమును స్వప్నమందైనను బొందవైతివి. కనుకనే వేదములు—ప్రాప్తించినను ప్రాప్తింపకున్నను—ధనము ప్రేతాగ్నివలె కష్టప్రదమని దెల్పినవి. నీ జీవితము ప్రతిక్షణము క్షీణించిపోవుచున్నది. దుర్లభమగు నరదేహమును వ్యర్థపుచ్చితివి. తులసీదాసు చెప్పునదేమన—ఇప్పటికైనను ప్రాపంచిక యాశలను వీడి భగవంతుని భజింపుము. ఏలనన, కాలమనెడు సర్పము ప్రపంచమును కబళించుచున్నది.

## ౧౦౯

ఓ జీవా!

ఈ శరీరము శాశ్వతమనునట్లు వ్యవహరించుచున్నావు. తలపై మృత్యువఘోషించియున్నదని ఎఱుగవైతివి ఈశ్వరు నొక్కసారిగా మరచిపోయితివి. భూమి, భార్య, గృహము, ధనము, మిత్రులు, పుత్రులు—వీరి నెవరభిమానింపలేదు? కాని వీ రెవరి వారైరి? ఎవరివెంట నేగిరి? ఓరీ! వీరి ప్రేమ కపటముతో నిండినది. ప్రపంచమంతను జయించి, యమునిసైతము బంధించిన మహారాజులనుగూడ మృత్యువు దనపొట్టను బెట్టుకొనినది. వారిముందు నీవెపాటి? ప్రపంచము యొక్క నిజమగు సారమేమో కొంచెము పరికించి చూడుము. వేదము లెవనిని ప్రతిపాదించినవో యోజింపుము. తులసీదాసు చెప్పునదేమన—ఇప్పటికైనను, శివుడుసైత మెవనిని ప్రేమించెనో వాని నేల భజింపవు?

(సశేషము)

# తత్త్వశాస్త్రము

## కర్మలు: వాని ప్రభావము

శ్రీ ఇచ్ఛాపురపు వైద్యనాథం, బి. ఏ.

(గతసంచిక తరువాయి)

జననమరణాది దుఃఖశూన్యమును నిత్యానంద రూపమునగు మోక్షమును సంపాదింప వాంఛించువారు వేదాంతశాస్త్రమనెడు తత్త్వశాస్త్రమును తెలిసికొనుట యావశ్యకము. అట్టి తత్త్వశాస్త్రమును గ్రహించుటకును గ్రహించిన దానిని దృఢముగా నుంచుకొనుటకును ప్రథమమున వైరాగ్యసంపాదన మావశ్యకము. అట్టి వైరాగ్య సంపాదనకై కర్మములనుగూర్చియు జననమరణములనుగూర్చియు తెలిసికొనవలసి యున్నది.

కర్మయను పదమున కనేకార్థములు కలవు. "నహికశ్చిత్ క్షణమపి జాతుతిష్ఠ త్యకర్మ కృత్" (భగవద్గీత) (కర్మచేయకుండ నెవ్వడును క్షణకాలమైననుండడు.) అనుటవలన ప్రాణవాయు క్రియలగు చలనాదులును కర్మేంద్రియ వ్యాపారములునుగూడ కర్మలని చెప్పబడినవి "శరీరయాత్రాపిచ తే నప్రసిద్ధ్యేదకర్మణః" (కర్మల నాచరింపనిచో జీవనము జరుగదు.) అనుటచే దేహధారణ కావశ్యకములగు కృషి వాణిజ్యాదులును కర్మపదముచే చెప్పబడును. ఇవియన్నియును లౌకిక (ఈలోకమునకు సంబంధించిన) కర్మములు. ఇవిగాక పరలోకమునకు సంబంధించి వేదములందు చెప్పబడిన కర్మములు కలవు. అవి విహితములనియు నిషిద్ధములనియు రెండు విధములుగా నున్నవి. విహితములనగా మనుష్యుడు చేయవలెనని విధింపబడిన కర్మములు, నిషిద్ధములనగా చేయరాదని యాజ్ఞాపింపబడిన హింసానృతభాషణ మద్యపానాది కర్మములు.

విహితకర్మములు నిత్యములనియు నైమిత్తికములనియు కామ్యములనియు మూడు విధములుగా నున్నవి. బ్రాహ్మణాది జాతులకు బ్రహ్మచర్యాద్యాశ్రమములందు చేయవలెనని విధింపబడిన స్నాన సంధ్యావందనాది కర్మములు నిత్యకర్మలనబడును. నిత్యకర్మల నాచరించినచో పుణ్యము రాదనియు ఆచరింపనిచో పాపము కల్గుట తథ్యమనియు కొందఱి యభిప్రాయము. ఎట్టి సుకర్మమైనను ఆచరింపనిచో పాపము రాదనియు ఆచరించినచో పుణ్యము కలుగుననియు కొందఱి వాదము. నిత్యకర్మల నాచరించుటవలన మనశ్శుద్ధి కల్గుటయే ఫలమనియు మనశ్శుద్ధివలన తత్త్వజ్ఞాన ముదయించి మోక్షము పొందవచ్చును కావున నిత్యకర్మానుష్ఠానమునకు మనశ్శుద్ధిమాత్రమే ప్రయోజనమని కొందఱి యుద్దేశము. మనశ్శుద్ధిమాత్రమేగాక సుఖానుభవముకూడ కలుగునని సురేశ్వరా

చార్యాదుల యభిప్రాయము. "నిత్యేషు శుద్ధి ప్రాధాన్యా ద్భోగోఽస్య ప్రతిబంధకః" ఇట్టి వాక్యము లిందులకు ప్రమాణములు. ఇట్టి నిత్య కర్మలను గూర్చి వివిధాభిప్రాయములు కలవు. ఒక కర్మనొనర్చినచో దానికి ఫలము కలుగక తప్పదు కావున నిత్యకర్మలకు మనశ్శుద్ధినిగాని సుఖానుభవమునుగాని రెండిటినిగాని ఫలముగా నంగీకరింపవచ్చును.

నైమిత్తిక కర్మలనగా పితృకర్మలు మున్నగునవి. ఇవి ఆయానియమితకాలములందు మాత్రమె తప్పక ఆచరింపవలసినవి. ఇవిగాక స్వర్గాద్యుత్తమలోక సంపాదకములగు యజ్ఞములు మొదలగు కామ్య కర్మలు కలవు. కామ్యకర్మలను పరలోకవాంఛలేనిచో ఆచరింపక విడువవచ్చును. కాని నిత్యనైమిత్తికములు తప్పక ఆచరింపవలసినవి. అవి కొందఱు సన్యాసులకు తప్ప ఇతరులకు త్యజింప తగినవి కావు.

ఇట్లు ఆయా వర్ణాశ్రమములకు విధింపబడిన కర్మలను శ్రద్ధాభక్తులతో నాచరించుటవలన మనశ్శుద్ధిద్వారా మనుష్యుడు ముక్తుడగునని "స్వేస్వేకర్మణ్యభిరత స్సంసిద్ధిం లభతేనరః" "స్వకర్మణాత మభ్యర్చ్య సిద్ధింవిందతి మానవః" అను నిట్టి వాక్యములచే భగవద్గీతలో నర్జునున కుపదేశింపబడెను. పూర్వోదాహృతములగు కర్మలు కామముతో నాచరించిన యెడల నుత్తమ సుఖముల నొసంగును. తత్తత్కర్మాచరణముచే జనించిన పుణ్యము నశింపగానే సుఖానుభవము నశించును. మరల జీవుడు జననమరణ ప్రవాహరూపమగు సంసారమున పడవలసివచ్చును. ఇట్లు సుకర్మలుత్తమలోకములందును నీలోకమందును సుఖానుభవము నొసంగును, దుష్కర్మము నాచరించినవాడు పాపాధిక్యమునుబట్టి నరకమున ననేకబాధల ననుభవించి యీ లోకమున పసు పక్షి క్రిమి కీటకాదులందు జనించుచు బాధలనుభవించుచు మరణించుచు నుండును. కావున జీవుడు సుకృత దుష్కృతములలో నేని నాచరించినను తత్ఫలానుభవమునకై తదనుగుణముగ శరీరధారణముచేసి జననమరణాదుల నొందుచుండవలసి యున్నది.

ఇట్టి సుకృత దుష్కృతరూపములగు కర్మములను జీవు డనాదికాలమునుండియు చేయుచున్నాడు. ఇట్లు కోట్లకొలది జన్మములనుండియు జీవుడు చేయుచున్న పుణ్యపాప కర్మలు వాసనారూపమున అంతఃకరణము (బుద్ధి) నందుండును. అట్లార్జింపబడిన కర్మలకు సంచితమని పేరు. ఈ సంచితములోనుండియే జీవుడీ జన్మమున ననుభవింపవలసిన సుఖదుఃఖములకు కావలసిన పుణ్య పాప కర్మలను పరమేశ్వరుడు విధించును. జీవుడు గర్భస్థ పిండములో పడినది మొదలు మరణించువఱకును ఈ విధింపబడిన కర్మానుభవమునుబట్టి ఏకాలమునం దెవరిచే నేస్థలమున నెట్లేమి యనుభవింపవలయునో ఆకాలమున వానిచే ఆస్థలమున అట్లు దాని ననుభవించును. ఇట్లనుభవించుటకు విధింపబడిన కర్మకు ప్రారబ్ధమని పేరు. ఈ ప్రారబ్ధము నెవ్వరును తప్పింపజాలరు. ఇది అనుభవించుటవలన మాత్రమే నశించును. ఇది పరమేశ్వరునిచే జీవుని అనుభవమునకై విధింపబడినది. ఇదికాక ఆగామియను నామముతో కొంత కర్మముకలదు. అది ఈ జన్మమునచేయు కర్మము. ఈ జన్మమునచేయు పుణ్యపాపకర్మలు సంచితములో చేరును, అందుచే సంచితము వృద్ధినొందుచుండును. ఒక జన్మములో జీవుడొనర్చిన కర్మముల ఫలితము వందలకొలది

జన్మములెత్తి యనుభవించినగాని నశింపదు. ఇట్లుండగా ననంతకోటి జన్మములనుండి జీవుడు దాచుకొన్న సంచితమునకు సంపూర్ణనాశము సంభవించుట అసంభవము.

జ్ఞాను లీవిషయమున నీక్రింది దృష్టాంతమును జెప్పుదురు. ఒక కృషికుడు (వ్యవసాయముచేయువాడు) విస్తారముగా ధాన్యము పండుభూమిని వ్యవసాయముచేయుచున్నాడు. తగిన జలాధారాదు లుండుటచే ప్రతి సంవత్సరమును అతనికి గరిసెలకొలది ధాన్యము తప్పక పండుచున్నది. వాడాధాన్యమును గాదెలలో నిలువచేయును. ఆ ప్రాతధాన్యములోనుండి కొంచెము మాత్రమే కుటుంబపోషణాదులకు తీసికొనును. తక్కిన ధాన్యమంతయు నిలువయుండును. మరల నుచితకాలమురాగానే పొలములోనుండి క్రొత్తధాన్యము వచ్చి గాదెలలో పడును. ఈ రీతిగా ఆ కృషికునకు నిలువయున్నదియు అందు వచ్చి చేరునదియు అగు ధాన్య మపరిమితముగా నున్నది. అనుభవించుటకు తీసికొన్నది స్వల్పముగానున్నది. కావున వాని కెల్లప్పుడును ధాన్యము విస్తారముగానే నిలువయుండును. తనవ్యయమునకు కొంత యుపయోగించుకొన్నను తరుగదు. పై యుదాహరణములో గాదెలో నిలువయున్న ధాన్యము సంచితకర్మ వంటిదనియు, అనుభవించు స్వల్పధాన్యము ప్రారబ్ధమువంటిదనియు, క్రొత్తగా పొలమునుండి వచ్చిచేరు క్రొత్తధాన్యము ఆగామివంటిదనియు గ్రహింపవచ్చును. ఇట్లు జీవు లనాదికాలమునుండియు తాను చేసిన కర్మల సంచితమునుండి ప్రారబ్ధరూపముగా కొంతభాగము ననుభవించుచున్నారు. అట్లనుభవించుకాలమున మరల కోట్లకొలది జన్మము లెత్తుటకు కావలసినంత కర్మను చేయుచున్నారు. ఇట్లు కర్మవలన అంతఃకరణమున కర్మవాసనలును వానివలన జన్మములును జన్మమువలన కర్మములును నిట్లు చక్రమువలె దిరుగుచుండును.

ఇట్లాద్యంతములులేని కర్మరాశిని నశింపచేయుటకు మార్గములు కలవా? లేవా? యని సంశయింప నక్కరలేదు. ఇట్టి భయంకర కర్మరాసులను నశింపజేయుటకును జననమరణాదిరూపసంసార ప్రవాహమునుండి తరించుటకును ఉపనిషత్తులు మార్గమును జూపియేయున్నవి. ఆ మార్గమునే వ్యాస శంకరాచార్య విద్యారణ్యాదులు సాధ్యమైనంత విశదమగునట్లుచేసిరి. ఆమార్గమే జ్ఞానమార్గమని చెప్పబడును. జ్ఞానమనగా జీవబ్రహ్మైక్యరూపము. అట్టి జ్ఞానమే సర్వకర్మలను నశింపజేసి మోక్షమునొసంగును. జ్ఞానప్రభావము భగవద్గీతలో నిట్లు చెప్పబడినది. "జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతేర్జున." జ్ఞానాగ్ని అన్ని (పుణ్యపాప) కర్మలను దహించును. "బుద్ధియుక్తోజహాతీహ ఉభేసుకృత దుష్కృతే" జ్ఞాని పుణ్యపాపములు రెండిటిని విడుచును. "జ్ఞానీత్వాత్మైవమే మతమ్" జ్ఞానికిని నాకును భేదములేదు. అతడే నేను. "నైనంకృతాకృతే తపతః" (జ్ఞానిని పుణ్యపాపములు బాధింపవు) అను నిట్టి శ్రుతి వాక్యములుకూడ ఈ విషయమును స్థిరపరచుచున్నవి. కావున మానవు డీ జన్మముననే, దుఃఖనాశకమును శాశ్వత సుఖప్రదమునగు జ్ఞానము నార్జింపవలసియున్నది.

# ముముక్షువు లెవ్వరు? - వారి నడవడి యెట్టిది?

ఒక భక్త పరమాణువు

ఇది మహాకలికాలము. ఇట్టికాలమున ముముక్షులని చెప్పదగువారుందురా ఉండరా అనునది మిక్కిలి సందేహము. కృతయుగాదుల లోనే 'మనుష్యాణాం సహస్రేషు- కశ్చిద్యతతి సిద్ధయే' అనెడి గీతాన్యాయము ననుసరించి వేయింటికి ఒక్కడుడో ముముక్షువుండునని చెప్పతగిన ఈ ఘోరకలిలో కోటికో అర్బుదమునకో ఒక్కడుండునేమో అనవచ్చును గదా.

ముముక్షనగా మోక్షేచ్ఛ, అనగా మోక్షమును పొందవలయునను కోర్కె. ఇట్టి కోర్కె లేని వారుందురా అందురేమో. బాగుగా లోతుగా విచారించిన లేరనే తెలియును. మోక్షమనగా బంధమునుండి విమోచనము. సర్వప్రాణులకు సహజముగానున్న బంధమేదో దానినుండి విడివడుటయే. అట్టి సర్వసామాన్య సహజ బంధము సంసారబంధమనియు సంసారమన్న కర్తృత్వ భోక్తృత్వమనియు సుఖ దుఃఖానుభవాత్మకమనియు ఇత్యాదివిధముగా శాస్త్రకారులు నిశ్చయించిరి. అనగా దేహేంద్రియమనోబుద్ధ్యాది సంఘాతమైన నేను అనెడి తానే కర్తయై సమస్త కర్మలును, లౌకికములును పారలౌకికములును అలౌకికములన్నియు చేయుచున్నానుగదా యను అభిమానము వహించుటయును అట్టి అభిమానముతోడనే వానివాని ఫలాలు సుఖ దుఃఖాత్మకములు అనుభవించడమును అని తాత్పర్యము. ఇట్టి అభిమానమును నిశ్శేషముగా త్యజించుటయే మోక్షము. కర్తను భోక్తను గూడ నేనే అను నభిమానముపోయిన చేయగల పనియే ఉండనేరదు. కాబట్టి యిట్టి అభిమాన త్యాగమనునది అసహజము అసంభవము అనియు, అట్టిత్యాగమువల్ల కలిగెడిప్రయోజనము లేదనియు వాదింపవచ్చును. ఇట్టివాదమువల్ల మోక్షమే వట్టి కల్ల అనవలసివచ్చును.

కాని యిట్టి మోక్షమున్నదనియు దానివల్ల నిశ్శేషముగా సమస్తదుఃఖములును ఆధ్యాత్మికములు ఆధి భౌతికములును ఆధి దైవికములు ఐహికములు పారలౌకికములు అన్నియు శమించి జీవించియుండగనే నిత్య నిరంతరానందానుభవమను పరమపదప్రాప్తి కలిగి తిరిగి సంసార బంధాత్మకమైన ప్రాణి జన్మము రాదని శ్రుతి స్మృతి పురాణాదులును సిద్ధపురుషుల అనుభవములును చాటుచున్నవి. ఇట్టి మోక్షము పొందిన ముక్తులు లోకములో సిద్ధులనియు స్థితప్రజ్ఞులనియు త్రిగుణాతీతులనియు జీవన్ముక్తులనియు జ్ఞానులనియు ఏకాంతానన్యభక్తులనియు గ్రంథములలో పేర్కొనబడుదురు. ఇట్టిమహాపురుషుల లక్షణములు భగవద్గీతలలోని సాంఖ్యయోగమున స్థితప్రజ్ఞప్రకరణమందును, గుణత్రయ విభాగయోగమున గుణాతీత ప్రకరణమందును

వర్ణింపబడినవి. ఇట్టి ముక్తులకు రాగద్వేషము లుండవని రాగ భయ క్రోధాదులుండవని వీరు అవాప్త సర్వకాములుగను నుందురని సుఖములను పొంది ఉబ్బరని దుఃఖములచే తబ్బిబ్బు పొందరని మమతాహంకారములులేక నిస్పృహులుగా నుందురని ఖ్యాతిలాభపూజా సత్కారములు అపేక్షింపరనియు సుఖదుఃఖములు మానావమానములు మున్నగు ద్వంద్వములను సమానముగా భావించి ఉదాసీనులుగా నుందురని సర్వదా బ్రహ్మాత్మైక్యయోగము సిద్ధించిన వారగుటచేత సచ్చిదానంద స్ఫూర్తితో విరాజిల్లు ముఖముతో ప్రకాశించుచు ఉందురనియు ఇట్లు సిద్ధుల లక్షణములు శాస్త్రాదులు వర్ణించుచున్నవి. ప్రహ్లాద నారద పరాశర పుండరీక వ్యాసాంబరీష శుక శౌనక భీష్మాది పూర్వయుగముల మహాపురుషులును శ్రీరామకృష్ణ పరమహంస శ్రీ సదాశివేంద్ర సరస్వతి శ్రీ రమణమహర్షి ఇత్యాది ప్రకృతియుగ మహాపురుషులును శ్రీ కబీరు రామదాస త్యాగరాజాది మహాభక్తులును పైలక్షణములన్నియు కల్గిన సిద్ధపురుషులని గ్రహింపగలము.

ఇట్టి సిద్ధత్వమునులేక ముక్తిని పొందవలయునని కోరువారు అనేకులు ఉండవచ్చును. అట్లు కోరినంతమాత్రాన వారందఱును ముముక్షులు గారు. ఆకలియగునప్పుడు అన్నముకొరకును దప్పిగల్గినప్పుడు పానీయముకొరకును పరితపించి ఆకలి దప్పులు తీర్చుకొని పరితృప్తి పొందుటకు మనుజుడు తహతహపడునట్లే మోక్షముకోరువాడును మోక్షోపాయములేవియో పెద్దలవల్ల తెలిసికొని వాని నాచరించును. ఇట్టి ఆచరణకు కడంగువాడే ముముక్షువు. క్షుధార్తునకు క్షున్నివారణోపాయమందు గాక యితరమందెట్టి వాంఛయు లేక పరిత్యజించు నట్లే ముముక్షువును మోక్షోపాయములందు తప్ప తక్కిన సర్వము నందును నిస్పృహతో ప్రవర్తించును. ఇట్టి ప్రవృత్తినే గాఢ వైరాగ్యమనియు తీవ్ర ముముక్ష అనియు అందురు. ఇట్టి వైరాగ్యముకలవాడే త్యాగి అనియు సన్న్యాసి అనియు అందురు. ఇట్టి వైరాగ్యవంతుడు గృహస్థుగానున్నను పరమార్థమున సన్న్యాసియే.

ఇట్టి తీవ్రముముక్షువు ఆత్మయే నిత్యమనియు ఆత్మేతర పదార్థములన్నియు అనిత్యములనియు తెలిసికొని ఆత్మప్రాప్తియందు గాఢరక్తిగలిగి తదితరములందు దోషబుద్ధిచేసి విసర్జించును, ఐహికాముష్మిక సుఖాలను భోగాలను ఆసింపక శాంతి దాంతి తితీక్షా శ్రద్ధా సమాధానోపరతులు దినదిన ప్రవర్ధమానముగా అలవర్చుకొనుచుండును, బహుశః సన్న్యాసాశ్రమము స్వీకరించును, ఒకవేళ ఏకారణముచేనైనను గృహస్థుగానే సాగుచున్నను దారాపుత్రాది విషయలోలుడు గానేరక ఆంతరతః సర్వసంగ పరిత్యాగియై సర్వదా బ్రహ్మవిచారముననో ఏకాంతానన్యభక్తి నిష్ఠయందో ధ్యానయోగాభ్యాసముననో నిమగ్నుడై కాలము గడుపుచుండును. ఇట్టి మహాపురుషుడు కేవలముముక్షువు. ఎవడు శాంతి దాంతి ప్రధానుడై ఐహిక సుఖేచ్ఛలను ఈషణత్రయమును విసర్జించి జ్ఞానయోగ భక్తియోగ ధ్యానయోగములలో అన్నిటియందును గాని కొన్నిటియందుగాని సర్వదా ప్రవర్తింపనుద్యుక్తుడో అట్టివాడు కేవల ముముక్షువుగా నెరుగదగును. ఇట్టి తీవ్రముముక్షు శీఘ్రగతిని జీవన్ముక్తిని బడసిన సిద్ధుడుగాగలడు.

ఇక నిట్టి కేవల ముముక్షులుగాక సాధారణ ముముక్షు లనువారు రెండవ తెగవారు. వీరే నిష్కామకర్మానుష్ఠానపరులు. నిష్కామ

కర్మానుష్ఠానమనగా శ్రుతి స్మృతి విహితములయిన శ్రౌత స్మార్తాది నిత్య నైమిత్తిక కామ్య కర్మలన్నియు కోరికలేక చివరకు ఖ్యాతి లాభ పూజా సత్కారాదులలో దేనిని గాని అపేక్షింపక కేవలము భగవదర్పణ బుద్ధితో భగవత్ప్రీత్యర్థమే అనుష్ఠించుట. విహితకర్మలన్నియు పురుషుడు ముఖ్యముగా ఈ కలికాలమున ఆచరింపజాలడు. కాబట్టి తన వర్ణాశ్రమములనుబట్టి ఆవశ్యకములుగా తలంపబడు కర్మలలో నిత్యము లనువానియందు కొన్నిటిని చివరకు సంధ్యావందనము గాయత్రీమంత్రజపము నయినను నిష్కామముగా ఆచరించుటయే నిష్కామకర్మానుష్ఠానము. ఇట్టి కర్మానుష్ఠానమునకు మూలభూతమయినది నిత్యసత్యవ్రతమని తెలిసికొనవలయును. సత్యమనగా మనోవాక్కాయములు మూటియందును అమాయికత్వము అకౌటిల్యము. అనగా త్రికరణములందును పరవంచనము ద్రోహబుద్ధి మున్నగునవి లేకుండ ప్రవర్తించుట. ఇట్టి సత్యవ్రతము కలవాడు సహజముగనే అహింస భూతదయ ఇత్యాది సౌజన్యముగల వాడుగనే భాసించును. కాబట్టి సత్యము అహింస భూతమైత్రి ప్రధానముగా అలవర్చుకొనుచు నిష్కామముగా విహితకర్మలలో యత్నించి తదనుష్ఠానమైనను చేయుచుండిన కాలక్రమేణ చిత్తశుద్ధి గలిగి తీవ్రముముక్షు చివరకు కలుగుచుండును.

ఈ కర్మానుష్ఠానములో ముఖ్యముగా భగవద్భక్తియు చేరియున్నదని గ్రహింపవలెను. భగవన్నామ సంకీర్తన జప తపాది భగవద్భక్తియు సంధ్యావందనాది కర్మలతో నిష్కామముగా చేసిననేగాని తీవ్రముముక్షువై తరింపలేడు. ఇట్టి కర్మనిష్ఠ భక్తినిష్ఠలు గలవానికి దంభము, దర్పము, స్వాభిమానము, క్రోధము, పారుష్యము అనగా పరుషభాషణము అజ్ఞానము అనగా కర్తవ్యాకర్తవ్యములనుగూర్చిన అవివేకము, ఇట్టి ఆసుర సంపత్తి, అనగా రాక్షసస్వభావముతొలగిపోయి సత్యము, అనగా త్రికరణములందును ఋజుభావము, అనగా నిజమునే భావించి నిజమునే మాట్లాడుట, అహింస అనగా ఏప్రాణికిని పీడగాని హింసగాని తలపెట్టకపోవుట, అక్రోధము, భూతదయ, దానము అనగా యాచించు దీనునకు శక్తికొలది యిచ్చుట, దాంతి అనగా బహిరింద్రియ నిగ్రహము, శాంతి అనగా మనస్సను అంతరింద్రియ నిగ్రహము ఇత్యాది దైవిక సంపద అనగా దేవతాసంబంధమైన స్వభావము వృద్ధిపొందగలదు. దైవికసంపదచేతగాని తీవ్రముముక్షువై తరింపజాలడు. ఏ మనుజుడు కర్మనిష్ఠగాని భక్తినిష్ఠగాని తదుభయముగాని చేసినను దంభా దర్పాహంకారాభిమానాది ఆ ఆసురసంపత్తి తొలగకయు సత్యాహింసాది దైవికసంపద వృద్ధిపొందకయుండునో అట్టివాని కర్మనిష్ఠయు భక్తినిష్ఠలు నిష్కామములు కావనియు దంభార్థమై మాత్రమే చేయబడునవిగా నుండుననియు అట్టి కర్మ భక్తినిష్ఠలవల్ల కలుగు ఫలము నరకమగును గాని స్వర్గాది పుణ్యలోకములుగాని తరణోపాయమగు జ్ఞానముకాని గాదనియు గీతలలో శ్రీకృష్ణపరమాత్మ 16-వ అధ్యాయమున చాటుచున్నాడు. కాబట్టి దంభ దర్ప క్రోధాభిమానములు అరికట్టకుండ చేయు యక్కించిత్కర్మానుష్ఠానముగాని యావత్కర్మానుష్ఠానముగాని భక్తిగాని ముక్తిప్రదమును స్వర్గప్రదమును కానేరదనియు, విశేషించి నరకప్రదమనియు గ్రహింపవలెను. కర్మభక్తి నిష్ఠలవల్ల దంభ దర్పాభిమానాదులు క్రమక్రమముగా తగ్గుచున్నప్పుడే అవి నిష్కా

నానుష్ఠానము లగుననియు తరణోపాయులగు ననియు గ్రహింపనోపును. ఇట్టి కర్మభక్తి నిష్ఠలు అనబడు నిష్కామకర్మయోగ మాచరించు స్త్రీ పురుషులు సాధారణ ముముక్షులుగా నెఱుగదగుదురు.

ఇట్టి నిష్కామకర్మానుష్ఠానమును గూర్చి చెప్పుటయు వ్రాయుటయు తేలికగాని ఆచరణము బహుతర కష్టసాధ్యము. ఎంతటి భక్తుడును వివేకియు శ్రీపరమేశ్వర ముద్దిశ్య శ్రీపరమేశ్వరప్రీత్యర్థమని సంకల్పము చేసి కర్మాంతమందు తత్స బ్రహ్మార్పణమస్తు అని వచించునే కాని చివరకు ఏదికోరినా ఏది కోరకపోయినా తన యొక్కయు తన దారాపుత్రాదుల యొక్కయు ఆయురారోగ్యాది యోగక్షేమములనుగూర్చి యయినా భగవంతుని మనస్సులోనైనను ప్రార్థింపకపోడు. ఇట్టి ప్రార్థనయు లేకుండ కర్మ భక్తులు చేసిననేగాని నిష్కామ కర్మానుష్ఠానమనిపించుకొనదు. కాబట్టి యిది మిక్కిలి కష్టసాధ్యము.

ఇక నిష్కాములుగాక సకాములై అనగా నిధినిక్షేప గృహారామ భాగ్యభోగాదు లపేక్షించియో ఖ్యాతిలాభ పూజా సత్కారాదు లపేక్షించియో కర్మ లాచరించువారును భగవద్భక్తి చేయువారును కొందరుందురు. వీరేబహు సంఖ్యాకులు. వీరు ముముక్షులు కానేరరు. కాని కాలక్రమేణ భగవదనుగ్రహము చేత నిష్కామ కర్మానుష్ఠాతలుగా సాధారణ ముముక్షులుగా మారి తరింపవచ్చును.

ఈ పైన పేర్కొనబడిన వారందరును ఏదోవిధముగా శాస్త్రానుభవములనునమ్మి కర్మానుష్ఠానముచేయువారే కనుక ఆస్తికులనబడుదురు. ఆస్తికులనగా శాస్త్రోపదేశములందును ఆచార్యోపదేశములందును విశ్వాసముకలిగి పరలోకాదు లున్నవని నమ్మి తమతమ సంస్కారాభిరుచులనుబట్టి శాస్త్రోక్త కర్మల నాచరించువారు. వీరు కాని వారు నాస్తికులు. ఇట్టివారు పరలోకాదులు భగవంతుడు లేరని వాదించువారుగా నుండవచ్చును. లేక పరలోకాదులు భగవంతుడు ఉన్నాడని స్వీకరించియు కేవల శిశ్నోదర పరాయణులుగా ప్రవర్తించువారుగను నుండవచ్చును. కాబట్టి బాహ్యమునకు కర్మ భక్తి నిష్ఠలు నెరవుచున్నట్లు కనిపించినను స్వార్థమాత్ర పరాయణులయి ఐహికభోగరతులయి సత్యాహింసాదులు వర్జించి నీతిబాహ్యులయి ప్రవర్తించుచుండువారును శిశ్నోదర పరాయణులగు నాస్తికులును 'ఇతోభ్రష్టః తతోభ్రష్ట' కోటికి చెందినవారే అని గ్రహింపవలెను.

ఈ పై వివేచనమునుబట్టి (1)విషయులు (2) ముముక్షులు (3) ముక్తులు అని మనుష్యులు మూడు విధములుగా నుందురనియు వారిలో ముక్తులనువారు మృగ్యాతిమృగ్యులనియు ముముక్షులలో తీవ్రముముక్షులుగూడ మృగ్యాతి మృగ్యులుగనే ఉందురనియు సాధారణ ముముక్షులు అచ్చటచ్చట అప్పటప్పట గోచరింపవచ్చుననియు విషయులు అనగా ఐహికభోగాదుల నపేక్షించువారు బహు సంఖ్యాకులుగా నుందురనియు వీరిలో కొందరు స్వార్థపరులయి యజ్ఞ దాన తపాదుల ఆచరింతురనియు తదన్యులు నాస్తికులనబడు వారై కేవల శిశ్నోదర పరాయణులయి మెలగుచుందురనియు స్పష్టము కాగలదు. ఎవరు యజ్ఞ దానతపాదులు త్రికాల సంధ్యావందనాదులును ఆచరించినను దంభ దర్పాహంకారాదులు కామ క్రోధాదులు కొంచెమైనను తగ్గక సత్యాహింసా బ్రహ్మచర్యాది సాచ్ఛీల్యము అలవడక భూతదయ

పరార్థ ప్రీతి కలుగకయు మేడిపండురీతిగ జీవయాత్ర సాగించుచుందురో అట్టివారు బాహ్యమునకు ఆస్తికోత్తములనిపించుకొనినను నిజానికి మాత్రమునాస్తికులనియు లోకవంచకులు ఆత్మవంచకులు అని తెలుసుకొనదగినవారు.

ఇందునుబట్టి ముముక్షుని నడవడి సత్యాహింసాదిపాలనము, శమదమాది సంపన్నత, నిష్కామకర్మానుష్ఠాన ప్రవణత్వము, స్వార్థరాహిత్యము, పరార్థప్రీతి, భూతమైత్రి ఇత్యాది సౌశీల్యముతోకూడిన భగవన్నామసంకీర్తన సంస్మరణాది రూపమగు భక్తి ధ్యాననిష్ఠగాగాని శ్రవణమననాత్మకమగు జ్ఞాననిష్ఠగాగాని ప్రకాశించుచుండును. ఇంతపరాకాష్ఠ లేకపోయినను తావన్మాత్రమగు సత్యాహింసాపాలనతో కూడి కామక్రోధాది దోషరహితమై నిష్కామభూయిష్ఠమై యత్కించిత్కర్మానుష్ఠాన ప్రవణత్వము కూడ ముముక్షుని నడవడిగా నెరుంగవచ్చును. ఇట్టిదేదియునుగాని నడవడి మిథ్యాచారమనియు నాస్తిక్యమనియు గ్రహింపనగును. శాస్త్రీయమును అనాదిసిద్ధమును అయిన యత్కించిత్కర్మానుష్ఠానము లేకపోయినను సత్యాహింసా శమదమాది సంపన్నుయిన సౌశీల్యమును సౌజన్యమును భగవద్భక్తి ప్రకాశించు పురుషుడుకూడ ఆస్తికోత్తముడై తరించువాడే యని యీ ప్రకరణమందు తలపోయవచ్చును.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

---

# శ్రీ అరవిందుల మహాసమాధి

ఆధ్యాత్మికము, రాజకీయము, వైజ్ఞానికము మున్నగు మార్గములందెల్ల జీవితమును గడిపి సార్థకముచేసికొని యోగిపుంగవులై శిష్యకోటికి జ్ఞానభిక్ష నిడిన శ్రీ అరవిందులు 5-12-50 న తమ పుదుచ్చేరి ఆశ్రమమునందు మహాసమాధి నందిరని తెలుపుటకు చింతిల్లుచున్నాము.

శ్రీవారు పవిత్ర భారతభూమియందు వంగదేశమున 15-8-1872 న జన్మించిరి. ఏడేండ్ల ప్రాయముననే విద్యాభ్యాసము నిమిత్తము శ్రీవారు ఇంగ్లండునకు బోయి యచ్చటనే బహుభాషల నభ్యసించి పాశ్చాత్యుల మన్ననల వడసిరి. భారతదేశమునకు విచ్చేసిన యనంతరము—రాజకీయము, వైజ్ఞానికము, ఆధ్యాత్మికము మున్నగు వివిధ మార్గములందు పాల్గొని చివరకు పరాశక్తి ఆదేశమునంది యోగసాధన కుపక్రమించిరి, మహర్షులని కీర్తి గడించిరి. 'నే నే మార్గమున జరించినను నా దేశాన్నత్యమునకే పాటుపడుచున్నా'నని ఘంటాపథముగ జాటిరి. ఇట్టి యోగిపుంగవుల నిర్యాణము భారతదేశమునకే గాక యావత్ప్రపంచమునకును తీరనిలోటు గలిగించినది.

శ్రీవారి ఆత్మ శాంతి నందుగాక!

# సంఘ వార్తలు

శ్రీ శారదేశ్వరీమై నమః

# శ్రీమాతృదేవి శతవార్షిక వర్థంతి

బేలూరు మఠము,
25-10-1950.

పశ్చిమవంగరాష్ట్రమున బంకూరా జిల్లాలో నొక మారుమూల గ్రామమగు జయరాం బాటిలో 1853-వ సంవత్సరమున జన్మించినను, నిష్కళంక పవిత్రశీలముచే, అపార దివ్య ప్రేమచే, గాఢ పారమార్థికానుభూతిచే శ్రీ శారదామణిదేవి, శ్రీమాతృదేవియని వ్యవహరింపబడుచున్నారు. తనువుగొనిన అత్యుత్తమ, పరిపూర్ణ స్త్రీత్వమనదగిన ఈమె పరమ పావన భారతీయ పతివ్రతాశిరోమణులగు సీతా, సావిత్రి, దమయంతి మున్నగు సాధ్వీమతల్లుల కెనయై, మహోన్నతాధ్యాత్మిక గురుపదవి నధిష్ఠించినారు. శ్రీశారదామణి యుక్తవయస్కురాలైన తరువాత, శ్రీరామకృష్ణులీమె నారాధించి, తమ పారమార్థిక సాధనల ఫలములన్నిటిని సమర్పించిరి. ఇంతేకాదు, శ్రీభగవాను నవతారానంతరమున వారి జగద్గురుస్థాన మలంకరించి, దినదిన ప్రవర్ధమానమగుచుండిన రామకృష్ణోద్యమమును నడిపించిన అదృశ్య శక్తివాహినియై, వేనవేల మానవులకు ఆధ్యాత్మిక వికాసమును గూర్చిన జ్ఞానద్యుమణియై విలసిల్లిన నారీమణి శ్రీశారదామణి.

ఈమె శతవార్షిక వర్థంత్యుత్సవమును తగురీతిని ప్రపంచమంతట జరుపుట మనకందరకును విధాయకధర్మము. ఈ ఘనకార్య నిర్వహణమునకు ప్రారంభసూచకముగ బేలూరు మఠాధికారులొక తాత్కాలిక కార్యనిర్వాహక వర్గము నేర్పాటుచేసినారు. రామకృష్ణమఠ, సేవాసంఘములకు పూర్వము సాధారణ కార్యదర్శిగనుండిన శ్రీమాధవానందస్వామి ఈ వర్గమున కధ్యక్షులు, శ్రీగంభీరానందస్వామి సాధారణ కార్యదర్శి, ఇతర స్వాము లార్గురు సభ్యులు. ఆనాటికానాడు పని ఇతోధికముగా కొనసాగుచుండుకొలదిని, ఈవర్గ సభ్యులసంఖ్య సముచితరీతిని హెచ్చింపబడును. ఉత్సవ నిర్వహణమునకు, మఠాధికారు లీ క్రింది ప్రణాళికను ప్రతిపాదించుచున్నారు.

1. శతవార్షిక వర్థంతి 1953 డిసెంబరు మొదలు 1954 డిసెంబరు ముగియులోపున జరుపబడవలయును.

2. సమగ్రమును, ప్రామాణికమునగు శ్రీమాతృదేవి జీవితచరిత్రతోపాటు, నొక సంగ్రహ జీవిత చరిత్రకూడ సాధ్యమైనన్ని భారత దేశభాషలలోను, విదేశభాషలలోను ప్రకటింపబడవలయును.

3. సాధ్యమైనన్ని భంగిమములలో శ్రీమాతృదేవి చిత్తరువులును, ఆమె జీవితచరిత్రకు సంబంధించిన ముఖ్య ప్రదేశముల పటములును గల సంపుటి ప్రకటింపబడవలయును,

4. భారతదేశ చరిత్రలో, వివిధయుగము లలో, వివిధరంగములందు సుప్రసిద్ధ నారి నుణులు సాధించిన ఘనకార్యముల వివరణ తోపాటు, వారి జీవితచరిత్రలుగల గ్రంథ మొకటి ప్రకటింపబడవలయును.

5. శ్రీమాతృదేవియునికిచే, పవిత్రములైన ముఖ్య స్థలములలో ఫలకములను స్థాపించుట కేర్పాటుచేయ బడవలయును.

6. శ్రీమాతృదేవి జీవితచరిత్రను గురించిన వ్యాసరచనయందు, విద్యార్థులకు పోటీ యేర్పాటు చేయబడవలయును.

7. శ్రీమాతృదేవి జీవితమును, ఉపదేశ ములనుగురించి ప్రసంగములు జరుగుటకుగాను వేర్వేరు స్థలములలో, ముఖ్యముగా స్త్రీల సంస్థలలో, స్త్రీల సభ లేర్పాటుచేయబడ వలయును.

8. శ్రీమాతృదేవి వ్రాసిన ఉత్తరములను, వాడిన వస్తువులను సేకరించి, కాపాడుటకు కృషి జరుపబడవలయును.

9. శ్రీమాతృదేవి నివాసముచే పవిత్రము లైన జయరామ్‌బాటి, కమార్పకూర్ మొద లగు ముఖ్యస్థలములకు యాత్ర లేర్పాటుచేయ బడవలయును.

పై కార్యక్రమము జయప్రదముగా కొన సాగవలయుననిన, జాగరూకతతో ప్రణాళిక లను సిద్ధపరచినంతమాత్రమున ప్రయోజనము లేదని వదాన్యుల భూరి విరాళములమూల మున ధనము చేకూరుట బహు ముఖ్యమని యెల్లరకును తెలిసినవిషయమే. కనుక, స్త్రీల పురోభివృద్ధియందును, మాతృపూజయందును విశ్వాసముగలవారి నందరిని ఈ క్రింద తెలిపిన ప్రయోజనములన్నిటికినిగాని, అందే యొకదాని కైననుగాని తమశక్తికొలది విరాళములిచ్చి, తోడ్పడుటకు అర్థించుచున్నాము

1. శ్రీమాతృదేవి కీర్తి ఆచంద్రార్క వైభవోపేతమై ప్రకాశించునట్లు చేయుట.

2. స్త్రీజన పురోభివృద్ధి,

3. పైన తెలిపిన గ్రంథప్రకటన.

విరాళములన్నియును, చెక్కులును, శ్రీ మాతృదేవి శతవార్షిక వర్ధంతి కార్యదర్శి పేర, పశ్చిమ వంగరాష్ట్రము, హౌరాజిల్లా, బేలూరు మఠము పోష్టుకు పంపబడవచ్చును.

1950-వ సం॥ అక్టోబరు 25-వ తేది.

వీరేశ్వరానందస్వామి
రామకృష్ణమఠసేవాసంఘ సాధారణకార్యదర్శి.



శ్రీ శారదామణిదేవిగారి జన్మతిధిపూజ ఆదివారము 31-12-1950

మఠమున బహిరంగోత్సవము ఆదివారము 7-1-1951



# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౪ సంచిక ౨

విషయ వివరణము

# శ్రీ రామకృష్ణ ప్రభ

## చందాదారులకు

౧. పత్రిక ప్రతిమాసము 20-వ తేదీన వెలువరింపఁబడును. ఒక వారము, పదిరోజులు చూచి ప్రతి మీకు అందకపోయినయెడల ఉత్తరము వ్రాయుఁడు.

౨. సంవత్సర చందా రు. ౩ లు మాత్రమే. జనవరినెల నుండిగాని జూలై నెల నుండిగాని చందాదారులుగఁ జేరవచ్చును. ఇతర మాసములలోఁ జేరదలచు వారికి జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని సంచికలు చేర్చిపంపఁబడును. విడిప్రతి రూ. ౦—౬—౦ లు. హిగిన్‌బాదంస్ వారి స్టాలులోఁగాని, మీ పత్రిక ఏజెంటును గాని అడుగుఁడు.

౩. ఉత్తర ప్రత్యుత్తరములు వీలైనంతవఱకు ఇంగ్లీషున వ్రాయుచు మీ చందాదారు సంఖ్య నుదాహరింపుఁడు. ఉత్తరములను "మేనేజరు, శ్రీరామకృష్ణప్రభ" అను చిరునామాకు వ్రాయుఁడు.

౪. చిరునామాయందు ఎట్టిమార్పుగలిగినను 10-వ తారీఖునకు ముందుగా మా కార్యాలయమునకుఁ దెలుపవలయును. లేనిచో, పత్రిక పూర్వపు చిరునామాకే పంపఁబడును.

## వ్యాసకర్తలకు

౧. కేవలము నైతిక ధార్మిక వైజ్ఞానిక విషయకములైన వ్యాసములేకాక, సాహిత్యమునకును కవిత్వమునకును సంబంధించిన ఏ వ్యాసములైనను బంపవచ్చును. సులభ సుందరమగు గ్రాంథిక భాషలో వ్రాయవలయును.

౨. వ్యాసములు అచ్చులో మూఁడు పుటలకు మించరాదు. ప్రతినెల ఒకటవ తేదీకి వ్యాసములు మాకు అందవలెను.

౩. వ్యాసములను, విమర్శకుఁ బంపు గ్రంథములను, వినిమయముగఁ బంపెడి పత్రికలను "సంపాదకుఁడు, శ్రీ రామకృష్ణ ప్రభ" అను చిరునామాకు వ్రాసి పంపవలెను.

౪. వ్యాసము తిరుగఁ బంపఁబడవలయునచోఁ దగు పోస్టేజి చేర్చి పంపవలయును.

---

వెలువడినవి ! ఇప్పుడే వెలువడినవి !!

# శ్రీ శారదా ప్రసంగములు

అనువాదకులు: శ్రీ వెదురుమూడి వేంకటకృష్ణరావుగారు

[ప్రభుత్వానువాదకులు]

సాధకు లెల్లరు జదివి తమ నిత్యజీవితమున అనుసరింపదగిన దివ్యప్రసంగములు.

318 పుటలు దివ్యమగు ద్వితీయ ముద్రణము వెల రూ. 2-8-0

ఇట్లు వ్రాయుఁడు :

మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి.



# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౭ } ౧౯౫౧ జనవరి - వికృతి - పుష్యము { సంచిక ౭

## ప్రార్థన

### భక్తిశతకము

శ్లో॥ సర్వజ్ఞ చక్ర సరసీరుహ రాజహంసం
కున్దేన్దు సున్దర రుచిం సురవృన్ద వన్ద్యమ్ ।
సద్ధర్మ చక్రసహజం జనపారిజాతం
శ్రీదన్త ధాతుమమలం ప్రణమామి భక్త్యా ॥ 28

ఏ దివ్యదంతము రాజహంసలలో సర్వజ్ఞ చక్రమై యొప్పుచున్నదో— దేని సౌందర్యము కుంద పుష్పముయొక్కయు చంద్రునియొక్కయు అందమును మించియున్నదో, ఏది ధర్మచక్రమునకు సాజన్మమై సకల దేవతలు పూజించునదై దివ్యకుసుమమైన పారిజాతమైనదో అట్టి ఉత్కృష్ట దంతమునకు భక్తితో ప్రణామము చేయుచున్నాను.

శ్లో॥ నాగాలయో పరిధరాలయ చక్రవాల మూర్ధ్ని
త్రికూట గత కాంచన శైలశృంగౌ ।
బోధిద్రుమూల నిహితాక్షయ ధాతుబింబం
విభ్రన్నమామి శిరసా జిన చైత్యమగ్రమ్ ॥ 29

నాగలోకముపైని వృత్తాకారముగానున్న భూమిమీద త్రికూటపర్వతమగు బంగారు కొండ దరినున్న బోధివృక్షము మూలముననుండి వినశ్వరరూపముతో నలరారుచున్న జైన విగ్రహమునకు నేను ప్రణామము చేయుచున్నాను.



ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ

# శ్రీ రామకృష్ణ వచనామృతము — 'మ.'

## శ్రీరామకృష్ణుడు—'మ.'

[స్థలము. దక్షిణేశ్వర దేవాలయము, కాలము: 19 ఆగస్టు 1883, ఆదివారము.]

కొంతకాలమునకు ముందే దేవాలయమున మాధ్యాహ్నిక నివేదనను ముగించి ద్వారములు మూసివైచిరి. శ్రీరామకృష్ణుడు భోజనముచేసి యించుక విశ్రాంతి నందియుండెను. ఆ విశ్రాంతి దీరిన పిదప తన చిన్నమంచముపై గూర్చొనియుండెను. అప్పుడు 'మ.' వచ్చి నమస్కరించెను. కొంతసేపటికి అతని వేదాంతమునుగూర్చి మాటాడజొచ్చెను.

శ్రీరామ —('మ.' ను జూచి) చూడుము. అష్టావక్రసంహితయందు ఆత్మజ్ఞానుల విషయము వివరింపబడియున్నది. ఆత్మజ్ఞానులు 'సోఽహం' 'నేనే ఆ పరబ్రహ్మను' అని వచింతురు, తలంతురు. ఇదంతయు వేదాంతవాదులగు సన్న్యాసుల మతము. సంసారుల కిది పనికిరాదు. సకల కార్యముల నాచరించుచు 'నేనే నిష్క్రియపరమాత్మ'నని యెట్లు పలుకనగును? వేదాంతవాదు లిట్లు పలుకుదురు:— 'ఆత్మ నిర్లిప్తుడు. సుఖదుఃఖములు, పాపపుణ్యములు—ఇవి ఆత్మ నేమియు చేయజాలవు. కాని దేహాభిమానులగు జీవులకు కష్టము కలిగింపగలవు. పొగ గోడపై ప్రసరించి గోడను నలుపు చేయును గాని ఆకసము నేమియు చేయజాలదు. కృష్ణకిశోరుడు జ్ఞానులవలె 'నేను ఖ' నని పలుకువాడు. అనగా నే నాకసమువంటివాడనని భావము. అతడు పరమభక్తుడగుటవలన ఆతడట్లు పలికినను కొంతవఱకు పరవాలేదు. కాని యట్లితరులు వచించుట అభావ్యము; నేను ముక్తుడనను నభిమానము కలిగియుండుట మిక్కిలి మంచిది. 'నేను ముక్తుడను, ముక్తుడను' అని పలుకుచుండిన చివరకు ముక్తుడు కాగలుగును. 'నేను బద్ధుడ' నని తలచువాడెల్లప్పుడును బద్ధుడుగనే యుండిపోగలడు. ఎవడు నేను 'పాపిని, పాపిని' అని తలంచునో ఆ మూర్ఖుడే పతనము నందును. అందులకు మూరు 'నే నీశ్వరభక్తుడను. ఆయన నామమును జపించుచున్నాను. నాకు పాపమెక్కడిది, బంధమెక్కడిది' అని పలుకుట మంచిది.

చూడుము. నా కీరోజు మనస్సు చక్కగా లేదు. హృదయుడు తనకు చాల జబ్బుగా నున్నదని యుత్తరము వ్రాసియున్నాడు. ఇది మాయయా? దయయా?

'మ.' ఏమియు చెప్పజాలక యూరకుండెను.

శ్రీరామ:—మాయ యన నేమియో తెలియునా? తల్లి, తండ్రి, సోదరీ సోదరులు, స్త్రీపుత్రులు, మేనల్లుడు, మేనకోడలు,—వీరి యందలి ప్రేమ. సర్వభూతములయందు సమానమై ప్రకాశించెడి ప్రేమయే దయ. హృదయునియెడగల నా యీ భావము మాయయా?

దయయా? కాని హృదయుడు నా కెంతయో సేవ కావించియున్నాడు. నా దేహారోగ్యము చెడియుండినపుడు ఎంతయో సేవ చేసెను. మఱి యెంతయో శాసించియు నున్నాడు. వాని శాసనము భరింపలేక గంగలో నురికిపడి దేహత్యాగము చేయుదునా యని గూడ తలంచితిని. కాని అతడు నాకొఱ కెంతయో పాటుపడి యున్నాడు. అతనికి కొంత ద్రవ్యము లభించిన నేను సంతసింతును. కాని నే నే ధనవంతున కీ విషయము చెప్పగలను?

సుమారు మూడుగంటలకు అధర సేనుడు, బలరాముడు వచ్చి సాష్టాంగ నమస్కారము గావించిరి. 'మీరెట్లున్నారు' అని వారు గురుదేవుని విచారించిరి. అందులకు ఆయన 'నా శరీరము బాగుగానే యున్నది కాని మనస్సు బాగుగాలేదు' అని వచించెను. కాని హృదయుని విషయముమాత్ర మేమియు పలుకలేదు.

సింహవాహిని దేవీమూర్తినిగూర్చి సంభాషణ ప్రారంభమాయెను.

శ్రీరామ —నేను సింహవాహినిమూర్తిని జూడ వెడలియుంటిని, అది మల్లికుని వంశజుల గృహమున ప్రతిష్ఠింపబడియుండెను. వారెల్లరు ప్రస్తుతము చాల బీదలై యున్నారు. ఆ గృహమెల్ల శిథిలమై యున్నది. దేవాలయమునందంతటను నాచుపట్టి క్రిందంతయు పావురముల రెట్టలతో నిండియుండెను. మల్లికుని వంశజులలో నితరులు మాత్రము బాగున్నారు కాని వీరుమాత్రము తీసిపోయియున్నారు. ఇందుగల భావమేది? (దీని యర్థమేది?)

'మ.' ఏమియు బదులు పలుకలేదు.

శ్రీరామ:—ఏమియో తెలియునా? ఎవరి కర్మముల వా రనుభవింపవలసినదియే. సంస్కారములు ప్రారబ్ధము—ఇవన్నియు నమ్మవలయునవి అట్లయినను ఆ యింటియందలి సింహవాహినిమూర్తి ఉజ్జ్వలముగానే యుండెను. ఈశ్వరావిర్భావమును నమ్మవలయును.

ఒకప్పుడు విష్ణుపురమున కేగితిని. (శ్రీరామకృష్ణులవారి జన్మస్థానమున కనతిదూరమున నున్న ఒకానొక జమీందారీ) అచ్చట రాజుగారిచే కట్టింపబడిన దేవాలయము లెన్నియో కలవు. వానియం దొకదానియందలి దేవీమూర్తి నామము మృణ్మయ దేవి. ఆ దేవాలయము నొద్ద తటాకములు కొన్ని కలవు. వానికి లాల్ బంద్, కృష్ణబంద్ అను నామములు గలవు. ఒక చెఱువునందలి నీరమును స్త్రీల శిరోధార్యమగు వాసనద్రవ్యముగంధము గలిగి యుండెను. దీని యర్థమేమి? ఆ దేవాలయమునందలి మృణ్మయదేవికి అట్టి సువాసనద్రవ్యముల నివేదింతురని నే నెఱుంగను. ఆ చెఱువు నొద్దనుండగనే నేను సమాధిస్థితి నందితిని. ఆ సమాధియందు నీటినుండి మృణ్మయదేవి నడుముబంటిబయటికి వచ్చెను. ఆ దేవీవిగ్రహమూర్తిని నే నింతవఱకు చూచియుండలేదు. అదియే ప్రధమ దర్శనము.

ఇట్లు కొంతకాలము గతింప భక్తులెల్లరు గుమిగూడిరి. కాబూలునందు జరుగుచుండిన విప్లవము, యుద్ధము—ఏనినిగూర్చి చర్చ జరుగుచుండెను. ఒకభక్తుడు యాకూబ్ ఖాన్, ఆఫ్గన్ స్థాన్ అమీరు సింహాసనచ్యుతుడయ్యెనని వచించెను. మఱల ఆ భక్తుడు శ్రీ గురుదేవుని సంబోధించి, యాకూబ్ ఖాన్ మంచి ఈశ్వరభక్తుడని విన్నవించెను.

శ్రీరామ:—సుఖదుఃఖములు దేహధారణ ధర్మములని నీ వెఱుంగవలయును. కవికంకణ

చండీగ్రంథమునందు ఇట్లు వచింపబడియున్నది కాళీవీరుడు గలడు. అతడు కాళీవరపుత్రుడు. అయినను ఆతనిని చెఱలోబెట్టి గొప్ప పాషాణము నాతని ఱొమ్మున బెట్టిరి. కాన దేహధారణము సుఖదుఃఖముల యనుభవార్థమే. శ్రీమంతుడుగూడ గొప్ప భక్తుడు. ఆతని తల్లి ఖుల్లానా భగవతివలన నెంతయో ప్రేమింపబడుచుండెను. అయినను శ్రీమంతుని కష్టముల కంతములేకుండెను. ఆతని తల నఱకుటకు స్మశానమునకు దోడ్కొనిపోయిరి. కట్టెలు గొట్టువాడు ఒకడు పరమభక్తుడై యుండెను. దేవిని ఎంతగనో పూజించుచుండెను. దేవి ఆతనికి దర్శనమొసగి యెంతయో కృప జూపియుండెను. అయినను వాని జీవనవృత్తి మాత్రము మారలేదు. కట్టెలుగొట్టి వానినమ్మిననే వానికి పూట గడచెడిది. దేవకి చతుర్భుజ చంక చక్ర గదాధారియగు భగవానుని చెఱలో కన్నులార గాంచెను కాని కారాగృహమునుండి మాత్రము విముక్తురాలు కాలేదు.

'మ.'—కారాగార విముక్తత మాత్రమేమి? శరీరమే అన్నిటికీ కారణము. శరీరమునుండియే విముక్తి కావలసియుండెను.

శ్రీరామ—ఇదంతయు ప్రారబ్ధకర్మానుభవము. ఈ భోగానుభవ మున్నంతకాలము శరీరమును ధరించుచుండవలయును. ఒకానొకప్పు డంధు డొకడు గంగాస్నానము గావింపనేగెను. స్నానము చేయగనే ఆతని పాపములు తొలగిపోయినను ఆతని గ్రుడ్డితనము మాత్రము వదలలేదు. (అందఱు నవ్విరి). పూర్వజన్మకర్మఫలము మిగిలియుండెను గాన వాడు దానిననుభవించుచుండెను.

'మ.'—వదలిన బాణము నెవరును అడ్డుపెట్టజాలరు.

శ్రీరామ—శారీరక సుఖదుఃఖము లెట్లు పోయినను పోనిమ్ము. భక్తుని జ్ఞానైశ్వర్యములు మాత్రము శాశ్వతములై యుండును. చూచితివా పాండవు లెన్ని కష్టముల పాల్పడిరో? అయినను అట్టి జ్ఞానము భక్తియు గలవారి నెందు గనగలవు?

ఈ సమయమున నరేంద్రుడు, విశ్వనాథోపాధ్యాయులు వచ్చిరి. విశ్వనాధుడు నేపాల రాజు వకీలు, ప్రతినిధి. శ్రీరామకృష్ణ గురుదేవులాతని కేప్టన్ అని పిలుచువారు. నరేంద్రునకు ఇరువదిరెండేండ్ల ప్రాయము. బి. ఏ. చదువుచుండెను అప్పుడప్పుడు వచ్చుచు పోవుచుండెడివాడు. వారిరువురు శ్రీరామకృష్ణ గురుదేవులకు నమస్కరించి కూర్చొనిరి. నరేంద్రుని ఒక పాట పాడుమని శ్రీ గురుదేవుడు కోరెను. గదియందొకమూలను తంబూరా వ్రేలాడుచుండెను. తబలాకూడ శ్రుతి సరిచూచి పెట్టబడెను. అందఱును పాట విన కుతూహలపడుచుండిరి.

శ్రీరామ—(నరేంద్రుని జూచి) ఇవి మును పటివలె మ్రోగుటలేదు.

కేప్టన్—పూర్ణములయినవి. అందువలననే శబ్దము కలుగలేదు. (పూర్ణకుంభము) నిండు కుండలు తొణకవుగదా! (అందఱును నవ్విరి).

శ్రీరామ:—అట్లయిన నారదాదులో?

కేప్టన్:—వారు పరుల దుఃఖనివారణార్థము పలుక నారంభించిరి. పరుల దుఃఖమువలన వారి మనస్సు ద్రవించినది.

శ్రీరామ — అవును. నారదుడు, శుకదేవుడు — వీరందఱును సమాధిస్థితినుండి దిగి వచ్చిరి. దయార్ద్రహృదయులై పరహితార్థము వారు సంభాషించుచున్నారు.

నరేంద్రుడు పాట నారంభించెను.

(పాట భావము)

ఏనాడు సత్యశివసుందరుడు నా హృదయ కుహరమున నావిర్భవించునో కదా! ఆయనను జూచుచు నే నెన్నడా యానందసాగరమున నోలలాడగలుగుదునో! జ్ఞానానంతరూపమున నా హృదయకుహరమున భగవాను డావిర్భవింప నా మనము ఆశ్చర్యచకితమై ఆయన శరణు జొచ్చును. హృదయాకాశమున ఆనందామృతరూపమున ఆయన ఉదయింప చంద్రోదయమున జకోరములు హర్షించు చందమున నా మనస్సు ఆయన ప్రకాశమువలన హర్షమున దేలియాడును. శాంతిమయుడును, శివుడును, అద్వితీయుడు నగు ఆ రాజరాజునకు సమర్పించి నా జీవనము సఫలము గావించుకొందును. ఇట్టి యవకాశ మింకెందు నాకు లభింపగలదు! అదియే సశరీర స్వర్గసుఖము. శుద్ధుడవును, అపాపవిద్ధుడవు నగు ఓ నాథా! నీ ప్రకాశము వలన దీపముల ముందటి యంధకారమువలె నా పాపము పటాపంచలగును. హే ధ్రువతారమూర్తీ! హే దీనబంధూ! నా కోరికల నెఱవేర్పుము. నేను రేయింబవళ్లు ప్రేమానందమగ్నుడనై యుండుగాక. నిన్ను పొంది నన్ను నేను మఱచునట్లు చేయుము. ఆ దిన మెన్నడు రానున్నదో కదా!

ఆనందామృతరూపుడన్న వచనము వినుటయు గురుదేవుడు గభీరసమాధిస్థితుడయ్యెను. పూర్వాభిముఖుడై చేతులు జోడించుకొని కూర్చొని ఆనందమయరూపసాగరమున నిమగ్నుడై పోయెను. ప్రాపంచికజ్ఞాన మావంతయు లేకపోయెను. కనురెప్పలు చలింపలేదు. నిశ్శ్వాసోచ్ఛ్వాసము లున్నవా లేవా యన్న సందేహమే. చిత్రార్పితునివలె కూర్చొని యుండెను. ఈ రాజ్యమునే వదలి యెందులకో బోయినట్లు గన్పట్టుచుండెను.

నరేంద్రుడు పాట ముగించి బయటికి బోయెను. అచ్చట వసారాయందు హాజ్రా కంబళాసనమున చేత జపమాల ధరించి కూర్చొనియుండెను. నరేంద్రు డాతనితో సల్లాపమేగెను. శ్రీరామకృష్ణుని సమాధి ముగిసెను. నలువైపుల జూచెను. గదినిండుగ జను లున్నను నరేంద్రు డందు లేడు. భక్తులందఱేకాగ్రదృష్టితో జూచుచుండిరి.

శ్రీరామ — నిప్పంటించినైనది. పిదప నాతడున్న నేమి పోయిన నేమి? (కేప్టన్‌తో) నీవు చిదానందము నారంభింపుము. అప్పుడు నీ కానందము కలుగును. చిదానంద మెల్లప్పుడు నున్నదియే. ఆవరణ విక్షేపములే ఆటంకములు. విషయాసక్తి తగ్గిన కొలదియు మనస్సు మఱింతగా భగవంతుని ప్రాపించును.

కేప్టన్. — కలకత్తా సమీపించిన కొలదియు కాశీ దూరమగుచుండును. కాశీ దగ్గరించిన కొలదియు కలకత్తా దూరమగుచుండును.

శ్రీరామ — శ్రీమతి రాధ శ్రీకృష్ణుని సమీపించిన కొలదియు శరీర సుగంధము మిక్కిలిగా ఆమెకు ప్రసరించుచుండెను. మనము భగవంతుని దగ్గఱకు బోయిన కొలదియు ముక్తిభావము లనంతములగుచుండును. నది సముద్రమును సమీపించిన కొలదియు

పోటుపాట్లధికమగుచుండును. జ్ఞాని యెల్లప్పుడు ఈశ్వరానుభవమును గలిగియుండును. ఆతని మనస్థితి పోటుపాట్లులేని ఒంటరి గంగానది వంటిది. ఆతని కంటికి యావత్ప్రపంచమును స్వాప్నికము. భక్తుని మనస్సట్టిదికాదు. పోటుపాట్లు గలవు. ఆతడు నవ్వును, ఏడ్చును, పాడును, ఆడును, ఒకప్పుడు మంచుగడ్డవలె మునుగును, మఱియొకప్పుడు లేచుచుండును. జ్ఞాని వెదకునది బ్రహ్మసాక్షాత్కారము. కాని భక్తునకు కావలసినది షడైశ్వర్య సంపూర్ణుడు, సర్వశక్తి సమన్వితుడునగు భగవానుడే! కాని శక్తియు బ్రహ్మయు నభేదములు. సచ్చిదానందుడే సచ్చిదానందమయి. మణియే జ్యోతి, జ్యోతియే మణి జ్యోతిలేని మణియు, మణిలేని జ్యోతియు మనకు భావనాతీతములు. సచ్చిదానంద మొక్కటియే. శక్తి ఉపాధి భేదములవలన నానారూపములు ధరించియుండును. సృష్టి స్థితి ప్రళయములు జరుగుటయు శక్తికార్యములే. ఆ సచ్చిదానందమే ఆద్యాశక్తి. ఎట్లన, కేప్టన్ ఒకప్పు డేపనియును జేయడు, ఒకప్పుడు పూజ చేయుచుండును. ఒకప్పుడు గవర్నరుగారితో మాట్లాడుచుండును. ఇదంతయు చేయునది ఒక కేప్టనే కదా.

కేప్టన్ — చిత్తమండీ!

శ్రీరామ. — ఈ విషయమే కేశవసేనునకు జెప్పియుంటిని.

కేప్టన్ — ఓ! కేశవసేనుడా! అతడు భ్రష్టాచారి, స్వేచ్ఛాచారి అతడు బాబూ గాని సాధువుగాడు.

శ్రీరామ. — (భక్తులతో) కేప్టన్ నన్ను కేశవసేనునొద్దకు వెళ్లవలదని పలుకుచున్నాడు.

కేప్టన్ — అయ్యా! మీరు పోవుదురు. నేనేమి చేయగలను?

శ్రీరామ. — (విరక్తిచెంది) నీవు డబ్బుకొఱకు గవర్నరు దగ్గఱకు వెళ్లవచ్చును గాని నేను కేశవసేను నొద్దకు పోరాదుకదా! అతడును భగవద్ధ్యానము కావించును. హరినామజపము గావించును. భగవన్మాయయే జీవము జగత్తు అని నీవు పలుకవచ్చును. ఈశ్వరుడు సమస్త జగత్తును జీవరాశియునై ప్రకాశించుచున్నాడు.



"నా జన్మగ్రామప్రాంతములందు స్త్రీలు వరియడుకులను దంచుచుండగా చూచినాను. ఒకతె ఒకచేతితో ఱోటిలోని గింజలను కదలించుచుండును, రెండవచేతితో తన బిడ్డను ఱొమ్మున జేర్చుకొని పాలిచ్చుచుండును. ఆ సమయమునందే కొనువానితో ఇట్లు బేరమాడును. 'పాత లెక్క ప్రకారము నీవు నా కింతబాకి, ఈ రోజున ఇంత ఈయవలయును.' ఒకపక్క ఈ పనులను జూచుకొనుచు, ఇంకొకపక్క చేతిమీద రోకలి పడి నలుగకుండ జాగరూకతవహించియే యుండును. నీవును సంసారమున ఆ విధముగ మెలగుము. మనసు సదా భగవంతునియందే నిలిపియుంచుము. ఆ మార్గమునుండి తొలగి వర్తించితివా, అనేకమైన అనర్థములు సంభవించును."

— శ్రీ రామకృష్ణ పరమహంస

# ధర్మ పరిశీలన

## విశ్వమత సిద్ధికి మార్గము

### శ్రీ వివేకానందస్వామి

(గతసంచిక తరువాయి)

తా నెచటనున్నను, మానవుడు విశ్వాసమును వికసింపజేసికొని, తనపారమార్థిక స్వభావమును బెంపొందించుకొనవలయును. ఈ ప్రపంచమందలి వివిధమతములను జదివి, మఱి యొక విషయమును నేను గ్రహించితిని. జీవాత్మ, పరమాత్మలను గురించి మూడు వేర్వేరు భావస్థితులుగలవు. మొట్టమొదట, శరీరమునకు నాశనముకలదనియు, శరీరమువలె గాక, నిర్వికారమైన, నిరంతమైన, నిత్యమైన యొకానొక భాగమో వస్తువో దానియందున్నదని సర్వమతము లంగీకరించుచున్నవి. కాని, యిటీవలి మతములు కొన్ని, మనయందలి వినశ్వర పదార్థమునకు అంతములేకున్నను, దానికి ఆదికలదని బోధించుచున్నవి. కాని, ఆదియున్న ప్రతి వస్తువునకును తప్పక అంతముండియే తీరవలయును. మనలోని ప్రధానాంశమే మనము. అట్టి మన కెన్నటికిని ఆదియే లేకుండెను, మఱి అంతమనునది కూడ నెన్నటికి నుండదు. ఈ శాశ్వత స్వభావముగల మన అందరికంటెను పైన, అంతములేని శాశ్వతు డింకొకడు కలడు. వాడే భగవంతుడు. జగదారంభమునుగురించి, మానవుని యారంభమునుగురించి జనులు ప్రసంగించుచుందురు. ఆరంభమను మాటకు యుగారంభమని మాత్రమే యర్థము. అంతేకాని, యావద్విశ్వారంభమని దాని యర్థముగాదు. సృష్టికి ఆరంభముండుట యసంభవము. ఆరంభకాలమును మీరెవరుగాని యూహింపజాలరు. ఆరంభముకలదానికి, అంతముండి తీరవలసినదే. నేనెన్నటికిని అంతరించి యుండలేదు. మీరుగాని, మనలో నెవరుగాని, ఇటు తరువాత నెన్నడును అంతరింపము.'' అని భగవద్గీత చెప్పుచున్నది. సృష్ట్యారంభ ప్రసక్తివచ్చిన చోట్లయందెల్ల ఒక యుగారంభమని అర్థము. మీ శరీరము మరణించునేగాని మీ యాత్మ యెన్నటికిని నశింపదు.

ఈ జీవాత్మ భావముతోపాటు, దాని పూర్ణత్వమును గురించిన భావసంపుటి మనకు కనుపడును. వస్తుతః జీవాత్మ పరిపూర్ణుడు. సృష్ట్యాదిని మానవుడు సంపూర్ణుడని హీబ్రూ న్యూటెస్టమెంటు (New testament) ఒప్పుకొనుచున్నది. మనుష్యుడు స్వకర్మ ఫలితముగా అపవిత్రుడైనాడు. కాని తన పూర్వపవిత్ర స్వభావము నతడు తిరిగి బడయవలసి యు

న్నాడు. ఈ విషయములను కొందరు కథల రూపముననను, చిహ్నముల రూపముననను, దృష్టాంతరూపముననను ప్రసంగించుచుందురు. వీరు చెప్పనట్టి విషయములను పరిశీలించితి మేని, మానవుని ఆత్మ నైసర్గికముగా పూర్ణ మైనదని, ఆ యాదిమ పవిత్రత నతడు మరల బడయవలసిన వాడని వారందరును బోధించు చున్నట్లు, మనకు విశదమగును. మానవుడు తన సహజ పూర్ణత్వమును, పవిత్రతను మరల నెట్లు బడయగలడు? భగవంతుని తెలిసికొనుట వలన. హీబ్రూబైబులు చెప్పినట్లు, భగవత్పు త్రుని ముఖముననతప్ప ఏ మానవుడుగాని భగ వంతుని దర్శింపజాలడు. దీని భావమేమి? యావన్మానవజీవిత లక్ష్యమును, పరమావధి యును ఆ భగవద్దర్శనమే. జగత్పితతో తాదా త్మ్యస్థితి సిద్ధించుటకుపూర్వము, భగవత్ పుత్ర త్వము సిద్ధింపవలయును. తనకర్మల ఫలితము వలననే మానవుడు తన పవిత్రతను కోల్పోయి నాడను విషయమును జ్ఞప్తియం దుంచు కొనుడు. మనము కష్టపడుచున్నామనిన, మన మన కర్మల ఫలితముగనే కష్టపడుచున్నాము, అందులకు భగవంతుడు నింద్యుడుకాడు. ఈ భావములకు సన్నిహిత సంబంధముగల పున ర్జన్మ భావ మొకప్పుడు విశ్వసమ్మతి నొంది యుండెను. యిరోపా దేశీయులు కాలక్రమ మున దాని నపభ్రంశము చేసినారు.

ఈ విషయమును మీలో కొందరు విని యుండినను నిర్లక్ష్యముచేసి యుండవచ్చును. ఈ పునర్జన్మ భావముతో సరిసమానముగా వర్తించునది మానవ జీవాత్మ నిత్యత్వ సిద్ధాం తము. ఏదో యొకచోట అంతముకలదాని కొక ఆరంభావస్థ యుండక తప్పదు. ఇట్లే ఒకానొకచోట ఆరంభమగునది ఏదికాని అంతముకాకుండ నుండజాలదు. మానవ జీవాత్మారంభమువంటి దారుణ వైపరీత్యమును మనము విశ్వసింపజాలము. పునర్జన్మ సిద్ధాం తము జీవాత్మ స్వాతంత్ర్యమును ధృవపరుచు చున్నది. కేవలారంభ మొకటి యుండె నను కొనుడు. అట్టి సందర్భమున, మానవునియందు గల ఈ అపవిత్రతకు భగవంతుడే పూర్తిగా బాధ్యుడగును! పరిపూర్ణ దయామయుడగు భగవంతుడీ ప్రపంచపాపములకు బాధ్యుడు! ఈ విధముగ పాపము సంభవించు నెడల, ఒకరు మరియొకరికంటె ఎక్కువగ నేల కష్ట పడవలయును? సర్వభూత దయామయుడగు భగవంతునియం దుండియే పాపముత్పన్నమగు చున్నయెడల, ఈ పక్షపాత మేందుకు? లక్ష లాది జనులు నిరంకుశాధిపుల కాళ్లక్రింద పడి నలగనేల? ఏపాప మెన్నడును చేసియుండని ప్రజలు తిండిలేక ఎందుకు మాడుచుండ వల యును? దీనికి బాధ్యులెవరు? అందుకు వా రెంతమాత్రమును బాధ్యులు కానిచో, భగ వంతుడే తప్పక బాధ్యుడగును. కనుక ఒక డనుభవించు కష్టములకు వాడే బాధ్యుడను సమాధానమే ఎక్కువ మేలైనది. నేనేదైన పని నారంభింతునేని, అందువలన కలుగు ఫలితములకు నేనే బాధ్యుడను.

(సశేషము)

# ఆత్మజ్ఞాని వివేకానందుడు

'శ్రీ'.—

క్రీ. శ. 1862 వ సంవత్సరము జనవరినూాస మున శ్రీ వివేకానందస్వాములవారు జన్మించిరి. వారి జన్మకాలమున వంగదేశము వివిధ విషయములందు ఉన్నతదశ నందియుండెను. సాహిత్యమున బంకించంద్ర ఛట్టోపాధ్యాయుడు, సాంఘిక విమర్శకులయందు ఈశ్వర చంద్ర విద్యాసాగరుడు, ధర్మజీవనమున దేవేంద్రనాధఠాకూరు, కేశవచంద్రసేనులు మున్నగువారు వన్నెగాంచియుండిరి.

అట్టికాలమున బుట్టిన వివేకానందులు జన్మమునుండియు ఆత్మజ్ఞానమును బడసియుండిరి. వారినిగూర్చి శ్రీరామకృష్ణులవారిట్లు పలికెడివారు "నరేంద్రుడు మూర్తీభవించిన ధర్మము. ఈ యుగమున నింతవఱకును నిట్టివారు జన్మింపలేదు నరేంద్రుడు పురుషుడు, నేను ప్రకృతిని." కొన్ని సందర్భములందు ఇట్లు గూడ వచించువారు "అఖండ బ్రహ్మమున తమ యస్తిత్వమును నిలుపుకొనజాలక దేవతలండఱును అందే లీనమైపోవుదురు. కాని సప్తర్షులు మాత్రము విడిగా తమ అస్తిత్వమును నిలువబెట్టుకొని ధ్యానమున నిమగ్నులగుచుందురు. వారియందొకానొక మహర్షి యంశావతారమే నరేంద్రుడు." మఱియొక సమయమున శ్రీగురుదేవులు శ్రీరామకృష్ణులవారిట్లు వక్కాణించిరి "జగద్రక్షకుడైన శ్రీమన్నారాయణు డొకానొకప్పుడు నరనారాయణులుగ వెలసి తపమొనర్చెను. ఆ నరుడే ఈ నరేంద్రుడు. నరేంద్రుడు శుకమహర్షివలె పవిత్రుడు. ఆతనిని మాయ స్పృశింపజాలదు."

ఈ వచనముల జదివి కొందఱు "ఇది నిజమేనా?" యని సంశయింపవచ్చును. శ్రీరామకృష్ణగురుదేవుని శిష్యుడగు శ్రీయోగానంద స్వాములవారిని కొందఱిట్లే ప్రశ్నింపగా శ్రీవారిట్లు సమాధానించిరి "శ్రీరామకృష్ణుల వారి పలుకులన్నియును యధార్థములే. వారి శ్రీముఖమునుండి యెన్నడును అసత్యము వెలువడనే లేదు."

శైశవమునుండియు నరేంద్రులకు ధర్మజీవనమున సంపూర్ణానురాగముండెడిది. అయినను ఎట్టివారి పలుకులనేనియు విమర్శక దృష్టితో పరిశీలింపక విశ్వసించెడివారు గారు. సమస్త విషయములకును ప్రమాణములను నిరూపింప గోరెడివారు. ఏసుక్రీస్తు శిష్యులయందొక్కరగు సెయింట్‌పాల్ గారు వచించెడి "Prove everything, hold fast that which is true" అను పలుకులును శ్రీవారి వాక్కులును నొకేవిధముగ నున్నవి.

ఇతర జాతీయు లుపయోగించిన పాత్రలను వాడినచో తనజాతి భ్రష్టమైపోవునా యని పరిశీలించుటకై మహమ్మదీయుల యుపయోగార్థమై తమయింటనుంచబడిన హుక్కాను బీల్చిరి. సంపెంగచెట్టుపై బ్రహ్మరాక్షసి కలదనివిని యాపలుకులయందలి యాథార్థ్యమును గుర్తింపదలంచి ఆచెట్టుపైనెక్కి, అది తన్నెట్లు బాధింపగలదో పరీక్షించుటకై యొక్కపెట్టున తదేకచింతతో నెంతోకాల మాచెట్టుమీదనే గడిపిరి. ఇట్టివారికి బ్రహ్మజిజ్ఞాస కలుగుటయందేమి యాశ్చర్యము! కావుననే వీరు మహర్షి దేవేంద్రనాధునిజూచి, "మహాశయా! తమరు ఈశ్వరుని గాంచితిరా" యని ప్రశ్నింప, ఋషి

వర్యులు "వత్సా! నీ నేత్రములయందు యోగులదృష్టిని చూచుచున్నా"నని వచించిరి. కాని తమ ప్రశ్నకు తగిన సమాధానమును బడయువఱకు విడువని నరేంద్రులు దక్షిణేశ్వరమునకేగి శ్రీరామకృష్ణగురుదేవునిగూడ ఇట్లే ప్రశ్నించిరి. అందులకు వారు, "ఔను నిన్ను నే నెట్లు జూచుచున్నానో అంతమాత్రముగనే కాక ఇంకను ఉజ్జ్వలముగా, భగవానుని జూచుచున్నాను" అని వక్కాణించిరి. ఆ పలుకులకు నరేంద్రు లాశ్చర్యమందిరి. "ఈశ్వరుని నేను జూచితి'నని ఇట్టి సాహసముతో వచించిన వారు శ్రీగురుదేవు లొక్కరే. ధర్మము సత్యము. మన మెల్లరమును దానిని అనుభూతిలోనికి దీసికొనిరాగలము. ఈ జగత్తు ఎట్లు మనకు స్పష్టముగా గోచరమగుచున్నదో యంతకంటె సహస్రగుణాధికముగా స్పష్టముగా భగవానుడు ప్రత్యక్షముగావచ్చు" నని నరేంద్రులు దెలిసికొనిరి.

శ్రీస్వాములవారు వీరత్వమునకుఎక్కువ ప్రాముఖ్యత నిచ్చువారు. మన దేశీయ యువకులకు "You must have nerves of steel and muscles of iron" అని ఇచ్చిన సందేశము జ్ఞప్తి నుంచుకొనదగినది. ఇట్టి మనోభావమే నరేంద్రుల యద్వైతమార్గానుసరణమున దోడ్పడెను.

అద్వైతమతమును నెలకొల్పినవారు శ్రీ శంకరాచార్యులవారు. ఆకాలమున శూన్యవాదమును ప్రచారించుచుండిన బౌద్ధధర్మమునకంటె హిందూధర్మము శ్రేష్టతను జూపినవారు వీరే. వీరి మతానుసారము "ఒకటియే సద్వస్తువు. అదియే బ్రహ్మము. ఏకం సద్విప్రా బహుధావదంతి." దేశకాల నిమిత్త భేదముల ననుసరించి ఆ ఒకేవస్తువు బహుప్రకారముల భాసిల్లుచున్నది. దీనినే కేంట్ (Kant) 'Space, Time, Causation" అని నుడివియున్నాడు. Matter (జడము) అనునదేమియు లేదు. ఉన్నదంతయు ఒక్క (Spirit) చేతనమే. ఈ పలుకులన్నియు ఉపనిషత్తులయందలి 'సర్వం ఖల్విదం బ్రహ్మేతి" వాక్యములే. ఆంగ్లసాహిత్యమున ప్రసిద్ధిగాంచిన Carlyle "Matter exists spiritually only" అని పలికియున్నాడు. సూఫి మతస్థుల 'అనల్ హక్" నకు కూడ నిదియే యర్థము. Emerson యొక్క "Over soul" సైతము దీనినే సూచించుచున్నది. దీనినే శ్రీ వివేకానందుల వారిట్లు వ్రాసియున్నారు —

అందఱియందు నేను, నాయందే యుందఱును,
ఆనందము, ఆనందము, ఆనందమె కేవలము

ఈ యద్వైతవాదమున చివరిపలుకు 'తత్త్వమసి' యనునది. దానిని బడయుటకు కావలయునవి నిత్యానిత్యవస్తు వివేకము, వైరాగ్యము, శమము, దమము, తితీక్ష, ఉపరతి, శ్రద్ధ, సమాధానము, ముముక్షుత్వము.

అయినను శ్రీ స్వామివారిని కేవలము అద్వైతవాదిగా చిత్రించిన వారి సంపూర్ణ మానవత్వమును తెలిసికొనజాలము. వారు జ్ఞానము, శక్తి—ఈ రెంటి నుపాసించినను, వారి జీవితమందు భక్తి ప్రేమల సమన్వయము చక్కగా గోచరించుచుండెడిది. "The original contribution of Swami Vivekananda is that he has established perfect harmony and co-ordination among conflicting schools of thought and various modes of realisation" అను పలుకులు సత్యములు. సామాన్య మానవులకు అద్వైతము నచ్చదని శ్రీవారికి

దెలియును. కావుననే "అందఱును అద్వైత మును గ్రహింపజాలరు. అది అత్యంతము కష్ట సాధ్యమగుమార్గము. బుద్ధికిగూడ గ్రాహ్యము గానిది. తీక్ష్ణబుద్ధికలవారే దాని నర్థముచేసి కొనగలరు. అందఱికిని ఆ మార్గము సరిపడదు" అని పలికిరి.

ఇందుల కుదాహరణముగ శ్రీవారి జీవితము నందలి ఈ సంఘటనమును గ్రహింపనగును —

శ్రీ గిరీష్‌చంద్రఘోష్ ఒకనాడు శ్రీ స్వామి వారినిజూచి యిట్లు ప్రశ్నించిరి "నరేన్! నేనొకమాట నడిగెదను. నీవెంతయో వేదాం తము జదివియుంటివిగదా? మనదేశమున భరిం పరాని దుఃఖము, క్షామము, వ్యభిచారము, భ్రూణహత్యాది పాపకృత్యములు దైనందినము జరుగుచున్నవిగదా! వీనిని పారద్రోలుటకు, తుదముట్టించుటకు వేదములం దేమైనను సదు పాయము గల్పింపబడియున్నదా?" ఈ ప్రాపం చికకష్టముల విన్నంతనే శ్రీ స్వాములవారి నేత్రము లశ్రుపూరితములయ్యెను. ఆ మనో వేదనను భరింపజాలక శ్రీవా రచ్చటినుండి వెడలిపోయిరి. అంతట గిరీష్‌చంద్రుడు "చూచితివా! ఎంతటి విశాలము, ఎంతటి దయార్ద్రము నగు హృదయముగలవాడు మీ ఆచార్యుడు నరేంద్రుడు! వేదాంతపండితుడని నేను మీ స్వామివారిని సన్మానించుచుండ లేదు. కాని యితరుల కష్టముల విని సహింప జాలక దుఃఖించుచు వెడలిపోయెనుగదా! అందులకే నేనాయనను సన్మానించుచున్నాను, గౌరవించుచున్నాను" అని పలికెను. కొంత సేపటికి శ్రీ స్వామివారు మరలివచ్చి "జి. సీ. ఇదిగో చూడుము. ఈ జగమునందలి దుఃఖ మును పారద్రోలు నవకాశము లభించినచో, అందులకై వేయిజన్మము లెత్తవలసియున్నను నేను సంతోషముతో నట్లే నా జన్మసహస్ర ములను దీనజనోద్ధరణార్థము వినియోగింతును. దీనుల కష్టముల నిట్లు తొలగింపజాలుదునేని యట్లే కావింతును" అని పలికిరి.

అద్వైత వేదాంత గ్రంథముల ననుసరించి ఆత్మజ్ఞానమనునది 'సర్వం ఖల్విదం బ్రహ్మ' యను వాక్యానుసారము అభేద బ్రహ్మజ్ఞానోప లబ్ధియే. ఇట్టి జ్ఞానము బడసినవారికి తాను అను అహంభావము నశించును. అట్టివారు సర్వభూతములందును పై భావమునే గనుగొను చుందురు. కాన ఇతరుల కష్టసుఖములన్నియు తమవిగనే యనుభవింతురు. శ్రీ వివేకా నందులవారు పరులకష్టముల విని సహింపజాలక అశ్రుపూరితులై లేచిపోయిరన్నచో అదియే ఇందులకొక నిదర్శనము. భారతదేశము కష్ట ముల తొలగించుటకే గదా వీరు పాశ్చాత్య దేశములకు బయనముగట్టిరి! అచటికేగి స్వయ ముగా ధనసంపాదనముగావించి, దేశసేవార్థమే శ్రీరామకృష్ణ సేవాసంఘమును నెలకొల్పిరి.

వీరిని ప్రాపంచికవిషయము లేవియు నాక ర్షింపజాలకపోవుటచే అమెరికా దేశీయులు వీరి కెంతయో సన్మానము గావించినప్పటికిని యెన్నియో సుఖసంపదలు వీరికి వాదాక్రాంత ములైనను వానినెల్ల లక్షింపక తమ కర్తవ్య మునే ఆచరించుచుండిరి. విదేశీయులేమి, భార తీయులేమి వీరియెడ జూపిన భక్తి ప్రపత్తులు వీరికి గావించిన స్వాగతోత్సవములు వేఱొక వ్యక్తికే కలిగియున్నచో అతని తల దిమ్మెత్తి ఈ గౌరవవాహినియందు మునిగి తనమార్గము నాతడు సంపూర్ణముగా మఱచియుండెడివా డనుటలో నావంతయు సంశయముగాని ఆశ్చ

ర్యముగాని లేదు. వీరు ప్రపంచమునకు ఆదర్శ ధర్మమార్గమును జూపవచ్చినవారగుటవలన వారి లక్ష్యము సతతము సూటిగా ఏకాగ్రమై యుండెడిది.

సాధారణముగా ఆధ్యాత్మిక లోకమున నడుగువెట్టిన జ్ఞానులెల్లరు తమ ముక్తికొఱకే పాటుపడువారైనను శ్రీవారు మాత్రము ఆ మార్గమును అనుసరింపరైరి. ఏలయన శ్రీవారు తమకు నిర్వికల్పసమాధిని దయచేయుడని శ్రీ గురుదేవుల బ్రార్థింపగా వారిట్లాదేశించిరి: "నీవు విశాల వటవృక్షమువంటివాడవనియు నెందఱో ఉత్తప్తజీవులు నీ చాయనుజేరి సుఖమును శాంతిని బడయుదురుగదా యనియు తలంచితిని. కాని నీ వీ యల్పమైన యాత్మముక్తినే గోరుచున్నావుగదా! హామ్మ! మన కార్యము నెఱవేర్పుము. నీ నిర్వికల్పసమాధి భాండాగారమును మూసి బీగమువైచి తల్లి తాళపుచెవిని నాచేత బెట్టియున్నది. నీ కార్యమంతయు ముగిసిన పిదప దానిని నీవనుభవింపగలవు." దీని ననుసరించి శ్రీ స్వామివారు బహుజనహితార్థము, బహుజనసుఖార్థము—తామీ లోకమున జన్మించితిమని గ్రహించిరి. ఇట్టిలక్ష్యము తమకుమాత్రమే కాక తాము నెలకొల్పిన మఠస్థులగు సన్న్యాసుల కందఱకును లక్ష్యముగా సూచించిరి. కావుననే ఒకానొకప్పుడు సందర్భవశాత్తు వారిట్లు పలికియున్నారు: "తినుట కెద్దియేని మంచి పదార్థము లభించినచో ఏకాకివై భుజించుటవలన నేమి ప్రయోజనము? ఏమి ఆనందము? పదుగురకా పదార్థము నొసగి నీవును భుజించిననేగదా ఆ ఆనందము నీలో నధికరించుట! ఆత్మానుభూతివలన నీవొక్కడవే ముక్తుడవు గావచ్చును. అందువలన జగత్తున కేమి లాభము? జగత్తునకు గూడ ముక్తినొసగి వారిని నీతో గొనిపోవలయును. అప్పుడే నిత్యసత్యమునందు నీవు ప్రతిష్ఠింపబడుదువు."

సాధారణముగా మనము సన్న్యాసాశ్రమమునుగూర్చి యొకానొక భ్రాంతిభావమునకు లోబడియుంటిమి. సన్న్యాసులకు ఆహారము, వస్త్రములు—మున్నగువాని నొసగి సోమరితనమును ప్రబలము చేయుచున్నట్లు భావించుచున్నాము. కాని శ్రీ స్వామివారు, "యథార్థ సన్న్యాసి గృహస్థుల కాచార్యుడు. అపూర్వమగు సన్న్యాసి యుపదేశమును గ్రహించి యందులకు మారుగా గృహస్థులు అన్నవస్త్రము లొసగుచున్నారు. ఇట్టి ఆదాన ప్రదానములే లేనిచో మనదేశస్థులనుగూడ అమెరికాయందలి 'Red Indians' స్థితియే పట్టియుండెడిది....ఇతర దేశములందెట్లున్నను మనదేశమున సాధువులు చుక్కాణి తమచేత బట్టుకొనియున్నందువలననే గృహస్థులు సంసారసాగరమున మునిగిపోవరైరి" యని పలికియున్నారు.

ముఖ్యముగా తెలుపవలసిన విషయమిది: శ్రీరామకృష్ణులవారి ఉపదేశానుసారము వీరు వేఱుగా నవీనసంప్రదాయము నొకదానిని సృష్టింపరైరి. ఎట్టివారి భావమునుగాని గ్రుంగింపని శ్రీరామకృష్ణుల శిష్యాగ్రణియై వెలసిన శ్రీ స్వామివారు స్వయముగా నెట్లు ప్రత్యేక శాఖను నెలకొల్పగలరు? సర్వమానవులకును సాక్షాత్సమన్వయమూర్తియైన శ్రీరామకృష్ణుల వారిపేర సర్వమతావలంబులకును సర్వకులస్థులకును తమతమ లక్ష్యములను అనుసరించి ప్రవర్తింపగలుగుటకే శ్రీరామకృష్ణ సేవాసంఘమును శ్రీవారు నెలకొల్పిరి.

వీరి జీవితము, వీరు గావించిన ఘనకార్యములు, వీరి అపూర్వాధ్యాత్మికానుభూతిని విరివిగా వెల్లడిచేయుచున్నవి. శ్రీకృష్ణభగవానుడు గీతయందు 'సర్వభూతములందును నేనే విరాజిల్లుచున్నాను. దీని నెవరు గుర్తింతురో వారే యోగులు' అని పలికియున్నారు. శ్రీ స్వామివారీ పలుకులకు ఆదర్శపురుషులై తమ ఆత్మజ్ఞానిత్వమును లోకమునకు జాటియున్నారు.

# ప్రార్థనాంజలి

శ్రీ డోకుపర్తి విశ్వజ్ఞాచార్యులు

సీ॥ శ్రీరామకృష్ణసద్గ్ర్య ఽ శేషతపశ్శక్తి, దిగ్భ్రమింగి వెలుగొందు ఽ దిట్ట వీవు
మతధర్మపరిశీల ఽ నాతతరచనలో, నందెదాల్చిన మొన ఽ గాడవీవు
త్రైయోగబోధాను ఽ ధాసరఃక్రీడల, హర్షాబ్ధి ముంచు రా ఽ యంచవీవు
ఆత్మదర్పణములో ఽ నందాలు మెఱిపించి, గమ్మత్తు లొనరించు ఽ ఘనుడవీవు

గీ॥ అనుచు నస్మన్మనఃపుత్రి, ఽ వనజనేత్రి, నిన్ను బ్రేమించి, తపియించు ఽ చున్నదనఘ!
కరుణ లాలించి పాలించు ఽ భరమునీదె, వందనము వివేకానంద ఽ సుందరముని! 1

సీ॥ అజ్ఞానబహుళ సాం ఽ ద్రాంధకారము మాపి, కోటిచంద్రుల నీటు ఽ గులికితీవు
పరమతద్వేష దు ఽ ర్జ్వరపీడితులబ్రోచి, వైద్యరత్నఖ్యాతి ఽ బ్రబలితీవు
ప్రథిత హిందూమత ఽ ప్రహ్లాదు బాలింప, నరసింహమూర్తివై ఽ మెరసితీవు
వరవిశ్వమతసభా ఽ ప్రతిమ కందముదీర్చి, కళల జాటిన శిల్పి ఽ ఘనుడవీవు

గీ॥ అనుచు నస్మన్మనఃపుత్రి, ఽ వనజనేత్రి, నిన్ను బ్రేమించి తపియించు ఽ చున్నదనఘ!
కరుణ లాలించి పాలించు ఽ భరమునీదె, వందనము వివేకానంద ఽ సుందరముని! 2

సీ॥ నీదు వాఙ్మధువును ఽ నెమ్మిగ్రోలనుగాని, మధుపదార్థములెల్ల ఽ వృధలె యయ్యె
నీదు వాగర్థంబు ఽ మీద మోజగుగాని, యర్థంబుపై మోజు ఽ వ్యర్థమయ్యె
నీదు భావోన్నతి ఽ నాదరించునుగాని, నతులాదరించుట ఽ రోతయయ్యె
నీ పల్కు జిగిబిగి ఽ నీటుజాటునుగాని, నీటుజాటనుమాట ఽ నీచమయ్యె

గీ॥ నగయ నా యెదగూతువి ఽ డ్డూరములును, నీదు మాహాత్మ్యమై దోచె ఽ నిజముగాను
కరుణ లాలించి పాలించు ఽ భరమునీదె, వందనము వివేకానంద ఽ సుందరముని! 3

# అమరజీవి శ్రీ అరవిందయోగి

ప్రొ టి. లక్ష్మీనరసింహారావు, బి. ఎస్ సి.

ఒక్క భారతదేశముననే గాక ఖండాంతర దేశములందలి యోగజిజ్ఞాసువుల హృదయములందు చెలరేగిన సంక్షోభను పూర్తిగ శమింపలేదు. భక్తుల హృదయశోక మింకను ఆరలేదు. శ్రీ రమణమహర్షి మహాసమాధిని పొంది, పట్టుమని సంవత్సరమైనను తిరుగలేదు. ఇంతలో బహుభాషాకోవిదుడు, మహాకవి, తత్త్వవేత్త, మహాయోగి, జీవన్ముక్తుడు, జగత్పావనపుణ్యమూర్తి శ్రీ అరవిందులు తన భక్తులకు గత నవంబరు 24 వ తేదీని అంతిమ దర్శనమిచ్చి పది దినములలో సిద్ధిపొందినారు. త్యాగమువలననేగాని అమృతత్వము లభింపజాలదనెడి ఉపనిషదుక్తికి శ్రీ యోగి జీవిత చరిత్ర ఒక ప్రత్యక్ష నిదర్శనము.

శ్రీ అరవిందులు 1872 వ సంవత్సరము ఆగష్టు 15 వ తేదీని కలకత్తాలో జన్మించెను. ఆనాటి వంగదేశీయులలో విద్వత్సంపన్నుల మర్యాదననుసరించి తనకుమారుడు పాశ్చాత్య సంస్కృతియందు సుశిక్షితుడై మహోన్నత పదవి నధిష్ఠించి దేశసేవ యొనర్పగలడని గంపెడాశతో తండ్రి అరవిందుని అతిబాల్యముననే ఇంగ్లాండునకు పంపెను. సుమారు పండ్రెండు సంవత్సరములు అనేక విద్యలభ్యసించి I. C S పరీక్ష కొక అభ్యర్థిగా నెన్నుకొనబడెను. కాని ఆ పరీక్షయం దుత్తీర్ణుడు కాలేదు. ఇట్లా పరీక్షయందు కృతార్థత బడయలేకపోవుట భారత ప్రజల మేలు నుద్దేశించి జరిగిన భగవత్సంకల్పము.

ఈ మహనీయుని ఆంగ్లకవిత్వ మహత్వపటుత్వము ఆయన రచసలయందు ప్రస్ఫుటముగా ప్రకాశించుచున్నది. వాల్మీకి, వ్యాస, కాళిదాసుల హృదయాగారములకు కరదీపములు పెట్టి జిజ్ఞాసువులకు జ్ఞానోదయము కల్గించిన దివ్యజ్ఞాని శ్రీ అరవిందులు. 1893 వ సంవత్సరమున ఇంగ్లాండును వదలి భారతదేశమునకు వచ్చి బరోడా స్థానమున కళాశాలాధ్యక్షుడుగ జేరి సమస్త దర్శనములను పరిశీలించి భిన్నప్రస్థానములగు వివిధ భారతీయ యోగసాధనలయందు గడతేరి హైందవ సంస్కృతియందు సర్వతోముఖ వైశిష్ట్యమును బడసెను.

ఇంతలో 1906 వ సంవత్సరములో భారతదేశపు ప్రతినిధిగ నున్న కర్జను ప్రభువు వంగరాష్ట్ర విభజనను అమలులో పెట్టించి దేశప్రజానీకమునకు అనేక దురన్యాయములు కల్గించుట జూచి సహింపజాలక శ్రీ అరవిందులు బరోడాలో తనయుద్యోగమును వదలి మాతృరాష్ట్రమునకు జేరికొని జాతీయనాయకత్వమును వహించుట కుద్యమించెను. నాటినుండియు భారతస్వాతంత్ర్యమున కెన్నియో పడరాని పాట్లుబడి తుట్టతుదకు బ్రిటిషు ప్రభుత్వము చేతనే వంగరాష్ట్ర విభజనను రద్దుచేయించెను.

దేశసేవాధురంధరుడగు శ్రీ అరవిందులు 1908 వ సంవత్సరమున కాలవశమున ఘోరనేరారోపణకు గురియై విచారణ పూర్తియగు

నంతవరకు ఏడాదిపాటు కారాగార బంధితుడయ్యెను. ఈ కారాగారవాసకాలమంతయు అరవిందులు నిరంతరయోగసముద్రమున తేలియాడి భగవత్సాక్షాత్కారము వడసెను. విచారణ పూర్తియైనది, అపరాధి నిర్దోషి యని నిరూపింపబడి విముక్తిని గావించిరి. రాజకీయ రంగమున తనలీలల జూపి సాంఘికముగ, సాముదాయకముగ, సాంస్కారికముగ, సాంపత్తికముగ, రాష్ట్రీయముగ ప్రజలలో మహాన్నత్యమును కలుగజేసి నిష్క్రమించి కొద్ది కాలమునకే వంగదేశమునుండి మాయమై పుదుచ్చేరిలో పారమార్థికముగ సర్వజనోద్ధరణముకొరకొక యాశ్రమమును నిర్మించి యోగసైపుణ్యమునకు జీవితమును వినియోగించిన దివ్యపురుషుడు, నవ్యయోగి శ్రీ అరవిందులు. మహోజ్వల యోగరంగము నధిష్టించి మానవజీవితవికాసముతో ఆధ్యాత్మిక ప్రగతికి మానవానీకములో నవ్యపరివర్తనమును కలుగజేసెను. దివ్యపరిపూర్ణతయందు ప్రవృద్ధినొందుటయే మనుష్యజీవితముయొక్క పరమధర్మమని నిరూపించి మానవుడు తన భౌతికస్థితిని దైవముయొక్క ప్రతిబింబముగ రూపొందించుట తన పరిణామమని వ్యక్తీకరించెను. సృష్టియొక్క సత్యము ఆత్మ యనియు, జీవన మాత్మవికాసమనియు నిరూపించెను. నాటినుండియు పాల్ రిచర్డ్ దంపతుల సహాయమున 'ఆర్య' పత్రిక మూలమున దేశదేశముల ప్రసిద్ధిపొందిన శిష్య ప్రశిష్యకోటులకు ఆధ్యాత్మిక పథమున నవ్యవీథులు నిర్మించెను.

శ్రీ అరవిందులు రిచర్డ్ సతీమణినే మాతృదేవిగా భావించి దివ్యప్రబోధమును పొంది ఆ తల్లి యోగక్షేమములను వేయికన్నులతో నెల్లప్పుడును కనిపెట్టెను. తమ లక్ష్యసిద్ధికై యాశ్రమ నిర్వహణకార్యమునకు మీరా యని పిలువబడు శ్రీమాతను నియోగించి అమరత్వమందెను. ఇక అమరజీవియగు శ్రీ అరవిందులు ప్రపంచ చారిత్రక పుటలలో స్వర్ణాక్షరలిఖితుడై దివ్యతేజోమయ నామధేయుడై నిత్యయోగోద్దీపమున నుద్భాసించును. మీరామాత నిర్వహణమున పుదుచ్చేరి యోగాశ్రమ మొక మహాసంస్థయై కలకాలము ప్రవర్ధిల్లుచు మానవకోటికి దివ్యజ్ఞానదాయియై సంకుచిత జాతీయ రూపభావముల నశింపజేసి సార్వజనైక జీవితోద్దేశమును ప్రజ్వలింపజేసి ఏకైక ప్రపంచమునకు తోడ్పడును గాక!



న్యాయవాదిని జూచినపుడు వ్యాజ్యెములును న్యాయస్థానములును, వైద్యుని జూచినపుడు రోగములును మందులును స్ఫురించునట్లే సాధుజనులును భక్తులును కనబడినప్పుడు భగవంతుడును ఆముష్మికమును జ్ఞప్తికి వచ్చును.

—శ్రీ రామకృష్ణ పరమహంస

# జీవి కర్తవ్యము

శ్రీ బులుసు వేంకటేశ్వర్లు, బి. ఏ.

చ. జననము నందు టెందులకో? చచ్చుట యెప్పుడో? యుండి జీవి తా
నొనరుపఁ దగ్గదేమియొ? మహోత్తమకార్యము లెట్టివో? తలం
చిన నిది యంతయున్ బరమ నిర్భర వేదన కాలవాలమౌ,
జని వృధయౌను నూరక యసారపథంబున యాత్ర సల్పుచో. ౧

చ. తలఁపఁగరాని జన్మపరితాపము దుర్మరణాతి భీతియున్
దొలఁపని జీవి కేల బహు దోషయుతాధికభాగ్యభోగముల్?
కలిత సమస్త పాపపద కాంక్షలు నీచములున్ క్షణాంతకం
బులు మృష లైన యల్పసుఖముల్ కట! మీసలపైని దేనియల్. ౨

చ. కవి యను గర్వపాటు, ఘనగాయకుఁ డన్ తలదిమ్ము, నున్నతం
బవు పదసంస్థితుం డని యనంతము నొ తెగనీల్గు, పండిత
ప్రవరుఁ డటన్న నిక్కు, ఘనవాహనుఁ డన్ కులు, కర్థరూపసం
భవుఁ డని యెంతయో మిడిసిపాటును నేలొకో? చచ్చు జీవికిన్. ౩

చ. కనుఁగవముందు నిత్యమును గాంచుచు నుండుట లేదె మృత్యువా
తను బడుచుండు టెందఱో గతానుగతంబుగ నింక దేనికై
క్షణికపు జీవితంబునను జంచలబుద్ధిని బర్గు లెత్తుటల్
వనితలకోసమై ధనికవర్గము వెంబడి నెండమావులన్? ౪

చ. కటకటఁ బొట్టు కాంక్షలకుఁ గక్కుఱితింబడి వెంటనంటుటో
దిటవుగు నెమ్మనంబునను దీరముఁ గాంచి తరింప నెంచుటో—
చటులభవాంబుధిం బడక చక్కనిమార్గముఁ బట్టి పుణ్యసం
ఘటనమునన్ మహోన్నతిని గాంచుటో జీవియె తేల్చుకోవలెన్. ౫

చ. పరధనధాన్యసంపదలపైఁ గడుకోరిక; చీము నెత్తురులన్
బరగు నసహ్యదేహమున బంధురమోహము, దేవదేవుఁడై
పరగెడువానిపై విముఖభావము, నుండఁగరానిచో నహం
కరణము, పుణ్యసంతతి నకారణకోపము, జీవి కేలొకో? ౬

చ. బ్రతికిన నాల్గువాళ్లు నిటు పాపపుఁ గార్యము లాచరింపఁగా
మతిచెడి యంత్యకాలమున మ్రగ్గుటకంటెను జీవితాను సం
తత పరమేశ చింతనమునన్ సుకృతంబున ధన్యమౌచు జీ
వితమును వెళ్లఁబుచ్చి జనివేదన వీఁగుట మేలుకాదొకో? ౭



# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిశరణమ్

ఆల్మోరా,
19-12-'15.

ప్రియ ....

మీరు 12 న వ్రాసిన యుత్తరము చదివి విషయము గ్రహించితిని. కొన్నాళ్లనుండియు మీ విషయమే తలపునకు వచ్చుచుండెను. సెలవు ముగిసినపిదప పని మిక్కిలి యధికమయి నదా? సరే! మరల మీకు సెలవులు రావచ్చును. అంతవఱకు కొన్నాళ్లు పనిచేసి పిదప మఱల విశ్రాంతి నందుదురు. ఇట్లే భగవత్కార్యము జరుగుచున్నది. నా శరీరారోగ్యము మునుపటివలెనే యున్నది. ఒకప్పుడు బాగుపడుట, మఱియొకప్పుడు జబ్బుపడుట—ఇట్లే జరుగుచున్నది. ఇది చూడ వ్యాధి తీరునట్లు కనిపించుటలేదు. ఇక మిగిలిన దినములన్నియు గూడ నిట్లే గడచును గాబోలు. భగవదిచ్ఛయే జరుగును. మీ వ్యాకులతను జూచి చాల ఆనందించుచున్నాను. మీ వ్యాకులము ననుసరించి భగవత్కృపయు వర్ధిల్లును. భగవంతుని యందు ప్రేమయు భక్తియు కలిగినచో సకలమును సమకూరినట్లే. భక్తుడు మఱియే యితరమునకై ప్రార్థించును? భగవత్సాక్షాత్కారమునందు కోర్కె పొడమవచ్చును కాని అది ఆయన యిచ్ఛానుసారము జరుగును. అర్జునుడు 'ద్రష్టుమిచ్ఛామి రూప మైశ్వరమ్ పురుషోత్తమ' * యని పలికియు సందేహించినవానివలె ఇట్లు పలికెను 'మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో! యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్.' † ఇదియే తుదిపలుకు. ఆయనకు మనసువచ్చినచో మనకు దర్శనమొసగును. లేనిచో అది దుర్లభము. ఏలయన ఆ దర్శనము కలిగినను శాంతియుండదు. ఈ రూపమును నేను జూడజాలను. కావున నాయందు దయ గ్రహించి ప్రభూ! నీ ప్రకృతి స్వాభావిక రూపమును జూపుమని ప్రార్థించినచో ఆయన ప్రకృతిస్థుడై మనలను రక్షించును. 'దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన, ఇదానీ మస్మి సంవృత్తః సచేతాః ప్రకృతిం గతః'—గీత-11-51. ‡ కావున దర్శనాదుల యందు వాంఛలేక భగవంతుని భక్తి ప్రేమలకొఱకే ప్రార్థింపవలయును. భగవంతుని యెడ భక్తి కలిగినవానికి ఏ కొదువయు నుండదు. "శ్లో. మత్కర్మకృ న్మత్పరమో

---

* పురుషోత్తమా! జ్ఞానైశ్వర్యశక్తి బలవీర్యాది సంపన్నమగు నీ ఈశ్వరీయ రూపమును సాక్షాత్కరింపజేసి కొనగోరుచున్నాను. —గీత-11-3.

† ప్రభూ! నేను ఆ విశ్వరూపమును జూడ యోగ్యుడనని తలతువేని యోగేశ్వరా! నాకు అవ్యయమగు నీ జగదాత్మరూపమును జూపుము. —గీత-11-4.

‡ జనార్దనా! సౌమ్యమగు ఈ నీ మనుష్యరూపమును గాంచి నా చిత్తము ప్రసన్నత నందినది, స్వస్థుడనైతిని.

మద్భక్తః సంగవర్జితః, నిర్వైరః సర్వభూతేషు యః సమామేతి పాండవ.''—పాండవా! నాకొఱకు కర్మముల నాచరించువాడును నన్నే పరమపురుషార్థముగ తలచువాడును ధన మిత్ర పుత్రాదులయం దాసక్తిలేనివాడును నన్నే ఆశ్రయించుకొనియుండువాడును సర్వజీవులయెడ (తన కత్యంతము అపకారమొనర్చువారియెడ గూడ) వైరభావము లేనివాడును అగు వ్యక్తి నన్ను పొందగలడు—గీత-11-55. కేవలము భగవంతునియెడ ప్రేమ మాత్రమే చక్కగా నచ్చిన నంతయే చాలును. మన కేమి ప్రేమింప దెలియదా? స్త్రీ పుత్రాదులు, బంధువులు, ధనము, జనము—వీనియందు మనము మన ప్రేమను బరపి అభ్యసించియున్నాము. ఆ ప్రేమనే యిపుడు మనము భగవత్పరము గావింపవలయును. ఏలననగా ఆయనతప్ప మిగిలినదంతయు ఒకప్పుడుండి మఱియొకప్పుడు నశించునదియే. కాని ఆయనమాత్రము చిరస్థాయి. ఆయనకంటె వేరెవరును మనకు ప్రేమాస్పదులు కాజాలరు. మిగిలినవన్నియు కొన్నాళ్లకు ప్రాబడి రుచి దప్పును. ఒకేవిధముగా కలకాలము నుండదు. కాని భగవత్పరము గావింపబడిన ప్రేమ ప్రతిక్షణము ప్రవర్థిల్లుచు అనంతమగును. 'శ్లో. తదేవరమ్యమ్ రుచిరం నవం నవం—అదియే (ఆ భక్తియే) రమణీయమును, మనోహరమును నిత్యనూతనము నయినది'. తక్కిన భోగములన్నియును సమాప్తములు, అరుచిరములు. కావుననే భక్తుడు 'యాప్రీతి రవివేకానాం విషయేష్వనపాయినీ, త్వామనుస్మరతః సామే హృదయాన్మాపసర్పతు—అవివేకులకు విషయములందు అచంచలప్రీతి కలుగునట్లే నీ స్మరణమునందలి ప్రీతి నా హృదయమునుండి చలింపకుండు గాక!' ఆయనయం దిట్టి ప్రేమ కలిగినచో ఆయన దర్శనమునకై అపేక్ష కలుగదు. ఆ దర్శనము ఆవశ్యకముగా నేర్పడినచో ఆ ప్రభువు స్తంభమునుండియైనను బయలు వెడలి దర్శనమిచ్చుచుండును. పరావరుని దృష్టి చక్షుగోచరము కాకపోయినను హృదయ గ్రంథులను భేదించును. 'శ్లో. హృదామనీషా మనసాభిక్లప్తో య ఏతద్విదుః—హృదయము, సంశయరహిత బుద్ధి, సమ్యగ్దర్శనరూపమనము'- వీనివలననే ఆయన ప్రకాశితుడగును. 'సోఽవిద్యాగ్రంథింవికిరతీహసోమ్య—ఓ ప్రియదర్శనా! అత డీ జన్మమునందే అవిద్యాగ్రంథులనుండి విముక్తుడగును.' కాని ఆయనను ప్రార్థించినచో సాక్షాత్కరింపడని చెప్పుటకును అలవికాదు. ఉపనిషత్తు లిట్లు చాటుచున్నవి. నిజమే. 'న సందృశే తిష్ఠతి రూపమస్య, న చక్షుషా పశ్యతి పర్చనయనం హృదా హృదిస్థం మనసాయ ఏన, మేవం విదు రమృతాస్తే భవంతి.' § శ్వేతాశ్వతరోపనిషత్తు - 4 - 20. సమస్తమును హృదయమునకు సంబంధించినదియే. మన ప్రాణ మెంతగా ఆయనయందుండునో ఆయన ప్రాణమును అంతగా మనయందుండును. ఆయన 'సాచ్చా దిల్ కామిత్రా' అసలు హృదయమునకు బంధువు. సర్వదా హృదయమునందు నివసించుచున్నాడు. మన మెందు చూచుచున్నాము? మన దృష్టి సమస్తమును అన్యవిషయములపై బద్ధమైయున్నది.

---

§ ఆయన రూప మింద్రియగోచరము గాదు. ఆయన నీ చక్షువులతో నెవరును జూడజాలరు. ఎవరు మనో హృదయముల ద్వారా (అతీంద్రియదృష్టివలన) హృదయస్థుండగు ఆయనను దర్శింతురో వారు మృత్యురహితు లగుదురు.

కానిచో ఆయన నింతవఱకు చూడకుందుమా? భక్తుడు సత్యమునే వచించియున్నాడు.

> $ మైకో కాఁహా టోఢో వందేమయితో
> తేరా పాసమో
> ఖోఁ జోగేతో ఆమిలూఙ్గా ఫలభరకే
> తల్లాసమో
> నదేవాలమే నమసజిద మేనకాశీకైలాసమే
> నహ్యాయిమే ఆవుధ్ ద్వారకా మేయా
> ఛేట్ విశ్వాసమో.
> —కబీరుదాసు.

ఆయన మనతోడనే యున్నాడు. కొంచెము వ్యాకులముతో పిలిచినచో ఆయన మనయెదుట సాక్షాత్కరించును అంతటి వ్యాకుల మెవరికి గలదు? మనమెల్లరము కబుర్ల రాయుళ్లమే కాని అంతర్భావముతో ఆయనను బిలుచువారముగాము ఆయన అంతర్యామి యని శాస్త్రములందు చదువుటయే గాని ఆ పలుకునందు నమ్మకమేది? 'సర్వస్య చాహం హృది సన్నివిష్టో' ఈ పలుకు దబ్బరయా? 'మమైవాంశో జీవలోకే, జీవభూత స్సనాతన' ఇదియును అసత్యముకాదు. కాని మనకుమాత్రమవి అసత్యములవలె నున్నవి. ఎందువలన? చదువుటయేగాని మనకు వానియందు విశ్వాసము నహి. అందువలననే మనకీ దుర్దశ 'గురు కృష్ణ వైష్ణవులు అను వీరి ముగ్వురి దయయు ఆవశ్యకము కాని ఒకరిదయ లేకపోవుటవలన సకలమును వ్యర్థమయినది' అను నర్థమొసగు పాటను శ్రీరామకృష్ణులవారు పాడుచుండెడివారు అందరి దయ కలిగియున్నను మనపై మనకే దయ లేనిచో అంతయు నిరుపయోగమని యర్థము 'ఆత్మైవహ్యాత్మనోబంధు రాత్మైవ రిపురాత్మనః, అనాత్మన స్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్'—గీత – 6 – 5, 6 కావున తనపై తన దయ మిక్కిలిగా సహాయకారి యగును అది లేనిచో అన్యుల దయ ఇసుమంతయు పనికిరాదు. భగవంతుని దృష్టి మీయందు ప్రసరించినది. కావున ఆయన మిమ్ము తప్పక కృప జూచును. మిక్కిలి వ్యాకులముతో ప్రార్థింపుడు. భగవంతుడు మీ మనోరథము నీడేర్చునుగాక! ఇదియే నా ప్రార్థన.

ఇట్లు,
శ్రీ తురీయానంద

$ నన్నెందు వెదకుచున్నావు? నేను నీయొద్దనే యున్నాను. నన్ను వెదుక తలపెట్టినచో మిక్కిలి శీఘ్రముగనే కనుగొనగలవు. నేను దేవమందిరమునగాని మసీదులోగాని లేను, కాశీ కైలాసములందు నయితము లేను. మఱియు అయోధ్యా ద్వారకలందుగూడ నేను లేను. కేవలము విశ్వాసమువలననే నన్ను బడయగలవు.



# పూర్ణమానవుడు

శ్రీ పిన్నింటి సుబ్బారావు

(గతసంచిక తరువాయి)

సముద్రమునందు తరంగము రూపము దాల్చును. ఆ తరంగమున్నంతవఱకు, అది వేరు రూపముతోడను, నామముతోడను ఉండును. ఆ తరంగము సముద్రమునం దంతరించిన తోడనే, యా నామము, రూపము రెండును నశించును. కాని సముద్రము మామూలుగనే యున్నది. ఆగంతుకముగా వచ్చినవి తరంగ మనెడి నామ రూపములు. ఇదియే మాయ. మాయకు రూపములేదు. దేశ, కాల, నిమిత్తము లనబరగు ఈ మాయాస్వరూపమువల ననే యీ నామ, రూప, జగత్తు గానబడు చున్నది. ఎవ్వరికి మాయ హరించునో, వారీ ప్రపంచమునంతటిని ఒక్కరూపముగానే గ్రహింపగలరు. రెండు రూపములుగా ఎంతకాలము వఱకు గ్రహింతురో యంతవఱకు వారు పరిపూర్ణులు గానేరరు. బుద్ధి వికసించినకొలదియు, ఈ దృశ్యప్రపంచము భావరూపముగను, ఆ భావప్రపంచము జ్ఞానమయరూపముగను తెలియబడగలదు. ఇట్టి పవిత్రమగు బుద్ధిగలవానికి ద్వైతులు చెప్పిన దేవయాన, పితృయానము లేమగును? నీవు పరిపూర్ణుడవైనపుడు నీవు వెళ్లుట, వచ్చుట ఎక్కడిది. చావు పుట్టుకలు, పుణ్య పాపలోకములు పరిపూర్ణ మానవుని దృష్టియందు మిథ్యలు. ఇవన్నియు, బ్రహ్మలోకపర్యంతము మానవుని దీసికొని పోయి, తదుపరి అంతయు మిథ్య యని బోధించుటకై భ్రాంతియందున్న మానవునకు గఱపు ప్రాథమిక పాఠములవంటివి.

అయినను స్వర్గ, నరకములు, జనన, మరణములు లేవనిన, ప్రపంచమంతయు నీనిని ఎందులకు నమ్ముచున్నారని ప్రశ్నింపవచ్చును. నీ వొక గ్రంథమును చదువుచున్నప్పుడు, అందలి పుటలను తిరుగవేయుచుందువు గాని, దానిని చదువు నీవు మార్పును బొందవుగదా. ఆ పుటల మాదిరిగా, ప్రకృతి లేక మాయ, లేక ఆకాశము, ప్రాణముల కలయిక యీ వివిధమార్పులను బొందుచున్నది గాని ఆత్మగాదనియు, భ్రాంతిచే ఈ మార్పులన్నియు తానే పొందుచున్నాననియు, స్థిరుడైయున్న సూర్యుడు చలించుచున్నాడనియు, చలించుచున్న భూమి స్థిరముగా ఉన్నదనియు గ్రహించుచున్నట్లు తెలంచుచున్నాడు. ఈ ప్రపంచమే మానవబుద్ధితో భూలోకమనియు, దేవబుద్ధితో స్వర్గలోకమనియు, క్రూరబుద్ధితో నరకలోకమునియు చెప్పుచున్నారు. భగవంతు డెచ్చటనో యుండి పుణ్య పాపములకు తగిన ఫలము నిచ్చుచుండు ననువారలకు, మరణానంతరము వారి భావముల కనువగు దృశ్యములనే గాంచుచుందురని చెప్పవలయును. ఈ స్వర్గ, నరకములు మానవుని బుద్ధికల్పితములు. వివిధ దేవతలు, దయ్యా

ములు, అవతారములు, నానాలోకములు అన్ని యును ఊహాకల్పితములు. మానవుడు సమస్త మును మిథ్య యని భావించుచు గాని తాను ఆత్మరూపి యని తలచక శరీరమే తానని దలచుచున్నాడు తాను ఈ ప్రపంచమునకు భగవంతుడనని దలపోయవలయును. తాను పాపాత్ముడనని దలపరాదు. భగవంతుని పూజించుట యన తన్ను తాను పూజించు కొనుటయే. ఇంటియందలి ధనమును దొంగలు అపహరించుచున్న, శిశువున కా సంగతియే దెలియదు. ఏలయన వానియందు దొంగలు, దొంగతనము అనునవి లేవు. ఆ రీతిగనే మన యందు దుర్మార్గము, పాపబుద్ధులు ఉన్న నాడే యితరులయందు వానిని గాంచగలము. మానవుని బుద్ధి వికసించినకొలదియు, ప్రపం చమునందుగాని, యితరులయందుగాని, క్రూర త్వము, దుర్మార్గము గాంచక, అంతటను మంచినే పూర్ణత్వమునే గాంచగలడు. ఇట్లు మానవుని బుద్ధి వికసించినంతనే, సర్వము తానే యని గ్రహింపగలిగిననాడు, నిర్భయు డును స్వేచ్ఛుడును కాగలడు. అట్టివానికే జనన మరణములు, పుణ్యాపాపములు, సమస్త బాధ లును పోగలవు. మానవుడు అపవిత్రుడు, పరా ధీనుడు, వ్యక్తిస్వరూపుడు అని తలచుట పొర పాటు. యథార్థమానవుడు సత్యస్వరూపుడు, శాశ్వతుడు.

ఇట్టి పరిపూర్ణసిద్ధి పొంద శక్యమా? ప్రపం చమున ఇప్పటికిని పూర్ణమానవులు గలరు. పరిపూర్ణస్థితి గలిగిన వెంటనే వారు సిద్ధిని పొందెదరా? పొందరు. ఒక యిరుసునకు గల రెండు చక్రములను గిరగిర త్రిప్పి యొక చక్ర మును చేతితో పట్టుకొని, ఖడ్గముతో ఇరుసును నరకిన, ఆ రెండవ చక్రము నేలపైబడి కొంత వఱకు దిరుగునట్లు ఈ పవిత్రమగు ఆత్మ యొక చక్రము. శరీరము, మనస్సు రెండవచక్రము. వీనిని గలపు కర్మ యను ఇరుసును, జ్ఞానమను ఖడ్గముతో నరకిన, ఆత్మ యను చక్రము ఆగి ప్రారబ్ధకర్మానుసారము కొంతకాలమువఱకు ఈ శరీరమునుండి పిదప ఆగిపోవును. ఇట్టి పరిపూర్ణ మానవునకు జననమరణములు, ఇతర లోకావాసములు ఉండనేరవు. ఈ స్థితి మాన వుడు తనజీవితమున ఒక్కనిమిషమైనను అనుభవించిన, ఆతడు జీవన్ముక్తుడనబడును. ఈ జీవితమునం దిట్టి స్థితిని బొందుటయే పరి పూర్ణ మానవస్థితి.

వివేకానందుడు పడమటి ఇండియాలో నిస్సారమగు సముద్రతీరమున నెలల తరబడి ప్రయాణముచేయుచు సుందరములగు సరోవరములను, వానిచుట్టును వృక్షములను గాంచెను. ఒకనాడు దప్పికచే యొక కొలను నకు బోయి దప్పి దీర్చుకొనబోగా, అది యదృశ్యమయ్యెను. అంతట అతడు ఆ నెల రోజులనుంచియు గాంచినది మరుమరీచికము లని గ్రహించెను. మరునాడు మామూలుగనే యా దారిని బోవుచుండగా, యథారీతిగా ఆ మరుమరీచికములు గాన్పింపదొడగెను గాని, యీసారి యవి భ్రాంతి, సత్యములు గావని గ్రహించుటచే భ్రమలో పడలేకపోయెను. అదేరీతిగా మానవుడు తాను అజ్ఞానావస్థయం దున్నంతవఱకు ఈ ప్రపంచము యథార్థమని దలచును, జ్ఞానము గలిగిన పిమ్మట ఇది నామ రూపాత్మకమగు భ్రమ యని గ్రహించి తన యథార్థరూపమును గుర్తింపగలడు. అజ్ఞాన స్థితియందువలెనే, కర్మప్రవాహము దొర్లి

వచ్చును గాని, యీసారి యిదియంతయును భ్రమ యని దెలియుటచే, సత్యాసత్యములను గ్రహింపగల్గును.

ఇట్టి పూర్ణస్థితిని పొందినవారుగాక, కొందరు ఏవో కొన్ని ఎంగిలి ముక్కలను గ్రహించి, నేను భగవంతుడను, స్వతంత్రుడను, నా యిష్టమువచ్చినట్లు నేను ఆచరింపవచ్చును అని చెప్పుచున్నారు. ఇట్టివారలు మూర్ఖులు. ఆత్మ స్వతంత్రుడు, ఈ జన్మహక్కును మానవుడు స్థిరపఱచుకొనిననాడు ప్రపంచ మాతనిని బంధింపజాలదు. ఈ ప్రపంచమంతయు ఆతని రూపమే యగుటచే, పూర్ణమానవునకు జాతి, మత, దేశభేదములు లేవు. ఈ విశ్వమంతయు ఆతని గృహమే. ఈ విశ్వమునందలి జనులందరును ఆతని కుటుంబమే.

మంచిచెడ్డలు, ఆత్మయొక్క సూక్ష్మ స్థూల ఆచ్ఛాదనములు. చెడ్డ యను తెరను దాటి, మంచి యను తెరను అధిగమించినగాని మానవుడు స్వతంత్రుడు గానేరడు. మానవునియందలి చెడుస్వభావమంతయును సుస్వభావముగా పూర్తిగా మారిననాడుగాని, యాతడు తన పూర్ణత్వమును పొందనేరడు. ఇట్టి పూర్ణమానవుడు జీవించియున్నంతవఱకు ఇతరులకు మంచినే యాచరించుచు, మంచినే భాషించుచు నుండగలడు. ఆతని దర్శనమే యితరులకు శ్రేయోదాయకము కాగలదు. ఆతడు తన పూర్ణత్వమును ఆచరణమూలముగా చూపును, వాగాడంబరము చూపడు. ఏ మానవుడు తన వ్యక్తిత్వమును పూర్తిగా విస్మరించి, మానవసేవయందు పూర్తిగా నిమగ్నుడై యుండగలడో యాతడే పూర్ణమానవుడు. తాను మానవరూపమునందున్న నారాయణస్వరూపమునకు పూజచేయుచున్నానని దలంచుచుండును. ఆతనికి పుణ్యాత్ముడు, పాపాత్ముడును సమానులే. ఆతనియందు వ్యక్తిత్వము నశించుటచే ఆత్మవ్యాపి లేక భగవన్మూర్తియై ప్రపంచమునంతటిని కదిపివేయగలడు. ప్రపంచమునందలి మానవులందరు ఈ స్థితికి రాగలిగిన నాడు ఈ భూలోకమే సమస్త సౌందర్యముల తోడను వర్థిల్లగలదు. సర్వత్ర ప్రేమ, సహకారము, త్యాగము విలసిల్లగలవు. ప్రపంచమునందలి మానవులందరు మేము భగవత్కులము అని ఏకైకకంఠముతో నుచ్చరించిన, ప్రపంచమంతయు ఆ భావనాశక్తిచే అద్భుతముగా మారిపోగలదు. మానవునియందు మంచియున్న, సమస్తమును మంచిగా పరిణమించగలదు. ఇట్టి పరిపూర్ణస్థితికి మానవులందరును ప్రాపించుటకై యత్నించినచో "నీవే నేను, నేనే నీవు" అని సర్వత్ర మారుమ్రోగ, సర్వప్రాణికోటియు ఆనందవారిధియందు నోలలాడగలదు.

(సశేషము)



# శ్రీ వాసుదేవ మననము

శ్రీ మావిరాజు శ్రీరామకృష్ణ

(నవంబరు సంచిక తరువాయి)

జ్ఞానయోగము అనగా—"శ్రవణాది సంజాత విజ్ఞానవంత యోగినం స్వభావం బ్రహ్మభావం యోజయతి గమయతాత యోగో నిర్విశేషః పరమాత్మా పరంబ్రహ్మ" = సద్గురు ముఖమున వేదాంత శ్రవణాదికముచే సంజాతమైన విజ్ఞానవంతుడగు యోగిని, స్వభావమైన బ్రహ్మభావమును పొందించునది యోగము. అదియే నిర్విశేష పరమాత్మరూప సర్వోత్కృష్ట బ్రహ్మము. "రమంతే యోగినోఽనన్తే నిత్యానందే చిదాత్మని। యితి రామపదేనాసౌ పరబ్రహ్మాభిధీయతే। చిన్మయస్యాద్వితీయస్య నిష్కలస్యా శరీరిణః। ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణా రూపకల్పనా"॥ ఇతి రామపూర్వతాపి న్యుపనిషత్ 6. 7) అనంత నిత్యానంద స్వరూపమైన ఆ చిన్మయ పరబ్రహ్మమునందు యోగులు రమించుచున్నారు. "రమం క్రీడాయాం" రము ధాతువునకు ఆనందించుట యని అర్థము. చతుర్ముఖాది జ్ఞానయోగులు అందరును ప్రత్యగభిన్న పరమాత్మయందే సర్వావస్థలయందును క్రీడించుచుందురు గదా. ఇట్లు జ్ఞానయోగులకు బ్రహ్మాత్మైక్య విజ్ఞానముకలిగి యా విజ్ఞానముచే మోక్షరూపమగు పరమానంద మనుభూతమగుచుండుటచేత, ఆత్మ విజ్ఞానులకు క్రీడాస్థానమగుట వలన, ఈ నిరతిశయ నిరవధిక నిత్యానంద పరబ్రహ్మ స్వరూప పరమాత్మ "రామ" యని ప్రతిపాదింపబడుచున్నది. చిన్మయము, అద్వితీయము, నిష్కలము (నిరవయవము) నిరుపాధికము నగు ఆ పరబ్రహ్మమునకు, ముముక్షువులైన ఉపాసకులయొక్క యుపాసనమనెడి కార్యసాఫల్యము కొరకు ప్రథమోపాసనీయమైన రూప కల్పనవలన నిరాకార పరబ్రహ్మము నరాకారమున ప్రకటీకృతమగుచు 'రామ' పదవాచ్యుడయ్యెను.

పరబ్రహ్మ ప్రతిపాదక (నిరూపక) మైన శ్రీరామమంత్రము (మంతారంత్రాయత ఇతి మంత్రః) మననముచేయువానిని సంరక్షించునది మంత్రము. "భర్జనం భవ బీజానా మార్జనం సుఖసంపదాం। తర్జనం యమదూతానాం రామ రామేతి గర్జనమ్॥" (ఆనందరామాయణం). రామ రామయను గర్జనము భవ బీజములకు భర్జనము (వేపుడు). సంవిదభిన్న సుఖోపలబ్ధి సంపాదనము. యమదూతలకు తర్జనము. (భయోత్పాతకమైన అదలుపు). "శ్రీరామనామామృత మంత్రబీజ సంజీవనీచేన్మనసి ప్రవిష్టా। హాలాహలంవా ప్రళయానలంవా మృత్యోర్ముఖంవా విశతాం కుతోభీః॥" (ఆనందరామాయణము) సంజీవియగు అమృత రూప శ్రీరామ మంత్రబీజము దృఢముగ నంతఃకరణమునందు ప్రవేశించినది యగుచుండగా హాలాహలమునందుగాని ప్రళయానలమునందుగాని మృత్యుముఖమునందుగాని ప్రవేశించిన

వారలకు భయమెక్కడిది? అట్లు ప్రవేశించి నను ఎంతమాత్రము భయమేలేదని నిశ్చితాభిప్రాయము. అందువలన "శత్రుచ్ఛేదైక మంత్రం సకలముపనిష ద్వాక్య సంపూజ్యమంత్రం। సంసారోత్తార మంత్రం సముపచిత తమ స్సంఘ నిర్యాణమంత్రం। సర్వైశ్వర్యైకమంత్రం వ్యసన భుజగ సందష్ట సంత్రాణమంత్రం జిహ్వే శ్రీరామమంత్రం జప జప సతతం జన్మ సాఫల్య మంత్రం". అరిషడ్వర్గాది సమస్త శత్రు సంహరణమునకు ముఖ్యమంత్రమును సర్వోపనిషద్వాక్యములచేతను సంభావింపబడు మంత్రమును, దుస్తర సంసారసాగరము నుండి తరింపజేయు మంత్రమును, అనాది కాలమునుండియు ప్రవృత్తమగుచున్న అజ్ఞానాంధకార విధ్వంసక మంత్రమును, పరిపూర్ణైశ్వర్య ప్రాప్తికి (ఈశ్వర స్వభావ ఐశ్వర్యం=ఈశ్వర భావము) ముఖ్యమంత్రమును, వ్యసనమనగా 'వ్యస్యతే శ్రేయోమార్గాత్ప్రచ్యావ్యతే పురుషోఽనేనేతి వ్యసనం'=దీనిచేత పురుషుడు శ్రేయో మార్గము నుండి తొలగద్రోయబడును కనుక రాగద్వేషాది జన్యమైన స్త్రీ ద్యూతాదికము వ్యసన మనబడును. ఇట్టి వ్యసనరూప సర్పసందష్టులైన వారిని సంరక్షించు మంత్రమును మానవజన్మమును సఫలముగ జేయు మంత్రమునగు శ్రీరామ మంత్రమును ఓ జిహ్వా! నిరంతరము జపించుమా— అను నిత్యాది శాస్త్రముల నాలకించి శ్రీరామ పదవాచ్య ప్రత్యగభిన్న పరమాత్మను శ్రద్ధా భక్తులతో సద్గురూపదేశ పూర్వకముగ శ్రీరామ పరబ్రహ్మము నుపాసింపవలెను. శ్రద్ధయన— 'శ్రద్ధాత్వాస్తిక్య కాంక్షయోః = భగవంతుని సత్వమునందు విశ్వాసమును, భగవంతుని దెలియ నిచ్ఛయు, 'శ్రద్ధ' యని నానార్థ రత్నమాల. "భక్తి" యన— "ద్రుతస్య భగవద్ధర్మాత్ ధారావాహికతాంగతా। సర్వేశే మనసోవృత్తి ర్భక్తిరిత్యభిధీయతే" (ఉజ్వలనీలమణి) భగవద్ధర్మనము (స్వభావము) యొక్క శ్రవణాధికమువలన విద్రుతమై (కరగినదై) న నీ ప్రవాహమువలె సర్వేశ్వరుని యందలి విచ్ఛిన్నమైన సమహిత చిత్త వృత్తి భక్తియని పేర్కొనబడుచున్నది. సాత్వస్మిన్ పరమ ప్రేమరూపా' 'అమృతస్వరూపాచ' (నారదభక్తి. సూ. 2. 3.) భగవంతునియందు పరమ ప్రేమభావము భక్తి. అదియే అమృత స్వరూపము. అనగా మోక్షస్వరూపము. "ప్రేణనం ప్రేమ. ప్రీఞ్ తర్పణే." ప్రేమ యన నిరంకుశ తృప్తిని బొందుట. భగవంతుడనగా— "ఉత్పత్తించ వినాశంచ భూతానామాగతింగతిం। వేత్తివిద్యా మవిద్యాంచ సవాచ్యో భగవానితి॥" (విష్ణుపురాణము 6-5-18). ఉత్పత్తి - వినాశనములనగా ఆవిర్భావ - తిరోభావములు. ఆవిర్భావమనగా వృత్తిరూపమున వివర్తించుట లేక జాగ్రదవస్థయందు కార్య కారణ సామర్థ్యముతో విజృంభించుట. తిరోభావమనగా—వృత్తి శూన్యముగ నవస్థానము లేక సుషుప్త్యవస్థయందు స్వస్వరూప స్థితి యందుండుట. ఇట్టి ఆవిర్భావ - తిరోభావములను, సకలభూతములయొక్క రాకపోకలను, విద్యావిద్యలను దెలియునతడు భగవంతుడు. భగవచ్ఛబ్దమునకు సర్వజ్ఞుడు సర్వశక్తిమంతుడు అని శంకర భాష్యమునందు అర్థము జెప్పబడినది.

(సశేషము)

# వి న య ప త్రి క

మూలం
శ్రీ తులసీదాస గోస్వామి

అనువాదం :
క్రాంతికన్

(గతసంచిక తరువాయి)

## ౧౧౦

మనోవాక్కర్మలచే పరోపకారమునకై యత్నించనినాడు మానవశరీరమును పొందిన మాత్రమున కలుగు లాభమేమి? ఏ (ఇంద్రియ) సుఖము స్వర్గమున, నరకమున, ఇంట, నరణ్యమున— నెచటనున్నను బిలువకయే మనల జేరవచ్చునో—ఓ మనసా!—దాని కొఱకే నీవు అనేక ప్రయత్నముల జేయుచున్నావు. తెలియజెప్పినను దెలిసికొనుటలేదు. ఓ మూర్ఖుడా! అజ్ఞానవశమున పరస్త్రీ భోగమునకై, పరులకు ద్రోహముజేయగోరి చిత్తమువచ్చినట్లెల్ల జేసితివి. గర్భవాసమున గలిగిన యనేక దుఃఖములవలననైన యసహ్యావేదనను మరచియే పోయితివి. ఆహార నిద్రా భయ మైధునములు ప్రాణిమాత్రులకొకటియే గాని దేవ దుర్లభమగు మానవదేహమును బొందియు నీవు మదగర్వములవీడి నమ్రభావమున భగవంతుని భజనసేయలేదు. స్వపరభేద భావము నింకను వీడలేదు. పరిశుద్ధుడవై శ్రీరామచంద్రుని సేవింపలేదు. అవకాశము చేజారినపిదప పశ్చాత్తాపపడుటవలన నేమి లభించును?

## ౧౧౧

మానవశరీరమును ధరించి నీవే (సత్) కార్యము కొనర్చితివి? వేదసార మనదగిన పరోపకారమును కలనైన దలపెట్టలేదు. ఈ ప్రపంచ మొక వృక్షము. ద్వైతభావము (భేదబుద్ధి) దీని వేరు, భయము ముండ్లు, శోకమే ఫలము. కాని ఈ వృక్ష మంతంతమాత్రమున గూలునది గాదు. రామభక్తియనెడు తీక్ష్ణకుఠారమే దీనిని నఱుకగలదు. కాని నీవు దీనిని నఱికివేయవైతివి. సంశయసముద్రమునుదాట రామనామమను నౌకయే శరణ్యము. ఆ శ్రీరామనామమును జపించి నీ యాత్మ నుద్ధరించుకొనలేదు. పైగా అజ్ఞానవశమున నెన్నియో యోనుల నెన్నియో జన్మలెత్తియు విసువు జెందవైతివి. ఇతరుల సంపదనుజూచి మనమున నీర్ష్యాగ్నిచే దహింపబడుచుంటివి. శమము, దమము, దయ, దీనులసేవ జేయుచు, హృదయమును చక్కబఱచుకొని భగవంతుని సేవింపవైతివి. ప్రభువు, గురువు, తండ్రి, మిత్రుడు నగు శ్రీరామచంద్రుని మనోవాక్కర్మల మరచిపోయితివి. తులసీదాసు చెప్పున దేమన— జటాయువు నుద్ధరించిన ఆ భగవానుడే శరణిచ్చునసెడి యాశ యొక్కటియే మిగిలియున్నది.

## ౧౧౨

ఈ మనస్సు—

శరీరము, గృహము, పుత్రులు, ధనము, భార్యలయందు ప్రేమ గలిగియున్నట్లుగా శ్రీ రామచంద్రుని చరణములయందును లగ్నమై యున్నచో భేదబుద్ధి — మానావమానముల భావమునకు దూరమై, జ్ఞానప్రాప్తియందు లగ్నమై వివిధములగు పరీక్షలలో నుత్తీర్ణురాలయ్యెడిది. అప్పుడు సుఖనిధానము, చతురుడు, కోసలాధిపతియునగు శ్రీరామచంద్రుడు ప్రసన్నుడై వానికేల వశుడుగాకుండును? వాడు (భక్తుడు) ప్రాణులందఱి హితమున లగ్న మనస్కుడగును. వాని చిత్తము పరిశుద్ధమగును. వానికి దృఢమగు భక్తి, ప్రేమ లభించును. అతడవిచలభావమున తన నియమముల చాలించును. కాని తులసీదాసు చెప్పునదేమన— రావణసంహర్తయగు శ్రీరాముడు దయ జూపిననాడే యిట్టి స్థితి సంభవము.

## ౧౧౩

ఓ మనసా!

నీవు శ్రీ హరియనెడు కల్పవృక్షమును సేవింపగోరితివేని విషయ వికారముల విడచి సారరూపుడగు శ్రీరాముని నామమును భజింపుము. ఇప్పటికైనను నే జెప్పునది వినుము. సమభావము, సంతోషము, పవిత్రమగు నాలోచన, సత్సంగతి—ఈ నాల్గింటిని హృదయమున దృఢముగ ధరింపుము. కామ, క్రోధ, లోభ, మోహ, అహంకార, ఇంద్రియసుఖ, ద్వేషముల నొక్కపెట్టున విడిచిపుచ్చుము. చెవులతో భగవంతుని కథ వినుము. నోటితో శ్రీ రామనామము నుచ్చరింపుము. హృదయమున శ్రీహరిని ధ్యానింపుము. శిరమువంచి వానికి నమస్కరింపుము. చేతులతో వానికి బరిచర్య చేయుము. కన్నులతో కృపాసముద్రుడు, జడచైతన్య స్వరూపుడు, సీతాపతియు నగు శ్రీ రామచంద్రుని దర్శింపుము. ఇదియే భక్తి, ఇదియే వైరాగ్యము, ఇదియే జ్ఞానము, ఇదియే భగవానుని ప్రసన్నుని జేసికొను సాధనము. నీవీ గొప్ప వ్రతము ననుష్ఠింపుము. శివప్రోక్తమగు నీ మార్గమున నెల్లపుడు నడచువారలకు స్వప్నమందైనను (జననమరణ) భయము గలుగదు.

## ౧౧౪

శ్రీరామచంద్రునివలె భజనసేయదగినవాడు, సుఖము నొసగువాడు, అభయ మిచ్చువాడు మఱెవడును లేడు. సుఖమునకు స్థానము, దుఃఖవినాశకుడు, శోకవిదూరుడు, లక్ష్మీరమణుడునగు భగవానుని గుణము లెంత లెక్కించినను తరుగవు. దుఃఖితుడు, నీచుడు, నీచకులోత్పన్నుడు, కపటి, దుష్టుడు, పాపి, భయార్తుడు, ఎచటను ఆశ్రయము లభించనివాడు— వీరుగూడ భక్తిపారవశ్యమున నొక్కసారి రామనామమును స్మరించిన దేవతలకైనను దుర్లభమగు నుత్తమపదవి నందుదురు. మోక్షమునైనను వాంఛింపని విరాగులగు మునులనెడు భ్రమరము లెవని చరణకమలముల యందు లోభముగలవై యుండునో, దయాళువు, అనాథులకు హితైషియగు నా భగవంతుని ఏల భజింపవు?

శ్రీరస్తు

# * శ్రీ సూర్యనారాయణ శతకము

కీ॥ శే॥ శ్రీ భాస్కరభట్ల సీతారామశాస్త్రి

శా॥ శ్రీ వాణీశ రమేశ శంకర వపుశ్శ్రీ దాల్చి, భక్తాళికిన్
ప్రావీణ్యం బమరం జిరాయు వగదత్వం బున్నతైశ్వర్యమున్
దీవిన్సన్నుతికెక్కఁ గూర్తువని వింటిన్నేను, నన్బ్రోవుమీ
సేవింతు, న్నుతియింతు, నెంతు మదిలో శ్రీసూర్యనారాయణా! ౧

శా॥ శ్రీకళ్యాణగుణాలవాల! త్రిజగత్సేవ్యప్రభాజాల! ల
క్ష్మీకాంతాశ్రయ! పద్మలోల! మునిరాట్చేతస్స్ఫురత్ఖేల! ఛా
యాకామిన్యధిపాల! భక్తజనరోగాఘాభ్రవాతూల! ప్రా
చీకాష్ఠాద్యధినాధవంద్యచరణా! శ్రీసూర్యనారాయణా! ౨

శా॥ శ్రీరామార్చిత! పద్మమిత్ర! విబుధక్షేమంకరా! భాస్కరా!
రారా! కోర్కులొసంగరా! పలుకరా! రక్షశ్చమూ సంహరా!
పారావారగభీర! హేమమయ శుంభద్విగ్రహా! కామిత
శ్రీరంజిల్లగ నన్ను నేలుకొనరా! శ్రీసూర్యనారాయణా! 3

శా॥ తప్పుల్రానియరాదు, నీదు కృతిగా దాత్పర్యముం జెంది, నే
జెప్పంబూనితి, దోడుగావలె జుమీ శృంగార మేపార, మా
యప్పా! యొప్పులకుప్ప! తెప్పవలె దుఃఖాంభోధి దాటించి, నా
చెప్పంబూను కృతిఁ వరింపగదవే! శ్రీసూర్యనారాయణా! ౪

మ॥ పరమాహ్లాద రసార్ద్ర మానసుడనై ప్రత్యక్షదైవంబ వీ
ధరణిన్నీవె యటంచు నెంచి, కవితాద్రాక్షారసంబీప్సితా

---

* సూచన — ఇయ్యది ప్రస్తుత శ్రీకాకుళమండలమందలి అర్సవల్లి గ్రామమందు గల శ్రీ సూర్యక్షేత్రవాసులును, సౌరోపాసకులును, షడ్దర్శనీపతి బిరుదాంకితులును నగు కీ॥ శే॥ శ్రీ భాస్కరభట్ల సీతారామశాస్త్రిగారిచే సుమారుగ రెండువందల సంవత్సరముల క్రిందట రచింపబడి యుండినది. ఇంతవరకు అచ్చుపడియుండలేదు, కావున నిపుడీ రీతిగ నీ పత్రికా ముఖమున పాఠకుల కందజేయడమయినది.

కరమాన ట్లుపహారమే నొసగెద న్గైకొమ్ము, మాకిమ్ము మే
ల్సిరు లత్యంత శుభంబు, లంచితగుణా! శ్రీసూర్యనారాయణా! ౫

మ॥ హృదయాంభోజమునందు నిన్నిడి, నుతుల్ హారాళమై యొప్పగా,
పదపద్యంబులు జెప్పి నీకొసగెదన్, ప్రార్థించెదన్, గొల్చెదన్,
ముదమొప్ప న్సభలందు దైవమితడే ముఖ్యంబుగానంచు నెం
చెద, లోకత్రయదీపకా! గుణగణా! శ్రీసూర్యనారాయణా! ౬

శా॥ తేజోమూర్తివి నిన్ను నే గొలిచెద న్దేహంబు సౌఖ్యంబుగా
రాజత్కీర్తిచెలంగ, మేలగు సిరుల్రంజిల్లగా, శాత్రవుల్
తేజంబారడి చెంది పోడిమణగ న్దిక్కేమి లేకేగగా,
శ్రీజాతార్చితపూతదివ్యచరణా! శ్రీసూర్యనారాయణా! ౭

శా॥ నానారోగవితాన మీ తనువున న్నానాటికిన్ హేయతన్
జానొందం దుదిలేక, నీకు నుతులే సల్పం దొరంకొంటి, నో
దీనానాధజనామరద్రుమ! నను న్దివ్యాంగునిం జేయవే,
శ్రీనాథావతరస్వరూప! కరుణన్, శ్రీసూర్యనారాయణా! ౮

శా॥ ఈ సంసార సముద్ర మగ్నుడను, నన్నేలాగు రక్షించెదో!
వీసంబైన సుఖంబు గన్పడదు, దుర్వృత్తి న్మనంబెప్పుడున్
కాసంతైన భవత్పదాంబుజ రతిం గాంక్షింప, దోయయ్య! నే
జేసే దేమిక, నీవె ప్రోవవలె జూ! శ్రీసూర్యనారాయణా! ౯

మ॥ చోరలంచు న్దరిజేరి వేడుకొనిన న్దుర్మార్గ సంచారులై,
నరమూర్ఖు ల్ఘనులైనవారిపగిది న్నాకోర్కె లీడేర్తురా?
కరుణాపూర్ణ కటాక్ష వీక్షణముల న్గాపాడి రక్షింపరా!
స్థిర సంపత్తి యొసంగు దీవె గదరా! శ్రీసూర్యనారాయణా! ౧౦

(సశేషము)



శ్రీ వివేకానందస్వాములవారి జన్మతిథిపూజ మంగళవారము 30-1-1951
మఠమున బహిరంగోత్సవము ఆదివారము 4-2-1951

Vol. VII—7 (January 1951) Sri Ramakrishna Prabha Regd. No. M—46

# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

## శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము)

540 పుటలు సర్వాంగ సుందరమగు చతుర్థ ముద్రణము వెల రూ. 3-4-0

## శ్రీమద్భగవద్గీత

480 పుటలు శ్రీధరీయ టీకాసార ప్రతిపద టీకా తాత్పర్య విశేషార్థ సహితము రూ. 3-0-0

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

350 పుటలు (మద్రాసు ఆంధ్ర విశ్వవిద్యాలయములందు పాఠ్యగ్రంథము) రూ. 2-8-0

## శ్రీ శారదాదేవి చరిత్ర

256 పుటలు (ఆంధ్ర విశ్వవిద్యాలయమున పాఠ్యగ్రంథము) వెల రూ. 1-12-0

## శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

136 పుటలు (ఆదర్శప్రాయుడగు గృహస్థుని జీవితము) వెల రూ. 1-4-0

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| శారదా ప్రసంగములు | 2 | 8 | 0 | గురూపదేశములు | | 0 | 8 | 0 |
| ప్రబోధరత్నాకరము . | 2 | 4 | 0 | నా సంస్కరణ యుద్ధవిధానము . | | 0 | 6 | 0 |
| రాజయోగము .. | 2 | 4 | 0 | నా గురుదేవుడు | | 0 | 6 | 0 |
| కర్మయోగము | 1 | 8 | 0 | శ్రీ పరమహంస జీవిత సంగ్రహము | | 0 | 4 | 0 |
| భక్తియోగము ... | 1 | 4 | 0 | నవీన భారతదేశము | | 0 | 4 | 0 |
| వివేకానందలేఖావళి (మొదటి భాగము) | 1 | 8 | 0 | ముక్తిమార్గము | | 0 | 8 | 0 |
| వివేకానందలేఖావళి (రెండవ భాగము) | 1 | 8 | 0 | సర్వం విష్ణుమయం జగత్ (తెలుగు) | | 0 | 3 | 0 |
| అనుష్ఠాన వేదాంతము .. | 1 | 4 | 0 | శ్రీ రామనామ సంకీర్తనము . | | 0 | 1 | 0 |
| వివేక సూర్యోదయము .. | 1 | 0 | 0 | బాలగీతము (పద్యకావ్యము) | | 0 | 1 | 0 |
| శ్రీ పరమహంస నీతికథా రత్నములు | 0 | 12 | 0 | [illegible] 0 0 6 | డజను | 0 | 5 | 0 |
| భక్తిమార్గము . | 0 | 8 | 0 | సింహ గరన 0 0 6 | డజను | 0 | 5 | 0 |
| చికాగో నగరోపన్యాసములు . | 0 | 8 | 0 | | | | | |

ఇవియేకాక

సంస్కృత, ఆంగ్ల, ద్రావిడ, హిందీ, కన్నడ గ్రంథములును

**వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)**

అను మాస పత్రికలును మా యొద్ద దొరకును

**శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి**

మున్నగువారి ఛాయాచిత్రములును మా యొద్ద దొరకును

ఇట్లు వ్రాయుడు:

మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి.

సంపాదకులు: శ్రీ ఋతజానందస్వామి; శ్రీ వెగురుపూడి వేంకటకృష్ణరావు
శ్రీ జి. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటరు ప్రెస్సు లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి,
శ్రీ ఆదిదేవానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 20-1-51.

# విషయసూచిక



# శ్రీరామకృష్ణప్రభ

## చందాదారులకు

౧. పత్రిక ప్రతిమాసము 20-వ తేదీన వెలువరింపఁబడును. ఒక వారము, పదిరోజులు గాంచి ప్రతి మీకు అందకపోయినయెడల ఉత్తరము వ్రాయుఁడు.

౨. సంవత్సర చందా రు. 3 లు మాత్రమే. జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని చందాదారులుగఁ జేరవచ్చును. ఇతర మాసములలోఁ జేరదలచు వారికి జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని సంచికలు చేర్చిపంపఁబడును. విడిప్రతి రూ ౦—౬—౦ లు. హిగిన్‌బాదంస్ వారి స్టాలులోఁ గాని, మా పత్రిక ఏజెంటును గాని అడుగుఁడు.

3. ఉత్తర ప్రత్యుత్తరములు వీలైనంతవరకు ఇంగ్లీషున వ్రాయుచు మీ చందాదారు సంఖ్య నుదాహరింపుఁడు. ఉత్తరములను "మేనేజరు, శ్రీరామకృష్ణప్రభ" అను చిరునామాకు వ్రాయుఁడు.

౪ చిరునామాయందు ఎట్టిమార్పు గలిగినను 10-వ తారీఖునకు ముందుగా మా కార్యాలయమునకుఁ దెలుపవలయును. లేనిచో, పత్రిక పూర్వపు చిరునామాకే పంపఁబడును.

## వ్యాసకర్తలకు

౧. కేవలము నైతిక ధార్మిక వైజ్ఞానిక విషయకములైన వ్యాసములే కాక, సాహిత్యమునకును కవిత్వమునకును సంబంధించిన ఏ వ్యాసములైనను బంపవచ్చును. సులభ సుందరమగు గ్రాంథిక భాషలో వ్రాయవలయును.

౨. వ్యాసములు అచ్చులో మూఁడు పుటలకు మించరాదు. ప్రతినెల ఒకటవ తేదీకి వ్యాసములు మాకు అందవలెను.

3. వ్యాసములను, విమర్శకుఁ బంపు గ్రంథములను, వినిమయముగఁ బంపెడి పత్రికలను "సంపాదకుఁడు, శ్రీరామకృష్ణ ప్రభ శ్రీరామకృష్ణ మిషన్ స్టూడెంట్స్ హోమ్, మైలాపూరు, చెన్నపురి" అను చిరునామాకు వ్రాసి పంపవలెను.

౪. వ్యాసము తిరుగఁ బంపఁబడవలయునచో దగు పోస్టేజి చేర్చి పంపవలయును.




# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౭ } ౧౯౭౧ ఫిబ్రవరి – వికృతి – మాఘము { సంచిక ౧


## ప్రార్థన

## శ్రీరామకృష్ణ జయాష్టకమ్


శ్రీ దేవేంద్రనాథ్ మజుందార్


గౌడ సారంగ రాగము — రూపక తాళము

భవభయ భంజన, పురుషనిరంజన రతిపతి గంజన కారీ।
యతిజన రంజన; మనోమదఖండన జయభవబంధన హారీ॥

జయ జనపాలక సురదళనాయక జయజయ విశ్వవిధాతా।
చిరశుభసాధక మతిమలపావక జయ చిత్తసంశయ త్రాతా॥

సురనరవందన విజరవివందన చితమననందనకారీ।
రిపుచయ మంథన జయభవతారణ స్థలజల భూధరధారీ॥

శమదమమండన అభయనికేతన జయజయ మంగళదాతా।
జయసుఖసాగర నటవరనాగర జయశరణాగత పాతా॥

భ్రమతమ భాస్కర జయపరమేశ్వర సుఖకర సుందరభాషీ।
అచల సనాతన జయభవపావన జయవిజయీ! అవినాశీ॥

భక్తవిమోహన వరతనుధారణ జయహరి కీర్తన భోళా।
గద్గదభాషణ చితమనతోషణ రలరల నర్తన లీలా॥

మతిగతివర్ధన కలిమలమర్దన విషయవిరాగ ప్రసారీ।
జడచిత చేతక భవజలభేలక జయ నరమానస చారీ॥

జయపురుషోత్తమ అనుపమసంయమ జయజయ అంతరయామీ।
ఖరతరసాధన నరదుఃఖవారణ జయరామకృష్ణ నమామి॥

ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ

# శ్రీ రామకృష్ణ వచనామృతము—'మ.'

దక్షిణేశ్వరాలయమున శ్రీరామకృష్ణుల వారి గదియందు భక్తులెల్లరు కూర్చొని యుండిరి. శ్రీ గురుదేవులు మాత్రము వసారా యందు పచార్లు గావించుచుండిరి. కొంతసేపటికి 'మ.' బయటికివచ్చి శ్రీ గురుదేవులను సంధించెను. పూర్వోత్తర వసారాయందు నరేంద్రుడు హాజ్రాతో సంభాషించుచుండెను. 'హాజ్రా శుష్కజ్ఞానవిచారము చేయును, జగత్ స్వప్నవత్ అని పలుకును, హాజ్రా నైవేద్యాదులన్నియు మనోభ్రాంతి, కేవలము స్వస్వరూపమును జింతించుటయే మన కర్తవ్యము, సోఽహం సోఽహం అని పలుకును'—శ్రీరామకృష్ణులవారికి హాజ్రాయందిట్టి భావములు గలవు.

శ్రీరామ—(నవ్వుచు) ఏమోయ్! మీరిరువురు ఏమి మాట్లాడుచున్నారు?

నరేంద్రుడు—(నవ్వుచు) మేమెల్ల పెద్ద పెద్ద మాటలు మాట్లాడుచున్నాము.

శ్రీరామ—ఎట్లయినను శుద్ధజ్ఞానము, శుద్ధభక్తియు నొక్కటియే. శుద్ధజ్ఞానము మనల దీసికొనిపోవు స్థలమునకే శుద్ధభక్తియు మనల దీసికొనిపోవును. భక్తిమార్గమే మిక్కిలి సులభమయినది.

నరేంద్రుడు:—"జ్ఞానవిచారముతో నాకేమియు పనిలేదు. తల్లీ నీయందు నాకున్నాదమును గల్గింపుము"—('మ.' తో) చూడుడు Hamilton గ్రంథమును జదివితిని. 'A learned ignorance is the end of philosophy and begging of religion' అని ఆ గ్రంథమున గలదు.

శ్రీరామ—('మ.' ను జూచి) దీని యర్థమేమి?

నరేంద్రుడు—దర్శనశాస్త్రపఠనమును ముగించినచో మానవుడు పండితమూర్ఖుడై పోవును. అప్పుడు ధర్మమును గోరును, ఆతని ధర్మజీవనము ప్రారంభించును.

శ్రీరామ—(నవ్వును) Thank you (అందఱు నవ్విరి).

కొంతసేపటికి సంధ్యా ప్రారంభమును గని యనేకులు గృహాభిముఖులైరి.

కొంత చీకటిపడినది. దేవాలయమున, సకల ప్రదేశములందును దీపములు వెలిగింపనను మతియాయెను. శ్రీ కాళికాదేవ్యాలయార్చకులును, శ్రీ విష్ణ్వాలయార్చకులును గంగ యందు స్నానమాడుచుండిరి. దక్షిణేశ్వరగ్రామ యువకులు కొందఱు నదియొడ్డున పాదాచమనము చేయుచుండిరి. శ్రీరామకృష్ణులవారు పశ్చిమదిశయందలి వసారాయందు నిలుచుకొని గంగాదర్శనము గావించుచుండిరి. సంధ్యయయినది సమస్త ప్రదేశములందును దీపములు వెలుగుచుండెను. శ్రీరామకృష్ణుల గదియందు దీపము వెలిగింపబడెను. సాంబ్రాణి

ధూపము వేయబడెను. ఇంతలో ద్వాదశ శివాలయములందును, విష్ణ్వాలయమునందును, కాళీ దేవ్యాలయమునందును దీపారాధన ప్రారంభింపబడెను. గంటలు, తాళములు మధుర గంభీరశబ్దమును గావించుచుండెను.

ఆనాడు కృష్ణపాడ్యమి కావుటవలన కొంత కాలమునకే చంద్రోదయమై దేవాలయాంతర్భాగమున చంద్రకిరణములు ప్రసరించుచుండెను. అట్లే చంద్రకిరణములు గంగానది కెరటములపై బడి ప్రతిబింబించుచుండెను. సంధ్య కాగనే శ్రీరామకృష్ణులు జగన్మాతకు నమస్కరించి, హరినామసంకీర్తనము గావించిరి పిదప తమగదియందున్న ధ్రువుడు, ప్రహ్లాదుడు, రామచంద్రుడు, కాళికాదేవి, రాధాకృష్ణుడు— ఈ చిత్రపటములన్నిటిని సమీపించి విడివిడిగా నమస్కరించిరి. పిమ్మట "బ్రహ్మ—ఆత్మ—భగవాన్, భాగవత—భక్త—భగవాన్, బ్రహ్మ—శక్తి, శక్తి—బ్రహ్మ, వేద, పురాణ, తంత్ర, గీతా, గాయత్రి శరణాగతుడను, శరణాగతుడను. నాహం, నాహం. తుంహుం, తుంహుం. నేను యంత్రమును, నీవు యంత్రివి" మున్నగు పల్కులు బలుకుచుండిరి. ఇట్టి నామోచ్చారణము గావించిన పిదప శ్రీరామకృష్ణులు చేతులు జోడించి జగన్మాతను ధ్యానముచేయుచుండిరి. సంధ్యాసమయమున తోటయందును గంగాతీరమునందును పచారుచేయుచుండిన భక్తులు దీపారాధన ముగిసిన కొంతకాలము నకు శ్రీరామకృష్ణుల గదిలోనికి వచ్చిరి. పరమహంసలవారు తమ మంచముపై కూర్చొనియుండిరి 'మ.' అధరుడు మున్నగువారు క్రింద కూర్చొనియుండిరి.

శ్రీరామ —నరేంద్రుడు, రాఖల్, భావనాథ్ మున్నగువారెల్లరు నిత్యసిద్ధులు. ఈశ్వర కోటికి జెందినవారు. వీరికి జ్ఞానశిక్ష అనవసరము. చూచితివా! నరేంద్రుడు ఎవరినీ 'Care' (లక్ష్యము) చేయడు. కేప్టన్ ఒకనాడు నాతో బండిలో వచ్చుచుండెను. 'మంచి స్థలమున కూర్చొను'డని కేప్టన్ పలుకగా ఆతని తలయెత్తియయినను జూడలేదు. నన్నుగూడ నపేక్షింపడు. ఆతనికెంత తెలియునో అదియును నాకు దెలుపడు. ఒకవేళ నేను 'నరేంద్రు డిట్టి విద్వాంసు'డని పదుగురకు దెలుపుదునని తలంచుచున్నాడేమో. మాయామోహము లేవియు లేవు. ఎట్టి బంధనమును ఆతనికి లేదు. మహాపురుషుడు. ఆతనియొద్ద నెన్ని సుగుణములు గలవు! పాట పాడగలడు. వాద్యము వాయింపగలడు, వ్రాయగలడు, చదువగలడు. మఱియొకవైపున జితేంద్రియుడు 'నేనెన్నడును వివాహమాడ' నని పలుకుచున్నాడు. నరేంద్ర భావనాథుల కత్యంతస్నేహము. వీరిరువురకును స్త్రీపురుషుల వలె మంచి మైత్రి కలదు. నరేంద్రు డిచటికంతగా రాడు. అదియు మంచిదే. పలుమారు వచ్చుచుండిన నేను మిక్కిలి విహ్వలుడనైయుందును.

# తత్త్వశాస్త్రము

## వేదములు: వాని యసాధారణ మహిమ

శ్రీ ఇచ్ఛాపురపు వైద్యనాథం, బి. ఏ.

తత్త్వశాస్త్రమనబడు అద్వైతమునకు వేదములు మూలాధారములై యున్నవి. కావున తత్త్వశాస్త్రవిషయవివరణమునకు ప్రథమమున వేదముల యసామాన్య ప్రభావమునుగూర్చి తెలిసికొనుట ప్రస్తుతము కాదు. విశిష్టాద్వైతులు, ద్వైతులు, సాంఖ్యులు, యోగులు మొదలగు వారును తమతమ మతములకు వేదములే ఆధారమనియు అందుచేత తమమతములు వేదసమ్మతములే యనియు చెప్పుచున్నారు. ఆ వాదము చాలవఱకు సత్యమని యంగీకరింపక తప్పదు. "జీవుడు పరమాత్మకంటె భిన్నుడా? అభిన్నుడా? జీవునకును ఈశ్వరునకును ఎట్టి సంబంధముగలదు?" అను నిట్టి కట్టకడపటి విషయములయందే పైని చెప్పిన మతము లద్వైతముతో భిన్నాభిప్రాయములు గలిగియున్నవిగాని వేదోక్తములగు వర్ణాశ్రమాచారాది ధర్మములనుష్ఠించుట మొదలగు ప్రథమ సోపానములనదగు విషయములలో భిన్నాభిప్రాయములు లేవు. అందుచేతనే మతత్రయ మనబడు అద్వైత, విశిష్టాద్వైత, ద్వైతములు గమ్యస్థాన విషయమునందు పరస్పర విరుద్ధములైనను హైందవు లందఱిచేతను గౌరవింపబడుచున్నవి.

ఇట్లు హైందవమతములకు మూలాధారములగు వేదములనుగురించి చారిత్రక పరిశోధకుల పరిశోధనలను ఫలితములను వివరించుట యనావశ్యకమగుటవలన వానిని వదలి ప్రాచీన ఋషులయు శంకరాచార్యులయు నభిప్రాయములను వివరింపదలచితిని. వేదములు పౌరుషేయములు (పురుషనిర్మితములు) కావనియు అవి సృష్టిప్రారంభకాలముననే ఈ లోకమున మహర్షుల మూలమున నవతరించెననియు పూర్వుల యభిప్రాయము. విద్ (తెలియు) అను ధాతువు నుండి వేదమను పదము ఉత్పన్నమైనది. ప్రాచీన మహర్షులు దీర్ఘకాలము పరిశుద్ధాంతఃకరణముతో తపమొనర్చి వేద సిద్ధాంతములను తెలిసికొని ప్రకటించిరి. కావున వేదమను నామము సిద్ధాంతములకు తగియున్నది. ఇట్లే తపోనిష్ఠా గరిష్ఠులైయున్న ప్రాచీన మహర్షులకు వేదసిద్ధాంతములు వినిపించుటచే శ్రుతి యనుపేరు వానికి సార్థకమయ్యెనని చెప్పవచ్చును. ఇట్లు వేద (సిద్ధాంత) ములు ఋషులచే తెలియబడుటవలన వేదములనియు వారిచే వినబడుటవలన శ్రుతులనియు చెప్పబడుచున్నవి. "యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" అనెడి శ్రుతి, సృష్టిప్రారంభముననే పరమేశ్వరుడు (నారాయణుడు) బ్రహ్మను సృజించి ఆతనికి వేదములను ఉపదేశించెనని చెప్పుచున్నది. దానినిబట్టి వేద(సిద్ధాంత)ములు సృష్టికి పూర్వముననే యున్నవని యూహింపవలసియున్నది. వేదముల సహాయముననే బ్రహ్మ సృష్టియొనర్చెనని చెప్పబడియున్నది. "తేనే బ్రహ్మహృదాయ ఆదికవయే ముహ్యన్తి యత్సూరయః" ఏ

వేదార్థము నెఱుంగలేక పండితులుగూడ నజ్ఞానమును పొందుచున్నారో అట్టి వేదమును విష్ణువు బ్రహ్మ కుపదేశించెను అను మహాభాగవతమునందలి వేదవ్యాసవచనము పైని వ్రాసిన శ్రుతి యభిప్రాయము ననువదించుచున్నది.

ఇట్లు వేదములు సృష్టికిపూర్వమునందే యున్నవని సిద్ధాంతిము చేయబడినను వేదముల యందచ్చటచ్చట మంత్రకర్తలుగ పేర్కొనబడుచున్న మహర్షుల నామములనుబట్టియు, జనక యాజ్ఞవల్క్యాదుల సంవాదమును బట్టియు వేదము లాయా జనకాదుల కాలము లందు నిర్మింపబడినవని కొందఱు భావింతురు. కాని మంత్రకర్త లనబడువారు మంత్రద్రష్టలు (మంత్రములను తపముచే తెలిసికొన్నవారు). ఇట్లే యాజ్ఞవల్క్యాదులు జనకాదుల కుపదేశించిరనినను తత్పూర్వమే తపోనిష్ఠులగు మహర్షులచే ప్రకాశింపజేయబడిన గురుపరంపరాగత వేదాంతాది సిద్ధాంతముల నుపదేశించిరనినను కాని యాజ్ఞవల్క్యాదులు వానిని కల్పింపలేదని గ్రహింపవలెను. ఒక గ్రంథములోని విషయమును వ్రాసిన కర్తయొకడును ఆగ్రంథమును ముద్రణాయంత్ర సహాయమున ముద్రించి ప్రకాశింపజేసిన ప్రకాశకుడు వేఱొకడును అయినట్లు వేదములను శ్రీమన్నారాయణుడు బ్రహ్మకొసంగగా వానిని మహర్షు లీలోకమున ప్రకాశింపజేసిరని యూహింపవలయును.

ఇట్లు వేదసిద్ధాంతములు సృష్టికి పూర్వము ననే యున్నవను విషయమున నీ క్రిందియుక్తి ననుసంధింపవలసియున్నది. మానవు డొక పదార్థమును నిర్మింపదలచినచో ముందుగా ఆ పదార్థముయొక్క ఆకారము వాని మనస్సునకు గోచరమగును. అట్లు ముందుగా మనోగోచరమైన ఆకారమునే ఆతడు నేత్రగోచరమగు పదార్థమునుగా సృజించును. అట్లు ఒకనికి మనోగోచరమగు పదార్థమునుగూర్చి మఱియొకని కుపదేశించుటకు శబ్ద (పద) సహాయమావశ్యకమై యుండును. అనగా ఆ మనోగోచరాకారమునకు నామకరణముచేసి బోధింపవలసియుండును. అట్లే బ్రహ్మచే సృష్టింపబడవలసిన పదార్థజాలమునుగురించి సృష్టికి పూర్వము, సర్వజ్ఞుడును సర్వశక్తిమంతుడును అగు శ్రీమన్నారాయణుడు బ్రహ్మ కుపదేశించెను. ఆ బ్రహ్మయు తన కుపదేశింపబడిన వేదములయందలి ఇంద్రాదిశబ్దములచే మనోగోచరమగు ఇంద్రాదులను వేదస్మరణ సహాయమున సృష్టించెను. ''వేదములనుండియే సృష్టి వచ్చెను'' అనుట కిదియే యభిప్రాయము.

ఇట్లు వేదముల ప్రాచీనతనుగూర్చి సిద్ధాంతము చేయబడినది. అయినను మనకు వినబడుచున్న అక్షరసమూహమగు వేదము శాశ్వతముకాదనియు ఈవేదములు ప్రళయకాలమునందదృశ్యములగుననియు వేదోక్త సిద్ధాంతములు మాత్రమే శాశ్వతమనియు ప్రాచీనుల యభిప్రాయము. కావున పై విధముగా వేదములకు శాశ్వతత్వమును సనాతనత్వమును అపౌరుషేయత్వమును అంగీకరింపవలసి యున్నది. ఇట్లపౌరుషేయత్వము నంగీకరించుటవలన వేదములు మానవకల్పితములు కావనియు అందుచే మానవులకుండు భ్రమ ప్రమాదాదులు వేదములకుండవనియు అందుచే వేదములు మాత్రమే పరలోకాధ్యాత్మికాది విషయములయందు ప్రమాణములగుట కర్హములనియు తెలియును.

ఇట్టి వేదములు సృష్టి ప్రారంభమున బ్రహ్మమానసపుత్రులగు వసిష్ఠాదులకు బ్రహ్మచే నుపదేశింపబడి వారి మూలమున భూలోక

మునందు వ్యాప్తినొందినవి. ఇవి వ్యాప్తినొందిన విధముకూడ మిక్కిలి ఆశ్చర్యకరమైనదియే. ఏలయనగా ప్రస్తుతకాలమునందువలె ముద్రణా యంత్రములుగాని కాగితములుగాని లేని ప్రాచీనకాలమునుండియు వినాశము నొందక మార్పునొందక యిప్పటివరకును హైందవులలో వ్యాపించుట యాశ్చర్యముకదా! ఆ కాలమున గురువులు శిష్యులచే అధ్యయనము చేయించుట తప్ప వేదవ్యాప్తికి వేరు మార్గము లేకుండెను. అట్లు గురువులును శిష్యులును ఎంతయో శ్రమపడి తమ జీవితమునంతను వేదరక్షణకై ధారపోసి వేదములను రక్షించిరి. కావుననే వేదరక్షణకై జీవితమును ధారపోయుటకు ప్రత్యేకముగా బ్రాహ్మణజాతి యేర్పడి యుండునని యూహింపవచ్చును. ఆ కాలమున కొందఱు క్షత్రియులు వేదములను పఠించినట్లాధారములున్నను ఈ ఊహ అసందర్భము కాజాలదు.

ఇట్లు ముద్రణాయంత్రాదుల సహాయము లేకున్నను వైరూప్యాదులను పొందక యిప్పటివరకును వేదములువ్యాపించినవిధము నాలోచింపగా వానియందేదియో యసాధారణమహిమ యున్నదని యూహింపవచ్చును. ఇట్లు బాహ్యసహాయములేక వేదములు వృద్ధినొందుచుండుటయే యాశ్చర్యకరమై యుండగా అవి, స్వవినాశకములగు కొన్ని కష్టముల నెదుర్కొని ఆ కష్టములనుండి బయటపడుట మఱింత ఆశ్చర్యకరమైయున్నది. వేదములు వృద్ధినొందుచుండగా మన దేశమున బౌద్ధమతము వ్యాపించెను. సత్యము, దయ, అహింస మొదలగు ఉత్తమగుణములు మాత్రమే అనుసరింపబడినచో చాలుననియు, వేదములు అప్రమాణములనియు అందలి సిద్ధాంతము లనుసరణీయములు కావనియు బుద్ధానులు విశేషప్రచారము చేసి తమ సిద్ధాంతములను వ్యాపింపజేయ మొదలిడిరి.

ఈ సిద్ధాంతములు మన దేశములో వేదమతమును తాత్కాలికముగా నశింపజేయుటకును వేదవ్యాప్తిని నిరోధించుటకును చాలవఱకు తోడ్పడెను. కొంతకాలమైనతరువాత శంకరాచార్యాదులు బౌద్ధమతమును శ్రుతియుక్త్యనుభవములను మూడు ప్రమాణములచే ఖండించి మరల వేదమతమును వ్యాపింపజేసిరి. వాస్తవస్థితిలో బౌద్ధమతధర్మములు వేదోక్తధర్మములలో కొన్నిమాత్రమే యైయున్నవి. అయినను గౌతము (బుద్ధుడు) వేదములప్రమాణములనుటచే అదియొక క్రొత్తమతమువలెనుండి ప్రజలకు భ్రాంతిని కల్గించెను. ఇట్లు బౌద్ధులు, జైనులు మొదలగువారిచే వేదములు కొన్ని కష్టములనొంది బయటపడినను మహమ్మదీయులు మన దేశముపై దండెత్తినప్పటినుండియు మరల వీరివలన ననేకబాధల నొందవలసి వచ్చెను. మహమ్మదీయులు హిందువులపై జిజియాపన్ను (తలపన్ను) వేయుట, దేవాలయములు ధ్వంసముచేయుట, హిందువులను హింసించుట మున్నగు క్రూరకృత్యముల నెన్నిటి నొనర్చినను దానినుండి సురక్షితముగా వేదములు వెలువడినవి. ఇట్లు బౌద్ధుల అహింసాత్మక మార్గములవలనగాని, తురుష్కుల హింసాత్మక మార్గములవలనగాని వినాశము నొందక ప్రకాశించుటయే వేదముల అసామాన్య మహిమకు దృష్టాంతముగా నున్నది.

అయినను ఈ దృష్టాంతముతో సంతృప్తి నొందక వేదమహిమ నెఱుంగుటకు తత్సంబంధమగు కొన్నివిషయములనుగూడ స్మరింపవలసి యున్నది. వేదములలో మూడుభాగములు

కలవు. అవి కర్మకాండమనియు, ఉపాసనా కాండమనియు, జ్ఞానకాండమనియు చెప్ప బడును. మానవు డిదివర కెన్నడును చూచి యుండని పుణ్యాలోకములగు స్వర్గాదుల విధ మును వివరించి వానిని పొందు మార్గములగు యజ్ఞాదులను వేదములు కర్మకాండమునందు చెప్పుచున్నవి. అట్లే శివకేశవాది దేవోత్త ములంగూర్చి వర్ణించి వారిలోకములను పొంది అనంతసుఖము లనుభవించుటకు కావలసిన దేవతోపాసనలను ఉపాసనాకాండము చెప్పు చున్నది. ఇట్లు మనము ప్రత్యక్షముగా నెఱు గని ఇతరలోకములను వానిని పొంది అనంత సుఖములను విస్తారకాల మనుభవించుట కుపా యములను చెప్పుటయే వేదముల ప్రభావమును వేనోళ్ల చాటుచుండగా వీనినన్నిటిని మించి యింకొక మహత్తర విషయమును బ్రకటించి వేదములు తమ మహత్త్వమును ప్రకటించు చున్నవి. అట్టి మహత్తరవిషయ మేది యనగా పరమాత్మను ప్రకటించి తత్ప్రాప్తి సాధనము లను చెప్పి మానవుడు జననమరణ ప్రవాహము నుండి విడివడి శాశ్వతసుఖమగు మోక్షమును పొందుటకు సహాయముచేయుట.

అట్టి పరమాత్మ యీ ప్రపంచమువలె పంచ భూతములచే నిర్మింపబడలేదు. అందుచే నతని యందు శబ్దస్పర్శాది గుణము లేమియులేవు. అందుచే జీవుని జ్ఞానేంద్రియములుగాని మనస్సు గాని ఆతనిని తెలిసికొనజాలవు. కావున ఆత్మ స్వరూపము మనోవాక్కుల కందరానిదై యున్నది. మనోవాక్కుల కందుబాటులో నున్న యెడల మానవుడు ఊహవలనగాని విజ్ఞాన శాస్త్ర (యంత్ర) సహాయమునగాని తెలిసి కొనుటకును పొందుటకును వీలగును. కాని ఆత్మ యట్టిది కాకపోవుటచేత నట్టి దురూహ్య మగు విషయమును బోధించుటకు వేదములు మాత్రమే సమర్థములై యున్నవి. ఆ వేదము లైనను "ఇదిగో! ఇది పరమాత్మ. దానిని నీవు పొందుము" అని బోధింపవు. అట్లు బోధిం పబడు పదార్థ మనిత్యమే యగును. మఱి యేమనగా నిషేధముఖమున అనాత్మ పదార్థ ములను ఆత్మకాదని నిషేధించి నిషేధావధి యగు పదార్థమును వాచ్యముగా చెప్పలేక లక్షణావృత్తిచే బోధించి "ఆ పరమాత్మయే నీవు" అని జీవబ్రహ్మైక్యమును బోధించును. "శ్లో. ప్రత్యక్షేణానుమానేన యస్తూపాయోన బుధ్యతే, ఏనం విందంతి వేదేన తస్మాద్వే దస్య వేదతా." (ఏ పదార్థమును చూచికాని ఊహించికాని తెలిసికొనుటకు సాధ్యముకాదో అట్టి పదార్థమును వేదసహాయమున తెలిసి కొందురు. అందుచే వేదములకు వేదత్వము సార్థకమయ్యెను.) అను శ్లోక మీ యభిప్రాయ మునే ప్రకటించును.

ఇట్లు వేదము లవాఙ్మానసగోచర విషయ మును బోధించి శాశ్వతసుఖమును పొందుటకు సంపూర్ణ సహాయము నొసంగుచు మానవునకు నీతిమార్గమును ఆధ్యాత్మికమార్గమును బోధిం చును. సత్య దయాహింసాది సుగుణములను మోక్షమునకు ప్రథమసోపానములుగా వర్ణించి అట్టి సుగుణసంపద నలవఱచుకొన్న పిమ్మట (చేయవలసిన) కర్తవ్యమును వివరించిన వేద ముల మహిమ మానవమాత్రుడు వర్ణింపజాల డనుట అతిశయోక్తి కానేరదు.



# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిశరణమ్

గాడముక్తేశ్వర్
4-2-'08.

శ్రీవర్మా.... ..

నిన్నటిదినము నీవు వ్రాసిన పెద్ద యుత్తరమును జదివి సకలమును గ్రహించితిని. అదియునుగాక ఇంతకుపూర్వమే శ్రీ . వారి వలన మీ విషయ మించుక వినియుంటిని. నీవు కాశీనగరముననుండి వీలయినంతవఱకు సాధన భజనలు చేయుచు సుఖముగా నున్నావని విని మిక్కిలిగా సంతసించుచున్నాను. శ్రీ శ్రీ శారదాదేవిగారే నీయందనుగ్రహముంచి మంత్రోపదేశమును గావించియున్నారన్న మఱి భయమేల? ఇక నీవు ఆనందముతో భగవంతున కాత్మ సమర్పణము గావించుకొని నిర్విచారుడవై యుండుము. బాధనాదు లేవియు బయట లేవు. ఉన్నవన్నియు లోపలనే యుండును. ఆంతరంగికమగు బంధనమును భ్రాంతి వలన వెలుపలనున్నట్లు అనుమానింతుము. మన పుణ్యకర్మవలనను భగవత్కృపవలనను మనసు నిర్మలమయినచో ఇది సుస్పష్టముగా బోధపడును. కాని యీవిషయమును గ్రహింపగలిగినను బంధనవిముక్తి మాత్రము సులభముగా లభింపజాలదు. గురుకృప కలిగియుండి మనము తీవ్రముగా బ్రయత్నించిననాడే యవి తొలగును. ఎట్లయినను నీవు ధన్యాత్ముడవు, సందియము లేదు. సంసారము ననిత్యత్వమును గ్రహించి శాశ్వతవస్తులాభము కొఱకు సమస్తమును నేనాడు త్యజించితివో ఆ నాడే నీ భాగ్య పరిచయము కలిగినది. అదియునుగాక శ్రీశారదాదేవిగారి కృపకును పాత్రుడవగుటవలన నీవు మహాభాగ్యశాలివని తలంపవలయును. నీవు తీర్థయాత్ర చేసి నిర్జన ప్రదేశములందు సాధనలు సలుప యత్నించుట మిక్కిలి శ్లాఘనీయము. 'ఆరోగ్యముపై దృష్టి నిలుపుము' అని శ్రీవారు చెప్పిన పలుకులు మఱువకుము. ప్రభువును హృదయస్థితుని గావించి యెచటికేగినను ఏగుము. ఏమియు భయము లేదు. ఏమియు చింతింపవలదు. నిర్విచారుడవై తీర్థయాత్రయు నిర్జనవాసమున సాధనలను జేసియు నీ మనోరథమును నీడేర్చుకొనుము. ఇందున నసంగతియు నాటకము కలుగజాలదు. కర్మవశాన బంధనము కలుగనోపునని వ్రాసియుంటివి కాని అట్టి భావమునకు ఎట్టి కారణమును కనుపించుట లేదు. కర్మాచరణము అవశ్య కర్తవ్యము. కానిచో చిత్తశుద్ధి కలుగుటెట్లు? కర్మాచరణమే మనకు గీటురాయి. మనస్సు ఎంతవఱకు ఫలాసక్తి కలిగియున్నదో, ఎంతవఱకు నిష్కామమయినదో, స్వార్థపరతయందలి న్యూనాధిక్యతల తారతమ్య మెంతమాత్రమైయున్నదియో —వీని నన్నింటిని గ్రహింపగలుగు నవకాశము కర్మాచరణమునందే కలదు. ఎన్నడు హృదయమున ప్రేమ అంకురించునో ఆనాడే కర్మమునందు కర్మజ్ఞానము కలుగదు, అవుడది యొక

ఆరాధనమై గోచరించును. అదియే నిజమయిన భక్తి. ప్రారంభమున నీ రెండును కావలయును—కర్మాచరణము గావింపవలయును, సాధనలును గావింపవలయును. ముఖ్యోద్దేశమున—ఈశ్వరలాభమున—లక్ష్యముంచుకొని కర్మాచరణము గావించుచుండినచో పిదప కొంతకాలమునకు భగవత్కృప వలన సర్వమును సాధనమార్గమేయను అభేద జ్ఞానము కలుగును. కర్మాచరణము, భక్తి సాధనలు—వీనికి భేదమూవంతయు గోచరింపదు, అన్నిటియందు భగవంతుడోతప్రోత భావమున మెలంగుటయే అందులకు కారణము. ఎట్లయినను ఆ భగవంతుని మనస్సున నిలిపి నీ మనోభీష్టమునననుసరించి జీవనమును గడుపుము. ఏలయన మఠముననుండి నిష్కామ కర్మాచరణము గావించుటయు, తీర్థములందు నివసించుచు నిర్జన సాధనల గావించుటయు—ఈ రెండును ఉత్తమములే ఎల్లప్పుడును 'నేను దుర్బలుడనని' తలంపవలదు. నీవు దుర్బలుడవుగావచ్చును కాని నీవు శరణుజొచ్చిన భగవంతుడు సర్వశక్తిమంతుడు కావున ఆయన శక్తి వలన నీవును సబలుడవని తలంపవలయును. ఆ భగవంతుడు గాక ప్రపంచమున నన్యతరమేదియులేదని నీ కెన్నడు గోచరించునో ఆ నాడే నీ హృదయమున మహాబలము ప్రవేశించును. ప్రభుని శ్రీపాద పద్మములందు నీ భక్తి విశ్వాసానురాగములు దైనందినము ప్రవర్ధమానములగుగాక! ఆ భగవానునియందు మీరెల్లరు సంపూర్ణముగ నిమగ్నులరై యీ మీ శరీరధారణము సార్థకము కావలయుననియే నా ప్రార్థన! ఇక వ్రాయవలయునది యేమి కలదు!

ఇట్లు,
శ్రీ తురీయానంద

—

మహాపురుషులు మహాత్యాగము చేయుచుండుటయు జనసామాన్యము వాని సత్ఫలముల ననుభవించుచుండుటయు లోకవిదితము. నీ మోక్షము నకుంగాను నీవు సమస్తము త్యజించుట యొక ఘనకార్యముకాదు. లోక కల్యాణార్థ మాత్మ మోక్షమును సైతము పరిత్యజింప నెంతువా? ఎంచెదవేని సాక్షాత్ భగవానుడవు—ఈ విషయము నాలోచింపుము. బ్రహ్మచర్యము నవలంబింపుము, ఇదియే నీకు నాహితోక్తి. నాయభిప్రాయమేమన, సమస్తవిషయసుఖములను విడనాడి, కొంతకాలమువఱకు నీతల్లిదండ్రులవద్ద నుండుము—ఇది "కుటీచకావస్థ." జగద్ధితార్థము నీ మహాత్యాగమునకు నీభార్యను సమాధానపఱుపఁ బ్రయత్నింపుము. దృఢ విశ్వాసము, సర్వవిజయసమర్థమగు ప్రేమానురాగములు, అఖండ నైర్మల్యము—ఇవి నీ కలవడునేని, యచిరకాలముననే విజయోపేతుఁడ వగుదు వనుటకు నాకిసుమంతయు సందియము లేదు.

—శ్రీ వివేకానందస్వామి

—

శ్రీ కృష్ణాయనమః

# ప్రపంచమనుసరింపదగినది బౌద్ధమత మొక్కటియేనా?

శ్రీ కృష్ణదాసు బుద్ధప్రియులు

[కొన్నాళ్ల క్రితము డాక్టరు B R అంబేద్కరుగారు మహాబోధిపత్రిక వైశాఖ సంచికయందు 'బుద్ధుడు—భవిష్యత్తున అతని ధర్మము' అను వ్యాసమును రచించి యుండిరి. అందుగల ప్రశ్నలు కొన్నింటికి శ్రీ కృష్ణదాసు బుద్ధప్రియులు ఒసగిన ప్రత్యుత్తరము లిప్పుడు ప్రచురింపబడుచున్నవి.

సంపాదకులు ]

(డిసంబరు సంచిక తరువాయి)

అం.—వ్యక్తుల స్వభావ మెల్లప్పుడును మారుచుండునదగుటచే నెవరి విషయమున గాని, యావజ్జీవ మొకే గుణము తక్కిన గుణముల నన్నిటిని త్రోసివుచ్చి విజృంభింపజాలదు. కనుక, మనుష్యులను వర్ణములుగ స్థిర విభజన చేయుటగాని, వారికి శాశ్వతవృత్తులను కల్పించుటగాని సాధ్యముకాదు. ఈ కారణమును బట్టి, చాతుర్వర్ణ్య సిద్ధాంతము నిలువజాలదు. హిట్లరు, ముస్సొలీనీలు సామాన్యస్థితిలోనుండి ప్రపంచ పరిపాలనా దక్షులగు నియంతల యున్నతపదవి నాక్రమించిరి. దీనికి కృష్ణుని సమాధాన మేమి?

బు.—సుప్రసిద్ధ స్మృతికర్త, ఆపస్తంబుని అభిప్రాయము ప్రకారము, వర్ణాశ్రమములు సమయాచారిక ధర్మములు, సాంఘిక సాంప్రదాయములే ఆధారముగాగల ఆచారములు. కొంతవరకు పరిసరస్థితిగతులకు అనుగుణముగా మార్పునొందుచు, సర్దుకొనుచుండు సంఘమునందంతర్భూతములై యుండునవి యివి. చాతుర్వర్ణ్యవ్యవస్థను తాను సృజించితినని శ్రీ కృష్ణుడు చెప్పినప్పుడు, సృష్టికంతకును మూలాధారభూతుడును, ఆదికారణుడునైన తానే చతుర్విధ విభాగాత్మకమైన మానవజాతిని సృష్టించితినని ఆయన భావము.

సంఘమనునది మార్పునొందుచు, పెరుగుచు, నశించు గోచరవస్తువిశేషమని హిందువులకు బాగుగా దెలిసిన విషయము. అందుచేతనే, వారు ప్రపంచమును చంచలసంస్థయగు జగత్తని వ్యవహరించినారు. అయినను, వ్యక్తులు జ్ఞానవికాసమునొంది, సాంఘిక పార

మార్థిక సౌష్ఠవమును ప్రతిబింబింపగల్గుటకై, సామాజికసంస్థల కొకవిధమైన స్థిరత్వమును, అవిచ్ఛిన్న పారంపర్యమును జేకూర్చుట బహు ముఖ్యమని హైందవనాయకులు గ్రహించిరి. ఆలోచనా స్వాతంత్ర్యముకల్గి, మానవులు తమ కనుగుణమైన వృత్తి నవలంబించుటయుక్తమే. కాని, ప్రతిక్షణమును స్వీయాభిప్రాయములను, వృత్తిని మార్చుకొనుచుండు మనుష్యుడు సంఘములో బనికిమాలినవాడై, నిరర్థకజీవిగ బరిణమించును. కనుక, సంఘమునందు ప్రతివ్యక్తికిని ఆతని అభిరుచిని, శిక్షణమునుబట్టి, గుణకర్మ ప్రమాణములనుబట్టి, స్థానమేర్పడును.

సౌష్ఠవ మానవోత్పత్తి, వికాసలబ్ధి కొఱకు, నేటికిని మానవోత్పత్తి శాస్త్రజ్ఞులు, కొన్ని పురుషాంతరములం దంతర్భూతములై యుండు గుణముల యభివృద్ధికి తోడ్పడు నుపాయముల పరిశీలనను, సముచిత ప్రయోగమును ప్రతిపాదించుచున్నారు, ఈ విషయమున మనకు అందుబాటులోనున్న పురాతన గ్రంథము లనేకములు చాతుర్వర్ణ్య నిర్మాతల లక్ష్యముకూడ నిదియేయని స్పష్టపరచుచున్నవి. సహజ సాత్వికగుణ సంపత్తితో, సాత్విక జననీజనకులకు గలుగు శిశు వా గుణములను తన యావజ్జీవమును గలిగియుండునను నిశ్చయములేదు, ఇట్లే, తామసిక లక్షణములతో జన్మించు శిశువును యావజ్జీవ మా తరగతిలోనే పరిగణించుటకును వలనుపడదు.

ప్రాచీన హిందూగ్రంథకర్తలు విద్యవలనను, శిక్షణమువలనను స్వతస్సిద్ధములగు గుణములు సుష్ఠుపరుపబడి, ఆస్థాయిని పోషింపబడవలయు నావశ్యకత నంగీకరించి యున్నారు. ఒక వ్యక్తికి శాశ్వతస్థానమును నిర్ణయించుటలో సంస్కారమునకుగల ప్రాముఖ్యము వారి పరిపూర్ణామోదమును బడసినది. కొన్ని యున్నత పారమార్థిక, సాంఘిక ప్రయోజనముల లబ్ధికి నొకానొక జీవితవిధానమును శ్రద్ధతోననుసరింపగల సంస్కారమే సాధనము. కేవలము గుణములవలన గాక ఈ సంస్కారము వలననే వర్ణము నిర్ణీతమగుచున్నది. ఇందుచేతనే, శ్రీకృష్ణుడు గుణ, కర్మలకు సమాన ప్రాముఖ్య మిచ్చియున్నాడు. ఈ సంస్కారము వలనగాని, కర్మవలనగాని వ్యక్తికి సత్ఫలితము లభించునని, ఆవ్యక్తి జననీజనకుల సద్గుణ సంపత్తితో బుట్టినప్పుడు, శాశ్వతముగ ఆఫలితము నిలువగలదని సులభముగ విశదము కాగలదు. యావజ్జీవము నిలువగల గుణముచు నెలకొల్పి సుస్థిరముగ నుండునట్లు చేయుటలో సంస్కారమునకుగల విలువను గీత పూర్ణముగ నంగీకరించుచుండుటచే, మానసిక, శారీరక యుక్తమగు చాతుర్వర్ణ్య విభాగము ప్రత్యేకాధికారములపై నాధారపడు సంకుచిత సంస్థగాక, మానవస్వభావము నాశ్రయించియుండు దుర్భేద్యదుర్గమై యొప్పుచున్నది.

పూర్వము జాతివిభాగములకంటె, ఈనాటి రాజకీయపక్షములే ప్రజలను ప్రతికూల కక్షలుగ విభజించి, వారిలో పరస్పర ద్వేషానలమును బ్రజ్వలింపజేయుచున్నవి. ప్రకటనఫలక చిత్రకారులందరును, తాపీపనివారందరును తెల్లవారులోపున హిట్లరులుగను, ముస్సోలినీలుగను మారుట లేదు, తాత్కాలికముగ వారేపేళ్లతో వ్యవహరించుచున్నను, వారిలో స్వతస్సిద్ధమగు యోగ్యతగలవారు మాత్రమే ఈ యున్నతస్థానము లాక్రమించుచున్నారు. ఒక శూద్రస్త్రీ పుత్రుడగు విదురుడు తన కాలపు మహోన్నత ధార్మిక పురుషులలో

నొకడయ్యెను, బ్రాహ్మణ సన్యాసులకంటెను, మునులకంటెను నెక్కువగ గోపస్త్రీలు భగవన్నిమగ్నతను సాధించిరి, వైభవోపేతులగు రాజులు పురోహిత, సభిక పరివేష్టితులై దుర్మార్గులైరి. ఈ విషయముల నన్నిటిని కన్నులారజూచిన కృష్ణుడు, పూర్వజన్మార్జితములగు తమతమ సంస్కారముల ప్రాబల్యముచే జీవులు, స్వీయ ప్రతిభా విష్కరణమునకు అడ్డుతగులు సందర్భములను, పరిసర స్థితిగతులను కొనాడగలరని బహు సులభముగ గ్రహించియే యుండును.

చాతుర్వర్ణ్యసంస్థ తరగతులను సూచించునేకాని, నిమ్నోన్నతములుగల అంతరములను సూచింపదు, కులవిధానము దాని వికృత స్వరూపమే కాని వారసుకాదు. కులపద్ధతి నేరూపమునగాని పునరుద్ధారణచేయుట అనావశ్యకము కావచ్చును గాని, వర్ణధర్మములను నాశనముచేయుట దుస్సాధ్యము ప్రతిసంఘము బ్రాహ్మణులను, క్షత్రియులను, వైశ్యులను, శూద్రుల నుత్పత్తిచేయవలయును, చేయనిచో, దానికి నాశనము తప్పదు. ఆశ్రమమువలె, వర్ణమాదర్శప్రాయమైనది. జాతి లేక కులసంస్థ, చారిత్రకవిషయము, నరవంశ విద్యావిషయిక పరిణతి. సుప్రసిద్ధ హైందవ విజ్ఞానవేత్త సెనార్టు, వర్ణమును తరగతియని, జాతిని కులమని అనువదించినాడు. జాతి వివిధకులములను, వృత్తులను, చారిత్రక కారణములవలన ఆచారజనితములైన యితర వ్యత్యాసములను సూచించుచున్నది. వృత్తులలోను, నివాసపద్ధతులలోను, ఇటువంటి యితర విషయములలోను గల భేదములవలన సంఘములో కలిగిన ఆంతరంగిక పరిణతియే కులపద్ధతి. గుణపరిశోధన నాధారముగ జేసికొని, ప్రజల నేప్రభుత్వముగాని కర్కశ కులములుగ విభజింపజాలదు.

ఇంతవరకు జరిగిన పరిశోధనలవలన, రాజకీయ విప్లవ ప్రాబల్యముచే వేర్వేరు వృత్తుల నవలంబించుచుండిన తెగలవారు ఉన్నతతర సాంఘికస్థానమును బడయుటకై ఒక్కొకప్పుడు తాము బ్రాహ్మణులమని చెప్పికొనుచున్నారు. అభీర బ్రాహ్మణులు పశుల కాపరులును, వ్యవసాయదారులును. సిథియను ప్రభువులు ఇండియాదేశములో స్థిరనివాస మేర్పరచికొనినప్పుడు, వారు క్షత్రియులైరి, మరి వారి పురోహితులు బ్రాహ్మణులైరి. వ్యాపార రహస్యములు కొన్ని ప్రత్యేక కుటుంబములను దాటి పైకి వెల్లడికాకుండునట్లు చేయుటకై యొక వృత్తిని వంశపారంపర్యముగ అవలంబించుటకును, కొన్ని పురుషాంతరములవారు కట్టుదిట్టమైన పరిశ్రమచేసి యొకానొక కళాకౌశలమును బెంపొందించుకొనుటకును ప్రజలకు నైసర్గికాభిలాష ఇండియాదేశమందే కాక యెన్నియో యితర దేశములందుకూడ గలదు. స్వీయవర్గమునకు బయట వివాహమాడుటకు [illegible] దేశములందలి పురుషులకుకూడ [illegible]వైముఖ్యమున్నట్లు కనుపడును. ఇండియాలో సహజముగా ప్రబలియున్న యీ స్థితిగతులకు పవిత్రశాసనములవలనను, వాక్సాంప్రదాయములవలనను, సంఘమున కొక ప్రత్యేకరక్షణ మగత్యమైన కాలమున, పరమపావనస్థానము లభించినది. నవీనదేశ కాలపరిస్థితులలో ఇట్టి వ్యత్యాసములన్నియు ముఖ్యముగ, విద్యా, రాజకీయ పరిణామములవలన క్రమక్రమముగ నశించుచున్నవి. కాబట్టి, యీ సమస్యలను బైకి లేవనెత్తి, సమరసభావమున జరుగుచున్న

సాంఘికాభివృద్ధిని నిరోధించుట నిష్ప్రయోజనము.

౨౦.—మానసికముగను, నైతికముగను హిందూమతము నిమ్నజాతులకు చేయగల సాయమేమి?

జ.—అత్యుత్తమమును, మహోదారము నైన హిందూమతసారము, పశుస్థితినుండి యే మనుష్యునైనను నిజమగు మానవత్వమునకు సముద్ధరించి, దేవతగ బరిణమింపజేయును. హైందవ విజ్ఞానసారమును జీర్ణించుకొనిన వ్యక్తికి నిమ్నజాతులు, ప్రభుత్వోక్త హీన జాతులు మొదలగు పదము లర్థశూన్యములు. ఎందుచేతననగా, అట్టి వ్యక్తికి ఈ విశ్వమంతయు శాశ్వతుడైన భగవంతుని ప్రతిబింబమై కన్పడును, ప్రతిజీవియు సాంఘికముగను, రాజకీయముగను నే పేరిట వ్యవహరింపబడుచున్నను సత్తానుబట్టి దివ్యాంశకలిగియుండును. అత్యధములును, అతిదీనులు నైన జనులకు హిందూమతము తప్ప మరి యే యితర మతముగాని యీ క్రిందివిధమున ప్రోత్సాహకరవాక్యములను జెప్పియుండలేదు.

మీరెవరికిని బానిసలుకారు, స్వాతంత్ర్యమంతయు, శక్తియంతయు మీలోనే యున్నది, మీలో నుండు యథార్థ మానవుడు సర్వశక్తిసంపన్నుడగు భగవంతుడే కనుక, ఈ లోకములో నత్యున్నతులను మించిన మహోన్నతులు మీరు. స్వకల్పితమైన యీ భ్రమ వాతావరణమును విడనాడి, మీయందున్న శక్తి, వైభవములను బ్రకటింపుడు. అప్పుడు మీ దాస్యమును, దుస్థితియు నంతరించును. మీకు గావలయు సర్వబలమును, రక్షణయును మీలోనే కలవు. కనుక, ముందునకువచ్చి, మీ భావిస్థితిని నిర్మించుకొనుడు.

ఆత్మగౌరవ, విశ్వాసములను అమూల్యములగు హిందూమత సిద్ధాంతములకంటె నెక్కువ ఉచ్చైస్స్వరమున బోధించు మత మింకొకటి వేరేదియు లేదు, ఉపనిషత్ప్రతిపాదితమైన మానవ దివ్యత్వ సందేశముకంటె నెక్కువ మానసిక, నైతికోపశాంతిని మరే యితర మత బోధలుకాని మనకు సమకూర్పజాలవు. కృతక నిస్సహాయస్థితిని దెచ్చిపెట్టుకొని చేయు దీనారావములుగాని, అన్యమతస్వీకారమొనర్తుమని చేయు బెదరింపులుగాని, కుతర్కాధారమున వాస్తవపరిస్థితులనుండి తప్పించుకొనుటకు చేయు ప్రయత్నములుగాని మనస్థితిని చక్కపరచుటకుతోడ్పడజాలవు. దీనులను, పరపీడితజీవులను జూచి విచారాశ్రువులను రాల్చిన యొక మహనీయుని యీ క్రింది మందలింపు గమనార్హము

''మనుష్యులమగు మనము, నింద నితరులపై మోపగలుగునంతవరకు, స్వీయదౌర్బల్యమును, దోషములను గుర్తించుటకు మిక్కిలి వెనుదీయుదుము. సాధారణముగ మానవులు తమ జీవితదోషముల నెల్ల సోదరమానవులపైననో, కానిచో భగవంతునిపైననో, స్వకల్పితభూతమగు విధిపైననో వేయుదురు.''

మన స్వీయగతికి మనమే కర్తలమను విశ్వాసమును కలిగి, ఆ విశ్వాసముతోనే వ్యవహరింతుముగాక. ఏవిధమైన అసమర్థతలతోగాని బాధపడువారు, ప్రతిఫలాపేక్షతో ప్రచారముచేసి సంపాదించిన రాజకీయాధికారము వలన మాత్రమే తమస్థితిని చక్కబరచుకొన

జాలరు. తమ స్వీయవిజ్ఞానమందు ఉత్తమమైన దానినెల్ల అవగాహనజేసికొని, జీవితలక్ష్యములను సాధించుటలో నితరుల కెవరికిని దీసిపోకుండుటకై, వారు తమలో గుప్తముగానున్న శక్తి నోరిమితో బ్రకటింపవలయును. సముద్రమున కావలగల దూరదేశములనుండి బౌద్ధమత ప్రచారకుల నాహ్వానించుటవలనగాని, హిందూమతమును దూషించుటవలనగాని అధమజాతుల జనులు తమస్థితిని బాగుజేసికొనజాలరు. ఎందుచేతననగా, బౌద్ధమతావలంబులగు జాతుల వారు ధనికులునుగారు, స్వమతప్రచారమునకై ఇండియాదేశమునకు వచ్చుటకు వలయు విశ్వాసోత్సాహమును వారికి లేదు. అన్యమతములను స్వీకరించువారికి సాయముచేసి, తమ వంశపారంపర్య మతములో వారి నుంచుకొనుటకు సాధారణ సవర్ణ హిందువు లాత్రపడుటలేదు. పాపము! సవర్ణ హైందవులు తమ నిమ్నజాతుల సోదరులవలెనే అజ్ఞాన, దారిద్ర్య నిమగ్నులై స్వీయమతప్రాశస్త్యమును గుర్తింపజాలక, తమ పరిసరములందేమి జరుగుచున్నదో గ్రహింపలేని స్థితిలో నున్నారు. కనుక తమ మతము తమ కన్యాయము చేసినదని భావించు హిందువులందరును అనుసరింపతగిన ఉత్తమమార్గము, నేటి రాజకీయస్థితిలో లభ్యమగు స్వాతంత్ర్య, విద్యాసౌకర్యముల నూతగాగొని, హిందూమతమును, వేదాంతమును విశ్వాసముతో, నోరిమితో బరిశోధించి, వానియందలి సుప్రశస్త విషయములను శల్యగతము గావించుకొనుటయందు కలదు కాని, తమ సోదర మతావలంబులు తమకు పూర్వమొనర్చిన అపచారములకు వారిని దూషించి, సత్యదూరములగు కారణములు యాధారములైన సంఘములో శాశ్వతముగ చీలికలను గల్పించుటలో లేదు.

హైందవ నాగరకతా విజ్ఞానములు నిమ్నోన్నత జనవివక్షతతో బనిలేకుండ, హిందువులందరి యాస్తి యని చెప్పుట కించుకమాత్రము సందేహములేదు. నేటి సవర్ణ హిందువులు మున్ను తమ పూర్వులొనర్చిన దోషములకు బశ్చాత్తాపము నొందుచు, తమ విజ్ఞానసంపదయందు నిమ్నజాతి సోదరులు తమతో సమానముగ పాల్గొనవలయునని ఆత్రపడుచున్నారు. ఇట్టి సందర్భములో ఇండియాదేశమందలి అధికసంఖ్యాక ప్రజావర్గములో చీలిక గల్పించి, హానికర ప్రచారముచేసి, అంతర్ద్వేషానలమును రగుల్కొల్పి ప్రజాసుఖజీవనమునకు శాశ్వతముగ చిచ్చుపెట్టుట మిక్కిలి అపాయకరము.

అ.—బౌద్ధభిక్షుకునకును, హైందవసన్న్యాసికిని హస్తిమశకాంతరము కలదు. అనుక్షణము బౌద్ధభిక్షుకుడు తనజీవితమును లోకహితమునకై ధారవోయుచుండును. హైందవసన్న్యాసికి లోకముతో పనియే లేదు.

బు.—ఇది విమర్శకు నిలువలేని అతిశయోక్తి. భగవత్ జ్ఞప్తి కలిగియుండుటకై, లోకమును భగవంతునిగనో, భగవత్సృష్టిగనో సేవింపగలుగుటకు ప్రపంచమందు సన్న్యాసిక సక్తత నిషేధింపబడినది. "ఆస్తికి యాజమాన్యము వహించుట స్వతంత్రయోచనకును, క్రియారూపకమైన స్వతంత్రయోచనా వినియోగమునకును ప్రతిబంధక" మని అంగీకరింపబడుచో, సంసారత్యాగమే దాని సహజఫలితముగ బరిణమించును. ప్రాపంచికవిషయసుఖములను పూర్తిగ ననుభవించి, విరక్తులైన వారును, అట్టి సుఖము లెంతమాత్ర మక్కరలేనివారును మాత్రమే హిందూమతప్రకారము

సన్న్యాసాశ్రమ స్వీకారమున కర్హులు. కనుక, అవిచ్ఛిన్న ప్రపంచసక్తిగల హైందవసన్న్యాసి భ్రష్టుడగును. సన్న్యాసాశ్రమ స్వీకార మొక సారి చేసిన హైందవుడు, తిరిగి దానిని విడనాడి గృహస్థాశ్రమ మవలంబింపకూడదని హిందూ ధర్మశాస్త్రము లాజ్ఞాపించుచున్నవి. బౌద్ధభిక్షు లట్లుగాక తమ యిచ్ఛవచ్చినప్పుడెల్ల సాంసారిక, సన్న్యాసజీవితము లవలంబింపవచ్చును.

అం.—సర్వమతములును యథార్థములైనవే యను వాక్యముకంటె దారుణమైన అసత్య మింకొకటి యేదియును లేదు. ఇట్టి బూటక మెన్నటికైన సమర్థనీయమా ?

బు.—మానవులందరు నొకే మతావలంబులై, యొకే యారాధన పద్ధతి ననుసరించుట తటస్థించునేని,లోకమున కదియే మహాదుస్థితిగ నెంచవచ్చుననియు, నట్లుగాక వారు తమ తమ జాతీయ మతధర్మముల ప్రకారము ప్రవర్తించుచు, కృతకృత్యులగుటకు స్వేచ్ఛకలిగి యుండుటే యుత్తమపద్ధతి యనియు పూజ్యపాదులు శ్రీ వివేకానందస్వామివారు నుడివి యున్నారు. తన మతమే మహోన్నతమైనదని, తక్కిన మతములెల్ల నశింపదగినవని వాదించువాడు, ప్రకృతివైపరీత్యమువలన ఆఱువ్రేళ్లు చేయిగల్గి తనవలెనే యెల్లరు నాఱువ్రేళ్లు చేతులుకలిగియుండుట సహజ శారీరకధర్మమని వాదించు మనుష్యునివలె పరిహాసాస్పదుడగును. సర్వమతధర్మముల సారమొకటే యను విషయమును ప్రపంచమండలి వివిధమతపరిశోధకులందరును సంపూర్ణముగ గ్రహించియున్నారు. ఇందువలన, మతములన్నియు సజీవములై యుండవలయునెడల, నవియెల్ల కలసియే సజీవములై శాశ్వతముగ వర్థిలుచుండవలయును; నశింపవలయునెడల, గలసియే నశింపవలయును. కాబట్టి, వివిధమతావలంబు లవశ్యముగ పరస్పర సహన, గౌరవభావములతో మెలగుచుండుటయే యిప్పుడు జరుగవలసిన పని.

అం.—ప్రపంచమనుసరింపతగినది, హిందువులను రక్షించునది బౌద్ధమత మొకటియే కాదా ?

బు.—ఈ లోకమున సుప్రసిద్ధ మతములెల్ల యుగయుగములనుండి, ధర్మ ప్రచారము చేయుచు, ముక్తిమార్గమును జూపి, మానవకోటిని రక్షించుచున్నవి. వాస్తవసందర్భ మిట్లుండ, విశ్వమత యోగ్యత బౌద్ధమతమునకు మాత్రమే కలదని వాదించుట దుస్సాహసము. ఇక హిందూమత ధర్మస్థానమున, బౌద్ధమతమును ప్రవేశపెట్టవలసిన యగత్య మెంతమాత్రమును లేదు. బౌద్ధమతమున గల సద్విషయములనెల్ల హిందూమత మెప్పుడో జీర్ణించికొనియున్నది. హిందువులు బుద్ధుని తమ దశావతారములలో నొక యవతారమూర్తిగ భావించి, పూజించుచున్నారు. సిద్ధార్థుడు బోధించిన దీనమానవసేవాదీక్ష హిందువులెల్లరును విధిగా ఆమోదించి, ఆచరించవలసిన పరమధర్మము. ఇట్లనుటచే, హిందువులు స్వధర్మమును విడనాడి, బౌద్ధమతమును స్వీకరింపవలయునని అర్థముకాదు.

ఇండియా దేశములో బౌద్ధమతము నశించి యెన్నియో యుగములైనది. ఇందులకు గారణము దాని నిరీశ్వరవాదమేకాక, ఛాందస వామాచార ప్రచారముచే సంభవించిన బౌద్ధభిక్షుకుల నైతికపతనమనికూడ నొక్కి చెప్పవచ్చును. బౌద్ధ, వేదాంత మతముల సారమొకటియే యని నిరూపించి, శ్రీ శంకరా

చార్యులవారు చాలమంది నుద్ధరించినను, వామాచారమువంటి పతిత బౌద్ధమత దురభ్యాసములలో గొన్నిటికి నేటికిని ప్రజలలో కొందరు వశులై యున్నారు. భ్రష్ట బౌద్ధమతము ప్రచారముచేసిన అసహ్యాకర ప్రతిమలును, స్వైర కర్మకలాపమును హిందూమతమును కురూపిణిగ జేసినవి. ఇండియాలోని ప్రజల యెల్లరి అభిరుచులను తృప్తిపరచునది, ధర్మార్థకామమోక్షములను చతుర్విధ పురుషార్థ సిద్ధికి సాధనోపాయములను నిర్ణయించు వేదమతమే కాని, సర్వవిధ కామనాశనద్వారమున నిర్వాణ ప్రాప్తిని బోధించు నేకైక సూత్రాశ్రయమగు బౌద్ధమతము కాదు. సర్వస్వరయుక్తమైన సంపూర్ణ గానస్వరూపమువంటిది హిందూమతము. దానిలో నొక స్వరము మాత్రమే యగును బౌద్ధమతము. బౌద్ధమత నైతికధర్మములను స్థిరముగా నెలకొల్పి, పోషింపగల శక్తి, దాని కాధారభూతమైన తాత్త్వికజ్ఞాన భవనమునకు లేదు. కనుక, హిందువులు బుద్ధుని హృదయవైశాల్యమును శంకరుని మహాద్భుత మేధాసంపత్తితో మేళవింపకోరతగుదురే కాని, స్వసంఘ శరీర శల్యాగతమైన స్వధర్మమును త్యజించి, నవనాగరకుల విలాసార్థము పూర్వశిథిలభాగముల యాధారముపై పునర్నిర్మితమైన కృతికి బౌద్ధమతమును స్వీకరించుటవలన వారు బడయు లాభ మిసుమంతయును లేదు.



మన సంఘమునందలి మహాలోపమిది, దీనిని మనము తొలఁగించుకోవలయును. జాతీయభావముగల సంఘము నిర్మింపఁబడవలయునన్నచో, విద్యగఱపి జనసామాన్యమును లేవనెత్తవలయును. పుండెచట నున్నదో మన సంఘసంస్కర్తలు చూడరు. కుటీరమున నివసించు నిజమైన సంఘము తన మానవత్వమును వ్యక్తిత్వమును గోల్పోయినది, మఱచిపోయినది. ఏ హిందువులో, తురకలో, క్రైస్తవులో, కాలిక్రింద వైచి త్రొక్కివేయుచుండ, చేతఁ బదికాసులున్న ప్రతివ్యక్తి చేతను దాను ద్రొక్కఁబడుటకే పుట్టితినని తలఁచునట్టి దుఃస్థితికి దిగినది మన సంఘము. పేదలు కోల్పోయిన వ్యక్తిత్వమును దిరిగి వారి కొసఁగవలయును. వారిని విద్యావంతులను గావింపవలయును. రసాయనముల నొండొంటితోఁ జేర్చునంతవఱకే మనపని, స్ఫటికీకరణము దైవనియమములననుసరించి జరుగును. జనులకు మన ముత్తమాశయములను గలుగఁజేయుదము, మిగిలినదంతయు వారు చేయవలసినపనియే.

—శ్రీ వివేకానందస్వామి



# వి న య ప త్రి క

మూలం:
శ్రీ తులసీదాస గోస్వామి

అనువాదం:
క్రాంతికర్

(గతసంచిక తరువాయి)

## ౧౧౫

శ్రీరామచంద్రునివలె ఆపదలను హరించువాడు, ఎట్టి స్వార్థములేకయే దయజూపువాడు, అసహ్యమగు దుఃఖసముద్రమును దాటించువాడు మరెవడును లేడు. గజేంద్రుడు తన యసమర్థతను గుర్తించి, తామరపూవును గైకొని "శరణు శరణు" అనుటతోడనే వాని దైన్యవాక్కులను విని సుదర్శన చక్రధారి యగు విష్ణుభగవానుడు గరుడునివదలి వానిని రక్షింప వెడలెను. దుశ్శాసనుడు వివస్త్రను గావింపనున్న సమయమున ద్రౌపది "శ్రీహరీ! నన్ను గాపాడుమా" యని కుయ్యిడుటతోడనే ఆ భగవంతుడు అసంఖ్యాకములగు వస్త్రములదెచ్చి పడవైచెను. దీనినెఱిగియే దేవతలు, మనుజులు, మునులు, జ్ఞానులు ఆ ప్రభుని చరణముల సేవింతురు. తులసీదాసు చెప్పునదేమన—నృగమహారాజు నుద్ధరించిన విష్ణుభగవానుడు ఎవని కథయ మొసంగడు?

## ౧౧౬

కీర్తికై పవిత్రాత్ములనువదలి నీచులను ప్రేమించిన ప్రభువు శ్రీరామచంద్రుడుగాక మరెవరు? శ్రీకృష్ణుడు స్తనములకు విషముపూసికొని తన్నుజంప వచ్చిన పూతనకు తల్లికివలెనే యుత్తమగతి నిచ్చెను. తనపై కామాసక్తలగు గోపికలపై జూపిన యపూర్వమగు కృప కారణముగా జగత్పితయగు బ్రహ్మయు వారి చరణరజమును గ్రహించి తన్ను ధన్యునిగా భావించుకొనెను. నిత్యమును ఏరికోరి దూషించెడు శిశుపాలుని రాజుల నిండుసభలో తనలో నైక్యమొనర్చుకొనెను. మూర్ఖుడగు కిరాతుడు మృగమని భ్రమించి గురిచూచి పాదమును బాణముతో గొట్టగా తన స్వభావము ననుసరించి వానిని సశరీరముగా స్వర్గమున కనిపెను. శ్రీకృష్ణు డుద్ధరించిన వీరందరు పాపులు, పుణ్యులుగూడ, వీరి విషయమై ఎవరేమనగలరు? కాని ఆశ్చర్యమేమనగా శ్రీరామచంద్రుడు సాత్త్వికాపస్వరూపుడగు తులసీదాసున కభయమొసంగెను.

## ౧౧౭

శ్రీరామచంద్రున కిది యలవాటు, తన మనమున నిజమగు ప్రేమను గుఱుతించి నీచుల యెడలను స్నేహశీలుడై యుండును. మిక్కిలి పాపియు, నీచుడునగు గుహనిషాదు డేపాటి మర్యాదగలవాడు? కాని వాని ప్రేమను గుఱు

తించి ఆయన వానిని కుమారునివలె కౌగిలించెను.

జటాయువు—బ్రహ్మ యాతనిని హింసామయము నొనర్చెను—ఏమంత దయగలవాడు? కాని రామచంద్రు డాతనికి తనచేతిమీదుగ తర్పణము విడచెను.

శబరి స్వతహాగా అపవిత్రురాలు. అవగుణముల ప్రోవు. అయినను ఆమె యిచ్చిన పండ్ల యొక్క రుచిని మిక్కిలిగా ప్రశంసించుచు నారగించెను.

రాక్షసుడు, శత్రువునగు విభీషణుడు తనను శరణువేడవచ్చెనని తెలిసి భరతునివలె యాతని కౌగలించెను. ప్రేమాధిక్యతచే తన శరీరమును తానే మఱచెను.

ఎవరిస్మరణ యనిష్టహేతువో అట్టివానరములు ఏమంత భాగ్యశాలురు, సచ్చరిత్రులు? కాని వారందఱను తనయింటికి బిలిచి ఆదరించెను. తనకు మిత్రులనుగా జేసికొనెను.

శ్రీరామచంద్రుడు స్వభావముచేతనే దయాళుడు. కోమలచిత్తుడు, పేదల పెన్నిధి. తులసీదాసు చెప్పునదేమన—ఓ కపటచిత్తుడా! కపటము నెఱపకుము. ఇట్టి ప్రభుని భజన చేయుము.

౧౧౮

ఓ శ్రీహరీ!

ఏ చరణములు కలియుగమందలి సమస్తపాపములను, దుఃఖములను నశింపజేయునో—

ఏవి సమస్తమయిన శుభములను జేకూర్చునో—

ఏవి శరదృతువున వికసించిన, అందమయిన, మిక్కిలి నూతనమైన యెఱ్ఱతామరవంటి రంగు గలవో—

వేనిని లక్ష్మీదేవి తన మనోహరములగు నరచేతులతో సేవించునో—

ఏవి యనుపమమగు శోభ కాకరములో—

ఏవి గంగాభవాని కుత్పత్తిస్థానములో—

ఏవి మన్మథ శత్రువగు శివునకు ప్రియతమములో—

ఏవి కపటవేషమున బలిచక్రవర్తిని మోసగించినవో—

ఏవి ఋషిపత్నియగు నహల్యను, నృగమహారాజును, హింసాస్వభావుడగు నిషాదుని యుద్ధరించినవో—

సిద్ధులు, దేవతలు, మునులు, వేనికి వందనమాచరింతురో—

ఏవి యందఱకు సుఖమును, ఆశ్రయమును నొసంగునో—

వేనిని ధ్యానించుటచే మానవుడు తాను తరించుటయేగాక, ఇతరులను గూడ తరింపజేయువాడగునో—

ఆ నీ చరణకమలముల నా కెన్నడైన జూపింతువా? కృపాసాగరుడవు. సుచతురుడవునగు నో రామచంద్రా! నీవు శరణుజొచ్చినవారి దుఃఖముల నోగొట్టువాడవు. ఈ తులసీదాసు—నీ యీ చరణముల దర్శింపవలెననెడు ఉత్కంఠతోడనే మరణింప గోరుచున్నాడు.

౧౧౯

ఓ ప్రభూ!

నీ వెన్నడైన నన్ను నీవానినిగా జేసికొందువా? పేదలను సంతోషపెట్టువాడవు రాజు

లలో శ్రేష్ఠుడవునగు నో రామచంద్రా! నీవు హృదయమున నీ కీర్తిని యోజింపవా? శీలమునకు సముద్రమవు, సుందరుడవు, అన్నివిధముల యోగ్యుడవు, సమర్థుడవు, సద్గుణములకు గనివి యగు నో ప్రభూ! నీవు నీదాసులను రక్షించితివి. రక్షించుచున్నావు, రక్షించెదవు. శరణు జొచ్చిన నా ప్రేమను గుర్తింపవా? నీ వెల్లవుడును దీనులయెడ ప్రేమగలవాడవని, మహాదాతవని వేదములు చెప్పుచున్నవి. లోకమెఱుగును. ఈ మాఱు నా విషయమై నీ యలవాటును మఱచిపోయితివా యను సందియము గలుగుచున్నది. నీవు దుఃఖితులకు, పేదలకు, అనాథులకు హితమొనర్చువాడవు. లోకమర్యాదను పాటించువాడవు. శరణు జొచ్చిన నా జననమరణ బంధముల ఛేదింతువుగనుక నా పరిణామము మంచిదనియే యెంతును.

## ౧౨౦

ఇతరులను నమ్మియున్న వారటులే యుండవచ్చును. నాకేమో ఈ కలియుగమున రామనామమే అన్నిఫలములను ఫలించిన కల్పవృక్షము. కర్మ, ఉపాసన, జ్ఞానము, వైదిక సిద్ధాంతములు—ఇవన్నియు నన్నివిధముల నిజములే. కాని నాదృష్టియంతయు రామనామముపైననే నిలిచినది. నే నింతవరకు కుక్కవలె ఆకులు నాకుచుంటినిగాని యెన్నడును నా కడుపు నిండలేదు. రామనామస్మరణవలన ఇప్పుడదియే అమృతరసముతో నిండినదైనది. దాని ప్రభావముచే నాకు స్వార్థ, పరమార్థ విషయములందు 'నరోవా కుంజరోవా' యనెడు ద్వైధీభావములేదు. సముద్రముపై రాళ్లతో వంతెన నిర్మించి వానరము లావలియొడ్డు జేరినవని విందును. విషయమేమన ప్రేమ, విశ్వాసము కుదురుకొనినపుడు కార్యము నిర్విఘ్నముగా సమాప్తమగును. 'రామ' యను రెండక్షరములే నాకు తల్లి, దండ్రి. వీని యెదుటనే నేను బాలునివలె మారాము జేసెదను. నేనిందులో ఏమైన దాచి చెప్పిన నా నాలుక మాడిపోవలె. శివుడే ఈ విషయమై సాక్షి. రామనామము వల్లనే అన్నివిధముల మేలొనగూడునని నాకు—తులసీదాసునకు—నమ్మకము.

(సశేషము)



# శ్రీ శారదానందస్వామి

ప్రపంచమున ఆధ్యాత్మికేతిహాసమును పరిశీలింప కొన్నివిషయములు స్పష్టముగ గోచరించును. ధర్మము అధఃపతనము చెందినపుడెల్ల భగవానుడు స్వయముగ తన శక్తివలన ప్రపంచమున నవతరించి ఆధర్మమును పునరుద్ధరించును. ఆయన ఈ లోకమునకు వచ్చునపుడెల్ల ఆయనతోగూడ లీలాసహచరులు గొందఱు వచ్చుటయు గలదు. ఆయన పూనిన కార్యమునందు వీరు తోడ్పడుచుందురు. అవతారపురుషుల చర్య, మహత్త్వము సాధారణ లౌకిక ప్రజలు గుర్తింపజాలరు. కావున ఆ యవతారపురుషుల ఆదర్శములను సదుపదేశములను ప్రచారము చేయ స్థైర్యముగల శిష్యవర్గ మత్యంతము ఆవశ్యకము. అదియునుగాక యీ యవతార పురుషుల అతీంద్రియ సూక్ష్మ ఆధ్యాత్మికోపలబ్ధులను సాధారణ ప్రజానీకమునకు బోధించు శక్తి వీరియందే యిమిడియుండగలదు. ఈ మహనీయులెల్లరు మనవలె తమ కర్మఫలములనుభవింపగలందులకై యీ సంసారమున జన్మించినవారు కారు. వీరెల్లరును నిత్యసిద్ధులగు నీశ్వరకోటికి జెందినవారు. తమ తపము వలనసిద్ధిపొందినవారయ్యు సామాన్య ప్రజానీకము కష్టములజూచి భరింపజాలక దయార్ద్రహృదయులై ఈ లోకమున కవతారపురుషుల గలిసివచ్చినవారు వీరు. ఉదాహరణమునకు శ్రీకృష్ణునితోడ అర్జునుడు, బుద్ధునితో ఆనందుడు, శంకరునితో పద్మపాదుడు, శ్రీచైతన్యునితో నిత్యానందుడు, ఏసుక్రీస్తుతో పీటరు— ఇట్టివారిని పేర్కొనవచ్చును

పందొమ్మిదవ శతాబ్దమున భారతదేశమున హిందూధర్మ మనేకమార్గముల క్షీణగతిని బొందియుండెను. ఆ కాలమున శ్రీరామకృష్ణ గురుదేవుడు భారత గగనమున పైవాక్పౌర్ణిమ యవతరించి తన వినిర్మల శుద్ధతేజస్సువలన సర్వత్ర ప్రకాశించెను. ఆయన రాకవలన శతాబ్దములనుండియు దాస్యమునకు లోబడి యుండిన ఈ భారతదే శౌన్నత్యస్థాపనకు పరిపూర్ణావకాశము లభించెను. ప్రకృతి ననుసరించి చంద్రబింబమును కొన్ని నక్షత్రములు వెన్నంటి దాని ప్రతిభను అధికరించునట్లు శ్రీ గురుదేవునితోగూడ కొందఱు శిష్యులీప్రపంచమున కరుదెంచి 'బహుజన హితాయ—బహుజన సుఖాయ' యన్న ధర్మవాణిని ఘంటాపథముగ జాటించి మానవులనుసరింపవలయు మార్గములనెల్ల జూపిపోయిరి. అట్టివారియం దొకరు శ్రీ శారదానందస్వాముల వారు.

శరచ్చంద్ర చక్రవర్తి యనునది వీరి పూర్వాశ్రమ నామధేయము. కలకత్తాయందు శిష్టాచారపరాయణులును ధనికులునగు బ్రాహ్మణ కుటుంబమున పుష్య శుద్ధ షష్ఠి (1865) నాడు వీరు జన్మించిరి. వారు శనివారము సాయంకాలమున జన్మించినందున కొందఱు భయపడిరి. కాని వారి బంధువులలో జ్యోతిశ్శాస్త్రపారంగతుడగు నొకవ్యక్తి ఈ శిశువు చిరాయుర పేతుడై వంశదీపకుడగునని వచిం

చెను. వీరి తాతగారు సంస్కృతభాషయం దపార పాండిత్యము గలిగి సంస్కృత పాఠశాల నొకదానిని నెలకొల్పి కొనసాగించుచుండిరి. కాని వీరితండ్రిగారు ఒకానొక 'మందులషాపు' నందు భాగస్వామియై చాలా డబ్బు సంపాదించిరి. ఆయనగారు చాల ధర్మపరాయణులై న్యాయబద్ధులై జీవించుచుండిరి. తమ వృత్తియందు చాలకాలము గడుపుచుండియు పూజాదులయందును శాస్త్రపురాణపఠనములందు సైతము కాలము తగుమాత్రము గడపుచుండిరి. శరచ్చంద్రుడు తన పైతృకగుణములు అనేకము బడసియుండెను. పసితనమునుండియు అత్యంత గాంభీర్యమును గలిగియుండెను. కాన అనేకులు ఆయనయందు తెలివితేటలు లేవేమో యనుకొనుచుండిరి. కాని బడిలో జేర్పగనే ప్రతి పరీక్షయందును ఉన్నతస్థానమును బడసి తన అసాధారణ బుద్ధిసూక్ష్మతను వెలయించుచుండెను. చదువుటయందే కాక శారీరక వ్యాయామమునందును బడియందలి విద్యార్థి సంఘములందును ఔన్నత్యమును గడించుచుండెను. ఆయనకు ఆధ్యాత్మికాభిరుచి బాల్యమునుండియే పట్టువడెను. ఆయన యింట తన తల్లి గావించెడు పూజాదులగని ఆమె పూజ ముగించిన పిదప నామె కావించినట్లే పూజాంగములన్నియు గావించి తన చెలికాండ్రకు జూపుచుండువాడు. ఉత్సవకాలములందు విక్రయింపబడుచున్న బొమ్మలయందుగూడ దేవతా మూర్తులు గల విగ్రహములనే ఆయన కొనుచుండువాడు. ఇట్టి దేవతార్చనాభిరుచిని గాంచిన జనని పూజాసామగ్రినెల్ల ఆ చిన్ని బాలునకు కొనిపెట్టెను. శైశవమునందు ఆయన బాల్యక్రీడలలో ప్రధానస్థానము వహించినది ఈ దేవతార్చనయే. ఉపనయనానంతరము గృహమున పూజాకైంకర్యమును ఆయనయే కావించుచుండెను. ఆయన మిక్కిలి కోమలహృదయము గలిగి యెవరికష్టములనేనియు సహింపజాలకుండెను. కాన తలిదండ్రులు చిఱుతిండ్లకొఱకిచ్చిన పైకమును బీద విద్యార్థుల కిచ్చుచుండెను. ఒకప్పుడు తమ పొరుగింటి పనిమనిషికి కలరా సంభవించెను. ఆమెనుగూర్చి ఆ యింటి పెద్దలు ఎట్టి పూచీ తీసికొనకపోయిరి. అప్పుడు ఆయన ఆమెకు వలయునట్లు శుశ్రూష గావించి సకలోపచారములు చేసెను. చివఱకామె మృత్యువువాతబడెను. ఆ యింటివారీ విషయమున చేయి చేసికొనలేదు. కావున శరచ్చంద్రుడే తన చెలికాండ్ర సాయమున ఆ శవమునకు దహన సంస్కారము గావించెను.

ఇట్లు వారి బుద్ధితీక్ష్ణతయు, ఔదార్యమును దినదినప్రవర్ధమానమగుచు ననేకుల నాకర్షింపజొచ్చెను. కొంత వయసు మీరిన పిదప వారు కేశవసేనుని సంఘమున జేరిరి. ఆ కాలమునందలివిద్యార్థులెల్లరు ప్రసిద్ధవక్తయగు కేశవచంద్రసేనునిచే ఆకర్షింపబడుచుండిరి. తన సహపాఠకులు, తన కళాశాలా విద్యార్థులు అనేకులు నవవిధాన బ్రహ్మసమాజ సభ్యులై యుంట వలన వారితోబాటు శరచ్చంద్రులును ఆ సమాజమున సభ్యత్వమునంది, ఆ సామాజికగ్రంథముల జదువుటయేకాక ధ్యానముచేయుటయు నభ్యసింప నారంభించిరి. ఇట్లుండ వీరు ప్రవేశ పరీక్షయందుత్తీర్ణులై సెయింట్ జేవియర్ కాలేజియందు జేరిరి. అచటి యధ్యక్షుడగు ఫాదర్ లెఫ్రంట్ వీరి యసాధారణ ధార్మిక భావమును కనిపట్టి వీరికి బైబిలు నేర్ప ప్రారంభించెను. ఇట్లు ఆచారపరాయణులైన బ్రాహ్మణకుటుంబమున జన్మించినను బ్రాహ్మ

మతము, క్రైస్తవమతము—వీనిని గూడ గ్రహించి క్రీస్తునం దత్యంత భక్తి జూపుచుండిరి. అయినను తమ స్వధర్మమగు హిందూ మతమునందు ఏమాత్రము ప్రేమయు వీరికి తగ్గలేదు. ఇట్లు కొన్నాళ్లు గడచుటయు సర్వధర్మసమన్వయమూర్తియగు శ్రీరామకృష్ణ గురుదేవుని దర్శనము శ్రీవారికి లభించెను.

శరచ్చంద్రులకు శశి యను బంధువు గలడు. వారిరువురును ఒకేగృహమున నివసించుచు నొకే కళాశాలయందు విద్యాభ్యాసము గావించుచుండిరి. ఒకనాడు శశి సహపాఠకులు కేశవచంద్రసేనుడు దక్షిణేశ్వరమున నున్న శ్రీరామకృష్ణ పరమహంసనుగూర్చి పొగడి ప్రచురించిన వ్యాసమును వినిపింపగా వీరిరువురును దక్షిణేశ్వరమునకు వెళ్లి వారిని దర్శింప నిశ్చయించుకొనిరి. 1883 వ సంవత్సరము అక్టోబరు మాసమున నొకనాడు శశియు శరచ్చంద్రుడును కలిసి దక్షిణేశ్వరమునకు వెడలిరి. శ్రీరామకృష్ణులవారు అత్యంతాదరపూర్వకముగ వారికి స్వాగతమిచ్చి రాబట్టిరి. కొన్ని ప్రశ్నోత్తరములు గడచిన పిదప వారు కేశవసేనుని బ్రహ్మసమాజమునకు అప్పుడప్పుడు వెళ్లుచున్నారని విని శ్రీ పరమహంసలవారు ఇట్లు పలికిరి 'పెంకులుగాని ఇటుకలుగాని కాల్పక పూర్వమే వానిపై ముద్రవైచినచో కాల్చిన పిదప నెల్లప్పుడును ఆ ముద్ర యట్లే యుండిపోవును. కాని ఈ కాలమున విద్యాభ్యాసము ముగిసక పూర్వమే యువకులకు వివాహము చేయుచున్నారు. కావున వారు విద్య ముగిసీ ముగియక పూర్వమే నౌకరీ కొఱకు ప్రాకులాడవలసియున్నది.' 'అట్లయిన వివాహమాడుట భగవదాజ్ఞకు విరోధమాయేమి' యని సభికులలో నొకరు ప్రశ్నించిరి. అప్పుడు శ్రీరామకృష్ణులవారు క్రీస్తు వివాహమునుగూర్చి పలికిన వాక్యములను బైబిలు నుండి జదివి వినిపించిరి "ప్రపంచమున కొందఱు తల్లిగర్భమునుండి పుట్టినప్పుడే నపుంసకులగుదురు. కొందఱు మానవులచే నట్లు చేయబడువారు. మఱికొందఱు భగవల్లాభమునకొఱక తమంతట తామే నపుంసకులగుదురు" ఇట్లు పలికి శ్రీరామకృష్ణులవారు వివాహమే సకల బంధములకును కారణమని వచించిరి. మఱల సభికులు ఇట్లు ప్రశ్నించిరి 'వివాహము ఈశ్వరాజ్ఞకు విరోధమయినదా? ఎవరును వివాహము కావించుకొనకపోయినచో ప్రపంచమున సృష్టి యెట్లు జరుగగలదు?' శ్రీరామకృష్ణులు నవ్వుచు ఇట్లనిరి 'అందుకై నీవు విచారింపవలదు. ఎవరికి వివాహము చేసికొనవలయునని కోర్కెకలదో వారు వివాహము చేసికొనవచ్చును. ఇది మనలో మనమాట. నాకు దోచిన విషయమును నేను జెప్పితిని. నీ కిష్టమున్నంతవఱకు ననుసరింపవచ్చును. ఇతరుల కెట్లున్నను శరచ్చంద్రుడు, శశి—వీరలకు మాత్ర మీ పలుకులు తీవ్రవైరాగ్యమును గలిగించెను. శ్రీరామకృష్ణుల యద్భుతదర్శనముచేత మిక్కిలిగా వీ రాకర్షింపబడిరి. ఈశ్వరదర్శనమే తమలక్ష్యమయినచో శ్రీరామకృష్ణులవారే తమకు మార్గము జూపగలరని వారికి నమ్మకము కుదిరెను. నాటినుండియు వీరిరువురును తఱచుగ వచ్చుచు బోవుచు నుండిరి. వీరి కళాశాలయందు ప్రతి గురువారము సెలవుదినము కావున ప్రతి గురువారమును వీరు దక్షిణేశ్వరమున కేగుట పరిపాటి యయ్యెను. ఇట్లు వచ్చుచు బోవుచున్న కాలమున శ్రీరామకృష్ణులవారు తమయందు జూపుచున్న అసాధారణ వాత్సల్యమునకు మురిసి

పోవుచు, 'ఇదేమి మన తలిదండ్రులయు బంధువులయు ప్రేమను మించియున్నది వీరి వాత్సల్యము' అని ఆశ్చర్యపడుచుండిరి. 'ఇందు స్వార్థపరత్వ మావంతయు లేకయున్నది గదా' యని యచ్చెరువడుచుండిరి. ఇట్లు వారిరువురును శ్రీరామకృష్ణ ప్రేమవారిధియందు నిమగ్నులయిరి.

ఒకనాడు వీరందఱును గూర్చొని వివిధ విషయములగూర్చి మాట్లాడుచుండ, జితేంద్రియుడును సర్వశక్తిప్రదాతయు నగు పార్వతీతనయుడగు గణేశుని ప్రశంసించుచుండిరి. అది వినిన శరచ్చంద్రుడు 'అయ్యా! నా కా భావమే ఆదర్శముగ గోచరించుచున్నది' అని వచించెను. అందులకు శ్రీరామకృష్ణులవారు 'కాదు, నీయందున్నది గణేశభావముగాదు, భైరవభావము. నీయందు శివుడున్నాడని తెలిసికొనుము. నాలో శక్తియున్నది. నీ శక్తిసామర్థ్యములన్నియును నాయందే యున్నవని గుర్తింపుము' అని పలికిరి. ఈ పలుకులయందలి గంభీరార్థము మనయట్టివారు గ్రహింపజాలరు. శివగణేశుల భావరహస్యము వారికే అవగతమైయుండెను కాని, శ్రీ శారదానందస్వామియయిన తరువాత వారి అసాధారణ సంయమము, ప్రేమ, మునెన్నడును గని విని యెఱుగని గాంభీర్యము, శాంతిభావమును జూచినచో కైలాసపతియగు యోగీశ్వరుని చిత్రపటము శ్రీవారియందు మనకు గోచరించుచుండును. మహాదేవునివలె వీరు సయితము ఇతరులొసగిన విషతుల్యములగు బాధలనెడి హాలాహలమును ప్రశాంతముగ లోగొని నిండుహృదయముతో వారినెల్లరను ఆశీర్వదించుచుండిరి.

ఒకప్పుడు శ్రీరామకృష్ణులవారు శరచ్చంద్రుని జూచి, 'ఓయీ! నీ వీశ్వరు నెట్లు దర్శింపగోరుచుంటివి? నీ ధ్యానమున ఏ దేవమూర్తిని జూడదలంతువు?' అని పలికిరి. యువకుడైయున్న శరచ్చంద్రుడు 'అయ్యా! ఏ దేవమూర్తినీ నేను జూడగోరుటలేదు. నేను సర్వజీవములందును భగవదుపలబ్ధిని బడయగోరుచున్నాను' అని పలికెను. అందులకు శ్రీరామకృష్ణులవారు చిఱునవ్వు నవ్వి, 'నీవు గోరుచున్నది చిట్టచివరి దర్శనమే. అట్టి దర్శనము హఠాత్తుగా లభింపజాలదు' అని వచించిరి. అందులకు శరత్ ఇట్లు బదులు పలికెను 'అట్టులయినచో మఱి యే యితర దర్శనమును నాకవసరములేదు. ఆ యుపలబ్ధి కలుగు పర్యంతము నాకు ఏలగు మార్గమునే నే ననుసరింతును. ఇదియే నా కోరిక.' ఇది వారి లక్ష్యమును జూపుచున్నది. శ్రీ శారదానంద స్వాములవారు ఏ దేవదేవీ దర్శనమును దమకు కలుగలేదనియు అయినను తాము శ్రీరామకృష్ణులవారియెడ దేని నర్థించిరో అది కొంతవఱకు లభించినదనియు చెప్పుచుండెడివారు.

బ్రహ్మసమాజముతో ఎక్కువ పరిచయము కలిగియున్నందున హిందూ 'దేవదేవీల' విగ్రహారాధనమునందు తగినంత నమ్మకము వీరికుండెడిది కాదు. నిరాకారబ్రహ్మమునందే వీరికి భక్తి మెండు. శ్రీరామకృష్ణులు దుర్గ, కాళి, కృష్ణుడు మున్నగువారియెడ జూపుచున్న శ్రద్ధాభక్తులు ఆదియందు వీరికి కొంత ఆశ్చర్యమును కలిగించెను. ఎన్నియోమార్లు శ్రీరామకృష్ణులవారితోబాటు కాళికాదేవాలయమునకును రాధాకృష్ణ దేవాలయమునకు వెళ్లిరి. శ్రీ పరమహంసలవారు ఆ దేవదేవీమూర్తులకు నమస్కరించుచున్నపుడు కొంతవఱకు శ్రీ శారదానందులును వారిని అనుసరించుచుండిరి. తరువాత కొన్నాళ్లకు శ్రీ పరమ

హంసలవారి యనుగ్రహమువలననే దేవదేవీ మూర్తులయందలి మహత్త్వమును గ్రహింప గలిగినట్లు పలికిరి. మరియొకప్పుడు తమ చిన్ననాటి ముచ్చట్లు జెప్పుచు నిట్లు పలికిరి "యౌవనకాలమున మేము పురుషకారము నందే నమ్మకము కలిగియుంటిమి. అదృష్టము లేక ఈశ్వరేచ్ఛ యను విషయమున కొంచె మయినను నమ్మకము లేకుండెను. ఆశ్చర్య మగు విషయమేమన, పురుషకారమువలననే యెన్నియో కార్యములు జయప్రదములు కావింపగలిగియుంటిని. చిన్న పెద్ద అన్న సమస్త విషయములందును విజయము నందుచుంటిని. శ్రీరామకృష్ణులవారిని జేరిన పిదపనే ఈ విష యమున మొట్టమొదట నేను దెబ్బదింటిని. మునుపు ఏ పనులు అత్యంత సులభసాధ్యముగ నెఱవేర్చుచుంటినో ఆ పనులనే యెంతగా ప్రయత్నించియు చేయజాలకపోవుచుంటిని. శ్రీరామకృష్ణుల యనుగ్రహమువలన భగవ దిచ్ఛ లేనిచో ఎవరును ఏ కార్యమునందును ఎంతగా ప్రయత్నించినను సఫలులు కానేరరని గ్రహించితిని."

శరచ్చంద్రుడు F A పరీక్షయం దుత్తీ ర్ణుడు కాగనే డాక్టరు పరీక్షకు జదువుమని ఆయన జనకులు ప్రేరేపించిరి. కాని శరచ్చంద్రు నకు 'డాక్టరీ' యం దిసుమంతయు కోరికలేదు. శ్రీరామకృష్ణులవారు వైద్యము, న్యాయవాద వృత్తియు ప్రజల కష్టములపై నాధారపడి యుండుటవలన వాని నభ్యసింపరాదని పలుకు చుండువారు. అదియే వీరి ఆటంకమునకు కార ణము. ఈ సమయమున వారికి నరేంద్రునితో పరిచయమేర్పడెను. ఆయన సలహాలను అప్పు డప్పుడు శరచ్చంద్రులు గ్రహించుచుండిరి. నరేంద్రులు మాత్రము ప్రోత్సహించుటవలన శరత్ వైద్యకళాశాల(Medical College)లో ప్రవేశించిరి. కాని వీరిక వైద్యులగు భాగ్యము లభించినదికాదు. వారు వైద్యశాలలో చేరిన కొన్నిమాసములకే ఒకరోజు భోజనము చేయుచుండ నరేంద్రులు వచ్చి శ్రీరామ కృష్ణులవారికి గళమునుండి రక్తము స్రవించు చున్నదని భయంకరమగు వార్తను దెలిపెను. ఆ పలుకు విన్నంతనే అందఱును తొందరపడి ఎట్లయినను వారికి సంపూర్ణారోగ్యము గలిగింప దలంచిరి.

శ్రీరామకృష్ణులవారియొద్ద నేయుండి శుశ్రూ షలు గావించుచు చికిత్సార్థము భక్తులందఱును శ్రీవారిని కలకత్తాకు దీసికొనివచ్చిరి. ఆగి యందు కొంతకాలము శశి, శరత్ మున్నగు వారు కొందఱు తమతమ గృహములనుండి నానాడు శ్రీరామకృష్ణులయొద్దకు జేరి శుశ్రూ షలు గావించి పోవుచుండిరి. కాని ఆ చికిత్స సఫలము కాకపోవుటవలన శ్రీరామకృష్ణుల వారు కాశీపురమునకు దీసికొనిరాబడిరి. అప్పుడు శరత్, శశి, నరేన్ మఱికొందఱును శ్రీవారికి అంతరంగిక శిష్యులై శ్రీవారితోడనే నివసింప నారంభించిరి. ఈ విషయమును గమనించిన 'శరత్' తండ్రి, గిరీషచంద్రుడు, కుమారుడు క్రమేపి గృహమును వదలిపెట్టి వెడలిపోవు నేమో యని భయపడసాగెను. "'శరత్' జ్యేష్ఠపుత్రుడు, కుటుంబ భారమును భరింప వలయు నతడు. కులగురువు జగన్నాథ్ తర్కా లంకర్ గొప్ప పండితుడు; తాంత్రిక సాధనల యందు సిద్ధిపొందియుండెను. ఆయనను వదలి మఱియొక గురువు నేల యాశ్రయింపవలయును? ఈ మహాత్ముని యెదుట శ్రీరామకృష్ణు డెంత మాత్రము?" అని తలంచి యొకనాడు తన కులగురువును శ్రీరామకృష్ణులయొద్దకు బంపెను.

కాని పూర్వపరిచయ మావంతయు లేని జగన్నాథ్ శ్రీరామకృష్ణులవారి సంభాషణము వలన, వారు సాటిలేని మహాత్ములని గ్రహించెను. మహామహిమగు నాధ్యాత్మిక జీవనమున నత్యున్నతస్థానమును శ్రీవారు పడసియున్నారనియు గ్రహించెను. కాన అచ్చటి నుండి మఱలివచ్చి గిరీష్‌చంద్రుని జూచి, 'అయ్యా! మీ కుమారుడు శ్రీరామకృష్ణులనే గురువుగా బడయగలిగినచో అది మహాభాగ్యమని మీరు భావింపవలయును' అని పలికెను. ఈ పలుకులు విననంతనే తనకుమారు డిల్లు చేరునుగదా యన్న చివరివాంఛయు గిరీష్‌నకు నశించెను. 'శరత్' నకు రోగుల శుశ్రూషయందుగల యుత్సాహమును మునుపే దెలిసికొనియున్నాము. ఇక తమ గురుదేవుని శుశ్రూషయం దెట్టి పట్టుదల కలిగియుండునో మన మూహింపగలమా? ఎట్లయినను శ్రీరామకృష్ణులకు సంపూర్ణారోగ్యమును సమకూర్పవలయునన్న యేకైకవాంఛయే వారి హృదయమునంతయు నావరించియుండెను. కేవలము శ్రద్ధాభక్తులతోడనే 'శరత్' శ్రీవారి సేవకుపక్రమింపలేదు. వారి సేవవలన తనకు ఇహపరములందును శ్రేయోదాయకమగుమార్గము, స్థితి లభించునన్న సంపూర్ణ విశ్వాసమే వారినీ కార్యమునకు పూన్చినది. ఉదాహరణమునకు 1886 వ సంవత్సరము జనవరి మొదటి తారీఖున శ్రీరామకృష్ణులవారు తమయొద్దనున్న ఆశ్రితుల కెందఱకో తమ పవిత్ర స్పర్శనమువలననే అత్యున్నత ఆధ్యాత్మికానుభవమును గలిగించిరి. ఎందఱో ఆశ్రితులు శ్రీరామకృష్ణులవారివలన జీవితము సార్థకము గావించుకొనగోరి వారిని దర్శించుచుండిరి. కాని 'శరత్' మాత్రము శ్రీ గురుదేవుని గదిని శుభ్రము చేయుచుండెను. 'ఇంతటి నదవకాశము నేల వృథపుచ్చితి' వని యొకరడుగగా, ఇట్లు సమాధానించెను. "అట్టి యనుభవములవలన నాకెంతమాత్రము పురోభివృద్ధి యగునట్లు గోచరింపలేదు. అన్నిటికంటెను శ్రీరామకృష్ణులవారే నాకు ప్రేమాస్పదులు. నాకేది ఆవశ్యకమో దానిని తమంతట తామే వారు నాకొసగుదురు. దానికొఱకు నే నిసుమంతయు కలత జెందను."

శ్రీరామకృష్ణులవారి శిక్షాప్రణాళిక శిష్యానుకూలమై యుండెడిది. వారు అందఱకును ఒకేవిధమగు నుపదేశము నొసగెడివారు కారు. కుంభకారుడు తనచేతి మృత్పిండమును తన యిచ్ఛానుసారిని వివిధభాండములుగ సృజించునట్లే శ్రీవారు తమ శిష్యులలో నెవరెవరి నెట్లెట్లు తయారుచేయ తలంతురో యట్లే అనాయాసముగ వారివారి నట్లట్లు సిద్ధము చేయువారు, భక్తులకు భక్తిమార్గము ననుసరించు నుపదేశమును, జ్ఞానులకు జ్ఞానమార్గోపదేశమును—ఇట్లు వారి వారి స్థితిననుసరించి వారివారికి ఆవశ్యకములగు నుపదేశము లొనరించెడివారు. ఆయా మార్గములం దుపదేశించుటయేకాక అన్నిమార్గముల చరమావస్థ యొక్కటియేయని చక్కగా బోధించువారు. 'శరత్' శ్రీ రామకృష్ణుల జేరిన నాటి నుండియు ధ్యానమున పట్టుదలగలవారై దక్షిణేశ్వరమునందలి పంచవటియందు ధ్యాననిమగ్నులగుచుండిరి. మఱికొన్ని వేళల శ్రీ రామకృష్ణులవారి సన్నిధియందు కూర్చొని యితరభక్తులతోబాటు మధుర సంకీర్తనమును వారి ఈశ్వరీయోపదేశములను వినుచుండెడివారు. ఈ సమయమునందే శ్రీరామకృష్ణుల అంతరంగిక శిష్యులు రాఖాల్ (బ్రహ్మానంద

స్వామి) బాబూరామ్ మొదలగువారితో పరిచయము కలిగి చివరకు ఆపరిచయమే జీవిత పర్యంతము వారికి చిరస్థాయియగు సోదరభావమును గలిగించెను.

శ్రీరామకృష్ణులు తమ జీవితకాలమునందే తమ శిష్యులకందఱకును నరేంద్రుని నాయకునిగాజేసి వారి ఆధ్యాత్మిక జీవితమును పెంపొందింప నేర్పాటుగావించిరి. నరేంద్రుని యసాధారణ ప్రతిభనుగాంచిన శిష్యవర్గము గురుదేవుని పలుకులనే శిరసావహించెను. ఉపదేశకాలమున నరేంద్రుడు సతీర్థుల కనేక విషయములు పట్టుదలతో నుపదేశించుచుండెడివాడు. కాని ఆ యుపదేశములందు పలుమారు పునరుక్తి కలిగి శ్రోతలకు విసుగు జనించెడిది. అయినను 'శరత్' మాత్రము ఆవంతయు విసుగుకొనక నరేంద్రుని యుపదేశముల నిత్యనూతనములుగ వినుచుండెను. అదిగని తక్కిన సతీర్థులు, "శరత్! పలుమారు చెప్పిన విషయమునే బోధించుచుండ విసుగు విరామములేక నీవెట్లు వినగలుగుచున్నావు" అని యడిగిరి. అందులకు శరత్ ఇట్లు సమాధానించెను. "మీకేమియు తెలియుటలేదు. వారు చెప్పు పలుకు లవియేయయినను ఒక్కొక్కపరి వారు బోధించునప్పుడు నాకు ఆపలుకులనుండి ఒక్కొక్క నూతనభావము స్ఫురించుచున్నది." శరత్ కు నరేంద్రునియందు అత్యధికమగు విశ్వాసము ప్రేమయు నుండెడిది.

ఒకనాడు శ్రీరామకృష్ణులు తమ అంతరంగిక శిష్యులు పండ్రెండుగురను—సన్న్యాసదీక్ష వహింప నున్నవారిని—బిలిచి మాధుకరమునకు బంపిరి. వీరందఱును సంపన్నగృహములనుండి వచ్చినవారు కాన ఈ మాధుకరమున కేగినపుడు కొందఱు వీరిని దూషించిరి; కొందఱు భిక్షమిడిరి మఱికొందఱు భిక్షమిడక తఱిమివైచిరి. ఇట్లు అనేకులు అనేకవిధముల వీరిని జూడసాగిరి. శరత్ గారి యీ యనుభవము కాలానంతరము నిట్లు చిఱునగవుతో వక్కాణించుచుండువారు "నేను మాధుకరాన్నము కొఱ కొక గ్రామమునకేగితిని. అచట నొక వీధియందు ప్రవేశించి ఒకయింటి యెదుట సన్న్యాసుల పద్ధతి ననుసరించి 'నారాయణహరి' అని కేకవైచితిని. అప్పు డా యింటి నుండి ఒక ముదుసలి బయటికివచ్చెను. ఆ కాలమున నేను పడుచుప్రాయము కలిగి దృఢకాయుడై యుండువాడను. నన్ను జూచి, ఆ ముదుసలి అవ్వ చాల కోపించి 'ఇదిగో యీ! దిట్టముగ్గ వలె నున్నావు! నీవు భిక్షమునకు వచ్చితివి. పనిచేసి బ్రతుకలేవా? ఏపని దొరకకపోయినను ట్రామ్ వే కండక్టరువైనను కాకుండదా' అని పలికి తటాలున తలుపుమూసికొని వెడలిపోయెను." ఆమె వ్యవహారము శరత్ నకు నవ్వు పుట్టించెనే కాని సన్న్యాసాశ్రమ జీవనము నావంతయు నేవగింపు కలిగింపదయ్యె. నానాటికి శ్రీరామకృష్ణుల ఆరోగ్యము క్షీణింపజొచ్చెను. వీరెంత శుశ్రూషలు గావించినను లాభము లేకపోయినది. చివరకు 15-8-1886 నాటి రాత్రి శ్రీగురుదేవులు భక్తుల దుఃఖసాగరమున ముంచి మహాసమాధిని గాంచిరి. వారి నిర్యాణమువలన శిష్యకోటి, పితృహీనులగు అనాథ శిశువులవలె విలవిల నేడ్వ నారంభించెను. ఇన్నాళ్లు వారిని జుట్టుముట్టి యచ్చటనే జీవనముగడుపుచున్న శిష్యులెల్లరు నిలువనీడలేనివారైరి. కాన శరత్, మఱికొందఱును మఱల గృహాభిముఖులైరి. కాని కొన్నాళ్లకు బారానగరమున ఒక మఠము నెలకొల్పబడుటయు 'శరత్' శశి మున్నగువారు మఱల

ఆ మఠమున ప్రవేశించిరి. అందు కొన్నాళ్లు గడపినపిదప సన్న్యాసదీక్ష పుచ్చుకొనవలయునని తలంచి 'ఆంతుపూర్'అను గ్రామమున కేగి యచ్చట, నరేంద్రుడు మున్నగు శ్రీరామకృష్ణుల అంతరంగికశిష్యులు కొందఱితో సన్న్యాస దీక్షను గ్రహించిరి. ఈ సన్న్యాసాశ్రమమున 'శరత్' శ్రీశారదానందస్వామి యన్న నామము వహించిరి. ఈ యువకులెల్లరు బారానగర మఠమున మహాతపస్సు గావింప ప్రారంభించిరి. అది వర్ణనాతీతమై యొప్పెను. వారు ఆహార పానీయములందు ఆవంతయు తలంపులేనివారై నిరంతరము ధ్యానము, తపస్సు, గ్రంథపఠనము—వీనియందే నిమగ్నులై తమకాలమును గడపుచుండిరి. వీరు మాధుకరమునకు బోయినపుడు ఒకనాడు వట్టి అన్నముమాత్రమే దొరకెడిది. అందులకువలయు కూరలు అసలే దొరకెడివి కావు. ఒకనాడు ఆహారము గూడ వలయునంత దొరకెడిదికాదు. అట్లయ్యు వారు వాని నన్నింటిని లెక్కింపక మఠము తలుపుల మూసివైచి లోన భగవన్నామసంకీర్తనము గావించుచు బాహ్యప్రపంచము నట్టె మఱచి పోవుచుండువారు. ఈ ధ్యాననునందు తన సహాధ్యాయు లెల్లరికంటె శ్రీ శారదానందు లత్యంతాభిలాషయు, పట్టుదలయుగల వారు. వారు ధ్యానమునకు గూర్చున్న దో ఘంటలకొలదియు తమ యాసనమునుండి లేవక నిష్ఠాపరాయణులై కాలము గడపెడివారు. ఈ విషయమునుగూర్చి శ్రీ వివేకానందస్వాములవారు మిక్కిలిగా ప్రశంసించెడివారు. కొన్నాళ్లకుపిదప బారానగర మఠమున తపముగావించుట వారికంతగా తృప్తికరము కాకపోవుటవలన వారెల్లరు తీర్థాటనము గావించి యాయా పుణ్యక్షేత్రములందు తపస్సు గావింపనెంచిరి. కావున శ్రీశారదానందుల వారిరువురతో గలిసి శ్రీ పూరీక్షేత్రమునకు బయలుదేరిరి. అందు కొంతకాలమున్నపిదప ఉత్తరఖండమున కేగవలయునని వారికి మనస్సు గలిగెను. కావున వారు బయలుదేరి కేదారనాథ్, బదరీనాథ్—వీనిని దర్శించి యామార్గమున అల్మోరాకు జనిరి. అచ్చట వారు, వివేకానందస్వామి, మఱికొందఱు 'గురుభాయులతో' గలిసి కొన్నాళ్లు హిమాచల భ్రమణము గావించిరి. ఇట్టి సమయమున వారి హృదయవైశాల్యమును స్పష్టీకరింపగల ఈ విషయము సంభవించెను.

ఒకనాడు ఇరువురతో గలిసి శ్రీశారదానందులు ఒక పర్వతమున బోవుచుండిరి. అది చాల దుర్గమమార్గము, ఇరుకువలన ఇరువురును చేతికఱ్ఱల నూనుకొని పోవుచుండిరి. ఏమాత్రము కాలుతొనకినా, అపాయమునకు గుఱికావలయునట్టి ఇరుకు పొంత. ఇట్లు కొంత దూరము పోవుచుండ ఎడనెడ నొక ముదుసలి యవ్వ పోవుచుండెను. చేత కఱ్ఱలేక పోవుట వలన ఆమె మిక్కిలి కష్టపడుచుండుటనుజూచి శ్రీశారదానందులు తన చేతికఱ్ఱను ఆ యవ్వ కిచ్చివేసిరి. కఱ్ఱలుగల 'గురుభాయు'లెల్లరు త్వరగా నడచిపోవుచుండిరి. కాని శ్రీశారదానందులు మాత్రము మెల్లగా నడచి చాలకాలమునకు వారిని జేరిరి. 'ఏల యాలస్యముగా వచ్చితి?' వని యడిగిన గురుభాయులతో 'నేను నా కఱ్ఱను ఒక ముసలమ్మ కిచ్చివైచితిని. కఱ్ఱ లేకపోవుటచే నడచుట యాలస్యమయినది' అని బదులు పలికిరి. అది విని గురుభాయులు 'నీ విట్లు నీ చేతికఱ్ఱ నేల యిచ్చితివి? నీ వెట్లు నడువగలవు?' అని పలుకగా శ్రీవారిట్లు సమాధానించిరి. 'ఆమె చాల కష్టపడు

చున్నది. నాకంటె నామెకే ఈకష్టము అత్యంతావశ్యకము.' ఇట్లు హిమాచలముననెంతో కాలము గడపి హృషీకేశము, ఖనఖలు మున్నగు ప్రదేశములందు తపము గావించి యచ్చటినుండి ఢిల్లి, మధుర, బృందావనము, అలహాబాదు మున్నగు నగరముల దాటి కాశీ నగరమును జేరిరి. అచట కొన్నాళ్లకు నగర పరిభ్రమణము గావింపవలయునని తలంపు కలుగుటయు శ్రీవారు కాలినడకనే సాగించిరి. అది నలువది మైళ్లు నడువవలసి యుండుటవలన శ్రీవారికి జ్వరము తగిలెను. అది సరిపడిన పిదప శీతభేది కలిగెను. శరీరారోగ్యము చెడుటవలన మరల కలకత్తాకు తిరిగివచ్చి బారానగరమున ప్రవేశించిరి. అచ్చట 'శుశ్రూష' సాయము లభించుటవలన అనతికాలముననే సంపూర్ణారోగ్యము కలిగెను. పిదప శ్రీ శారదామణిదేవిగారు జయరాంబాటియందున్నందునను ఆమెను శ్రీరామకృష్ణుల ప్రతినిధిగా వారు తలంచుచుండుటవలనను వారు ఆమె దర్శనార్థము జయరాంబాటి కేగిరి. ఆ గ్రామమత్యంత మనోహరముగా నున్నందున శ్రీవారు అచట నుండుటకు చాల సమ్మతించిరి. కాని వారికి అచట చలిజ్వరము తగులుటయు, వారు మరల బారానగరమునకు వచ్చిరి. కాని అచ్చటగూడ ఈ చలిజ్వరమువలన చాలకాలము బాధపడవలసివచ్చెను. బారానగర మఠమున వసతులు సరిపడకపోవుటవలన వారి మఠమును దక్షిణేశ్వరమునకు సమీపముననున్న ఆలంబజారునకు మార్చిరి.

ఇట్లు కొంతకాలము గడచిన పిదప శ్రీ వివేకానందస్వామి అమెరికాకు జని, తమ యుపన్యాసములవలన అత్యంత ప్రఖ్యాతి గాంచుచున్నారని విని 'గురుభాయి' లెల్లరు సంతసించిరి. అందందు వేదాంత ప్రచారము గావించి జయధ్వనులతో శ్రీ వివేకానందులు లండను జేరినపుడు, తమకు తగిన సహాధ్యాయుడు కావలయునని శ్రీ శారదానందులను అచటికి రప్పింపనని తెలిపిరి. అట్లే 1896 వ సంవత్సరమున శ్రీ శారదానందులు లండనున కేగిరి. అందుండి అమెరికాకు జని, సమస్త ప్రదేశములందు ప్రజారంజకముగా ఆకర్షణీయముగా ఉపన్యాసములిచ్చిరి. న్యూయార్కు నగరమునే తమ ప్రచార కేంద్రముగా నేర్పరచుకొనిరి. ఇంతలో శ్రీ వివేకానందస్వాములవారు భారతదేశమునకు వచ్చి శ్రీరామకృష్ణ సంఘమును నెలకొల్పినపుడు, దానికి తగిన కార్యదర్శి శ్రీ శారదానందులే యని నిర్ణయించి వారికి ఆహ్వానము బంపిరి. కాన రెండేండ్లుమాత్రము అమెరికాయందుండి శ్రీ శారదానందులవారు భారతదేశమునకు వచ్చిరి. వారు వచ్చునపుడు రోము నగరమునందలి సెయింట్ పీటర్స చర్చికి వెళ్లిరి. అందు భావావేశము కలిగి ప్రపంచమునే కొంతకాలము మరచియుండిరి. ఈ యనుభవము శ్రీరామకృష్ణులవారు 'శ్రీ శారదానందులు ఏసుక్రీస్తు శిష్యవర్గమునందలివా'రన్న పలుకును ప్రమాణీకరించుచున్నదేమో!

(సశేషము)



సంపాదకులు శ్రీ ఋతజానందస్వామి; శ్రీ వెలుదుమూడి వేంకటకృష్ణరావు
శ్రీ కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటరు ప్రెస్సు లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి,
శ్రీ ఆదిదేవానంద స్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 20-2-51.

# విషయసూచిక



# శ్రీ రామకృష్ణ ప్రభ

## చందాదారులకు

౧. పత్రిక ప్రతిమాసము 20-వ తేదీన వెలువరింపఁబడును. ఒక వారము, పదిరోజులు చూచి ప్రతి మీకు అందకపోయినయెడల ఉత్తరము వ్రాయుఁడు.

౨. సంవత్సర చందా రు. ౩ లు మాత్రమే. జనవరినెల నుండిగాని జూలై నెల నుండిగాని చందాదారులుగఁ జేరవచ్చును ఇతర మాసములలోఁ జేరదలచు వారికి జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని సంచికలు చేర్చిపంపఁబడును. విడిప్రతి రూ. ౦—౬—౦ లు. హిగిన్‌బాదంస్‌వారి స్టాలులోఁగాని, మీ పత్రిక ఏజెంటును గాని అడుగుఁడు

౩. ఉత్తర ప్రత్యుత్తరములు వీలైనంతవఱకు ఇంగ్లీషున వ్రాయుచు మీ చందాదారు సంఖ్య నుదాహరింపుఁడు. ఉత్తరములను "మేనేజరు, శ్రీరామకృష్ణప్రభ" అను చిరునామాకు వ్రాయుఁడు.

౪. చిరునామాయందు ఎట్టిమార్పుకలిగినను 10-వ తారీఖునకు ముందుగా మా కార్యాలయమునకుఁ దెలుపవలయును. లేనిచో, పత్రిక పూర్వపు చిరునామాకే పంపఁబడును.

## వ్యాసకర్తలకు

౧. కేవలము నైతిక ధార్మిక వైజ్ఞానిక విషయకములైన వ్యాసము లేకాక, సాహిత్యమునకును కవిత్వమునకును సంబంధించిన ఏ వ్యాసములైనను బంపవచ్చును. సులభ సుందరమగు గ్రాంథికభాషలో వ్రాయవలయును.

౨. వ్యాసములు అచ్చులో మూఁడు పుటలకు మించరాదు. ప్రతినెల ఒకటవ తేదీకి వ్యాసములు మాకు అందవలెను.

౩. వ్యాసములను, విమర్శకుఁ బంపు గ్రంథములను, వినిమయముగఁ బంపెడి పత్రికలను "సంపాదకుఁడు, శ్రీరామకృష్ణ ప్రభ శ్రీరామకృష్ణ మిషన్ స్టూడెంట్స్ హోమ్, మైలాపూరు, చెన్నపురి" అను చిరునామాకు వ్రాసి పంపవలెను.

౪. వ్యాసము తిరుగఁ బంపఁబడవలయుననుచోఁ దగు పోస్టేజి చేర్చి పంపవలయును.



# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౭ } ౧౯౫౧ - మార్చి : వికృతి - ఫాల్గుణము { సంచిక ౯

## ప్రార్థన

### భక్తిశతకము

శ్లో॥ హైమాలవాల వలయాన్తర రత్నవేదీ
వజ్రాసనోల్లసిత మూలమగేన్ద్రబోధిమ్।
యమ్ ప్రాప్య మారవిజయానుపదమ్ప్రపేదే
సర్వజ్ఞతాం స భగవాన్ తమహం నమామి॥ ౩౦

బంగారపు పళ్లెము కట్టబడి రత్నవేదికను చుట్టిన వేళ్లుకలదై వజ్రాసనమును అనుష్ఠించిన వృక్షరాజమును ఏ భగవానుడు మార విజయానంతరము ఆశ్రయించి సర్వజ్ఞత్వమును పొందెనో ఆబోధి వృక్షమునకు నమస్కారము చేయుచున్నాను.

శ్లో॥ మూర్ధన్ బుద్ధం నమ త్వం శ్రవణ శృణుసదా ధర్మమద్వైధవాది
ప్రోక్తం సర్వజ్ఞరూపం నయన నిరుపమం పశ్య జిఘ్రాంఘ్రిపద్మమ్।
ఘ్రాణం త్వం చార్కబన్ధోః స్తుహి సఖిరసనే శ్రీఘనమ్ పూజయేథాస్,
సిద్ధం పాణో వ్రజాంఘ్రే జినసదన మదస్మద్గుణం చిత్త చిన్త్య॥ ౩౧

ఓ శిరసా బుద్ధునకు నమస్కారముచేయుము, ఓ కర్ణములారా బుద్ధ ధర్మమును వినుడి, ఓ కన్నులారా అసమానమైన సర్వజ్ఞరూపమును కాంచుడి, ఓ ఘ్రాణమా సూర్యబాంధవుని పాదపద్మమును ఆఘ్రాణించుము, ఓ వయస్యా నాలుకా ఘనీభవించిన శ్రీని పూజింపుము, ఓ చేతులారా సిద్ధుని పూజింపుడు, ఓ పాదములారా జినసదనమున కరుగుడు, ఓ హృదయమా ఆ మహానుభావుని సద్గుణములను చింతింపుము.



ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ

# శ్రీ రామకృష్ణ వచనామృతము — 'మ.'

## దక్షిణేశ్వరమున భక్తులతో శ్రీరామకృష్ణుడు

20-8-1883.

రాత్రి 8 ఘంటలయినది. శ్రీరామకృష్ణుల వారు చిన్నమంచమున దోమతెరపైచి లోన గూర్చొని ధ్యానముచేయుచుండిరి. నేలమీద 'మ.' యును ఆయన స్నేహితుడు హరిబాబును గూర్చొనియుండిరి. హరిబాబు భార్య గతించి పదునొకండువత్సరములయినను ఆయన పునర్వివాహము చేసికొనలేదు. ఆయనకు తలిదండ్రులు, తోబుట్టువులు—అందఱు నుండిరి. వారందఱియెడలను ఆయన మిక్కిలి ప్రేమ జూపుచుండెను.

ఈ కాలమున హాజ్రా దక్షిణేశ్వరమున నివసించుచుండెను. రాఖాల్ కూడ శ్రీరామకృష్ణులతో నప్పుడప్పుడు కూడియుండువాడు. అప్పుడప్పుడు ఆయన అధరసేనుని గృహమున కేగుచుండువాడు. నరేంద్రుడు, భావనాథ్, అధరుడు, రామ్, నవమోహన్—ఇతర భక్తులు మఱికొందఱును శ్రీరామకృష్ణుల వారిని కనీసము వారమునకొకసారియైనను వచ్చి దర్శించుచుండెడివారు. హృదయుడు స్వగ్రామమునకు బోయి జబ్బున బడుటను దెలిసి శ్రీరామకృష్ణులు మనస్సున తొట్రుపడు చుండిరి. ఆ జబ్బును నయముచేయించుకొనుటకై ఒకానొక భక్తుడు 10 రూపాయలు హృదయునకు బంపియుండెను. కాని ఆ విషయము శ్రీరామకృష్ణులవారికి తెలియదు.

కొంతసేపటికి శ్రీరామకృష్ణులవారు మంచమునుండి బయటికి వచ్చిరి. వారికి భక్తులు చేమోడ్చి నమస్కరించిరి. దోమతెఱ పైకి వైచిన పిదప శ్రీరామకృష్ణులవారు మంచము పైన గూర్చొనిరి. భక్తులతో నిట్లు పలుక నారంభించిరి :

శ్రీరామ—లోపల గూర్చొని ధ్యానము చేయుచుంటిని. ఆ సమయమున నా కిట్లు దోచెను. కేవలరూపకల్పనమేకదా ధ్యానము. అందువలన నది నాకు నచ్చలేదు. భగవంతు డున్నట్లుండి హఠాత్తుగా మనకు దర్శనమిచ్చిన బాగుండుననుకొంటిని. మఱల ఎవరు ధ్యానము చేయుట? ఎవరిని ధ్యానముచేయుట? యని గూడ ప్రశ్న కలిగినది.

'మ.'—చిత్తము. మీరే చెప్పియున్నారు సర్వము భగవానుడే యని. ధ్యానముచేయువాడుగూడ భగవానుడే.

శ్రీరామ—ఎవడేని ధ్యానముచేయ సంకల్పించినను భగవదనుగ్రహములేనిదే వాడు ధ్యానముచేయజాలడు. నీవేమందువు?

'మ.'—నిజము. మీయందు 'నేను' అను భావము లేనందుననే మీ కిట్లు తోచు

చున్నది. 'నేను' అను అహంభావరహితుల కెల్ల నిట్టి స్థితియే కలుగును.

శ్రీరామ — అయినను నేను భగవద్దాసుడను, భగవానుని సేవకుడను అను భావముండుట మంచిది. నేను పనిచేయగలనన్న జ్ఞానమున్నంతవఱకు 'నేను' భగవద్దాసుడను. భగవంతుడా నీవే నా ప్రభువవు అను భావముండుట అత్యంతము శుభకరము. పనులయం దాసక్తి కలిగియున్నపుడు సేవక సేవ్యభావము కలిగి యుండుటయే మేలు.

'మ.' సాధారణముగా పరబ్రహ్మచింతనము చేయుచుండువాడు.

శ్రీరామ.—(అతనినిజూచి) బ్రహ్మ మాకసమువలె నిర్వికారము. అగ్నికి రంగులేదు గదా! అయినను దానియందు వివిధరసాయనముల జల్లి తెలుపు, ఎఱుపు, నలుపు—ఈ రంగుల గల్పింపవచ్చును. అట్టిదే ఇదియును. కాని శక్తివలననే బ్రహ్మము వివిధరూపముల గాంచినది. సత్త్వ రజ స్తమములు—ఇవి మూడును శక్తివే. బ్రహ్మము గుణాతీతము. అది ఎట్టిదో మనము వర్ణింపజాలము. బ్రహ్మము వాచామగోచరము. 'నేతి నేతి' యనెడు మార్గము ననుసరించిపోయిన నేది మిగులునో అదియే ఆ ఆనందపదము, అదియే బ్రహ్మము.

క్రొత్తగా పెండ్లియయిన అత్తింటికి అల్లుడు తన యీడుస్నేహితులతో వచ్చి కూర్చొని యున్నాడనుకొనుము. కిటికీనుండి వధువు తన స్నేహితురాండ్రతో చూచుచుండును. ఆ స్నేహితురాండ్రు వరుని గుర్తింపలేక 'ఇతడా, నీ భర్త' యని యడుగుచు చేతితో జూపిన అది నవ్వుచు కాదని ప్రత్యుత్తరమిచ్చును. మఱల నింకొకనిజూపి, 'ఇతడా' యని యడిగిన, అతడును గాదని చెప్పును. ఇట్లు చూపుచు బోయిన, చివరకు భర్తనే జూపినపు డది 'కాదు, అవును' అని యేమియు జెప్పక నవ్వుచు నూరకొనును. స్నేహితురాండ్రందఱును అతడే ఆమె భర్త యని తెలిసికొందురు.

బ్రహ్మస్వరూపమును గాంచినవాడేమియు బలుకక మిన్నకుండును.

శ్రీరామ —('మ.' తో) నే నెల్లప్పుడు మిక్కుటముగా మాటాడుదునుగదు!

'మ.' —అయ్యా! మీరు చెప్పినట్లు చక్కగా గాచిన నేతియందు వేయబడిన పిండి పదార్థము సుయ్ సుయ్ మనును. మీరు భక్తులకు చైతన్యము గలిగించు నిమిత్తమే మాట్లాడుచుందురు.

ఇక శ్రీరామకృష్ణ గురుదేవుడు హాజ్రాతో సల్లాపమారంభించెను.

శ్రీరామ — సత్పురుషస్వభావము తెలియునా? ఇతరుల నెవడు కష్టపెట్టక యుండునో అతడే సత్పురుషుడు. భోజనమునకుబిలువగా కొందఱు ప్రత్యేకస్థానమును గోరుదురు. భగవానునియందు నిజమైన భక్తిగలవా డెన్నడును తప్పటడుగులిడడు. అకారణముగ నెవరినీ బాధింపడు.

దుష్టులతో సహవాసము గావించుట మంచిదికాదు. మన మెల్లపుడును వారినివీడి దూరముగనే యుండవలయును. ('మ.' తో) సరేనా?

మ.—చిత్తము, దుష్టసహవాసము మనస్సు నెంతో పతనముగావించును. మీరన్నట్లు వీరపురుషుని విషయము వేఱు.

శ్రీరామ—ఎట్లు?

'మ.' —నిప్పు తక్కువగా నున్నపు డం దొక చిన్న పుడక వైచినను అది ఆరిపోవును. కాని ఆ అగ్నియే జ్వాజ్వల్యమానమై మండు చుండెనేని అందు పచ్చని అరటిచెట్టువైచినను అది భస్మమగును.

శ్రీరామకృష్ణులు హరిబాబును గూర్చి విచారించిరి.

'మ.' —ఇతడు మీ దర్శనార్థమే వచ్చి యున్నాడు. ఇతని భార్య గతించి చాల కాల మయినది.

శ్రీరామ —ఏమోయ్? నీకేమి పని?

'మ.' —అతనికి విశేషమయిన పని ఏమి యులేదు. కాని ఇంటియొద్ద తల్లిదండ్రులను సోదరులను మిక్కిలి జాగరూకతతో పోషించు చుండును.

శ్రీరామ —(నవ్వుచు) అదేమిటి? నీవు గుమ్మడికాయలు పగలగొట్టు ముసలితాతవలె నింట్లో గూర్చొనియుందువా? నీవు సంసారివీ కావు, హరిభక్తుడవునుగావు. ఇది మంచిది కాదు. ఒక్కొక్కయింట నొక్కొక్క పురు షుడు ప్రౌఢ స్తమానమును పిల్లలతోడను భార్య తోడను గూర్చొని చుట్టకాల్చుకొనుచు లోకాభిరామాయణము చెప్పుచుండును. విందు గావించు కార్యాలలో గుమ్మడికాయలు పగుల గొట్టుటయే ఆతనికి పెద్దపని. స్త్రీలు గుమ్మడి కాయల పగులగొట్టనలవాటు లేకపోవుటవలన గుమ్మడికాయలు పగుల్పవలసినపుడెల్ల 'ఓరీ! ఆయనను దీసికొని రారా'యని వారు పిల్లలను పంపగా అతడువచ్చి దానిని రెండు ముక్కలు చేసిపోవును. అంతయే ఆతని పని. కావుననే వారికి 'గుమ్మడికాయల పగుల్చు ముసలి తాత' లను పేరు సార్థకమైనది.

నీ విదియు చేయుదువు, అదియు జేయు దువు, చేయుము. భగవత్పాదారవిందముల యందు మనస్సునిలిపి, సంసారమున కార్య కలాపము నెఱవేర్చుచుండుము. తీరికగా నున్న పుడు భక్తి శాస్త్రములు— భాగవతము, చైతన్య చరిత్ర—మున్నగునవన్నియు—జదువుము.

రాత్రి సుమారు పదిగంటలయినది. శ్రీ రామకృష్ణగురుదేవుడు కొంచెము గోధుమరవ పాయసమును రెండుమూడు 'లూచీలును' పుచ్చుకొనెను. శ్రీరామకృష్ణులకు నమస్క రించి 'మ.' సెలవుపుచ్చుకొనెను.



# భగవాన్ శ్రీరామకృష్ణుడు

# భారతవర్ష నవయుగావతార పురుషుడు*

శ్రీ పిన్నింటి సుబ్బారావు

అది సందిగ్ధకాలము. ప్రాచీనభావములపై పాశ్చాత్యభావములు వీరవిహారము చేయుచున్న రోజులవి. పాశ్చాత్య సంస్కృతిచే, భారతయువకుల మనోఫలకము సంశయాచ్ఛాదితమై, సౌఖ్యమును పొందుటయే జీవిత పరమావధియనియు, భగవంతుడనువాడొకడు వేరుగా లేడనియు, శుద్ధ నాస్తిక వాతావరణము నలుమూలలవ్యాపించి, సనాతన హిందూమతము సమసిపోవునేమోయనెడి భయము, కారుమేఘమువలె నలుముకొన్న కాలమది. ఇట్టి సంధ్యాకాలమున భారతీయులకు, తద్వారా, యావత్ప్రపంచమునకు, సనాతన హిందూమతమే ప్రపంచమతములకు మాతృకయని, తన మతాచరణలచే, తన దివ్యోపదేశములచే, ప్రాక్పశ్చిమములను సమన్వయపరచి, హిందూమతమునకు నవ్యపద్ధతిని జీవకళను పోసి, గత శతాబ్దమున, ప్రాచీన హైందవ చక్రవర్తులు భూమండలమంతయు దిగ్విజయమును గావించినటుల, భారతవర్షము మరల ప్రపంచమునంతటిని ఖడ్గబలముచేగాక, జ్ఞానఖడ్గముచే, యాధ్యాత్మికశక్తిచే, జయించవలెనని, భౌతిక వాతావరణమునందు, ఆత్మశక్తిని మానవ చర్మచక్షువులకు ప్రత్యక్షముగా చూపి, మత విషయమున క్రొత్త సమన్వయమార్గమును చూపిన శ్రీరామకృష్ణుడు అవతార పురుషుడని నమ్ముటకు సందేహమేమియును లేదు.

చక్రవర్తికి, రాజప్రతినిధి ఎట్లో, భగవంతునకు అవతారపురుషుడట్లు. తనరాజ్యమునం దెచ్చటైనను, అల్లరిజరిగిన దానిని శాంతింపచేయుటకై చక్రవర్తి తన ప్రతినిధిని ఎట్లు బంపునో, యారీతిగా, ప్రపంచమునం దెచ్చటైనను మతహాని గలిగినపుడు, భగవంతుడు తన ప్రతినిధిని శిష్టరక్షణకై పంపుచుండును. సముద్రమునకు కెరటము లెట్టివో, భగవంతునకవతారము అట్టిది. ప్రపంచమందలి వివిధావతారపురుషుల యథార్థస్వరూప మొక్కటియే. వేరువేరు కాలములయందు వేరువేరు నామములతో, రామ, సీత, కృష్ణ, క్రీస్తు, బుద్ధ యని ఇట్లు పిలువబడుచుండును, వారు మానవ జన్మమును దాల్చినను, ఎల్లయెడల వారిది యోగస్థితి, సమాధిస్థితినుండి యుత్థితులై జాగ్రదావస్థకు తిరిగి రాగలరు. వెలుతురునకు చుట్టును కొంతవరకు నీడయుండునటుల, ఈ యవతారపురుషులను తమదగ్గరిప్రజలు, లేక

---

* ఇందలి విషయములన్నియు చెన్నపురి శ్రీరామకృష్ణ మఠమువారిచే ప్రచురింపబడిన శ్రీరామకృష్ణ లీలామృత మను గ్రంథమునుండి గైకొనబడినవి.

తమకాలపుప్రజలు గుర్తింపనేరరు. శ్రీరామచంద్రుని యవతారమును అకాలమున గుర్తించినవారు సప్త ఋషులేగదా! భగవంతుడు ఈశ్వర, దేవ, జగత్తు, నర యను చతుర్విధ రూపముల దాల్చుచుండును. అందు నర రూపమే యవతారపురుషరూపము.

సిద్ధుడు ముముక్షువులకుమాత్రమే చేయూత నిచ్చి రక్షించగలడు. అవతారపురుషు డట్లుగాక, సముద్రము పొంగి ఉప్పెనవచ్చినపుడు ఎట్లు పరిసరప్రాంతమంతయు జలమయమగునో, యారీతిగా, అవతారపురుషుడు పరమ మూఢులనుగూడ, తన సంకల్పమాత్రముచె, తన దివ్య స్పర్శమాత్రముచే సిద్ధులను చేయగలడు. ఒక నదీప్రవాహమునందు వచ్చుచున్న యొక ద్రమాను, పైవ్రాలిన పక్షిసమూహముచే ఎట్లు మునుంగకయుండునో, ఎట్లు యొక చిన్న కొయ్యము, పైవ్రాలిన శకుంతలముయొక్క భారముచే నీటియందు మగ్నమగునో, యారీతిగా, సిద్ధపురుషుడు అధిక పరిశ్రమచేసి తానొక్కడే యుత్తీర్ణుడు కాగలడుగాని, యవతారపురుషుడు తనను నమ్మిన అసంఖ్యాకులగు మానవులకు పూర్ణశాంతి నీయగలడు. ఇట్టి యవతారపురుషునితోగూడ, ముక్తజీవులుగాని, మోక్షాప్తులుగాని జన్మించుచుందురు.

శ్రీరామకృష్ణుడు అవతారపురుషుడని యీ దిగువ నిదర్శనములద్వారా తెలియనగును.

1. శ్రీరామకృష్ణుని తండ్రియగు ఖుదీరాముడు గయకు యాత్రార్థమై వెళ్లగా నచ్చట గదాధరుడు స్వప్నమందు గనబడి, దుష్టశిక్షణ, శిష్ట రక్షణకు నీకు కుమారునిగా పుట్టెదనని చెప్పుట.

2. గర్భవతియై చంద్రాదేవి దివ్యపురుషులతోను, దేవతా స్త్రీలతోను మాట్లాడుచున్నట్లుగా గనబడుచుండుట.

3. శ్రీరామకృష్ణుడు జన్మించినపుడు పురిటి సమయమున నున్న ధ్వనియను స్త్రీ పరుండబెట్టినచోట నుండక, పొయ్యిలో సగము బూడిదలో గప్పబడియుండుట.

4. శిశువుగానున్నప్పుడు ఒకప్పుడు అధిక భారముగను ఒకప్పు డెంతో తేలికగను గానబడుచుండుట. 8-వ నెల వయస్సులో చంద్రాదేవి పాలిచ్చి మంచముపై పరుండబెట్టి వేరొక పనిపైబోయి మరలవచ్చి చూడగా, ఆ మంచముపై నొక యాజానుబాహుని గాంచుట, తండ్రి వచ్చిచూడగా యథారీతిగా శిశురూపమున నుండుట.

5. అతిబాల్యముననే, విద్వాంసులకు నిగూఢమగు ధర్మసూక్ష్మములను దెల్పుట.

6. శ్రీనివాసుడను అధమజాతి హిందువు ఈత డవతారపురుషుడని గ్రహించి నాకు నీవు చేయనున్న మహాద్భుతకార్యములను చూచుభాగ్యము లేదు అని నుడివియున్నాడు.

7. శ్రీవిశ్వేశ్వరీ దర్శనమై ఎల్లప్పుడు దేవతలతో సంభాషించుచు ఒక మహాశక్తి స్వాధీనములోనున్నట్లు సదా గాన్పించెడివారు.

8. మధురబాబు భగవంతుడుగూడ శాసనబద్ధుడై నడువవలెనని చెప్పగా, శాసనకర్తకు, శాసనము నుపసంహరించుకొను శక్తిగూడ నుండగలదని నుడివి, మరునాడు, ఆలయపు తోటలో ఎఱ్ఱపూవులను పూచెడు నొక మొక్కకు తెల్లనిపూవు పూయించి యీ సత్యమును ఋజువుచేయుట.

9. హాలదారిచ్చిన శాపముచే, శ్రీగురుదేవుడు రక్తమును గ్రక్కుకొనుచుండగా ఒక

యోగివచ్చి యారక్తము నోటినుండి బయిటికి వచ్చుటమంచిది లేనిచో జడసమాధిలో ప్రవేశించి యిక బాహ్యస్మృతియే రాకుండెడిది. శ్రీవిశ్వేశ్వరి యీ మహాపురుషునిచే ఏదియో యొక గొప్పకార్యము చేయించదలచి యీవిధముగా శరీరము రక్షించినది యని నుడివెను.

10. వివాహయత్నమును చేయుచుండగా, తనభార్య ఫలానా చోటగలదని తెలియజేసెను.

11. ఈతఁడెప్పుడును దివ్యోన్మాద స్థితియందుండుటచే, ఇతరులు ఇదియొక వ్యాధిలక్షణమని దలచి శ్రీకవిరాజ గంగాప్రసాదసేనువద్దకు చికిత్సకై దీసికొనిపోగా, అతడిది మహాయోగస్థితిగాని వ్యాధిలక్షణముగాదని నిర్ధారణచేయుట.

12. తల్లియగు చంద్రాదేవి తనతనయుడు పిచ్చివాడగుచున్నాడని విచారించి, ఈశ్వరుని శ్రీరామకృష్ణుని రక్షించమని ప్రార్థించగా ఈశ్వరుడు ప్రత్యక్షమై శ్రీరామకృష్ణుడు ఈశ్వరసాక్షాత్కార స్థితియందున్నాడని తెలియచేయుట.

13. ఆగ్రహావేశుడై మధురబాబు శ్రీగురుదేవుని పరీక్షింపదలచి, పచారుచేయుచున్న శ్రీరామకృష్ణుని చూచుచుండగా, యొకసారి జగజ్జనని రూపముతోను, మఱియొకసారి మహాదేవుని రూపముతోను చర్మచక్షువులకు గానబడుట.

14. భైరవీ బ్రాహ్మణి శ్రీగురుదేవుని మహాభావస్థితిని, తీవ్రతాపము, ఆకలినిచూచి, యీతడు స్పర్శమాత్రముచే మానవులను పావనులగా చేయగల యవతారమూర్తియని నిర్ధారణచేయుట.

15. భైరవీ బ్రాహ్మణి తన యిష్టదేవతకు, నైవేద్యము చేయుచుండగా, శ్రీరామకృష్ణుడు మహాభావస్థితిలోవచ్చి యానైవేద్యమును ఆరగించగా, ఆ బ్రాహ్మణి తన ధ్యానస్థితిలో, శ్రీరామకృష్ణరూపమున తనయిష్టదైవము అవతరించియున్నాడని గ్రహించి, తాను పూజించుచున్న సాలగ్రామమును గంగలో పారవైచుట.

16. శ్రీరామకృష్ణుడు అవతారమూర్తియా యని నిర్ధారణచేయుటకు ఏర్పడిన పండితసభలో వైష్ణవాచరణుడు, పండిత గౌరీకాంత తర్కభూషణుడు అప్పుడప్పు డవతరించిన యవతారమూర్తులు దివ్యశక్తియొక్క శతాంశములనియు, శ్రీగురుదేవుడు ఆయనంతశక్తియే యనియు నిర్ధారణచేయుట.

17. జంతువులయొక్కయు, పక్షుల యొక్కయు భాష తనకు బోధపడుచుండెడిదనియు, అనేకమంది దేవతలను, శ్రీరాజరాజేశ్వరిని గాంచితిననియు తెలవిచ్చుట.

18. శరీరఛాయ బంగారుచాయగా మాగి దివ్యమోహన విగ్రహముగా నుండుటచే ప్రజలందరు చుట్టుముట్టుచుండుటచే, శ్రీలోకేశ్వరిని, ఆంతరంగిక సౌందర్యముంచి, బాహ్యసౌందర్యమును దీసికొనుమని ప్రార్థించుటచే అప్పటినుంచియు వారి శరీరము చామన చాయగా మారుట.

19. తనవద్ద కనేకమంది శిష్యులుగావచ్చెదరని శ్రీగురుదేవులు దెల్పెడువారు.

20. ప్రతాపచంద్ర ముజుందారు భారతదేశ చరిత్రలో ప్రాణాపాయసమయమున ఆర్యవిజ్ఞాన సముద్ధరణమునకై భగవన్నియమితుడగు పురుషోత్తముడే యీ రామకృష్ణుడని ప్రకటించెను.

21. షడ్దర్శన పండితుడగు నారాయణ శాస్త్రి యాతడు కోరినది తప్పక సిద్ధించు ననియు, ఈతనిని శరణువేడినవారు తప్పక ముక్తులయ్యెదరనియు నుడివెను.

22. న్యాయ, వేదాంత శాస్త్రముల యందు నిధియగు పండిత పద్మలోచన తర్కాలంకారుడు ఈతనిం దివ్యావతారమని నిర్ణయించెను.

23. జటాధారియగు నొక సాధువువద్ద రామలాలు అను నొక విగ్రహము ముండెడిది. ఈ సాధువు రామోపాసకుడు. ఈతని తపోశక్తిచే, (శ్రీ)రాముడు నిరంతర మీతనితో నీడ పగిది నుండి, యీతడుచేయు సమస్తోపచారములను స్వీకరించుచుండెడివాడు. ఈ రహస్యమును (శ్రీ) గురుదేవులు గనిపెట్టెను. అంతట రామలాలు ఆ జటాధారిని వదలి శ్రీ గురుదేవునివద్దనే యుండుటగాంచి; యా బాబాజి యా రామలాలు విగ్రహమును శ్రీ గురుదేవుల కిచ్చి వెళ్లిపోయెను.

24. వివిధములగు పందొమ్మిది భక్తిభావము లొకే వ్యక్తియందుండుట మహాభావ మందురు. ఒక్కొక్క భక్తిభావము పరిపూర్తి చెందుట కొక్కొక్క జన్మ సరిపడును. అట్టితరి నితనియం దీ పందొమ్మిది భావములు పరిపూర్తి నొందుట యీతని యవతార పురుష విశిష్టతయని గుర్తెరుగవలయును.

25. శ్రీ రాధాదేవిని దర్శించి యాపె చాయ లేత పసుపురంగనియు, శ్రీకృష్ణుని దర్శించి, నీలవర్ణముగానున్న యొక విధమగు గడ్డిపూవుయొక్క చాయగా వానిరంగున్న దనియు నుడివియున్నారు.

26. నిర్వికల్ప సమాధిలో ఒక్కొక్కసారి ఆరుమాసములవఱకు నుండెడివారు. లోకోద్ధరణకై శ్రీ జగజ్జనని బాహ్యస్మృతి గలిగించినదని నుడివియుండిరి.

27. మధురనాధుని భార్య జగదాంబదాసికి జబ్బుచేయగా, మధురనాధుడు దుఃఖించుచుండగా, ఆమెకు ఆరోగ్యముగలుగునని వరమిచ్చి, తాను ఆరుమాసములు వ్యాధితో బాధపడెను.

28. మధురనాధుడు వ్రణముచే బాధపడుచుండగా, తన స్పర్శమాత్రముచే ఆ బాధను పోగొట్టెను. దివ్యహస్త స్పర్శ గలిగియుండెనని చెప్పుట కనేక నిదర్శనములు గలవు.

29. కాశీ యాత్రలో కాశీపట్టణము బంగారుతో గట్టబడియున్నట్లు గాంచెను. యోగసమాధిని పొంది జటాధారియగు నొక తెల్లని పురుషుడు ప్రతికాష్టమువద్దకు బోయి ప్రతి జీవుని పైకెత్తి చెవిలో మహామంత్రముపదేశించుచున్నట్లును, విశ్వేశ్వరి కాష్టమున కావల ప్రక్క గూర్చుండి, యా జీవియొక్క బంధనములు త్రెంచి మహానిర్వాణ ద్వారము తెరచుచున్నట్లును గాంచి, శాస్త్రములయందుల్లేఖింపబడిన కాశీమహాత్మ్యమును ఋజువుజేసెను.

30. శ్రీ గురుదేవునికి సేవచేయుచున్న హృదయుడు వలగన్నను తీవ్రసాధనలను చేయుచుండగా, ఒకనాడు శ్రీరామకృష్ణు డాతని చక్షువులకు భూమినంటక, మహాతేజముతో నుండినట్లును, తానుగూడ నొక తేజోమూర్తిగను, తాను శ్రీ గురుదేవునియొక్క శాశ్వతపరిచారకుడుగను గనబడెను.

31. హృదయుడు దేవీపూజ చేయుచున్నప్పుడు మూడు రోజులు శ్రీ గురుదేవుడు సూక్ష్మశరీరధారియై శ్రీ దేవీవిగ్రహము ప్రక్కన గూర్చుండి దర్శనమిచ్చెను.

32. మధురుని అవసానసమయమున శ్రీ గురుదేవుడు దక్షిణేశ్వరమునందుండియే, సూక్ష్మశరీరధారియై మధురబాబును రక్షించి, యాతని మరణవార్తను హృదయునితో చెప్పి, యాతడు దివ్య విమానములో దేవలోకమునకు బోయెననియు, నాతడు మరల ఏ రూపముతో జన్మించునో యా భవిష్యత్తును దెలియబరచెను.

33. క్రీస్తు ప్రభువును దర్శించి ముక్కొంచెము చదునుగా నుండునని తెలవిచ్చిరి.

34. బుద్ధుడు అవతారపురుషుడనియు, ఆతడు చెప్పినది యుపనిషన్మతమనియు దివ్యదృష్టిచే ప్రకటించెను.

35. జనకమహారాజు వరుసగా పదనొకండు సిక్కు గురువులుగా జన్మించి పిమ్మట పరబ్రహ్మలో లీనమయ్యెనని ప్రకటించెను.

36. తాను భవిష్యత్తులో పశ్చిమోత్తర దిశను రెండువందల సంవత్సరములకు పిమ్మట అవతరించెదననియు, అప్పుడు కొందరు ముక్తులయ్యెదరనియు, నింకను మిగిలినవారు చాలాకాలము వేచియుండవలెననియు పలికియున్నారు.

37. తాను శరీరమును ఎప్పుడు విడిచిపెట్టునో యా గుర్తులను ముందుగనే చెప్పెను. అది తు. చ. తప్పకుండ జరిగినది.

38. మధురబాబుతో తన విశ్వమతసిద్ధాంతముల వ్యాపనమునకై శ్రీ జగజ్జనని యొక్క క్రొత్తసంఘమును తనద్వారా స్థాపింపవలెనని కోరిక గలిగియున్నదని తెలియపరచెను, అది నెరవేరెను.

39. కడసారి జన్మగలిగి ముక్తినొందవలసినవారును, జీవితములో నొకసారియైనను మనస్ఫూర్తిగా భగవంతుని ప్రార్థించినవారును తనవద్దకు రావలెనని తెల్పెడివారు.

40. ఆది మహమ్మదును దర్శించి, హిందూ, మహమ్మదీయ మైత్రికి అద్వైతమతమే మార్గమని దారిజూపిరి.

41. కేశవచంద్రసేనుని గాంచి, యాతని యనుచరుల చిహ్నమగు విప్పబడిన కుంచెయు, రాజసిక స్వభావమునకు చిహ్నమగు రత్నమును తలయందును చూచెను.

42. మనోమోహనుడు శ్రీ గురుదేవుని చూచుటకు రా నుద్యమింపగా, ఆతని మేనత్త, భార్యయు నడ్డగింపగా, ఆ విషయమును మనోమోహనున కెరింగించుట.

43. తనకిచ్చు మిగాయి వస్త్రాలు ఇతరులకిచ్చి మిగిలినది తనకియ్యరాదని రామచంద్రునకు కలలో గనబడి మంత్రోపదేశము చేయుటయు, ఆతడు గొల్చుచున్న యిష్టదేవత శ్రీరామకృష్ణ రూపముగా గనబడుటయు శ్రీ గురుదేవుని దివ్యజన్మను ఋజువు చేయుచున్నవి.

44. రాఖలు తన మానసికపుత్రుడనియు, శ్రీకృష్ణుని చెలికాడనియు తెలియపర్చెను.

45. నరేంద్రుని చూచినంతనే శ్రీరామకృష్ణుడు "నీవు మానవుల దుఃఖములను తొలగించుటకై భూమిపై బుట్టిన నారాయణావతారమగు నరుడను పురాతనమహర్షి వనియు, ఏడుగురు ఋషులున్న తేజోలోకమందలి యొకభాగమే యీ నరేంద్రరూపముగా అవతరించెననియు నుడివెను.

46. ఎవ్వరును తమ కోరికలను శ్రీ గురుదేవునకు తెల్పనక్కరలేకుండగనే యాతడు గ్రహించి నెరవేర్చుచుండెడివారని నరేంద్రుడు తెల్పియుండెను.

47. కాళీప్రసాదచంద్రుడు శ్రీ గురుదేవుడు పూర్వావతారములన్నియును గలిసిన యవతారమూర్తి యని తన దివ్యదర్శనములయందు గ్రహించెను.

48. క్షీరోద, సుబోధనులకు స్పర్శమాత్రముచే జవన్ముక్తిని ప్రసాదించుట.

49. నవగోపాలునకు దినమున కొకసారి తన్ను స్మరించుకొనినంతనే మోక్షము గలుగునని వరమిచ్చుట.

50. శ్రీ గురుదేవుడు యోగసమాధిలో నున్నప్పుడు చిన్ననరేను ముట్టుకొనగా గొప్ప బాధచే కెవ్వుమని కేకవేసెను. మతగ్రంథములయందు ఏదైన పుండు శరీరమందున్నప్పుడు దివ్యమూర్తులను తాకరాదని చెప్పబడియున్నది.

51. శ్రీ గురుదేవుడు అఘోరమణి దేవితో రెండుమాసములు గోపాలరూపమున నుండి దివ్యానుభవములను గలుగజేసెను.

52. కాశ్మీపూరులో నుండగా తన స్థూల శరీరమునుండి సూక్ష్మశరీరము విడువడి వీపుపై ననేక వ్రణములతో తిరుగుచుండుట చూచి అపవిత్రులు తనపాదమును తాకుటచే వారు పవిత్రులగుచుండిరనియు, వారి పాపములవలన తన కీ స్థితి గలిగినదనియు చెప్పెను.

53. నిర్యాణమునకు ఎనిమిది, తొమ్మిది రోజులకు ముందుగనే తన మహాసమాధి రోజును తెలియజేసి, నరేంద్రుని శరీరమునందు తన తేజస్సును ప్రవేశింపజేసి, యాతనితో నీవు లోకము నుద్ధరించగలవని నుడివిరి.

54. నిర్యాణదినమునకు రెండు రోజులు ముందుగా నరేంద్రునకు శ్రీరామకృష్ణుడు అవతారపురుషుడా యని సందేహించుచున్న సమయములో శ్రీ గురుదేవుడు అయ్యది గ్రహించెనో యన్నట్లు ఎవ్వడు ఒక్కకాలమున శ్రీరాముడుగను, మఱియొకకాలమున కృష్ణుడుగను గాన్పించెనో, యాతడే యీ శ్రీరామకృష్ణుడు అని స్పష్టముగా చెప్పి సందేహమును బాపెను.

55. గాంధిమహాత్ముడు శ్రీరామకృష్ణుడు సజీవాకృతినిదాల్చిన దివ్యత్వమని వాక్రుచ్చెను.



# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిశరణమ్

ఆల్మోరా
19-11-'11.

ప్రియశ్రీ... .

15-వ తారీఖునాటి నీ యుత్తరము జూచి సంతసించితిని. మీ క్షేమ సమాచారములు నా కపుడపుడు దెలియుచునేయున్నవి. సర్వదా మీ క్షేమమునే కాంక్షించుచు, తలంచుచు నుందును.

జల్ బిచ్ కుముద్ వసే చందా వసే ఆకాశ్
జో యాంకే హృద్ వసే సో తాకో పాశ్ *

భక్త తులసీదాసు యథార్థమునే—సత్యమునే—వచించియున్నాడు. హృదయము నీయందున్నది. కాన నే నెంతటి దూర పర్వతములందున్నను నీ సమక్షముననే యున్నట్లు నాకు గోచరించుచున్నది.

—ఆ విషయమున భగవదిచ్ఛయే నెఱవేరును. అంతకంటె నేనేమి వచింపగలను? నీవు క్షేమముగానుండి దేవతార్చనయందు విలీనుడవగుచున్నావని విని యెంతయు సంతసించుచున్నాను.

నారాయణ చింతనమువలన జడత్వము ప్రాపించుననుటకు వీలులేదు. అందు భయపడ నవసరములేదని శ్రీవివేకానందులవారికి శ్రీరామకృష్ణులవారే చెప్పియున్నారు.—వివేకానందులు, 'మహాశయా! మీరు మమ్మింతగా ప్రేమించుటవలన మీకు అల్ల జడభరతునివలె జడత్వము ప్రాపించునేమో. కావున మీరు మమ్మింతగా ప్రేమింపవలదు' అని శ్రీగురుదేవుల హెచ్చరించిరి. ఆ పలుకులు విని 'నారాయణుని ప్రేమించుటవలన జడత్వము ఆవంతయు గలుగదు,' అని శ్రీరామకృష్ణులు పలికిరి. కావున మీయందలి ప్రేమవలన నాకు భయపడవలయు నవసరములేదు. మీరు గోవిందుని భజించువారు. "డుక్కృంకరణే" మీకు బహిరావరణము మాత్రమే. ఏలనన "నహినహి రక్షతి" । యన్నవిషయము మీ రెఱుంగనిది కాదు.

శ్లో॥ నహి కల్యాణకృత్ కశ్చిత్
దుర్గతిం తాత గచ్ఛతి.

ఇది భగవానుని స్వీయవాక్యము. కాన ఇందు విపరీతార్థ కల్పనమున కవకాశమే లేదు. తక్కిన విషయములన్నియు చక్కగానున్నవి. నా ప్రేమపూర్వకాశీర్వచనములు.

ఇట్లు,
శ్రీ తురీయానంద

---

* జలములమధ్య కుముదములు వసించుచున్నవి. ఆకాశమున చంద్రుడు వసించుచుండును. అయినను ఈ ఇరుపక్షములకును మధ్య అవినాభావమగు ప్రేమ కలిగియేయుండును. అట్లే ఎవరెవరు ఎవరెవరి హృదయస్థులగుదురో వారు వారివారికి ఎంతయు సన్నిహితులై యుందురు.

† శ్లో. ప్రాప్తే సన్నిహితే మరణే। నహినహి రక్షతి డుక్కృంకరణే॥
—శ్రీ శంకరాచార్యులవారి చర్పట పంజరికాస్తోత్రము.

మృత్యువు సన్నిహితమయినపుడు 'డుక్కృంకరణే' రక్షింపజాలదు. 'డుక్కృంకరణే' యనునది సంస్కృత వ్యాకరణ సూత్రము.

# శ్రీ సూర్యనారాయణ శతకము

కీ॥ శే॥ శ్రీ భాస్కరభట్ల సీతారామశాస్త్రి

(జనవరి సంచిక తరువాయి)

మ॥ శ్రిత సంరక్షణసేయఁజాలని వృథాఽజీవి న్బ్రశంసింపఁగా
వెతగానుండదె? సత్సభాంతరముల ఽ న్విద్వత్కవిశ్రేణికిన్,
చతురుల్మెచ్చఁగ నిచ్చలున్ నిను సవిఽస్తారంబుగా నెన్న నం
చిత కీర్తుల్దగుఁ గాక! దివ్యకరుణా! ఽ శ్రీ సూర్యనారాయణా! ౧౧

శా॥ బంగార్పువ్వుల దొంటిమేన మనుజుఽల్బల్మారు పూజించి, మ్రొ
క్కంగా, నిన్నుతిసేయఁగా, ధరణిలో ఽ గంభీరులై, ధీరులై,
సాంగంబైన సువిద్యల న్బ్రబలి, భాఽగ్యారోగ్య సంపన్నతన్
శృంగారంబుగఁ దేజరిల్లెదరహో! ఽ శ్రీసూర్యనారాయణా! ౧౨

మ॥ వినయం బించుక లేకయే కలుగునా? ఽ విశ్వాసమెవ్వారికిన్,
ఘనవిద్యాన్వితులైన నేమి? దురహంఽకారాత్ముల స్వైరరా
దనఘు ల్వారల కల్మిఁజూచి చనఁగా, ఽ నజ్ఞానులా మూర్ఖు లెం
చిన మేల్సేయరయా! సహస్రకిరణా! ఽ శ్రీసూర్యనారాయణా! ౧౩

శా॥ వీణావేణురవంబు వీనుల విన ఽ న్విందై మనంబొప్పు, న
తీక్ష్ణోగ్రోచ్చ ఖరస్వనంబు మదికిన్ ఽ జీకాకు నొందించు, వి
న్నాణంబేర్పడఁగా మృదూక్తుల జగఽన్నాథా! సమస్తేప్సిత
శ్రేణిం దోడనె కూర్తు మానవులకున్, ఽ శ్రీసూర్యనారాయణా! ౧౪

శా॥ రంగత్తుంగ తురంగ సప్తకరథ ఽ ప్రారోహణా! పద్మినీ
సంగాంతః కరణా! సురారిహరణా! ఽ ఛాయాతపః కారణా!
గాంగేయాంబరధారణా! శుభగుణా! ఽ కారుణ్యపూర్ణేక్షణా!
శృంగారాభరణా! సహస్రకిరణా! శ్రీసూర్యనారాయణా! ౧౫

మ॥ కలుషచ్ఛేదన! నీదు పాదములు నాకన్నుంగవన్ జూడఁగా
వలెనంచున్ స్తుతియించి వేడెదను, నావంకన్ గృపన్ జూడవే!
కలిదోషంబులణంగ, శత్రుతతి లోఁగన్ సౌఖ్యసందోహముల్
చెలఁగన్, మంగళ సంగతుల్ దనరఁగా, శ్రీసూర్యనారాయణా! ౧౬

మ॥ తరమా నాకు నుతింప? బ్రహ్మ ముఖ సుత్రామాది దేవాళికిన్
భరమైనట్టి భవన్మహత్త్వము, సదా భవ్యంబులై యుజ్జ్వల
త్కరుణాపాంగ శుభేక్షణమ్ముల జగద్భర్తుండ వీ వెట్టులన్
సిరులొంద న్ననుఁ జూచెదో! సుతుఁడ! నో శ్రీసూర్యనారాయణా! ౧౭

శా॥ ఏరా! నామనవాలకింపవు? చలంబేరా? మహోదార! నా
నేరాలెన్నుట మేరగాదు, వినరా! నీ ప్రాపె నేఁ గోరి యు
న్నారా! కోర్కెలొసంగరా! పలుకరా! నాతోడ, హేమాంబరా!
శ్రీ రాజిల్లఁగ నన్ను నేలుకొనరా! శ్రీసూర్యనారాయణా! ౧౮

శా॥ వేరే వేల్పులు లేరొ? వేఁడుకొనఁగా, విశ్వప్రకాశుండవై
గారామారఁగ భక్తకోటులకు భాగ్యం బాయురారోగ్యముల్
కోరికోరకమున్నె నీవొసఁగఁగాఁ గొంచింపవంచు న్నినున్
జేరె న్నామది, నన్నుఁ బ్రోవు, సుగుణా! శ్రీసూర్యనారాయణా! ౧౯

మ॥ సతతాక్షీణ పరంపరానుగతమై సౌభాగ్యసత్కీర్తులన్
క్షితిలో నున్నతిఁ గాంచువారలు, సదా చిత్తంబులో నుంచి, ని
న్నతిభక్తిన్భజియించి, పూజలిడువారయ్యా! సురాగ్రేశ పూ
జిత నవ్యారుణ పంకజాత చరణా! శ్రీసూర్యనారాయణా! ౨౦

(సశేషము)



# శ్రీ శారదానందస్వామి

(గతసంచిక తరువాయి)

అల్లు నూతనముగ స్థాపింపబడిన శ్రీరామకృష్ణ సేవాసంఘమునకు శ్రీ బ్రహ్మానంద స్వాములవారు అధ్యక్షులుగను, శ్రీ శారదానందస్వాములవారు కార్యదర్శిగను ఎన్నుకొనబడిరి. అప్పుడు తాము వహించిన కార్యభారమును శ్రీవారు తమ జీవితపర్యంతము—నాటినుండి ఇరువదియైదు సంవత్సరములు—ఎట్టి అవాంతరములు, ఆటంకములు, కలిగినను వానినెల్ల తమ ధైర్యసాహసములతో నెదుర్కొని తమ కార్యదీక్షను ప్రదర్శించియున్నారు. నూతన కేంద్రస్థాపనము, సేవాకార్యము, క్షామనివారణము, ప్రవాహ (వరదల) కష్టనివారణము, శిక్షావిస్తారము, ధర్మప్రచారము—ఇవన్నియుగూడ వారి సలహా ననుసరించియే జరుగుచుండెడివి. శ్రీరామకృష్ణ సంఘమును నిలువబెట్టినవారు వీరే. అప్రతిహత ప్రతిభయు, కార్యకౌశలము, సర్వవిషయవిచక్షణయు, ఆయా మనుష్యస్వభావ పరిశీలనాదక్షతయు, అనన్య సామాన్యమగు ప్రేమయు వీరి సహజ గుణములు. ఇట్టి సుగుణములన్నియు గలిగి భాసింపగల మహామహులు దుర్లభులు. మహా విశాలహృదయులు. వీరెందఱో నిరాశ్రయులకు ఆశ్రయము నొసగియున్నారు. వీరి కార్యదర్శకత్వమునందు విరక్తి గలిగింపగల ఘట్టములందెల్ల అత్యంత శాంతియు సహనము గలిగి తమకార్యమును—నిర్వర్తించుచుండిరి. ఏదేని నూతన సంఘమును స్థాపింపవలసివచ్చినప్పుడు పరిష్కరింప వీలుగాని విషమసమస్యలెన్నియో యడ్డుతగిలెడివి. ఎన్నియో కుప్రశ్నలకు జవాబీయవలసియుండెడిది. కాని ఎంతటి కోపమునకు అవకాశము గలిగింప గలిగిన సమస్యలందును శ్రీవారు అత్యంత శాంతియు సహనమును జూపి యా సమస్యలనెల్ల తగురీతిని పరిష్కరించెడివారు, కాని కోపమునకు ఆవంతయు జోటిచ్చెడివారు కారు. దీనినిజూచి శ్రీ వివేకానందస్వాములవా రిట్లు సరసముగ పలుకుచుండువారు · "శరత్తు రక్తము చేపనెత్తురు వంటిది. అందావంతయు నుష్ణమనునదియే లేదు."

వీరి యాత్మసంయమమునుగూర్చిన దృష్టాంతములెన్నియేనియు గలవు. ఒకనాడు వారు ఆలంబజారు మఠమున నుండగా తమ పూజాగృహమున మట్టితో నిండిన కాలిజాడ పడియుంట గనుంగొనిరి. అది జూచినంతట శ్రీవారికి భరింపరాని కోపము గలిగెను. అందు ప్రవేశించినవాడు వంటవాడు. మిక్కిలి కోపములో వానిని బిలిపించిరి. ఆ పేద గజగజ వణకుచు శ్రీవారిని దర్శించుటెట్లా యని చింతించుచుండెను. కాని వెంటనే శ్రీవారు తమ కోపమును సరిదిద్దుకొని 'ఏమియులేదు, నీవు వెళ్లి నీ పని చూచుకొ'మ్మని పలికి వానిని బంపివైచిరి. వారి యసాధారణ తితీక్ష యపారమయినది. ఎంతటి తప్పుచేసినవారైనను శ్రీవారి ప్రేమ, సహనము—వీనివలన తమ శీలమును పరివర్త

నము గావించుకొనుచుండువారు. మానవ స్వభావము సదా ఒకేరీతిగ నుండదు. ఎంతటి దుష్టుడయినను కాలక్రమమున బాగుపడు నవకాశము గలదని శ్రీవారికి సంపూర్ణ విశ్వాసము గలదు. అందువలననే ఇతరులు గావించిన తప్పులనెల్ల క్షమించుచుండువారు. కావుననే యితరులతో గలసి యెంతమాత్రము పని చేయజాలనివారు వీరితో గలసి యెన్నియో ఘన కార్యములు ఉత్సాహపూర్వకముగ జేయుచుండువారు.

ఆ కాలమున శ్రీవారి 'గురుభాయి' శ్రీ తురీయానందస్వాములవారు అమెరికాలో సేవాకార్యము నిర్వహించుచుండిరి. శ్రీ వివేకానందస్వాములవారు భారతదేశమునకు పునరాగమనము చేసిన పిమ్మట శరీరమున అస్వస్థతగా నున్నదని విని శ్రీవారి (వివేకానందస్వామివారి) ని జూడదలంచి వారు భారతదేశమునకు బయనమయిరి. శ్రీవారి కార్యమును నిర్వహించుటకై శ్రీ త్రిగుణాతీతానందస్వాములవారు భారతదేశమునుండి పంపబడిరి. శ్రీ త్రిగుణాతీతానందులు ఉద్బోధనాపత్రిక భారమును సమస్తమును భరించి నిర్వహించుచుండిరి. వారి పోకవలన పత్రిక సక్రమముగ నడువక, చివరకు పత్రికయే నిలిచిపోవునేమో యన్న భయము, సంశయము కలుగజొచ్చినవి. అప్పుడు శ్రీ శారదానందస్వాములవారు ఆ పత్రికా నిర్వహణ కార్యమును తాము భరించి, దానికి వలయు వ్యాసరాజములనెల్ల రచించి, పత్రిక పేరుప్రతిష్ఠల నిలుపుటయే కాక దానికి వలయు మూలధనమునుగూడ సేకరించి యుంచిరి. ఆ సమయమున 'ఉద్బోధనా కార్యాలయము' ప్రత్యేకముగా నిర్మింపవలయునని శ్రీవారికి స్ఫురించెను. అదియును గాక శ్రీ శారదాదేవిగారు కలకత్తా వచ్చినప్పుడెల్ల వారు విడియుటకు తగువసతియుండెడిదికాదు. కావున కలకత్తా నగరమున నొక యిల్లు కొని, క్రిందిభాగమును ఉద్బోధనా కార్యాలయముగను, మేడభాగమును దేవిగారి విశ్రాంతిభవనముగను చేయించిరి. ఈ విషయమునందు చాల ఋణమేర్పడినది. ఆ ఋణమును (అప్పును) దీర్చుట చాల కష్టముగ నుండెను. కాని అది యొకవిధముగ మేలే యయ్యెను. ఏలనన శ్రీ స్వాములవారీ ఋణమును చెల్లించుటకై 'శ్రీరామకృష్ణ లీలాప్రసంగ' మను గ్రంథమును రచించ బూనిరి. అది విమర్శకదృష్టితో వంగభాషయందు భాషాసౌష్టవము మిన్నందునట్లు వ్రాయబడిన దివ్యగ్రంథము, గొప్పదియును. అట్టి ఉత్కృష్ట గ్రంథమును శ్రీవారు ఋణముకతో, ఏకాగ్రచిత్తులై వ్రాసిరి. పాఠకులకెల్ల వంగభాషయం దింతటి మహత్త్వము గలదా యన్న యాశ్చర్యము నా గ్రంథము గలిగించెను. ఆ గ్రంథపఠనమువలన అనేకులకు శ్రీరామకృష్ణులవారియందు శ్రద్ధాభక్తులు అంకురించెను, అనేకులకు అధికరించెను. అయినను ఎవరేని శ్రీవారిని దర్శించి 'స్వామీ, తమరు వ్రాసిన గ్రంథము చక్కగా నున్న' దన్నచో, 'అహా! అట్లందురేమి. ఆ గ్రంథమును నేను వ్రాసినవాడనుగాను. శ్రీరామకృష్ణులవారే ఆ గ్రంథమును నాచే వ్రాయించుకొన్నారు' అని పలికెడివారు. అట్లు కష్టపడి ఆ గ్రంథమును అయిదు భాగములుగ శ్రీవారు వ్రాసినను ఆ గ్రంథ మింకను అసంపూర్ణముగనే యున్నది. 'సంపూర్ణముచేయుడని' యెవరేని ప్రార్థించినచో, 'గురుదేవునకు వలయునని తలంపు గలిగినచో వారే చేయింతురు'

అని నిరాడంబరముగా బలికెడివారు.

ఈ గ్రంథరచనావిధానమును పరిశీలించినచో శ్రీ స్వాములవారి గొప్పదనము వివిధముల స్ఫురింపగలదు. వీరు కలకత్తాలో కొన్న భవనమా మిక్కిలి చిన్నది. అందు క్రింది భాగమున ఉద్బోధనా కార్యాలయము కాపుట వలన నెల్లప్పుడును జనబాహుళ్యముతో నిండియుండెడిది. అంతమాత్రమే కాక, పైభాగమున శ్రీ శారదాదేవిగారి విడిది. కావున అనుదినము, మాటిమాటికి తండోపతండములుగా వారిని దర్శింపవచ్చు భక్తజనులకా విరామము లేకుండెడిది. పై పెచ్చు శ్రీ స్వాములవారు శ్రీరామకృష్ణ సేవాసంఘమునకు కార్యదర్శి కాపుటవలన నానాడు వారనేకులను జూడవలసియుండెడిది. ఇన్ని ఆటంకములుండినను శ్రీవారు ఏదో ఒకవేళను నిర్ణయించుకొని పూనికతో, శ్రద్ధాభక్తులతో ఆ గ్రంథరచనము సాగించెడివారు. గ్రంథరచనమునందు వీరిది నూతనపంథా. గ్రంథరచనమునకు గూర్చున్నచో శ్రీవారు ప్రపంచమునంతయు మఱచి గ్రంథరచనమునందే నిమగ్నులై యుండెడివారు.

కలకత్తాలో శ్రీ శారదాదేవిగారుండుట శ్రీవారికి చాల ఆనందదాయకమయ్యెను. శ్రీ దేవిగారి దర్శనార్థము వచ్చిన భక్తులు గుమ్మముదగ్గరిగదిలోనున్న శ్రీ శారదానందుల వారి యనుమతి నందియే పోవలసియుండెడిది. ఆ కాలమున వీరి స్థూలకాయము, గంభీరదృష్టి పార్వతీ గృహమునకు ద్వారపాలకుడైన శ్రీ గణేశుని భక్తులకు స్ఫురింపజేయుచుండెడిది. భక్తుల మంచిచెడ్డలను గమనించి తగినవారికే అనుమతినిచ్చెడివారు కాని ఎల్లరకును గాదు. అదియునుగాక శ్రీ శారదాదేవియందు వీరికి గల భక్తి అత్యద్భుతము. ఆమెగారేమి చెప్పినను దానిని ఆజ్ఞగా భావించి, శిరసావహించి యట్లే నెఱవేర్చుచుండువారు. ఆద్యశక్తియే దేవీమూలమున మూర్తీభవించినట్లు వారికి స్ఫురించుచుండెడిది. శ్రీ శారదాదేవిగారి జన్మస్థలమగు జయరాంబటినుండి వచ్చువారియందుగూడ వీరి 'శారదాదేవి భక్తి' ప్రసరింపసాగినది. అందువలన అచ్చటివారన్నను వీరికి ప్రాణముగా నుండెడిది. ఈ అవకాశమును పురస్కరించుకొని కొందఱు వారిని తమ కార్యార్థము వినియోగించుకొని చివరకు శ్రీవారిని చాల చిక్కులపాలు గావించుచుండువారు.

1909 వ సంవత్సరమున సంభవించిన యీ సంఘటనము, అత్యంత శాంతిమయులైయున్న శ్రీ స్వామివారికి, ఎంతటి సాహసము గలదో నిరూపించుచున్నది ఆ యేడు జరిగిన మాణిక్కతోలా బాంబుకేసునకు సంబంధించిన యువకులిరువురు, తామిక రాజకీయములకు స్వస్తిచెప్పెదమనియు శ్రీరామకృష్ణ సేవాసంఘమున జేరదలచితిమనియు వచ్చిరి. వీరిరువురును నాడు పేరుగాంచిన విప్లవకారులు. వీరిరువురను సంఘమున జేర్చుకొనుటయన్న అది నిజముగా 'పోలీసువారికి' తమంతట తామే ఆశ్రమమునకు దారిజూపినట్లగును. కాని వారిరువురకు శ్రీరామకృష్ణ సేవాసంఘమున జేరవలయునన్న హృదయపరివర్తనము కలిగినట్లు శ్రీవారు గుర్తించిరి. వారి కాశ్రయనిరాకరణము న్యాయ్యముగా వారికి దోపలేదు. కాబట్టి శ్రీవారు వారికి నిండుమనస్సుతో నాశ్రయమిచ్చిరి. అందులకై గొప్పగొప్ప పోలీసు ఉద్యోగస్థులతో సంప్రతించి వీరిరువురి శీలరక్షణమున శ్రీవారు ఉత్తరవాదిగ నిలిచిరి.

ఇట్టి ఆటంకములనెల్ల రూపుమాపి తమ కాశ్రయమిచ్చినందుల కా యువకులు గూడ శ్రీరామకృష్ణ సేవాసంఘమున నత్యంత శ్రద్ధాభక్తులతో సేవచేసి తమజీవితమునంతయు సార్థకము గావించుకొనిరి. శ్రీ స్వామివారు నిర్భయముగా నిరాఘాటముగా వారికి ఆశ్రయమిచ్చినందుననే ఆ యువకులు తమ జీవననౌకను సక్రమముగ నడుపుకొనగలిగిరి, శ్రీవారిట్టి సాయము వారికి చేయగలిగిరి. మఱియు నాడు వంగదేశమునను్న విప్లవకారుల సంస్థలయందలి సభ్యులకు శ్రీవివేకానందస్వాములవారి ప్రసంగములు హృదయరంజకములై విప్లవమునకు దారితీయుచున్నట్లురాజ్యాంగమువారికిదుర భిప్రాయము గల్పించినట్లు(రాజ్యాంగము) వారు తమ నివేదికయందు ప్రచురించిరట. అదియును గాక వంగదేశము దర్బారున ప్రసంగముచేయుచుండిన నాటి గవర్నరుగూడ శ్రీరామకృష్ణ సేవాసంఘమునకు ప్రతికూలాభిప్రాయములిచ్చుచు కొన్నివాక్యము లుచ్చరించిరట. ఇవన్నియు సంఘపతనమునకే హేతువులగునన్నట్లు శ్రీ శారదానందులకు స్ఫురించినది. వెంటనే నాటి గవర్నరుగారి కొక విజ్ఞాపనమును వ్రాసి పంపిరి. ఆ విజ్ఞాపనమునకు (Lord Carmichael) నాటిగవర్నరిట్లు ప్రత్యుత్తరమొసగిరి. "శ్రీరామకృష్ణ సంఘమువారు పంపిన విజ్ఞాపనము చదివి యత్యంతవిచారపూరితుడనైతిని. ఆనాడు దర్బారున నేను పల్కినవాక్యములు శ్రీరామకృష్ణసంఘముయొక్క ధార్మిక, సాంఘిక, విద్యావిషయక కార్యముల నాటంకపఱచుచున్నట్లు విని దుఃఖించుచున్నాను. శ్రీరామకృష్ణసంఘస్థులపై దోషారోపణము చేయుట నాయభిమతముకాదు. సంఘకార్యములందు రాజకీయమణుమాత్రమును లేదని నేను చక్కగా దెలియుదును. దశదిశలను ఈ సంఘమువారి ప్రశంసలనే వినుచున్నాడనుగాని మఱి ఇతరమేమియు లేదు." అలుకిమ్మట నుండి ఈ యాశ్రమమునకు పోలీసువారెట్టి కష్టమును గలిగింపరైరి. నానాటికి శ్రీస్వాములవారి కార్యభార మధికరించుటవలన అది శ్రీవారి ఆరోగ్యమును గుచించినది. అందువలన శ్రీవారు వాతరోగమునకు లోనైరి. కావున అందఱును శ్రీవారిని పూరీక్షేత్రమున కొన్నాళ్లు విరామము తీసికొనుడని హెచ్చరించిరి.

(సశేషము)

# శ్రీ వాసుదేవ మననము

శ్రీ మాచిరాజు శ్రీ రామకృష్ణ

(జనవరి సంచిక తరువాయి)

ఆ భక్తియు శ్లో "శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం। అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మ నివేదనం" (భాగవతము 7-5-23) 1. శ్రవణము, 2. కీర్తనము, 3. స్మరణము, 4. పాదసేవనము, 5. అర్చనము, 6. వందనము, 7. దాస్యము, 8. సఖ్యము, 9. ఆత్మనివేదనము నని విష్ణుసేవ తొమ్మిది విధములుగ జెప్పబడినది.

1. శ్రవణము:—"శ్రవణం భగవన్నామ చరితగుణాదీనాం శ్రుతిర్భవేత్॥" భగవంతుని యొక్క నామచరిత్ర గుణాదులను సద్గురుముఖమున శ్రద్ధతో నాకర్ణించుట శ్రవణభక్తి.

2. కీర్తనము:—"భగవన్నామలీలా గుణాదీనా ముచ్చైర్భాషాతు కీర్తనం॥" భగవంతుని నామలీలా (క్రియా) గుణాదుల నుచ్చైస్స్వరముతో కీర్తించుట కీర్తన భక్తి.

3. స్మరణము —"యథాకథం చిన్మనసా భగవత్సంబంధః స్మృతిరుచ్యతే॥" పగనైనను, వగనైనను, ప్రాణభీతినైనను ఏకారణముచేనైనను భగవదైకమానసికవృత్తి ననవరతము గలిగియుండుట స్మరణభక్తి. ఇట్టి స్మరణభక్తి ఫలము—"తస్మా ద్వైరాను బంధేన నిర్వైరేణ భయేనవా। స్నేహాత్ కామేనవాయుంజ్యాత్ కథం చిన్నేక్షతే పృథక్॥" (భాగవతం 7-1-25). "ఆ. వె. అలుకనైన, జెలిమినైన, గామంబుననైన, బాంధవముననైన భీతినైన దగిలి తలప నఖిలాత్ముడగు హరి జేరవచ్చు వేరు సేయడతడు." ఇవ్విధమున "గోప్యః కామా ద్భయాత్కంసో ద్వేషా చ్చైద్యాదయోనృపాః। సంబంధాద్వృష్ణయః స్నేహా ద్యూయం భక్త్యా వయం విభోః॥" (భాగవతము 7-1-30) శా॥ కామోత్కంఠతగోపికల్ భయమునం గంసుండు వైరక్రియా। సామగ్రిన్ శిసుపాల ముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులున్। ప్రేమన్ మీరలు భక్తినేము నిదె చక్రింగంటి మెట్లైన ను। ద్దామధ్యానగరిష్ఠుడైన హరి జెందన్‌వచ్చు ధాత్రీశ్వరా॥" అని భాగవత భారతి.

4. పాదసేవనము — "పాదోస్య విశ్వా భూతాని" "సకలభూత భౌతికప్రపంచము భగవంతుని పాదమాత్రము" అనెడి వేద వచనమును బట్టి విశ్వమంతయు భగవదంశమగును. కనుక పాదసేవనమన భగవదంశ సేవ. లేక భగవదంశద్వారా భగవత్సేవయని యర్థము. "మమనామ సదాగ్రాహీ మమసేవా

ప్రియస్సదా। భక్తిస్తస్మై ప్రదాతవ్యా తతో ముక్తిర్నసంశయః॥" (బ్రా.పు.) భగవన్నామమును నిత్యము చిత్తమున నిశ్చలముగ నెలకొల్పి అత్యంతశ్రద్ధతో భగవత్సేవాప్రియుడై యుండు పుణ్యాత్మునకు ఉత్కృష్టమైన భగవద్భక్తియు తోడనే ముక్తియు నిస్సంశయముగ ప్రాప్తమగునని బ్రాహ్మపురాణ వచనము.

5. అర్చనము — "శుద్ధిన్యాసాది పూర్వాంగ కర్మ నిర్వాహపూర్వకం। అర్చనం తూపచారాణాం స్యాన్మంత్రేణోపపాదనం॥" భూశుద్ధి భూతశుద్ధి మాతృకాన్యాసము దిగ్బంధనము మున్నగు పూర్వాంగ నిర్వర్తన పూర్వకముగ విధ్యుక్త మంత్రతంత్రాద్యలోపముగా భగవంతునికి ఆవాహనాది షోడశోపచార పూజావిధానము అర్చనభక్తి. షోడశోపచారములనగా— "ఆవాహనాసనే పాద్యమర్ఘ్యమాచమనీయకం। స్నానం వస్త్రం చోపవీతం గంధం పుష్పేచ ధూపకం। దీపం నైవేద్య తాంబూలం నీరాజన మతఃపరం। పుష్పాంజలిస్తథా సర్వే హ్యుపచారాస్తు షోడశ॥" అని శాస్త్రము. "శ్రీవిష్ణోరర్చనంయేతు ప్రకుర్వంతి నరాభువి। తేయాంతి శాశ్వతం విష్ణోరానందం పరమంపదం॥" (ఇతి విష్ణురహస్యే). ఉర్వియం దేమానవులు శ్రద్ధాళువులై భగవదర్చనయు నజస్రము నిర్వర్తించుచుందురో అట్టి సన్మార్గప్రవర్తకులు, బ్రహ్మానంద రూప శాశ్వత పరమపదప్రాప్తిని బడయుదురని విష్ణురహస్యము.

6. వందనము— "మనసావాచా నామ సహిత నమస్కారోచ్చారణం। కాయేన దండవత్ప్రణామశ్చ। ఏవం సాష్టాంగదండప్రణామః॥" మనస్సుతోడను వాక్కుచేతను భగవన్నామోచ్చారణముతో సహా నమస్కారోచ్చారణమును, శరీరముచేత దండవత్ప్రణామమొనరించుటయు నిట్లు సర్వత్ర భగవద్భావనతో త్రికరణశుద్ధిగ సాష్టాంగదండవత్ప్రణామ విధి వందన భక్తి. "ఏకోఽపికృష్ణస్య కృతః ప్రణామః దశాశ్వమేధావభృథైర్నతుల్యః। దశాశ్వమేధీ పునరేతిజన్మ కృష్ణప్రణామీ నపునర్భవాయ॥" పది అశ్వమేధయాగములను జేసి దీక్షాంతమునం దాచరించిన పది అవభృథ స్నానములును, శ్రీకృష్ణపరమాత్మనుగూర్చి నిరుక్తప్రకారముగ నాచరించిన ఒక్క సాష్టాంగదండవత్ప్రణామమును ఫలదాతృత్వమునందు సమతుల్యములు గానేరవు. ఏలయన దశాశ్వమేధియగు పురుషుడు తత్ఫలమగు స్వర్గాది పుణ్యలోకములను బొంది యా పుణ్యకర్మక్షయానంతరమున మరల మర్త్యలోకమునందు పునర్భవమునుం బొందును. పై విధముగ శ్రీకృష్ణపరమాత్మనుగూర్చి చేయబడిన ఒక్క ప్రణామమువలన పూర్వోక్త శ్రీకృష్ణప్రణామి పునర్భవమును పొందడు. పునరావృత్తి రహితమైన కైవల్యమును బొందును అని శాస్త్రము వందనభక్తి ఫలము నుగ్గడించుచున్నది.

7. దాస్యము — "దాస్యం కర్మార్పణం తస్య కైంకర్యమపి సర్వథా॥" స్వయంకృత సర్వస్వధర్మకర్మములను ఫలసహితము భగవత్సమర్పణముగ జేయుటయు, మనోవాక్శరీరములద్వారా సర్వవిధములచేత నిష్కపటముగ సదా భగవంతునికి కైంకర్యము (సేవ) చేయుచుండుటయు దాస్యభక్తి. పరిచర్యాదులన్నియు దీని కంగములు.

8. సఖ్యము:— "విశ్వాసో మిత్రవృత్తిశ్చ

సఖ్యం ద్వివిధమీరితం॥" భగవంతునియం దత్యంత విశ్వాసమును (నమ్మకమును) మిత్ర ప్రవర్తనమును కలిగియుండుట సఖ్యభక్తి.

9. ఆత్మనివేదనము — "తను మానసధనాదికం సర్వం భగవతి ఇతి భావనయా సర్వ చింతాత్యాగః॥" స్వీయములైన తను మానస ధనాదులు సర్వము భగవంతుని వైభవమేయని దృఢముగ నిశ్చితి నిశ్చలబుద్ధితో నిజతను మానసధనాదులన్నింటిని భగవంతుని కర్పించి సమస్త చింతలను పరిత్యజించుట ఆత్మనివేదన భక్తి. "వాసుదేవాశ్రయోమర్త్యో వాసుదేవ పరాయణః। సర్వపాపవిశుద్ధాత్మా యాతిబ్రహ్మ సనాతనం॥" (విష్ణుసంహిత 130) ఆత్మనివేదన పూర్వకముగ కేవల వాసుదేవు నాశ్రయించి, వాసుదేవైక నిలయాంతఃకరణుడైన పరిశుద్ధాత్ముడు సచ్చిదానంద పరబ్రహ్మమును పొందును.

(సశేషము)

---

# నాటకదీపము

కీ. శే. శిష్టు కృష్ణమూర్తి కవి

(1950 సం॥ మార్చి సంచిక తరువాయి)

గీ. ఆటగీములోన ♦ తేటగ దీపంబు। రాజు సభ్య పురుష ♦ రాజి నాట
కర్త నిర్విశేష ♦ వృత్తి దోచగజేయు। తద్విహీనమయ్యు ♦ తానె వెలుగు॥ 12

గీ. నరినహంకార విషయమ ♦ నీషలదనె। సాక్షియై వెలుగింపగ ♦ జాలు మరియు
భాస్యధిమణాదికముల ♦ యభావమునను। తానె వెలుగొందు పూర్వాకా ♦ లీన రీతి॥ 13

గీ. సాక్షి స్వప్రకాశ ♦ చైతన్య రూపత। నవిరతమున దీప్తి ♦ నతిశయిల్లు
తత్ప్రకాశ దీపి ♦ తయగు నీ బుద్ధి య। నేక రీతి స్థైర్య ♦ మేది తిరుగు॥ 14

సీ. ప్రభువహంకారంబు ♦ రసరూప శబ్దాది। విషయముల్ సభ్య పు ♦ రుషులు నర్త
కి మతి యింద్రియముల ♦ సమితి మార్దంగిక। తాళధార్యాదుల ♦ పాళి సాక్షి
దీపంబు స్వస్థలి ♦ తిరమయి యదియు స। కల భూతములనునీ ♦ కరణి వెలుగ,
జేయునట్లచలన ♦ స్థితి సాక్షి బహిరంత। రవభాసకుండగు ♦ నంత నిజము,
పరగు నీ బహిరంత ర్విభాగమరయ। దేహసాపేక్ష యాత్మకు ♦ తెలియలేదు
బాహ్యముల్ విషయంబు లా ♦ భ్యంతరం బు।హంకృతి స్థిరుడౌ సాక్షి ♦ యట్లనేయు॥

గీ. అంతరస్థితయౌ బుద్ధి యత్నములకు। తోడుగా మాటిమాటికి తోడరు వెలికి
తాదృశంబగు శేముషీ తరళత పర। మాత్మ నారోపితం బగు నది ముదమగు॥ 16

క. ఎటులన జాలాంతర గృహ। పట దల్పాతపము చలన పరి హీనం బౌ
నట కరము చలితమైనను। చంచలముగా గదుల నట్లు సంభ్రాంతి యిడున్॥ 17

గీ. అటుల నైజస్థలస్థితుండైన సాక్షి। వెలికి లోనికి గత్యాగతులను చేయ
కట్టి శేముషీ చాంచల్య మందినట్లు। తోచుగాకది నిజముయి తోచ లేదు॥ 18

గీ. బాహ్యుడును నాంతరుండును బరగ సాక్షి। గాడు యాదేశములుబుద్ధి గమ్యములగు
బుద్ధి మొదలైనయవిశాంతిం బొందినప్పు। డెక్కడ వెలుంగునా బ్రహ్మ మక్కడుండు॥

సీ. దేశ మేదియు లేద దేశభాక్కటులైన। సర్వసాక్షిత్వంబు సర్వగత్వ
మాదియౌ నన్నిటి కేది దిక్కన సర్వ। దేశ ప్రక్లిప్తిచే తిరమగు దన,
కదిలేదు వెలియైన నంతరమైన వి। శ్వంబైన నేది దేశంబు సేయు,
బుద్ధి యౌ దేశము పొల్పుగ జేయు సా। క్షి యటు వస్తువుల యోజింపవలయు,
బుద్ధి రూపాదికం బేది పొసగంజేయు। దాని దాన బ్రకాశించు దానిం జేయు
దాని దానికి సాక్షియై దనరు నాత్మ। వాఙ్మనస గోచరుండుగా వరలు నతడు॥20

గీ. ఇట్టి వాడెట్లు మాకుగ్రహింప యోగ్యు। డగు నది యసాధ్యమంటివా యతిశయేష్ట
మయ్యె సర్వగ్రహంబులు నణగు లేక। స్వాత్మ పరిశిష్టుడౌట యశవశ్య మయ్యె॥ 21

గీ. స్వప్రకాశ స్వరూపతను ప్రమాణ। మైన గోరగరాదది యడిగితేని
గురుముఖంబున శ్రుతిపారకుడవయి మతి। శరణముగ జేయు మాగ్రహాశపరతినేని॥ 22

క. సుమతి శరణముగ జేసెద। నమిత ఫలంబేమిదాన ననదెల్పెద సో
ద్యమత దధీనుడనై బ్ర। హ్మముగను వెలినైన లోన నైనను వత్సా॥ 23

క. ఆర్యా ప్రమథాధీశ్వర। భార్యా దేవనుతశౌర్య భావిజశోద్య
త్సార్యా దూరీకృత మా। త్సర్యా మునిపతి విచార్య జనకాహార్యా॥ 24

క. కోరు కొన కోట్రలక్ష్మి। నారాయణబ్రహ్మతత్త్వ నాటకదీపం
బారసి శిష్టాన్వయజుండు। ధీర కృపం గృష్ణమూర్తి తెనిఁగించి యిడెన్॥ 25

# ధ్యానము - సేవ

అనువాదకులు : శ్రీ సోమంచి లింగయ్య, బి.ఏ., బి.ఎల్.

[గతమాసము 11-వ తేదీని రాజమహేంద్రవరమున శ్రీరామకృష్ణ మఠము స్థాపింపబడినది ఆ సందర్భమున శ్రీ గురుమహారాజు(శ్రీరామకృష్ణ పరమహంస)గారి చిత్రపటావిష్కరణకై అధ్యక్షతవహించిన శ్రీ శాంతి రామమూర్తిగారు ఆంగ్లమున చదివిన వ్యాసమున కిది తెలుగు ]

రాజమహేంద్రవరమున రామకృష్ణమఠ స్థాపనోత్సవములో నాకుగూడ కొంకెంత అవకాశము దొరికినందులకు నేనెంతయు నానందించుచున్నాను. ధ్యానము—సేవ అను రెండు ధర్మములపై నడుచుచున్న శ్రీరామకృష్ణ మఠముయొక్క ప్రణాళిక నన్నెంతయో ఆకర్షించినది. మానవవిజ్ఞానమునం దన్నిశాఖల యందును మూల సిద్ధాంతములను పరిశీలించుటకు ప్రయత్నముచేయు సంస్థలును, ఆ మూల సిద్ధాంతముల నమలుపరుచుచు వ్యవహరించు సంస్థలును గూడ అవసరమే. భారతదేశము యుగయుగములనుండి మతముల, వేదాంతముల ద్వారా అన్వేషించుచుండిన ఆత్మవిద్య ఈనాడు పాశ్చాత్త్యులు భౌతికశాస్త్రములద్వారా అన్వేషించుచున్న భౌతికవిజ్ఞానమున కేవిధముగను తీసిపోదు కాని లోకమున నీ రెంటికిని గల విలువ జీవితమును నిర్మించి అభ్యున్నతికి గొని పోవు సామర్థ్యముపై ఆధారపడి యుండును. ఏపనిముట్లు దైనందిన వ్యవహారముల కుపయుక్తములుగావో, ఉపయోగపడనైన జాలవో అవి క్రమక్రమముగా మూలబడును. నవీనజీవన వికాసమంతయు పదార్థమే ప్రధాన వస్తువని నిర్ణయించిన పాశ్చాత్త్య భౌతికశాస్త్ర ముపై నాధారపడియున్నది. అనేక సౌకర్యముల నొడగూర్చిన ఆ భౌతికశాస్త్రము ఏ సిద్ధాంతముపై ఆధారపడియున్నదో ఆ సిద్ధాంతము నేడు ప్రపంచమున గౌరవింపబడుచున్నది. ఆ శాస్త్రపరిశోధనలకై ప్రభుత్వములును, ప్రజలును అనేక సంస్థలను నిర్మించి - వాటిని పోషించుచున్నారు.

పూర్వకాలమున భారతదేశములో ఆత్మయొక్కటే సద్వస్తువనియు, ఆ ప్రధానవస్తువు నుండియే సర్వము నుద్భవించి పోషింపబడి లయించుచున్నదనియు, సిద్ధాంతీకరించినారు. శాస్త్రములు, కళలు, జీవితవిధానములు మున్నగునవన్నియు భారతదేశమున పూర్వమీ ఆత్మతత్త్వముపై ఆధారపడి నిర్మింపబడినవి. ఈనాడు పాశ్చాత్త్యదేశములలో ఇవన్నియు పదార్థమే ప్రధానమనియెడు సిద్ధాంతముపై ఆధారపడినవి. గతరెండువందల సంవత్సరములనుండియు, భారతదేశము పాశ్చాత్త్య పరిపాలనలో నుండుటచే భారతీయుల భావ సంపుటి ఆధ్యాత్మికమునుండి భౌతికముగా మారిపోయినది. ఆధ్యాత్మికతను ఈనాడు మనము నిరాకరించుచున్నాము, లేదా పూర్తిగా విస్మరించుచున్నాము. అందుచే మన

పూర్వులు తమ భావములను, ఉద్వేగములను ఆధ్యాత్మికతపై ఆధారము చేసికొని జీవించి రనుట ఊహించుటకుగూడ సాధ్యముకాకున్నది. మన సహజాతములచే మాత్రము అనేక శతాబ్దములనుండి భారతదేశమును సజీవముగా నుంచగలిగిన ఆ జ్ఞానసంపుటియందు ఇంకను విశ్వాసముకలదు. భారతదేశము మరల నొక మారు స్వేచ్ఛగ నుండవలయునన్నచో మన పూర్వులు ఏవిజ్ఞానముపైనను, విశ్వాసముపైనను తమ జీవితవిధానములను ఆధారపరుచుకొని యున్నారో దానిని మనము మరల కైవసము చేసికొనవలసియున్నది. ఈ ఆధ్యాత్మికతయే భారతీయ జీవితమునకు మూలాధారము. పాశ్చాత్యులనుండి మనమెంతగా భౌతికవిజ్ఞానమును నేర్చుకొన్నను, మన జీవిత తత్త్వముమాత్రము ఆత్మ పరిశోధనలపై ఆధారపడవలెను.

ఐహికజీవితమున పొందిన భౌతికశాస్త్ర విజయమే సత్యమైన జ్ఞానమని భావించుచుంటిమి, కాని సత్యముమాత్రము అనేకముఖములుకలది. భారతీయులు అనేకమతములును వేదాంతములును అన్వేషించుచున్న తత్త్వమొక్కటియేయనియు, ఆతత్త్వమునుండియే సమస్త మతములును, వేదాంతములును, శాస్త్రములును ఉద్భవించుచున్నవనియు గ్రహించిరి. పాశ్చాత్య శాస్త్రజ్ఞులే తాము సంపూర్ణ సత్యమని కొన్ని శతాబ్దములక్రితము నమ్మినదానిని వీడుచున్నారు. న్యూటన్ దేశకాలములు రెండును పారమార్థిక సత్యములని భావించెను. ఐన్‌స్టీన్ దేశకాలములు రెండును సాపేక్షికములనియు, అందు దేశము పారమార్థిక సత్యమనియు లెక్కలు దానిపై నాధారపడవలెననియును భావించెను. ఆక్స్‌ఫర్డు విశ్వ విద్యాలయములోని ప్రొఫెసర్ మిల్‌నీ అనునాతడు కినెమాటిక్ సాపేక్షిక సిద్ధాంతమను నొక నూతనసాపేక్షికసిద్ధాంతమును ప్రతిపాదించుచున్నారు. వారు కాలము పారమార్థిక సత్యమనియు, లెక్కలు దానిపైననే ఆధారపడవలెననియును చెప్పుచున్నారు. ఇంతేకాదు. అనేకరకములగు కాలములుకూడగలవనియును విశ్వరహస్యములను సమన్వయము చేసికొనుటకు ఈకాల రహస్యమును తెలిసికొనవలెననియును వారు అభిప్రాయపడుచున్నారు.

ఈరకమగు కాలతత్త్వమును మనము పరిశోధించినచో పదార్థముపై ఆధారపడిన జ్ఞానమునకును, ఆత్మజ్ఞానమునకును, ఒక వంతెనను నిర్మింపవచ్చును. లూయీ డికిన్సన్ అను కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయమునందలి అధ్యాపకులు "ఇండియా, చైనా, జపాను" అనునొక గ్రంథమును రచించినారు. ఆయన ప్రపంచ మందలి నాగరికతలన్నింటిని రెండుగా విభజించి, భారతీయనాగరికతను ఒకవైపునను, మిగిలిన ప్రపంచనాగరికతలనన్నింటిని మరియొక వైపుననునుంచి భారతీయనాగరకత కాల రహితమనియు, ఇతర నాగరికతలన్నియు కాలానుబద్ధములనియు చెప్పినాడు. నిత్యత్వమునకును, కాలమునకు భేదమున్నది. ఆభేదమే నాగరికతలలోని తత్త్వములకుగల తేడా. నిత్యత్వము-కాలము అనువానిని మంచుతోడను, నీటితోడను, హిమవాహినితోడను, నదితోడను, హిమాలయపర్వతములతోడను, గంగా నదితోడను పోల్చవచ్చును. మంచు, హిమవాహిని, హిమాలయములు ఇవి అన్నియు నిత్యత్వమునకు చిహ్నమాత్రములు. నీరు, నది, గంగ యనునవి కాలమునకు చిహ్నములు. కాలము రెండు పరిమాణములుగలదని నాకుతోచు

చున్నది. ఆధ్యాత్మికకాలము యోగసిద్ధులు దివ్యదృష్టి, అపార ప్రతిభ వీటికి ఆధారము, ఈ వ్యావహారిక జగత్తులోగల కాల ప్రమాణము దైనందిన జీవితమునకు పునాది. సాధారణ భౌతిక జవితములో మానవుడు కాలతలముపై నాలుగుకాళ్లతో ప్రాకుచున్నాడు. ఆధ్యాత్మికకాలములో మానవుడు నిచ్చెన నెక్కినట్లు ఊర్ధ్వగామియగును. భూమిపై ప్రాకుచుండిన జంతువులు నిటారుగా నిలువబడుటచే నొక నూతనపరిణామమును, నూతన దృశ్యమును గాంచెను. సిద్ధపురుషులును, సాధువులును కాలతలమున నిటారుగ నిలుచుండువారు. సామాన్యమానవులము కాల తలమున ప్రాకెడువారము. ఈ కాల ద్విపరిమాణ సిద్ధాంత మంగీకరించినచో భారత నాగరికతనుగూర్చిన డికిన్సన్‌గారి అభిప్రాయము విపులీకరింపబడవలెను. భారతీయనాగరికత కాలరహితమేకాదు, కాలసహితముగూడ. ఆత్మ, నిత్యత్వమునకును, కాలమునకును, గూడ మూలము కావున భారతనాగరికత ఆత్మతత్త్వముపై నాధారపడినదనియు, ఇతరనాగరికతలన్నియు కాలముపై నాధారపడియున్నవనియు, చెప్ప నొప్పును. కాలము దాటి నిత్యత్వమున నుండువారు ముక్తులుగారు. ఎవరు కాలమును, నిత్యత్వమునుదాటి కాలమును, నిత్యత్వమును గూడనగునే "సత్" కలదో దానిలో నైక్యమగుదురోవారే ముక్తులు. ఈకాల ద్విపరిమాణ సిద్ధాంతము నాధారపరుచుకొని భారత దేశము భౌతికజీవితమునందును, ఆధ్యాత్మిక జీవితమునందును గూడ విశ్వాసమును పునరుద్ధరించుకొనవచ్చును.

భారత దేశమున మతములును, వేదాంతములును ప్రధానస్థానమాక్రమించినవి. కాని భౌతికశాస్త్రములుగూడ వికసించినవి. దేవాలయములను, తటాకములనుగూడ భారతీయులు నిర్మించిరి. దేవాలయములు ఆధ్యాత్మిక జీవన (శక్తి) నిధానములై ఆత్మక్షేత్రముల నుజ్జ్వలింపజేసినవి, తటాకములు భౌతికజీవన (జల) నిధానములై క్షేత్రములను సస్యశ్యామలము నొనర్చినవి. సాధువులు ఆధ్యాత్మిక జవన ప్రవంతులు. ప్రవక్తలు మహానదులు. ఆధ్యాత్మిక నిర్మాణముతోబాటు ఆనాటికి సమృద్ధములైన భౌతిక జీవితవిధానములను గూడ భారతీయులు నిర్మించిరి. ఈ నాడు భౌతికనాగరికతలో మనము వెనుకబడియుంటిమి. పదార్థమును మనము చక్కగ వినియోగించుకొనజాల కున్నాము. పదార్థ విజ్ఞానముకన్న ఆత్మవిజ్ఞానమేల నీరసముకావలెను? ఆత్మశాస్త్రము పదార్థశాస్త్రముకన్న మరింత సమగ్రముగ నుండవలెను. శంకరుని నుండి రామకృష్ణునివరకును స్థాపింపబడిన మఠములలో ధ్యానము సృజనాత్మకము కావలయునని చెప్ప సాహసించుచున్నారు. పాశ్చాత్య శాస్త్రజ్ఞులు, సాపేక్షకులద్వారా తామొక వేదాంతమును, మతమును నిర్మించుకొన ప్రయత్నించుచున్నారు. అట్టి శాస్త్రముచే భారత జీవితమున నవవికాస మేర్పడగలదు.

వేదాంతు లీజగత్తు భౌతికపదార్థముచే నిర్మింపబడినదనువారు కొందరును, మనస్సుచే నిర్మింపబడినదనువారు కొందరునునై యున్నారు. మనోవాదులు ఆత్మ తత్త్వము నంగీకరించువారును, భౌతికవాదులు ఆత్మను నిరాకరించువారునునై యున్నారు. భౌతికవాదులు పదార్థమే సత్యమనియు, ఆత్మ లేనే లేదనియు సిద్ధాంతీకరించి వ్యవహరించుచున్నారు. సత్యము సత్ - అసత్తులు రెండును గూడ ఆత్మ

తత్త్వమున భారతీయులు మనస్సు, పదార్థము ఈ రెంటికి మించి అగాధమైన స్థితికి చనినారు. భారతీయులు సహజాకాంక్షులు, ఆధ్యాత్మిక పరిశోధనాలయములచే ఎక్కువగ తృప్తి నొందును, కేవల భౌతిక పరిశోధనాలయములచేగాదు. పదార్థము కన్న ఆత్మ తక్కువ శక్తిమంతమనుట కాధారములేదు. పరమాణుశక్తికి, ఆత్మశక్తి ఏ విధముగను తీసిపోదు. భారతీయుల సాంప్రదాయానుసారముగ, గాంధిమహాత్ముడు తనజీవితమున చేర్చినగుణసార మిదియే. భారతీయుల వాఙ్మయమునందును, సాంప్రదాయములందును గల ఆధ్యాత్మికశక్తి ప్రదర్శనానుభవములను మరలస్మృతిపథమునకు కొనివచ్చి, ఋజువుచేయవలయును.

ఆత్మశాస్త్రము నాధారముచేసికొనికూడ, శాస్త్రీయపద్ధతులపై ప్రజావినియోగకరమగు విధానముల నన్వేషించి సృష్టింపదగును. బొగ్గు ప్రభావము అనునొక గ్రంథమును కొన్ని దినముల క్రితము చదివితిని. పాశ్చాత్యనాగరికత యంతయు రాక్షసిబొగ్గువలన నుద్భవించిన అధికశక్తిచే నిర్మింపబడినదని ఆ గ్రంథమున నున్నది. భారతదేశము తన నవీననాగరికతను ఏశక్తిచే నిర్మింపగలదాయని నేను ఆశ్చర్యపడుచుందును. మనకు రాక్షసిబొగ్గు తక్కువగా కలదు. మానవులు సమృద్ధిగాగలరు. ఈనాడు మానవులన్నచో మన దేశమునకు భారము పెంపొందించువారుగా నున్నారేకాని లాభదాయకులుగా లేరు. కొన్ని శతాబ్దముల క్రితము రాక్షసిబొగ్గుకూడ ఒకరకమైన మట్టిగను, బాధించునదిగను తలపోసిరి. అంతలో ఒక యింజనీరు బొగ్గులోశక్తియున్నదని కనిపెట్టి, ఆశక్తిని వినియోగించు మార్గములను కనిపెట్టెను. అప్పటినుండియు ఆశక్తి ప్రజలకు వినియోగపడినది. భగవంతుడు రాక్షసిబొగ్గును సృష్టించుటకంటె మానవుని సృష్టించుట కెక్కువకాలమును తీసికొనెననుటయు, మానవునిలో తనశక్తిని ఎక్కువగా నింపెననుటయు సుస్పష్టమే. ఈ అత్యధిక మానవశక్తితో మన నాగరికతను నిర్మించుకొనరాదా? ఈనాడు మానవుడు అధికశక్తి లేనివాడనుట నిజమే. కాని ఏ యింజనీరు అయినను మానవునిలో నిద్రాణమైయున్న శక్తిని వికసింపజేసి దానిని నాగరికతా నిర్మాణమున వినియోగింపగలిగినచో నెంత బాగుండును? అట్టివాడు రాక్షసిబొగ్గులోని శక్తిని వెలికితీసి పాశ్చాత్యనాగరికతను నిర్మించినవానికంటె గొప్పవాడై మహత్తరమైన నవీనభారతీయ నాగరికతను నిర్మింపగలవాడగును.

ఆత్మశాస్త్రమును, మానవుల యింజనీర్లను తయారుచేయుట భారతదేశపు బాధ్యత అని నేను విశ్వసింతును. పవిత్ర గోదావరీ తీరమున వెలసిన ఈ శ్రీ రామకృష్ణమఠము తన పూర్వ సాంప్రదాయముల ననుసరించి, ఆత్మశాస్త్రమును ఆవిష్కరించుటకును, మానవుల 'యింజనీర్లను' సృష్టించుటకును, తగిన సృజనాత్మకజ్ఞానమును గూర్చువారి కాలయముగ నుండునని విశ్వసించుచున్నాను. అందుచే ఈ మఠమువారి ఆదర్శములు రెండును—ధ్యానము, సేవ—అనునవి రెండును సమృద్ధములును, సమగ్రములును అగును.



# వి న య ప త్రి క

మూలం
శ్రీ తులసీదాస గోస్వామి

అనువాదం:
క్రాంతికర్

(గతసంచిక తరువాయి)

౧౨౧

రామనామముతోబాటు రామభద్రుడును నెవరికి ప్రియతముడుగాడో వారికీ భయంకర మగు కలికాలమున ఆదిమధ్యావసానములం దెపుడును మేలుగలుగదు. రామనామమహిమ నెఱిగి అహంకార, లోభ, అజ్ఞాన, క్రోధ, కామములు భయమందుచున్నవి. రామనామము నెల్లపుడు స్మరించు మహాత్ములకు కఠినమగు నాతపముగూడ నీడనిచ్చును. రామనామ ప్రభావముచే రాతిపై తామరమొల కెత్తునని యెవరైన జెప్పవో నందతిశయోక్తి యావంతయులేదు. ఈ రామనామమును విని, స్మరించి భిల్లస్త్రీ యగు శబరి భాగ్యవంతురాలు, పుణ్యాత్మురాలునైనది. వాల్మీకి, యజామిళులు ఈ రామనామమును తలక్రిందులుగ నుచ్చరించి సద్గతినందిరి. అట్టి ఈ నామము రామునికంటె నెక్కుడు సామర్థ్యముగలది. ఇది మూఢులనుసైతము చతురులనొనర్చినది. ఈ నామమును జపించియే తులసీదాసునివంటి మహాపాపి ఢంకాబజాయించి పుణ్యాత్ముడైనాడు.

౧౨౨

ఓ దీనబంధూ!

నీవంటి ప్రభువు మరియొకడు నాకెచట దొరకును? నీవుగాక ఇతరుల బాధనెఱిగిన వారెవరు? నే నెవరికి నాదైన్యమును వినిపింతును? నే నెన్నో ప్రదేశములకేగి యెందఱనో స్వాముల జూచితిని. కాని యందఱును దయాహీనులే. ఎవరైన దయాళువులున్న వారయోగ్యులు. మనోభావమును వ్యక్తపఱచి ఏల లాఘవమందవలెనని దలచి వారియెదుట నోరుమెదపనైతిని. పుడిసెడు నీటిలోమునిగి చావదగిన పాపకార్యములెన్నో ఆచరించియు లోకులయెదుట మహాజ్ఞానివలె నటింతును. నేను దురాశాపరుడను. నా మనసు కామమునకు దాసురాలు. అయినను నేను 'నీవాడ' నని చెప్పుకొనుచున్నాను.

ఓ ప్రభూ!

నీవు నాహృదయమునందలి భావాలనన్నిటి నెఱుంగుదువు. అయినను నేను స్వయముగ విన్నవించుకొనుచున్నాను. కపటమును వీడి నీ ద్వారమువద్ద నీ గుణముల బాడుచు పడియుండునటుల నేదైన ఉపాయమును చేయుము.

౧౨౩

ఉత్తమమగు నీ జీవనము వ్యర్థముగ గడచిపోయినది. పరమార్థము లభ్యముగాకపోవుట యటుండ నిత్యము అవినీతి హెచ్చుచున్నది. బాల్యము ఆటపాటలలో, ఆహారవిహారములలో గడచినది. యౌవనమును స్త్రీలు జయించిరి. తత్ఫలితముగ పరమార్థమునకగు సాధన

మేదియు దొరకకపోగా ముసలితనము రోగ, వియోగ, శోక, పరిశ్రమల కాకరమైనది. ఈ విధముగ నా పెద్దవయస్సు వ్యర్థముగ గడచిపోయినది. ఇంద్రియ విషయప్రేమ, క్రోధము, ఈర్ష్య, మోహము—వీనికి వశుడనగుటవలన సజ్జనసమాజము హితవుగాలేదు. శ్రీరామచంద్రుని గుణముల స్వయముగ కీర్తింపలేదు. ఇతరులనోట వినలేదు. ఆతనిచరణముల ప్రేమింపలేదు. అసహ్యాకరములగు సాంసారిక యాతనల గురించి విని నాహృదయమిపుడు పశ్చాత్తాపమనెడు నగ్నిచే దహింపబడుచున్నది.

ఓ ప్రభూ!

తులసీదాసు చెప్పునదేమన—నీవే నీకీర్తిని యోజించి నన్నుద్ధరించు మార్గ మేదైన కనుగొనుము.

## ౧౨౪

ఓ రసనా!

నీవు శ్రీరాము నేల జపింపవు? రాత్రింబవళ్లు ఇతరుల నిందించి వ్యర్థముగ నేల వాసనల బెంచికొందువు? మనుజుని ముఖమనెడు పవిత్రమగు మందిరముననుండి దానిని సిగ్గుపరచకుము.

చంద్రుని సమీపముననుండియు అమృతమును వీడి ఎండమావులకై యేల పరుగిడెదవు? కలికైరవ చంద్రికయగు కామకథను మిక్కిలి ప్రేమతో చెవియొగ్గి విందువు. అదివీడి భగవంతుని సుందరమగు కీర్తి నుగ్గడింపుము—చెవులయందలి కల్మషము తొలగునట్లు, బుద్ధియనెడు బంగారమును, యుక్తులనెడు మణులను బొదిగి అందమగు మాలనుజేసి శరణాగతవత్సలుడు, రవికులసరోజరవియగు శ్రీరామచంద్ర మహారాజునకు కానుకపెట్టుము. వాదవివాదములయందలి యభిరుచిని వీడి భగవంతుని భజనసేయుము. ఆయన మధురతర చరిత్రను గానముసేయుము. ఇందువలననే యీ తులసీదాసు సంసారసాగరమును దరియింపగలడు. మూడు లోకములయందును నీవు పవిత్రమగు కీర్తినందెదవు. విమలమగు నీ యశస్సు వ్యాపింపగలదు.

## ౧౨౫

ఓ శ్రీరామచంద్రా!

ఎవరియెడల నీవు ప్రసన్నుడవగుదువో వారే పుణ్యాత్ములు, పవిత్రులు. వేశ్య, జటాయువు, కిరాతుడు వైకుంఠమునకేగిరి, వారే నాడు ప్రయాగలో పిడుకలదాలిలోపడి చచ్చిరె? నృగమహారాజు వేదోక్తమార్గము నేనాడును వీడలేదు, అయినను ఆయన యెంతకఠినమగు యాతన ననుభవింపవలసివచ్చెనో లోక మెఱుగును. గజేంద్రుడే గురునియొద్ద ఉపదేశమందెను? ఒక్కమారు నిన్ను స్మరించినంతనే వాహనమునువీడి, సుదర్శనచక్రమును గైకొని పరుగిడితివి! దేవతలు, మునులు, బ్రాహ్మణులు—ఉన్నతకులముల నన్నిటిని వీడి గోకులమున యాదవునింటిలో జన్మించితివి. దుర్యోధనుని వైభవమునుగాదని విదురునింట విందారగించితివి. నీభక్తు లేదిచేసినను నీకు మంచిదిగనే దోచును. నీ యీ పద్ధతిని అర్జునుని యొద్ద కొలదిగ ప్రదర్శించితివి.

తులసీదాసు చెప్పునదేమన— శ్రీరామచంద్రుడు సహజప్రేమ కధీనుడు. నీటివల్లనైన నునుపువలె నితరసాధనము లన్నియు వ్యర్థములు. (సశేషము)



# సంఘ వార్తలు

# రాజమహేంద్రవరమున రామకృష్ణమఠ స్థాపనమహోత్సవము

పూర్వ మొకప్పుడు సాధారణ కార్యదర్శిగా నుండిన శ్రీ మాధవానందస్వామివారు 1951-వ సంవత్సరము ఫిబ్రవరి 8-వ తేదీ గురువారము నాడు రాజమహేంద్రవరమున శ్రీ రామకృష్ణ మఠమును విధ్యుక్తముగ ప్రతిష్ఠాపన గావించిరి. శ్రీరామకృష్ణ చిత్రపటావిష్కరణానంతరము ప్రత్యేక పూజా హోమములుగావించిరి. మహాప్రసాదమును మూడు వేలకు పైబడిన భక్తులారగించిరి.

నాడు సాయంకాలము మఠావరణలో శ్రీ మాధవానందస్వామివారి యధ్యక్షతను బహిరంగ సభ జరుపబడినది. మఠస్థాపనకు ముఖ్య కారకులగు శ్రీ దువ్వూరి రామకృష్ణారావుగారి శ్రద్ధాభక్తులను, వదాన్యతను సూచించుచు శ్రీరామకృష్ణునియొక్కయు, శ్రీ వివేకానంద స్వాములవారియొక్కయు ఉపదేశామృతముల ననుసరించవలసినదిగా శ్రీమాధవానందస్వాములవారు సభ్యులను హెచ్చరించిరి. ఇతర వక్తలు పలువురు రామకృష్ణసంస్థ దేశదేశముల ప్రజాసేవకై యొనర్చుచున్న యుత్కృష్ట కార్యములను పొగడి మఠస్థాపనవలన రాజమహేంద్రవరమునకు కలిగిన సౌభాగ్యమును కొనియాడిరి.

మహోత్సవము మూడుదినములు జరిగినది. మద్రాసు రామకృష్ణమఠాధ్యక్షులగు శ్రీ కైలాసానందస్వాములవారు, 9-వ తేదీ సాయంకాలమును, మారిషస్ దీవులయందలి రామకృష్ణమఠాధిపతులు, శ్రీ నిశ్రేయసానంద స్వాములవారు 10-వ తేదీ సాయంకాలమును వరుసగ అధ్యక్షత వహించిరి.

ఉత్సవము నాలుగుదినములును గానసభలతో హరికథా కాలక్షేపములతో వేనవేలు భక్తులు ఆనందించిరి.

11-వ తేదీ ఆదివారము సాయంకాలము శ్రీ శొంఠి రామమూర్తి పంతులుగారి (Adviser for Food to the Govt. of India) అధ్యక్షతను బహిరంగ సభ జరిగినది. శ్రీ మాధవానందస్వాములువారును శ్రీ నిశ్రేయసానందస్వాములవారును ముఖ్యముగ వక్తృత్వమును వహించిరి. ఆంధ్రదేశమునకు పట్టుగొమ్మయు చారిత్రక ప్రసిద్ధిగన్నట్టియు రాజమహేంద్రవరమున రామకృష్ణమఠస్థాపనచే, తమకు కల్గిన సంతోషాతిశయములను వెలిబుచ్చి, హైందవనాగరకతాభ్యున్నతిని తెలియజెప్పి, పవిత్ర గోదావరీ నదీతీరమున వెలసిన ఈ మఠము సహజ ఆధ్యాత్మికపరిసరములతో ధ్యానభావనచే పరమశాస్త్రమును కల్పించి శాస్త్రయుక్తమగు సేవ కనువగు మానవవ్యాపారమును నిర్మింపగలదని శ్రీరామమూర్తిగారు తమ ఆశయమును విశదీకరించిరి. ధ్యానము, సేవ అను రెండు విషయములను గూర్చి వీరు గావించిన ఉపన్యాసమును ఈ సంచికయందే ప్రకటించితిమి.

ఈ కేంద్రాధ్యక్షులు శ్రీ నిత్యబోధానంద స్వాములవారి ధన్యవాదములతో ఉత్సవము ముగిసినది.



సంపాదకులు: శ్రీ ఋతజానందస్వామి; శ్రీ వెలగపూడి వేంకటకృష్ణరావు
శ్రీ కే. ఎస్. ఎన్. రాజన్ గారిచే ది జ్యూపిటరు ప్రెస్సు లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి,
శ్రీ ఆదిదేవానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 20-3-51.

# విషయసూచిక



# శ్రీ రామకృష్ణ ప్రభ

## చందాదారులకు

౧. పత్రిక ప్రతిమాసము 20-వ తేదీన వెలువరింపఁబడును. ఒక వారము, పదిరోజులు చూచి ప్రతి మీకు అందకపోయినయెడల ఉత్తరము వ్రాయుఁడు.

౨. సంవత్సర చందా రు. 3 లు మాత్రమే. జనవరినెల నుండిగాని జూలై నెల నుండిగాని చందాదారులుగఁ జేరవచ్చును. ఇతర మాసములలోఁ జేరదలచు వారికి జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని సంచికలు చేర్చిపంపఁబడును. విడిప్రతి రూ. ౦—౬—౦ లు. హిగిన్‌బాదంస్ వారి స్టాలులోఁగాని, మీ పత్రిక ఏజెంటును గాని అడుగుఁడు.

3. ఉత్తర ప్రత్యుత్తరములు వీలైనంతవఱకు ఇంగ్లీషున వ్రాయుచు మీ చందాదారు సంఖ్య నుదాహరింపుఁడు. ఉత్తరములను "మేనేజరు, శ్రీరామకృష్ణప్రభ" అను చిరునామాకు వ్రాయుఁడు.

౪. చిరునామాయందు ఎట్టిమార్పుగలిగినను 10-వ తారీఖునకు ముందుగా మా కార్యాలయమునకుఁ దెలుపవలయును. లేనిచో, పత్రిక పూర్వపు చిరునామాకే పంపఁబడును.

## వ్యాసకర్తలకు

౧ కేవలము నైతిక ధార్మిక వైజ్ఞానిక విషయకములైన వ్యాసములేకాక, సాహిత్యమునకును కవిత్వమునకును సంబంధించిన ఏ వ్యాసములైనను బంపవచ్చును. సులభ సుందరమగు గ్రాంథిక భాషలో వ్రాయవలయును.

౨. వ్యాసములు అచ్చులో మూఁడు పుటలకు మించరాదు. ప్రతినెల ఒకటవ తేదీకి వ్యాసములు మాకు అందవలెను.

3. వ్యాసములను, విమర్శకుఁ బంపు గ్రంథములను, వినిమయముగఁ బంపెడి పత్రికలను "సంపాదకుఁడు, శ్రీరామకృష్ణ ప్రభ శ్రీరామకృష్ణ మిషన్ స్టూడెంట్స్ హోమ్, మైలాపూరు, చెన్నపురి" అను చిరునామాకు వ్రాసి పంపవలెను.

౪. వ్యాసము తిరుగఁ బంపఁబడవలయుననుచోఁ దగు పోస్టేజి చేర్చి పంపవలయును.




# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౭ } ౧౯౫౧ - ఏప్రిల్ · · ఖర - చైత్రము } సంచిక ౧౦


## ప్రార్థన

### శారదా స్తోత్రము

నమస్తే అభయా వరదా విజయా, మోక్షదా-జ్ఞానదా దేవీ శారదే
నమస్తే అమితా శక్తిజ్ఞానాతీతా, అవ్యక్త-అరూపా యోగిజనధ్యానాతీతా
భక్త-చిత్త-హరా-విమలా-దేహాతీతా— అవ్యయసనాతనీ ప్రకృతి శారదే!

నమస్తే వ్యక్తా ఆకాశరూపిణీ, అనంతకళ్యాణి ఆనందదాయినీ
జ్యోతిప్రవాహా శక్తిసనాతనీ— ఇందునివాసినీ ఇందుమయీ శారదే!

నమస్తే మహాశక్తి అనుభూతిరూపిణీ, ఆశ-ప్రీతి-తృషా లజ్జానురాగిణీ
మదన-మాదన-చేతనా-విధాయినీ— కనకవరణీ-ఉషా-అరుణా శారదే!

నమస్తే అమియా అమలా కమలా, నిత్య-కుశలా, సకలా శశికళా
విపుల-పులక-మయీ-ఆలోక ఉజ్జ్వలా— మానస-తామస-నాశినీ శారదే!

నమస్తే బ్రహ్మాణీ-వైష్ణవీ-శివానీ, గీతా-గాయత్రీ సావిత్రీ భవానీ
దృశ్యరూపిణీ-విశ్వవ్యాపినీ, త్రిగుణరూపిణీ-మహామాయా శారదే!

—శ్రీ మణీంద్రమోహన్ ఛాకీ

ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ

# శ్రీ రామకృష్ణ వచనామృతము—'మ.'

## గురు శిష్య సంవాదము

7-9-1883.

దక్షిణేశ్వరాలయమున శ్రీరామకృష్ణులు తమగదిలో గూర్చొని 'మ.' తో మాట్లాడు చుండిరి. రాత్రి సుమారు ఏడుగంటలయినది.

శ్రీరామ:—ఆనాడు కలకత్తా వెళ్లుచుంటిని. బండిలో బోవుచుండగా జీవములన్నియు నిమ్న దృష్టితో నున్నట్లు నాకు గనిపించెను. అందఱకు గూడ నొకటే ఉదరపరాయణత్వమే! ఎట్లు ఉదరపోషణము గావింపగలమా యన్న ప్రయత్నమే! అందఱి మనస్సులును కామినీకాంచన ములవైపునకే పోవుచుండెను. ఒకరిద్దరకు మాత్రమే యూర్ధ్వదృష్టి యుండెను. వారి మనస్సు భగవదున్ముఖమై యుండెను.

'మ.'—ఈ కాలమున ఉదరపరాయణత్వ మెక్కుడగుచున్నది. పాశ్చాత్త్యదేశీయానుకరణమువలన నేటి ప్రజలకు విలాసజీవనాసక్తి యధికరించినది. కావుననే వారికి లోటు కనిపించుచున్నది.

శ్రీరామ:—పాశ్చాత్త్యులకు భగవానునియం దెట్టి యభిప్రాయము గలదు?

'మ.'—వారందఱును నిరాకారవాదులు.

శ్రీరామ.—మనయందును అట్టి మతము గలదు.

శ్రీరామకృష్ణులు కొంతకాల మూరకుండిరి. పిదప తమ బ్రహ్మజ్ఞానావస్థనుగూర్చి యిట్లు పలుకదొడగిరి.

శ్రీరామ:—ఒకనాడు ఎచ్చట జూచినను అఖండ చైతన్య స్వరూపమును గాంచితిని. మొట్టమొదట అనేకమనుష్యులు జీవజంతువులు—అన్నియు గోచరించినవి. ఆమానవులలో, గొప్పవారు, ఆంగ్లేయులు, ముసల్మానులు, నేనుగూడను, పాకీవారు, కుక్కలు, వీనితోబాటు గడ్డము పెంచుకొన్న సాహెబు మల్లయుందు కొంచెము అన్నము పెట్టుకొనియుండుట—ఇవన్నియు నాకు గోచరించినవి. అతడు అన్నమును దీసికొని వచ్చి యందఱి నోళ్లలో కొంచెము కొంచెముగా బెట్టిపోవుచుండెను. నేనుగూడ రుచి చూచితిని.

మఱియొక దినమున, బియ్యము, కూరగాయలు మున్నగు నితర ఖాద్యవస్తువుల తోబాటు మలమూత్రములు బడియుండుట జూచితిని. హఠాత్తుగా నాలోనుండి జీవాత్మ బయటబడి యగ్నిశిఖవలె నా వస్తువులనన్నింటి నాస్వాదించెను—మలమూత్రములగూడ భుజించెను. దీనినిబట్టి ఒకే అభేదచైతన్యమే వివిధ

రూపములతో ప్రకాశించుచున్నట్లు నాకు దెలుపబడినది.

మఱియొకనాడు, నాకు ఆ ప్రతిశిష్యులున్నట్లు ఎఱిగింపబడినది. వారు నాకత్యంతము కావలసినవారుగా కనిపించిరి. దేవాలయమున శంఖా ఘంటా నినాదములు చెలరేగగా నేను నా కుటీరము కొప్పున కెక్కి నలువైపుల జూచుచు, 'ఓరీ! మీరందఱు నెటుపోయితిరి! మిమ్ము జూడక నా ప్రాణము పోవుచున్నది. త్వరగా రండు' అని కేకలు పెట్టుచుంటిని.

సరే యీ దర్శనముల గూర్చి నీ యభిప్రాయమేమి?

'మ.' —మీరు భగవంతుని లీలాస్థానము. నాకు దెలిసినంతవఱకు మీరు యంత్రము, ఆయన యంత్రి. జీవరాసుల నన్నింటిని ఆయన యంత్రముద్వారా తయారుచేసెను గాని మిమ్ము మాత్రము తన రెండు చేతులతో తయారుగావించెను.

శ్రీరామ.—సరే! దర్శనానంతరము షడైశ్వర్యములు గలుగునని హజ్రా పలుకును.

'మ.' —శుద్ధభక్తిని గోరువారల కైశ్వర్యముతో పనిలేదు.

శ్రీరామ —ఒకవేళ హజ్రా పూర్వజన్మమున దరిద్రుడై యుండవచ్చును! అందుచేతనే కాబోలు నైశ్వర్యములయెడ నాతని కంతటి యాసక్తి! నేను వంటలవానితో చెప్పెడిదంతయు నాతనికి కావలయును. 'నీవేమియు వంటవానితో జెప్పవలదు. నేను యజమానితో సంప్రదించి నీకు కావలసినదంతయు నిటకు జేరునట్లు చేయుదునులే' యని నాతో నాతడు పలుకువాడు.

'మ.' బిగ్గరగా నవ్వసాగెను.

శ్రీరామ —(నవ్వుచు) అట్లు ఆతడేదో చెప్పుచునుండగా నేనూరక గూర్చొని వినుచుందును.

'మ.' —శుద్ధభక్తులయం దీ యైశ్వర్యము లేవియు గనుపింపవని మీరే పలికియున్నారు. శుద్ధభక్తుడు భగవానుని గోపాలరూపమున జూడ నభిలషించును. మొదట భగవానుడయఃకాంతమువంటివాడును, భక్తుడు సూదివంటివాడునై యుందురు. కాని చివరకు భక్తుడయఃకాంతమై భగవంతుడే సూది యగును. అనగా భగవానుడు భక్తుల యెదుట సులభుడై యుండును.

శ్రీరామ —అవును. అది ఉదయించుచున్న సూర్యునివంటిది. అపుడు అనాయాసముగ సూర్యుని జూడవచ్చును. అపు డాతని కిరణజాలము కండ్లను గ్రుచ్చకపోవుటయేకాక జూడ నింపుగగూడ నుండును. భగవానుడు భక్తులకొఱకు మార్దవమును స్వీకరించును. తన యైశ్వర్యమంతయు త్యజించి భక్తుల యెదుటికి వచ్చును

ఇరువురును కొంతసేపు మిన్నకుండిరి.

'మ.' —మీ దర్శనములన్నియు నేల సత్యములు కాకూడదా యని నాకు తోచుచున్నది. అవియే యసత్యములయిన నీ సంసారమంతకంటె నసత్యము. ఏలనన మనస్సు ఒకానొక యింద్రియమాత్రమే. మీ దర్శనములన్నియు మీ శుద్ధమనస్సున ప్రస్ఫుటించుచున్నవి. కాని మేమెల్లరము మనస్సు మూలమున సాంసారిక విషయముల దెలిసికొనగలుగుచున్నాము.

శ్రీరామ.—ఓహో! నీవిపుడు నిత్యానిత్య

వస్తువుల గుర్తింపగలుగుచున్నావే సరే, హాజ్రా యెట్టివాడో చెప్పుము.

'మ.' —అత డొకానొక తరహా మనిషి. (అని యిరువురును నవ్వుదురు.)

శ్రీరామ —సరే, నాయట్టివాని నెందయి నను జూచితివా?

'మ.' —లేదండి.

శ్రీరామ —మఱి యే యితర పరమ హంసలవలె నయినా నే నున్నానా?

'మ.' —లేదండి, మీకు పోలిక లేదు.

శ్రీరామ —(నవ్వుచు) పేరులేని చెట్టు నెపుడయినా విన్నావా?

'మ.' —లేదండి.

శ్రీరామ —ఏదో ఒక చెట్టున్నదట దానిని జూచి యెవరును గుర్తింపలేకపోయిరట

'మ.' —చిత్తము, మిమ్మెవరును గుర్తిం: జాలరు. మిమ్ము ఎంతగా గుర్తించునో అంత తకు మానవు డున్నతిని పొందుచుండును.

'మ.':—మిన్నకుండి, (తనలో) శ్రీరావ కృష్ణులు ఉదయకాలపు సూర్యుడు, గుర్తిం: రానిచెట్టు—వీనినన్నింటిని దెలుపుచున్నారే ఏమి, వారు అవతారపురుషులా? ఇది వా: మానవలీలయా? ఇందులకేనా కుటీరముపై నుండి తన ఆంతరంగికశిష్యులను 'మీరందఱును నా దగ్గరకు రండి' యని పిలుచుట!

---

శ్రీకృష్ణభగవానుఁ డసలు జన్మించెనా యను విషయము మనము నిర్ణయింపఁజాలము, బుద్ధుఁడు, చైతన్యుఁడు మున్నగు నవతారమూర్తు లొకేస్వరమున నొకేపాట పాడిరి, రామకృష్ణపరమహంసయో, అతినవీనుఁడు, అఖండ పరిపూర్ణుఁడు. జ్ఞానభక్తివైరాగ్యములు, ఔదార్యము, విశ్వమానవ సేవేచ్ఛ—ఇవన్నియుఁ గేంద్రీకృతమై యాతనియందు మూర్తీభవించినవి. కావున రామకృష్ణునకు సాటి యెవ్వరు? ఆతని గణుతింపఁజాలని వాని జన్మము నిరర్థకము! జన్మ జన్మాంతరములందును నాతనిసేవకుఁడ నగుటయే నా మహాభాగ్యముగా గణింతును, ఆతఁ డాడిన యొక్కమాట వేదవేదాంతములకంటెను నాకు విశేషమాననీయము. తస్య దాసదాసదాసోఽహమ్—ఆహా! ఆతని దాసదాసానుదాసుఁడను నేను. సంకుచితబుద్ధియు స్వమతదురభిమాన మును నాతని సిద్ధాంతములకుఁ గేవల విరుద్ధము. సంకుచితబుద్ధియునిన నా కొడలుమంట. ఆతనిపేరు విస్మరింపఁబడినను సరియే, ఆతని యుపదేశములు మాత్రము ఫలించుఁగాక!

—శ్రీ వివేకానందస్వామి

# ధర్మ పరిశీలన

## విశ్వమత సిద్ధికి మార్గము

### శ్రీ వివేకానందస్వామి

(జనవరి సంచిక తరువాయి)

దుఃఖమునకు నేను కారణభూతుడను కా గలుగుచో, దానిని తొలగించుశక్తికూడ నాకు గలదు. దీని అనివార్య ఫలితముగ, మనము స్వతంత్రులమను విషయమేర్పడుచున్నది. ప్రారబ్ధగతియనున దేదియును లేదు. మనలను నిర్బంధించున దేదియు లేదు. మనము చేసిన కర్మను నాశనముచేయ గలము.

ఈ సిద్ధాంత సందర్భమున నొక వాదము నోరిమితో గమనింప మిమ్ము వేడుచున్నాను. ఎందుచేతననగా, అది కొంచెము క్లిష్టమైనది. అనుభవద్వారమున నే మన జ్ఞానమునంతయును సంపాదించుచున్నాము. జ్ఞానార్జనమున కింత కంటె వేరె మార్గమేదియును లేదు. అనుభవములని మనము చెప్పునవి బుద్ధికి, ప్రజ్ఞావస్థకు సంబంధించినవి. ఇందుల కుదాహరణము · గానపేటికి (పియానో) పై నొక డొక పాటను ప్రయోగించునపు డతడు బుద్ధిపూర్వకముగ తన చేతివ్రేళ్లతో, పేటికయందుగల ప్రతి మెట్టు నొక్కుచుండును. వ్రేళ్ల చలన మొక యభ్యాసముగా నేర్పడువరకును, అతడీ పద్ధతినే మరల, మరల ననుసరించుచుండును. ఇది పరిపాటియైనప్పుడు, ప్రత్యేకమైన మెట్టును నొక్కుచున్నానా లేదా యను విషయమును విశేష శ్రద్ధతో గమనింపకుండగనే అతడు పాటను పలికించును. ఇదేవిధముగ మన స్వవిషయమున. మన సంస్కారములు బుద్ధిపూర్వకముగ మనముచేసిన పూర్వకర్మల ఫలితములని గ్రహింతుము. ఒక శిశువు కొన్ని ప్రత్యేకసంస్కారములతో పుట్టును. ఇవి యెక్కడనుండి వచ్చుచున్నవి? ఏపాపగాని భావమేదియు లేని శూన్యమనస్సుతో పుట్టుట లేదు. దాని ప్రత్యేకభావ సంపుటి యింతకు పూర్వమే యేర్పడియుండినది. ఏశిశువును కేవల రిక్త చిత్తముతో జన్మించియుండలేదని, ప్రాచీన గ్రీకు, ఐగుప్తీయ తత్త్వజ్ఞులు బోధించియున్నారు. పూర్వజన్మలలో బుద్ధిపూర్వకముగ జేసిన కర్మల ఫలితముగా ప్రతి శిశువును వందలకొలది సంస్కారములతో బుట్టుచున్నది. అవి యన్నియు దానికి ఈజన్మలో కలుగలేదు. అవి పూర్వజన్మలలో కలిగినవని మన మొప్పుకొనక తప్పదు. ఎంత గాఢ చార్వాకవాదియైనను, ఈ సంస్కారములు పురాకృత కర్మఫలితములని అంగీకరింపక తప్పదు. అయితే, యివి వంశపారం

పర్యముగ సంక్రమించుచున్నవని వారు చెప్పుదురు. మన తల్లిదండ్రులు, తాత ముత్తాతలు మనకీ వంశపారంపర్య ధర్మానుగుణముగ లభించుచున్నారు. వంశపారంపర్య ధర్మ మొకటి మాత్రమే యిందు కాధారమైనచో, ప్రతి విషయమును శరీరమే నిర్ణయించుచుండును. ఇక ఆత్మ యున్నదని నమ్మవలసిన యావశ్యకతయే యుండదు. ఆస్తిక, నాస్తిక మతములనుగురించిన వివిధ వాదములను, చర్చలను మనము విపులముగ బరిశీలింప నక్కరలేదు. ఇందువలన జీవాత్మ కలదని నమ్మువారికి ఋజుమార్గ మేర్పడుచున్నది. న్యాయమైన నిర్ణయమునకు రావలయుననిన, మనకు పూర్వజన్మ లుండినవని మన మంగీకరింపక తప్పదని గ్రహింపవలసియున్నాము. ప్రాచీన తత్త్వశాస్త్రజ్ఞులయు, మహర్షులయు విశ్వాస మిదియే. ఈ సిద్ధాంతమును యూదులు నమ్మినారు, ఏసుక్రీస్తు నమ్మినాడు. బైబిలులో "అబ్రహాము పుట్టక పూర్వము నేనున్నాను" అని యొకచోటను, "ఈ రూపమున ఈలియస్ వచ్చినట్లు చెప్పుదురు" అని మఱియొకచోటను ఆయన నుడివియున్నాడు.

వేర్వేరు సందర్భములందును, స్థితిగతులందును వివిధజాతులలో ప్రబలిన వివిధ మతములకును ఆసియాఖండమే పుట్టినిల్లు కావున, ఆసియావాసుల కవియన్నియు బాగుగా తెలియును. అవి తమ జన్మస్థానమును విడిచి, బయటకు వచ్చినప్పుడు దోషభూయిష్ఠములైనవి. క్రైస్తవమతములోని మహోదార భావములు, యూరపుఖండ వాసుల కెన్నడును బోధపడలేదు. ఎందుచేతననగా, బైబిలుగ్రంథ కర్తల భావములును, కల్పనాచిత్రములును యూరపుఖండమునకు విజాతీయములు. ఉదాహరణకు, మడొన్నా చిత్రపటములను దీసికొనుడు. ప్రతి చిత్రకారుడును తాను ముందుగ నేర్పఱచుకొనిన సొంతభావములను బట్టి తన మడొన్నా చిత్తరువును లిఖించును. ఏసుక్రీస్తు కడపటి భోజన చిత్రపటములను వందలకొలది చూచుచున్నాను. ఆయన యొక బల్లయొద్ద కూర్చుండినట్లు చిత్రించుచున్నారు. ఎన్నడును, క్రీస్తు బల్లయొద్ద కూర్చుండియుండలేదు. ఇతరులతో గలసి యాయన నేలపై పద్మాసనము వైచుకొని కూర్చుండెను. వారొక గిన్నెలో రొట్టెను ముంచుకొనుచుండిరి. ఆ రొట్టె మీరు నేడు తిను రొట్టెవంటిది కాదు. ఏజాతివారికైనను తమకు అపరిచితములైన ఇతరుల ఆచారములను గ్రహించుట కష్టము. ఇట్టి సందర్భములో, గ్రీకులు, రోమనులు మొదలగు ప్రజల సంపర్కమువలన వందలకొలది యేండ్లలో మార్పుల, చేర్పుల నెన్నిటినో పొందిన యూదుల ఆచారములను యూరపు వాస్తవ్యులు గ్రహించు టెంత కష్టము? అసంగతములైన పుక్కిటిపురాణములతో రాను రాను నిండినదగుటచే, ఏసుక్రీస్తుని తొల్లిటి సుందర మతము, వారికి బహు స్వల్పముగ మాత్రమే లభించుటలో నేమి, వారు దాని నొక నవీన వ్యాపారవస్తువుగ ప్రచారము చేయుచుండుటలో నేమి ఆశ్చర్యమేమియును లేదు.

ప్రస్తుత విషయప్రసక్తికి గడంగుదుముగాక! జీవాత్మ శాశ్వతమని దాని తేజస్సు కొఱవడినదని సర్వమతములును బోధించుచున్నవనియు, భగవత్ జ్ఞానముచేతనే దాని తొల్లిటి ఛవి ప్రతత, విశుద్ధతత్త్వము పునఃస్థాపితము కావలసియున్నదనియు మనము గ్రహించుచున్నాము.

భగవంతునిగురించి ఈ వేర్వేరు మతముల అభిప్రాయమేమి? భగవంతునిగురించిన బహు ప్రాచీన భావము మిక్కిలి అస్పష్టముగ నుండెను. అతి పురాతన జాతులకు, సూర్యుడు, భూమి, అగ్ని, జలము మొదలగు వివిధ దేవత లుండిరి. ప్రాచీన యూదులలో ఈ దేవతలు పెక్కం డ్రొకరితో నొకరు భయంకరముగ పోరాడుచుండినట్లు మన కగుపడును. పిమ్మట, యూదులును, బాబిలోనియన్లును ఇలోహిమును కొలిచినట్లు గ్రహింపగలము. అటు తరువాత, ఒకే భగవంతుడు సర్వోత్తముడై వెలయుచుండినట్లు మనకు తెలియవచ్చుచున్నది. కాని ఈ విషయమున వివిధజాతులకు వివిధ భావములుండెను. వారిలో ప్రతి జాతియు తన దేవుడే యుత్తమోత్తముడని వాదించుచు, తన వాదమును పోరాటముచే ఋజువుచేయ బ్రయత్నించుచుండెను. అందరిలో మిక్కిలి బాగుగ పోరాడినజాతి తన పోరాటపు ఫలితముగ తన దేవుడుత్తమోత్తముడని ఋజువు చేయుచుండెను. ఆజాతులు ప్రాయికముగ అనాగరకజాతులు. కాని, కాలక్రమమున ఈప్రాచీన భావములు మూలబడిపోయి, శ్రేష్ఠతర భావములు ప్రబలినవి. ఆ మతములన్నియు కొన్ని శతాబ్దముల కృషిఫలితముగ పెంపొందినవేకాని, ఆకాశమునుండి యూడిపడిన దందొక్కటియును లేదు. వానిలో ప్రతిదియు ఆనాటికానాడు కొంచెము, కొంచెమెక్కువగ కృషిచేయవలసియే యుండెను. ఇటుపిమ్మట, ఏకేశ్వరభావములు అనగా సర్వశక్తిమంతుడును, సర్వజ్ఞుడును, విశ్వేశ్వరుడు నగు భగవంతు డొకడే యను విశ్వాస ప్రధానములగు భావములు బయలుదేరినవి. ఈ భగవంతుడు విశ్వమున కతీతుడు, పైన ఆకాశమందెక్కడో నివసించును. ఇతనిని కల్పించినవారి యూహల ప్రతిబింబమే యితడు – కుడి, యెడమ ప్రక్కలుగలిగి, చేత నొక పక్షిని బట్టుకొని, యీ విధముగ నెన్నో విశేషాలంకారములతో నితడు వెలయుచుండును. అయితే, ఒక్క విషయము మాత్రము నిశ్చయము. అనాగరకజాతుల దేవతలెల్ల సమూలముగ నశించిపోయి, వాని స్థానమున నేకైక విశ్వేశ్వరుడు సుస్థాపితుడయ్యెను. ఇతడే దేవదేవుడు – కాని, ప్రపంచములోన నుండక దానికి వెలుపట నుండువాడు, అప్రాప్యుడు. ఏదియు వాని చెంతకు పోజాలదు. కాని, యీ భావముకూడ, మెల్లమెల్లగా మారెను. దీనికి పైబడిన స్థితిలో, ప్రకృతియందంతర్యామియైయుండు భగవంతుడు మనకు గోచరించును.

బైబిలు న్యూటెస్టమెంటు భగవంతుని గురించి ప్రస్తావించుచు ''స్వర్గమందుండు మన తండ్రి'' అనగా మనుష్యులనుండి వేరుగ విడివడి స్వర్గలోకములో నివసించు భగవంతుడని బోధించుచున్నది. మనము భూమిపై నివసించుచున్నాము. అతడు స్వర్గమందు నివసించుచున్నాడు. తరువాత, ప్రకృతియందంతర్యామియై భగవంతుడుండునను బోధ మనకు గోచరించును, అనగా, స్వర్గమందేకాక, భూమిపైనగూడ భగవంతుడున్నాడు. అతడు మనలో నున్నాడు. హైందవతత్త్వశాస్త్రములో, మనకును, భగవంతునకును ఈ సన్నిహిత సంబంధస్థితియే యున్నట్లు మనకు గనుపడును. కాని, మేమింతతో ఆగము. అద్వైతస్థితి యున్నది. ఆ స్థితిలో మానవునకు తా నారాధించుచున్న భగవంతుడు, స్వర్గమందును, భూమిపైనను నుండు తండ్రియేకాక ''నేనును

నాతండ్రియు నొకరమే" యను విషయ మనుభవైక వేద్యమగును. తన ఆత్మలో భగవంతుడే తానను, వాని అంశయే తానను జ్ఞానము నతడు కలిగియుండును. నాలో నిత్యమైనదెల్ల అతడే. అతనిలో నిత్యమైనదెల్ల నేనే. ఈ విధముగా, భగవంతునకును, మానవునకును మధ్యగల భేదము తొలగింపబడుచున్నది, భగవంతుని దెలిసికొనుటవలన, స్వర్గ రాజ్యము మనలోనే యెట్లున్నదో మనకు బోధపడుచున్నది.

ప్రారంభావస్థలో, అనగా ద్వైతావస్థలో, మానవుడు తాను ఏజానో, జేమ్సో, టామునో యను నొక స్వల్ప వ్యక్తిగత జీవుడను జ్ఞానమునుకలిగి, "నేనెల్లకాలమును జానుగనో, జేమ్సుగనో టాముగనో యుందునేకాని, తదితరుడ నెన్నటికినిగా"నని చెప్పుచుండును. ఇదే ధోరణిలో హంతకుడును ముందుకువచ్చి, "నేనెల్లకాలమును హంతకుడుగనే యుందు" నని చెప్పవచ్చును. అయినను, కాలముపోను, టాము అంతర్ధానుడై, తిరిగి తన తొల్లిటి స్వచ్ఛమైన ఆడమురూపమును బడయును.

"చిత్తశుద్ధి కలవారు ధన్యులు, ఏలన, వారు భగవత్సాక్షాత్కారమును బడయుదురు." మనము భగవంతుని జూడగలమా? చూడలేమని వేఱుగ జెప్పనక్కర లేదు. మనము భగవంతుని దెలిసికొనగలమా? తెలిసికొనలేమని వేఱుగ జెప్పనక్కఱలేదు. భగవంతుడు తెలిసికొనబడతగినవాడేయైనచో, వాడిక భగవంతుడేకాడు. జ్ఞానము పరిమితావస్థ కలది. కాని, "నేనును, నాతండ్రియు నొకరమే. నా ఆత్మలో నేనే సత్యమును గ్రహించుచున్నాను." ఈభావములు కొన్ని మతములలో వెలువరింపబడినవి; మఱికొన్నిటిలో గుప్తముగా మాత్రము సూచింపబడినవి. ఇంకను కొన్ని మతములలో బహిష్కృతములైనవి. క్రీస్తు బోధలు ప్రస్తుత మీ దేశములో చాల కొలదిగమాత్రమే అవగాహన యగుచున్నవి. అవి యెన్నడును మిక్కిలి చక్కగ ప్రజలకు బోధపడలేదని చెప్పవలసి వచ్చినందుకు, నన్ను మీరు క్షమింతురుగాక!

అకలంకసిద్ధికిని, పరిపూర్ణత్వ సిద్ధికిని మానవాభివృద్ధిలో వేర్వేరంతరములుండుట అత్యావశ్యకము. ఒకే భావపరంపర ఆధారముపైని వివిధ మతధర్మములు నిర్మింపబడినవి. స్వర్గ రాజ్యము మీలోనే యున్నదని ఏసుక్రీస్తు చెప్పుచున్నాడు. ఆయనయే మరియొకచోట, "స్వర్గములోనున్న మన తండ్రి"యని వచించుచున్నాడు. ఈ యంశములను రెండిటిని మీరెట్లు సమన్వయ పరచెదరు? ఈ క్రింది విధమున ఇందలి రెండవ వాక్యమాయన మతధర్మ విద్యావిహీనులగు సామాన్య జనులకు జెప్పినాడు. వారి స్వభావలోనే వారితో మాటాడుట యావశ్యకముకదా జనసామాన్యమునకు ఇంద్రియగ్రాహ్యములగు స్థూలభావములు కావలయును. ఒక మనుష్యుడు ప్రపంచమంతటిలో అత్యున్నతతత్వవేత్తయైనను, మతధర్మ విషయమున శిశుప్రాయుడు కావచ్చును. ఉన్నతాధ్యాత్మిక స్థితిని బడసిన మానవుడు, స్వర్గరాజ్యము తనలోనే యున్నదని గ్రహింపగలడు. ఇదియే నిజమైన మానసిక రాజ్యము. ఈ విధమున ప్రతి మతమందును పరస్పర విరుద్ధములుగను, అసంగతములుగను పైకి గనుపడు సందర్భములు వివిధాభివృద్ధ్యంతరములను సూచించును. ఈ కారణమువలన, మన మెవరినిగాని వారి మతవిషయమున నిందింపకూడదు. కొన్ని అభివృద్ధిదశలలో విగ్రహా

ములును, సాంకేతిక చిహ్నములును ఆవశ్యకము లగును. అవి ఆయా యవస్థలలో నుండువారు గ్రహింపగల భాషయని చెప్పవచ్చును.

ఏవేవో సిద్ధాంతములుగాని, మూఢస్వమతాభిమానపూర్వకములైన ఆదేశములుగాని మతధర్మము కాజాలవనునది, నేను మీ కందింపగోరు తరువాతి భావము. ముఖ్యమైనది మీకు అనుభవైకవేద్యమగునదియే కాని, మీరు చదువునదిగాని, మీరు నమ్మునట్టి మూఢాదేశసముదాయముగాని కాదు. "నిర్మలాత్ములు ధన్యులు, కారణమేమన, వారు భగవద్దర్శనమును బడసెదరు." ఔను, ఈ జన్మలోనే. అదే మోక్షము. కొన్నిమాటలను గొణుగుటచే దీనిని సాధింపవచ్చునని బోధించువారు కొందరున్నారు. బాహ్యవేషములు మోక్షమున కావశ్యకములని యే గురువర్యుడుగాని యెన్నడును బోధింపలేదు. దీనిని సాధించు శక్తి మనలోనే యున్నది. మనము భగవంతుని యందు నివసించుచు, సంచరించుచున్నాము. మతశాఖలకును, కులములకును ప్రయోజన మున్నది. కాని, అవి ప్రారంభావస్థయందుండు సాధకుల కేర్పడినవియును, తాత్కాలికములును. గ్రంథము లెన్నడును మతముల నేర్పరచవు; కాని, మతములు గ్రంథముల నుత్పన్నము చేయును. ఆ విషయమును మన మెన్నడును మరువకూడదు. ఏ గ్రంథముగాని యెన్నడును భగవంతుని సృజింపలేదు, కాని, యుత్తమ గ్రంథముల కన్నిటికిని భగవంతుడు ప్రేరణకర్త. ఏ గ్రంథముగాని యొక జీవాత్మ నెన్నడును సృజింపలేదు. ఆ విషయమును మన మెన్నడును మరువకూడదు. ఆత్మలో భగవత్సాక్షాత్కారమును బడయుటే సర్వమతముల పరమావధియును. అది యొకటియే విశ్వమతము. సర్వమతములయందును విశ్వజనీన సత్యమొకటి యున్నయెడల, అది యీ భగవత్సాక్షాత్కారమే యని నేను ప్రతిపాదించుచున్నాను. భావములలో, సాధనపద్ధతులలో భేదములుండవచ్చును గాని, ముఖ్యవిషయ మదియే. వలయములో కేంద్ర మొకటియే యుండును, కాని, దానిలోనికి బోవు వివిధ రేఖలు వేయియుండవచ్చును. భగవత్సాక్షాత్కారమే ఆ కేంద్రము. అనగా, ఇంద్రియమయమైన యీ జగత్తునకు, మానవుల నిరంతరాన్న, పాన, వ్యర్థాలాపమయమైన యీజగత్తునకు, అనిత్య ఛాయారూపములతోను, స్వార్థముతోను నిండిన యీ జగత్తునకు, వెనుక నున్న వస్తువదియే. తా నీ ప్రపంచములోని మతములన్నిటిని నమ్మినను, ఇంతవరకు విరచితములైన పవిత్ర మతగ్రంథములన్నిటిని కంఠపాఠముచేసి, జ్ఞప్తియందుంచుకొనినను, ఈ భూలోకమునగల మహానదులన్నిటిలో స్నానము చేసినను, మానవుడు భగవద్దర్శన భాగ్యమును బడసియుండనిచో, నేను వానిని శుద్ధనాస్తికునిగ బరిగణింతును. ఇక నత డెన్నడు గాని యే దేవాలయమునకును, మసీదునకును బోకపోయినను, మఱి విధ్యుక్తకర్మను దేనిని గాని ఆచరింపకపోయినను, తన హృదయాంతరంగమున భగవదనుభూతిని బడయగలిగి, క్షణభంగురములైన యైహిక పటాటోపముల కతీతుడైనచో, అతడు సాధువు, మహర్షి; ఇట్లతనిని మీ రేపేరుననైన బిలువవచ్చును. విస్సన్న చెప్పినదే వేదమన్నట్లు, ఎవడైన తానే ధర్మాత్ముడనని, తన మతమే సరియైనదని, ఇతర మతములెల్ల సరియైనవి కావని నొక్కి చెప్పునెడల, అతడే పూర్తిగా తప్పు

దారిని బడినవాడు. ఇతర మతములు సరియైన వను విషయముపైననే, తన మత నిర్దుష్టత ఆధారపడి యున్నదని ఆతనికి తెలియదు. నిజమైన మతధర్మానుసరణను నిర్ణయించునది యావన్మానవ జాతిపట్ల ప్రేమ, సహనాతిశయమే. ఇది యెవరికిగలదో, వారే నిజమైన మతధర్మము ననుసరించువారు. ఇట్లనుటవలన మానవులందరు సోదరులని తాత్కాలిక భావావేశముచే దాంబికముగా పలుకుటయని నా యభిప్రాయము కాదు, మానవజీవి త్రైకైక స్వభావమందు దృఢవిశ్వాసమని నా యుద్దేశ్యము. మతశాఖలును, వివిధ కులములును భేదదృష్టితో ప్రవర్తింపనిచో, అవి నాకు సమ్మతములే, వైభవోపేతములే. మానవుడు నిజమైన మతధర్మ మనుసరించుటకవి తోడ్పడును. ఒకానొక మతబద్ధమైన సంఘములో పుట్టుట మంచిదేకాని, ఇతర మతములను దూషించుచు దానియందు దురాసక్తితో గిట్టుట తప్పు. శిశువుగ జన్మించుట మంచిదేకాని, యావజ్జీవమును శిశుప్రాయుడుగనే యుండుట తప్పు. ప్రత్యేక మతములు, కర్మలు, ప్రతిమలు శిశువులకు మంచివేకాని, వారు పెరిగి పెద్దలైన తరువాత తమతమ సంకుచిత మతములను విడిచి విశాల దృష్టితో ప్రవర్తింపవలయును. ఎల్లకాలమును మనము శిశుప్రాయులముగ నుండకూడదు. ఇది మనుష్యుల శరీర పరిమాణమును పాటింపక, ఎల్లరికి నొకే దుస్తును సరిపుచ్చుటకు ప్రయత్నించునట్లుండును. ప్రపంచములో వేర్వేరు మత కులములుండుట దోషముగ నేను పరిగణింపను. అవి ఇప్పటికంటె సహస్రాధికములై యుండునట్లనుగ్రహింపుమని భగవంతుని నేను ప్రార్థింతును. కులము లెంత యెక్కువగనున్న, తమ కిష్టముగల మత కులము ననుసరించుటకు జనుల కంత యెక్కువ అవకాశ ముండును. ఒకే మతమును జనులందరు ననుసరించునట్లు ప్రయత్నించుటమాత్రమే నాకు కిట్టదు. వస్తుతః మతధర్మము లన్నియు నొకటేయైనను, వేర్వేరు సందర్భములలో, వేర్వేరు జాతుల కనుగుణముగ నుండునట్లు నిర్మింపబడిన వివిధమత స్వరూపము లుండక తప్పదు. మనలో నొక్కొకరికిని వారివారి సొంతమైన ప్రత్యేక మతముండవలయును, బాహ్యలక్షణములకు సంబంధించినంతవరకే ఆ మతప్రత్యేకత.

ఎన్నో సంవత్సరములక్రిందట మా దేశములో నేనొక మహర్షిని, సాధుపుంగవుని దర్శించితిని. మా వేదములు, మీ బైబిలు, కురాను మొదలగు అపౌరుషేయములైన మతగ్రంథములనుగురించి మేము మాట్లాడుకొంటిమి. ఈ మహనీయుడు నన్నొక బల్లపైనుండిన పుస్తకమును దీసి చదువుమనెను. అది మా దేశీయ పంచాంగ గ్రంథము. ఆ సంవత్సరమున కెంత వర్షము కురియునో చదివితిని. "ఇప్పుడు నీవా పుస్తకమును బట్టుకొని, పిండుమని నన్నాయన ఆజ్ఞాపించెను. నేనట్లు చేసినపిమ్మట, "ఒక్క నీటిచుక్కయైన బయటకు రాదేమి? నీరు బయటకు వచ్చువరకు, అది యొక పుస్తకము మాత్రమే. నీకు నీ మతము భగవత్సాక్షాత్కారము కలుగజేయునంతవరకు, అది నిష్ప్రయోజనము. మతధర్మముకొఱకు పుస్తకములను మాత్రము చదువు మనుష్యుని జూచినప్పుడు, తన వీపుపై కొన్ని మణుగుల చక్కెరను మోసికొని పోవుచున్నను, అందలి మాధుర్యమైన రుచి తెలియని గాడిద మనకు జ్ఞప్తికి వచ్చును" అని ఆ మహనీయుడు హెచ్చరించెను.

మోకరించి, "అయ్యో! మే మెంత మహా పాపులము!" అని యేడువుడనియా, మనుష్యులకు మనము చేయవలసినబోధ? కాదు, కాదు. అంతకంటె వారి దివ్యస్వభావమును వారి జ్ఞప్తికి తెచ్చెదముగాక! నేను మీకొక కథ చెప్పెదను. సింహమొకటి ఆహారము కొరకు వెదకికొనుచు మందలోని యొక గొఱ్ఱె పై కురికెను. అట్లురుకుచుండగనే పాపమా సింహమీని, పిల్లనుకని, అచ్చటనే చనిపోయెను. ఆ పిల్ల మందలోని గొఱ్ఱెలతోబాటు పెరిగి, గడ్డితినుచు, గొఱ్ఱెవలె అరచుచు, తాను మృగరాజునను విషయము నెన్నటికిని తెలిసికొనదయ్యెను. ఇట్లుండ నొకనాఁ డింకొక సింహమా మందకడకువచ్చి, అందులో పెద్ద సింహ మొకటి గొఱ్ఱెవలె గడ్డిమేయుచు, అరచుచుండుటను జూచి ఆశ్చర్యపడెను. దానినిజూచి ఆ గొఱ్ఱెసింగముతోకూడ మందఅంతయు చెల్లాచెదరై పారిపోయెను. కాని, ఆ క్రొత్త సింహము మఱియొక యవకాశమును జూచుకొని, ఆ మంద లోనికివచ్చి, అప్పుడు నిద్రపోవుచుండిన గొఱ్ఱె సింగమును లేపి, "నీవు సింహమవు" అని జెప్పెను. అందుపై, "కాదు, కాదు" అని యా గొఱ్ఱెసింగము గొఱ్ఱెవలె అరువ నారంభించెను. కాని, ఆ క్రొత్తసింహము దానినొక చెరువు నొద్దకు దీసికొనిపోయి, నీటిలోని దాని ప్రతిబింబమును జూచికొని, అది తనను బోలియున్నదో లేదో తెలిసికొనుమనెను. గొఱ్ఱెసింగము నీటిలోని తన రూపమునుజూచి, క్రొత్త సింహము చెప్పినమాట నిజమని యొప్పుకొనెను. పిమ్మట, క్రొత్త సింహము గర్జించి, దానినిగూడ గర్జింపుమని యడుగ, గొఱ్ఱెసింగము కొంతవరకు ప్రయత్నించి, త్వరలో తానును గంభీరముగ గర్జించుచుండెను. అంతటనుండి అదియొక గొఱ్ఱెవలె ప్రవర్తింపలేదు.

మిత్రులారా! మీరందరును సింహముల వంటి శక్తిమంతులని మీకు తెలుపఁగోరుచున్నాను.

గది చీకటిగ నున్నచో, మీరు రొమ్ము బాదుకొనుచు, "చీకటి! చీకటి! చీకటి!" అని యేడ్చుచు, తడుములాడెదరా? అందుకు నివారణోపాయ మదికాదు. వెలుతురు వచ్చుటకు దీపము వెలిగించుట ఒకటియే మార్గము. అప్పుడు చీకటి పోవును. మీకు పైనగల ప్రకాశ మనుభవైకవేద్యము గావించుకొనుటకు, మీ అంతరంగమున ఆధ్యాత్మిక దీపమును వెలిగించుట ఒకటియే సాధనోపాయము. అప్పుడు పాపమాలిన్యమను చీకటి పటాపంచలగును. అధమమైన అహంభావమును విడచి, మీ యున్నతాత్మనుగూర్చి తలపోయుడు.

(సశేషము)

# తత్త్వశాస్త్రము

## వేదాంత విద్యావ్యాప్తి: తత్ప్రాప్తి సాధనములు

శ్రీ ఇచ్ఛాపురపు వైద్యనాథం

అసాధారణ మహిమోపేతములైన వేదములనుండియే తత్త్వశాస్త్రమావిర్భవించినది. వేదములు, కర్మోపాసనలచే పుణ్యలోకములను పొందుటకును, జ్ఞానముచే పునర్జన్మాది దుఃఖశూన్యమునునిరతిశయానందమునగు మోక్షము నొందుటకును కావలసిన విషయముల నుపదేశించినవి. ఇందు మోక్షమునకు జ్ఞానమే సాధనమని యంగీకరింపబడినది. "జ్ఞానాదేవతు కైవల్యమ్, దేవం మత్వా హర్ష శోకౌజహాతి" ఇత్యాది శ్రుతివాక్యములును విద్వదనుభవమును నిందులకు ప్రమాణములు.

ఇట్టి వేదాంతజ్ఞాన ముపనిషత్తుల ద్వారమున భూలోకమున వ్యాపించినది. సర్వజ్ఞుండును పరమగురువునగు శ్రీమన్నారాయణుడు, తాను కేవల పరబ్రహ్మ స్వరూపమే యగుటవలనను తన్నాశ్రయించిన మాయ శుద్ధసత్త్వయగుటచే జ్ఞానలోపములేనివా డగుటవలనను తనకు స్వతస్సిద్ధముగానున్న ఈ తత్త్వరహస్యమును తన నాభికమలమునుండి యుత్పన్నుండైన బ్రహ్మకు ప్రథమమున నుపదేశించెను. పిమ్మట బ్రహ్మ తన మానసపుత్రుడగు వశిష్ఠున కుపదేశించెను. ఆతడు తన పుత్రుడగు శక్తి యనువానికిని అతడు తన సుతుడగు పరాశరునకును అతడు తన ఆత్మజుడును నారాయణ రూపుడు నగు వేదవ్యాసునకును నుపదేశించిరి.

ఇట్లావిద్య బ్రహ్మకడనుండి క్రమముగా భూలోకమునకు మహర్షులద్వారా యవతరించెను. ద్వాపర యుగాంతము వరకును ఈ విద్య మహర్షి పరంపరగా వ్యాపించి ఆ మహర్షులచే అర్హుల కుపదేశము చేయబడుచుండెను. యుగప్రభావమునుబట్టియు ఉపదేష్టలగు మహర్షుల ప్రభావమునుబట్టియు ఈ విద్యను శిష్యులు నిస్సందేహముగా గ్రహించి ముక్తులగుచుండిరి. కాని కాలప్రభావము ననుసరించి శిష్యులు సంశయగ్రస్తులగుటయు క్రమముగా అన్యమతములం దభిలాష కల్గుటయు సంభవించెను. ఇట్లు కొంతకాల మగుసరికి తత్త్వశాస్త్రమే గాక వేదమతములగు భక్తియోగ సాంఖ్యాదులును అంధకారమున బడుటయు ఇతర మతములు ప్రకాశించుటయు ప్రారంభమయ్యెను. అందుచే తత్త్వశాస్త్ర విషయమున వ్యాప్తి తగ్గెను. త్రికాలవేదియగు వేదవ్యాసుడు భాగవతమున వర్షర్తువర్ణన సందర్భమున నిట్లు వర్ణించెను. శ్లో. "నిశాముఖేషు ఖద్యోతా స్తమసా భాన్తినగ్రహాః, యథా పాపేన పాషండా నహి వేదాః కలౌయుగే." కలియుగమున వేదములంధకారలీనములై యితర మతములు ప్రకాశించునట్లు వర్షాకాలపు రాత్రులందు నక్షత్ర చంద్రాదులు ప్రకాశింపక తమోలీనములై (మేఘాచ్ఛాదితములై) యుండగా మిణుగురు పురుగులు ప్రకాశించుచుండెనని ఈ శ్లోకమున కభిప్రాయము.

ఇట్లు బౌద్ధాది మతములచే నాచ్ఛాదింపబడిన వేదాంత మతమును మరల ప్రకాశింపజేయుటకు సర్వజ్ఞులగు శంకరాచార్యులు పూనుకొనిరి. పైని వ్రాసినట్లు వేదవ్యాసుల వరకును వ్యాపించిన బ్రహ్మవిద్యను వేదవ్యాసుడు తన పుత్రుడగు శ్రీ శుకున కుపదేశించెను. ఆయన గౌడపాదాచార్యులకును ఆయన గోవింద యతీంద్రునకును ఆయన, శంకరావతారమగు

శంకరాచార్యులకును నుపదేశించిరి. ఆ శంకరులు తనకాలముననున్న యితర మతముల నన్నిటిని జయించి వేదాంతవిద్యను వ్యాపింపజేయుటయేగాక ఆయన దిగ్విజయమునకు జయస్తంభములంబోలు నాలుగు మఠములను భారతదేశమున నాలుగుదిక్కుల చివరలయందును ప్రతిష్ఠింపజేసెను. తన శిష్యులగు పద్మపాద హస్తామలకాదులకు బ్రహ్మవిద్య నుపదేశించి వారి యజ్ఞానమును తొలగించి వారిద్వారమున బ్రహ్మవిద్యను భారతదేశమునం దంతటను ప్రకాశింపజేసెను. ఇంతేగాక సర్వజ్ఞ శిరోమణి యగు శంకరులు సూత్రభాష్యమును వ్రాసి బ్రహ్మవిద్యావిషయక సందేహము లన్నిటిని తొలగించిరి. అంతకు పూర్వము బ్రహ్మవిద్యను (వేదాంతమును) గురూత్తము లుపదేశించుటయు ముముక్షువులగు శిష్యులు గ్రహించుటయు ప్రచారములో నుండెను. కాని పూర్వపక్ష సిద్ధాంతములతో నిండిన లిఖితగ్రంథము శంకరవిరచిత సూత్రభాష్యమువంటిది మఱియొకటి యేదియు లేదు. ఇట్లు శంకరులు తన కాలమున బ్రహ్మవిద్యను వ్యాపింపజేయుటయే గాక తన యనంతరమున తనయట్టి సమర్థులు జనింపకున్నను బ్రహ్మవిద్య సందేహాస్పదము కాకుండునట్లు శాశ్వతోపకారము చేసిరి. ఇట్లు వేదాంతవిద్య ప్రస్తుతకాలమువరకును అవిచ్ఛిన్నముగా వ్యాపించినది. ఈ ఇరువదవ శతాబ్దమునగూడ శతాధికులగు బ్రహ్మవిద్యాసంపన్నులు జనాకీర్ణ ప్రదేశములందును హిమాలయాది పర్వతములందును గలరు. మోక్షేచ్ఛ యున్నచో ఈ కాలముననైనను ఉత్తమ గురువులు లభింపకపోరు.

ఇట్టి బ్రహ్మవిద్యను సంపాదించుటకు కొన్ని సాధనములు గలవు. ప్రథమమున అనుబంధ చతుష్టయమునుగూర్చి తెలిసికొనిన పిమ్మట సాధనములనుగూర్చి తెలిసికొనవలసియున్నది. శాస్త్రములకన్నిటికిని 1. విషయము, 2. సంబంధము, 3. ప్రయోజనము, 4. అధికారి అను నాలుగనుబంధములుండును. అందులో వేదాంతశాస్త్రమునకు జగజ్జీవపరాత్మల యథార్థస్థితిని వివరించి జీవబ్రహ్మైక్యమును బోధించుటయే విషయము. ప్రతిపాద్య ప్రతిపాదకభావము సంబంధమగును. వేదాంత శాస్త్రము బ్రహ్మవిద్యను ప్రతిపాదించునది కావున ప్రతిపాదకమనబడును. బ్రహ్మవిద్య ప్రతిపాద్యమనబడును. జననమరణాది దుఃఖ రహితమును ఆనందమయము నగు మోక్ష ప్రాప్తి ప్రయోజనము. క్రింద చెప్పబోవు లక్షణములుగల ముముక్షువు (మోక్షమునందు కోరికగలవాడు) అధికారి.

మోక్షము నొందగోరువారు 1. నిత్యానిత్య వస్తువివేకము, 2. ఐహికాముష్మికఫల నిరాసము, 3. శమాదిషట్కసంపత్తి, 4. ముముక్షుత్వము అను లక్షణములు కలిగియుండవలెను. నిత్యానిత్యవస్తువివేకమనగా పరమాత్మ యొక్కటియే నిత్యమనియు తక్కిన జగదాదు లన్నియు అనిత్యమనియు తెలిసికొనుట. ఇట్లు బ్రహ్మభిన్నపదార్థములన్నియు అనిత్యములని తెలిసికొన్నచో ఈ లోకమునందలి సుఖములును ఉత్తమలోకములందలి సుఖములును అనిత్యములని తెలిసికొని వానియందు విరక్తిని కలిగియుండును, కావున నిత్యానిత్య వస్తు వివేకము ఇహపరసుఖములయందు విరక్తిని కల్గించును. ఇంతేగాక ఏ సుఖమైనను ప్రయత్న సంపాద్యమగుటయు, తాత్కాలికమగుటయు, దుఃఖాంతమగుటయు నను మూడు దోషములతో నిండియుండును. ఇట్లు సుఖములనుగూర్చి విమర్శించినచో క్రమముగా వానియందు విరక్తి కలుగును. విరక్తచిత్తునకు ఇంద్రియజయము,

మనోజయము, ప్రపంచవిషయములనుండి విరమించుట, శీతోష్ణాది ద్వంద్వసహనము, గురువేదాంతవాక్యములయందు శ్రద్ధ మొదలగునవి (శమాదిషట్కము) లభించును. సూక్ష్మబుద్ధి గల యనేకులు కఠినగ్రంథములను జదివి తెలిసికొనుట, పెక్కుభాషల నభ్యసించుట, అసాధ్యకార్యముల నిర్వహించు సామర్థ్యము కల్గియుండుట మొదలగు ననేక సుగుణములతో గూడియుందురు. కాని పైని వ్రాసిన ఇంద్రియజయాదిగుణములు లోపించుటచే వేదాంతశాస్త్రమును విన్నను సరిగా అర్థముచేసికొనలేక తమ అశక్తతను మరుగుపరచి శాస్త్రము పరస్పరవిరోధములతో నిండి యసందర్భముగా నున్నదని పల్కుచుందురు. వైరాగ్యాది గుణములచే పరిశుద్ధముగాని బుద్ధి ప్రపంచవిషయములను గ్రహించుటలో నెంత సూక్ష్మమైనను బ్రహ్మవిద్యను మాత్రము గ్రహింపజాలదు. కావున పైని వ్రాసిన సుగుణములను జిజ్ఞాసువునకు (తెలిసికొనగోరువానికి) ఉండవలయును. ఇంతేగాక ముముక్షుత్వముగూడ ఆవశ్యకము. కొందరు మోక్షేచ్ఛ లేకయే వేదాంతశాస్త్రములో నేమున్నదో తెలిసికొందమనెడు కోరికతో అభ్యసింతురు. అట్టివారికిని అంతఃకరణము విషయసుఖసంపాదనేచ్ఛతో నిండియుండుటచే కలుషితమై యీ విద్యను సులభముగా గ్రహించుట కవకాశము కలుగదు. ఇంతేగాక వేదములందును ఉపదేశకులగు గురువులయందును వ్యాస శంకరాది శాస్త్రప్రకాశకులందును అపరిమితమగు గౌరవముండవలెను. వారు సామాన్యులని భ్రాంతి నొందినచో ఈ విద్య అలవడదు.

ఇవియన్నియు గాక దైవభక్తి యత్యావశ్యకము. దైవకృప లేకుండ లేశమైనను ఈ విద్య పట్టువడదు. "యస్య దేవే పరాభక్తిర్యథా దేవే తథా గురౌ, తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః" అని శ్రుతి చెప్పుచున్నది. ఎవనికి దేవునియం దుత్తమ భక్తి కలదో అట్లే గురువునందును ఉత్తమ భక్తి కలదో అట్టి ఉత్తమపురుషునకే రహస్యార్థములను గ్రహించు శక్తి కలుగునని యీ శ్రుతికి భావము. భగవద్గీతలలో నిట్లు చెప్పబడినది. శ్లో. జరామరణ మోక్షాయ మామాశ్రిత్య యతన్తియే, తే బ్రహ్మ తద్విదుః కృత్స్న మధ్యాత్మం కర్మచాఖిలమ్." విషయసుఖములకొరకు గాక జరామరణాది నాశనముకొరకై యెవరు నన్నాశ్రయింతురో వారే బ్రహ్మవిద్యను సంపూర్ణముగా తెలిసికొనగలరు. అని భావము. ఇట్లే "శ్లో. దైవీహ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా, మామేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తితే" అనియు గలదు. త్రిగుణాత్మకమగు తన మాయ నెవ్వరును దాటలేరనియు తన్ను (శ్రీమన్నారాయణుని) ఆశ్రయించినవారు మాత్రమే దాటగలరనియు దీనికి భావము.

కావున నిష్కామమును మోక్షకామమును అగు దైవభక్తియు గురుభక్తియు పైనివ్రాసిన సాధనచతుష్టయముగల పురుషుడు మాత్రమే తత్త్వశాస్త్రగ్రహణమున కర్హుడని నిశ్చయింపబడినది. ఇందు సాధనచతుష్టయ సంపాదనలో కొన్నిలోపములున్నను దైవభక్తియు గురుభక్తియు లేనిచో ఎంతకాలము నేర్చినను ఈ విద్య లభింపదు. కావున మోక్షేచ్ఛ గలవాడు ముందుగా దైవభక్తిని గురుభక్తిని గలిగియుండి పిమ్మట క్రమముగా తత్త్వశాస్త్రప్రాప్తి సాధనములను తత్త్వశాస్త్రజ్ఞానమును సంపాదింపవలసియున్నది.



# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిశరణమ్

ఆల్మోరా,
7-6-'16.

శ్లో॥ వేదే రామాయణే చైవ
పురాణే భారతే తథా
ఆదావంతే చ మధ్యే చ
హరిస్సర్వత్ర గీయతే ! *

ప్రియ...

మీరు 31-5-'16 న వ్రాసిన యుత్తరమును జదివి సంతసించితిని. మీ శరీరస్థితిబాగున్నదని తెలిసికొని సంతుష్టుడనైతిని. మీరు నిరాశా భావమును వదలితిరని విని ఆనందించు చున్నాను. మీకు తప్పక ఆశాభావము ప్రవర్ధ మానమగుచున్నది. మీ నిరాశాభావము నశించినకొలదియు ఆశాభావము ప్రవర్ధమాన మగును. మీరు అనవరతము వదలక భగవత్ప్రార్థనము కావింపుడు.

ఆల్మోరాయందు శ్రీరామకృష్ణాశ్రమ మింతకుమున్నుండెడిదికాదు. శ్రీ వివేకానంద స్వాముల కృపవలన నేడీ స్థల మింతటి ప్రసిద్ధిని బడసినది. ఈ సంఘ కేంద్రమునకు స్థల మవసరమైయుండెను. ఆయన కృపవలన అట్లే అది లభించెను. ఈ స్థాపనమువలన నెందఱో (సాధకులకు) శుభము కలుగగలదని నాకు దోచుచున్నది. మీ రనువదించిన వేదస్తుతిని జదివితిని. అందలి మీ సూచనలన్నియు మనోహరములుగ నున్నవి. విషయమునుగూర్చి యిక నేమి చెప్పవలయును! ఇదియే సకల శాస్త్రములకు ఏకైకసార సిద్ధాంతము.

హరివినా గత్యంతరములేదు. ఏలనన ఆతడొక్కడే సద్వస్తువు,నిత్యుడు. మిగిలినవన్నియు మిథ్య; ఒకక్షణముననుండి మరుక్షణమున మాయమగును. కావున మనస్సు అన్యవిషయగతమైనచో మనకు లాభమావంతయు లేదు సరికదా! చివరకు మిగులునది దుఃఖమొక్కటియే. కాని భగవన్మాయాశక్తి మిక్కిలి బలీయమయినది. సత్యము సులభముగా గ్రహింపనీయదు. కావుననే భగవానుడు "మామేవయే ప్రపద్యంతే, మాయామేతాం తరంతితే— ఎవరు నన్ను శరణుజొత్తురో వారు (నా) మాయనుండి విముక్తులగుదురు" అని పలికి యున్నాడు. ఈశ్వరశరణాగతి వినా యుపాయము వేఱొకటిలేదు. 'మామేకం శరణం వ్రజ'—ప్రభువు దయయుంచి మనలను తన చరణాశ్రయుల గావించుగాక! ఇదియే నా ప్రార్థన.

నా ప్రేమపూర్వకాశీస్సులు,
ఇట్లు,
శ్రీ తురీయానంద

---

* వేదము, రామాయణము, పురాణములు, భారతము—వీనియన్నిటియందును ఆదిమధ్యాంతములందెల్ల శ్రీహరియే స్తుతింపబడియున్నాడు.

శ్రీరామకృష్ణ శరణమ్

ఆల్మోరా,
10–2–'16.

ప్రియ భూ...

ఈ యుదయమే నీ 'రిజష్టరు' ఉత్తర మంది నది. ప్రభువు నిన్నానందమునందే నోలలాడించుగాక! మీ బంధువులు మువ్వురును నొకే గుణము—ప్రకృతి—కలవారగుటచే, మీలో నిట్టి సుఖజీవనము జరుగుచున్నది. ఇదంతయు భగవానుని కృపామయమే సంసారమునందు సకలవస్తువులను సంపాదింపవచ్చును గాని భగవత్పాదభక్తిని బడయుట మిక్కిలి కష్టము. ఆ భక్తి లభింపనిచో మిగిలిన వస్తుచయమెల్ల వృథాయగును. ఇవి యెందులకును బనికి రావన్న విషయము తేటతెల్లమే. భగవత్పాదారవిందములయందు భక్తి కుదిరినచో మన జీవితము మధుమయమై విరాజిల్లును. అది లేనిచో వృథా భారవాహిత్వమే మిగులునది. ఎట్లయినను మీకుమాత్రము భగవంతుడు భక్తిధనమును బాగుగా ప్రసాదించియున్నాడు. ఆయన పాదపద్మములందు మనస్సు నిల్పిఆయన భక్తులకును అంతరంగికులకును సేవచేయుచు కాలము గడపిన నీ జన్మము సార్థకమగును. భగవత్కృపవలన మీకిట్టి బుద్ధియే కలిగియుండుట మహాభాగ్యము. పరమభక్తుడగు తులసీదాసు "ధనకనకవస్తువాహనములు పాపులకునైతము లభించును కాని హరిభక్తియు భాగవత సంగమము నిజముగా భాగ్యవంతులకే కలుగును." అనిపలికియున్నాడు. శ్రీరామకృష్ణుల అంతరంగిక శిష్యులుగూడ మీపై ప్రేమజూపి మీ కుశలమును వాంఛించుటయందు దావంతయు నాశ్చర్య కారణము కనుపింపదు. ఏలనన, ఈశ్వరశరణాగతులెల్లరు వారికి ప్రియులు, బంధువులును. వారితోడి సంబంధము పారమార్థికమే కాని మాయాజనితము కాదు. బేలూరు మఠమున జరుగనున్న శ్రీ వివేకానందస్వాములవారి జన్మదినోత్సవ కార్యక్రమ నివేదిక నాకు ముందుగనే జేరినది. ఇకపైన నీ యుత్సవము బహుదేశములందు, పలుతావులందు అత్యంత జయప్రదముగా జరుగగలదు. కాలము గడచుకొలదిని శ్రీరామకృష్ణ వివేకానంద వేదాంత ప్రచారము సర్వతోముఖముగ ప్రవర్థమానము కాగలదు. వీరి యుపదేశముల నవగతముచేసికొని ఆచరణకు పూనుకొన్న మానవులు అవిద్య నుండి విడివడి ప్రకృతి సత్యమును హృదయంగమము చేసికొనగలరు. అందుమూలమున వీరు నిర్మలానందమున కధికారులై వీరి జన్మమును సార్థకము గావించుకొందురు. ఏమి ఆ భగవత్కృపామహిమ!

భగవత్సంకల్పములన్నియు మంచివే. ఆయన పాదపద్మములందు మనస్సు నిలుపగలిగిన నిక కష్టములుండవు. భగవంతుడు కరుణించి మనలను వారి శరణార్థుల గావించుకొనుగాక! ఇదియే నా ప్రార్థన.

ఇట్లు,
శుభాకాంక్షి,
శ్రీ తురీయానంద

# వి న య ప త్రి క

మూలం :
శ్రీ తులసీదాస గోస్వామి

అనువాదం :
క్రాంతికర్

(గతసంచిక తరువాయి)

## ౧౨౬

ఆ కాలమున నీవు నాకంటె నెక్కుడు దుష్టులకు బలాత్కారముగ మోక్షము నిచ్చితివి. ఎవరెట్టి పాపులైనను ఏదోవిధమున నీ నామ ముచ్చరించుటతోడనే వారి ఎదుట సాక్షాత్కరించి ఆదర పూర్వకముగ శరణిచ్చుచుంటివి. అజామిళుడు పాపములపుట్ట. యమదూతలాతనిని యాతనలపాలు చేయుచుండ నీ వాతనిని విడిపించితివి. వారు చేతులు నులుము కొనుచు క్రోధమున పండ్లు పటపట కొఱకుచు వెడలిపోయిరి. గౌతమునిభార్య అహల్య, గజేంద్రుడు, జటాయువు, యమలార్జున తరువులు, వానరములు—ఇంక నెందఱో పాపులను నీ వెఱుంగుదువు—వారి కవసర మేర్పడినపుడెల్ల భక్తసమాజమును వీడి పరుగిడితివి. ఈనాడుమాత్రము నీ ద్వారమున నెందఱి కాదరము లభించుటలేదు? ఎందఱు పాపులు పవిత్రులగుటలేదు? మూడుకాలములందును నున్న మహాపాపులందఱును నా కేపాటి? ఇంతవరకును నీ పనులనుజూచి యూరకుంటిని. కాని నీ వెంతకును సుముఖుడవుగాలేదు. ఇక నే నిపుడు నీవు మహా లోభివని లోకమున ప్రచారమొనర్తును. కాకున్న నేనీ లోకపరిహాసము నెంతకాలము సహింపగలను?

## ౧౨౭

ఓ రామచంద్రప్రభూ!

నీవంటి దీనబంధువు లేడు. నావంటి దీనుడు లేడు. నేను కుటిలు లందఱిలోను శ్రేష్ఠుడను. నీవు కుటిలత్వమును పరిహరించుటలో సాటిలేని వాడవు. నేను మనోవాక్కాయముల పాపనిరతుడను. నీవు కృపాళుడవు. పతితోద్ధారకుడవు. నే ననాథుడను. నీవు అనాథుల పరమహితైషివనుమాట నెన్నడు మరువను. నే నార్తుడను. నీ వార్తిహరుడవు. నీ కీర్తిని వేదములు, పురాణములు కొనియాడుచున్నవి. నేను భీతుడను. నీవు సమస్తములగు భయహేతువులను హరించువాడవు.

ఓ రామా!

నీవు సుఖనిధానమవు. జననమరణ దుఃఖ నివారకుడవు. నే నతి దుఃఖితుడను. త్రివిధ తాపములచే తప్తుడను. తులసీదాసునిగతి నీక్షించి నీవే యాతనిని నీ యాప్తకోటిలో జేర్చికొనుము.

## ౧౨౮

ఓ ప్రభూ!

వేదములు, పురాణములు నీవంటి స్వార్థ

హితైషిని మరియొకనిని చెప్పకపోవుటచేత నేను నీ చరణముల ప్రేమించితిని. నేను జన్మించిన చోటునందెల్ల తల్లి, తండ్రి, పుత్రులు, భార్య ఇంకను ఎందఱో బంధువు లేర్పడిరి. కాని యందఱును దమ స్వార్థమునకే నన్ను ప్రేమించిరి. మనమున కాపట్యము వహించిరి. ఎవరును భగవద్భక్తిని నా కుపదేశింపలేదు. నేనీ మానవదేహమును ధరించి దేవతలు, మునులు, మనుష్యులు, రాక్షసులు, నాగులు, కిన్నరులు—మున్నగు నెంతమందికి నమస్కరింపలేదు ?—ఓ హరీ! పాపవశమున నేను త్రివిధ తాపములచే దహింపబడుచున్నాను. కాని ఎవరును నాపై దయదలచి నా దాహము నార్పలేరైరి. సుఖమునకై యెన్నో యత్నముల జేసితినిగాని, భగవంతునకు విముఖుడనగుట నెల్లపుడు దుఃఖమునే పొందితిని. ప్రపంచమంతటను దుఃఖవాగురు లొడ్డబడి యుండుటజూచి నీరులేని కాల్వలోని నావవలె నే నలసిపోయితిని. ఓ ప్రభూ! సుఖనిధానమగు నిన్ను మరచిన నాకీస్థితిగల్గుట యుచితమే. ఓ హరీ! క్రోధమువీడి నాపై నీ కృపను బ్రసరింప జేయుము. నేను — తులసీదాసును — నిన్ను శరణు జొచ్చితిని.

## ౧౨౯

ఓ హరీ!

హృదయకమలమున నీకు స్థానమివ్వక బాహ్యప్రపంచమున వ్యాకులుడనై, దిరుగాడు నేను నాజ్ఞానమును గోల్పోయితిని. మూర్ఖమగు మృగము తన శరీరమందలి కస్తూరినిగానక—ఇట్టి శ్రేష్ఠమగు సుగంధ మెచటినుండి వచ్చుచున్నదాయని—కొండలు, చెట్లు, లతలు, భూమి, బిలముల దానిని వెదకుచు దిరుగును. స్వచ్ఛమగు నీటితో నిండిన కాసారమున కొలదిపాటి నాచు వ్యాపించియుండుటజూచి దుష్టుడనగు నే నా జలమును వీడి దీనితోనే దప్పిక దీర్చుకొనగోరితిని. నా శరీరమున దారుణమగు త్రివిధ తాపములు వ్యాపించుచున్నవి. దానికితోడు దారిద్ర్యము పీడించుచున్నది. నాయింటనేయున్న రామనామమనెడు కల్పవృక్షమును వీడి ఇంద్రియ విషయములనెడు కంటక వృక్షములతోట వేయుచున్నాను. జ్ఞానాగారమగు నీ వంటివాడును, నావంటి మహామూర్ఖుడును మరెవరు లేరని పురాణములు జెప్పుచున్నవి. ఆ యా విషయములను యోజించి ఓ ప్రభూ! నీ కేది హితమో దాని నాచరింపుము.

## ౧౩౦

ఓ రామభద్రా!

నన్నురక్షింపుము. కళ్యాణస్వరూపుడవగు నో రామచంద్రా! నన్ను రక్షింపుము. నీ మంచి యశస్సు చెవులారవిని నేను నిన్ను శరణుజొచ్చితిని. ఓ దీనబంధూ! నీవు దైన్యము, దారిద్ర్యము, త్రివిధతాపములు, దోషములు, దారుణదుఃఖములు, భయము, గర్వములను దూరమొనర్చువాడవు. నీ భక్తులు ప్రాపంచికపు టురులలో జిక్కి, కర్మ - కాలముల ప్రభావమున వ్యాకులురైనపుడును, దుష్ట ప్రభువులు పృథ్వికి భారస్వరూపులైనపుడును నీవు మానవదేహమును ధరించి భూభారము నడంచితివి. మునులను, దేవతలను, సాధువులను గాపాడితివి. వర్ణాశ్రమధర్మములను మరల స్థాపించితివి. నీవు దుష్టులగు రాజుల వెలుగును

ప్రకాశింపనీయలేదనుటకు వేదములు, లోకమే సాక్షులు. రావణుని కారాగారమున దేవతలు మ్రగ్గుచున్నపుడు వారి కాశ్రయమొసంగి దిక్పాలుర దిక్కుల ప్రతిష్ఠించితివి. నీరాజ్యమున ధర్మము తన నాల్గు పాదముల నుదయుంచినది.

ఓ దయామయా! నీవు అహల్య, గుహుడు, జటాయువు, వానరులు, శబరి, జాంబవంతుడు, రాక్షసులు—వీరలను తరింపజేసితివి, తరింపజేయువారలను జేసితివి. తులసీదాసు చెప్పున దేమన—గజేంద్రుని రక్షించినవాఁడ! శిలమునకు సముద్రునివంటి వాఁడ! రామచంద్రా! నాయెడల నుదాసీనుడవై యుండుట జూచి దుఃఖముచే కరగిపోవుచున్నాను.

(సశేషము)

# మూర్ఖుడు

"నిద్రపట్టక మేలుకొనియున్నవానికి రాత్రులు దీర్ఘములై కనిపించును. మార్గాయాసము నందిన బాటసారికి మార్గ మెంతోదూరముగ గోచరించును. సరియైన ధర్మమార్గము నెఱుంగని మూర్ఖునకు జీవితమే దీర్ఘము దుర్భరమునై కనిపించును."

"యాత్రికునకు మహనీయుడో సమానుడో సహచరుడుగ లభింపనిచో వాడు పట్టుదలతో నేకాకియై యాత్రసల్పుటయే శ్రేయోదాయకము. ఎన్నటికిని మూర్ఖునితో గలిసి పయనించుట తగనిపని."

"మూర్ఖుడు తాను మూర్ఖుడనని గుర్తించినచో వా డంతవఱకైనను వివేకియే. కాని తాను వివేకినని తలంచు మూర్ఖుని మౌర్ఖ్యమునకు అంతములేదు."

"తన జీవితకాలమంతయు విద్వాంసునితో కలిసి వర్తించినను తెడ్డు కూరల రుచి నెఱుంగని తెఱంగున సత్యము నెన్నటికిని గ్రహింపజాలడు."

"ముహూర్తమాత్రమేని విద్వాంసులతోడి సంపర్కము కలిగినంతనే, క్షణములో జిహ్వ రుచి నెఱుంగునట్లు బుద్ధిమంతులు సత్యమును గ్రహింపగలరు."

"తన దుష్కార్యముల ఫలము తానే యనుభవించుటవలన తెలిసీతెలియని మూర్ఖుడు తనకు తానే శత్రువగుచున్నాడు."

"ఏ కార్యమును గావించి మనుష్యుడు పశ్చాత్తాపమందవలసి యేడ్పు ముఖముతో దాని ఫలమున కెదురుచూడవలసి వచ్చునో ఆ కార్యము సుకరముగాదు."

"ఏ కార్యము గావించినపిమ్మట పశ్చాత్తాపమంద నవసరముండదో దేని ఫలమును సంతోషముతో నెదురుచూడనగునో అదియే చక్కగా గావింపబడిన కార్యము."

'ధమ్మపదము'

# శ్రీ శారదానందస్వామి

(గతసంచిక తరువాయి)

శ్రీ శారదానందస్వాములవారు ఆరోగ్యము కొఱకు నాలుగయిదు మాసములు పూరీయందు గడపిరి. అయినను అచ్చటను శ్రీవారికి పని తగ్గినదికాదు. తమకార్యము లెన్నియున్నను ప్రతిదినము శ్రీజగన్నాధుని సేవించుట నియమముగానుంచుకొని శ్రీవారు జగన్నాథక్షేత్రముకుబోయి దర్శనము చేసికొని వచ్చుచుండువారు. శ్రీజగన్నాథరథోత్సవ కాలమున స్థూల శరీరియయిన శ్రీస్వామివారు రథరజ్జువును (పగ్గమును) పట్టిలాగుట జూడ చూపరులకు అద్భుతావహముగా నుండెడిది.

శ్రీ స్వామివారు పూరీలో నుండగా నొక విచిత్ర సంఘటన సంభవించినది. ఒకనాడు శ్రీస్వామివారు షికారువెళ్లి తిరిగివచ్చునప్పటికి 'పూండి' రాజు ఏజంటు శ్రీవారి బసకు వచ్చి అదియే రాజాగారి బసగా తలంచి రాజాగారిని, వారి ఏజంట్లను అందు ప్రవేశింపజేసెను. శ్రీవారు మఱలివచ్చి చూడగా తమ బస సమస్తము రాజుతోడను అతని పరివారముతోడను నిండియుండెను. వారి నచట నుండి శ్రీవారు తలంచినచో బయటికి బంపియుండెడివారే కాని అట్లుచేయ తలంపక శ్రీవారు తాము వేఱొక బసచూచుకొన తలంచిరి. ఈలోపున రాజాగారి ప్రత్యేక కార్యదర్శి శ్రీవారినిజూచి 'నీ వెచ్చటికివచ్చితివి'—యీ మున్నగుమాటలతో శ్రీవారిని గద్దించెను. కాని శ్రీవారు సరియగు సమాధానము చెప్పినంత అంతయు గ్రహించిన ఆ కార్యదర్శి తన అకార్యమునకు లజ్జించి, శ్రీవారి క్షమాపణ వేడికొనెను.

శ్రీవారు పూరీనుండి మఱలివచ్చిన పిదప ఎప్పటియట్ల తమ కార్యములను శ్రద్ధాపూర్వకముగా నెఱవేర్చుచుండెడివారు. ఇట్లు కొంత కాలము జరిగినపిదప వారి గురుభాయిలగు ప్రేమానందస్వాములకు చాల జబ్బుచేసెను. వారికి వలయు సదుపాయములన్నియు సమకూర్చి వారి రోగము నివారించునట్లు చేసిరి. ఇది యిట్లుండగనే పూరీలోనున్న గురుభాయులు శ్రీతురీయానందస్వాములవారికి జబ్బు చేసినది. వారియొద్దకువెళ్లి శ్రీవారు వారి రోగ నివారణార్థము వలయురీతిని సేవచేసిరి. పాఠకులు ముందు చదివిన విధమున, శ్రీవారు రోగులకు సేవచేయుటయందొకానొక నేర్పు చూపెడివారు. ఎట్టిరోగులయినను మందు పుచ్చుకొన నిష్టపడకయున్నచో వారి నెట్లో మెప్పించి వారిచే నౌషధసేవనము గావింపించెడివారు; ఎవరేనిరోగులు సూదిమందులకు భయపడి వలదన్నను ఎంతో నయమున వారికి మెప్పుజెప్పి ఆ సూదిమందుల పుచ్చుకొనునట్లు చేయువారు, పథ్యము విషయమున, రోగులు గంజి వలదనియు పుచ్చుకోజాలమనియు పరితపించుచున్నచో వారినిజేరి వారి మార్గమునే మొదట ననుసరించి రెండుమూడు రోజులలో వారిని తమ మార్గమునకు ద్రిప్పుకొని గంజియో మఱి యే యితర పదార్థమో పుచ్చుకొనునట్లు చేసి—వైద్యులు (డాక్టర్లు) చెప్పిన

స్థితికి, మార్గమునకు—వారిని దీసికొని వచ్చువారు. ఈ రోగిసేవయందు తమకు ప్రాణాపాయముకలుగనున్నదని తెలిసినను దానిని తృణప్రాయముగ నెంచి యెన్నియో సార్లు రోగులను ఆరోగ్యవంతులజేసిరి. వయసు చెల్లినకొలదియు శ్రీవారు రోగిసేవకు తాము వెళ్లక తమ పరిచారకులనో, బ్రహ్మచారులనో బంపుచు మధ్యేమధ్యే తాము వెళ్లి చూచి వచ్చుచుండువారు. ఇట్లుండగా ఒకనాడు మధ్యాహ్నము శ్రీవారెచ్చటికో వెళ్లుచుండగా వారెచటికి బోవుచున్నారో తెలిసికొనుటకై పరిచారకుడును వారితో బోవుచుండెను. కొంత దూరమువఱకు శ్రీస్వామివారా పరిచారకుని జూడరైరి. కాని తరువాత పరిచారకుడు తమ వెంట వచ్చుట దెలిసికొని ఈ యెండలో నీ వేల వచ్చుచున్నావు, రావలదని పలికిరి. కాని ఆ పరిచారకుడు మీ వెంట వచ్చుట కనుమతి నిండని బ్రతిమాలగా సరియేయని స్వామివారు సమ్మతించిరి. ఇరువురుగలసి, పోవుచుండిరి. కొంతదూరముపోయి, వారొక 'హోటల్' చేరి యందు మీదిభాగమున శల్యావశిష్టుడు క్షయ రోగ పీడితుడునగు నొకానొక భక్తునియొద్దకు బోయిరి. శ్రీవారు, ఆ భక్తుని జూచినంతనే ఆతని పడకపై గూర్చొని యాతని శరీరము నిమురుచు కుశల ప్రశ్నలుచేయుచుండిరి. రోగి రోగము ముదిరిపోయినది. మాట్లాడుచుండు నపుడే దగ్గు మిక్కుటముగా వచ్చి వెంటనే కఫముగూడ తుంపరలరూపమున నెదుటి వస్తువులపై బడుచుండెను. కొంతసేపటికి భక్తుడు స్వాములవారికి తనయొద్దనున్న పండ్లు ఈయ సమకట్టి ఒకదానిని కోసి శ్రీవారి కర్పించెను. శ్రీవారు వలదన్నను మీరు పుచ్చుకోవలయు నని బలవంతపెట్టెను. అపుడు శ్రీస్వామివారా ఫలమునుండి రెండుమూడు ముక్కలను దీసి కొనిరి. ఇదియంతయు జూచిన సేవకునకు జుగుప్సయు, భయమునుగూడ గలిగినది. పిమ్మట తిరిగివచ్చునపుడు పరిచారకుడు శ్రీవారినిజూచి, "స్వామీ! మీరారోగియొద్ద నుండిన ఆపండును తీసికొనుట సమంజసముగా లేదు" అని మందలించెను. అపుడు శ్రీస్వామి వారిట్లు పలికిరి "శ్రీరామకృష్ణులపలుకులు వింటివికావా? 'భక్తితో నిచ్చు ప్రతి వస్తువును ఎట్టి హానియు కలిగింపదు' అనెడివారు గదా శ్రీగురుదేవులు." రోగి మరణశయ్యపైనున్నం దున ఆతని తృప్తిపఱచుటకే ఆఫలమును శ్రీవారు పుచ్చుకొనిరి కాని యితరకారణమేదియు లేదు.

శ్రీశారదాదేవిగారు కలకత్తా వచ్చినప్పు డెల్ల ఉద్బోధనకార్యాలయముమేడమీదనుండు వారు. ఇతర సమయములందు తమ స్వగ్రామ మగు జయరాంబటియం దుండువారు. ఇట్లుండ 1920 వ సంవత్సరమున శ్రీ శారదాదేవి గారికి జయరాంబటియందుండగా తీవ్రవ్యాధి సంభవించెను. ఆ పల్లెటూరియందు రోగనివార ణకు తగు సదుపాయములు కలుగజాలవని తలంచి శ్రీశారదానందస్వామివారు శ్రీదేవి గారిని కలకత్తాకు రప్పించి, వైద్యసాహా య్యము కలిగించిరి. శ్రీశారదాదేవిగారి ఆరోగ్యార్థము తాము చేయవలసిన కార్యము సమస్తము శ్రద్ధాభక్తులతో చేయుచు శ్రీశారదానందులు ఎంతయో సేవచేసిరి. కాని అందువలన నేమియు లాభములేక పోయెను. శ్రీమాతృదేవి అయిదారు మాసముల యనంతరము శరీరత్యాగము కావించిరి. ఇటుపయిన రెండు సంవత్సరములకు శ్రీరామ కృష్ణసేవాసంఘమునకు ప్రథమాధ్యక్షులై

యుండిన బ్రహ్మానందస్వాములవారును మహా సమాధి నందిరి. శ్రీవారికి వీరిరువురియందును అత్యంత గౌరవాభిమానములు గలవు. వీరిరువురి నిర్యాణము శ్రీవారి మనస్సున కలతను గలిగించెను. ఇట్లు ఒక్కొక్కరుగా తమ గురుభాయిలు తమ్ము వీడి పోవుట శ్రీవారికి ఒంటరి వారైన కనిపించెడిది. శ్రీవారి కార్యకరణోత్సాహము నానాటికి క్షీణింపదొడగెను. కావున వారు తమ కాలమును నెక్కువగా ధ్యానమునందును జపమునందును గడుప నారంభించిరి. వీరి కార్యకలాపము మాత్రము తప్పినది కాదు. కాని ఆ కార్యనిర్వహణము శ్రీవారు స్వయముగా చేయక, ఇతరుల చే చేయించుచుండెడివారు. ఈ కాలమున శ్రీవారు శ్రీశారదాదేవిగారి జన్మస్థలమగు జయరాంబటియందొక మందిరము నెలకొల్పిరి. దానికి దగిన ధనము, సంచాలనము,—ఇవన్నియు తాము దగ్గర నుండకపోయినను ఎప్పటి కప్పుడు ఆ కార్యనిర్వహణమును గూర్చి వలసిన విషయమును దెలిసికొనుచు, తగిన రీతిని ఆ కార్యమును కొనసాగించుచుండిరి. ఆ దేవాలయము 1923 వ సంవత్సరము, ఏప్రిల్ మాసమున అక్షయతృతీయనాడు ప్రతిష్ఠింపబడినది. ఆ ప్రతిష్ఠాపనోత్సవమత్యంత జయప్రదముగా జరిగెను. శ్రీమాతృదేవిగారి శిష్యులు, భక్తులు—ఎందఱో సాధువులు ఆనాడు అచ్చట గుమిగూడి కొన్నిరోజులవఱకు ఉత్సవమున పాల్గొని జయప్రదము గావించిరి. నేడు ఆ దేవాలయము శ్రీశారదాదేవిగారి జ్ఞాపకచిహ్నముగా నుండుటయే కాక శ్రీశారదానందుల భక్తి ప్రపత్తులకు నిదర్శనముగా నున్నది.

శ్రీవారు తమ జీవితకాలమున గావించిన సేవయొక గొప్పకార్యము మొట్టమొదటి శ్రీ రామకృష్ణ సేవాసంఘ సమావేశము (Convention). ఆ సమావేశము ముఖ్యముగా శ్రీరామకృష్ణ సంఘ సాధువులకొఱకే యేర్పరుపబడినది. పలు కేంద్రములనుండి యెందఱో సాధువులు వచ్చిరి. వారందఱును గలిసి ప్రతియొక్క ఆశ్రమ కార్యము నెట్లు నిర్వహింపబడుచున్నదో చర్చించిరి. శ్రీశారదానంద స్వాములవారు ఈ సమావేశ ప్రారంభమున సాధువులకు చదివి వినిపించిన ఆహ్వానపత్రమునందు శ్రీరామకృష్ణ సేవాసంఘము నాటివఱకు నిర్వహించిన కార్యకలాపమంతయు విశదీకరించి, ఆ విషయమున తమకు గలిగిన కష్టనష్టముల దెలుపుచు వాని నివారణకు తాము కావింపగలిగిన, అనుసరింపవలసిన మార్గమునుగూర్చి చక్కగా బోధించిరి. ఆ నాటి ఆహ్వానపత్రము ఆనాటి యుత్సవమును, ఉత్సాహమునే కాక, శ్రీ రామకృష్ణ సేవా సంఘము 'శాశ్వతముగా సర్వకాల సర్వావస్థలయందు కావింపవలయు కార్యదక్షత, విధానము—వీనిని నేటికిని విశదముగా మార్గదర్శినియై పురోమార్గమును జూపుచున్నది.

నానాటికి సంఘకార్యకలాపము అధికరించుచుండెను. శ్రీస్వామివారు ఆ కార్యమును ఒంటరిగా నిర్వహింపజాలక అందులకు తగిన (కమిటీ) ఉపసంఘము నొకదాని నేర్పఱచిరి. మెల్ల మెల్లగా వారు కార్యకలాపమునుండి విడివడుచు జపధ్యానములం దెక్కువ కాలమును గడుపనారంభించిరి. ఒకానొక కాలమునందు క్షామనివారణము, సాంక్రామికరోగ గ్రస్త సేవనము మున్నగు కార్యములందు బద్ధకంకణులై యుండిన శ్రీస్వామివారే ఆ కార్యకలాపము నెల్ల నొక మూలవైచి, యెల్లప్పుడు జపధ్యానములందే-తమ కార్యములను గడుపుట శిష్యుల

కనేకులకు ఆశ్చర్యమును గలిగించినది. ఒక్కొక్కప్పుడు మిక్కిలి చనవుగలిగినవారు కొందఱు "స్వామీ! మీయట్టి మహాత్ములేల యిట్టి తీవ్రమయిన తపస్సు చేయవలయును?" అని యడిగినచో శ్రీవారూరక చిఱునవ్వు నవ్వి సరిపెట్టువారు.

శ్రీశారదానందుల శరీరస్థితి కొంచెము కొంచెముగా క్షీణింపనారంభించినది. తమ శరీరము పలువిధ వ్యాధులచే పీడింపబడినను అందలి యథార్థస్థితిని శ్రీవా రెవరికిని తెలియజేసెడివారుకారు. కావుననే వారి నిర్యాణమునందు గూడ శ్రీవారింత త్వరలో నిర్యాణముచెందుదురని యెవరును గ్రహింపజాలక పోయిరి.

ఆనాడు శనివారము 6 ఆగస్టు 1927. శ్రీ స్వామివారు తమ అలవాటు ననుసరించి ఉదయముననే లేచి ధ్యానమునకు గూర్చొనిరి. సాధారణముగా ఆధ్యానము మధ్యాహ్నము వఱకు జరిగెడిది కాని ఆనాడు త్వరగాలేచి పూజాగృహమును జేరి యందు సుమారు అర్ధ ఘంటసేపు జరిపిరి. పిదప బయటికివచ్చి దైనందిన కృత్యముల కావించిరి. సాయంకాలము దీపారాధనానంతరము శ్రీవారు తమగదిని ప్రవేశించిరి. అపుడు వారి సేవకుడు ముఖ్యములగు (ఆఫీసు) కాగితముల పట్టుకొని వచ్చెను. వానిని దీసికొని మేజాలో బెట్టుచుండగా తల తిరిగినది. వెంటనే సేవకునిబిలిచి, 'నీవు త్వరగా మందు తయారుచేయు'మని పలికి, పడకమీద శయనించిరి. అంతయే. పిదప డాక్టర్లు ఎందఱోవచ్చిరి. అది 'సన్న్యాసరోగ' మని నిర్ధారణకావింపబడెను. ఎన్నిమందులిచ్చినను శ్రీ స్వామివారికి స్పృహకలుగనే లేదు. ఈ విషయము ఎల్ల కేంద్రములకు దెలుపబడెను. ఎందఱో సాధువులు, బ్రహ్మచారులువచ్చి ఉద్బోధనాకార్యాలయమున గుమిగూడిరి. శ్రీవారుమాత్రము అట్లే శయనించియుండిరి. ఇట్లే 19 వ తారీఖువఱకు నుండి ఆ నాటి రాత్రి రెండు గంటలకు మహాసమాధినందిరి. శ్రీరామకృష్ణ సేవాసంఘమునకు మరమునకు ఆధారభూతుడయిన మహానుభావుడు శాశ్వతముగా మానవనేత్రమార్గమును వీడిపోయెను.

శ్రీరామకృష్ణ గురుదేవుని శిష్యవర్గమున నొక్కొక్కరు నొక్కొక్క విశేషాంశమును జూపెడివారు. స్వీయ మేధాశక్తివలన యావత్ప్రపంచమును నుఱ్ఱూతలూగించి, నిదురించుచున్న భారతమును మేల్కొల్పి ఆధ్యాత్మికశక్తి జీవునియందే కలదనియు అనుష్ఠానలోపమే వైఫల్యహేతువనియు జాటి అనుష్ఠాన వేదాంతమును సలక్ష్యముగ స్థాపించిన మహామహులు శ్రీవివేకానందస్వాములవారు. రేయింబవళ్లు మానవుడెట్లు భగవద్భావమునందే నిమగ్నుడై బ్రహ్మానందానుభూతిని బడయగలడోయన్న విషయమును శ్రీబ్రహ్మానందస్వాములవారు అనుష్ఠానపూర్వకముగ నిరూపించియుండిరి. ప్రేమస్వరూపుడగు భగవానుని ధ్యానించుట వలన మనహృదయమెట్లు ప్రేమమయమై భాసిల్లగలదో యన్న విషయమును నిరూపించి రూఢిపరచినవారు శ్రీ ప్రేమానందస్వాములవారు. ఇట్లే శ్రీరామకృష్ణగురుదేవుల శిష్యులెల్లరు నొక్కొక్కవిషయమును, విశేషాంశమును ప్రజానీకమునకు జాటియున్నారు. అట్టి శిష్యవర్గమునకు జెందిన మహానుభావులలో నొక్కరైన శ్రీ శారదానందస్వాములవారు అత్యంత కష్టతరమగు కర్మయోగాభ్యాసనమును తమ జీవితమున విపులముగ విశదీకరించియున్నారు. ఎంతటి యుత్సాహముతో ఎట్టి

మానసికస్థితితో నొక కార్యమున కాలిడు దురో అట్టి యుత్సాహముతోడనే, అట్టి మానసిక పరిస్థితితోడనే—ఆవంతయు మార్పులేని హృదయముతో వారా కార్యమునుండి బయట బడగల శక్తిని గలిగియుండిరి. మహోతంత్ర సముపేతమగు నీ కార్యక్షేత్రమున నీటిలోని తామరవలె నావంతయు కళంకములేని విధమున వారి జీవితము చక్కగా గడచుచుండెడిది. భగవద్వ్యాఖ్యానుసారిణి సమస్తకర్మములను భగవదర్పణముగావించి తాము నిష్కాములైయుండుటయే కర్మయోగ సిద్ధాంతమని చక్కగా గుర్తించియుండుటవలననే శ్రీవారిట్టి జీవనమును నడుపగలిగిరి. సమస్తకర్మములందును విలీనులైయున్నను ఆధ్యాత్మికరాజ్యమున మానవులెట్లు ఉచ్చస్థానము నలంకరింపగలరాయన్న విషయము శ్రీవారి జీవితమునందలి ప్రతి ఘట్టమునందును కన్నులకు గట్టినట్లుండును, 'యోగః కర్మసుకౌశల' మ్మన్న వాక్యము వారి జీవితమునందు సార్థకమునందినది. ఎట్టి కర్మకలాపమునందు విలీనులైయున్నను భగవత్సంబంధమును మాత్రము వారొక క్షణకాలమును విడిచినవారు కారు.

వారియందువలె కర్మకౌశల్యము మఱి యెవరియందును గనుపింపదు. భగవద్గీత ద్వితీయాధ్యాయమునందు స్థితప్రజ్ఞనుగూర్చి వివరింపబడియున్నది. ఆ లక్షణములన్నియు వీరియందు సంపూర్ణముగ గనిపించుచున్నవి. వారి కార్యభారమును వహించినకాలమున నెట్టి దుర్ఘట సంఘటనలు ఎట్టి దుఃఖకర విషయములు సంభవించినను వారు వాని నావంతయు లక్ష్యపెట్టువారు కారు. శరీరవిషయమున ఆరోగ్యముగానున్న కాలమున నుదాసీనతను వహించినయట్లే అనారోగ్యస్థితియందును శోభాయమానమగు ముఖవర్చస్సుతో విరాజిల్లెడివారు. ఎట్టి కార్యమయినను దీర్ఘదర్శిత్వముతో నెల్ల విషయములు ముందు వెనుక లాలోచించి పూనెడివారేకాని ఆకస్మికోద్రేకముతో కార్యవిఘాతము నాలోచింపక కాలిడువారుగారు. సర్వదా తమ్ము సాక్షీభూతులగా దలంచి సమస్తకార్యములను అనాసక్తులై కావించుటయే వారియందలి విశేషము. ఎన్నికార్యములందు విలీనులైయున్నను శ్రీవారు మహాయోగివలె చరించుచుండువారు. వారి హృదయమునందెల్ల అచంచల దివ్య ప్రశాంతి తేజోరూపమున దేజరిల్లుచుండెడిది. వారియందు యోగచతుష్టయము సంపూర్ణ సమన్వయమునంది యందు దేనికి ప్రాముఖ్యత గలదో నిరూపింప సాధ్యముగాని పరిస్థితి వారి దివ్య జీవితమున గోచరించెడిది. వారికి సాటియగు కర్మయోగులు లేరు. కాశీ క్షేత్రమునందలి విశ్వనాథదేవాలయమునకు బోయినను పూరీ జగన్నాథాలయమునకు బోయినను వారు విగ్రహమూర్తిపై కన్నుంచి భక్తినిబద్ధాంజలులై ధ్యానింపనున్న దృశ్యము వర్ణనాతీతము. దానింగన్న వా రాదృశ్యమును నెన్నడును మఱువజాలరు. శాస్త్రముల బోధించుచున్న కాలమున విద్యార్థులు గావించు తర్కములన్నింటికి శ్రీవారు యుక్తియుక్తముగ తమమేధాశక్తికి వన్నెపెట్టుచు శాస్త్రీయ సమాధానముల నొసగుచుండువారు. ఇట్లే ధ్యానయోగమార్గానుసారులకు గలుగనున్న సందేహములెల్ల చక్కని ఫక్కిని సునాయాసముగ దీర్చుచుండువారు.

వారి జీవితమునంతయు ముఖ్యముగా రెండు దృక్కోణములనుండి గ్రహింపగలము—ఒకటి ఆదర్శసాధువు, రెండు శ్రీరామకృష్ణ సేవాసంఘ కార్యదర్శి. ఇంతటి మహాసంఘమును, ఇందఱు

కార్మికులను ననేకమార్గమున పొచ్చెములేని రీతిని నడుపుటయన్న సామాన్యముగాదు. అసాధారణ శక్తికలవారే కాని ఆ కార్యమును బూనుకొనజాలరు. వీరీ కార్యము నెట్లు నెఱవేర్పగలిగిరో కదా యని తెలియవలయునన్న కార్మికులచిత్తములనెల్ల వారివారి కనువగు స్థితికి బోయి తమవైపునకాకర్షించెడి మేధాశక్తి వీరికి కలిగియుండుటయే యిందులకు ప్రధాన హేతువని తేలగలదు. ఎట్టి పాక్షికాశయమును లేక సార్వజనీనమగు శ్రేయస్సునకే వీరు పాటుపడ నుంకించెడివారు. లేనిపోని చాడీలు చెప్పి వీరి నొకరికి వైరులగావింపవలయునన్న అది అర్థరహిత ప్రలాపము, వృథాప్రయాస. ఎంతటి పసిబాలుడయినను తమకేదియేని విన్నవింపవచ్చినచో మిక్కిలి ఓర్పుతో విని వానికి వలయు మేలుగావించుటయు తాము స్వయముగా నెందేని పొరపడినచో నితరులనెల్ల క్షమాపణ కోరుటయు వీరియందు స్పష్టముగా గోచరించు సుగుణములు.

ఆధ్యాత్మిక జీవనమున భహుదేవతాదర్శనములు, అనుభూతులు పడసినను వారెన్నడును ఆ విషయముల వెల్లడిగావించెడివారు కారు. తప్పనిసరియైనప్పుడును ఏదో ఒకటిరెండు మాటలతో చాల అరుదుగా వ్యవహారము తేల్చెడివారేకాని స్వీయానుభూతులనుగూర్చి వారు ముచ్చటించినవారు గారు. వినయమే రూపొందెనో యన్నట్లున్న మహానుభావులగు వీరికి అహంభావమణుమాత్రమును నుండెడిది కాదు. సంఘమునందు ముఖ్యమును గొప్పదియు నగు పదవిని కలిగియున్నను వారు సమస్తవిషయములందును అందఱితోడను సమానముగనే ప్రవర్తించెడి వారు.

ఉదయాది దినమంతయు కర్మనిలీనులై యున్నను తుదకు రాత్రులందో సాయంసమయములందో ధ్యానమున గంటలకొలది గడపుచుండువారు. అందువలననే వారి మనస్సు బాహిర విషయములవలన చలింపకుండెడిది కాబోలు. వారిదగ్గరనున్న బ్రహ్మచారులకు సాధువులకు నిట్లుపదేశించువారు వేయిపనులున్నను జపధ్యానములను విడువవలదు. మనుష్యుడు జీవితకాలమంతయు పనిచేయజాలడు. కాన శైశవమునుండియు జపధ్యానములున్న నవియే వానిని చివరవఱకును రక్షింపగలవు. ఈవిషయము సాధువులు, బ్రహ్మచారులేగాక యెల్లరును గమనించి యనుసరింపదగినది. మానవజీవితమున ఆధ్యాత్మికముగా నున్నతిగాంచుటయే యాతని రక్షింపగలదు. కాన శ్రీవారి యీ సలహాయెల్లను అనుసరింపదగినది. అవతారపురుషుడగు శ్రీరామకృష్ణుని శిష్యులయిన యిట్టి మహానుభావులెల్ల మన జీవనమున కాదర్శప్రాయులై యుందురుగాక! వారి కారుణ్యామృతము మనపై వర్షించి మనయందలి ఆధ్యాత్మిక బీజమును ప్రబలము జేయుగాక!



# గ్రంథసమీక్ష

## చూడాల

రచయిత శ్రీ బిట్రా ఆంజనేయులు. డబుల్ క్రౌన్ 1/16 సైజు (168 + 8) పుటలు. వెల· రూ. 1-8-0. వలయువారు, బిట్రా ఆంజనేయులు, తాడికొండపోష్టు, గుంటూరు జిల్లా అని వ్రాయవలయును.

ఇది యోగవాశిష్ఠాంతర్గతమగు చూడాలోపాఖ్యానము. గ్రంథకర్త దీనిని ప్రబంధకావ్యముబోలె పద్యకావ్యముగ రచించెను. రాగవిలాసము, ప్రబోధవిలాసము, లీలావిలాసము నను విలాసత్రయంబును మూడాశ్వాసములుగ రచింపబడినవి. పద్యములు హృద్యములై యలరారుచున్నవి. శైలియు నాతికఠినమై చదువరుల నూరించుచున్నది. ఆధ్యాత్మిక విద్యాబోధకమయ్యు నీ కావ్యము నవరసభరితమై యొప్పుచున్నది. జ్ఞానప్రబోధనమున నిట్టి యుపాఖ్యానము లెంతేని సహాయము గావింపగలవు.

మచ్చునకు :

చ. జలము తరంగరూపమును
 చయ్యనఁ దాల్చినయట్లు చిత్తమే
తలఁప విచిత్రకర్మములఁ
 దాల్చిని భావవిభావచేష్టలన్
సలుపుచు విష్టపత్రయము
 చాయను సర్వపదార్థరూపతన్
వెలయును కాలధర్మముల
 వీడ కనంతబలప్రపూర్ణమై. 3-191.

ఉ. చెప్పినదాని నింత చెవిఁ
 జేర్చినఁ జెప్పగవచ్చు నేరికిన్
జెప్పినదంతయున్ వినక
 చేత మదెచ్చటనేని జేర్చినన్
జెప్పినదెల్ల మాటలకుఁ
 జేటగు నంతియకాని యందునే
మచ్చుపడన్ ఫలంబుగను
 నయ్య! యెఱుంగవె నీవు చెప్పుమా!
2-81.

---

## రత్నత్రయము

రచయిత· శ్రీ బులుసు వేంకటేశ్వరులు, బి. ఏ. డబుల్ క్రౌన్ 1/16 సైజు (4 + 92) పుటలు. వెల ఒకరూపాయి. వలయువారు, శ్రీ బులుసు వెంకటేశ్వరులు, బి. ఏ., రామారావుపేట, కాకినాడ అని వ్రాయవలయును.

ఇది మానవప్రపంచమున వన్నెవాసిగాంచి ఆదర్శప్రాయులైన ముగ్గురు మహాపురుషుల జీవితములు గల వచన గ్రంథము. ఒకటి, జ్ఞానిరత్నమగు రామతీర్థ జీవితము, రెండు, వైజ్ఞానికరత్నమగు రామను పండిత చరిత్రము, మూడు, విద్వత్కవిరత్నము పండితరాయల జీవితచరిత్రము—ఇందు వర్ణింపబడియున్నవి. భాష సలక్షణమును సుశ్రావ్యమునై హృద్యములగుశబ్దజాలములతో సరళమై యలరారుచున్నది. దీనిని నేటి విద్యార్థిలోకమున కంద

జేయు తలంపుతో గ్రంథకర్త రచించుటయే యీ శైలికి ప్రధానకారణము. ఇక విషయమా, పండితపామరజనంబులందఱును జదివి తమ జీవితముల సార్థకము గావించుకోవలయు మహాపురుష జీవితములు. ఈ రచనయందు గ్రంథకర్తగారు స్వీయాభిప్రాయము నిట్లు వెలిబుచ్చియున్నారు " దేశభక్తి, విజ్ఞానరక్తి, సమరసశక్తి—ఈ మూఁడింటిలో దైవభక్తి మిళితమై మనబాలుర కలవడిననాడే మన విద్యార్థులు భారతీయ విద్యార్థు లనఁదగుదురు." గ్రంథకర్త స్వీయాభిప్రాయానుసారిణి గ్రంథము సాంతము సహజమును సరళమును నగు భాషయందు రచించి విద్యార్థిలోకమునకే కాక సమస్త భారతీయులకును మేలొనఁగూర్చిరి. పాఠకులు సంపూర్ణ ఫలమును బడయుదురుగాక!

---

## పూర్ణయోగము

రచయిత శ్రీ నలినీకాంతగుప్త, అనువాదకులు శ్రీ శి. నారాయణరెడ్డి. డబుల్ క్రౌన్ 1/16 సైజు, (6 + 110) పుటలు. మూల్యము. రూ. 1-4-0. వలయువారు, ప్రకాశకులు, శ్రీ అరవిందాశ్రమము, పుదుచ్చేరి అని వ్రాయవలయును.

ఆంగ్లభాషయందు శ్రీ అరవింద యోగీంద్రులు రచించిన యోగసమన్వయము నాధారముగా జేసికొని శ్రీ నలినీకాంతగుప్త బంగాళాభాషయందు పూర్ణయోగమును రచించుటయు దాని నాంధ్రుల కందజేయుటకై, శ్రీ శి. నారాయణరెడ్డిగా రాంధ్రీకరించిరి. ఏ మానవుడైనను ఏ యోగము నభ్యసించి నను, అనుసరించినను, గమ్యమును బడయ గలడనుటయే యిందలి ముఖ్యవిషయము. భాషయు సరసముగ నున్నది. చదువరు లీ గ్రంథపఠనమున ఆత్మోన్నతినంద సాధనలు గావించి ఫలము నందగలరు.

---

## ఆత్మభారతము

రచయిత శ్రీ బిట్రా ఆంజనేయులు. డబుల్ క్రౌన్ 1/16 సైజు (357 + 34) పుటలు. వెల రూ. 4-8-0. వలయువారు, శ్రీ బిట్రా ఆంజనేయులు, తాడికొండపోష్టు, గుంటూరు జిల్లా అని వ్రాయవలయును.

ఇది ఆత్మపరముగా భారతమును సమన్వయించి వ్రాయబడిన గ్రంథము. శైలి మనోహరము, పదములు సరసములు. ఆంధ్రమున నిట్టి గ్రంథములకు పూర్వులే పూనియున్నారు. ప్రబోధచంద్రోదయాదు లిట్టివేగదా! అయినను భారతమువంటి మహాగ్రంథమును సంపూర్ణముగా ఆత్మపరముగా నిట్లుపమించి వ్రాసిన గ్రంథరాజములలో నిదియే ఆంధ్రమున ప్రథమ మని చెప్పక తప్పదు. ఈ విషయమున గ్రంథకర్త పూనినమార్గ మత్యంతానుసరణీయము. భారతము నవగతము చేసికొన్న వారెల్ల అత్యంత సులభముగ ఆధ్యాత్మిక విషయముల దెలియగలుగునట్లు వివరింపబడిన ఈ గ్రంథము పాఠకలోకమున కత్యంతోపయుక్తమనుట యతిశయోక్తి కానేరదు. ఆధ్యాత్మికవిద్య నిట్లు ప్రచారము గావించుచున్న గ్రంథకర్త ఆంధ్రులకెల్ల అభినందనీయులు.

---

సౌభాగ్య

(ప్రత్యేక వార్షిక సంచిక)

మదరాసు ప్రభుత్వ స్త్రీజనాభ్యుదయశాఖ ప్రచురణ. రూ. 0-8-0. సాధారణ విడి పత్రిక రూ. 0-3-0. తపాలాఖర్చులతో సహా సాలుచందా రూ.2/-లు మాత్రమే. వివరములకు ఇట్లు వ్రాయుడు The Editor, Womens Welfare Journal, Government House, Mount Road, Madras 2.

మహిళాభ్యుదయమునకు అత్యంతాదరాభిలాషలతో పాటుపడుచున్న "సౌభాగ్య" నిరంతరకృషిఫలితముగా ఈ సంవత్సరము వెలువడిన ప్రత్యేక వార్షిక సంచిక ఇది. ప్రభుత్వ పోషణలో స్త్రీజనాభ్యుదయశాఖ కార్యకలాపములు సంచికలో కట్టకడపట విశదీకరింపబడినవి. "జీవితంలో ఆనందము", "శిశుపోషణ", "అందం", "ఇంటి తోట" మొదలైన చిన్న చిన్న వ్యాసములు ప్రతి ఇల్లాలికి సామాన్యముగా కలుగు సందేహములను నివర్తించుటయేగాక మిక్కిలి వైజ్ఞానికముగా ఉన్నవి. అతివలకు చేదోడు వాదోడు సౌభాగ్య.

---

# సంఘవార్తలు

## శ్రీ రామకృష్ణ పరమహంస - జయంత్యుత్సవము

తిరుత్తణి తాలూకాయందలి కంచిరాజు గురువరాజు కండ్రిగ గ్రామమునందు శ్రీ రామకృష్ణసేవాసమితివారిచే 31-3-51 నాడు శ్రీరామకృష్ణపరమహంస జయంత్యుత్సవము జరుపబడెను.

నాటి ఉదయము 7 ఘంటలకు బీదలకు అన్నదానము గావింపబడెను. పూజాదులు యథావిధిగా జరుపబడెను.

సాయంత్రము 7 ఘంటలకు బహిరంగ సమావేశము జరిగెను. నాటిసభకు చెన్నపురి మైలాపూరు శ్రీరామకృష్ణమఠస్థులగు శ్రీశ్రీశ్రీ ఋతజానందస్వాములవా రధ్యక్షత వహించిరి. చెన్నపురి పచ్చయప్ప ఉన్నతపాఠశాలాంధ్రపండితులు విద్వాన్ శ్రీదీనదయాళుగారు శ్రీ రామకృష్ణగురుదేవుని జీవితచరిత్ర, ఉపదేశములు—ఈ మున్నగు విషయముల విపులముగ వివరించుచు నుపన్యసించిరి.

తదుపరి అధ్యక్షులవారు జయంత్యుత్సవముల వివరించుచు యావత్ప్రపంచమునను అవి యెట్లు కొనసాగింపబడుచున్నదియు విశదముగా వెల్లడించిరి. స్వయముగా శ్రీరామకృష్ణ సంఘమునకు సంబంధించి, ఆధ్యాత్మిక జీవనమును గడుపుచున్న శ్రీ స్వాములవారు శ్రీ గురుదేవుల మహిమలను, ఉపదేశములను, వారి అవతారమువలన మనము పొందవలసిన లాభములు, అందులకుగల యుపాయములు విశదీకరించిరి.

రాత్రి పది ఘంటలకు శ్రీ కాళహస్తి వాస్తవ్యులు శ్రీ బొజ్జా కృష్ణదాసుగారు హరికథా కాలక్షేపము గావించిరి.

అనంతరము సభ్యుల అభివందనములతో సభ జయప్రదముగ ముగిసెను.

# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

## శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము)

540 పుటలు సర్వాంగ సుందరమగు చతుర్థ ముద్రణము వెల రూ. 3-4-0

## శ్రీ మద్భగవద్గీత

480 పుటలు శ్రీధరీయ టీకాసార ప్రతిపద టీకాతాత్పర్య విశేషార్థ సహితము రూ. 3-0-0

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

350 పుటలు (మద్రాసు ఆంధ్ర విశ్వవిద్యాలయములందు పాఠ్యగ్రంథము) రూ 2-8-0

## శ్రీ శారదాదేవి చరిత్ర

256 పుటలు (ఆంధ్ర విశ్వవిద్యాలయమున పాఠ్యగ్రంథము) వెల రూ. 1-12-0

## శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

136 పుటలు (ఆదర్శప్రాయుడగు గృహస్థుని జీవితము) వెల రూ. 1-4-0

| | | | |
|---|---|---|---|
| శారదా ప్రసంగములు | 2 | 8 | 0 |
| ప్రబోధరత్నాకరము | 2 | 4 | 0 |
| రాజయోగము .. | 2 | 4 | 0 |
| కర్మయోగము | 1 | 8 | 0 |
| భక్తియోగము | 1 | 4 | 0 |
| వివేకానందలేఖావళి (మొదటి భాగము) | 1 | 8 | 0 |
| వివేకానందలేఖావళి (రెండవ భాగము) | 1 | 8 | 0 |
| అనుష్ఠాన వేదాంతము | 1 | 4 | 0 |
| వివేక సూర్యోదయము | 1 | 0 | 0 |
| శ్రీ పరమహంస నీతికథా రత్నములు | 0 | 12 | 0 |
| భక్తిమార్గము | 0 | 8 | 0 |
| షికాగో నగరోపన్యాసములు | 0 | 8 | 0 |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| గురూపదేశములు . | | | | | 0 | 8 | 0 |
| నాసంస్కరణ యుద్ధవిధానము | | | | | 0 | 6 | 0 |
| నా గురుదేవుడు | | | | | 0 | 6 | 0 |
| శ్రీ పరమహంస జీవిత సంగ్రహము | | | | | 0 | 4 | 0 |
| నవీన భారతదేశము | | | | | 0 | 4 | 0 |
| ముక్తిమార్గము | | | | | 0 | 8 | 0 |
| సర్వం విష్ణుమయం జగత్ (తెలుగు) | | | | | 0 | 3 | 0 |
| శ్రీ రామనామ సంకీర్తనము | | | | | 0 | 1 | 0 |
| యతిగీతము (పద్యకావ్యము) | | | | | 0 | 1 | 0 |
| నా మతము | 0 | 0 | 6 | డజను | 0 | 5 | 0 |
| సింహ గర్జన | 0 | 0 | 6 | డజను | 0 | 5 | 0 |

ఇవియేకాక

సంస్కృత, ఆంగ్ల, ద్రావిడ, హింది, కన్నడ గ్రంథములును

వేదాంతకేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాస పత్రికలును మాయొద్ద దొరకును

**శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి**

మున్నగువారి ఛాయాచిత్రములును మాయొద్ద దొరకును

ఇట్లు వ్రాయుడు

మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి.

సంపాదకులు శ్రీ ఋతజానందస్వామి; శ్రీ వెగురుమూడి వేంకటకృష్ణరావు
శ్రీ కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటరు ప్రెస్సు లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి,
శ్రీ ఆదిదేవానంద స్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 20-4-51.

# విషయసూచిక



# శ్రీ రామకృష్ణ ప్రభ

## చందాదారులకు

౧. పత్రిక ప్రతిమాసము 20-వ తేదీన వెలువరింపఁబడును. ఒక వారము, పదిరోజులు చూచి ప్రతి మీకు అందకపోయినయెడల ఉత్తరము వ్రాయుఁడు.

౨. సంవత్సర చందా రు. 3 లు మాత్రమే. జనవరినెల నుండిగాని జూలై నెల నుండిగాని చందాదారులుగఁ జేరవచ్చును. ఇతర మాసములలోఁ జేరదలచు వారికి జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని సంచికలు చేర్చిపంపఁబడును. విడిప్రతి రూ. ౦—౬—౦ లు. హిగిన్‌బాదమ్‌వారి స్టాలులోఁగాని, మీ పత్రిక ఏజెంటును గాని అడుగుఁడు.

3. ఉత్తర ప్రత్యుత్తరములు వీలైనంతవఱకు ఇంగ్లీషున వ్రాయుచు మీ చందాదారు సంఖ్య నుదాహరింపుఁడు. ఉత్తరములను "మేనేజరు, శ్రీరామకృష్ణప్రభ" అను చిరునామాకు వ్రాయుఁడు.

౪. చిరునామాయందు ఎట్టిమార్పుగలిగినను 10-వ తారీఖునకు ముందుగా మా కార్యాలయమునకుఁ దెలుపవలయును. లేనిచో, పత్రిక పూర్వపు చిరునామాకే పంపఁబడును.

## వ్యాసకర్తలకు

౧ కేవలము నైతిక ధార్మిక వైజ్ఞానిక విషయకములైన వ్యాసములేకాక, సాహిత్యమునకును కవిత్వమునకును సంబంధించిన ఏ వ్యాసములైనను బంపవచ్చును. సులభ సుందరమగు గ్రాంథికభాషలో వ్రాయవలయును.

౨. వ్యాసములు అచ్చులో మూఁడు పుటలకు మించరాదు. ప్రతినెల ఒకటవ తేదీకి వ్యాసములు మాకు అందవలెను.

3 వ్యాసములను, విమర్శకుఁ బంపు గ్రంథములను, వినిమయముగఁ బంపెడి పత్రికలను "సంపాదకుఁడు శ్రీరామకృష్ణ ప్రభ శ్రీరామకృష్ణ మిషన్ స్టూడెంట్స్ హోమ్, మైలాపూరు, చెన్నపురి" అను చిరునామాకు వ్రాసి పంపవలెను.

౪. వ్యాసము తిరుగఁ బంపఁబడవలయునచో఼డగు పోస్టేజి చేర్చి పంపవలయును.




# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౭ } ౧౯౫౧ – మే ·· ఖర – వైశాఖము { సంచిక ౧౧


## ప్రార్థన

# శ్రీ శారదా స్తోత్రము

నమస్తే చిన్మయీ చితా చింతామణీ, తంత్ర మంత్ర మయీ యంత్ర నివాసినీ
కుమారీ యువతీ వృద్ధారూపధారిణీ— అనాధి అశేషస్థితిగతి శారదే !

నమస్తే యోగమాయా శివే దాక్షాయనీ, దీక్షాదాయినీ దేవీ నారాయణీ
కల్పలతికా తత్వప్రదాయినీ— జనన మరణ వినాశినీ శారదే !

నమస్తే భవానీ ఇంద్రాణీ ఊర్వశీ, గళితకుంతల కాళీ ఏ లోకేశీ
అట్టహాసినీ ఖట్వాంగధారిణీ— దైత్యవిమర్దినీ మహాకాళీ శారదే !

నమస్తే చండికా రక్తబీజ శోషణీ, చాముండా ప్రచండికా చండముండనాశినీ
విశ్వస్తంభినీ జృంభనకారిణీ— ఆదిత్యగణవందితా జననీ శారదే !

నమస్తే దుర్గా దుర్గమ సంసారే, త్రైలోకపూజితా శక్తి కంసారే
ఊర్ణా అర్పణా ఉమా చరాచరే— నిఖిలతేజఘణ ఘోరా శారదే !

—శ్రీ మణీంద్రమోహన్ ఛాకీ



ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ

# శ్రీ రామకృష్ణ వచనామృతము — 'మ.'

## దక్షిణేశ్వరమందిరమున శ్రీ రామకృష్ణుడు

9 సెప్టెంబర్, 1883.

నాడు ఆదివారము. శ్రీ రామకృష్ణుడు మధ్యాహ్నభోజనమును సేవించి తనగదిలో చిన్నమంచముపైన గూర్చొనియుండెను. సుమారు 2 ఘంటలయినది. గదిలో రాఖాల్, 'మ.', రతన్—క్రింద గూర్చొనియుండిరి. రామలాల్, రామ్‌ఛట్టోపాధ్యాయ్, హజ్రా అపుడపుడే వచ్చి కూర్చొనుచుండిరి. రతన్ యదుమల్లికుని తోటను పరీక్షించుచుండువాడు. శ్రీరామకృష్ణులయందు భక్తి కుదురుటవలన నపుడపుడు దక్షిణేశ్వరమున కేతెంచి వారిని చూచిపోవుచుండెను. పలువిషయములను మాట్లాడుచు మాటల సందర్భమున రతన్ 'యదుమల్లికుని కలకత్తాయందలి యింటియందు నీలకంఠునిచే తయారుగావింపబడిన నాటకము జరుగబోవుచున్నది' అని చెప్పుచు 'మీ రచటికి తప్పకుండ విచ్చేయవలయును. దినముగూడ నిశ్చయింపబడినది' అని పలికెను.

శ్రీరామ.—సరే, నాకును వెళ్లవలయునని ఆశగా నున్నది. ఆహా! నీలకంఠు డెంతటి భక్తితో పాడును!

ఒక భక్తుడు.—చిత్తము.

శ్రీరామ.—అతడు పాట బాడుచుండగా కంటినుండి కన్నీరు జలజల గారును. నేను నాటకము దర్శింప నేగినచో రాత్రి యచటనే యుందును.

రతన్—మంచిదే.

రామఛటర్జీ మొదలగువారు యదుమల్లికుని యింటియందు దొంగలుపడిన విషయమును గూర్చి ప్రస్తావించిరి.

రతన్—అవును. ఆ యింటి పూజాగృహమునందలి దేవుని బంగారపు పాదరక్షలు దొంగిలింపబడినవి. ఇల్లంతయు హడావుడిమయమయినది. మంత్రపళ్లెమువలన దొంగ పట్టుబడును. అందఱును గూర్చుందురు. అపుడా పళ్లెము దొంగిలించినవానియొద్దకు తనంతట తానే పోవును.

శ్రీరామ.—(నవ్వుచు) ఎట్లు పోవును? దానికేమి కాలుసేతులు గలవా?

రతన్.—కాదు, ఒకడు దానిని క్రింద నొక్కిపట్టును.

మరియొక భక్తుడు—అందులో నేదియో హస్తలాఘవమున్నది. అది యొక విద్యాకౌశలమే.

శ్రీరామ.—ఏ కౌశలమువలన భగవానుని పొందగలమో అదియే నిజమయిన కౌశలము. ఆ చాతురియే చాతురి.

ఇట్టి మాటలు జరుగుచుండగా కొందఱు లోనికేతెంచి శ్రీరామకృష్ణ గురుదేవునకు నమస్కరించి కూర్చొనిరి. అందులో నొకరు శ్రీరామకృష్ణులకు పూర్వపరిచితులు, అతడు తాంత్రికసాధనలు గావించువాడు. పంచ—

మకారసాధనగూడ గావించువాడు. అంతర్యామి యయిన శ్రీరామకృష్ణులు సమస్తమును తెలిసికొనిరి. వారిలో మరియొకడు ధర్మము పేరుచెప్పి యెన్నియో పాపకర్మలు చేయుచున్నాడు. అదియును వారెరిగియే యున్నారు.

శ్రీరామకృష్ణులు సంతానభావము గలవారు. వారికి స్త్రీలందఱును దేవీరూపిణులే. వేశ్యలనుగూడ వారట్లే చూచెడివారు.

శ్రీరామ—(నవ్వుచు) అచలానందు డిచటికి బోయెను? ఆనాడు కాళీకింకరు డేతెంచెను. ఆతనితోగూడ నొక సింగియు వచ్చెను. ('మ.' మొదలగువారితో) అచలానందుడు, వారి శిష్యుల భావములు వేరు. నాది సంతానభావము.

క్రొత్తగా వచ్చినవారందఱును ఏమియు బలుకక మిన్నకుండిరి.

శ్రీరామ:—నాకు స్త్రీలందఱు మాతృసమానలు. అచలానందు డవుడవు డిచటికి వచ్చియుండువాడు. ఇచటికి వచ్చిన పిదప భగవదర్పితమయిన కారణమును ఎక్కువగా స్వీకరించువాడు. నా సంతానభావమును విని తాను చేయుచున్నది సరియే యని వాదించుచు 'స్త్రీలతో గలిసి వీరభావమును నీవేల యంగీకరింపవు? తాంత్రికశాస్త్రములందు శ్రీ మహాదేవునిచే జెప్పబడిన విషయములు నీవేల స్వీకరింపరాదు? అందు వీరభావము సయితము వివరింపబడియున్నదిగదా!' అని హెచ్చరించువాడు. అపుడు నేను 'నేనేమి చెప్పగలనండి! నా కవన్నియు నచ్చుటలేదు. సంతానభావమే నాకు బాగుగా కనిపించుచున్నది' అని పలుకువాడను.

అచలానందుడు తన భార్యాపుత్రులను రక్షించెడివాడు గాడు. నన్ను సమీపించి, "పిల్లలందఱను భగవానుడు చూచుకొనును, అంతయు భగవదిచ్ఛయే" యని పలుకును. నేనేమియు ప్రత్యుత్తరమిచ్చువాడను గాను. కాని నాకిట్లు స్ఫురించుచుండెడిది "నీ పిల్లల నెవరు రక్షింతురు? భార్యాపుత్రుల విడనాడుట ధనార్జనమునకు మార్గము గాని యట్లుండవలయును. ప్రజలు నిన్ను జూచి యీతడు మహా గొప్పత్యాగి యని భ్రమించుచు నెంతయో ద్రవ్యమును కానుకగా నిత్తురు. ఇట్లు నీవు సంపాదింపగలవు."

వ్యాజ్యెములో జయించి యెక్కువ ధనము సంపాదించుటకో లేక వ్యాజ్యెములో నితరులను గెలిపించుటకో సాధనములు సలుపుట మిక్కిలి నీచబుద్ధి.

ద్రవ్యమువలన అన్నపానాదులు సంపాదింప వచ్చును, నివసించుటకు స్థలము సంపాదింప వచ్చును. భగవత్సేవ సాధుభక్తులసేవ కావింప వచ్చును. పేదలు ఎదుటబడినచో వారి కుపకారము చేయవచ్చును. ఇవన్నియు ద్రవ్యము యొక్క సద్వ్యవహారములు. ఐహికసుఖముల కొఱకు గాదు ద్రవ్యసంపాదనము. దేహసుఖముకొఱకును గాదు. సంగ్రామమునకును గాదు.

కొన్ని సిద్ధులు లభించునన్న యుద్దేశముతో కొందఱు పంచ—మకార సాధనలు గావింతురు. కాని అది యెంతటి హీనబుద్ధి! శ్రీకృష్ణు డర్జునునితో, 'తమ్ముడా అష్టసిద్ధులలో నొక సిద్ధి నీకు గలిగిన నీ శక్తిని కొలదిగా హెచ్చింప వచ్చును. కాని దానివలన నీవు నన్ను పొంద జాలవు' అని పలికియున్నాడు. సిద్ధుడైనచో

మాయ నశింపదు. మాయ యున్నచో అహం కారము వెన్నంటును. ఎంతటి హీనబుద్ధి? అందఱిచేతను గర్హనీయమయిన స్థానమును నుండి మద్యపానముచేసి పొందునదేమి? వ్యాజ్యమును జయించుటయే నా లక్ష్యము?

శరీరము, ధనము—ఇవన్నియు ననిత్యములు. వీనికై యింత శ్రమ యేల? హఠయోగి యవస్థను జూచితివా? అతడు తనకెట్లు దీర్ఘాయువు గలుగునో యని చూచుచుండును. భగవంతునివైపు కొంచెమేనియు దృష్టి నిలుపడు. 'నేతి, ధౌతి' క్రియలచేత తన బొజ్జను పరిశుభ్రము చేయుచున్నాడు. ఒక నాళమువలన పాలు గ్రహించుచున్నాడు.

'ఒకప్పు డొక కమసాలి పనిచేయుచుండగా హఠాత్తుగా అతని నాలుక తిరుగబడిపోయి అతనికి జడసమాధి సంభవించెను. చైతన్యమావంతయు లేదు. ఇట్లెన్నియో దినములు గడచెను. ఎందఱెందఱో అతని మహాత్మునిగా దలచి పూజింప నొడగిరి. ఇట్లు కొన్నిసంవత్సరములు గడచిపోయెను. అకస్మాత్తుగా ఒకానొక నాడు అతని జిహ్వ యథాస్థితి నందగా, అతనికి స్పృహ కలిగెను. ప్రపంచమంతయు మునుపటి వలెనే కనిపించుచుండుటవలన ఎట్టి మార్పును చెందక తనపూర్వవృత్తికే పూనుకొనెను.' అందఱు నవ్విరి.

ఇవన్నియు శారీరక కార్యములే కాని భగవల్లాభమున కిం దావంతయు సంబంధము లేదు. ఒక డెన్నియో యోగాసనములు తెలిసికొనియుండెను. యోగసమాధినిగూర్చి యెంతయో చర్చించెడివాడు. కాని వాని మనస్సంతయు కామినీకాంచనములయందే లగ్నమైయుండెడిది. ఒకప్పు డాతనికి కొన్ని వేలరూపాయల నోటు ఒకటి కనిపించెను. లోభము నాపుకొనజాలక ఎట్లయినను దానిని బయటికి కొని తేగలము గదా యన్న నమ్మకము కొలదిని వాడు దానిని మ్రింగివైచెను. చివరకు నోటు బయటికి వచ్చినది నిజమే కాని వానికి మూడేండ్ల కారాగారశిక్ష విధింపబడినది. ఒట్టు బెట్టి చెప్పుచున్నాను. అతడు చాలా ఆధ్యాత్మికోన్నతి నందినవాడేమో యని నేను నా సామాన్యబుద్ధితో తలంచుచుండువాడను.

ఒకప్పుడు సింతీనుండి వచ్చిన మహేంద్రపాలుడు ఐదురూపాయలు రామలాల్‌నొద్ద నిచ్చిపోయెను. అతడు వెళ్లిన పిమ్మట రామలాల్ నాకా విషయము దెలిపెను. 'ఎందుకిచ్చివెళ్లె' నని నేనడుగగా రామలాల్ ఇట్లు చెప్పెను 'ఇచ్చటి ఖర్చులకే.' అది విని 'పాలవాని బాకీ కొంతవట్టు తీర్పవచ్చు'' నని నే ననుకొంటిని. కాని రాత్రి పండుకొనబోవునప్పటికి హఠాత్తుగా నులికిపడి లేచితిని. నా హృదయము దేనినో విచారించుచున్నట్లనిపించినది. తోడనే రామలాల్ దగ్గరకేగి 'అతడు డబ్బెవరికిచ్చెను? అది నా ఖర్చులకా, లేక నీ ఖర్చులకా' యని యడిగితిని. 'కాదు, నా ఖర్చులకు కాదు, మీ ఖర్చులకే' యని రామలాల్ వచించెను. అందులకు నేనిట్లంటిని 'అయినచో ఆ ధనము నిప్పుడే తీసికొనిపోయి యిచ్చిరమ్ము, లేనిచో నాకు మనశ్శాంతి కలుగనేరదు.' మఱుసటిరోజు రామలాల్ వెళ్లి ఆ పైకము నిచ్చివచ్చెను.

ఒకప్పు డొక ధనికుడు వచ్చి, 'అయ్యా! మీ పేరు చాల గొప్పగా విన్నందున మీ యొద్దకు వచ్చితిని. మీరు నా వ్యాజ్యెమున నాకు జయము కలుగునట్లు చేయుడు' అని

ప్రార్థించెను. నే నిట్లంటిని. 'అయ్యయ్యో, మీ రెంతయో పొరపడితిరి. అది నేను కాదు. అచలానందుడు చేయగల'డని వచించితిని.

నిజమయిన భగవద్భక్తి కలవాడు శరీరమును ధనమును లక్షింపడు. అతడు దేహసౌఖ్యములకొఱకో, గౌరవాభిమానముల కొఱకో, లేక ధనార్థమో జప తపము లొనర్చుటయా? ఇవన్నియు ననిత్యములు. మూన్నాళ్ల ముచ్చటయే.

క్రొత్తగా వచ్చినవారు శ్రీరామకృష్ణులకు నమస్కరించి సెలవు పుచ్చుకొనిరి. వారు వెళ్లిన పిమ్మట శ్రీరామకృష్ణులు నవ్వుచు 'మ.' ను జూచి 'దొంగలా ధార్మికవిషయముల వినుట?' యనిరి.

నరేంద్రు డెట్టివాడు?

'మ.'—చిత్తము, చాలా మంచివాడు.

శ్రీరామ —ఎంతటి విద్య గలదో అంతటి బుద్ధియు గలదు. పాడగలడు. వాద్యముల వాయింపగలడుగూడ. మరల జితేంద్రియుడు వివాహమక్కరలేదని పలుకుచున్నాడు.

'మ.' —మీరు 'నేను పాపిని, పాపిని అని పలుకువాడు పాపియే యగును, ఇక తిరుగు లేదు. నేను భగవానుని సంతానమను అని నమ్మువానికి శీఘ్రముగ నున్నతి కలుగును' అని సెలవిచ్చియున్నారు.

శ్రీరామ:—అవును విశ్వాసమే వలయునది. కృష్ణకిశోరున కెంతటి విశ్వాసము? 'ఒకమారు భగవంతుని నామమును జపించి స్మరించితిని, ఇక నాకు పాపమేమిటి? నేను శుద్ధ నిర్మలుడనయితి' నని పలుకువాడు. హలధారి, 'అజామీళుడు నారాయణునిగూర్చి తపము చేయబోయెను. తపము చేయనిదే భగవత్కృప కలుగునా? ఒకమారు మాత్రము నారాయణ నామజపమువలన నేమి ప్రయోజనము?' అని పలికెను. ఈ పలుకు విన్నంతనే కృష్ణకిశోరునకు పట్టరాని కోపము కలిగినది. ఈ తోటలో పూలుగోయవచ్చినప్పుడు హలధారియున్న వైపున కేనియు బోవువాడుగాడు, తొంగియు చూచెడివాడు గాడు.

హలధారి తండ్రి మిక్కిలి భక్తుడు. స్నానముచేయునపుడు మొలబంటి నీటిలో దిగి 'రక్తవర్ణం చతుర్ముఖమ్' ఇట్టి ధ్యానశ్లోకములు చెప్పుచుండగా ఆతని కండ్లనుండి ప్రేమాశ్రువులు జలజల రాలుచుండెడివి.

ఒకనాడు 'అరిదహ' మనెడి గంగాఘట్టము నందు ఒకానొక సాధువు వచ్చియున్నట్లు విని మేమెల్లరము వారిని జూడబోదలచితిమి. అది విని హలధారి 'ఆ పంచభూతమయ పంజరమును జూచిన ప్రయోజనమేమి?' యని పలికెను. ఈ పలుకెట్లో కృష్ణకిశోరుని చెవిని బడినది. 'ఆ సాధుదర్శనమునుగూర్చి యిట్లు పలికినాడా? ఎవడు కృష్ణనామమును జపించునో లేక రామనామమును ధ్యానించునో ఆతని శరీరము శరీరముగాదు. అది చిన్మయ దేహము. అతడు సమస్తమును చిన్మయముగనే గాంచును. చిన్మయశ్యాముడే అతనికి గోచరించును. ఒకమారు శ్రీకృష్ణనామమునుగాని రామనామమునుగాని స్మరించిన నూరుసార్లు సంధ్యావందనము చేసిన ఫలము కలుగగలదు.'

కృష్ణకిశోరుని కుమారుడు ప్రాణావసానమున రామనామము నుచ్చరింపసాగెను. అప్పుడు 'అతని కింకేమియు భయములేదు, రామనామము నుచ్చరించుచున్నాడు' అని కృష్ణకిశోరుడు పలికెను. కాని అపుడపుడు

కృష్ణకిశోరు డేడువ నారంభించెను. ఎట్లయినను పుత్రశోకము గదా!

అత నొకప్పుడు బృందావనమున పోవుచుండగా దప్పి కలిగినది. ఆ సమయమున దగ్గర నున్న మాదిగవానిని జూచి 'శివనామోచ్చారణము గావించి నాకు నీళ్లిమ్ము' అని యడిగెను. అంతట ఆచారనిష్ఠలు కలవాడయినను వాడిచ్చిన జలమును పుచ్చుకొనెను. చూచితివా? ఎంతటి విశ్వాసముగలవాడో!

విశ్వాసములేనిదే పూజ, జపము, సంధ్యావందనము—ఇవన్నియు నిష్ఫలములు. నీవేమందువు?

'మ.'—చిత్తము.

శ్రీరామ—(నవ్వుచు) స్త్రీలు కొందఱు గంగాస్నానమునకు బోవుదురు. రాజ్యములోని వ్యవహారమంతయు నచ్చటే—విధవమేనత్త 'అమ్మో! మా యింట్లో నే పూజయినను నేను లేనిదే జరుగదు. చిన్నచిన్న విషయములు గూడ నేను సవరించుకోవలయును. ఏదయిన పెండ్లి పేరంటములకు బంతు లేర్పాటుచేయవలసినచో ఆ భారమంతయు నాదే. అప్పుడే కాని ఏదియు జరుగదు. వధూవరుల శయ్యలు గూడ నేనే ఏర్పాటుచేయవలయును' అని చెప్ప నారంభించును.

'మ.':—చిత్తము. వీరి దోషమేమి? విధిలేక వారిట్లు తమకాలమును గడపుదురు.

శ్రీరామ:—(నవ్వుచు) కొందఱి యిండ్లయందు మిద్దెమీద దేవతార్చనగది యుండును. ఆ యింటి గృహిణులకు దేవతార్చనకు వలయు పూలుగుట్టుట చందనముతీయుట పని. కాని ఆ సమయమున నొకమారయినా వారు భగవన్నామము స్మరింపరు. 'ఏ వంటచేయుట, ఈ రోజు బజారున మంచి కూరలు దొరకలేదు, నిన్నటికూర చాల బాగుగా నున్నది, ఆ అబ్బాయి వచ్చినాడుగదా, అతడు మా పినతండ్రి కుమారుడు. ఓరీ నీకింకను ఆ పని ముగిసినదికాదా? మరల నా ప్రస్తావన తేవద్దు. నా హారి లేదు.' — యిట్టి వ్యర్థాలాపము లాడుచుందురు.

చూచితివా? దేవతార్చన గదిలో నిట్టి పలుకులు!

'మ.'—చిత్తము. చాలవఱకు అందఱు నిట్లే యుందురు. మీరన్నట్లు భగవంతుని యందు సంపూర్ణానురాగము గలిగియున్నవాడు చాలకాలము పూజచేయవలయునా?

శ్రీరామకృష్ణులు, 'మ.' ఏకాంతముగ మాట్లాడుచున్నారు:

'మ.':—జగత్తంతయు భగవంతుడే యైయున్నచో వివిధభావములేల?

శ్రీరామ:—సర్వవ్యాపి భావముతో నీశ్వరుడు సర్వభూతములందు నున్నాడు. అయినను శక్తివిశేషము కలదు. కొన్నిచోట్ల విద్యాశక్తి, కొన్నియెడల అవిద్యాశక్తి, కొన్నియెడల శక్త్యాధిక్యత, మఱికొన్నియెడల స్వల్పశక్తి. నీవు చూడలేదేమి? లోకమున మోసగాండ్రు, దోపిడిగాండ్రు నుండుట. మఱికొందఱు పెద్దపులులవలె భయంకరముగ నుందురు. వారిని జూచినంతనే భయము కల్గును. నేను వారిని వ్యాఘ్రనారాయణులనియు, చోరనారాయణులనియు వచింతును.

'మ.'—(నవ్వుచు) చిత్తము, దూరముననుండియే వారికి నమస్కరింపవలయును. వ్యాఘ్రనారాయణుని సమీపించి కౌగిలింపబోయిన వాడు మనలనే తినివేయును.

శ్రీరామ — జగత్తంతయు భగవానుడు, ఆయనశక్తి తప్ప నితరమేమియు లేదు. నారదుడు శ్రీరామచంద్రుని స్తుతించుచు నిట్లు వచించెను. 'ఓ రామా! నీవు శివుడవు. సీత భగవతి. నీవు బ్రహ్మవు, సీత బ్రహ్మాణి. నీవు ఇంద్రుడవు, సీత యింద్రాణి. నీవు నారాయణుడవు, సీత లక్ష్మి. పురుషవాచకములన్నియు నీవు, స్త్రీవాచకములన్నియు సీత.

'మ.'.— భగవానుని చిన్మయస్వరూప మెట్టిది?

శ్రీరామ —(కొంచెము యోచించి) తర్వాత మెల్లమెల్లగా— నీటివలె— ఇవన్నియు సాధనానంతరము తెలియదగినవి.

నీవు రూపమును నమ్ముము. బ్రహ్మజ్ఞానము కలిగినపుడే అభేదజ్ఞానము కలుగును. బ్రహ్మయు, శక్తియు అన్నియు దహనశక్తివలె నభేదము. అగ్నిని దలంచినపుడే దహనశక్తి స్ఫురించును. దహనశక్తిని దలంచునపుడే అగ్ని తలంపునకు వచ్చును. దుగ్ధము దాని ధావళ్యము, జలము దాని శైత్యము— ఇవియు నిట్టివే.

కాని బ్రహ్మజ్ఞానానంతరము మఱియొక స్థానము గలదు. జ్ఞానము కలిగినవానికే అజ్ఞానమును గలదు. వశిష్ఠుడు తన నూర్గురు కుమారుల కొఱకు పుత్రశోకము నందెను. లక్ష్మణుడు శ్రీరాముని ఈ విషయము నడుగగా శ్రీరామచంద్రు డిట్లు బదులు చెప్పెను. 'సోదరా! జ్ఞానాజ్ఞానముల దాటి యావలకు బొమ్ము. జ్ఞానము కలిగినవానికే యజ్ఞానము సైతము గలదు. కాలిలో ముల్లు గ్రుచ్చుకొనిన మఱియొక ముల్లుతో దానిని దీయవలయును. పిమ్మట రెండింటిని బారవేయవలసినదియే.

'మ.' — అజ్ఞానము జ్ఞానము రెంటినిగూడ పారవేయవలసినదేనా?

శ్రీరామ.— అవును. అందులకే నీవు విజ్ఞానమును పొందవలయును. చూచితివా, వెలుతురుయొక్క జ్ఞానము కలవానికే అంధకారము జ్ఞానముగూడ గలదు. సుఖానుభవము గలవానికి దుఃఖానుభవముగూడ గలదు, పుణ్యజ్ఞానము గలవానికి పాపజ్ఞానముగూడ గలదు. 'సత్' జ్ఞానముగలవానికి 'అసత్' జ్ఞానముగూడ గలదు. శౌచజ్ఞానము గలవానికే అశౌచజ్ఞానముగూడ గలదు. 'నేను' అను జ్ఞానముగలవానికి 'నీవు' అను జ్ఞానముగూడ గలదు.

విజ్ఞానము అనగా పరమాత్ముని విశేషముగా దెలిసికొనుట. కాష్ఠమునందగ్ని గలదన్న నమ్మకము జ్ఞానము. ఆ యగ్నివలన ఆహారము తయారుచేసి భుజించి పుష్టులగుట విజ్ఞానము. ఆత్మానుభూతివలన భగవంతుడు కలడని తెలిసికొనుట జ్ఞానము. కాని ఆయనతోడి సల్లాపమున (వాత్సల్య, సఖ్య, దాస్య మధురాది భావములతో) నానందించుటయే విజ్ఞానము. జీవము జగత్తు అంతయు ఆయనయే యని దర్శించుట విజ్ఞానము. ఒకతెగవారి భావము ననుసరించి యీశ్వరదర్శనము లభింపదు. ఎవరు ఎవరిని జూచుట? మనకు శాహ్యమున గలడా భగవానుడు. మనలను మనమే చూచుకొనవలయును. సముద్రములోనికి బోయిన పడవ తిరిగి రాదు. దాని కబురుకూడ మనకు దెలియదు.

'మ.':— మీరు చెప్పియున్నారుగదా,

(Monument) * నెక్కినవానికి (మనుష్యులు, బండ్లు, గుఱ్ఱములు, దుకాణములు మున్నగునవి) క్రింది విశేషము లేవియు దెలియజాలవని.

శ్రీరామ — నేనిపుడు ప్రతిరోజు కాళికాలయమునకు బోవుటలేదు. అందువలన నేమయినను దోషము జరుగుచున్నదా! నరేంద్రుడు 'ఈయన యిప్పటికిని కాళికాదేవ్యాలయమునకు బోవుచున్నారా' యని వచించును.

'మ.' — చిత్తము. మీకు ఒక్కొక్కనాడొక్కొక్క నూతనావస్థ. మీరు చేయునపరాధమేమున్నది?

శ్రీరామ — కొందఱు హృదయునిగూర్చి సేనుగారితో నిట్లు చెప్పిరి. 'అతనికి చాల జబ్బుగా నున్నది. ఆయనకు రెండు పంచెలును, రెండు చొక్కాలును దెప్పించినట్లయిన మేము వానిని ఆయన యూరికి బంపించెదము.' అపుడాయన రెండు రూపాయలు మాత్ర మిచ్చెను. ఆయన కంత డబ్బున్నది. కాని యివ్వడమింతేనా? ఇందులకు నీవేమందువు?

'మ.' — చిత్తము. భగవానుని దెలిసికొన ప్రయత్నించువా రట్లు చేయరు. జ్ఞానలాభమే వారి లక్ష్యము.

శ్రీరామ — భగవానుడొక్కడే సద్వస్తువు. తక్కినవన్నియు అసత్తు.

* కలకత్తా మైదానమునందలి యొకానొక యెత్తైన స్థూపము.



బ్రహ్మజ్ఞానికి ఆహారము స్వయముగా, అప్రయత్నముగా లభించును— (నదీతటాకాదులందు) ఎచట దొరకినను ఆతడు నీరు త్రావును. ఒకప్పుడరణ్యమునను మఱియొకప్పుడు శ్మశానమునను నిద్రించుచు నిర్భయుడై ఆతడు స్వచ్ఛందవిహారము చేయును, వేదచోదితము, వేదములకు సైతము అప్రాప్యము అగు బ్రహ్మమార్గమున ఆతడు చరించును. వాని శరీరము ఆకసమువంటిది, పసిబిడ్డవలె ఆతడు పరులయిచ్ఛచే నడుపబడుచుండును, ఒకప్పు డాతడు దిగంబరుడై, లేదా, జ్ఞానాంబరుడై, మఱియొకప్పుడు దివ్యాంబరధారియై వెలయుచుండును, శౌచాశౌచములను పాటింపక, ఒకప్పుడు పసిబాలునివలెను, మఱియొకప్పుడు పిచ్చివాని చందమునను, వేఱొకప్పుడు పిశాచము రీతిని ఆతడు వర్తించును.

—శ్రీ వివేకానందస్వామి

శ్రీ శారదేశ్వర్యైనమః

# ధర్మపరిశీలన

## వైదిక ధర్మాదర్శములు

### శ్రీ వివేకానందస్వామి

(గతసంచిక తరువాయి)

ఆత్మను గురించిన, పరమాత్మను గురించిన, మతసంబంధములయిన యావద్విషయములను గురించిన ధార్మికయోచనయే మన కతి ముఖ్యము. సంహితలను దీసికొందము. ఇవి స్తోత్రకదంబములు. ఇవియే అతిప్రాచీనార్య సాహితిగా నేర్పడుచున్నవి. నిజముగ ప్రపంచమున నివియే అతిప్రాచీన సాహిత్యమని చెప్పనొప్పును. వీనికంటె నెక్కువ ప్రాచీనములైన అత్యల్ప సాహిత్యఖండము లెచ్చటనైన నుండిన నుండవచ్చును, కాని, పుస్తకములును, నిజమగు సాహిత్యమును లేవు. ప్రపంచమంతటికిని సంపుటీకరణము చేయబడిన అతిప్రాచీనగ్రంథ మిదియే. దీనిలో ఆర్యుల బహుపురాతనభావములును, ఆశయములును, వారి నడవడులకును, పద్ధతులకును సంబంధించి బయలు దేరిన ప్రశ్నలును, ఈ మొదలైన విషయములన్నియును వర్ణితములైనవి. ఆరంభమందే మన కతివిచిత్రభావ మొకటి కనుపడును. తేజోమయులగు వేర్వేరు దేవుళ్లనుగురించి యీ స్తోత్రములు పాడబడినవి. ఇంద్ర, వరుణ, మిత్ర, పర్జన్యాదులగు వీరెందరో కలరు. వివిధ పౌరాణిక, లాక్షణిక విగ్రహము లొకరి తరువాత నొకరు మనయెదుటికి వత్తురు. ఇందు కుదాహరణము. మానవులకు వర్షములు లేకుండ జేసిన సర్పమును శిక్షించుచు ఇంద్రుడు దానిపై వజ్రాయుధమును ప్రయోగించును. ఆ సర్పము చనిపోవును. కుంభవృష్టిగా వర్షము కురియును. జనులు సంతసించి, హవ్యములతో నింద్రు నారాధింతురు. హోమాగ్నిజ్యోతిని సిద్ధపరిచి, కొన్నిజంతువులను వధించి, వాని మాంసమును ఆ మంటలో శూలములపై వ్రేల్చి, దాని నింద్రునకు సమర్పింతురు. బహుజనాభిమాన పాత్రమగు మొక్క యొకటి ఆ కాలపు ప్రజల కుండెను. అది యేమి మొక్కయో, యిప్పు డెవరికిని తెలియదు. ప్రస్తుత మది కేవలము లేనిదానిలోనే లెక్క. దానిని నలుగగొట్టినచో, పాలవంటి రసము వచ్చుననియు, పులిసిన పిమ్మట అది మత్తును కలుగజేయుననియు పుస్తకములవలన మనకు తెలియుచున్నది. దీనినిగూడ నింద్రుడు మొదలగు దేవతలకు వారు సమర్పించి, తామును త్రాగెడువారు. ఒక్కొకప్పుడు దీనిని వారును, దేవుళ్లును మితముదప్పి త్రాగెడువారు. కొన్నిసమయములం దింద్రుడు తప్పత్రాగుచుండెను. ఒకసారి

ఇంద్రుడీ సోమరసము నెక్కువగా త్రాగి, అసంబద్ధాలాపము లాడినట్లు కనుబరచు గ్రంథభాగములు కలవు. వరుణుని విషయముకూడ నిట్టిదే. ఇతడు మహాశక్తిమంతుడైన మరియొక దేవుడు. ఇంద్రునివలెనే తనభక్తులను రక్షించుచుండు నితనినిగూడ, సోమరస నైవేద్యముతో ఆరాధకులు స్తుతించుచున్నారు ఈ విధముగనే యుద్ధదేవుడు మొదలగు దేవుళ్లెందరో కలరు. కాని, బహుజనాభిప్రాయానుసరణముగ, ఈ సంహితల పురాణములకు నితర పురాణములకు నొకవిషయములో భేదమున్నది. ఈ దేవుళ్లలో ప్రతియొకరికిని అనంతత్వ మాపాదింపబడినది. ఈ అనంతత్వము వివిక్తము గావింపబడి, ఆదిత్యునిగ వర్ణితమైనది. మరికొన్ని సమయములం దితర దేవుళ్లందరికిని ఒక విశేషణముగ జంటింపబడుచుండినది. దృష్టాంతమునకు ఇంద్రుని దీసికొనుడు. ఇంద్రుడు బహుదృఢశరీరుడని, కొన్నివేళల బంగారు కవచమును ధరించుచుండునని, భూలోకముచకు దిగివచ్చి తనభక్తులతో నివసించుచు, భుజించుచుండునని, రాక్షసులతోను, సర్పములతోను పోరాడుచుండునని, ఈ విధముగ వర్ణింపబడినట్లు కొన్ని గ్రంథములలో మీకు గనుపడును. మరియొక స్తోత్రములో, ఇంద్రునకు అత్యున్నతస్థాన మీయబడినది. అతడు సర్వవ్యాపియు, సర్వశక్తిమంతుడునై, సర్వజీవుల హృద్రహస్యములను తెలిసికొనుచుండును. వరుణుని విషయముకూడ నిట్టిదే వాయుదేవతయగు నితడు పూర్వమింద్రునివలెనే, జలాధిపత్యమువహించును. ఆకస్మికముగ నితడున్నతతరస్థానమునకు లేవనెత్తబడి, సర్వవ్యాపియై, సర్వశక్తి సంపన్నుడైనట్లు కనుగొనగలము. అతని మహోన్నత స్వరూపవర్ణనగల ఒక ఘట్టమును మీకుజదివి, వినిపింతును. దీనినిబట్టి నాయభిప్రాయము మీకు విశదము కాగలదు. ఇది ఆంగ్లభాషలో పద్యరూపమున అనువదింపబడినది. ఆ రూపముననే దానిని మీకు నేను చదివి వినిపించుట మంచిది

“స్వర్గలోకవాసియు, మహాబలుడునైన యీ ప్రభువు మన కత్యధిక సమీపస్థునివలె మన పనులన్నిటిని జూచుచుండును. తామొనర్చు కార్యములను మానవు లెంత కప్పిపుచ్చుటకు ప్రయత్నించినను, అవియెల్ల దేవతలకు దెలియుచుండును. ఎవరు నిలుచుండినది, ఎవరు రహస్యముగ నొకచోటునుండి మరియొకచోటునకు బోవుచుండునది, ఎవరు తన రహస్యస్థలమున దాగినది—వీరి సంచారములెల్ల దేవతలకు దెలియుచుండును. ఇద్దరు మనుష్యులు తామేకాంతముగనున్నట్లు భావించి, కుట్రపన్నునప్పుడెల్ల, మూడవవాడై వరుణప్రభు వచ్చుటనుండి, వారి పన్నాగములనెల్ల తెలిసికొనుచుండును. ఈ భూమి ఆతనిదే. ఈ అనంత, విశాలాకాశములెల్ల అతనివియే. సముద్రములు రెండు నతనియందున్నను, అతడు మాత్రమా చిన్న గుంటలోనుండును, ఆకసమున పైకి చాలదూర మెవ రెగిరిపో దలచినను, వరుణప్రభునిచే బడకుండ వారు తప్పించుకొనజాలరు. అతని వేగులవాండ్రాకసమునుండిదిగి, యీ ప్రపంచమంతట చరించుచు, భూలోకములో బహుదూరస్థములైన మారుమూలలందుగూడ నేమి జరుగుచున్నదో పరిశోధించి చూచుచుందురు.”

ఈ విధముగ నితర దేవుళ్లను గుఱించి మన మెన్నియో దృష్టాంతములను జెప్పవచ్చును. వారందరు నొకరితరువాత మరియొకరు వచ్చు

చుందురు. వీరందరిగతియు నొక్కటే. మొట్ట మొదట వీరు దేవతలుగ బయలుదేరి, పిమ్మట సమస్త విశ్వమును తనలోనఁనె కలిగి, సర్వ జీవ హృదయసాక్షియగు జగన్నాధుని స్థానమునకు పురోగమనము గావింతురు. వరుణుని విషయములో మరియొకభావము పొడగట్టును. కాని అది అంకురించినవెంటనే ఆర్యమనస్తత్వము దాని నణచివైచెను. అది భయమునకు సంబంధించిన భావము. తాము పాపముచేసితిమని భయపడి, వారు వరుణుని క్షమాపణను వేడెదరు. ఈ భావములు హిందూదేశపు నేలపై పెరుగుట కవకాశమెన్నడు నీయబడలేదు. ఇందుకుగల కారణములను మీరిటుతరువాత గ్రహింపగలరు. కాని, భయ పాపభావములు మొలకెత్తమొదలిడినవి. ఇదియే మీకందరకును దెలిసిన యేకేశ్వరభావము. ఈ యేకేశ్వరభావము బహు ప్రాచీనకాలముననే హిందూదేశమునకు వచ్చినట్లు మనకు స్పష్టమగుచున్నది. అతి ప్రాచీన ప్రథమ గ్రంథమగు సంహితలయందంతట ఈ యేకేశ్వరవాదము ప్రబలియున్నది కాని, యిది ఆర్యులకు చాలియుండలేదని మనము గ్రహింపగలము. దీని నతి పూర్వకాల భావముగ బరిగణించి, వారు విసర్జించిరని హిందువుల అభిప్రాయము. వేదములను గురించి ఐరోపియనులు వ్రాసిన గ్రంథములను జదువునపుడు, మా గ్రంథకర్తల రచనలన్నియు నీ పూర్వ విద్యాగంధభరితములని వారు వెలిబుచ్చిన యభిప్రాయమును గని హిందువులు నవ్వకుండ నుండజాలరు. సశరీర భగవద్భావమే మహోన్నత భగవదాదర్శమని యుగ్గుబాలతో నభ్యసించిన మనుష్యులు, సంహితల యుగము ముగిసినతరువాత వానియందంతట నిండియున్న యేకేశ్వరభావము పనికిమాలినదని, తత్త్వవేత్తలకును, జ్ఞానులకును అనుచితమైనదనియెంచి, అంతకంటె నెక్కువ తాత్త్వికయుక్తియుతమును, నపరిమితమునగుభావమునకై చాల పరిశ్రమించిన యీహిందూదేశ ప్రాచీన బుద్ధిశాలురవలెయోచింపసాహసింపలేకపోవుట సహజము. సాకార భగవానునియందు విశ్వమెల్ల ఇమిడియున్నదని, అతడు సర్వజీవ హృదయాధినాధుడని యెంత వర్ణించినను, ఆర్యులేకేశ్వరవాదమును మానుషముగ భావించిరి. తమ భావ పరంపరయందు హిందువు లతి సాహసిక యోచనాపరులని వారి యోగ్యతకనుగుణముగ ప్రశంసింతుముగాక! పేరునకు సాహసికులని చెప్పబడు పాశ్చాత్య యోచనాపరులను భయభ్రాంతులుగ జేయుటకు,హిందూ ధీవిశారదుల భావ తేజస్ఫులింగ మొకటియైనను చాలును. వీరధిగమించిన భావ శిఖర ప్రదేశములం దొరుల కూపిరియాడక, శ్వాసకోశములు పగిలిపోవునని మాక్సుమూలరు పండితుడు చెప్పిన దెంతయు సమంజసము. తమకెట్టి ప్రమాదము సంభవించినను సరే, తమ పూర్వ ఛాందసాభిప్రాయములెల్ల తుత్తునియలైననుసరే, తమ్ముగూర్చి సంఘమేమనుకొన్ననుసరే, యేమిచెప్పినను సరే లెక్కసేయక వీరు తమకు యుక్తమని, సత్యమని తోచినదానినే బోధించిరి.

(సశేషము)

# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీ హరిశరణమ్

శ్రీరామకృష్ణ కుటీరము,
ఆల్మోరా,
8-7-'16.

ప్రియ...

మీ లేఖయు మనియార్డరు అయిదురూపా యలును చేరినవి. శ్రీరామకృష్ణ కుటీరము చిన్నదయినను చక్కగా నిర్మింపబడుచున్నది.

మీ యుత్తరము జదివి సంతుష్టుడనైతిని. కాని 'నేను దీనుడను, హీనుడను' అని యందు గల భావములగూర్చి యెంతయు క్షోభము నందుచున్నాను. ఈ భావములను సంపూర్ణముగ వదలిపెట్టవలయును. "నేను ఈశ్వరుని పేర జపించుచున్నాను. నాకేమి కొదువ? నేనేల విచారింపవలయును?" అని శ్రీరామకృష్ణులు మనకు బోధించియున్నారుగదా! మీ యాత్మ గ్లాని సూచకములగు నిట్టి భావముల గని వాస్తవముగా నేను చింతించుచున్నాను. ఇవన్నియుగూడ ఆత్మోన్నతికి అంతరాయము లని శ్రీ గురుదేవునియొద్ద నే వినియుంటిని. మీ కెక్కుడు సంబంధము భగవంతునితోడిదే యని జ్ఞప్తియందుంచుకొని ఆయన సన్నిధిని జేరుటకే మీరు ప్రయత్నింపవలయును. 'నేను ఆయన సంతానమను' అను పలుకెన్నటికిని మరువవలదు. ఈ సంసారమునందలి సంబంధము లన్నియును క్షణభంగురములే కాని ఆయన తోడి సంబంధమే చిరస్థాయి.

శ్లో. "జీవన్ముక్తి సుఖప్రాప్తి
హేతవే జన్మధారితమ్,
ఆత్మనా నిత్యముక్తేన
న తు సంసార కామ్యయా." *

శ్రీ శంకరాచార్యుల కృతమయిన ఈ శ్లోకమును ప్రప్రథమమున నేను జదివినపుడు నాకు కలిగిన ఆనందము వర్ణనాతీతము. వెంటనే ఈ జీవితపు కర్తవ్యము బాహాటముగా, జ్వాజ్వల్యమానముగా నాకు గోచరించినది. నాకు గలిగిన సందేహములన్నింటికి సమాధానములు లభించినవి. మనుష్యజననోద్దేశము జీవన్ముక్తి సుఖప్రాప్తియే కాని యితరమేదియు గాదని నేను తెలిసికొంటిని. వాస్తవముగా నిత్యముక్త మయిన ఆత్మ మరి యే యితర కారణమువలన జన్మింపవలసియుండును? 'నేను ముక్తుడ' నను భావము నందుటకొఱకే యీ శరీరధారణము. అట్టి నిత్యముక్తాత్మయగు మీరిట్టి యసంగత ప్రలాపములు గావించుట శోభాయమానము గాదు. మేఘాచ్ఛాదితుడుగాని సూర్యుని ముఖాముఖిని జూచుట కష్టమయినను ప్రతిబింబిత సూర్యుని జూచుటయందేమి కష్టము గలదు? అట్లే 'నేనే సచ్చిదానందబ్రహ్మమను' అను నిశ్చయమును బొందుట కష్టమే యయినను

---

* నిత్యముక్తమయిన ఆత్మ జన్మను ధరించుట జీవన్ముక్తి సుఖము ననుభవించుటకొఱకే కాని సంసారము నందలి కోరికచేత కాదు.

నేను 'ఆయన అంశమను లేక సంతానమను' అని నిశ్చయించుకొనవలయును. 'నేను ఆయన కంటె భిన్నుడ' నని తలంచుట తగనిపని. అది మనకెన్నడును శ్రేయస్సును గలిగింపదు. 'నేనెట్టివాడనయినను ఆయనకు సంబంధించినవాడనే కాని యితరులకు గాను' అని భావింపవలయును. పుత్రుడు అత్యంతాయోగ్యుడయినను పుత్రుడేకదా! కుమారుడు సుపుత్రుడయినను కుపుత్రుడయినను తల్లి యెందయినను బారద్రోలునా? నేను తల్లియొక్క సంతానమను, నేను సజ్జనుడనయినను దుర్జనుడనయినను సరియే. మీరుగూడ సజ్జనులైనను దుర్జనులైనను తల్లియొక్క సంతానమే. ఇందావంతయు సందియములేదు. మీకు నా ప్రేమాశీర్వాదములు.

ఇట్లు,
చిరశుభాకాంక్షి,
శ్రీ తురీయానంద

---

# శ్రీ వాసుదేవ మననము

శ్రీ మాచిరాజు శ్రీ రామకృష్ణ

(మార్చి సంచిక తరువాయి)

"సన్నిందాసతి నామ వైభవకథా శ్రీశేశయోర్భేదధీః అశ్రద్ధా శ్రుతిశాస్త్ర దైశిక గిరాం నామ్న్యర్థ వాదభ్రమః। నామాస్తీతి నిషిద్ధ వృత్తివిహిత త్యాగౌచ ధర్మాంతరైః సామ్యం నామ జపే శివస్య చ హరే ర్నామా పరాధాదశ॥"

(1) "సన్నింద" అనగా = సత్పురుషులు, సచ్ఛాస్త్రములు, సన్మంత్రములు మొదలైన సద్వస్తువులను దూషించుట. ఇట్టి సత్పదార్థములయందు ఏవస్తువు నిందాయుతముగనైనను ఆచరింపబడిన భగవన్నామ జపము దోష విశిష్టమైన దగుటవలన భగవత్తుష్టి జనకము కానేరదు.

(2) 'అసతి నామ వైభవకథా' అనగా— అసత్పురుషులయెదుట భగవన్నామ వైభవము - మాహాత్మ్యమును వర్ణించుట. ఇందువలన భగవన్నామ జపఫలము నిందితమగును. ఎట్లన పామరుడు భగవన్నామ మాహాత్మ్యమును వినియును గూడ స్వభావమును విడువడు. నిజహృదయానుగుణముగనే కార్యములను చేయుచుండును. పామరుడొకడు రామాయణకథను విని 'అయ్యా! ఈ కథయందు రాక్షసుడెవరు? రాముడా లేక రావణుడా?' అని యా కథకుని అడిగెను. ఆ ప్రశ్నను విని యా కథకుడు చకితుడై, 'నాయనా! రాక్షసుడు రాముడును కాదు, రావణుడును

కాదు. రామాయణకథను నీవంటి మూర్ఖునకు చెప్పినందులకు రాక్షసుడను నేను' అని సావధానముగ ప్రత్యుత్తరమును చెప్పెను. కనుక మూఢులకు భగవన్నామ వైభవ కథనము వలన భగవన్నామ జప విషయమైన మహాత్మ్య బుద్ధి భ్రంశమును పొందును. భగవన్నామ జపఫలము దోషయుక్తమగును.

(3) "శ్రీశేశయోర్భేదధీః" అనగా— హరిహరులయందు భేదబుద్ధి. శివకేశవుల యందు భేదభావముతో ప్రవర్తించుచు నాచరించిన భగవన్నామ జపము నిష్ఫలమగును. మరియు విపరీత ఫలరూపమైన అధోగతి జనకమగును. "శివస్య హృదయం విష్ణు ర్విష్ణోశ్చ హృదయం శివః। ఏతయో రంతరం మత్వా రౌరవం నరకం వ్రజేత్॥" శివుని హృదయమే విష్ణువు. విష్ణుని హృదయమే శివుడు. ఉభయుల కభేదము. శంకర నారాయణులయందు భేద బుద్ధిని జూపు పురుషుడు రౌరవ నరకగామియగునని శాస్త్రము. భగవ దుపాసకులు తమతమ ఇష్టదైవములను శరణుపొంది యా దైవమునే పరమోత్తమ దైవముగాభావించి యాదైవమునే ఉపాసించుచున్నారు. అది శ్రేష్ఠమే. కాని భగవద్భక్తులు కొందఱు తమ తమ ఉపాస్యదైవమే ఉపాసనీయ మనియు అన్య దైవము మృష (అసత్యము) అనియు ప్రలాపములు పలికెదరు. ఇట్టి ప్రలాపములు శాస్త్ర సమ్మతములుకావు. కాని బ్రహ్మాండమంతయు నాయుపాస్యదైవమైన శ్రీరామబ్రహ్మమునందు వివర్తముగా రచితమైన రూపాంతరమగుటం జేసి సకలము అలీకము. సర్వము శ్రీరామ మయమే యని మాత్రము ప్రత్యేక భక్తునికి నిజోపాస్య దైవమునుగూర్చి నిశ్చలభావ ముండవలయును.

(4) 'శ్రుతి వచనములయందు అశ్రద్ధ'— "వేదోఽఖిలో ధర్మమూలం". "చతుర్వేదములును ధర్మములకు మూలము," అని శ్రుతి. ఇట్లుండ ధర్మమునకు మూలస్వరూపమైన వేదములయందు అశ్రద్ధ యెపుడు కలుగునో అపుడు భగవన్నామ జప రూప ధర్మవృక్షము ఎటుల ఫలప్రదము కాగలదు?

(5) 'శాస్త్రవిధానమునందు అశ్రద్ధ'— యఃశాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః। నససిద్ధి మవాప్నోతి నసుఖం నపరాం గతిం॥" (గీ. 16-23). ఎవడు కర్తవ్యాకర్తవ్య అర్థప్రకాశకమైన శాస్త్రవిహిత విధి నిషేధములను విచారించక ఘన తృష్ణాయత్తచిత్తుడై శాస్త్రవిధి నుల్లంఘించి స్వేచ్ఛానురూపముగ శ్రద్ధావిధురమైన ధర్మానుష్ఠానమును చేయుచుండునో అట్టి కామాయత్త ప్రవృత్తిగల పురుషుడు శాస్త్రవిరుద్ధ కర్మానుష్ఠానమువలన నట్టి కర్మములచే చిత్తశుద్ధిని పొందజాలడు. విధ్యుక్త కర్మముననే సత్ఫల మవశ్యము కలుగుననెడి నియమము గలదు. ఆ హేతువు చేతనే స్వర్గీయ సుఖమును పొందనేరడు. కర్మములకు ముక్తిసాధనత్వాభావము వలన మోక్షము నధిగమింపజాలడు. విధి నతిక్రమించి యథేచ్ఛ ననుసరించి కర్మముల నాచరించువాడు స్వర్గాపవర్గోభయభ్రష్టుడగును.

(సశేషము)

# పూర్ణమానవుడు *

శ్రీ పిన్నింటి సుబ్బారావు

(జనవరి సంచిక తరువాయి)

## 2. పూర్ణమానవత్వమునకు మత మవసరమా ?

మానవుడు ప్రకృతిని పరిశీలించి, దాని తత్త్వమరయుటకై యింద్రియజన్య జ్ఞానముతో తృప్తిగాంచక, యింద్రియాతీత స్థితికై యత్నింప మొదలిడెను. మనస్సుయొక్క వివిధస్థితులను పరిశీలించి, జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి స్థితులుగాక, వీని కతీతమైన సమాధి లేక తురీయస్థితి యనెడి నాల్గవస్థితిని గనుగొని, యీ స్థితియందే, బుద్ధికిని, హేతువునకును అతీత మగు పరమ సత్యములను గుర్తింపగలుగునది యని నిర్ధారణచేసెను. ఋషులు వేదసత్యములను చివరకు బౌద్ధులు 'నీతి సత్త' నీరీతిగనే కనుగొనగల్గిరి. ఈ సమాధిస్థితికే నిర్గుణ బ్రహ్మము, సర్వాంతర్యామి, మూలతత్త్వము, నీతి సత్తా యని వేరు వేరు నామము లిడిరి.

పూర్ణమానవుని మనమింతవఱకు చూచి యుండము. కాని యది మానవజీవితమున కాదర్శమై యుండవలయును. మానవుడు తన యింద్రియముల సహాయముతో నిజమగు శక్తిని, సౌఖ్యమును బొందజాలడని గ్రహించి సర్వమును త్యజించినగాని, వానిని బొందజాలనని గ్రహించెను. ఈ త్యాగమే మతమునకు పునాది.

ప్రపంచమును ఈ మూలనుంచి ఆమూలకు ఉద్ధూతలూగించిన వారందరును ఆధ్యాత్మిక శక్తి సంపన్నులే. మానవుడు తన ఆత్మశక్తిని పొందుటకు మతమే పునాది. సరియగు వర్తన మలవడుటకును, ఇతరులకును, తనకును మన శ్శాంతిని చేకూర్చుటకును, మతమ్మే యాధారము. మూఢవిశ్వాసములు, పిచ్చి పట్టుదలలు, ఊహలు, సంకుచితభావములు నశించుటకు, మత మాధారము. మానవుని మనస్సు విశాలమగుకొలదియు, మతము, ఆధ్యాత్మికభావము లాధారముగాగలవు.

పరిపూర్ణ మానవుడు, సమస్త మతముల మంచిని గ్రహించి, యన్ని మతములవారికిని యాదర్శప్రాయుడు కాగలడు. సగుణుడు, నిర్గుణుడు, సర్వవ్యాపకుడు, నీతిసత్త, ఆదర్శ మానవుడు, యీపరమ సత్యములన్నియును ఆతడు సమదృష్టితో గాంచగలడు. మత సత్యములు, పురోహితుల, దేవాలయముల, చర్చిల, మసీదుల, గ్రంథముల, విధివాక్యముల కర్మకాండల నధిగమించి, విశ్వసత్యములపై ఆధారపడవలయును. పరమధర్మములు పరిపూర్ణమానవుని నిత్యజీవిత ధర్మములై సమస్త మానవులను, మతములను నాతడు సమదృష్టితోగాంచి, లోకకల్యాణమునకై కృషి

---

* ఈ వ్యాసమందలి విషయభాగమంతయు వివేకానందస్వాములవారి గ్రంథములనుండి గైకొని నా గురువర్యులగు పూజ్యపాద శ్రీ విరజానందస్వాములవారి పాదపద్మముల కర్పితమొనరించుచున్నాను.

చేయగలదు. ఇట్టి దివ్యశక్తికి మతమే పునాది.

3. పూర్ణమానవుని మనోశక్తి ఎట్టిది?

మహాపురుషులను దర్శించినమాత్రమున, స్పర్శించినమాత్రమున, మానవుల కష్టములు ఈప్సితములు ఫలించునని ప్రతి మానవుని యొక్కయు నమ్మకమై యున్నది. ఇట్టి యద్భుతశక్తులన్నియును ప్రతి మానవుని మానసమునందును నణగియున్నవి. ప్రతి మానవుని మనస్సును, ఇతర మానవుని మనస్సుతో సంబంధము గలిగియున్నది. మానవునిమనస్సు, విశ్వ మనోశక్తితో మిళితమైయున్నది. పూర్వము యోగులు, దూరశ్రవణ, గ్రహణ, శక్తులను గలిగియుండిరని చెప్పుటకు మనస్సులన్నియును ఒకదానితో, నింకొకటి సంబంధింపబడి యుండుటచేతనే, భావములన్నియు, వాయువునందు మిళితమై వాయుకెరటములుగా మారి, యవి మఱల ఇతరులకు భావరూపముగా రూపొందుచున్నవి. మన శరీరములు, గుణములు, బుద్ధి, ఆత్మశక్తి నిరంతరము, ఇతరులపై ప్రసరించుచున్నవి, కాని, ఆత్మశక్తిలేని మానవు డెన్ని చెప్పినను, ఆత డితరులను తనభావముల కనువుగా జేసికొన నేరడు. ఆధ్యాత్మిక శక్తి సంపన్నుడు మాటలాడకయే, విశ్వమునంతటిని తన వైపున కాకర్షించుకొనును. మాటలయందు గాక శక్తియందే పరిపూర్ణమానవుని విజయ మాధారపడియున్నది. విద్యయొక్క పరమార్థ మిట్టి పరిపూర్ణ మానవుని నిర్మించుటయే.

ఇట్టి మనశ్శక్తిని ప్రతిమానవుడు బీదవారు, భాగ్యవంతులు, గృహస్థులు, వ్యాపారులు, ఆధ్యాత్మికజ్ఞాన సంపన్నులు, సద్భక్తులు, రాజయోగాభ్యాసముచే పొందవచ్చును. మానవుని శక్తి స్థూలమునందుగాక, సూక్ష్మమునందు గలదు. మనమొక బరువైన వస్తువును ఎత్తినపుడు, మనకండరము లుబ్బును కాని, యా కండరములయందలి సత్తువ, అందున్న సూక్ష్మనరములయందున్నది. ఒక నరము తెగినచో యందలి కండరము నిర్వీర్యమగును. ఈ నరములు తమ సత్తువను వాని కంటె సూక్ష్మతరమగువానినుండియు, భావములేక మనోవ్యాపారమునుండియు పొందుచున్నవి. సముద్రగర్భమున బయలుదేరిన, నీటి బుడగను, దానిగర్భమునందు గాంచలేక, యెట్లు నీటి యుపరిభాగమున గాంచగల్గుచున్నామో, యారీతిగా, సూక్ష్మశక్తుల సత్తువను మనము గాంచజాలము. మానవుడు తన మనోభావమును ఆదియందే నిగ్రహించిననాడు, ఆతడు తన చర్యలను గూడ నియమించుకొనగలడు. తన మనస్సును తాను జయింపగలిగిననాడు, ఆత డితరులనుగూడ జయింపగలడు. ఈమనోజయమునకు, పవిత్రత, నీతి ప్రవర్తనము మూలములు. ఇట్లు మనోజయమునుపొందిన, మానవునకును మానవునకును, సంఘమునకును సంఘమునకును, గల వైరకారణములు సమసిపోవును.

మానవుడు బాల్యమున నజ్ఞానియై, వయస్సువచ్చిన కొలదియు, పరిపూర్ణస్థితికి వచ్చుటకై యత్నించుచున్నాడు. తీవ్ర మనస్కులు తాము చేరవలసిన గమ్యస్థానమును ఆదియందే యూహించి తీవ్రప్రయత్నమును జేసి యీ జీవితమునందే పూర్ణత్వమును బొందుచున్నారు. ఎట్లు మనము, కృత్రిమములగు ఎరువులచే, అనతికాలమున నధికఫలమును బొందనుంకించుచున్నామో, యారీతిగా, మానవుడును కొన్ని సాధనములచే, తన జీవితసిద్ధిని శీఘ్రగతిని బొందగలడు. అవతారపురుషులు,

మతకర్తలు, ఇట్టి పూర్ణస్థితిని ఈజన్మయందే పొందియుండిరి.

మానవుని శక్తికి అంతులేదు, హద్దులేదు. ఇట్లు తీవ్రతరమగు మనోశక్తిని బడసి, పూర్ణ మానవుడు, జాతియొక్క జీవితమునంతటిని ఆ జీవితమునందే జీవించి, ప్రపంచజనులకు తానే నుచ్ఛ్వాస నిశ్వాసలై, సర్వత్ర తానేయై, తలచినదెల్ల నెరవేర్చుకొనుచు, సంకల్పసిద్ధుడై, యుగపురుషుడై వర్థిల్లగలడు. దీనికంతటికిని ప్రబలమగు మనోశక్తియే కారణము.

## 4. పూర్ణమానవుడు ప్రపంచమును ఏదృష్టితో గాంచును ?

వృక్షము మొదట విత్తనమునందు జన్మించి, మావిత్తనమునందే లయించుచున్నది. పక్షులు గ్రుడ్లయందుద్భవించి, గ్రుడ్లయందే లయించుచు, భవిష్యజ్జీవితమునకు ఆధారమును నిడుచుచున్నవి. మానవులు, మృగములు గూడ ఈ రీతిగనే భవిష్యజ్జీవితమునకు బీజములను నిచ్చుచున్నారు. ప్రపంచమునందు సమస్త ప్రాణికోటియు, తాము మొదట దేని నుండి యుద్భవించుచున్నవో, చివరకు దానియందే లయించుచున్నవని తేలుచున్నది. అందుచే ప్రతిపదార్థమునకు ఆది, అంత్యము సమానమని ఋజువగుచున్నది. కార్య, కారణములు రెండును సమానములు. ఈ సృష్టియంతయు చర్వితచర్వణముగా, జనించుట, మరణించుట లేక రూపొందుట, మడయుటయను ధర్మముపై నంతులేని కాలమునుంచి యనంతకాలమువఱకు జరుగుచున్నది.

విత్తనము వృక్షమగుటకు పూర్వము కొంత కాలమువఱకు, భూమిఅంతర్భాగమున మానవునకు గోచరముకాని స్థితియందుండి విలీనమై యందుండి వృక్షముద్భవించుచున్నది. ఆరీతిగనే యీ ప్రపంచముగూడ కల్పాంతమందు సూక్ష్మరూపమును దాల్చియు సూక్ష్మాకృతినుండి స్థూలరూపమును దాల్చుచున్నది. అయితే, యీసృష్టి ఏమూలరూపమునుండి యుద్భవించుచున్నది ? పరిణామవాదుల సిద్ధాంతులుగుండ ఈ సమస్తనామ రూపాత్మకమగు జగత్తు, అతి సూక్ష్మరూపముగా అణగియుండి, స్థూలాకృతిని బొందుచున్నదని యంగీకరింపవలసియున్నది. పరిణామవాదులు భగవంతు డున్నాడని ఒప్పుకొనరు. భగవంతుడు జ్ఞానరూపియనియు, ఈ జ్ఞానము, జీవాణువు కొన్నివేల జన్మములను ధరించినపిమ్మట మానవజన్మయందు స్ఫుటముగా గోచరించుచున్నదనియు, అందుచే భగవంతుడున్నాడని నమ్మ పనిలేదనియు చెప్పుచున్నారు. చెట్టు విత్తనమునందుద్భవించి విత్తనమునం దణగుచున్నది. పక్షులు గ్రుడ్డునందుద్భవించి గ్రుడ్డునాదణగుచున్నవి. మానవుడు జీవాణువునం దుద్భవించుయందే యణగుచున్నాడు. ఇట్లు ప్రతిపదార్థమునకు ఆది, అంత్యము సమానముగా గానబడుచున్నది. ఆరీతిగనే పరిణామవాద ప్రకారము, సృష్టికి పరిణామము పూర్ణమానవుడు. అందుచే ఆదియందు గూడ ఈ పూర్ణమానవత్వము, అతి సూక్ష్మరూపమున జీవాణువునం దణగియున్నదని నమ్మవలసి యున్నది. అందుచే సృష్టికి ఆది అతి సూక్ష్మరూపధారియగు పూర్ణమానవుడు, అంత్యముగూడ నాతడే. సామాన్యముగా యంత్రశక్తినిగొల్చుచు, ఇన్నిగుఱ్ఱముల శక్తిగల యంత్రము అని పేర్కొనుచున్నాము. అనగా అన్నిగుఱ్ఱములశక్తిని మన మా యంత్రమునందు సంఘటితమొనర్చి

యున్నాము. లేనిది ఎచ్చటనుంచియు రానేరదు. అందుచే ఈ జ్ఞానరూపియగు భగవంతుని జీవాణువునం దణగియుండుటచేతనే, యాతడే పూర్ణమానవుడనియు, స్వేచ్ఛామానవుడనియు, దైవమానవుడనియు, ఏసుక్రీస్తనియు, బుద్ధుడనియు, యోగేశ్వరుడనియు, వేరు వేరు పేర్ల పిలువబడుచున్నాడు.

ఈ ప్రపంచమంతయును, వివిధ పదార్థములను, ఒకదానితో నింకొకటి కలియుటచే ఏర్పరచబడియున్నది. అనగా ఈ వివిధ నిర్మాణములకు జ్ఞానస్వరూపమే కారణము. ఆతడే భగవంతుడు లేక పూర్ణమానవుడు. ఆజ్ఞానరూపమే యీ వేరువేరు రూపములతో పరిణామము దాల్చుచుండుటచే, ఈ కానబడు ఈ వివిధనామ రూపాత్మకమగు యావత్ప్రపంచము, ఆతడుగాక వేఱొండు లేదుగాన, మనము ఆతనియందే యున్నాము. ఆతడే యీ సమస్తరూపిగా నున్నాడు. మన మాతని యందుద్భవించి, యాతనియందే నివసించి, యాతనియందే లయించుచున్నాము. ఈరీతిగా పూర్ణమానవుడే జగత్తంతయు భగవంతుని లేక తనయొక్క మారురూపమని భావించి తాదాత్మ్యభావమును గలిగియుండును.

5. పూర్ణమానవుని శారీరకభావము లేవి ?

నరుడు మృతుడైనపిమ్మట, ఈ దేహము నశించినను, శాశ్వతముగా నిల్చియున్న దేదియును లేదా యని యాదికాలమునుంచియు తర్కించుచు నేయుండిరి. మన మొక వస్తువును చూచునపుడు, మొదట ఈ స్థూలనేత్రములు, పిమ్మట, సూక్ష్మరూపమునన్ను నేత్రేంద్రియము, దానికి పిమ్మట, మనస్సు, పిమ్మట బుద్ధి, చివరకు ప్రత్యగాత్మయు నివన్నియును ఒకదానితో నింకొకటి సంబంధించినగాని, యావస్తువు దృగ్గోచరము గానేరదు. ఇట్లు ఇంద్రియములు కొన్ని స్థూలముగను, కొన్ని సూక్ష్మముగను ఉన్నవి. ఈ స్థూల, సూక్ష్మేంద్రియములకు, వృద్ధి, క్షయములు గలవు. వృద్ధులయందు, రోగులయందు, బలహీనులయందు ఈ విషయము స్పష్టముగా గోచరింపగలదు. శరీరము నశించుచున్నట్లే మనస్సుగూడ నశించుస్వభావముగలది. సహజతేజోరూపుడై, జ్ఞానస్వరూపుడగు ఆత్మకు హాని వృద్ధులు లేవు. పదార్థములకు హాని, వృద్ధులు గలవుగాని, స్వతఃసిద్ధుడగు తేజోమూర్తికి నుండవు. శాహ్యశరీరము, సూక్ష్మశరీరము వలనను, సూక్ష్మశరీరము, ఆత్మసన్నిధానము వలనను, చైతన్యవంతములగుచున్నవి. సచ్చిదానంద స్వరూపుడగు ఆత్మ మాయోపాధిరహితుడై అణురూపము మొదలు, మహదాది రూపమువఱకు, జీవాణువునుంచి, పూర్ణమానవునివఱకు వివిధరూపములను దాల్చుచు క్రీడను సల్పుచున్నది. జీవాత్మ శాశ్వతుడు. అనంతకాలమునుండి అనంతరూపములను దాల్చుచు, తనయందలి మాయోపాధి నశించుచున్నకొలదియు, ఆత్మచైతన్య మభివృద్ధిగాంచుచున్నకొలదియు, దానికి తగు ఆకృతులను దాల్చుచు, చివరకు పూర్ణమానవత్వమును, ఆత్మోపలబ్ధిని బడయుచున్నది.

ఉన్నదంతయును ఒక్క భగవంతుని స్వరూపమే గాని వేఱొండు లేదని పూర్ణమానవుడు దలంచును. విత్తనమే వృక్షముగా మారుచున్నది. మఱల ఆ చెట్టు విత్తనమునం దణగుచున్నది. ఆ రీతిగనే సమస్త జీవరాసులును పరిణామమును చెందుచున్నవి. అంతయును ఒక్కటే రూపము. మానవుడు, వృక్షముల

మీాదను, జంతువులమీాదను, పక్షులమీాదను ఆధారపడియున్నాడు. అవి మానవునిపైన ఆధారపడియున్నవి. మానవుడు బొగ్గుపులుసు గాలిని విడుచుచున్న, వృక్షములు దానిని గ్రహించి, ప్రాణవాయువును ఇచ్చుచున్నవి. ఈ రీతిగా సృష్టియంతయు నొక్కటే రూపము, అన్నియును ఒకదానిపై నింకొకటి యాధారపడి యంతయు నొకటే స్వరూపమని ఋజువు చేయుచున్నది.

### 6. పూర్ణమానవత్వమును పొందుటెట్లు ?

ప్రతి జీవరాశియు, ఈ పూర్ణమానవత్వమును ఎప్పటికో యొకప్పుడు పొంది తీరును. కాని మనము భూములకు ఎరువులుపయోగించియు, మొక్కలకు అంట్లుగట్టియు, శీఘ్రగతిగా ఎక్కువ ఫలితమును పొందుచున్నట్లు, మానవులలోగూడ తీవ్రబుద్ధులు కొన్ని యుపాయములచే తమ గమ్యస్థానమును అనతికాలములో పొందగలుగుచున్నారు.

మానవునియందున్న యిచ్ఛ, జ్ఞాన, క్రియా శక్తుల ననుసరించి, ఋషులు భక్తి, జ్ఞాన, కర్మ, రాజయోగములను నాలుగు మార్గములను సూచించిరి. ఈ నాలుగును నాలుగు ప్రత్యేకసాధనములు గావు. ఒకదానితో ఇంకొకటి సంబంధించియున్నది. కర్మయోగి, భక్తి జ్ఞాన రాజయోగముల కలిగియుండవలయును. మిగిలిన మార్గావలంబకులుగూడ, వానిని కొద్దిగనో, గొప్పగనో కలిగియుండవలసియున్నది. కర్మయోగము క్రియాశక్తిపై నాధారపడియుండి, ధ్యానము, నిశ్చలమానసము గలిగియుండవలెనని బోధించుచున్నది. జ్ఞానయోగమునందు జ్ఞానశక్తి విరివిగా వ్యాప్తిగాంచుచున్నది. భక్తియోగమునందు ఇచ్ఛాశక్తి వృద్ధిగాంచుచున్నది. అందుచే ఈ నాలుగు మార్గములు మానవునియందున్న త్రివిధశక్తులను ఇనుమడింపజేయును గాన, పూర్ణమానవత్వమున కీ నాలుగు మార్గములు పూర్తిగా మానవునియందు పరిపూర్తి నొందవలయును. అప్పుడే మానవుడు పరిపూర్ణుడు కాగలడు. ఇట్టి పరిపూర్ణత్వమునే—యిట్టి పరిపూర్ణ మానవత్వమునే చేరుటకై ఎల్లరును కృషిచేయ వలసియున్నది. ఈ విషయమునే, వివేకానందులు "భగవంతుడు అందరి మానవుల యందును, కర్మ, భక్తి, రాజ, జ్ఞానయోగముల పరిపూర్ణత గలుగజేయుగాక! వీనిలో ఏదియో యొకటో, రెండో లక్ష్యముగా నుంచుకొని కృషిచేయువారియొక్క యభివృద్ధి పరిపూర్ణమైనదిగాదు. ఇట్టివారికి మిగతా మార్గములు అపాయకరములు. "ఈ నాలుగు మార్గములు మానవునియందు పరిపూర్ణతను బొందుటయే నా మతాదర్శము" అని నుడివియున్నారు. అందుచే నిట్టి మార్గములనే యవలంబించి మనము పూర్ణత్వమును పొందవలసియున్నది. ఇట్టి పూర్ణమానవత్వమును పొందుటయే మోక్షము దైవత్వము అని పిలువబడుచున్నది.



# వి న య ప త్రి క

మూలం.
శ్రీ తులసీదాస గోస్వామి

అనువాదం:
క్రాంతికర్

(గతసంచిక తరువాయి)

## ౧౩౧

ప్రభూ!

నాకెచటనైనను మరియొక ప్రభువు, స్థానము ఉన్నచో మాటిమాటికి నిన్ను బిలిచి విసుగెత్తించెడి వాడను గాను. దయాళుడవగు నీవు నావంటి సోమరిని, అభాగ్యుని పాలించి పోషించితివి. రామచంద్రుడే నా రాజు, అయోధ్యయే నానగరము. దిక్పాలురు, సూర్యుడు, గణేశుడు, పార్వతి—వీరెవరిని నేను ప్రేమతో సేవింపలేదు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను హితైషులని భావింపలేదు. రామనామమందే నాకు పరమ విశ్వాసము. రామనామమే నా నియమము. నాయనన్య నిష్ఠ. ఈ సాధనయే నాకమృతతుల్యము. మిగిలినవన్నియు విష సదృశములు.

ఓ అనాథ నాథా!

(కామ క్రోధాదులనెడి) నా యీ యను చరులనుగూర్చి యెవరితో జెప్పుకొందును? చోరులు, చౌకీదారులు—అందఱు నీ యధీన మున నున్నారు. స్వామీ! యోజింపుడు స్వకార్యమున, దేవతాకార్యమున, దుఃఖితుల కార్యము—వీనిపట్ల ఎన్నడైన ఆలసింపదగునా? నీ విట్టి పనులలో నెన్నడును ఆలసించి యెరుగవు. నీ స్వభావము నెఱిగిన నాకు నీయందే నమ్మకము, ప్రేమ కుదిరినవి. కాని కలియుగ మండలి యవినీతిని జూచి నేను భయమందు చున్నాను.

ఓ రామచంద్రా!

ఇక "ఓ తులసీదాసా! నీవు నావాడవు. మనమున నిరాశజెంది భయపడకుమా!" యని నీవు జెప్పనేవలయు లేదా నీవా రెవరిచే నైన జెప్పింపవలయు.

## ౧౩౨

ఓ రామచంద్రా!

నీవు నాకభయ మొసంగుము. నీవెల్లపుడు దీనుల కభయమొసంగుచు వచ్చుచుంటివి. మూడుకాలముల, మూడులోకముల నీవంటి దయాళు డెందును లేడనుట ప్రసిద్ధము. దుఃఖితులను శరణాగతులను నీవుగాక మరెవరు పాలింతురు? నీవు సోమరులు, అభాగ్యులు, పాపులు నగువారిని పాలించి పోషించితివి, సంతుష్టుల నొనర్చితివి. కాని ఓ నాథా! నీవెన్నడును అనాథులయెడ ఋణవిముక్తుడవు గాలేదు. ఓ ప్రభూ! నీవు సమర్థుడవు. నేనున్న వాడ నున్నట్లుగ నీవాడను. కలిపురుషుని వంకర

నడకజూచి నా హృదయమున నేవగింపేర్పడు చున్నది. ప్రసన్నుడవయియో, కాకనో, నవ్వుచునో, క్రోధముననో నీవు ఒక్కసారి "ఓయి తులసీదాసా! నీవు నావాడవ"ని యనరాదా? ఓ మహాప్రభూ! నీమీద ఒట్టువెట్టుకొని జెప్పుచున్నాను—ఆ క్షణముననే నా దుఃఖము సమూలముగ నశించును. సుఖములెల్ల నాకనుకూలమగును.

## ౧౩౩

ఓ రామచంద్రా!

నీ నామము దయగల కల్పవృక్షము. దానిని స్మరించుటవలన త్రితాపములు నశించును. సమస్తములగు కోరికలు నెరవేరును. అది పుణ్యామనెడు పద్మసరస్సు. అది లాభములకు లాభము. సుఖములకు సుఖము. సర్వస్వము. పాపులను పవిత్రుల నొనర్చునది. భయమునకు భయము. నీచులకు, ఉన్నతులకు, రాజులకు, దరిద్రులకు—అందఱి కందుబాటులోనిది. సుఖదాయకము. స్వగృహమువంటిది. రామనామమందలి ప్రేమ పురుషార్థచతుష్టయముయొక్క ఫలమే యని వేదము లెలుగెత్తి ఘోషించు చున్నవి. ఇట్టి రామనామము నెవరు ప్రేమింపరో, ఎవరి మనమున విశ్వాసమేర్పడదో వారు నా దృష్టిలో గర్దభులు. రామనామము వంటి తల్లి, పుత్రుడు, హితైషి, సోదరుడు, గురువు, స్వామి ఎవరును లేరు. అది బుద్ధి నిచ్చునది. శీలవంతమైనది. చంద్రునివలె నానందసంధాయి.

ఓ పరమదయాళూ!

నీవు దీనుడనైన నాకు నీ నామముతో జీవించు శక్తిని, దానియెడ ప్రేమను అనుగ్రహింపుము. నాకు—తులసీదాసునకు—అదియే గొప్ప యండ.

## ౧౩౪

యజమాని యుదాసీనుడగుచో నాంతరంగికుడగు నౌకరు సైతము నష్టపడును. ఇక నా విషయమై చెప్పనేల? నేను ప్రకటముగనె చెడిపోవుచుంటిని. ఈ లోకమున నా కెట్టి స్థానము లేదు. పరలోకమును గురించి యేమి నమ్మకము? రామనామమువల్లనే నేను మంచివాడనుగా దోచుచున్నాను. కర్మ, స్వభావము, కాలము, కామము, క్రోధము, లోభము, మోహము ననెడు మొసళ్లచే పట్టుకొనబడితిని. దారిద్ర్యముచే బాధితుడను. నన్ను బంధించుటకేమో కోటానుకోట్ల యోధులున్నారు గాని విడిపించువాడవు నీవొకడవే. ప్రభూ! నన్ను రక్షింపుము. నేను త్రితాపములచే, పాపములచే దహింపబడుచున్నాను. అందఱి ప్రసన్నత, నమ్మకము, ప్రేమ నీ ద్వారమునైపే యని నే నెఱిగియున్నాను. పాలచే మూతి కాల్చుకొనిన నేను మజ్జిగ త్రాగుటకును భయపడు చున్నాను. అరచి యరచి నే నలసిపోతిని. నా జాతి, వర్ణము, మర్యాద అన్నియు తిరిగిపోయినవి. ఇపుడు నీ యెంగిలి కానపడియున్నాను. పాలలో మునిగి తేలవలయునని లేదు. ఇతరులయెడ సన్మార్గగామి నయ్యు నా మేలు జూచుకొనుటలేదు. తిరస్కృతుడనయ్యు నీ ద్వారమున బడియుండుటలోనే క్షేమమున్నదని తెలిసికొంటిని. ఈ విషయమునే మాటిమాటికి నా మనస్సునకు జెప్పితిని. ప్రభుడవగు నీతోను జెప్పితిని.

(సశేషము)

# అంతర్దృష్టి

## శ్రీ అయ్యదేవర వేంకటసుబ్బారావు

ఆ. గీ. శిశువు పుట్టురీతి / శివగర్భమందున, జగతు పుట్టలేదు / చర్చజేయ
వేరు భావముంచి / వెలవెల బోనేల, దీని తెలియువాడు / ధీరుడగును. 1

ఆ. గీ. పాలవల్ల పెరుగు / పరిణామమగునట్లు, ఆత్మ మారలేదు / అన్నిగాగ
మార్పు భావముంచి / మడయుటపనియేమి, దీని తెలియువాడు / ధీరుడగును. 2

ఆ. గీ. మన్ను సహజరూపు / మార్పది లేకను, ఘటమునిలుచురీతి / ఘనుడు నిలువ
విష్ణువందు నిట్టి / విపరీతమేలయా, దీని తెలియువాడు / ధీరుడగును. 3

ఆ. గీ. సూర్యబింబమందు / చూపును చలనంబు, నీటిలోనగాంచ / నిజమెయనగ,
పూర్ణబ్రహ్మ కిదియు / పూర్తిగ భంగమే, దీని తెలియువాడు / ధీరుడగును. 4

ఆ. గీ. సూక్తి మార్పులేక / చూపుకు రజితమై, గానుపించురీతి / గాదు బ్రహ్మ,
బ్రహ్మయందు నెట్టి / భ్రమలకు పనిలేదు, దీని తెలియువాడు ధీరుడగును. 5

ఆ. గీ. ఎండమావులందు / నేర్పడు జలమట్లు, ఆత్మయందుతోచు / నఖిలజగము
జగతుచర్చజేయ / జరిగెడి ఫలమేమి; దీని తెలియువాడు / ధీరుడగును. 6

ఆ. గీ. స్వప్నజగతుబోలి / స్వార్థమేమియులేక, సాక్షియనగనుండు / సాక్షిగాక
సర్వజగతుబాధ / సంక్రమింపదు నీకు, దీని తెలియువాడు ధీరుడగును. 7

ఆ. గీ. ఆత్మదృష్టి 'నేను' అనదగు నాత్మగా, జీవదృష్టినతని / జేరు అంశ
దేహదృష్టిచేత / దేవునిబంటగు, దీని తెలియువాడు / ధీరుడగును. 8

ఆ. గీ. దృక్కు బ్రహ్మజేసి / దృశ్యంబు మాయగా, చూచుచుండి దీని/సూక్ష్మమెరిగి
సంచరించుచుండ / సంచలనములేదు; దీని తెలియువాడు / ధీరుడగును. 9

# ధర్మసంగ్రహము

శ్రీ యం. వి. రమణయ్య

ధర్మము అనగా 'ధరతిలోకానితి ధర్మః,' లోకములను ధరించునది. (అనగా) లోకములను కాపాడునది.

లోకములను నాశనముచేయునది అధర్మము. "విదంత్యనేన ధర్మాధర్మావితి వేదః" ఈ ధర్మాధర్మములను తెల్పునది వేదము. కనుకనే "వేదో ధర్మమూలం" అని వినబడుచున్నది.

భగవంతుడు జగత్తును సృష్టించి దాని స్థితికొఱకై మొట్టమొదట మరీచ్యాదులను సృజించి ప్రవృత్తిలక్షణమైన వేదోక్తధర్మమును వారిచే గ్రహింపజేసెను, తదుపరి సనకసనందాదులను సృష్టించి జ్ఞానవైరాగ్య లక్షణమగు నివృత్తి లక్షణమైన వేదోక్తధర్మమును గ్రహింపజేసెను. అందువలన వేదకర్త పరమేశ్వరుడని తెలియవలెను. కనుక ధర్మమూర్తియగు బరమేశ్వరుడు శిష్టులను రక్షించుటకొఱకు, దుష్టులను శిక్షించుటకొఱకు, ధర్మముద్ధరించుటకొఱకును సంభవింతునని స్వయముగా నుడివియున్నాడు.

కాలము కృత త్రేతా ద్వాపరయుగంబులను యుగ చతుష్టయంబుచే క్రమంబుగా ప్రవర్తించును. ధర్మమను గోవు సత్యదయాతపోదానంబులను నాల్గు పాదంబులచే నడచుచున్నది. ఇది కలియుగంబు. కాన ధర్మమను గోవు నాల్గు పాదంబులతో కుంటువడి యిప్పుడు నడచుటలేదు.

సామాన్యముగా ధర్మము 5 విధంబులని చెప్పవచ్చును.

(1) శ్రుతిబోధితములు. (2) స్మృతిబోధితములు. (3) లౌకికధర్మములు. (4) సామాన్యధర్మములు. (5) విశేషధర్మములు.

(1) శ్రుతిబోధితములు — ఇవి నిత్యమైనవి. సర్వజ్ఞుడగు నా పరమాత్మ నిశ్వాసములే (అనగా పురుషుడు నిట్టూర్పువిడచినంత సుకరముగా బ్రహ్మ వేదములు స్మరించెనని. "యస్య నిశ్వసితం వేదాః" అను శ్రుతివాక్యము వలన తెలియుచున్నది.

(2) స్మృతిబోధితములు — ఇవి కల్పితములు. శ్రుతిబోధితముల క్రోడీకరణములే. ఇవి ఆయాయుగ తారతమ్యానుసారముగానే ప్రవర్తింపబడుచున్నవి. కనుకనే "కలౌ పారాశరస్మృతిః" అని తెలియుచున్నది. శ్రుతిబోధిత ధర్మములకు, స్మృతిబోధిత ధర్మములకు విరోధములేదు. విరోధముగల్గినచో, శ్రుతిబోధితధర్మములే ప్రమాణములని ప్రాచీనులు చెప్పుచున్నారు.

(3) లౌకికధర్మములు:— ఇవి సర్వసామాన్యముగా మనమందఱు మాచరించు సదాచారములు.

(4) సామాన్యధర్మములు:— ఇవి సామాన్యముగా అందఱాచరింపవలసిన నిత్యకృత్యములు.

(5) విశేషధర్మములు:— ఇవి ఆయా వర్ణా

శ్రమానుసారముగా నేర్పడినవి.

ఆహారనిద్రా భయ మైథునములు పశువులకును, మనకును సామాన్యమేగాని, ధర్మమునందు మాత్రము భేదము గల్గుచున్నది. అందువల్లనే "లోకమునందు మానవజన్మ దుర్లభతర"మని, ఆర్యమిత్రులు నుడివియున్నారు.

అట్టిమానవుడు ముఖ్యముగా మాతృఋణము, పితృఋణము, దేవర్షి ఋణమను మూడు ఋణములతో బుట్టుచున్నాడు. విశేష ఋణమగు మానవఋణముతోడ నాల్గు ఋణంబులచే విముక్తినొందినవాడే ధర్మాత్ముడనబరగుచున్నాడు. అట్టి ధర్మాత్మతను బడయుటకు, "సత్యంవద, ధర్మంచర. మాతృదేవోభవ; పితృదేవోభవ, అతిథి దేవోభవ, ఆచార్య దేవోభవ" ఇత్యాది వేదానుశాసనములు వినబడుచున్నవి. ఈ పై జెప్పబడిన వేదానుశాసనములన్నియు జ్ఞానోత్పత్తికంటె ముందవశ్య మాచరింపదగినవి. ఇవి పురుషుని చిత్తమును సంస్కరించును. కర్మలచే సంస్కరింపబడిన హృదయముగలవానికి ఆత్మజ్ఞానము కరతలామలక మగునని మన ప్రాచీనులు నుడివియున్నారు.

ధర్మమనగా యథాశాస్త్రముగా ఏ ద్రవ్యాదులందు శుభాశంసకొఱకై సాధనత అగునో అదియేధర్మత అని తెలిసికొనవలయును. ధర్మము ధర్మతకు సాధనమగుచున్నది. "శ్రేయస్సాధనతాయత్ర ద్రవ్యాదా విధితోభవేత్, తస్యైవ ధర్మతాజ్ఞేయా, ధర్మస్తత్సాధనం యతః." స్వధర్మము మనచేత లెస్సగా కాపాడబడినదై మనలను రక్షించుచున్నది. స్వధర్మమే మనచేత చెఱుపబడినదై మనలను చంపుచున్నది. ఏ ధర్మము మనచేత చంపబడక సదా చక్కగా ఆచరింపబడుచున్నదో, ఆ ధర్మమే మనకు శరణ్యమైనది. యోగులు దేనిని పొందుటకు ధ్యానింతురో, ఆస్థానమును గూడ ధర్మము పొందించుచున్నది. ధర్మమునకంటె చెలికాడు లేడు. ధార్మికునకంటె సుఖవంతుడు, పండితుడు ఈ లోకమున లేడు. మఱియు ధర్మము స్వర్గ, మర్త్య, నాగలోక సుఖములను, తుట్టతుదకు మోక్షమునైతము నిచ్చునదని విక్రమార్కచరిత్రయందు వర్ణింపబడియున్నది. ఎవరెవరి ధర్మములను వారువారు చక్కగా ఆచరించినచో, దేశము క్షామ మరంబులకు లోనుగాక సుభిక్షముగా నుండును. అప్పుడు ధర్మము నాల్గు పాదంబులచే బ్రవర్తిల్లును. వర్ణములు మనయొక్క ఆత్మోన్నతినిబట్టి బురాణప్రసిద్ధముగా అనులోమ, విలోమములద్వారానే యేర్పడియున్నవి. కనుక ధర్మ మాయావర్ణముల తారతమ్యానుసారముగానే యేర్పడియున్నది. అంతియకాని వర్ణాశ్రమములలో ఎక్కువ తక్కువలు లేవు.

ఈ ఎక్కువతక్కువలనుగూర్చి శ్రీరామకృష్ణపరమహంస ఒకప్పుడిట్లు నుడివియున్నారు. శ్రీవారొకప్పుడు తన జందెమును తీసివైచి ధ్యాననిమగ్నతయందుండ నొకానొకడు ఇట్లు ప్రశ్నించెను "స్వామీ! మీరు జందెమునేల తీసివైచితిరి?" అప్పుడు పరమహంస యిట్లు సమాధానించిరి "భగవత్సాన్నిధ్యమున మన మందఱము సమానులము అందువలన నీశ్వర సేవాతత్పరతయం దీ జందెము నన్నుద్ధతునిగా చేయును. కాన నేను ధ్యానసమయమున జందెమును తీసివైచి తదనంతరము ధరించుచుందును."

వర్ణాశ్రమ తారతమ్యానుసారముగానే వేషభాషాదు లేర్పడియున్నవి. వృక్షజాతి

అంతయు ఒకటేయైననను, వృక్షములు బహు రీతుల బేర్కొనబడుచున్నవి. సస్యములన్నియు, ఒకటేయైన నొక్కొక్కరకపు సస్యమునకు నొక్కొక్క ఎరువు నియమితమైయున్నది. ఒక రకపు సస్యమున కేర్పాటైన ఎరువు మఱియొక సస్యమునకు మనముపయోగింతుమేని ఆ సస్యము వృద్ధిగొందుటకు బదులు నాశనమగు చున్నది.

గురువు శిష్యులందఱికి సమానముగా బోధించినను, వారందఱు ఫలములోమాత్రము భేదించుచున్నారు. దేవతలలోను వర్ణవివక్షత గలదని యీ క్రింది శ్లోకమువలన తెలియు చున్నది. "బ్రాహ్మణో భగవాన్ రుద్రః, క్షత్త్రియో విష్ణురుచ్యతే। వైశ్యః పితామహః ప్రోక్తః, శూద్ర స్సంకీర్ణ దేవతా॥"

దానముచేయుట, సత్రములు, మఠములు, దేవాలయములు కట్టించుట, వాపీకూపతటాకారామాదులను నిర్మించుట మున్నగునవి ధర్మకార్యము లనబరగుచున్నవి.

మనము ఇహపరముల రెండింటియందును శాశ్వతసుఖము బడయవలెననిన, సత్యము, అహింస, బ్రహ్మచర్యము, అస్తేయము, అపరిగ్రహముల ననుష్ఠింపవలెనని యార్యమిశ్రుల యభిమతము. ఈ నాల్గును చతుర్వేదముల సారాంశములగుచున్నవి. సర్వమతముల సముచ్చయమని చెప్పవచ్చును. ఆ ధర్మము వేదము, స్మృతి, సదాచారము, ఆత్మప్రియము సాక్షాల్లక్షణమని నాల్గువిధములుగా చెప్పబడి యున్నది. సర్వాత్మనా ఈ అన్నింటికిని ఆత్మప్రియము మూలమగుచున్నది. కనుక ఆత్మోపమ్యదృష్టియే ధర్మసంగ్రహమని చెప్పబడు చున్నది. "ఆత్మోపమ్యేన భూతేషు దయాం కుర్వీత మానవః" అను లోకోక్తి వినబడు చున్నది. శ్రీకృష్ణపరమాత్మ యిట్లు నుడివి యున్నారు. "ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున। సుఖం వాయదివా దుఃఖం సయోగీ పరమోమతః॥"

ఓ అర్జునా! సుఖదుఃఖములం దెవడు సర్వభూతములను తనవలె చూచుచున్నాడో వాడు యోగివరుడని చెప్పబడుచున్నాడు.

"అహింసా పరమో ధర్మః" అని ప్రతిక్షణము వల్లెవేయుచు, తమ ఔరససంతానము వలె గృహజంతువులను సాకుచు, క్షుత్పిపాసార్థము వాటిని హింసించుటయం దేమాత్రము న్యాయములేదు.

తల్లిదండ్రులకంటె వేరుదైవములేదు. కనుక వారిని సేవించుటచేత దేవతలందఱు ప్రసన్నులగుదురు. తల్లిదండ్రులను సేవించువాడు ధర్మమయుడని చెప్పబడుచున్నాడు. సర్వసంగపరిత్యాగికంటెను తల్లి పూజనీయురాలు. కనుక తల్లిదండ్రులను సేవించుట ప్రధానధర్మము. ఎవరి ధర్మము వారి కెక్కువ. ఒకరి ధర్మమును మఱియొక రాచరించినచో, వానికి శ్రేయస్సు కలుగుటకు బదులు అశుభము గల్గును. కనుక స్వధర్మమే శ్రేయోదాయము. పరధర్మము భయావహము. "స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః" అని గీతావాక్యముగ్ఘోషించుచున్నది. కనుక స్వధర్మమే శరణ్యమైనది. ఆత్మప్రియమే ధర్మసంగ్రహమని చెప్పబడుచున్నది. తల్లిదండ్రులను సేవించువాడే ధర్మమయుడని చెప్పబడుచున్నాడు.

# అరిషడ్వర్గము : కామము

శ్రీ ఉపద్రష్ట సత్యనారాయణభుక్త

1. భగవంతునికిని మానవునికిని భేద మేమన, మాయ భగవంతునికి లోబడియున్నది. మాయ మానవుని లోబరచుకొన్నది. భగవంతుడు మాయను తన యిష్టానుసారముగా నుపయోగించును. మానవుడు మాయచే నాజ్ఞాపింపబడుచున్నాడు. మానవునికిని భగవంతునికి మధ్య మాయ యను తెర వ్యాపించియున్నది. ఈ మాయాచ్ఛాదనముచేతనే మానవుడు భగవంతుని జేరలేకున్నాడు. జ్ఞానముచే దీనిని తొలగించగలిగినవాడు తన్ను భగవంతునిగా తెలిసికొని, భగవంతునియందు లీనమై భగవంతుడే యని పిలువబడుచున్నాడు. అట్టివాడే జ్ఞాని, ఆనందమయుడైన యోగి. ఆ మాయ నెట్లు త్రెంపుచున్నాడో యెట్లు భగవత్స్వరూపము బొందుచున్నాడో యోచింపవలెను. మాయ యనునది కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములను దారములపై నాధారపడి వ్యాపించియున్న వల. ఈ వలయందు సుఖ దుఃఖములు పడుగు పేకలుగా నల్లబడి సర్వేశ్వరుని వైపునకు ప్రయాణముచేయు జీవుని అడ్డగించి స్వస్వరూప విహీనునిగా చేయుచున్నది. గాన ఈవల కాధారములైయున్న కామక్రోధాదులగు అరిషడ్వర్గము ముందుగా యోగి త్రుంచుచున్నాడు. అందు కామమును గూర్చి ఆలోచింతము.

2. కామము అను మూడు వర్ణములయందును ఎంతైనను మహత్వమున్నది. ఈ మూడు వర్ణములలోనే ప్రపంచమంతయునిమిడియున్నది. పుట్టి పెరిగి మరల లయమగుచున్నదనిన నతిశయోక్తికాదు. ఈ మూడువర్ణములచేతనే భగవంతునికి మానవునికి గల సంబంధము విస్మృతమైనది. మానవుని యజ్ఞానమునకు ఆధారము కల్గినది. భగవంతుడనిన మానవునికి భయము భక్తి కల్గుట కవకాశ మేర్పడినది. భగవంతు డన నెక్కడనో ఎంతయో దూరమున నున్నాడని మానవునికి భావముదయించినది. భగవంతు డనువాడు లేడనిపించినది. వేయేల! కామమే భగవంతుడై మానవుని హృదయమున స్థానమేర్పరచుకొని ప్రకాశించుచున్నది. మానవునిపై భగవంతుడు ప్రయోగించిన జాల మవిచ్ఛిన్నముగా నుండ జేసినది. ఈ మానవునితో దోబూచులాడు సర్వేశ్వరునికి దాగుటకు మరుగైనది.

3. కామ మనగా కోరిక. ఇది సర్వార్థములకు ననర్థములకు మూలము. ఇదియే మానవుని జీవితయాత్రకు పునాది. దీనివలననే క్రోధము మోహము మదము మాత్సర్యము అనువానిని మనుజుడు గాంచుచున్నాడు. కోరికచేతనే మానవుడు ప్రతికార్యమును చేసి దాని ఫలితములగు సుఖదుఃఖములను అనుభవించుచున్నాడు. సుఖానుభవమున దాని ఛాయ ననుసరించు మదమును ఆతనిపై నావేశించుచున్నది.

ఈ యైహికసుఖమునకు సహజమగు విరామ కాలమే దుఃఖమని భావించి యా సుఖమందు మోహము చెంది దానిని కల్పించు పదార్థము లందలి లోభత్వము పొంది వానిని విడువలేక అవియే తన్ను విడువగా ఒరులు వాని నపహరించినారను ననుమానమున వానిపై నింద వైచి క్రోధావిష్టుడగుచున్నాడు.

ఇప్పు డాతని మనస్సున గల క్రోధము పూర్వ మాతని మనస్సున గల మదముతో కలసి మాత్సర్యముగా తయారగుచున్నది. మత్సరగ్రస్తుడైన యాతడు ఎట్టి కార్యములనైన వెనుదీయునా? అత డధఃపతితుడగుట యబ్బురమా? ఆతడు భగవత్సన్నిధానమున కెంత దూరమున కేగెనో చెప్పగలమా? ఇదియంతయు కామప్రభావమే కదా!

**4.** మానవునికిని భగవంతునికిని సహజముగా మనుజుని ముఖమునకును, మూపునకును గల దూరమంత దూరమున్నది.' ఇంత దగ్గరగానున్నను, మూపును ముఖము చూడగలదా? కాని సాధన సంపత్తిచే శరీరము తన యిష్టానుసారము వంచగల సాధకుడు ముఖమును వెనుకకు త్రిప్పి మూపును చూడగలడు. అటులనే యోగి అభ్యాసవశమున 'లభ్యమగు జ్ఞానముచే భగవంతుని చూడగలడు.

అతడు మొట్టమొదట కామమును జయింపవలెనుకదా! తత్సాధనము నెట్లవలంబించునో చూతము.

యోగియే కాక సమస్త జనులును త్యాగమనునది కామమును మట్టుపెట్టు జాగిలముగా గ్రహింపవలెను. త్యాగమనగా విడుచుట. మొదట యోగి హఠయోగముచే మనస్సును శరీరమును దృఢపరచుకొనును. తరువాత నాతడు ప్రపంచమున గల ప్రతివిషయమున గల కోర్కెయును క్రమక్రమముగా విడుచు నేర్పును మనస్సునకు నేర్పును. అట్లు నేర్పుటకు కోరువాడు తనకున్న కోరికలన్నిటికంటెను కోరదగిన కోరిక యింకొకటి కలదనియు, ఇప్పుడు తనలోనున్న కోరికలన్నిటికంటెను ఆ కోరికచే శాశ్వత సౌఖ్యమును అనుభవించగలననియు అదియే భగవంతుని కోరుటయనియు భగవంతుని తెలిసికొను పరిశోధనకంటె భగవంతుని కంటె కోరదగు విషయములేదనియు తనకోరికలన్నియు భగవంతుడే యనియు భావించి సాధనచేసినయెడల క్రమముగా నాతనికి కామమునం దసహ్యము కల్గును గాన కామములేని కర్మములనే యాతడొనరించును. తానుచేసిన కర్మములయొక్క ఫలము భగవంతునిదే యని భావించును. ఫలితము కోరని కర్మవలన వచ్చు సుఖదుఃఖము లాతని జేరవుకదా! సుఖదుఃఖాతీతుడగు నయ్యోగి భగవత్సన్నిధానము జేరుటకును, భగవంతుడే తానగుటకును సందేహమేమి? ఇంతకును ముఖ్యమైనది సాధన. త్యాగము తక్క వేరులేదు. గాన కామవిజయమునకు ముఖ్యమైన సాధనములు:—(1) దృఢబుద్ధి, (2) త్యాగము. వీనిని సాధించిన మానవుడు కామజేతయగును. అతనికి ప్రకృతి సర్వమును సమకూర్చును.

అతడే నిష్కామయోగి.

శ్లో॥ కాయేనవాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనావా ప్రకృతే స్స్వభావాత్
కరోమియద్య త్సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి॥



# సంఘ వార్తలు

## లండన్ నగరమున

# శ్రీ రామకృష్ణ జన్మదినోత్సవము

శ్రీరామకృష్ణ పరమహంసలవారి 116 వ జన్మదినోత్సవము లండన్ నగరమునందలి శ్రీ రామకృష్ణ వేదాంతసంఘమువారిచే కింగ్స్‌లే హాలు (Kingslay Hall) నందు 20-3-'51 నాడు జయప్రదముగ జరుపబడెను. ఆనాటి వక్తలలో నొకరైన కెన్నల్ వాకర్, F R. C. S అనువారు "ప్రపంచమున నెందఱు తమ నిత్యజీవితమునకును ప్రబోధమునకును భేద మావంతయులేక జీవింపగలరు? అట్టివారు చాల యరుదు. కాని శ్రీరామకృష్ణులు అధునాతనకాలమున నిట్టివిషయమున గొప్ప ఆదర్శ పురుషుడు. ఆయన జీవితమునకును ఉపదేశములకును భేదమేమియు గోచరింపదు. శ్రీరామకృష్ణుల జీవితముగూర్చిగాని ఉపదేశముల గూర్చిగాని ప్రసంగింపుడని నన్ను గోరిరి. కాని నేనీ రెండు విషయములలో దేనినిగూర్చి చెప్పుచున్నానో నాకే తెలియుటలేదు. అవి రెండును అన్యోన్యములుగ నే—ఒక్కటిగ నే—నాకు గోచరించుచున్నవి" అని తన యుపన్యాసారంభమున పలికి శ్రీరామకృష్ణుల యుపదేశములు నేటికాలపు కడగండ్లను దీర్పగల విధమును వివరించిరి. ఆ సందర్భమున అచ్చటి కేంద్రాధ్యక్షులయిన శ్రీ ఘనానందస్వామివారు, ఆ కేంద్రము ఎట్లు ఎన్నియో ఆటంకముల నుద్గమించి చక్కని పునాదిని బడయగలిగినదియు వివరించిరి. పిదప నుపన్యసించిన Sir John Stuart Wallace అను వారు "ప్రాపంచికధర్మము" అను విషయము నిట్లు వివరించిరి: "1890 వ సంవత్సరమున శ్రీ వివేకానందస్వాములవారు సర్వధర్మ సమన్వయమునకు వివరించిన మార్గ మొక్కటియే ప్రపంచమునకు శ్రేయోదాయకమై Mr Walkar వచించిన కష్టముల దీర్పగలదని పలికిరి. మఱియు Sir John గారు మానవులనెల్ల మూడు తెగలుగ విభజించిరి. ఇందు మొదటితరగతివారు నాస్తికులయిన యువకులు, రెండవవారు అజ్ఞాతవాదులు. అనగా ఆదియందు నాస్తికులై యుండి పిదప తమభావమును మార్చుకొన్నవారు. ఇక మూడవతరగతివారు ఆస్తికులు. వారి విశ్వాసమే వారికి జ్ఞానోపలబ్ధి కలిగించినది. ఈ ఆస్తికుల తరగతికి జెందినవారే శ్రీరామకృష్ణులవారు. వారు స్వీయానుభవముచే జ్ఞానము బడయుటవలన శ్రీవారు సమస్త ప్రపంచమునకును ధర్మసమన్వయమార్గమును జూపగలిగిరి. ఆ మార్గమును శ్రీ వివేకానంద స్వాములవారు ప్రాక్పశ్చిమ దేశములందంతట ప్రకటించిరి." అంతట శ్రీ ఘనానందస్వాములవారు తమ యుపన్యాసము మధ్య నిట్లు వివరించిరి: "శ్రీరామకృష్ణ సంఘము గొప్ప ఆధ్యాత్మిక సంఘము. అది ప్రపంచశాంతి కెంతయు దోడ్పడనున్నది. దాని శాఖయే యీ లండను కేంద్రము. కల్లోలమయమైయున్న ప్రపంచమునకు శ్రీరామకృష్ణోపదేశములు శాంతిభిక్షనిడగలవు." అంత సభ జయప్రదముగ ముగిసినది.



# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

## శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము)

540 పుటలు సర్వాంగ సుందరమగు చతుర్థ ముద్రణము వెల రూ. 3-4-0

## శ్రీ మద్భగవద్గీత

480 పుటలు శ్రీధరీయ టీకాసార ప్రతిపద టీకాతాత్పర్య విశేషార్థ సహితము రూ 3-0-0

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

350 పుటలు (మద్రాసు ఆంధ్ర విశ్వవిద్యాలయములందు పాఠ్యగ్రంథము) రూ. 2-8-0

## శ్రీ శారదాదేవి చరిత్ర

256 పుటలు (ఆంధ్ర విశ్వవిద్యాలయమున పాఠ్యగ్రంథము) వెల రూ. 1-12-0

## శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

136 పుటలు (ఆదర్శప్రాయుడగు గృహస్థుని జీవితము) వెల రూ. 1-4-0

| | | | |
|---|---|---|---|
| శారదా ప్రసంగములు . | 2 | 8 | 0 |
| ప్రబోధరత్నాకరము . | 2 | 4 | 0 |
| రాజయోగము .. | 2 | 4 | 0 |
| కర్మయోగము | 1 | 8 | 0 |
| భక్తియోగము . | 1 | 4 | 0 |
| వివేకానంద లేఖావళి (మొదటి భాగము) | 1 | 8 | 0 |
| వివేకానంద లేఖావళి (రెండవ భాగము) | 1 | 8 | 0 |
| అనుష్ఠాన వేదాంతము . | 1 | 4 | 0 |
| వివేక సూర్యోదయము . | 1 | 0 | 0 |
| శ్రీ పరమహంస నీతికథా రత్నములు | 0 | 12 | 0 |
| భక్తిమార్గము . | 0 | 8 | 0 |
| చికాగో నగరోపన్యాసములు . | 0 | 8 | 0 |
| గురూపదేశములు . | 0 | 8 | 0 |
| నా సంస్కరణ యుద్ధవిధానము | 0 | 6 | 0 |
| నా గురుదేవుడు | 0 | 6 | 0 |
| శ్రీ పరమహంస జీవిత సంగ్రహము | 0 | 4 | 0 |
| నవీన భారతదేశము | 0 | 4 | 0 |
| ముక్తిమార్గము | 0 | 3 | 0 |
| సర్వం విష్ణుమయం జగత్ (తెలుగు) | 0 | 3 | 0 |
| శ్రీ రామనామ సంకీర్తనము | 0 | 1 | 0 |
| యతిగీతము (పద్యకావ్యము) | 0 | 1 | 0 |
| నా మతము 0 0 6 డజను | 0 | 5 | 0 |
| సింహగర్జన 0 0 6 డజను | 0 | 5 | 0 |

ఇవియే కాక

సంస్కృత, ఆంగ్ల, ద్రావిడ, హిందీ, కన్నడ గ్రంథములును

వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాస పత్రికలును మా యొద్ద దొరకును

శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి

మున్నగువారి ఛాయాచిత్రములును మా యొద్ద దొరకును

ఇట్లు వ్రాయుడు

మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి.

సంపాదకులు: శ్రీ భూతేశానందస్వామి, శ్రీ [illegible]
శ్రీ కె. ఎస్. ఎన్. రాజన్ గారిచే ది జ్యూపిటరు ప్రెస్సు లిమిటెడ్ (జి. టి. మదరాసు)లో ముద్రింపబడి,
శ్రీ ఆదిదేవానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 20-5-51.

# శ్రీ రామకృష్ణ ప్రభ

౧౯౫౧, జూన్—ఖర, జ్యేష్ఠము

సంపుటము ౭ సంచిక ౧౨

శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు
చెన్నపురి

# విషయసూచిక



# శ్రీ రామకృష్ణ ప్రభ

## చందాదారులకు

౧. పత్రిక ప్రతిమాసము 20-వ తేదీన వెలువరింపఁబడును. ఒక వారము, పదిరోజులు గూచి ప్రతి మీకు అందకపోయినయెడల ఉత్తరము వ్రాయుఁడు.

౨. సంవత్సర చందా రు. ౩ లు మాత్రమే. జనవరినెల నుండిగాని జూలై నెల నుండిగాని చందాదారులుగఁ జేరవచ్చును. ఇతర మాసములలోఁ జేరదలచు వారికి జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని సంచికలు చేర్చిపంపఁబడును. విడిప్రతి రూ. ౦—౬—౦ లు. హిగిన్‌బాదంస్ వారి స్టాలులోఁగాని, మీ పత్రిక ఏజెంటును గాని అడుగుఁడు.

౩. ఉత్తర ప్రత్యుత్తరములు వీలైనంతవఱకు ఇంగ్లీషున వ్రాయుచు మీ చందాదారు సంఖ్య నుదాహరింపఁగా, ఉత్తరములను "మేనేజరు, శ్రీరామకృష్ణప్రభ" అను చిరునామాకు వ్రాయుఁడు.

౪. చిరునామాయందు ఏట్టిమార్పుగలిగినను 10-వ తారీఖునకు ముందుగా మా కార్యాలయమునకుఁ దెలుపవలయును. లేనిచో, పత్రిక పూర్వపు చిరునామాకే పంపఁబడును.

## వ్యాసకర్తలకు

౧. కేవలము నైతిక ధార్మిక వైజ్ఞానిక విషయకములైన వ్యాసములేకాక, సాహిత్యమునకును కవిత్వమునకును సంబంధించిన ఏ వ్యాసములైనను బంపవచ్చును. సులభ సుందరమగు గ్రాంథిక భాషలో వ్రాయవలయును.

౨. వ్యాసములు అచ్చులో మూఁడు పుటలకు మించరాదు. ప్రతినెల ఒకటవ తేదీకి వ్యాసములు మాకు అందవలెను.

౩. వ్యాసములను, విమర్శకుఁ బంపు గ్రంథములను, వినిమయముగఁ బంపెడి పత్రికలను "సంపాదకుఁడు, శ్రీరామకృష్ణ ప్రభ శ్రీరామకృష్ణ మిషన్ స్టూడెంట్స్ హోమ్, మైలాపూరు, చెన్నపురి" అను చిరునామాకు వ్రాసి పంపవలెను.

౪. వ్యాసము తిరుగఁ బంపఁబడవలయుననుచోఁ దగు పోస్టేజి చేర్చి పంపవలయును.



# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౭ { ౧౯౫౧ - జూన్ :: ఖర - జ్యేష్ఠము } సంచిక ౧౨

## ప్రార్థన

### భక్తిశతకము

శ్లో. నాహం లాభార్చనార్థీనచ భయచకితోనాపి సత్కీర్తికామో
నత్వం ఘర్మాంశువంశ ప్రభవ ఇతి మునేనాపి విద్యాశయాతే।
పారంపర్యాన్నచ త్వాం శరణముపగతః కింతుతే సార్వజన్యం
సమ్యగ్జ్ఞానం సమీక్ష్యత్వయి భవజలధిం సన్తరోతుం ప్రవృత్తః॥ 32

ఓ మునీ! నేను నిన్ను సదా భజించునది లాభాపేక్షచేగాదు, భయవిహ్వలతచే కాదు, కీర్తిఖ్యాతులను కోరికాదు - నీవు సూర్యవంశజుడవనియు కాదు. విజ్ఞానార్థినై కాదు - పారంపర్యాచారము కాదు—ఈ సంసారసాగరమును తరింపకోరినవాడనై సార్వజన్య శ్రేయోదాయకమగు సుజ్ఞానము నీకు కలదనే నీ దరిచేరినాడను.

శ్లో. తద్వైరాగ్య సమస్తభూతకరుణా ప్రజ్ఞాదినానాగుణ
స్ఫూర్జచ్చందన పంకసింధుపతితౌ గంతుం క్షమోనాన్యతః।
భూపావాయది దండయంతి విబుధా నిందంతి వా బాంధవా
ముంచంతి క్షణమప్యహం జిన పితర్జీవామి నత్వం వినా॥ 33

జ్ఞానము, వివేకము, భూతదయ, వైరాగ్యము మొదలగు నీ సకల సద్గుణ ప్రకాశమానమైన గంధసాగరమున మునిగియున్న వానికి ఇతరస్థలములకు పో వీలుకలుగదు. రాజులు దండింపనీ, కవులు అవజ్ఞాభావమును ప్రకటింతురుగాక, బంధువులు త్యజింపనీ, నిన్నువినా - ఓ జిన తండ్రీ! ఒక్కక్షణము జీవించలేను.



ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ

# శ్రీ రామకృష్ణ వచనామృతము — 'మ.'

## శ్రీ అధరసేనునియింట రాఖాల్, ఈశాన్‌చంద్రముఖర్జీ మున్నగు భక్తులతో శ్రీరామకృష్ణుడు

22 సెప్టెంబర్, 1883.

ఈనాడు శ్రీరామకృష్ణగురుదేవుడు కలకత్తా యందలి అధరసేనుని గృహామునకు శుభాగమనము గావించెను. గురుదేవు డా యింటి వసారా యందు గూర్చొనియుండెను. అది సాయంకాలము. శ్రీరామకృష్ణుని జూచుటకై ఆ చుట్టుపట్లనున్న భక్తులు, 'మ.', ఈశాన్ ప్రభృతులు అనేకులు వచ్చియుండిరి.

శ్రీ ఈశాన్‌చంద్రముఖర్జీ శ్రీరామకృష్ణుని ఎక్కువగా ప్రేమించువాడు. ఆయన అకౌంటెంట్ జనరల్ ఆఫీసున సూపరింటెండెంటుగా నుండి ప్రస్తుతము విరామము నందియుండెను. ఆయన మిక్కిలిగా దానధర్మములు గావించుచుండువాడు. తనకు వీలున్నపుడంతయు దక్షిణేశ్వరమున కేతెంచి శ్రీ గురుదేవుని దర్శించువాడు. గంగాతీరమునందలి నిర్జన గృహామునం దపుడపుడు భగవచ్చింతన గావించుచు కాలము గడుపుచుండువాడు.

శ్రీరామ:—(ఈశానునిజూచి) ఏమోయ్! ఆ కుఱ్ఱవాడు ఉత్తరము వ్రాసిన విషయము జెప్పు.

ఈశాన్:—(నవ్వుచు) కుఱ్ఱవాడు ఈశ్వరుడు మనలను సృష్టించెను అన్నమాట వినెను. అందువలన తనప్రార్థనలను భగవంతునకు దెలుపుటకుగాను భగవానున కొక యుత్తరము వ్రాసి తపాలాపెట్టెలో వేసెను. విలాసము స్వర్గము అని వ్రాసియుండెను. (అందఱు నవ్విరి.)

శ్రీరామ.—(నవ్వుచు) చూచితివా! ఆ బాలున కెంతటి విశ్వాసమో! అంతటి నమ్మకముండిననే భగవద్దర్శనము కలుగును. (ఈశానునితో) ఆ కర్మత్యాగి విషయము?

ఈశాను:—భగవల్లాభము కలిగినచో సంధ్యాదికర్మములు త్యజింపబడును. గంగాతీరమున నందఱును సంధ్యవార్చుచుండిరి. ఒకడు మాత్రము ఊరకుండెను. ఒకడు వానినిజూచి 'ఏమోయ్ నీవు సంధ్యవార్చుటలేదు?' అని యడిగెనట. అందుల కత డిట్లు సమాధానించెను: 'నాకు అశౌచము తగిలినది కాన సంధ్యవార్చుటకు వీలుపడదయ్యె. ఒకటి మరణాశౌచము, రెండవది జన్మాశౌచము. అవిద్యయగు తల్లికి మృత్యువు కలిగినది, బోధమయుడగు ఆత్మారాముడు (కుమారుడు) జన్మించెను. *

శ్రీరామ:—సరే ఆత్మజ్ఞానము కలిగిన జాతిభేదము నశించునన్న కథ?

* శ్లో. మృతా మోహమయీమాతా, జాతో బోధమయః సుతః,
మాతకద్వయ సంప్రాప్తౌ, కస్మై సంధ్యా ముపాస్మహే. —మైత్రేయ - ద్వితీయాధ్యాయము.

ఈశాన్.—కాశీయందు గంగాస్నానము చేసి శ్రీ శంకరాచార్యుడు మెట్లెక్కుచుండెను. ఆ సమయమున కొన్ని కుక్కలతో చండాలు డొక డెదురుపడెను. వానినిజూచి శ్రీ శంకరుడు 'ఏమోయ్! నన్ను స్పృశించితివి' అనెను. అందుల కా చండాలు డిట్లనెను 'అయ్యా! నేను నిన్నంటలేదు. మీరు నన్నంటలేదు. ఆత్మ అందఱకును అంతర్యామి, నిర్లిప్తుడు. సురయందలి సూర్యబింబమునకును, గంగ యందలి సూర్యప్రతిబింబమునకును భేదము గలదా?'

శ్రీరామ.—(నవ్వుచు) సమన్వయము మాట? అన్ని మతములవలన భగవల్లాభము నందగలుగు టెట్లు?

ఈశాన్.—హరి, హర—ఈ రెండు శబ్దములకు ధాతువొక్కటియే. ప్రత్యయము మాత్రమే భేదము. ఎవడు హరియో అతడే హరుడును. నమ్మకమున్న జాలును.

శ్రీరామ:—(నవ్వుచు) మరియొకమాట, సాధువు హృదయము అన్నిటికంటె పెద్దది, అది ఎట్లు?

ఈశాన్.—(నవ్వుచు) అన్నిటికంటె పెద్దది పృథివి. దానిని మించినది సాగరము. దానిని మించినది ఆకాశము. కాని విష్ణుభగవాను డొకపాదముచేత స్వర్గమర్త్యపాతాళములను త్రిభువనములను ఆక్రమించెను. ఆ విష్ణుపాదము సాధువు హృదయమునందు గలదు. కాన అన్నిటికంటె సాధుహృదయము పెద్దది.

ఈ పలుకులు విని భక్తులందఱు నానందించిరి.

ఈశానుడు తన మిత్రగృహమున గాయత్రీ పురశ్చరణము చేయగోరియున్నాడు. గాయత్రి బ్రహ్మమంత్రము. విషయబుద్ధి సంపూర్ణముగా నశింపనిచో బ్రహ్మజ్ఞానము కలుగదు. కాని కలియుగమున నెల్లరును అన్నగతప్రాణులు. విషయబుద్ధి పోవదు. మనస్సు రూప రస గంధ స్పర్శ శబ్దములందే నిలుచును. అందువలన శ్రీరామకృష్ణుడు ఈశానునితో నిట్లనెను: "కలియుగమున వేదమతము ననుసరింపజాలము. ఎవడు బ్రహ్మమో అతడే శక్తి. శక్త్యుపాసన గావించిన బ్రహ్మోపాసనయే యగును. సృష్టి స్థితి ప్రళయముల గావించునపుడు బ్రహ్మమే శక్తి యని చెప్పఁబొప్పును." ఈ రెండును వేఱు వేఱు వస్తువులు గావు, ఒకటే వస్తువు.

ఏల 'నేతి, నేతి' యని చెప్పుచు దిరుగుచున్నావు? బ్రహ్మనుగూర్చి ఏమియు వివరింప జాలము. చెప్పగలిగినది 'అస్తిమాత్రం కేవల రామ్,' మనము చూచునదంతయు, చింతించు నదంతయు ఆద్యాశక్తియే. ఆ చిచ్ఛక్తియొక్క ఐశ్వర్యము—సృష్టి, పాలనము, సంహారము, జీవజగత్తు, ధ్యానము, ధ్యాత భక్తి, ప్రేమ,—ఇవన్నియు ఆమె ఐశ్వర్యములే.

కాని బ్రహ్మయు శక్తియు నభేదములు. లంకనుండి తిరిగి వచ్చిన పిదప హనుమంతుడు శ్రీరాముని ఇట్లు స్తుతించెను. ఓ రామా! నీవు పరబ్రహ్మమవు, సీత నీ శక్తి. కాని మీలో భేదములేదు. సర్పమునకు దాని తిర్యగ్గతి—సర్పమును తలచినప్పుడు దాని గతియు మనకు తలంపునకు వచ్చును. ఆ గతిని తలంచినప్పుడు సర్పము తలంపునకు వచ్చును. పాలును తలంచి నప్పుడు దాని ధావళ్యము స్ఫురించును, ధావళ్యమును తలంచిన క్షీరము స్ఫురించును. శైత్యమును తలంచిన జలము స్ఫురించును, జలమును తలంచిన శైత్యము స్ఫురించును.

ఈ ఆద్యశక్తి లేక మహామాయ బ్రహ్మము నావరించియున్నది, ఈ ఆవరణము తొలగినచో నే నేమైయుంటినో అదియే యగుదుమ. నేనే

నీవు, నీవే నేను. ఎంతవఱకు యీ యావరణ మున్నదో అంతవఱకు 'సోఽహం—నేనే బ్రహ్మను' అనెడి వేదాంతవాదుల వాక్కు నిరర్థకము. జలమునకు తరంగము చెందినది కాని తరంగమునకు జలము చెందినదికాదు. ఆవరణమున్నంతకాలము భగవానుని తల్లిగా భావించి పిలుచుటయే తగినపని. నీవు నా తల్లివి, నేను నీ సంతానమను, నీవు ప్రభువవు, నేను దాసుడను. సేవ్య సేవకభావము చాల మంచిది. ఈ దాసభావమునుండియే శాంత సఖ్యాది భావములుగూడ కలుగగలవు. యజమాని దాసునియెడ సంతుష్టుడే యయినచో దాసుని తనయొద్దకు బిలిచి కూర్చుండబెట్టుకొని, 'నీకును నాకును తారతమ్యములేదు' అని పలుక వచ్చును. కాని దాసుడు తనంతట తానే యజమానిచెంతకు బోయి కూర్చున్నచో యజమానికి కోపము కలుగకుండునా ?'

భగవదవతార లీలలన్నియును చిచ్ఛక్తి యొక్క ఐశ్వర్యవికాసములు. ఏది బ్రహ్మమో అదియే మఱల రాముడు, కృష్ణుడు, శివుడు నగును.

ఈశాన:—'హరి హర' అను నీ రెంటికిని ఒకే ధాతువు. ప్రత్యయములే వ్యత్యాసములు. (అందఱు నవ్వుదురు.)

శ్రీరామ.—ఔను, ఒకటే కాని రెండు లేవు. వేదములందు 'ఓం సచ్చిదానందః బ్రహ్మః' అదియే పురాణములందు 'ఓం సచ్చిదానందః కృష్ణః' అనియు తాంత్రిక శాస్త్రములందు 'ఓం సచ్చిదానంద శివమ్' అనియు వివరింపబడియున్నది.

ఆ చిచ్ఛక్తియే మహామాయారూపమున అందఱను అజ్ఞానమున ముంచియున్నది. అధ్యాత్మరామాయణమున రాముని దర్శించిన ఋషులెల్ల 'ఓ రామా! నీ భువనమోహినీ మాయవలన మమ్ములను ముగ్ధులను జేయ వలదు.' అన్నాడు.

ఈశాన.—ఆ మాయ యేమిటి ?

శ్రీరామ.—నీవు చూచునదియు, విను చున్నదియు, యోచించునదియు—అంతయు మాయయే. ఒక్కమాటలో జెప్పవలయు నన్నచో కామినీకాంచనములే మాయావరణ ములు.

తాంబూలచర్వణము, మత్స్యాహారము భుజించుట, ధూమపానము, అభ్యంగనస్నానము గావించుట,—వీనివలన ఏ దోషమును లేదు. ఇవన్నియు త్యజించిన మాత్రమున నేమి లాభము? కామినీకాంచనత్యాగమే త్యాగము, గృహస్థులు అపుడపుడు నిర్జనస్థలమునకు బోయి సాధనలు సలుపుచు భక్తిని బడయవలయును. మానసికముగ త్యజింపవలయును. సన్న్యాసులు మానసికత్యాగము, బహిర్త్యాగము—రెండును గావింపవలయును. కేశవునితో నేనిట్లు పలికి యుంటిని "'టైఫాయిడు' జ్వరపీడితుడున్న గదియందు మంచి మంచి ఊరగాయలు, చన్నీటి కలశము నుండినచో అతడెట్లు బాగుపడగలడు?" అపుడపుడు నిర్జనస్థలమునకు బోవలయును.

ఒకభక్తుడు.—అయ్యా! నవవిధాన మెట్టిది ? * అది నాకు కలగూరగంపవలె కనిపించుచున్నది.

శ్రీరామ.—కొందఱు దానిని ఆధునికమని చెప్పుదురు. అదియంతయు విని బ్రహ్మసామాజికులకు మాత్రము భగవానుడు మరియొకడా యని తలచెడివాడను. అది నవవిధానమట. క్రొత్తవిధానము. అదియు నుండవచ్చును.

* నవవిధానము బ్రహ్మసమాజమునందలి యొక శాఖ. కేశవచంద్రునివలన ప్రారంభింపబడినది.

షడ్దర్శనములున్నవిగదా! అట్లే యిదియు నొకటై యుండవచ్చును.

కాని నిరాకారవాదుల పొరపాటిది వారు చెప్పినట్లు భగవానుడు నిరాకారుడే. తక్కిన మతములన్నియు పెడదారులట. భగవానుడు సాకారుడును నిరాకారుడును గూడ నని నే నెఱుగుదును. ఆయన యింకెన్నియో విధములు గావచ్చును. ఆయన అన్నియు కాగలడు.

(ఈశానునితో) చిచ్ఛక్తియే—ఆ మహామాయయే— తమచతుర్వింశతి తత్త్వములునై యున్నది. ఒకప్పుడు నేను ధ్యానముచేయుచుండగా మనస్సు 'రస్కే' యింటికి బోయినది. 'రస్కే' పాకీవాడు. అపుడు మనస్సులో నిట్లంటిని: ఓ మూర్ఖుడా ఇచటనే పడియుండుము. అపుడు దేవి నాకిట్లు కనబఱిచినది అచట దిరుగుచున్న స్త్రీ పురుషులెల్లరుగూడ ఆవరణముమాత్రమై యుండెను. ఆ యందరి యందును కులకుండలినీశక్తియు షట్చక్రములును అంతర్భూతములుగా నుండెను.

ఆ ఆద్యశక్తి స్త్రీయా? పురుషుడా? నేనొకప్పుడు కుమారి పుష్కరమున లాహావారి యింటిలోని కాళీపూజను దర్శించితిని. దేవి మూర్తిమీద యజ్ఞోపవీతము అలంకరింపబడి యుండెను. తల్లి మెడలో యజ్ఞోపవీత మెందులకని యొకడు ప్రశ్నించెను. ఆ యింటి యజమాని ఆతనిజూచి, 'తమ్ముడా! నీ వెట్లో సరిగా తెలిసికొన్నట్లు కనిపించుచున్నది. కాని ఆమె స్త్రీయైయో, పురుషుడో నాకు గోచరించుటలేదు.'

కొన్ని గ్రంథములం దిట్లున్నది: 'మహామాయ శివుని లటుక్కున మ్రింగివైచినది. ఆమెయందలి షట్చక్రములు వికసించినపుడు శివుడు ఆమె తొడనుండి బయటికి వచ్చెనట. అపుడే శివుడు తంత్రశాస్త్రమును సృష్టించెను.'

ఆ మహామాయ చిచ్ఛక్తి శరణుబొందును.

ఈశా—మీరు నన్ననుగ్రహింపవలయును.

శ్రీరాను—సరళభావముతో 'భగవానుడా! నాకు నీ దర్శనము నొసగుము' అని విలపింపుము. తరువాత 'భగవంతుడా! కామినీకాంచనములనుండి నా మనస్సును దొలగింపుము' అని ప్రార్థింపుము. లోపలికి మునుగుము. పైపై నీదులాడిన రత్నములు లభింపవా? బాగుగా మునిగి దేవులాడవలయును.

గురువువలన మార్గమును దెలిసికొనవలయును. ఒకడు పూజకొఱకై బాణలింగమును వెదకుచుండెను. ఆ సమయమున నొకడు అతనిని జేరి, 'నీవు ఫలానా నదిదగ్గరకు బొమ్ము. అచట చెట్టుక్రింద నొక సుడిగుండము గలదు. ఆ సుడిగుండమున మునిగి లోనికి బోయిన నీకు బాణలింగము లభించును' అని చెప్పెనట. అట్లే గురువుదగ్గర మార్గమును దెలిసికొనవలయును.

ఈశా—చిత్తము.

శ్రీరామ—సచ్చిదానందమే గురురూపమున భాసిల్లుచున్నది. మానవగురువునొద్ద దీక్షపొందినవాడు తన గురువును మానవునిగా దలచిన నేమియు ఫలించదు. ఆయనను సాక్షాత్తు భగవానునిగా తలంపవలయును. అప్పుడేగదా! మంత్రమునందు విశ్వాసము కలుగుట? విశ్వాసమున్నచో సమస్తమును సమకూరినట్లే. ఏకలవ్యుడు మట్టితో ద్రోణాచార్యుని తయారుచేసి అడవిలో విలువిద్య నేర్చుకొనెను. సాక్షాత్తు ద్రోణాచార్యులనెడి మనస్సుతో మట్టిద్రోణుని బూజించెడివాడు అందువలననేగదా అంతటి విద్య నేర్వగలిగినాడు. నీవు శుష్కబ్రాహ్మణ పండితులతో గూడి వృథాకాలయాపన చేయవలదు. వారి మనస్సంతయు ధనసంపాదనము

నందే మునిగియుండును. స్వస్త్యాయనము గావించుటకై కొందఱు బ్రాహ్మణులు లోకచోట జేరిరి. శ్రీచండియో మఱిదేనినో చదువుచుండిరి. అందు కొన్నిపుటలు జదువకయే త్రిప్పివేయుచుండిరి. (అందఱు నవ్విరి.)

తన్ను తాను జంపుకొనుటకు (గోరుకత్తి) చిన్నకత్తియైనను జాలును. ఇతరులను జంపుటకే బల్లెము, బాకులు, ఈటెలు కావలయును. ఎన్నో శాస్త్రములవలని ప్రయోజనములేదు. వివేకమే లేకపోయినచో పాండిత్యమువలన బ్రయోజనములేదు. షడ్దర్శనములను దెలిసికొన్నను వృథాయగును. నిర్జనప్రదేశమున రహస్యముగా భగవానుని బ్రార్థించినచో ఆయనయే నీకు సమస్తము సమకూర్పగలడు.

ఈశానుడు గాయత్రీ పురశ్చరణార్థము గంగాతీరమున నొక కుటీరమును నిర్మించియున్నట్లు శ్రీరామకృష్ణ గురుదేవుడు వినియుండెను.

శ్రీరామ:— (ఆత్రతతో) ఏమోయ్! ఇల్లు కట్టుట పూర్తియైనదా? నే నొకమాట చెప్పెద వినుము. నీ సాధనజీవితమును పరులకు ఎంత గుప్తముగా నుంతువో నీ కంతటి శ్రేయస్సు. సద్గుణములతో పరిపూర్ణులైనవారు మనసునందో, ఒకమూలయందో, అడవియందో, లేక దోమతెరలోపలనో కూర్చొని ధ్యానింతురు.

అప్పుడప్పుడు ఈశానుడు హజ్రాను తన యింటికి దీసికొనిపోవును. హజ్రాకు బాహ్యశౌచమున ఎక్కువ చూపు. శ్రీరామకృష్ణ గురుదేవుడు ఆయనను ఈ విషయమున వన్నిమారు సార్లు మందలించియున్నాడు.

శ్రీరామ:— (ఈశానునితో) ఇదిగో! ఎక్కువ ఆచారమును జూడవలదు. ఒకప్పు డొక సాధువునకు చాల దప్పి కలిగెను. ఆ సమయమున దారియందు ఒకడొక తోలుసంచి నిండుగా నీరు బట్టుకొని పోవుచుండెను. ఆ సాధువు అవస్థనుజూచి వాడు ఆతనికి నీరు పోయ సమ్మతించెను. ఆ సమయమున ఆతని జూచి సాధువు 'నీ సంచి శుభ్రముగా నున్నదా?' అని ప్రశ్నించెను. అందులకు బాటసారి, 'పంతులుగారు! నా సంచి చాల శుద్ధముగా నున్నది. కాని మీ సంచిమాత్రము మలమూత్రములతో నిండియున్నది. అందువలన నే నా సంచియందలి నీరు మీరు త్రాగవచ్చును. అందువల్ల నే దోషమును లేదు' అని పలికెను. ఇచట నీ సంచి యనగా నీ శరీరము, కడుపు మొదలగునవి:

మరియొక విషయము భగవన్నామమున నమ్మకము కలిగియుండుట. అట్లయిన తీర్థయాత్రలుకూడ నవసరములేదు.

ఇట్లు చెప్పి శ్రీరామకృష్ణుడు పాడ నారంభించెను.

పాట భావము :

నేను కాళీనామము ననవరతము జపించుచు శరీరమునే విడువగలిగినచో గయా, గంగా, ప్రయాగ, కాశి, కాంచి మున్నగు స్థలములకు నేనేల పోవలయును? ... ...

శ్రీరామ:—(ఈశానునిజూచి) ఇంక నేమయిన సందేహమున్న అడుగుము.

ఈశాను:—చిత్తము. విశ్వాసమే అన్నిటికంటె ముఖ్యమని మీరు చెప్పిన పిదప అడుగవలసిన దేమియున్నది?

శ్రీరామ:—నిజమయిన నమ్మకము కలిగినవానికి భగవద్దర్శనము తప్పక కలుగగలదు. సమస్తమును నమ్మువారికి అంతకంటె త్వరగా గలుగును. ఆహారమును పరీక్షించి తిను అవు

చక్కగా పాలీయదు. అటు ఇటు చూడక అన్నిచెట్లయాకులు తిను ఆవు పుష్కలముగా పాలిచ్చును.

ఒకనికి తన యిష్టదైవమును నొక పొట్టేలి శరీరమున జూచునట్లు భగవదాదేశము కలిగిన దట. వాడా విషయమును నమ్మెను. భగవంతుడు సర్వభూతములందును అంతర్భూతుడై యున్నాడుగదా!

ఒక గురువు తన శిష్యునకు శ్రీరామచంద్రుడే ప్రతి జీవమునందును గలడని చెప్పి వెడలిపోయెను. శిష్యు డట్లే నమ్మికొనెను. ఒకప్పుడు ఒక కుక్క వాని రొట్టెముక్కను నోటగఱచుకొనిపోయెను. అంత నా శిష్యుడు నేతిగిన్నెను జేతబట్టుకొని కుక్క వెంట బరువెత్తుచు 'ఓ రామచంద్రా! కొంచెము నిలువుము, నీ రొట్టెకు నేయి యింకను బూయలేదు' అని కేకలువేయుచుండెను.

కృష్ణకిశోరున కెంతటి విశ్వాసమో చూచితివా? 'ఓం కృష్ణ, ఓం రాం' అని యీ మంత్రము నుచ్చరించినచో కోటి సంధ్యావందనములు చేసిన ఫలము కలుగునని పలికి యున్నాడు.

నాతో నాత డొకప్పుడు రహస్యముగా 'నాకు'సంధ్య గింధ్య' ఇవన్నియు నచ్చుటలేదు', అనెను. నాకుగూడ ఆ విధముగనే కొన్ని సమయములందు గోచరించును. దేవియే అన్నిటియందును నున్నట్లు నాకు జూపియున్నది. సరివి చెట్లమధ్య నేను వచ్చుచుండగా ఒకప్పుడు నా వెనుక నొక కుక్క వచ్చుచుండెను. ఆ కుక్కద్వారా తల్లి యేమయిన చెప్పునేమో యని నాకు దోచినది.

నీవు చెప్పినట్లు నమ్మకమువలన సమస్తమును గలుగును.

ఈశాన్.—కాని, మేమెల్లరము గృహస్థులము.

శ్రీరామ.—అయిననేమి? అసంభవము గూడ సంభవముగా మారగలదు. రామప్రసాదు ఒకపాటయందు 'మాయాజాలము' అని పాడగా, మరియొకడు దానికి జవాబుగా నిట్లు పాడెను. 'ఈ సంసారము ఆనంద నికేతనము, ఇక్కడ తిని, త్రాగి ఎంతో హాయిగా నుందును. జనకరాజ మహాతేజమునకు ఎవరును సాటిగాకపోయిరి. ఇహపరముల రెంటిని రెండుచేతుల నుంచుకొని నిండు గిన్నె పాలు త్రాగుచుండెను.'

కాని మొదట నిర్జనస్థలములందు పారమార్థిక సాధనలను కావించి భగవద్దర్శనము బడసిన యనంతరమే సంసారమునందుండినను జనకునివలె నుండవచ్చును. అట్లు కానిచో నింకెట్లు ఆ స్థితి కలుగును? శివుని జూడుము. ఆయనకే కొఱతయు లేదు. గణేశుడు, కార్తికేయుడు, లక్ష్మి, సరస్వతి, పార్వతి అందఱును గలరు. అయినను అప్పుడప్పుడు సమాధిస్థితి యందుండును. మరికొన్నిసమయముల 'రామ్, రామ్' అని పలుకుచు జపించుచుండును.



శ్రీ శారదేశ్వర్యైనమః

# ధర్మ పరిశీలన

## వైదిక ధర్మాదర్శములు

శ్రీ వివేకానందస్వామి

(గతసంచిక తరువాయి)

ఈ వేదయుగమహర్షుల యూహాలనెల్ల పరిశీలించుటకుముందు, వేదములందుగల ఒకటి, రెండు విచిత్ర సందర్భములనుగురించి యోచింతము. ఈ దేవత లొకరితరువాత మరియొకరుగ ఉన్నతతర స్థానమునకు లేవనెత్తబడి, తుట్టతుదకు విశ్వప్రభువగు సాకారభగవానుని పదవి నధిష్ఠింపజేయబడు విశేషవిషయమునకు సమాధానమావశ్యకము ఆచార్య మాక్సుమూలరు దీనిని హైందవులకు మాత్రము వర్తించు నొక విశిష్టవిషయమని తలంచి, దీనికి "హెనొథీజ" మని నామకరణముచేసెను. సమాధానమునకై మన మెక్కువదూరము పోనక్కరలేదు. అది ఆగ్రంథములోనే కలదు. ఆ దేవతల పరిణతినిగూర్చిన భాగమునకు బహు సమీపముగనే, ఈ సమాధానముకూడ మనకు గనుపడును. హైందవపురాణములు తదితర పురాణములకంటె విశేషముగ భిన్నములై యుండుటకు కారణమేమియను ప్రశ్న యిప్పట్టున బయలుదేరుచున్నది. బాబిలన్, గ్రీకు పురాణములలో, ఒక్క దేవతమాత్రము పైకి వచ్చుటకు ప్రయత్నించి, ఉన్నతస్థాన మాక్రమింప, నితర దేవతలెల్ల నశించిపోయినట్లు మనకగుపడును. మొలాకులందరిలో జిహోవా ఒక్కడే అత్యున్నతస్థితికి, మహాదేవపదవికి వచ్చును, తక్కిన మొలాకులందరిని లోకము శాశ్వతముగ మఱచిపోవును. ఇట్లే, గ్రీకు దేవతలందరిలో జ్యూయెస్సు ముందుకు వచ్చి, విశేష ప్రాముఖ్యమును గణించి, విశ్వాధిపత్యముగల దేవతయగును, తక్కిన దేవతలెల్లరును స్వల్ప దేవతల స్థానమునకు దిగిపోవుదురు. ఈ విషయమే తరువాతికాలములలో గూడ సంభవించినది. బౌద్ధులును, జైనులును తమ ప్రవక్తలలో నొకరిని సర్వేశ్వరపదవికి లేవనెత్తి, తక్కిన దేవతలనెల్ల బుద్ధునకో, జినునకో లోబడియుండునట్లు చేసిరి. ఈ చర్యయే లోకమందంతట జరిగినది. కాని, దీని కొకే మినహాయింపుగలదని మనము చెప్పవచ్చును. ఒక దేవత స్తుతింపబడి, తక్కిన దేవతలనెల్ల ఆజ్ఞాపించును. వరుణునిచే ఉన్నతస్థితికి దీసికొనిరాబడిన దేవత, తరువాతి పుస్తకములో అత్యున్నతస్థానము నధిష్ఠించును. ఈరీతిగ వారు వంతులప్రకారము సాకారభగవానుని పదవి

నధిష్ఠింతురు. దీనికి సమాధాన మాపుస్తక ములోనే యున్నది. ఇది ఒక హిందూదేశము నకే కాక, ప్రపంచమంతటగల మతములన్నిటికిని నిశితమైన యోచనావిషయమును సమకూర్చిన మహోత్కృష్ట సమాధానము — ఏకమ్ సత్, విప్రా బహుధావదంతి. "ఎల్లప్పుడుండునది ఒక్కటియే, మహర్షులు దానిని వేర్వేరు పేళ్లతో వ్యవహరింతురు." ఈ దేవతలందరిని గురించి స్తోత్రములు వ్రాయబడిన యీ సందర్భములన్నిటిలో, దృశ్యమాన దైవమొకటియే, ద్రష్టమాత్రము వేరు. ఒకే దైవమును గురించి స్తోత్రకారుడు, మహర్షి, కవి వేర్వేరు భాషలలో, మాటలలో గానముచేసినారు. "ఎల్లప్పుడుండునది ఒకటియే, మహర్షులు దానిని వేర్వేరు పేళ్లతో వ్యవహరింతురు." ఆ ఒక గీతికవలన బహుముఖ్యములగు ఫలితములు కలిగియున్నవి. మత విషయమున ప్రజాపీడన మెన్నడును జరిగియుండని, తమ తమ మత విశ్వాసములకై యెవరుగాని యెన్నడును క్షోభ నొందియుండని దేశము హిందూదేశ మొకటియేయను తలంపు మీలో కొందరి కాశ్చర్యము కలిగించియుండవచ్చును. అచ్చట ఆస్తికులు నాస్తికులును, ద్వైతులును అద్వైతులును, ఏకేశ్వరవాదులు నెల్లప్పుడు నేబాధయును లేకుండ జీవించుచున్నారు. బ్రాహ్మణ దేవాలయ మంటప వేదికలపై కెక్కి దేవతలకేమి, చివరకు భగవంతునకేమి ప్రతికూలముగ చార్వాకులెట్టి ప్రతిబంధకముగాని లేకుండ నుపన్యసించుటకు అనుమతింపబడుదురు. భగవంతుడు, దేవతలు, వేదములు, మతము మొదలగునవన్నియు తమ స్వలాభమునకై పురోహితులు కల్పించిన ఛాందసములని, యే విధమైన బాధలేకుండ నుపన్యసించుచు స్వేచ్ఛగా వారు దేశమంతట విహరించుచుందురు. ఈ విధముగ తానెచటకుబోయినను, హిందువులకు పవిత్రమైన ప్రతి ప్రాచీన సాంప్రదాయమును నామరూపములు లేకుండ నాశనముచేయుటకు బుద్ధుడు ప్రయత్నించెను పరిపూర్ణ వృద్ధాప్యము వచ్చువరకు బుద్ధుడు జీవించెను. భగవంతుడున్నాడను భావమును హేళనచేసిన జైనులుకూడ నిట్లే ప్రవర్తించిరి. "భగవంతుడుండుట యెట్లు పొసగును? ఇది కేవల ఛాందసముతప్ప వేరేమియుకాదు,"— ఇదియే వారి వాదము. ఇట్టి నిదర్శనము లనంతముగ గలవు. మహమ్మదీయులు హిందూదేశములోనికి శరపరంపరగా దండయాత్రకై జొరబడకపూర్వము, మతపీడనమనిన నేమో జనులెన్నడు నెఱుగరు, విదేశీయులవలననే యిది హిందువులకు స్వానుభవైకవేద్యమైనది. క్రైస్తవదేవాలయ నిర్మాణమునకు హిందువులెంత సాయముచేసిరో, యింకను సాయము చేయుటకెంత సంసిద్ధులైయున్నారో అందరికిని తెలిసినవిషయమే. అచ్చట రక్తపాత మెన్నడును సంభవించియుండలేదు. హిందూదేశము నుండి ఖండాంతరములకు ప్రచారముకొఱకు వెడలిన హిందూమత విరుద్ధములగు మతములకుగూడ ఈ సాధుస్వభావమలవడినది, ఉదాహరణమునకు బౌద్ధమతమును దీసికొనుడు. కొన్ని విషయములలో బౌద్ధమతము గొప్పదియే. కాని, దానిని వేదాంతముతో తికమకపడి సమన్వయపఱుపజూచుటలో అర్థము లేదు. ఈ సందర్భమున క్రైస్తవమతమునకును, తత్ప్రచారక సైన్యమునకును (సాల్వేషన్ ఆర్మికిని) గల భేదము నెవరైనను గమనింపనగును. బౌద్ధమతమందెన్నియో గొప్ప విషయములు కలవు. కాని, అవి వానిని భద్రపఱుపజాలవని

వారిచేతులలో బడినవి. పరతత్వశాస్త్ర వేత్తల అమూల్య భావరత్నములు విద్యావిహీనులగు సామాన్య జనవర్గముల చేతులలో పడినవి. వీరి ఉత్సాహమూ, అపరిమితము, భావములూ, మానవసేవా తత్పరములగు అత్యాశ్చర్యకర భావములు. కాని, లాభ మేమి? దేనినైన భద్రముగ గాపాడవలయు ననిన, యోచనాశక్తి, కుశాగ్రబుద్ధి అత్యావశ్యకములు. మానవసేవోద్దీపకములగు భావములు, మొఱటు మూకలచేతులలోపడినప్పుడెల్ల, మీకుగనుపడు మొట్టమొదటి ఫలితము పతనము. సద్వస్తువులను భద్రముగ గాపాడునవి విద్యాసంపదయును, మేధాశక్తియును. ప్రపంచమున మొట్టమొదట మతప్రచారార్థము వెడలిన యీ బౌద్ధమతము తత్కాలమున గల యావన్నాగరక దేశములందును బహుళవ్యాప్తినందినది. ఆమతమునకై పరజనరక్తపాత మణుమాత్రమైన నెన్నడును సంభవించి యుండలేదు. చీనాలో, ఈ బౌద్ధమత ప్రచారకులెట్లు హింసింపబడిరో, ఆ దేశచక్రవర్తు లొకరితరువాత నింకొకరు వేలకొలదిగ వారి నెట్లు హత్యగావించిరో మనము పుస్తకములలో చదువుదుము. కాని, అటుతరువాత అదృష్టదేవత వారి కాదేశమున అనుకూలించినది. అప్పటి చక్రవర్తులలో నొకడా హింసకారులపై పగతీర్చుకొందునని చెప్పినప్పుడు, ప్రచారకులు వలదని వారించిరి. ఆవైఖరికంతటికిని కారణ మీ శ్లోకమొకటియే. అందుచేతనే దానిని మీరు జ్ఞప్తియందుంచుకొనవలయునని కోరుచున్నాను. ఇంద్రుడని, మిత్రుడని, వరుణుడని ఎవని వ్యవహరింతురో, అట్టి యెల్లప్పుడుండు సత్పదార్థ మొకటియే! విప్రులు దానిని వేర్వేరు పేళ్లతో వ్యవహరింతురు.''



వాయుదీపముల (గ్యాసులైట్లు) వెలుతురు పట్టణములోని ఆయాస్థలములందు వేర్వేఱుగా ప్రకాశించుచుండును. అయినను ఆ దీపములకు ఆధారమగువాయువు ఒకే యంత్రమునుండి వచ్చుచున్నది. అదే విధముగ సమస్త దేశములందును జాతులందును గల ఆచార్యులందఱును ఒకే పరబ్రహ్మమువలన దివ్యప్రభావమును జ్ఞానమును బడయుచున్నారు. ఒకడు మేడమీదికి నిచ్చెనతోడనో, వెదురు సాయముననో, మెట్ల మీదుగనో, తాటితో ఎగబాకియో పోవచ్చును. అటులనే భగవంతుని జేరుటకు అనేకములైన సాధనలును మార్గములును కలవు, లోకమునందలి ప్రతిమతమును అట్టి మార్గములలో ఒకదానిని జూపును.

—శ్రీ రామకృష్ణ పరమహంస



# శ్రీ విరజానందస్వామి

శ్రీ రామకృష్ణమఠమునకును, సేవాసంఘమునకును అధ్యక్షులగు శ్రీ స్వామి విరజానంద మహారాజు, 1951 వ సం॥ మే 30 వ తేది ఉదయము గం. 6–56 నిముషములకు బేలూరు మఠములో తమ డెబ్బదియెనిమిదవ యేట పరమపదించిరని వ్రాయవలసివచ్చినందుల కెంతయు చింతిల్లుచున్నాము. కడచిన కొన్ని యేండ్లనుండి శ్రీ స్వామివారి ఆరోగ్యము బాగుగలేదు. ఇంతవరకు సజీవులై యుండిన శ్రీమద్వివేకానందస్వామి సన్యాస శిష్యులలో వీరే కట్టకడపటివారు.

పూర్వాశ్రమమున కాళీకృష్ణవసువు అను నామధేయముగల వీరు పవిత్రస్నాన పూర్ణిమ దినమగు 1873 వ సం॥ జూను 10 వ తేదిని కలకత్తాలో గౌరవనీయమైన యొక కాయస్థ కుటుంబమున జన్మించిరి. వీరి తండ్రి, శ్రీ త్రైలోక్యనాథవసువుగారు మంచి పేరు ప్రతిష్ఠలు గడించిన కలకత్తా వైద్యులు. కాళీకృష్ణుడు మొట్టమొదట ట్రెయినింగు అకాడెమీలోను, పిమ్మట రిపన్ కళాశాలలోను విద్య నభ్యసించెను. శ్రీరామకృష్ణ వచనామృత గ్రంథకర్తయగు, 'యమ్' అని వ్యవహరింపబడు శ్రీ మహేంద్రనాథగుప్తగారు ఆ కళాశాలలో అధ్యాపకులుగ బనిచేయుచుండిరి.

బాల్యమునుండియు కాళీకృష్ణుడు పారమార్థికవిషయములపట్ల తీవ్రమైన ఆసక్తికలవాడై, మతగ్రంథపఠనమునందును, తనవలె పారమార్థిక చింతగల తోడిబాలురతో గలసి హరిభజన, నామసంకీర్తనాదులందును విశేషముగ కాలము గడపుచుండువాడు. ఈ పారమార్థికాసక్తియే యితనికి శ్రీరామకృష్ణుని గృహస్థ శిష్యులలో నొకడగు శ్రీరామచంద్ర దత్తుని పరిచయమును కలుగజేసెను. ఈ బాలున కాయన శ్రీరామకృష్ణుని యద్భుత జీవితచరిత్రను దెలుపుచుండువాడు. కాని, యితని పారమార్థిక మనోభీష్టములను గుర్తించి, యితని నా కాలమున కలకత్తాయందలి బారానగర నూతనమఠములో నివసించుచుండిన శ్రీరామకృష్ణుని సన్యాస శిష్యుల కడకు మహేంద్రనాథగుప్తుడె పంపెను.

కాళీకృష్ణుని జీవితపరిణతికి తోడ్పడిన యీ సన్నివేశము బహుముఖ్యమైనది. శ్రీ గురుదేవుని శిష్యుల కఠినతాపసికజీవితమును, వారి దివ్యప్రేమయు—ముఖ్యముగ శ్రీరామకృష్ణానందస్వాములవారి వాత్సల్యామృతము—కాళీకృష్ణుని యువకహృదయమును పూర్తిగ జూరగొని శాశ్వతముగ వశపరచుకొనినవి. ఈ కారణముచే నితడు మఠమునకు తరుచుగ బోవుచు, ఒక్కొకప్పుడు కొలదినాళ్లచ్చటనే నివసించుచుండువాడు. ఈ విధముగ కాలము గడచినకొలది, సన్యాసాశ్రమమును స్వీకరింపవలయునను కోరిక ఈ బాలుని మనస్సున వేళ్లబారెను. తుదకు 1891 లో పదునేడేండ్ల వయస్సున, కాళీకృష్ణుడు ప్రపంచమును ప

త్యజించి, బారానగరమందలి సన్న్యాసబృందమును జేరెను. తన తలిదండ్రుల సంపూర్ణ సమ్మతితో, హృదయపూర్వకాశీస్సులతోడనే యీ చర్య నితడు తీసికొనగలిగియుండుట యితని యదృష్ట విశేషము. ఆ కాలమున శ్రీ వివేకానందస్వాములవారు పరివ్రాజకుడై దేశాటనము గావించుచుండినందున, స్వామిజీ 1897 లో పాశ్చాత్య దేశసంచారమును ముగించి స్వదేశమునకు మరలివచ్చిన పిమ్మటనే, కాళీకృష్ణునకు శ్రీవారి పరిచయభాగ్యము కలిగెను. శ్రీరామకృష్ణుని యువకశిష్యులీ బారానగరములోనే తమ యాధ్యాత్మికశక్తిని, పవిత్రశీలమును బెంపొందించికొనియుండుటచే, తానచట గడపిన దినములు కాళీకృష్ణుని మనస్సున దివ్యోత్సాహమును బ్రేరేపించినవి. అచ్చటి కఠోర తాపసిక జీవిత వాతావరణమునుజూచి భయపడక, ద్విగుణీకృతోత్సాహముతో నతడు మఠనిర్వహణకార్యనిమగ్నుడై పాటుపడజొచ్చెను. శ్రీరామకృష్ణుని స్వశిష్యులను సేవించు మహాభాగ్య మతనికి లభించెను. వారును బహుప్రేమతో నాతని పారమార్థిక జీవితమునకు రూపురేఖలను గల్పించి, తీర్చిదిద్దుచుండిరి. అతనితోగూడ బారానగర మఠమునకు వచ్చుచుండిన యతని మిత్రులుకూడ, నొకరి తరువాత నొకరు సన్న్యాసమును స్వీకరించిరి. కాలక్రమమున, వారు విమలానంద, శుద్ధానంద, ప్రకాశానంద, బోధానంద, ఆత్మానంద, నిర్భయానందస్వాములను పేళ్లతో లోకమునకు బరిచితులైరి. 1892 లో శ్రీ మాతృదేవివలన మంత్రోపదేశమునొంది, కాళీకృష్ణుడు బృందావనములో శ్రీ ప్రేమానందస్వామి సహవాసమున పారమార్థికసాధనలను గావించెను.

1897 లో పాశ్చాత్యదేశ పర్యటనానంతరము శ్రీ వివేకానందస్వామి కలకత్తాకు తిరిగి వచ్చి, ఆ సంవత్సరమందే విరజానందస్వామి యని నామకరణముచేసి, కాళీకృష్ణునకు సన్న్యాసాశ్రమ మిచ్చిరి. కొలదికాలమైన తరువాత నితడు శ్రీ స్వామిజీ పనుపున మతబోధకుడుగ తూర్పుబంగాళమునందలి డక్కా మున్నగు కొన్నిప్రదేశములకు బోయి, దేవఘురులో క్షామనివారణోద్యమము నేర్పాటుచేసి జయప్రదముగ నిర్వహించెను. శ్రీ స్వామిజీకి స్వయముగ సేవచేయు విశేషావకాశముకూడ నితనికి లభించెను. శ్రీ స్వామిజీయు నితని యేకాగ్రభక్తిని, సేవాపరతంత్రతనుజూచి మహానంద భరితుడయ్యెను.

1899 లో శ్రీ వివేకానందస్వామి పాశ్చాత్యదేశములకు రెండవసారి సంచారార్థము బయనమైరి. వారి యాదేశానుసారముగ విరజానందస్వామి హిమవత్పర్వత మధ్యభాగమున మాయావతిలో క్రొత్తగ స్థాపితమైన అద్వైతాశ్రమమునకు ప్రచారకుడుగ వెడలిరి. ప్రారంభావస్థలోనున్న ఆ యాశ్రమమును చిరస్థాయిగా జేయుటలో సేవియరు దంపతుల కాయన చేసిన సాయ మమూల్యము. శ్రీ వివేకానందస్వాములవారి పాశ్చాత్య శిష్యులతో ప్రియతములైన జె. హెచ్. సేవియరుగారు 1900 సం॥ అక్టోబరు 28 వ తేదిని మరణించినందున, ఆ యాశ్రమమునకు గొప్పనష్టము వాటిల్లినది. అమెరికాకు రెండవసారి పోయి, తిరిగివచ్చిన పిమ్మట శ్రీ స్వామిజీ, పతివియోగముచే కుందుచున్న సేవియర్ సతీమణికి తమ సానుభూతిని దెలుపుటకై మాయావతికి బయనమైరి. అది శీతకాలము. మాయావతికి బోవుబాట దుర్గమమైయుండెను. తగిన ప్రయాణ

సౌకర్యములు లేనందున కష్టము లినుమ డించెను. రైలుస్టేషనునుండి అరువదియైదుమైళ్ల దూరములో నున్న మాయావతికి ప్రయాణము ముదావహముకాదు. కద్గోదమునుండి మాయా వతికి స్వామిజీని, వారి యనుచరవర్గమును సురక్షితముగ జేర్చు భారము విరజానంద స్వామిపై బడినది. ప్రాణసంకటమైన ఆ చలికి వెరవక, మాయావతినుండి స్వామి బయలు దేరి, ఆ దూరమంతయు రేయుంబవళ్లు నడిచి, రెండురోజులలోనే స్వామిజీ రాకకు పూర్వము కద్గోదముచేరి శ్రీవారిని మాయావతికి తోడ్కొనిపోవుటకు సంసిద్ధులై యుండిరి. ఇందులకు స్వామీజీ మిక్కిలి హర్షించి 'ఇతడు నిజముగ నాకు తగిన శిష్యుడు' అని మెచ్చురిం చిరి. తిరిగి స్వామీజీని కలకత్తాకు సాగనంపి నపుడు విరజానందస్వామి ఆయనతో పిలిభిట్ వరకు వచ్చిరి. కటకటా! అదియే వీరికి శ్రీ స్వామిజీ కడసారి దర్శనము. తరువాత విరజానందస్వామి అహమ్మదాబాదులో పర్య టనము చేయుచుండగా, 1902 లో శ్రీ వివేకా నందస్వామి బేలూరు మఠములో పరమ పదించిరి.

శ్రీ స్వామిజీ అంత్యదినములలో, వారి చెంతను లేకపోతినికదా యను తీవ్రదుఃఖము నకు విరజానందస్వామి లోనైరి. తనగురుపునం దాయనభక్తి అంత నిశితమైనది. ఇందువలన, విరజానందస్వామి సేవాకార్యకలాపమునుండి విరమించి, మూడుసంవత్సరములు గ్రంథపఠ నమునందును, ధ్యానమునందును శ్రీ బ్రహ్మా నంద, తురీయానందస్వాముల సేవయందును గడపిరి. 1904 లో ఈయనను అమెరికాకు పంపవలెనను ప్రయత్నము జరిగినది కాని, ఈయన హిందూదేశములోనే యుండి, తపో నిష్ఠయందు నిమగ్నులై యుండగోరినందున ఆ ప్రయత్నము కొనసాగలేదు.

1906 లో శ్రీ స్వరూపానందస్వామి నిర్యా ణానంతరము వారి స్థానమున విరజానందస్వామి అధ్యక్షులుగ నియమింపబడి, మాయావతి ఆశ్రమమును కట్టుదిట్టముగ నిర్మాణముచేయు కష్టతరమైన పనికి పూనుకొనిరి ఎనిమిది సంవత్సరములవరకు వారా కార్యభారమును వహించిరి వారి జీవితములో నిది వారి నిర్మాణ కౌశలమును ప్రకటింపగల కాలముగ భావింప బడవచ్చును

మాయావతిలో వీరు బహుకార్యములను నిర్వహించుచుండిరి రామకృష్ణమఠ ప్రధాన పత్రికయగు 'ప్రబుద్ధభారత'కు సంపాదకులుగ నుండుటయే గాక, శ్రీ స్వామీజీ (ప్రాక్పశ్చిమ శిష్యవిరచితమైన) జీవిత మహాగ్రంథ సంపుట ములను నాల్గింటిని సంస్కరించి సంపాదింప వలసినవారైరి ఇంతేకాక శ్రీ వివేకానంద స్వాముల సంపూర్ణ గ్రంథావళిని సేకరించి, ప్రచురించు బాధ్యతకూడ వీరిపైననే పడెను. వీరి పరిశ్రమకును మేధాశక్తికిని ఈ గ్రంథా వళియే కలకాలము తార్కాణమై యుండ గలదు

1913 వ సం॥ డిశంబరు 15 వ తేదీని మాయావతీ అద్వైతాశ్రమాధ్యక్షపదవినుండి విరమించినను, విరజానందస్వామి వివేకానంద స్వాములవారి సంపూర్ణ గ్రంథావళీ సంపాద కీయ కార్యమును పూర్తిచేయుటకై మరియొక సంవత్సరమువరకును అచ్చటనే యుండిరి. ఏకాంతముగ కాలము గడుపుట కనువైన ఒక ప్రశాంతస్థలము నేర్పాటుచేయగోరి, 1915 వ సంవత్సరములో హిమాలయపర్వతములందలి

"శ్యామలతాల్" గ్రామములో నొక యాశ్రమమును స్వాములవా రేర్పాటుచేసిరి. ఈ ప్రశాంతాశ్రమమున నేకాంతవాసమునందును, పవిత్రగ్రంథపఠనమునందును, దీర్ఘకాల ధ్యానమునందును ఈయన పదిసంవత్సరములు గడిపిరి. శ్యామలతాల్‌లో వీరు గడిపిన జీవితము తీవ్రమైన ఆత్మశిక్షణకు, తపమునకు, నిరాడంబర జీవనమునకు ఆదర్శప్రాయమై యుండెను. ఈ ఆశ్రమమనిన వీరికి ప్రత్యేకాభిమాన మెందు చేతననగా, తమ జీవితమునందలి అత్యుత్తమ ప్రాయమును వీరిచ్చటనే యోగధ్యానములందు గడపిరి. ఈ ఆశ్రమ ప్రాంతీయ గ్రామములందలి నిరక్షరాస్యులగు జనులకు వైద్యసాహాయ్యమత్యావశ్యకమని తలంచి, దయార్ద్రహృదయులై, విరజానందస్వామి యిచ్చట నొక సేవాశ్రమమును నిర్మించిరి. నిజమునకు 1926 నుండి వీరి మానవసేవాభిలాష యితోధికముగ పెరుగుచుండినందున, రామకృష్ణ మఠమునందును, సేవాసంఘమునందును వీరి యభిమానము తీవ్రతరము కాజొచ్చెను. 1934 లో వీరిని ఆ సంస్థల కార్యదర్శిగ నెన్నుకొనిరి. ఇప్పటినుండి వీరు మహోత్సాహముతో బనిచేయ నారంభించిరి. 1938 లో మొదట వీరి యుపాధ్యక్షులుగను, ఆ సంవత్సరమందే శ్రీ శుద్ధానందస్వామి నిర్యాణానంతరమున అధ్యక్షులుగను వీరి నెన్నుకొనిరి.

విరజానందస్వామి అధ్యక్షులుగ నుండిన కాలమున, రామకృష్ణ సేవాసంఘవ్యాప్తియు, కార్యకలాపమును అత్యధికముగ బెంపొందినవి. శిశువులకు సహజమైన అమాయకోత్సాహముతో పాటు వీరు కనుబరచిన పారమార్థిక శక్తివలనను, గంభీరవైఖరివలనను వేలకొలది జనులు, పిన్నలు, పెద్దలు, స్త్రీలు, పురుషులు వీరి భక్తులైరి. రామకృష్ణమఠ సన్న్యాసవర్గమున బ్రవేశించిన యువకులనేకులు తమజీవితములను సార్థకపరచుకొనిరి. చాలసార్లు శ్రీ విరజానంద మహారాజు భారతదేశమందలి వివిధస్థలములలో బర్యటనముజేసి, అచ్చటి స్త్రీ, పురుషులనేకులకు తమ యమూల్య హితోపదేశముల వలననేమి, తమ తపఃప్రాబల్యమువలననేమి సుస్థిర పారమార్థిక విశ్వాస మనుగ్రహించిరి. ఇంతయేల, శ్రీ వివేకానందస్వామి యాదర్శమగు నిరంతర కార్యదీక్షతో కూడిన తీవ్ర ధ్యానమునకు, ఈ స్వామి జీవిత మద్భుత నిదర్శనముగ మనకు గోచరించును.

తమ శిష్యకోటికి వీరందిచ్చిన హితోపదేశములెల్ల తొలుదొల్త వంగభాషయందు "పరమార్థ ప్రసంగ" మను పుస్తకరూపమున ప్రకటింపబడినవి. ఈ పుస్తక మాంగ్ల, హిందీ భాషలలో అనువదింపబడినది. నిరుడే 'పరమార్థసిద్ధికి మార్గ' మనుపేర అమెరికాలో గూడ నిది ఆంగ్లమున ముద్రితమైనది.

తమ జీవితావసాన దినములందు స్వామి చాల వ్యాధిగ్రస్తులై యుండిరి. శరీరమున క్లిష్టస్థితులెన్నియో పొడచూపినవి. కాని, వీరా బాధలనెల్ల అపరిమితమైన యోరిమితోను, నిర్లక్ష్యముతోను సహించినందున, చూచువారి కీయన యెంతమాత్రము బాధపడినట్లే కనుపడలేదు. 30 వ తేది తెల్లవారుఝామున సుమారు నాలుగుగంటలకు వీరి స్థితి బహుప్రమాదకరముగ బరిణమించినది. మఠమున గల సన్న్యాసులు, బ్రహ్మచారులందరును వీరిచెంత జేరి, శ్రీరామకృష్ణ నామోచ్చారణ నారంభించిరి. రమారమి ఆరుగంటల యేబది యారు నిమిషములకు స్వామి ప్రశాంతముగ

తమ భౌతికశరీరమును చాలించిరి, ఇంచు మించుగ సాయంకాల మారుగంటలకు దహన సంస్కారము పూర్తయైన పిమ్మట, అస్థికలు పావనగంగానదీజలమగ్నములైనవి. శ్రీ విరజానందస్వామి నిర్యాణమువలన ప్రపంచ మొక నిరుపమాన దివ్యశక్తిని, తామొక యమూల్య నాయకోత్తముని గోల్పోయినట్లు పరితపించుచు భక్తులొనర్చిన 'జయ్! గురుమహారాజ్జీకి జయ్!' అను నినాదములతో బేలూరుమఠ మానాడు మారుమ్రోగినది.



# వినయపత్రిక

మూలం :
శ్రీ తులసీదాస గోస్వామి

అనువాదం :
క్రాంతికర్

(గతసంచిక తరువాయి)

## ౧౩౫

చెప్పలేను. చెప్పక యుండలేను. పెద్దలకు స్వదైన్యమును వినిపించుటలోనే సుఖమున్నది. ఓ ప్రభూ! నీ దొడ్డతనము, నా తుచ్ఛలఘుత్వము—నీ పవిత్రత, నా పాపములను దలచుకొని సంకోచముచే నా మనము తెల్లడిల్లుచున్నది. కాని నీ వెనుకటి స్వభావమును విని ఎదుటబడుచున్నాను. నీ గుణములను గానము చేయుటవలన, చేతులు జోడించి నీకు నమస్కరించుటవలన నీవు నీ ప్రేమపద్ధతియొక్క చాతుర్యముతో నీచులను సైత ముద్ధరింతువు. నీ దర్బారులో గర్వించినవారికి సర్వనాశనమే. వినయము, ధైర్యమువలన సుఖము—శుభము బొందవచ్చును. రావణునివంటి సమర్థుడెందును లేడు—విభీషణు డన్నివిధముల దీనుడు. కాని నీవు ప్రేమపరాధీనతనే నెక్కుడని తలచితివి. నీ యెదుట చతురుడననుకొనువాడు మహామూర్ఖుడు. సూటిగా, సరళభావముతో తన దైన్యమును ప్రకటించుటవలన పాపవాసనలు దూరమగును. జటాయువు, అహల్య, శబరి—వీరి కథలను స్మరించిన వ్యక్తి యెన్నడును తక్కువప్రేమగలిగియుండదు. నీ నామము కల్పవృక్షము. అది మనోరథములనన్నిటిని నెరవేర్చును. దానిని స్మరించుటవలన కలికాలజములగు దోషములు, కపటములు నశించును.

ఓ రామచంద్రప్రభూ!

నీ భక్తి యను నెడు గంగాజలమునకు నన్ను

మీానము నొసఱ్పుము. ఇదియే యీా తులసీదాసు నిన్ను గోరెడు వరము.

౧౩౬

ఓ రామచంద్రా!

నేటినుండి ప్రతినబూని హఠపూర్వకముగా వాకిటబడియుందును. 'నీవు నావాడవు' అని నీవు చెప్పువరకు ప్రాణముండగా నిచటినుండి లేవను. నీమీాద ఒట్టు. యమదూతలు నన్ను పడద్రోసి యలసిపోయిరి కాని నే నిచటినుండి కదలలేదు. ప్రపంచమున నెన్నోమార్లుజన్మించి, అసహ్యమగు గర్భవాసదుఃఖము ననుభవించితిని. నరకమునుగూడ నిరాదరించి వచ్చి వేసితిని. నేను మొండివాడను. కోరినవస్తువును తీసికొనియే యూరకుందును. దయాళుడవగు నీవు నా కోరిక నీడేర్చియే తీరవలెను. ఆలసించ వద్దు. నేను సిగ్గుచే చచ్చిపోవుచున్నాను. నాలో నెన్నో దోషములున్నవి. కనుక బహిరంగముగ నన్ను నీవాడనని చెప్పుకొనుటకు సంకోచించుచున్నయెడల మనస్సులోనే నన్నను గ్రహించుము. కలికాలమును జూచి నేను భయమందుచున్నాను.

౧౩౭

ఓ రామచంద్రా!

చేపకు నీటివలె, జీవికి జీవనమువలె, సర్పమునకు మణివలె, లోభికి ధనమువలె నెన్నడైన నీవు నాకు ప్రియతముడవయ్యెదవా? స్వతస్సుందరియు, రసికురాలు నగు నాయిక, రసికుడు, యువకుడు నగు నాయకుని ప్రేమించునటుల దయాళుడవగు నో రామా! నా మనమున నీయెడల దృఢమును, పవిత్రమును నగు ప్రేమను గలిగించుము. చతురుడవగు నో ప్రభూ! వేదములు నిన్ను మనోరథముల నిచ్చువాడవని చెప్పుచున్నవి. దీనుడనగు నా—తులసీదాసుని—మనోవాంఛితముల నీడేర్పుము.

౧౩౮

శ్రీరామచంద్రా!

నీ వెన్నడైన దయయుంచి నావైపు జూడవా? ఓ దయానిధీ! నీ హృదయమున నన్ను మంచి సేవకుడనియో, చెడ్డసేవకుడనియో దలచి అసంఖ్యములగు నా యపరాధములను క్షమింపవా? ప్రతి జన్మలోను మనస్సు నన్ను జయించినది. ఇపుడైన నీవు నన్ను దానిపై విజయమందునటుల జేయవా? ఓ అనాథనాథా! నీవు నా క్షుద్రత్వమునుజూచి భయపడనపుడే నేను సనాథుడనయ్యెదను. నీవును అనాథులకు నాథుడవయ్యెదవు. నను నా భయమువల్లనే నిన్ను ప్రార్థించుచున్నాను. నీవు నాకు పరమహితైషివే. నిన్ను విడచి నా యాత్మకథ నెవరికి నివేదింతును? నీవొక్కడవే నా ప్రభుడవు, గురుడవు, తల్లివి, తండ్రివి, సర్వస్వమవు.

౧౩౯

శ్రీరామచంద్రా!

మంచివాడనుగానీ, చెడువాడనుగానీ నేను నీ దాసుడనే. నీవు నన్ను పరిత్యజింపవలదు. కృపాసముద్రుడవగు నో కోసలాధిపతీ! నీవు శరణాగతరక్షకుడవు. నీ దయాస్వభావమును తలచియే నాపై గరుణింపుము. నేను మొదటి

నుండియు చెడిపోతిని. అసలే చెడిపోయియున్న నన్ను నీవింకను చెడగొట్టవద్దు. నీవెల్లపుడు, అందఱకు నన్నివిధముల మేలొనగూర్చినయే యుంటివి. ఈసారి నన్నుద్ధరింపుము. నన్ను జేపట్టిన లోకము పరిహసించునని భయపడు చున్నావా? ఎట్టి శీలముతో, ఎట్టి సరళస్వభావముతో వానరులయెడల, గుహునియెడ మిత్రత్వమును బూనితివో ఆ స్వభావము ననుసరించియే నన్నుగూడ నీవానిని జేసికొనుము. నేను దోషినైనప్పటికి, నీ తులసీదాసు నెన్నడును మఱువకుము. ఏలనన, విరిగినచేయి మెడకు వ్రేలాడునుగదా! పోయిన కంటిని చికిత్స జేయక మానరుగదా!!

## ౧౪౦

నీవు నాయెడల నెట్టి దుర్భావమును వహింపవద్దు. నాయెడల విముఖుడవు గావద్దు. ఓ రామచంద్రా! విను. నీవు దప్ప నాకీ లోకమునగాని, పరలోకమునగాని హితుడెవడును లేడు. నన్ను మూర్ఖునిగ, అయోగ్యునిగ, సోమరిగ, అధమునిగ, వ్యర్థునిగ నెఱిగి స్వార్థులగు నా మిత్రులెల్లరు వదలివేసిరి. మఱచియుగూడ నావైపు జూడలేదు. భక్తిహీనుడను, వేదమార్గచ్యుతుడను, కలిదోషావృతుడను నగు నన్ను దేవతలుగూడ వదలివేసిరి. కాని ఇందు వారి దోషమేమియు లేదు. తప్పంతయు నాదే. నీ నామము నడ్డుజేసికొని పొట్టనింపుకొనుచున్నాను. అయినను నీ దాసుడననియే జెప్పుకొనుచున్నాను. ఈ విషయము లోకమంతటను వ్యాపించినది. ఇక లోకము గొప్పదో, వేదము గొప్పదో నీవే యోజింపుము. నాకు చేకూరదగిన మేలు ఎట్టిదైనను నీవల్లనే చేకూరును. ఆలసించుటవలన నానాటికి నా స్థితి చెడిపోవుచున్నది. శీఘ్రముగ నన్ను నీవానిగ జేసికొనుము.

(సశేషము)



# మననయోగ్యరత్నములు

శ్రీ తాతా వేంకటేశ్వరరావు

1. ఆత్మ నుద్ధరించుకొనకపోవుటయే ఆత్మహత్య.

2. క్షణకాలమైనను బ్రహ్మానంద సుఖమును బొందని మానవుడు ద్విపాదపశువు.

3. ముదురు తమస్సులో మునిగిపోయి కాలమును వ్యర్థపరచి ముక్తిమాటైనను దలపకుండుటయే మహాపాపము.

4. బాహ్యచక్షువులకు గోచరించు చరాచరదృశ్యమంతయు అవశ్య వినాశకరమని ఎరుగుము.

5. మనస్సే బంధమునకు మోక్షమునకు సాధనము.

6. మనస్సును వశపరచుకొనుటయే మాయను గెలుచుట.

7. మాయాతీత పరమాత్మ నాశ్రయించిన వారిని మాయ అంటజాలదు.

8. త్రిగుణభూషితమైన మాయాప్రకృతికిని శుద్ధచైతన్య పరమాత్మకు గల సంబంధమును తెలిసికొని సద్వస్తువైన నిర్గుణ పరబ్రహ్మ స్వరూపములో లీనమైయుండుటయే సమాధి.

9. బాహ్యచక్షువులున్నను జ్ఞానజ్యోతిని గాంచు ఆంతరిక దివ్యనేత్రములు లేనిచో అంధులకెల్ల అంధుడు.

10. మార్గమును దప్పి ప్రవర్తించుచు స్వస్వరూపమును మరచుటయే బంధమునకు హేతువగుచున్నది.

11. దృష్టిగోచరమగు సృష్టి యావత్తు నశ్వరమని యనుభవముబొంది తన్నుతా నుద్ధరించుకొను తెలివియే జ్ఞానము.

12. అనుక్షణము మృత్యువును తలపోయుచుండువానికి మోహ, మమత లుడిగిపోవును.

13. పరమాత్మ నాశ్రయించని జీవితము పశుజీవితము.

14. సత్‌స్వరూప పరమాత్మను సత్యభాషణ, సత్‌ప్రవర్తనలవల్లనే పొందశక్యము.

15. ఏది నశించినను ఎవనికి నశింపులేదో, ఎవడు పరిపూర్ణుడో, ఎవడు సర్వముల కాధారుడో యాతడే పరమాత్మ.

16. ఎవని స్మరణలేక మనజీవితములే వ్యర్థములని అనుభవజ్ఞులైన యోగులవల్ల తెలిసికొంటిమో యాతడే పరమాత్మ, ఆతనినే ఆశ్రయింతుము.

17. ఎవడు దయామయుడో, ఎవని దయ వలన జ్ఞానసాధనమగు మానవజన్మ లభించి స్వస్వరూపజ్ఞానము కలుగుటకు అవకాశము కలిగినదో అట్టి పరమాత్మను బొందక కేవలము ఆహారము, నిద్ర, భయములను మాత్రమే పాటించి జీవితము వ్యర్థపరచుకొనుటయే అజ్ఞానము.

18. పలుకులకంటె ప్రవర్తన శ్రేష్ఠము.

19. కబుర్ల వేదాంతమునకంటె కార్యసిద్ధికరమైన వేదాంతము శ్రేయస్కరము.

20. ఆత్మకంటె నిత్యమైన మరొక వస్తువున్నదనుకొనుటయే భ్రాంతి.

21. పరిపూర్ణ సచ్చిదానంద పరబ్రహ్మ స్వరూప పరమాత్మకంటె తదితరమైన వున్నటుల కనుపించు అన్యమైనదంతయు మాయయే యని గుర్తించుము.

22. అంధునికి చీకటి వెలుతురుల తారతమ్యము తెలియనట్లు అజ్ఞానికి సదసద్‌వివేక జ్ఞానముండదు.

23. విషయలంపటులకు వైరాగ్యబోధలు చెవిటికి శంఖుశబ్దమువలె నుండును.

24. తన్నుతా నుద్ధరించుకొననిదే అన్యుల తరింపజేయుటకు తాను తగియుండడు.

# శ్రీ వాసుదేవ మననము

శ్రీ మాచిరాజు శ్రీరామకృష్ణ

(గతసంచిక తరువాయి)

“తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ। జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి॥” (గీ. 16-24). అందువలన ముముక్షువులకు కర్తవ్యానుష్ఠాన, అకర్తవ్యాననుష్ఠాన అర్థనిర్ణయమునందు శ్రుతిస్మృతి లక్షణమే యైన శాస్త్రము ప్రమాణము. కనుక శాస్త్రవిధానోక్తమైన స్వీయ కర్మము నెరింగి యనుష్ఠించుచుండుట ముముక్షుజనకర్తవ్యము అని శాస్త్రాదేశము కనుక శాస్త్రప్రమాణము నంగీకరించి తద్ధర్మము (విధి) ననుసరించి భగవన్నామ జపమును చేయవలెను. జపము సఫలమగును. శ్రద్ధాశూన్యముగను శాస్త్రవిరుద్ధముగను భగవన్నామ జపానుష్ఠానము పరమపురుషార్థమగు మోక్షరూపఫల ప్రతిబంధకమే యగును.

(6) ‘సద్గురూపదేశమునందు అశ్రద్ధ’— ఇది యొక మహాపరాధము. కనుక మొదటనే “శ్రోత్రియం బ్రహ్మ సష్ఠం” అనెడి ముండకోపనిషద్వచనము ననుసరించి శ్రోత్రియుడును బ్రహ్మనిష్ఠుడును నగు ఆచార్యునే బుభుత్సువు ఆశ్రయింపవలయును. ఆత్మవిజ్ఞాన అజ్ఞానులగు కుహనా గురువుల నాశ్రయించుటయందు సాహసింపగూడదు. వేగిరపడి అనాలోచితముగ ఆశ్రయించిన తరువాత నిలుకడమీద నిజము తెలిసి పశ్చాత్తాపముగాని అశ్రద్ధగాని తప్పక గలుగును. తద్గురూపదేశమునందు అశ్రద్ధ జనించినయెడల తద్గురూపదిష్ట, మంత్రజపము ప్రయోజనకారి కానేరదు.

(7) ‘నామ్న్యర్థ వాద భ్రమః’—“రామేతి ద్వ్యక్షరం నామ జపన్ముక్తి మవాప్నుయాత్”— ‘రామ యను నీ యక్షరద్వయముచేత గూర్పబడిన భగవన్నామమును జపము సేయు పురుషుడు ముక్తిని బడయును’ అను నిత్యాది శ్రుత్యర్థమునందు అవిశ్వాసము. ‘నామ్న్యర్థవాద భ్రమ’. రూపాపరాధమనగా ‘రామ’ అను రెండక్షరముల నామజపము నాచరించుట మాత్రము చేతనే ఎక్కడనైన ముక్త కలుగునా? యిట్టి కల్పన కేవలము లోకమును తనవైపునకు ఆకర్షించుకొనుటకు చెప్పెడి స్తుతిరూపమైన అతిశయోక్తి మాత్రమే గాని వేరు కాదు. అని వాద ప్రతివాదములు చేయుట నామ్న్యర్థవాదభ్రమ రూపాపరాధము. ఈ దోషము రామనామ జపానుష్ఠాన ఫలప్రాప్తియందు బాధకమై యున్నది.

(8, 9) ‘నామాస్తీతి నిషిద్ధవృత్తి విహితత్యాగౌ’—‘నాకు రక్షకము రామనామము గలదు. నేను హింసాసత్యభాషణ జారచోరత్వాది దుష్కర్మముల నాచరించినను దోషము లేదు. భయములేదు’ అని నిషిద్ధకర్మప్రవృత్తియు ‘రామనామముకంటె నీ సంధ్యావందనాది నిత్యనైమిత్తికాది కర్మానుష్ఠానము

ప్రధానమా? ఇవి నాకొక లక్ష్యమా?' అని వేదవిహితవిధి. 'త్యాగమును గలిగి నాకు విధి నిషేధముల అననుసరణ - అనుసరణమువలన ప్రయోజన ప్రత్యవాయములు లేవు. నేను ఒక్క రామనామజపమాత్రముచేతనే కృతకృత్యుడను'—అను నిట్టి భావపరిపూర్ణుడై భగవన్నామజపమును చేయునెడల నట్టి అభినివేశము భగవన్నామ జపానుష్ఠానపరునకు అధోగతులను గల్పించును. కావున శాస్త్ర విధానోక్త విధి నిషేధ విసర్జన పూర్వకముగ భగవన్నామజపము మహాపరాధము. దీనిని విశేష భయంకరమైనదానినిగా గ్రహించి పరిహరించవలయును.

(10) 'శివశ్య చ హరే ర్నామ జపే ధర్మాంతరైః సామ్యం'—హరిహరాదిరూప భగవన్నామ జపమునందు స్వధర్మము - పరధర్మము సమానమే యని భావించి స్వధర్మమునకు పరధర్మములతో సామ్యమును చెప్పుట. అదెట్లన— "హరే రామ హరే రామ, రామ రామ హరే హరే। హరే కృష్ణ హరే కృష్ణ, కృష్ణ కృష్ణ హరే హరే।" అను నీ మహామంత్రమును సార్ధత్రికోటి యావృత్తులు పునశ్చరణ విధానమువలన బునరావృత్తిరహితమైన పరమపురుషార్థమగు నిశ్శ్రేయసానందము సిద్ధించును అని కలి సంతరణోపనిషత్తునందు చెప్పబడినది. ఇట్లుండ, సర్వధర్మములు సమానమే కదా! కనుక 'రామ' అనినను, 'అల్లా' అనినను, 'క్రీస్తు' అనినను అంతకును ఫలము సమానమే యగును. ఉపర్యుక్త మహామంత్రమునందు మాత్రమే అతిశయ విశిష్టత ఏమియును లేదు—అని ఇట్లు భావించుటగూడ భగవన్నామ జపానుష్ఠానమునం దత్యంత మహాపరాధము. ఏలయన మన ధర్మశాస్త్రమునందు 'రామ - కృష్ణ - శివ-గోపాల-భవాని-సగార్య-గణపతి-యను నిత్యాద్యనేక నామధేయముల చేత భగవంతుడు వర్ణింపబడుచున్నాడు. ఈ విధములైన సమస్త నామములచేత జపము చేయుటవలనగూడ ప్రత్యేక ప్రత్యేక ఫలప్రాప్తి చెప్పబడినది. ఇట్లుండ 'రామ' నామ జప ఫలమునకును, 'అల్లా లేక క్రైస్తు' నామముల జప ఫలమునకును సామ్యము ఎటుల సమకూరగలదు! అందువలన స్వధర్మమునకును స్వధర్మానురూపమైన తన యిష్టదైవముయొక్క నామజపమునకును ధర్మాంతరములతో సామ్యము పరిహరణీయము. అనాదరణీయము.

(సశేషము)

# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరి శరణమ్

అల్మోరా,
20-5-'16.

ప్రియ...

పదుమూడవ తారీఖునాటి మీ యుత్తరము చేరినది. దానిని జదివి హర్షమును విషాదమునుగూడ బొందితిని. హర్షమేలయన, తమ సాంసారిక భోగసుఖములందలి యనాదరత జూచియు, కర్తవ్య కర్మ నిష్ఠనుజూచియును. కారణములేకయే మీకిట్టి నిరాశాభావము ఆత్మలఘుత్వము కలుగుటయే నా విషాదమునకు గారణము. ఆత్మగరిమ నిజముగా మంచిది గాదు. అయినను సర్వదా మా జీవనము వృథాప్రయాసమైనది; ఏమియు జరుగలేదు, అనుకొనవలయునా? ఏమయినను దైన్యము, అట్టి భావములు మంచివికావు. గురుదేవుడు అహంకారమును ద్వేషించువాడే యయినను దీన హీన క్షీణభావములను అణుమాత్రము నంగీకరించువారుగారు. అందులకు మారుగా భగవంతునితోడి సంబంధమును కల్పించుకొని తన్మూలమున నహంకారము నిర్మూలించుకొనుడని వచించుచు, 'నేనీశ్వరుని సంతానమును, నాకు భయమేల? ఆయన కృపవలన ఈ సంసారము నవలీలగా దరింపగలను' అను భావమును మిక్కిలిగా బోధించెడివారు. రామప్రసాదుని గేయములం దిట్టి భావమే స్ఫురించుచున్నది. 'బ్రహ్మమయియగు శక్తియే తల్లిగా నున్నవాని కిక భయమేల?' అని ఆయన కీర్తించియున్నాడుగదా! అంతమాత్రమే కాక రామప్రసాదు అట్టి తల్లితో జగడమాడుటకు గూడ వెనుదీయక 'నిన్నింక అమ్మా యని పిలువను' ఈ మున్నగు పాటలతో దేవితోడి తన చనవును జూపుచుండెడివాడు. శ్రీరామకృష్ణులవారుగూడ నీభావమునే విపులముగా వివరించుచుండెడివారు. కాన మీ దైన్యమును మీరు విడువవలయును. మీ రేమి తక్కువవారా? ఇట్టి మహాకార్యనిమగ్నులయ్యును భగవదారాధనకు అవకాశమును గల్పించుకొనుచున్నారుగదా! మీకు తీరికయైన సమయమునుగూడ ఈ విషయమునందే వినియోగించుచుందురుగాక! మధ్యాహ్నము, సంధ్య యనుట యేల, కాలమంతయు భగవంతునిదే. జీవితమంతయుగూడ ఆయనదే. అదికాక 'అనన్యభావముతో నొక్క ముహూర్తమయినా ఆయనను శరణుజొరగలిగినచో మనజీవితమంతయు ధన్యము కాగలదు. మనపాపములు పరిహారములగును' అను విశ్వాసము ఆవశ్యకము. వేదస్తుతిని చిరకాలము క్రితము చదివి యుంటిని. ప్రస్తుతము అంతగా జ్ఞాపకములేదు. అందలి భాష మిక్కిలి కఠినమని మాత్రము జ్ఞాపకమున్నది. అయినను 'గురుదేవతాభక్తి లేనిచో ఈశ్వరతత్త్వప్రవేశాధికారము లేదు' అను వచనము సత్యము. అయినను దేవుడు హృదయమందే యున్నాడు. అందు లేనిచో ఆయన నెచ్చటనయినను కలిసికొను నవకా-

శమే—ఆశగా—లేదు. గురువుగూడ ఆయ నయే—మన్నాథః శ్రీ జగన్నాథో మద్గురుః శ్రీ జగద్గురు. (గురుగీత) ఇట్లు కానిచో దేవుడే కానిమ్ము గురువే కానిమ్ము, వారివలని ప్రయో జనమేమి? దేవుడును గురువును మనయందే సదా వసించుచున్నారు. అట్లు వసింపనిచో మనమెట్లు జీవింపగలము? మనల నెవరు సర్వదా సంరక్షించుచున్నారో, ఎవరి కృప వలన మనము ప్రాణము గలిగియున్నామో ఆయనయే అందఱను అనుగ్రహించియున్నారు. ఎవరు ఆయనను గోరుదురో వారే చూడగలరు. ఇంటిపిల్లి యయినను అడవిని జేరినంతనే అడవి పిల్లిగా మారిపోవును. ఈ కండ్లు, ఈ చర్మము, ఈ చేతులుగూడ ఆయనను బొందగనే అప్రా కృతములయిపోవును. శబ్దముల నేర్చుటవలన నేమాత్రము ప్రయోజనములేదు. అట్టి శబ్ద జాలము నాదిమధ్యాంతములందు ఎవరున్నారో ఆయనవలననే శబ్దములన్నియు సఫలములై యున్నవి. ఆయనను ప్రకాశింప ప్రయత్నించుట వలననే ఆ శబ్దములకు శబ్దత.

శ్రీధరస్వాములవారు మిక్కిలి సత్యములగు వచనముల జెప్పియున్నారు. 'నక్కలన్నింటికిని అఱపు ఒకటే' యని శ్రీరామకృష్ణులవారు పలికెడివారు. శ్లో. ఏమానవాః విగతరాగ పరావరజ్ఞాః। నారాయణం సురగురుం సతతం స్మరంతి। ధ్యానేన విగత కిల్బిష వేదనాస్తే। మాతుః పయోధర రసం నపునః పిబంతి.*

భగవానుని చరణములు పవిత్రములు. సర్వ దిశలయందును వ్యాపించియున్నవి. 'పాదోఽస్య విశ్వాభూతాని' (పురుషసూక్తము). మనమంద రముగూడ ఆచరణములనే ఆశ్రయించి యున్నాము. వాని యుపాసన కాక మరి దేని నుపాసించుట? మనకు మాత్రమే ఆ చరణో పాసనయందు సంపూర్ణాధికారము కలదు. ఆయన మన 'ప్రాణస్య ప్రాణః చక్షుష శ్చక్షుః' మనము తెలిసికొన్నను తెలియక పోయినను ఆయనయే మన సర్వస్వము అన్న మాటకు సందియములేదు. కావున ఎట్లయినా మనము మనఃప్రాణములను ఆయన కర్పించి, సంపూర్ణభావముతో ఆయనయందే నిలువ వలయును. ఆయన కాక మరి దేనినీ చూడ కుందుముగాక. నా శుభేచ్ఛాప్రేమ గ్రహింపుము.

నీ శుభాకాంక్షి,

శ్రీ తురీయానంద

---

* ఏ మానవులు ఆసక్తిశూన్యులై సగుణ నిర్గుణ బ్రహ్మవిజ్ఞాన సంపన్నులై దేవగురుడైన శ్రీ నారాయణుని సర్వదా స్మరింతురో వారు తమ ధ్యానమువలన తమ పాపవేద సముదాయమును దూరీకరించి తరింతురు. వారికిక మాతృస్తన్యపానము చేయవలయు నవసరము లేదు.

—ప్రపన్నగీత, బ్రహ్మోక్తి.

# మానవజీవితపరమావధి

శ్రీ తటవర్తి సూర్యనారాయణమూర్తి

కర్మ మానవులకు ఎట్లు ప్రాప్తించును?

కర్మ మానవులకు తమ పూర్వజన్మ ప్రారబ్ధవశమున సంభవించును.

ప్రారబ్ధకర్మమన నేమి? అది ఎన్ని విధములు?

అనాదిగానున్న జీవుడు యావజ్జీవ పర్యంతము ఆర్జించిన పుణ్యపాప కర్మ సంచయము సంచితమనబడును. ఆ సంచితములోని కొంత భాగమే పునర్జన్మమునకు హేతువై పాంచభౌతిక శరీరమును కల్పించి సత్కర్మ దుష్కర్మలకు అనురూపములైన సుఖదుఃఖములను అనుభవింపజేయును. దీనికే ప్రారబ్ధమని పేరు. ఇది యిచ్ఛాప్రారబ్ధమని, అనిచ్ఛాప్రారబ్ధమని, పరేచ్ఛాప్రారబ్ధమని త్రివిధమైయుండును. ఇవి, వివేకులు అవివేకులు సమముగా అనుభవింపదగినవే అయినను వీనిలో వివేక అవివేకములనుబట్టి యిచ్ఛాప్రారబ్ధము మాత్రము భేదమైయుండును— మకర మాసమందలి మేఘము లెల్లెడల వ్యాపించినను సస్యములు మొదలగువానికి చెరుపు రాకుండా స్వల్పముగా కురిసి వెలిసినట్టుగా వివేకి తనయొక్క యిచ్ఛాకర్మవశమున హృదయమును ముంచుకొన్నట్టు తోచినను వివేకి సంపదలవలన తనకును పరులకును హానిచేయక ఇహపరసుఖములకు ప్రతిబంధకము లేక శరీరధారణమాత్రమునం దేవాని నుపయోగించును. తులామాసమందలి మేఘము తొలుత సులభముగా గనపడియుండి తుదకు ఎల్ల దిశల నావరించుకొని కడవలతో ముంచివంచినట్టు వర్షించి సస్యములకు జంతు సంతతికిని హానిని కలిగించినట్టుగా నవివేకియొక్క యిచ్ఛ మిక్కిలి తుచ్ఛముగానున్నందున తుదకు విపరీతమై పరులకు నానావిధములైన బాధలు కలుగజేసి తన సమర్థతవలననే అనుకూలమైనదనియు, తన యసమర్థతవల్లనే ప్రతికూలమైనదనియు తలంచి యిహపరసుఖములకు దూరమై నరకము సంపాదించును. వివేకులెప్పుడును ప్రవృత్తికర్మలెల్ల ననర్థమూలకములనియు ధనాపేక్షగలవారికి ఎప్పుడును దుఃఖములు తప్పవనియు నిశ్చయించి సర్వసంగములను బరిత్యజించుకొని కర్మానుసారముగా లభించిన పదార్థములచే పరితృప్తి నొందుచు, దేహధారణమాత్రమునకు నుపయోగించు కార్యమునందు ప్రవేశించుచు, శౌచాది క్రియలయందు అనురక్తిగలిగి యితర విషయాసక్తి లేక సన్మార్గమున వర్తింతురు. అవివేకులగువారు లోకములయందు అసత్యములుపలికి అప్రమాణములుచేసి చౌర్యవృత్తి నవలంబించి వ్యభిచారము లాచరించి బహువిధ బాధలనుభవించిన బుద్ధిహీనులనేకులను ప్రత్యక్షముగాజూచి, అకార్యకరణములకు ప్రవేశించినవారికి అవశ్య

ముగా ఇట్టి పదవులు ప్రాప్తించునని గట్టిగా తెలిసియున్నను, వెనుక జేసినవారి లసమర్థులనియు తాము సర్వసమర్థులయినట్టును భావించుకొని యెట్టికార్యములో ప్రవేశించినను వెనుదీయక నిర్వహింపగలమన్న గర్వాధిక్యతచేత దుర్మార్గమున వర్తింతురు. ఇదియే వివేకికిని అవివేకికిని యిచ్ఛాప్రారబ్ధమున గల భేదము.

కాయములకు గాయములు తగులుట, నానా విధములైన యాదివ్యాధులు కలుగుట, ఎండ వాన నిప్పు మొదలగువానివలన బాధనొందుట దేవాలయ ప్రాకార మండపాదులు వగైరా మీదబడుట, మొదలగువానివలన నాకస్మికముగా కలిగెడి సుఖదుఃఖములను ఎండ వాన నిప్పు మొదలగువాని వలన గలిగెడి సుఖములును నప్రయత్నముగా సంప్రాప్తములగునవి గాన ఇది అనిచ్ఛా ప్రారబ్ధమనబడును.

ఒక పురుషుడు మౌనమవలంబించి కూరుచుండియుండగా మరియొకడు వానికడకు వచ్చి తనకష్టనిష్ఠురములను చెప్పుకొని తనకీ మేలు చేయక తప్పదని మిక్కిలి బ్రతిమాలగా దాక్షిణ్యమునకు లోబడి వానిపనికి పూనుకొని అందువలన గలిగిన సుఖదుఃఖముల ననుభవించుట పరేచ్ఛా ప్రారబ్ధమనబడును.

(సశేషము)



మనుష్యులు రెండురీతులుగా ఉందురు ·— మొదటిరీతివారు చెరుగునట్టి చేటవంటివారు, రెండవరీతివారు జల్లించు జల్లెడవంటి వారు. చేట పనికిమాలిన పొల్లును విడిచి, ఉపయోగపడు బియ్యము పప్పును తనయందు నిలుపుకొనునట్లు మొదటి తరగతివారు అయోగ్యములైన కామినీ కాంచనములవంటివానిని విసర్జించి పరమ ప్రాప్యుడగు భగవంతుని మాత్రమే స్వీకరింతురు. జల్లెడయో, సన్నని పదార్థములను జాఱవిడిచి పొల్లును గ్రహించును. ఇట్లే రెండవతరగతి జనులు పరమప్రాప్యమైన వస్తువును పరిత్యజించి కామినీకాంచనములవంటి వానిని చేపట్టుదురు.

—శ్రీ రామకృష్ణ పరమహంస

# ద్రావిడ శైవ భక్తులు

## అరువత్తుమూవురు

శ్రీ టి. ఎల్. నరసింహారావు, బి. యస్‌సి.

భారతావనిని శైవము అనాదిగా వెలయుచున్నది. జనబాహుళ్యమున విస్తృత ప్రచారమును పొంది వ్యాపించి యున్నది భక్తి సాంప్రదాయము. కాలగతి ననుసరించి ఈ శైవమున అనేక మార్పు లుద్భవించి బహు రూపములు పొందినవి. దేశమున అనేక ప్రదేశములందు శివాలయములు బయలుదేర శైవ తీర్థములైనవి. సువ్యాప్తమైన ఈశైవమున పాశుపతము, కాపాలికము, కాలాముఖము అను భేదములు కలిగి పరస్పర విరోధములతో స్పర్ధలతోనుండినను వీరందరును శివుడే పరతత్వమని విశ్వసించువారు. కర్మ కఠోరమై పరస్పర వైరములతో వైషమ్యములతో పెనుగులాడుకొనుచున్న శైవము నానాటికి సన్నగిలజొచ్చినది. జాతిమత వివక్షలు పాటింపక అహింసాతత్వమును బోధించుచు కర్మ కాఠిన్యతలేక అనుష్ఠాన సౌకర్యములను కలిగించుచున్న జైన బౌద్ధమతములకు బహుళ ప్రచారముకలిగినది. ఇట్లు ఒకప్రక్క జైన బౌద్ధాదులు ప్రవృద్ధిచెందుచుండ మరియొక ప్రక్క అద్వైతమతము తలయెత్తనాగెను. ఈ సమయమున శైవమతమునకు ఇరుప్రక్కల కలుగుచున్న ఒత్తిడిని వారించి స్వమతమును రక్షించుకొను ఆత్యావశ్యకమైనది శైవులకు. ఇంతలో ఉత్తరమునుంచి బ్రాహ్మణులు దక్షిణాదికి వలసవచ్చిరి. జైన బౌద్ధ ద్వైతమతాదులను వైదికమత సంబంధముగా మార్చుటకు ప్రయత్నములు జరిగినవి. ఉత్తరమునుంచి వలసవచ్చిన వైదికమతమునకు దక్షిణమున నెలకొనియున్న మతములకును సమ్మేళనముకలిగి జనబాహుళ్యమున భక్తిసాంప్రదాయము విస్తృత ప్రచారమునుపొంది వ్యాపించి యున్నది. ఈ సమ్మేళనాఫలితముగా దక్షిణాదిని నవ్యసాంప్రదాయములు రెండేర్పడినవి. ఇవియే తమిళశైవ సాంప్రదాయము, తమిళ వైష్ణవ సాంప్రదాయమును. శైవము నాయన్మారు (నయనారు) ల వల్లను వైష్ణవము ఆళ్వారులవల్లను వ్యాప్తిపొంద నారంభించినవి.

నాయన్మారులు తమిళశైవ భక్తులు, పూజ్యులు. ఈ భక్తశ్రేణిలో జనశ్రుతియందు మిక్కిలి ప్రసిద్ధిచెందినవారు అరువదిముగ్గురు. వీరి నే "అరువత్తుమూారు", "అరువత్తు మూావరు" అని పిలిచెదరు. వీరినిగూర్చిన చరిత్రలు విస్తరముగా తమిళ "పెరియ పురాణమ్" నందును, "తిరుత్తొండర్ త్తొగై" యందును కలవు. ఈ శైవభక్తులలో పలువురు "వెల్లాల" కులమునకు చెందినవారు. ఏ కొంతమందియో ఆదిమ మతములకు, బ్రాహ్మణు

లకు చెందినవారై యుండిరి. ఈ తమిళ శైవ ప్రచారకులు ముఖ్యముగా బహుళప్రచారములోనున్న జైన బౌద్ధమతముల నరికట్టుటకు నడుముకట్టియుండిరి. అందుకై వీరు శివభక్తికి మాత్రమే అత్యుత్తమస్థానమిచ్చి, ప్రాధాన్యమునిచ్చి, దానినే ప్రామాణికముగా బెట్టి కొని జాతి మత భేదములను పాటింపరైరి. ఉత్తమజాతికి చెందిన బ్రాహ్మణులు కులాధముల సాపంక్తిని భోజనాదికర్మలను నిరాక్షేపణీయముగా జరపుచుండిరి. ఎందరెందరో స్త్రీలు భక్తులైరి. ఆదిశైవబ్రాహ్మణుడు సుందరమూర్తి చేరమాన్ పెరుమాళ్ నయనార్ అను బ్రాహ్మణేతరుని ఇంట భోజనాదులను చేసెడివాడట. అంతటితో నూరకుండక సుందరమూర్తి పరవై నాచ్చియారు అనునాట్యకత్తెను వివాహమాడెనట. భిల్లభక్తుడు కన్నప్ప పులైయ నందనారు మొదలగువారికి బ్రాహ్మణనయనారులతో సమానమగు పూజ్యత పవిత్రతకలదు. ఆనాడు శైవమున మాలమాదిగ, చాకలి, బ్రాహ్మణ మొదలగు మత భేదములుగాని, స్త్రీపురుష భేదముగాని లేక నానాజాతి భక్తకూటమైయుండెను. ఆ నాడు ఎక్కువ ప్రచారములోనుండిన జైన సాంప్రదాయమున త్రిషష్టి శలాకాపురుషులను భక్తులు గలరు. ఈ త్రిషష్టి శలాకాపురుషులలో తీర్థంకరులు, చక్రవర్తులు, గురు బలదేవులు, గురువాసుదేవులు, ప్రతివాసుదేవులు అను వారలు కలరు. ఈ త్రిషష్టిశలాకపురుషులకు ప్రత్యామ్నాయముగ శైవభక్తులలో సుప్రసిద్ధులగు అరువది ముగ్గురు భక్తులను ఏర్పరిచి వారి చరిత్రలు పెరియపురాణమున జొనిపి ద్రావిడ శైవ భక్తులు ప్రతినిత్యము పారాయణచేయుదురు. ముఖ్యముగ దక్షిణాది శైవులు ఈ నాయన్మారుల విగ్రహములను శైవతీర్థములందలి శివాలయములందు ప్రతిష్ఠచేసి వారు ప్రముఖులనియు వారు శైవభక్త్యుద్ధరణకు వెలసినవారనియు, వారిని నిత్యస్తోత్రపారముల నుతించుటయే కాక ప్రతి సంవత్సరము శివాలయములందు జరుగు బ్రహ్మోత్సవమునందు అరువత్తుమూవరు ఉత్సవమును చేయుచుందురు. బ్రహ్మోత్సవమున ముఖ్యముగ మూడు పెద్ద ఉత్సవములు జరుగును. అవి ఋషభవాహనము, రథోత్సవము, అరువత్తుమూవరు. అరువత్తుమూవరు నాడు అరువదిమూడు నాయన్మారుల విగ్రహములు ఆలయముచుట్టు ఊరేగించి మహోత్సవము నడుపుదురు. మద్రాసు మైలాపూరులోని కపాలీశ్వర దేవాలయమునందు తిరువతీశ్వరన్ పేట యందలి దేవాలయమందు ఈ ప్రాచీన శైవభక్తులను నెలకొల్పి ఉత్సవాదులు నడుపుచున్నారు.

వీరిలో ముఖ్యులను గూర్చి ఆంధ్ర భక్తలోకమునకు పరిచయ పరచుచున్నాను.

కణ్ణప్పన్ ఇతనే తిన్నడు. ధూర్జటి మహాకవి రచించిన కాళహస్తీశ్వర మహాత్మ్యమందలి కన్నప్ప ఈతడే. భిల్లకులమునకు చెందిన పరమశివ భక్తుడు. శివునకు తనకన్నులర్పించిన మహాభక్తుడు.

చిఱుతొండడు సెట్టికులజుడు. శివుని యాజ్ఞననుసరించి తనకు లేక లేక కల్గిన ముద్దుల పట్టిని చంపి అతని మాంసమును శివుని ఆరగింపజేసెను. శివుడు చిఱుతొండనంబి అకుంఠిత భక్తికిమెచ్చి శిరియాల బాలుని బ్రతికించి నంబికి మోక్షమనుగ్రహించెను.

నరసింగమునైయార్ శివభక్తుడైన పల్లవ

రాజు. ఈ ముగ్ధభక్తుడు తనభార్య శివనిర్మాల్యమగు పూమాలలను తీసి వాసనచూచినదని ఆమె చేతులను తెగగొట్టినాడు.

అతిపత్తర్ బెస్తకులమునకు చెందిన భక్తుడు. చేపల పట్టునప్పుడు వలలో చిక్కిన మొదటి చేపను శివున కర్పించువాడట. ఒకనాడు బంగారుచేప దొరకగా కాంచనవ్యామోహము లేక దానినికూడ శివున కర్పించి కైలాసమును పొందినవాడట.

యాల్పానయనారు - ఇతడే తిరునీలకంఠుడు. కుమ్మరికులమునకు చెందినవాడు. ఒక దినము శివాలయమునకుపోయి తిరిగివచ్చు సమయమున గాలివానచే ఇల్లు చేరలేక మార్గముననున్న ఒక వారకాంత వీటిలో తలదాచుకొన్నాడట. మఱునాటి ఉదయము తనయింటికి పోగా రాత్రి వారవనిత బూసిన గంధాదులను వేసిన పూమాలలను చూచి భార్యకు కోపమువచ్చి ఆతనితో మాట్లాడడము మానినది. కాపురము చెడినది వృద్ధులైనారు. చివరకు శివుడు ప్రత్యక్షమై ఆ భార్యకు నిజముచెప్పి ఆదంపతులకు యౌవనమిచ్చినాడట. ఆనాటినుండి వారు సకల భోగములను అనుభవించిరట.

తిరుజ్ఞానసంబంధరు - ఈ భక్తుడే శంకరాచార్యులవారు పేర్కొన్న ద్రవిడ శిశువు. ఈ భక్తుడు శివునకపరావతారమని శైవుల నమ్మకము.

ఈ విధముగ అరువదిముగ్గురు భక్తులును ముగ్ధభక్తులుగ కాన్పించుచున్నారు. ఇప్పటికిని ద్రావిడనాడున జనబాహుళ్యమున ముగ్ధభక్తి సాంప్రదాయమే ప్రస్ఫుట మగుచున్నది. ఒక చెట్టుక్రింద రెండు రాళ్లను నిలబెట్టి దానికింత పసుపుమెత్తి నాలుగుపూవులు పెట్టుదురు. ఆరాళ్లను చూచి లెంపలుకొట్టికొని గుంజీలుతీయు తమిళుల నెందరినో నేటికిని చూచుచున్నారము. దీనినిబట్టి భక్తివిషయమున వీరి మనములు అశిక్షితములు అని తేలుచున్నది. భక్తి సాంప్రదాయములో ఇట్టి ముగ్ధభక్తి ప్రప్రథమావస్థయై యుండవచ్చు. ఈశ్వరసాక్షాత్కారమునకు ఇదియొక తెరగు.



# సంఘవార్తలు

## శ్రీరామకృష్ణ ఆశ్రమము - విశాఖపట్టణము

విశాఖపట్టణపు రామకృష్ణ మిషన్ ఆశ్రమము వెయ్యిన్ని తొమ్మిదివందల ముప్పది యొనిమిదవయేట స్థాపింపబడినది. ఇది యొక విద్యార్థుల గృహమును, గ్రంథాలయమును, పఠనశాలను నిర్వహించుచున్నది.

ఈ దిగువ కనుపరుపబడినది దీనియొక్క వెయ్యిన్ని తొమ్మన్నూట యేబదియవ సంవత్సరపు నివేదిక.

### విద్యార్థుల గృహము

విశాఖపట్టణము ఆంధ్రదేశములోనికెల్ల ముఖ్యమగు విద్యాకేంద్రము. అందుచేత నీయాశ్రమము విద్యార్థులకు వారి మానసిక, కళాభిరుచుల పెంపొందించుకొనుటకొరకును, సేవాపూర్వకమగు త్యాగబుద్ధి నలవరచుకొనుటకును యథేష్టమగు అవకాశము గలిగింప 1940 లో నొక విద్యార్థుల గృహమును స్థాపించెను. 1948 వరకు నిది యాశ్రమమున నొక భాగముగ నుండెడిది. అటుతర్వాత 34 వేల రూప్యముల వెచ్చించి పదునాలు విద్యార్థులకు సరిపడు భవనమును నిర్మించిరి. 1951, ఫిబ్రవరి నాలుగవ తారీఖున విశాల సమావేశమున శ్రీమత్ మాధవానందస్వాములవారిచే ఇది ప్రారంభింపబడినది.

### గ్రంథాలయము, పఠనశాల

850 పుస్తకములు ఈగ్రంథాలయమునగలవు. పఠనశాలకు పదునాలు పత్రికలు వచ్చుచున్నవి. సంవత్సరమున చదువరులకు 714 పుస్తకము లొసగబడినవి. దీనికై నియమింపబడిన స్వాములవారు ప్రతి ఆదివారమునాడు ఉపన్యసించుచుందురు. ఆ సమయమున నెల్లరును రావచ్చును. అప్పుడప్పుడు వివాదాంశములను గూర్చి ప్రాబోధకీయ ఉపన్యాసములు పట్టణములందును చుట్టుప్రక్కలనుండు గ్రామములందును జరుగును.

### ఆంధ్ర తుపాను ఉపశమనము

1949 సంవత్సరము అక్టోబరునందు ఆంధ్ర జిల్లాలు పెక్కింటికి నష్టము గల్గించిన తుపాను, వరదలచే పీడితులగువారిని రక్షించుటకొరకు అనకాపల్లి, తుని, అమలాపురము, నరసాపురము, భీమవరము, కైకలూరులందు ఆరు సహాయకేంద్రములు బీదలకు వస్త్రసహాయము కొరకును, పాఠశాలలకు, విద్యార్థులకు విద్యావసరముల సరఫరాచేయుటకును స్థాపింపబడినవి. మొత్తముమీద 153 పాఠశాలలలోని ఆరువేల మూడువందల విద్యార్థులకు పుస్తకములు, జీతములు, వస్త్రములును, 3,174 మంది తుపానుబాధితులగు బీదవారికి వస్త్రములును సరఫరా చేయబడినవి.

### ఆదాయ వ్యయములు

| | |
|---|---|
| సంవత్సరపు మొత్తము వసూలు | =23,335-7-0 |
| వ్యయము | =25,257-7-6 |
| తక్కువపడినది | = 1,922-0-6 |

దీనియొక్క సాధారణ సంరక్షణమునకును, విద్యార్థుల గృహమున కనీసము ముప్పదిమందికైనను వసతిగూర్చుటకును, గ్రంథాలయమును పఠనశాలను అభివృద్ధిపరచుటకును ద్రవ్యసహాయము అవసరముగా నున్నది.

Vol. VII—12 (June 1951) Sri Ramakrishna Prabha Regd No M—4635

# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

## శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము)

సర్వాంగ సుందరమగు చతుర్థ ముద్రణము వెల రూ. 3-4-0

## శ్రీ మద్భగవద్గీత

480 పుటలు శ్రీధరీయ టీకాసార ప్రతిపద టీకా తాత్పర్య విశేషార్థ సహితము రూ. 3-0-0

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

350 పుటలు (మద్రాసు ఆంధ్ర విశ్వవిద్యాలయములందు పాఠ్యగ్రంథము) రూ. 2-8-0

## శ్రీ శారదాదేవి చరిత్ర

256 పుటలు (ఆంధ్ర విశ్వవిద్యాలయమున పాఠ్యగ్రంథము) వెల రూ. 1-12-0

## శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

136 పుటలు (ఆదర్శప్రాయుడగు గృహస్థుని జీవితము) వెల రూ. 1-4-0

| | | | |
|---|---|---|---|
| శారదా ప్రసంగములు | 2 | 8 | 0 |
| ప్రబోధరత్నాకరము | 2 | 4 | 0 |
| రాజయోగము | 2 | 4 | 0 |
| కర్మయోగము | 1 | 8 | 0 |
| భక్తియోగము | 1 | 4 | 0 |
| వివేకానంద లేఖావళి (మొదటి భాగము) | 1 | 8 | 0 |
| వివేకానంద లేఖావళి (రెండవ భాగము) | 1 | 8 | 0 |
| అనుష్ఠాన వేదాంతము | 1 | 4 | 0 |
| వివేక సూర్యోదయము | 1 | 0 | 0 |
| శ్రీ పరమహంస నీతికథా రత్నములు | 0 | 12 | 0 |
| భక్తిమార్గము | 0 | 8 | 0 |
| షికాగో నగరోపన్యాసములు | 0 | 8 | 0 |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| గురూపదేశములు | | | .. | | 0 | 8 | 0 |
| నా సంస్కరణ యుద్ధవిధానము | | | | | 0 | 6 | 0 |
| నా గురుదేవుడు | | | | | 0 | 6 | 0 |
| శ్రీ పరమహంస జీవిత సంగ్రహము | | | | | 0 | 4 | 0 |
| నవీన భారతదేశము | | | | | 0 | 4 | 0 |
| ముక్తిమార్గము | | | | | 0 | 3 | 0 |
| సర్వం విష్ణుమయం జగత్ (తెలుగు) | | | | | 0 | 3 | 0 |
| శ్రీ రామనామ సంకీర్తనము | | | | | 0 | 1 | 0 |
| యతిగీతము (పద్యకావ్యము) | | | | | 0 | 1 | 0 |
| నా మతము | 0 | 0 | 6 | డజను | 0 | 5 | 0 |
| సింహ గర్జన | 0 | 0 | 6 | డజను | 0 | 5 | 0 |

ఇవియేకాక

సంస్కృత, ఆంగ్ల, ద్రావిడ, హిందీ, కన్నడ గ్రంథములును

వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాస పత్రికలును మాయొద్ద దొరకును

శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి

మున్నగువారి ఛాయాచిత్రములును మాయొద్ద దొరకును

ఇట్లు వ్రాయుడు:

మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి.

సంపాదకులు శ్రీ ఋతజానందస్వామి; శ్రీ వెదురుమూడి వేంకటకృష్ణరావు
శ్రీ కె. ఎస్. ఎన్. రాజన్ గారిచే ది జ్యూపిటరు ప్రెస్సు లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి,
శ్రీ ఆదిదేవానంద స్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 20-6-51.